# తెలుగు యువత

## ప్రపంచ తెలుగు రచయితల 3వ మహాసభల ప్రత్యేక సంచిక




ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ సౌజన్యంతో



కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ

ప్రపంచ తెలుగు రచయితల 3వ మహాసభల రథ సారథులు,
మాకు అత్యంత ఆత్మీయ మిత్రులు










**శ్రీ మండలి బుద్ధప్రసాద్**
గౌరవాధ్యక్షులు
ప్రపంచ తెలుగు రచయితల 3వ మహాసభలు

**ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్**
కార్యనిర్వాహక అధ్యక్షులు
ప్రపంచ తెలుగు రచయితల 3వ మహాసభలు

## గౌ॥ శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి
## గౌ॥ ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గారికి

అభినందనలతో.....



**డా॥ కామినేని శ్రీనివాస్**
ఆంధ్రప్రదేశ్ వైద్యశాఖామాత్యులు

G.V.P02 A124



ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ సౌజన్యంతో

కృష్ణాజిల్లా రచయితల సంఘం

ప్రపంచ తెలుగు రచయితల సంఘం



# 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు

విజయవాడ, పడమట, యన్.టి.ఆర్.సర్కిల్, శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూలు

విశ్వనాథ సత్యనారాయణ సభా ప్రాంగణం : 2015 ఫిబ్రవరి 21,22

# తెలుగు వెలుగు

H:- 11
W:- 8.5

ప్రత్యేక సంచిక

కూర్పు

శ్రీ గాజుల సత్యనారాయణ

డా॥ గుమ్మా సాంబశివరావు

డా॥ వెన్నా వల్లభరావు

శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి

శ్రీ గోళ్ళ నారాయణరావు

డా॥ వై. శ్రీలత

శ్రీమతి భమిడిపాటి బాలా త్రిపుర సుందరి

శ్రీమతి కోకా విమలకుమారి

శ్రీమతి వేమూరి (కావూరి) సత్యవతి

శ్రీమతి సిరిపురపు అన్నపూర్ణ

డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్

డా॥ కొమాండూరి కృష్ణ


ప్రచురణ



కృష్ణాజిల్లా రచయితల సంఘం

బకింగ్‌హాంపేట పోస్టాఫీస్ ఎదురు, గవర్నర్‌పేట, విజయవాడ-520002

# ప్రపంచ తెలుగు రచయితల 3వ మహాసభల కార్యవర్గం

గౌరవాధ్యక్షులు
**శ్రీ మండలి బుద్ధప్రసాద్**

అధ్యక్షులు
**గుత్తికొండ సుబ్బారావు**

కార్యనిర్వాహక అధ్యక్షులు
**ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్**

ప్రధాన కార్యదర్శి
**డా॥ జి.వి. పూర్ణచందు**

శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్
శ్రీ గాజుల సత్యనారాయణ
శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి
శ్రీ టి. శోభనాద్రి
శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి
డా॥ గుమ్మా సాంబశివరావు
డా॥ వెన్నా వల్లభరావు
డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్
డా॥ వై. శ్రీలత
శ్రీ కె.వి.ఎల్.యన్. శర్మ
శ్రీ మల్లాప్రగడ ప్రభాకరరావు
శ్రీ వేదాంతం శరత్‌చంద్రబాబు
శ్రీమతి పి. నాగలక్ష్మి
శ్రీ విడియాల చక్రవర్తి
శ్రీ మహమ్మద్ సిలార్
శ్రీమతి కరెడ్ల సుశీల
శ్రీ అన్నం లాల్‌బహదూర్ శాస్త్రి
శ్రీమతి వి. శ్రీఉమామహేశ్వరి
శ్రీ తూములూరి రాజేంద్రప్రసాద్
శ్రీ గోళ్ళ నారాయణరావు
శ్రీమతి సిరిపురపు అన్నపూర్ణ
శ్రీ వి.యల్.నరసారెడ్డి
డా. బీరం సుందరరావు
డా.ఘంటా విజయకుమార్
శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్
శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి
శ్రీమతి చలసాని వసుమతి
శ్రీమతి వల్లూరుపల్లి లక్ష్మి

శ్రీ సుంకర నాగభూషణం
శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్
శ్రీ గుత్తికొండ వెంకటరాములు
శ్రీ జె. సాయిరామ్ ప్రసాద్
శ్రీ చింతపల్లి వెంకట నారాయణ
డా॥ యన్. సీతాపతి
శ్రీమతి సింహాద్రి పద్మ
శ్రీ రేపాక రఘునందన్
శ్రీ శిఖా ఆకాష్
శ్రీ తిక్కిశెట్టి రామ్మోహనరావు
శ్రీ యస్.వి. రత్నారావు
శ్రీమతి కోకా విమలకుమారి
డా॥ జి. రెజీనా
శ్రీమతి గుత్తికొండ కోకిలాంబ
శ్రీ చలపాక ప్రకాష్
శ్రీ కలిమిశ్రీ
శ్రీ కళాసాగర్
డా.పి.వి. హనుమచ్ఛాస్త్రి
శ్రీ గొట్టిపాటి మురళీమోహన్
శ్రీ బందా వెంకట రామారావు
శ్రీమతి కోపూరి పుష్పాదేవి
శ్రీమతి మందరపు హైమవతి
డా॥ కొమాండూరి కృష్ణ
కుమారి వీరఘంటం శ్రీదేవి
బిషప్ కాటూరి ప్రభుదాస్
శ్రీ తల్లాప్రగడ రవికుమార్
శ్రీ యం. అంజయ్య
శ్రీ స్మితశ్రీ

# అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు



**శ్రీ మండలి బుద్ధప్రసాద్**
గౌరవాధ్యక్షులు
ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు
సెల్ : 9848780872
mandalibuddhaprasad@gmail.com

ప్రజల నోట పలికే ప్రతి పదమూ భాషల ఆకాశంలో వెలుగులీనే నక్షత్రమే! ప్రతి పదమూ విలువైనదే! ప్రతి పదానికి మూలం ఉంటుంది. వ్యుత్పత్తి ఉంటుంది. జీవితం ఉంటుంది. చరిత్ర ఉంటుంది.

మాతృభాషని సాంకేతికంగా మొదటి భాష (first language లేదా native langauge) అంటారు. బిడ్డ పుట్టిన నాటి నుండీ భాషా మెళకువలు తల్లి నుంచే నేర్చుకొంటాడు కాబట్టి, మనిషి నేర్చిన మొదటి భాష అమ్మ భాష! అది మన ఉనికిని నిలుపుతుంది. సామాజిక, సాంస్కృతిక,భాషాపరమైన అస్తిత్వాన్ని నిరూపిస్తుంది. భాషా జాతీయతకు, సాంస్కృతిక వారసత్వానికి, ప్రాంతీయతకు సాక్ష్యం ఇస్తుంది.

భాషా సంస్కృతుల విభిన్నతలోంచి ప్రపంచ మానవ ఏకత్వాన్ని సాధించటానికి, భాషా భిన్నత్వాన్ని, బహుభాషా విధానాన్ని ప్రతి ఒక్కరూ గౌరవించాలని ఐక్యరాజ్యసమితి విద్యా వైజ్ఞానిక సంస్థ 'యునెస్కో' నిర్ణయం చేసింది.

వివిధ భాషా సంస్కృతుల మధ్య సమన్వయం సాధించటం, నాణ్యమైన విద్య నందించటం, జ్ఞాన సమాజాలను (Knowledge Societies) నిర్మించటం, వివిధ సాంస్కృతిక వారసత్వాలను పరిరక్షించటం, శాస్త్ర, సాంకేతిక విజయాలు అందరికీ సమానంగా అందించటానికి కావలసిన రాజకీయ నిర్ణయశక్తిని (political will) సాధించటం యునెస్కో తన కార్యక్రమ లక్ష్యంగా ప్రకటించింది.

ప్రపంచ ప్రజలంతా తమ తమ మాతృభాషల పరిజ్ఞానాన్ని పెంపొందించుకొని, అమ్మ భాష పట్ల పునరంకితం కావటానికి ఫిబ్రవరి 21వ తేదీన ప్రపంచ ప్రజలందరూ మాతృభాషా దినోత్సవాన్ని జరుపుకోవాలని యునెస్కో సూచించింది. మరణశయ్య మీద ఉన్న అమ్మభాషల పరిరక్షణకు అవసరమైన కార్యాచరణ రూపొందించుకోవాలని ప్రపంచ దేశాలకు పిలుపు నిచ్చింది. విద్యా, సాంస్కృతిక, వైజ్ఞానిక, సాంకేతిక సమాచార రంగాలకు, సాంఘిక, మానవీయ శాస్త్రాలకు కూడాఈ బాధ్యత ఉన్నదని ప్రకటించింది. విద్యకు సంబంధించిన అంశాలయిన మేధాశక్తి, నైతికత, మానవీయతలు మాతృభాషతోనే ముడిపడి ఉంటాయని మేధో వర్గానికి గుర్తు చేసింది.

**భాష ఎలా మరణిస్తుంది?**

భాషా మరణానికి భాషీయులు లేకపోవటం మాత్రమే కారణం కాదు. ఆ భాషీయులు మాట్లాడటం మానేసినా కూడా భాష మరణిస్తుంది. పరాయి పాలనలో సైనిక దౌష్ట్యం, ఆర్థిక వాణిజ్య, సాంస్కృతిక పరమైన అంశాలు, మతం, విద్య అనేవి అమ్మ భాషలను అంతం చేయాలనే చూస్తాయి. భాషీయుల్లో కొందరు విద్యావంతులు తన స్వంత భాష పట్ల కనబరిచే వ్యతిరేక ధోరణి, చిన్న చూపుల వలన కూడా భాష మరణశయ్యను చేరుతుంది. ప్రపంచీకరణ నేపథ్యంలో పెచ్చుమీరిన వలసలు, ఇతర భాషా ప్రాంతాలలో కనిపించే

ఉద్యోగ అవకాశాలు, పట్టణీకరణం, పాశ్చాత్య వ్యామోహాలు వ్యక్తుల సాంప్రదాయిక జీవితంలో పెను మార్పులకు కారణం అవుతాయి. అన్ని అవరోధాలను ఎదుర్కొని భాషా సంస్కృతుల పరిరక్షణ గురించి కూడా మనం ఆలోచించాలి.

భాషా సంస్కృతుల పరిజ్ఞానాన్ని ఒక అనవసరమైన అంశంగా భావించుకోవటాన్ని యునెస్కో ఆక్షేపించింది. అందువలన ఆ భాషాజాతికి సరిదిద్దుకోలేని అపకారం జరుగుతుందని వ్యాఖ్యానించింది.

గత 500 ఏళ్ళలో యూరప్, ఆసియాలలో కలిపి మొత్తం 75 మాతృభాషలు మరణించాయి. కొలంబస్ కనుగొన్న కాలంలో అమెరికాలో 280 భాషలుండగా, వాటిలోంచి ఇప్పటికి 115 భాషలు మాట్లాడే చివరి వ్యక్తులు కూడా మరణించారని యునెస్కో నివేదిక చెప్తోంది. మనం కూడా మన భాషలో మాట్లాడటాన్ని మానేస్తే, మనం ఉండీ ప్రయోజనం లేని పరిస్థితే ఏర్పడుతుంది. అలా మరణశయ్య చేరే అవకాశం ఉన్న భాషల్లో తెలుగు కూడా ఉన్నదని యునెస్కో హెచ్చరించిన తరువాతే మనలో కొంతయినా కదలిక వచ్చింది.

## అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం :

మాతృభాష కోసం అమరులైన భాషా సేవకులను కన్న బంగారు భూమి బంగ్లాదేశ్ ! భాషా ప్రపంచానికి ఆదర్శప్రాయమైన దేశం అది ! భారతదేశ విభజన సమయంలో ఈనాటి బంగ్లాదేశ్ పాకిస్తానులో ఒక భాగంగా ఉండేది. అప్పట్లో దాన్ని తూర్పు పాకిస్తాన్ అనేవారు. ఉర్దూ భాషని పాకిస్తాన్ తన జాతీయ భాషగా ప్రకటించినందువలన సహజంగానే తూర్పు పాకిస్తానులో కూడా ఉర్దూనే అధికార భాష అయ్యింది. కానీ, బెంగాలీని మాతృభాషగా కలిగిన తూర్పు పాకిస్తానీయులు అందుకు వ్యతిరేకంగా ఉద్యమించటంతో మాతృభాష కోసం అక్కడ అనేక పోరాటాలు జరిగాయి. ఒక దశలో ఉద్యమం తీవ్ర రూపం తీసుకుంది. 1952 ఫిబ్రవరి, 21న ఢాకాలో ఉద్యమకారుల పైన కాల్పులు జరిగాయి. నలుగురు ఢాకా విశ్వ విద్యాలయ విద్యార్థులు ప్రాణాలు కోల్పోయారు. ఈ సంఘటన అంతర్జాతీయ సమాజాన్ని కలచి వేసింది. ఒక భాషీయుల మీద వేరొక భాషను బలవంతంగా రుద్దటం హేయమైన చర్యగా ఎందరో నిరసించారు. ఫిబ్రవరి 29, 1956న పాకిస్తాన్ ప్రభుత్వం అంతర్జాతీయ వత్తిడికి తలొగ్గి అధికార భాషగా బెంగాలీని గుర్తించింది.

అప్పటి నుండీ, బంగ్లా ప్రజలు ఈ రోజుని SHOHID DIBOSH లేక SHAHEED DAY గా జరుపుకొంటున్నారు. "భాషోద్యమ అమరుల సంస్మరణ దినం" అని దీని అర్థం. ఆ అమరవీరుల జ్ఞాపకంగా నిర్మించిన 'షహీద్ మినార్'ని రెండుసార్లు పాకిస్తాన్ పాలకులు కూల్చివేసినా తిరిగి నిర్మించారు. అక్కడ బంగ్లా దేశీయులు వంగ భాషా మహోత్సవం జరుపుకొంటున్నారు.

న్యూజీలాండ్ భాషలో Aotearoa (మనందరం సంబంధీకులం) అనే పదాన్ని 30 ప్రపంచ భాషల్లోకి అనువదింప చేసి ఆ దేశం మాతృభాషా ప్రచారం చేసింది. ఆస్ట్రేలియా, ఆష్ఫీల్డ్ పార్క్ సిడ్నీలో "అంతర్జాతీయ మాతృభాషా స్థూపం" నిర్మించింది.

శ్రీమతి ఇందిరాగాంధి పూనికతో 1971లో బంగ్లాదేశ్ స్వతంత్ర దేశంగా అవతరించింది. 1999 నవంబర్, 17న యునెస్కో సంస్థ అమరులైన బంగ్లాదేశ్ భాషోద్యమకారుల సంస్మరణగా ఫిబ్రవరి 21 తేదీని అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా ప్రకటించింది. ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 21 నాడు అధికారికంగా అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం జరపాలనీ, మాతృభాషల అభివృద్ధికి పలు కీలక నిర్ణయాలు ప్రకటించి, కంకణధారులు కావాలని ప్రభుత్వాలకు యునెస్కో సంస్థ సూచించింది.

కెన్యా, దక్షిణాఫ్రికా, మలేషియా, భారతదేశం, ఇంకా మరికొన్ని తూర్పు ఆసియా దేశాలలో ప్రజలకు ఇంగ్లీషు వ్యామోహం, మాతృభాష పట్ల నిరాదరణ ఎక్కువగా ఉన్నాయని, మాతృభాష రాకపోతే పోయేదేమి లేదనే భావన బలీయంగా ఉందని యునెస్కో గుర్తించింది. సింగపూరులో ఈ నాటికీ ఇంగ్లీషే ప్రథమ భాషగా ఉండటాన్ని యునెస్కో తప్పు బట్టింది. పరాయి పాలనలో మాతృభాషను అణిచేయటం అనేది జరగకపోతే, ఒక ఆసియా దేశంలో ఇంగ్లీషు మొదటి భాష ఎలా కాగలుగుతుందని ప్రశ్నించింది.

విద్యార్థి ఒక పాఠ్యాంశంలో వెనుకబడి ఉండటం అంటే, అది ఆ పాఠ్యాంశానికి పరిమితమైన విషయం. కానీ, ఒక మాతృభాషలో వెనకబడి ఉండటం అంటే, ఆలోచనా శక్తీ, భావ వ్యక్తీకరణమూ, అనే రెండు మౌలికమైన మేథోవ్యవస్థలు ఆ విద్యార్థిలో కుప్పకూలి పోయాయని అర్థం చేసుకోవాలని యునెస్కో సంస్థ ప్రభుత్వాలకూ, పాలనా వ్యవస్థకూ, విద్యారంగ ప్రముఖులకూ సూచించింది.

అమ్మ భాష అనేదే తెలియకుండా తెలుగు బిడ్డను విద్యావంతుణ్ణి చేయాలని ఎంత ప్రయత్నించినా, తరగతి గదిలో బోధిస్తున్న విషయాన్ని విద్యార్థి మాతృభాషలోనే అర్థం చేసుకొంటాడు. అమ్మభాష అరకొరగా వచ్చిన విద్యార్థికి పాఠ్యాంశాలు కూడా అరకొరగానే అర్థం అవుతాయి. చదువులోనూ, తెలివితేటల్లోనూ బిడ్డ వెనుకబడిపోతాడు. ఇతర భాషల పరిజ్ఞానంతో పాటు తన భాష కూడా విద్యార్థులు నేర్వటం ఎంతో అవసరం కూడా!

నిజానికి భారతదేశంలో ఉన్నట్టే, అనేక వందల స్థానిక మాతృభాషలు ఆస్ట్రేలియాలో ఉన్నాయి. యూరోపియన్ జాతుల ఆక్రమణ కారణంగా ఇంగ్లీషు మాటున అవి అణగారిపోయి ఉన్నాయి. ఇలాంటి సన్నివేశాలు ప్రపంచంలో చాలా దేశాలలో జరుగుతున్నాయి. ఏదో ఒక రాజభాష అనేక మైనారిటీ మాతృభాషలను అణిచి వేయటం సర్వసాధారణ విషయం అయ్యింది. ఇన్నాళ్ళు మేథో సమాజం దీన్ని అంతగా పట్టించుకోలేదు. ఫిబ్రవరి 21న అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం ప్రకటన వలన మాతృభాషల పట్ల ఒక అంతర్జాతీయ విధానాన్ని రూపొందించటానికి కూడా అవకాశం కలిగింది.

యునెస్కో సంస్థ 2002లో ప్రపంచవ్యాప్తంగా 3,000 మాతృభాషలు ప్రమాదం అంచున ఉన్నాయన్న ప్రకటన చేసింది. అదే ఏడాది, "భాషల ఆకాశంలో ప్రతి పదమూ ఒక నక్షత్రమే" అనే నినాదాన్ని ఇచ్చి, మాతృభాషని గుర్తించి, పరిరక్షించి, అభివృద్ధి చేయవలసిన బాధ్యతని ప్రజలు, ప్రభుత్వాలు తీసుకోవాలని సూచించింది. 2004లో పిల్లలందరూ మాతృభాషలోనే మొదటగా చదవనూ వ్రాయనూ నేర్చుకొనే అవకాశం కల్పించాలనే ప్రపంచ ఉద్యమానికి శ్రీకారం చుట్టింది.

2005లో మాతృభాషలలో బ్రెయిలీ లిపి తదితర సంకేత భాషల గురించీ, 2006లో సాంకేతిక రంగంలోకి మాతృ భాషలను తీసుకురావటం గురించీ, 2007లో బహుభాషా మాధ్యమంలో బోధనల గురించి యునెస్కో పిలుపునిచ్చింది. 2008ని అంతర్జాతీయ మాతృభాషా సంవత్సరంగా ప్రకటించింది. 2009 మే, 16న ఐక్యరాజ్య సమితి సర్వ సభ్య సమావేశంలో "ప్రపంచంలోని అన్ని దేశాల, ప్రాంతాల, ప్రజలు మాట్లాడుకొనే భాషలను సంరక్షించే కార్యక్రమాలు చేపట్టా"లని (A/RES/61/266) తీర్మానం చేసింది. 2010లో భాషాసంస్కృతులకు జాతులు పునరంకితం కావాలని పిలుపునిచ్చింది. 2011లో సమాచార సాంకేతిక రంగాలు మాతృభాషల అభివృద్ధికి తోడ్పడాలనే అంశానికి ప్రాధాన్యత నిచ్చింది. 2012లో "బహుభాషా సమాజాలలో మాతృభాషలో చదువు"కు ప్రాధాన్యత నీయవలసిందిగా కోరింది. 2013లో మాతృభాషలో పుస్తకాలు అనే అంశం గురించి, 2014లో మాతృభాషలు ప్రపంచ పౌరసత్వం గురించీ ప్రత్యేక విధానాలను రూపొందించుకోవాలని యునెస్కో ప్రకటించింది. 2015వ సంవత్సరంలో యునెస్కో దృష్టి మరింత విస్తృతం అయ్యింది. విద్యావ్యవస్థలో మాతృభాషని మరింతగా చేర్చవలసిన అవసరం గుర్తిస్తూ ఈ ఏడాది కాలంలో తగిన కార్యక్రమాలను రూపొందించుకోవాలని సూచించింది. అంతర్జాతీయగా సమాజం మాతృభాష ప్రాధాన్యతని గుర్తిస్తున్న వాస్తవాన్ని దేశీయ ప్రభుత్వాలు దృష్టిలో పెట్టుకొని విద్యావ్యవస్థను రూపొందించుకోవాలి. పరభాషా వ్యామోహం చదువు విషయంలో ఉండకూడదనేది యునెస్కో భావన.

**యునెస్కో 2013 మాతృభాషా దినోత్సవ సందేశం :** "మాతృభాషలో విద్యాబోధనను మేం ప్రోత్సహిస్తున్నాం. అది నిరక్షరాస్యతను రూపుమాపుతుంది. నాణ్యమైన చదువును అందించటానికి అది తోడ్పడుతుంది. మాతృభాషలో విద్యాబోధన, మాతృభాషా పరిరక్షణ వలన అపురూపమైన, స్వజాతీయమైన పరిజ్ఞానం కూడా పరిరక్షించబడి, తరువాతి తరాలకు అందుతుంది. మన సాంస్కృతిక వారసత్వాన్ని ఈ విధంగా గ్రహించి, గౌరవించటం వలన సామాజిక ఉన్నతికి ఒక శక్తి దక్కుతుంది..." అంటుంది యునెస్కో.

2013వ సంవత్సరంలో భాషలకూ, ఆ భాషలో వెలువడిన గ్రంథాలకూ గల సంబంధంపైన ప్రధానంగా దృష్టి పెట్టవలసిందిగా యునెస్కో ప్రధాన సంచాలకులు పిలుపు నిచ్చారు.

ఆమె తన సందేశంలో ప్రపంచ శాంతికి, సమాజాభివృద్ధికీ పుస్తకం ముఖ్యపాత్ర వహిస్తుందన్నారు. సమాజంలో అక్షరాస్యులందరి చేతుల్లోనూ పుస్తకం ఉండేలా చూడాలన్నారు. సాంకేతికంగా మానవ సమాజం ఎంతో ఎదుగుతున్న దశలో పుస్తకం విలువైన ఉపకరణమే నంటూ, జ్ఞాన సమాజాలకు మూల స్తంభాలు పుస్తకాలేనన్నారు. స్వేచ్ఛగా భావవ్యక్తీకరణకు, జ్ఞాన సముపార్జనకు పుస్తకం అవసరం అని ఆమె అన్నారు. ఒక విధంగా ఇది పుస్తక నామ సంవత్సరంగా యునెస్కో సంస్థ భావించింది.

**భాషా పరిరక్షణకు యునెస్కో సూత్రాలు :**

**విద్యారంగం :** బహుభాషాధ్యయనము, మాతృభాషలో అక్షరాస్యత, స్థానిక జీవన వికాసాన్ని ప్రతిఫలించే పాఠ్యాంశాలు.

**సాంస్కృతిక రంగం :** సంస్కృతి పట్ల అవగాహన, దాన్ని పరిరక్షించుకోవాలనే బలమైన లక్ష్యం పెంపొందించే విధంగా పాలనాపరంగానూ, విద్యాపరంగానూ ప్రామాణికమైన రీతిలో చర్యలు తీసుకొనేలా ప్రోత్సహించటం.

**సమాచార సాంకేతిక రంగం :** ఫోన్లు, కంప్యూటర్లు, ఇతర సాంకేతిక ఉపకరణాలలో స్థానిక భాషా విధానాన్నీ, అంతర్జాతీయ సాంకేతిక (సైబర్) రంగాలలో బహుభాషా విధానాన్నీ అవలంబించటం.

**శాస్త్రీయరంగం :** సాహసపరమైన విషయాలను స్థానిక భాషలలో సామాన్యుడికి సైతం అర్థం అయ్యే రీతిలో సులువైన భాషలో అందించటానికి మాతృభాషలకు తగిన శక్తిని కలిగించటం.

**తెలుగు భాషాభివృద్ధి :** అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం మొదలైన ఈ 13 ఏళ్ళ కాలంలో మాతృభాష పట్ల మమకారంతో తెలుగు భాషా సంస్కృతులు పరిరక్షణ ధ్యేయంగా మనం చేస్తూ వచ్చిన కృషికి తగిన ప్రతిఫలాలు మనం అందుకోగలిగాం. 2011లో తెలుగు భాషను సాంకేతిక రంగంలోకి తీసుకువెళ్ళే ప్రయత్నాలకు శ్రీకారం చుట్టాము. 'యూనీకోడ్ కన్సార్టియం'లో ప్రధాన సభ్యత్వాన్ని పొందటం ద్వారా ఆధునిక సాంకేతిక రంగంలోకి తీసుకువెళ్ళి, తెలుగు భాషను ప్రపంచ తెలుగు భాషగా తీర్చేందుకు తొలి అడుగులు వేశాం. 2012లో ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణ ద్వారా ప్రజలలో భాషాపరమైన జాగృతిని కలిగించగలిగాం. 2013వ సంవత్సరాన్ని మాన్య ముఖ్యమంత్రి శ్రీ కిరణ్‌కుమార్ రెడ్డి తెలుగు భాషా సంస్కృతీ వికాస సంవత్సరంగా ప్రకటించారు. మాతృభాషలో విద్యాబోధన కోసం కొన్ని చర్యలను మాన్య ముఖ్యమంత్రి శ్రీ కిరణ్‌కుమార్ రెడ్డి ఇప్పటికే ప్రకటించారు. ఒకటవ తరగతి నుంచి పదవ తరగతి వరకూ విధిగా తెలుగు నేర్చుకునే దిశగా చర్యలు తీసుకుంటున్నారు.

ఈ ఏడాది వాటి ఫలాలు మనకు అందాలి. అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని జరుపుకోవటం వలన, పాలనా వ్యవస్థపైన ఉన్న బాధ్యతను మరొక్కసారి గట్టిగా గుర్తు చేయగలుగుతాం.

"బహుభాషా ప్రపంచంలో మాతృభాషలో ప్రాథమిక విద్య" అనేది యునెస్కో సంస్థ ప్రపంచ మేధావుల ముందు ఉంచుతున్న ఒక పెద్ద బాధ్యత. మానస శాస్త్రవేత్తలు చూపించిన మార్గం ఇది. విద్యామాధ్యమం ఏదయినా ప్రాథమిక విద్యకు మాతృభాషను సమానంగా నేర్పించవలసిన బాధ్యత ఉంది. పిల్లల్లో మాతృభాష పట్ల ద్వేషాన్ని కాకుండా ప్రేమ, గౌరవాలను పెంచేదిగా విద్యా వ్యవస్థ ఉండాలి. మహాత్మాగాంధీ చెప్పినట్లు మాతృభాష తృణీకారం మాతృమూర్తి తిరస్కారమేనని విద్యారంగం గ్రహించాలి.

**3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు :** ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ సౌజన్యంతో కృష్ణాజిల్లా రచయితల సంఘం, ప్రపంచ తెలుగు రచయితల సంఘం నిర్వహిస్తున్న 3వ ప్రపంచ తెలుగు రయితల మహాసభలు 2015 ఫిబ్రవరి 21,22 తేదీలలో అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా జరగటం విశేషం. ఆంధ్రప్రదేశ్ నూతన రాజధాని నగరంలో ఇంత భారీస్థాయిలో అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం జరగడం ఒక శుభసూచకంగా భావిస్తున్నాను.

ప్రాంతాల కతీతంగా తెలుగువారంతా ఒకటేననే లక్ష్యంతో జరగుతున్న ఈ మహా సభల్లో తెలుగు భాషా వికాసం, ప్రపంచ భాషగా తెలుగు అభివృద్ధి గురించి విశేష చర్చలు జరుగుతాయని భావిస్తున్నాను.

తెలుగు చదవటం, తెలుగులో మాట్లాడటం, తెలుగులో ఆలోచించటం ఇవి తెలుగువారి మనో వికాసానికి తోడ్పడే అంశాలు. తెలుగు రచయితలు, భాషావేత్తలు, సాహిత్యాభిమానులు, మేధావులు ఏకత్రాటిపైన నిలిచి తెలుగు భాషోన్నతి కోసం అంకితం కావాల్సిన సమయం ఇది! అందరికి స్వాగతం పలుకుతున్నాను.

# 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల లక్ష్య ప్రస్తావన




**ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్**

కార్యనిర్వాహక అధ్యక్షులు

**3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు**

**సెల్ : 98490 67343**

ylp1953@gmail.com


ప్రపంచవ్యాప్తంగా తెలుగువారు అన్ని ప్రముఖ దేశాలలోనూ, నగరాలలోనూ నిర్మాణాత్మక పాత్రను పోషిస్తున్నారు. అమెరికా, జర్మనీ, మలేషియాలాంటి దేశాలలో సాంకేతిక, వాణిజ్య రంగాలలో మాత్రమే కాదు. అక్కడి రాజకీయ రంగంలో కూడా రాణిస్తున్నారు. శ్రమించటం, ఫలితాలను సాధించటం అనే విషయాలలో తెలుగువారు పేరెన్నికగన్నారు. ఇది తెలుగు వారందరికీ గర్వకారణం.

ప్రపంచంలోని తెలుగువారందరూ ప్రాంతాలకతీతంగా ఒకరేననే ఏకైక లక్ష్యంతో ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలుగు భాషాభిమానులను ఒక వేదిక పైకి చేర్చటానికి సంకల్పం చెప్పుకుంటూ 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు నిర్వహించటానికి సమాయత్తుల మౌతున్నాం. అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని పురస్కరించుకుని 2015 ఫిబ్రవరి 21, 22వ తేదీలలో విజయవాడ పటమట యన్టీ.ఆర్ సర్కిల్‌లోని శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూలు సభా ప్రాంగణంలో ఈ 3వ మహాసభలు జరుగుతున్నాయి. మా ఆహ్వానాన్ని మన్నించి దేశ విదేశాల నుండి విచ్చేస్తున్న అనేకమంది రచయితలు, భాషావేత్తలు, భాషాభిమానులందరికీ హృదయపూర్వక స్వాగతం పలుకుతున్నాం.

తెలుగు భాషా వికాసం, శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రపంచ తెలుగు అమలు, రచయితల సంక్షేమం, రచనల ప్రచురణకు తోడ్పాటు, జాతీయ అంతర్జాతీయ భాషలలోకి తెలుగు రచనల అనువాదం మొదలైన అంశాలపై విశేష చర్చలు జరుగుతాయి. ప్రసిద్ధ సాహితీవేత్తలు, సంబంధిత రంగాల ప్రముఖుల ప్రధాన ప్రసంగాలు ఏర్పాటు చేశాము.

ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలలోను, తమిళనాడు, ఒడిసా, కర్ణాటక, బెంగాల్, మహారాష్ట్ర తదితర రాష్ట్రాలలోను, జీవిస్తున్న తెలుగువారి జీవనం, తెలుగు భాషా సంస్కృతులను కాపాడుకోవటంలో తెలుగువారు ఎదుర్కొంటున్న సమస్యలు తదితర అంశాలపై సదస్సులు రూపొందించటం జరిగింది. భాషోద్యమ స్ఫూర్తితో

ఈ మహాసభల సందర్భంగా రెండు గ్రంథాలను వెలువరిస్తున్నాం. తెలుగు భారతి పరిశోధనా వ్యాసాల సంకలనం నేటికాలపు తెలుగు సామాజిక జీవన వ్యవస్థను, సమకాలీన సాహిత్య ధోరణులను, నేటి యువతరం ఆలోచనలను ప్రభావితం చేస్తున్న వివిధ అంశాలను అనేక కోణాలలోంచి పరిశీలించిన వ్యాసాల సమాహారం రెండవ గ్రంథం. ఈ మహాసభల ప్రతినిధులు మరియు మరికొందరు పెద్దల రచనలతో మహాసభల ప్రత్యేక సంచికగా **'తెలుగు యువత'** గ్రంథాన్ని వెలువరిస్తున్నాం. అందుకు సహకరించిన రచయితలందరికీ మా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాం.

జాతి వికసించాలంటే నిన్నటిని స్పృశించాలి. నేటిని సమీక్షించాలి. రేపటి అవసరాలను తర్కించి అందుకు అనుగుణంగా భాషా సంస్కృతులను తీర్చిదిద్దుకోగలగాలి. ప్రపంచ తెలుగు రచయితల మహాసభల లక్ష్యం ఇదే! మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు భాషోద్యమ స్ఫూర్తిని కలిగించగా, రెండవ మహాసభలు సాంకేతిక రంగాలలో తెలుగు వినియోగంపై ప్రభుత్వం దృష్టి సారించేలా చేయగలిగాయి.

ముందుగానే చెప్పినట్లు, ఈ 3వ సభలు ప్రాంతాల కతీతంగా ప్రపంచంలోని తెలుగువారందరినీ ఒక వేదికపైకి చేర్చే లక్ష్యంతో సాగుతున్నాయి. సామాజిక అంశాలకు తొలిగా స్పందించవలసిన బాధ్యత రచయితలదే! స్పందించి పాల్గొంటున్న రచయితలందరికీ మా నమోవాకాలు.



తెలుగు ప్రజల గుండె తలుపులు తడుతున్న

# కృష్ణాజిల్లా రచయితల సంఘం

**గుత్తికొండ సుబ్బారావు** అధ్యక్షుడు

**జి.వి.పూర్ణచందు** ప్రధాన కార్యదర్శి

కృష్ణాజిల్లా రచయితల సంఘానికి 48 ఏళ్ల క్రితం 1967 లోనే జిల్లాలోని సాహితీవేత్తలు పురుడు పోశారు. అది మొదటి కృష్ణా జిల్లా రచయితల మహాసభలు జరిగిన సందర్భం. 1967 జనవరి 8న ఈ వేడుకలు జరిగాయి. అందుకు విజయవాడ రైస్‌మిల్లర్స్ సంఘం హాలు వేదికయ్యింది. నార్ల వెంకటే శ్వరరావు ఈ సభలను ప్రారంభించారు. సభలు ఆ ఒక్కరోజే జరిగాయి. జిల్లా రచయితలే సంఘంగా ఏర్పడి ఈ సభలు నిర్వహించారు.

**రెండవ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు :**

మళ్లీ ఏడాదికే 1968 మార్చి, 10,11 తేదీలలో కృష్ణాజిల్లా రచయితల రెండవ మహాసభలు జరిగాయి. ఈ సభలను కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రారంభించారు. విజయవాడ రామ్మోహన గ్రంథాలయం మేడ మీద హాలులో ఈ సభలు జరిగాయి.

**మూడవ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు :**

రెండేళ్ల విరామం తర్వాత 1970 జూన్ 27, 28 తేదీలలో గుడివాడలో కృష్ణాజిల్లా రచయితల మూడవ మహాసభలు జరిగాయి. పెనుతుఫాను, ఎడాపెడా ఈదురు గాలులు వీస్తున్నా ఆగకుండా సభలు జరిగాయి. కవి సమ్రాట్ త్రిపురనేని వెంకటే శ్వరరావు సభలను ప్రారంభించారు. సభలను గుడివాడ కవిరాజ కళామందిరంలో నిర్వహించారు. పాల్గొన్న ప్రముఖులలో ఆరుద్ర, సోమసుందర్, గజ్జెల మల్లారెడ్డి యమ్వీయల్ ప్రభృతులున్నారు.

ఇలా ఎప్పటికప్పుడు వనరులు సమకూరిన సమయంలో ఊపు మీద జిల్లా రచయితల మహాసభలను నిర్వహించడానికి రచయితల సంఘం పరిమితం అయ్యింది. అదిగో అనగానే ఆరేళ్లు గడిచిపోయాయి.

**నాల్గవ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు :**

1976 నవంబర్ 20, 21 తేదీలలో మచిలీపట్నం స్పందన సాహితీ సమాఖ్య ముందుకొచ్చి నాల్గవ మహాసభలకు పూనుకొంది. విహారి, శాలివాహన, గుత్తికొండ సుబ్బారావు, పువ్వాడ తిక్కన సోమయాజి, జి.వి. పూర్ణచందు, బూదరాజు శ్యామసుందర్ ప్రభృతులు నిర్వాహకులుగా ఈ సభలు జరిగాయి. ఈసారీ వానల బీభత్సంలోనే జరిగాయి. అప్పటికప్పుడు వేదికను వేరేచోటికి మార్చి సభలు నిర్వహించారు. శ్రీమాన్ యస్.టి.జి. వరదాచార్యులు సభలను ప్రారంభించారు. డి.వి. నరసరాజు, కొండముది, అద్దేపల్లి, ఆరెస్ సుదర్శనం, రామ్మోహనరాయ్, లత, ఆదివిష్ణు, హవిష్ ప్రభృతులు పాల్గొన్నారు. విశ్వనాథవారి దివ్య స్మృతికి ఈ సభలను అంకితం చేశారు.

**ఐదవ "కృష్ణాజిల్లా రచయితల మహా సభలు" :**

ఆ తరువాత మళ్లీ కృష్ణాజిల్లా రచయితల మహాసభల నిర్వహణకు మరో ఆరేళ్లు ఆగాల్సి వచ్చింది. ఇలా ఆగినందువలన ఒక ప్రయోజనం కల్గింది. పెద్దలు మండలి వెంకట కృష్ణారావు, ఎం.ఆర్. అప్పారావు ప్రభృతుల సూచన మేరకు, 'కృష్ణాజిల్లా రచయితల సంఘం' ఒకటి పూర్తిస్థాయిలో ఏర్పడి పనిచేసే సంస్థగా నిర్మించాలనే ఆలోచన చేయడం జరిగింది. వెంకట కృష్ణారావుగారు ఆ సభలకు ఆతిథ్యం ఇవ్వడానికి సన్నద్ధం కావడంతో కృష్ణాజిల్లా రచయితల ఐదవ మహాసభలు, అవనిగడ్డ గాంధీ క్షేత్రంలో 1982 జూలై 10, 11 తేదీలలో జరిగాయి. ఆనాటి ప్రభుత్వ ఆస్థాన కవి దాశరధి సభలను ప్రారంభించారు. ముఖ్య అతిథిగా మండలి వారూ, ప్రత్యేక సంచిక ఆవిష్కర్తగా ముక్కామల నాగభూషణం గారు విచ్చేశారు. సంజీవదేవ్, ఆరుద్ర లత, అద్దేపల్లి, విహారి, టి.యల్. కాంతారావు, పోతుకూచి సాంబశివరావు ప్రభృతులు పాల్గొన్నారు. ఈ సభల సందర్భంగా డా॥ జి.వి. పూర్ణచందు మినీ కవితా ప్రదర్శన ఏర్పాటు చేశారు. శ్రీ ఎం. ఎ.మూర్తి కథా ప్రదర్శన శ్రీ టి.సాయికృష్ణ గీతగోవిందం బొమ్మల ప్రదర్శనలు కూడా ఏర్పాటయ్యాయి.

**కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆవిర్భావం :**

ఈ సభల సందర్భంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆవిర్భావం జరిగింది. నారాయణరెడ్డి, దాశరథి, ఎం.ఆర్. అప్పారావు, ప్రభృతులతో గౌరవ సలహా మండలి ఏర్పడింది. గౌరవ అధ్యక్షులుగా శ్రీ మండలి వెంకట కృష్ణారావు, అధ్యక్షులుగా శ్రీ ముక్కామల నాగభూషణం, ప్రధాన కార్యదర్శిగా శ్రీ గుత్తికొండ సుబ్బారావు, కార్యదర్శులుగా శ్రీ మండలి బుద్ధప్రసాద్, డా॥ జి.వి. పూర్ణచందు, ఉపాధ్యక్షులుగా కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత, డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు కోశాధికారిగా శ్రీ మైత్రేయ ఇంకా 15 మంది సభ్యులతో ఒక కార్యవర్గం ఏర్పడింది. అప్పటి నుంచీ పూర్తిస్థాయిలో రచయితల సంఘం తన కార్యక్రమాలు ప్రారంభించింది. 1983లో ఇదే కార్య వర్గంతో సంస్థ రిజిస్టర్ అయ్యింది. ఆ సందర్భంగా విజయవాడ దుర్గాభవన్ హాలులో ప్రారంభోత్సవ సభ జరిగింది. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి సంస్థను ప్రారంభించారు.

**ఆం.ప్ర. సాహిత్య అకాడమీ గుర్తింపు :**

1985లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి ఎన్నికలు నిర్వహించారు. దేవులపల్లి రామానుజ రావు అప్పుడు అకాడమీ అధ్యక్షులుగా ఉన్నారు. ముఖ్యమంత్రి ఎన్టీరామారావు అకాడమీల ను రద్దు చేస్తారనే వార్తల నేపథ్యంలో అకాడమీ ధైర్యంగా జనరల్ బాడీ ఎన్నికలు నిర్వహించింది. ఈ ఎన్నికలలో రచయితల సంఘం సభ్యులైన డా॥ తెన్నేటి హేమలత, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి.వి. పూర్ణచందు, శ్రీఎం. ఎ.మూర్తి ఈ నలుగురూ అకాడమీ సభ్యులుగా ఎన్నికయ్యారు. శ్రీ గుత్తికొండ సుబ్బారావు అకాడమీ కార్యవర్గ సభ్యులుగా అంతకు మునుపు పనిచేశారు. ఇది కృష్ణాజిల్లా రచయితల సంఘానికి ఆనాడు గర్వకారణమైన విషయం. సాహిత్య అకాడమీ గుర్తింపు కూడా సంస్థకు లభించింది.

**వివిధ అంశాలపై జిల్లా రచయితల మహాసభలు :**

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రతి రెండేళ్ళకొకసారి వివిధ సాహిత్యాంశాల పైన జిల్లా రచయితల మహాసభలను వరుసగా నిర్వహిస్తూ వచ్చింది 1984లో "తెలుగు విమర్శ" పైన, 1986లో తెలుగు నవలపైన, 1988లో తెలుగు కథపైన, 1990లో "తూర్పు యూరప్ పరిణామాల" పైన సభలు నిర్వహించగా అర్థవంతమైన చర్చలు జరిగాయి. 1992లో ఆడనవలలు, క్షుద్ర నవలలు, డిటెక్టివ్ తరహా నవలలు ఇలా నవలా సాహిత్యం అనేక కొత్త పుంతలు తొక్కుతున్న రోజుల్లో, "తెలుగు నవల-నాడు-నేడు-రేపు" అనే అంశంపైన జిల్లారచయితల సంఘం సదస్సు నిర్వహించింది ఘోస్ట్ రచయితలు ఎవరెవరు ఎవరి పేరులతో నవలలు రాస్తున్నారో రహస్యం బట్టబయలు చేసి, శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ సంచలనం సృష్టించింది ఈ సభలలోనే !

**పుస్తక ప్రచురణ :**

సభలతో పాటుగా పుస్తక ప్రచురణను కూడా చేపట్టి, శ్రీ జోస్యుల సూర్యనారాయణ మూర్తి రచన "కవితా భారతి", శ్రీ ముక్కామల నాగభూషణం రచన "అసుర నాగరికత", డా॥ జి.వి. పూర్ణచందు రచన "సప్తసింధు" ఐతిహాసిక నవల, శ్రీ మైత్రేయ, డా॥ జి.వి.పూర్ణచందు సంయుక్తంగా రాసిన "శ్రీ ముక్కామల నాగభూషణం జీవిత చరిత్ర" గ్రంథాలను ప్రచురించింది.

**వెనకడుగు-పునరుద్ధరణ :**

వయోభారం రీత్యా కృష్ణాజిల్లా రచయితల సంఘం పెద్దలు – శ్రీ ముక్కామల నాగభూషణం, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, డా॥ లత, డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు, శ్రీ మైత్రేయ – ఒక్కొక్కరూ స్వర్గస్థులు కావడంతో ... జిల్లా రచయితల సంఘం కార్యకలాపాలు నెమ్మదిగా వెనకడుగు పట్టసాగాయి.

2005లో కృష్ణా మహోత్సవాలలో భాగంగా అవనిగడ్డ శాసనసభ్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గట్టిగా పూనుకొని కృష్ణా జిల్లా రచయితల సంఘాన్ని పునరుద్ధరింపచేయాలని సంకల్పించారు. ఆయన వెంట నడిచేందుకు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి.వి.పూర్ణచందు సంసిద్ధతను తెలపడంతో కృష్ణాజిల్లా సాహిత్య చరిత్రలో మరో నూతనాధ్యాయం మొదలయ్యింది.

ఆ సందర్భంలోనే "కృష్ణాజిల్లాలో ప్రాచీన సాహిత్యం" గురించి డా॥ ద్వా.నా. శాస్త్రి, కృష్ణాజిల్లాలో ఆధునిక సాహిత్యం గురించి శ్రీ అద్దేపల్లి ప్రసంగాలు ఏర్పాటుచేసి, సభానంతరం కృష్ణాజిల్లా రచయితల సంఘానికి నూతన కార్యవర్గాన్ని రూపొందించారు.

శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గౌరవ అధ్యక్షులుగా, శ్రీ గుత్తికొండ సుబ్బారావు అధ్యక్షులుగా, డా॥ జి.వి. పూర్ణచందు ప్రధాన కార్యదర్శిగా, శ్రీ తాతా రమేశ్ బాబు కోశాధికారిగా రమారమి 60 మందితో జిల్లా వ్యాప్తంగా ఒక కార్యవర్గం ఏర్పాటయ్యింది.

వెనువెంటనే రెండు పొయిట్రీ వర్క్‌షాపులు, ఒక జర్నలిజం వర్క్‌షాపు నిర్వహించడం వలన, రచయితలను, ముఖ్యంగా యువ రచయితలను భారీగా సమీకరించే అవకాశం వీటి వలన కలిగింది.

**తెలుగు భాషా సదస్సుల నిర్వహణ :**

2006 ఫిబ్రవరి 12న తెలుగు భాషోద్యమ సమాఖ్యతో కలిసి, తొలి భాషా సదస్సును నిర్వహించి, కృష్ణాజిల్లా రచయితల సంఘం తెలుగు భాషోద్యమానికి తన వంతు భాగస్వామ్యాన్ని ప్రకటించింది ఆ తరువాత ఉయ్యూరు, నూజివీడు, కైకలూరు, మచిలీపట్టణం, గుడివాడ, విజయవాడ, జగ్గయ్యపేట, తిరువూరు లలో భాషా సదస్సులు ఏర్పరిచి, ప్రజల గుండె తలుపులు తట్టే ప్రయత్నం ప్రారంభించింది. రచయితలు ఎనలేని అభిమానంతో కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని ఆదరించడం ప్రారంభించారు.

**జాతీయ తెలుగు రచయితల మహాసభలు-తెలుగు పసిడి ప్రచురణ:**

అదే అదనుగా జాతీయ తెలుగు రచయితల మహా సభలను నిర్వహించేందుకు సంకల్పం చెప్పుకొంది కృష్ణాజిల్లా రచయితల సంఘం. అది ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన స్వర్ణోత్సవ సంవత్సరం. ఈ సందర్భంగా 2006 అక్టోబర్ 27 – 28 తేదీలో జరిగిన జాతీయ తెలుగు రచయితల మహాసభలలో "తెలుగు పసిడి" అనే ఉద్గ్రంథాన్ని ప్రచురించి విడుదల చేయడం జరిగింది. ఈ 50 ఏళ్ల కాలంలో తెలుగుభాష, సంస్కృతి, సాహిత్య వికాస పరిణామాల సమీక్షగా 112 వ్యాసాల సంకలనంగా వెయ్యి పేజీల బృహద్గ్రంథం అది ! 25 ఏళ్ల క్రితం, ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాల సందర్భంగా యువభారతి సంస్థ వెలువరించిన "మహతి" గ్రంథం స్ఫూర్తిగా ఈ పుస్తకాన్ని వెలువరించగా, సాహితీ వేత్తలు, విమర్శకులు ఈ గ్రంథాన్ని వేనోళ్ల ప్రశంసించారు. ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ ఈ గ్రంథానికి సౌజన్యం వహించింది. ఆ సభలలోనే ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు నిర్వహణకు సంకల్పం చెప్పుకున్నదీ రచయితల సంఘం.

**మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు :**

భారతదేశ స్వాతంత్ర్యానికి వజ్రోత్సవ సంవత్సరం సందర్భం గానే ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు జరిగాయి. 2007 సెప్టెంబర్ 21, 22, 23 తేదీలలో, విజయవాడ శేషశాయి కళ్యాణ మండపంలో వైభవోపేతంగా జరిగాయి. దాదాపు 800 మంది సాహితీ ప్రముఖులు అతిథులుగా రాగా, మూడు రోజులలోనూ కనీసం 10,000 మంది సదస్సులకు హాజరై ఉంటారని అంచనా! ప్రజలలో భాషోద్యమ స్ఫూర్తిని కలిగించి, భాషాభిమానాన్ని రేకెత్తిం చేందుకే ఈ సభలు నిర్వహించామని, ఆ మేరకు ఈ సభలు విజయవంతమయ్యాయని కృష్ణాజిల్లా రచయితల సంఘం భావించింది. ఈ మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభల తర్వాత నిజంగానే ప్రజలలో అనుకూల మార్పు కన్పించింది. మనం తెలుగు వాళ్లం, తెలుగులో మాట్లాడటం నామోషీ అనుకోవాల్సిన అవసరం లేదు, తెలుగువారమైనందుకు మనం గర్వించాలనే భావన ప్రజలలో క్రమేణా ప్రస్ఫుటం కాజొచ్చింది. ఇప్పుడు ప్రతి విద్యాలయంలోనూ తెలుగు భాషాదినోత్సవాలు, తెలుగు మీద ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించడం ఒక ఆచారం అయ్యింది. కొందరు పనిగట్టుకొని కార్పొరేట్ స్కూలు ముసుగులో తెలుగులో మాట్లాడినందుకు పిల్లలను శిక్షించడం, "నా జన్మలో తెలుగు మాట్లాడను" అని బోర్డు రాసి మెడలో తగిలించి, ఎండలో నిలబెట్టడం, గుడ్డలూడదీసి బెంచి ఎక్కించడం లాంటి దుశ్చర్యలకు పాల్పడుతున్నప్పటికీ ఉన్నంతలో భాషాభిమానం ప్రదర్శిస్తున్న వారి సంఖ్య నానాటికి పెరుగుతూ వస్తోంది. ఇదొక సానుకూల పరిణామం. ఇందుకు కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహిస్తున్న కార్యక్రమాలు ప్రధాన ప్రేరకంగా వున్నాయన్నది వాస్తవం.

**వజ్రభారతి గ్రంథ ప్రచురణ :**

ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా రాష్ట్ర గవర్నర్ తివారీ, కేంద్రమంత్రి పురంధేశ్వరి ఆవిష్కరించిన 'వజ్ర భారతి' 216 వ్యాసాల అనుశీలనా గ్రంథం కృష్ణాజిల్లా రచయితల సంఘం కృషికి ఒక తార్కాణంగా నిలిచింది. భారత స్వాతంత్ర్య వజ్రోత్సవాల సందర్భంగా 60 ఏళ్ల స్వతంత్ర భారతదేశంలో వివిధ రంగాలలో తెలుగువారి ప్రగతి సమీక్షగా ఈ గ్రంథం వెలువడింది. ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ ఈ గ్రంథానికి సౌజన్యం వహించింది. ఇది 1/4 డెమ్మీ సైజులో 1100 పేజీల మహాగ్రంథంగా వెలువడింది. ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. లాంటి పోటీ పరీక్షలకు వెళ్ళేవారికి ఈ పుస్తకం ఒక కరదీపికగా ఉందని, అనేక రంగాలలో తెలుగువారి విజయాలకు సంబంధించిన సమాచారం చక్కగా విశ్లేషించబడిందని విమర్శకుల ప్రశంసలు పొందిన గ్రంథం ఇది !

**తెలుగు భాష ప్రాచీనతపై జాతీయ సదస్సు :**

ప్రపంచ మహాసభల నిర్వహణ తర్వాత కృష్ణాజిల్లా రచయి తల సంఘం భాషోద్యమాన్ని బలోపేతం చేసే బాధ్యతలు స్వీకరిం చింది. 2008 ఫిబ్రవరి 17,18 తేదీలలో భారతీయ భాషా కేంద్రం (CIIL), ద్రావిడ విశ్వవిద్యాలయం వారి సహకారంతో "తెలుగు భాష ప్రాచీనత – విశిష్టత" అనే అంశం మీద ఒక జాతీయ సదస్సుని విజయవాడ హోటల్ ఐలాపురం హాలులో జరిపింది.

భాషాజాతిగా తెలుగువారు ప్రాచీనులని, తెలుగు భాషకు 2000 సంవత్సరాలకు మించిన ఆధారాలున్నాయని ఈ సదస్సులో పరిశోధకులు అనేక ఆధారాలను చూపించారు. తెలుగు భాష ప్రాచీనత పైన జరిగిన తొలి సదస్సు ఇది ! ఈ సదస్సులో సమర్పిత మైన పరిశోధనా పత్రాలతో "తెలుగు భాష ప్రాచీనత -విశిష్టత" పేరుతో ఒక పుస్తకాన్ని కూడా వెలువరించింది ఇమ్మిడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ వారే ఈ గ్రంథానికీ సౌజన్యం వహించారు. ఈ పుస్తకం ఆవిష్కరణకు ముందురోజు 2008 అక్టోబర్ 31న కేంద్రమంత్రిణి అంబికాసోనీ గారు తెలుగు, కన్నడ భాషలకు ప్రాచీనత హోదా ప్రకటించడంతో ఈఆవిష్కరణ సభని విజయోత్సవ సభగా నిర్వహించింది. కేంద్ర మంత్రిణి పురంధేశ్వరిగారు ఈ గ్రంథాన్ని ఆవిష్కరించారు.

భాషాజాతీయులుగా తెలుగువారు కృష్ణాజిల్లా కేంద్రంగా చరిత్ర పూర్వయుగం నుంచీ సాధించిన అంశాలపైన ఇంక దృష్టి సారించింది. కృష్ణా జిల్లా రచయితల సంఘం ఇందు కోసం రెండు ప్రధానమైన విశేష సదస్సులను నిర్వహించింది. మొదటి ది 'కృష్ణాజిల్లా చారిత్రక వైభవం' పై జాతీయ సదస్సు కాగా, రెండవది సింధు కృష్ణా లోయల నాగరికతల తులనాత్మక అధ్యయన జాతీయ సదస్సు. ఎంతోవిలువైన, సాధికారికమైన చారిత్రక విశేషాలను ఈ సదస్సులు ఆవిష్కరించాయి.

**కృష్ణాజిల్లా చారిత్రక వైభవం-సదస్సు :**

కృష్ణా ముఖద్వారం కేంద్రంగా గత 3000 సంవత్సరాలుగా నడిచిన తెలుగువారి చరిత్రని 121మంది పురావస్తు శాస్త్ర పరిశోధకులు,చారిత్రక వేత్తలు, సాహిత్య వేత్తలు విశ్లేషించిన సదస్సు ఇది. భారతీయ పురావస్తు సర్వేక్షణ వారితో కలిసి ఈ సదస్సు 2008 మార్చి 21, 22 తేదీలలో మచిలీపట్టణం డచ్ కోటలో జరిగింది. భయంకరమైన వాన, పెనుగాలులకు వెయ్యిమంది కోసం ఏర్పాటుచేసిన పందిళ్లు డేరాలన్నీ కొట్టుకు పోయి సదస్సుకు అవరోధం ఏర్పడినా, అప్పటి కప్పుడు జిల్లా పరిషత్ సభాస్థలిలోకి వేదికని మార్చి, మొదటి రోజు సదస్సును నిర్వహించగా, రెండవ రోజుకి డచ్‌కోటలో ఏర్పాట్లన్నీ పునరుద్ధరించి, వేదికని మళ్లీ డచ్ కోటకు మార్చడం జరిగింది. భారత దేశంలో డచ్ రాయబారులు ఈ సదస్సుకు హాజరుకావడం ఒక విశేషం. ఈ సదస్సులో సమర్పితమైన పరిశోధనా పత్రాలసమా హారమే 'కృష్ణాజిల్లా సర్వస్వం', ఇమ్మిడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ మరియు కె.సి.పి. లిమిటెడ్ వారు ఈ గ్రంథ ప్రచురణకు సౌజన్యం వహించారు.

**సింధు-కృష్ణా లోయల నాగరికతల తులనాత్మక అధ్యయన సదస్సు:**

ద్రావిడ విశ్వవిద్యాలయం, రాష్ట్ర పురావస్తు శాఖ వారి సహకారంతో "సింధు కృష్ణా లోయల నాగరికతల తులనాత్మక అధ్యయన సదస్సు"ను విజయవాడ హోటల్ ఐలాపురం 2009 జనవరి 24, 25 తేదీలలో నిర్వహించడం జరిగింది. రాష్ట్రంలోని పురావస్తు శాస్త్రవేత్తలు అనేకమంది ఈ సదస్సులో పాల్గొన్నారు.

సింధునాగరికత నడుస్తున్న కాలానికి దెక్కన్ భూభాగంలో మానవ సంచారం ఉంది. కృష్ణాలోయ ప్రాంతంలో మనుషులు జీవించారు. వారికొక సంస్కృతి వుంది. నాగరికత వుంది. ఇనుము కరిగించగల నేర్పరులు వాళ్లు. అయితే, చరిత్రకారులు ఈ ప్రజలను, వారి నాగరికతని అధ్యయనం చేయడంలో నిర్లక్ష్యం వహించారు. ఆ నాగరికతని కృష్ణాలోయ నాగరికతగా పిలవాలనీ, సింధు నాగరికతకూ, కృష్ణా నాగరికతకు మధ్య సంబంధాలను ఆ రెండు నాగరికతల స్వరూప స్వభావాలనూ తులనాత్మకంగా అధ్యయనం చేయాల్సిన అవసరాన్ని ఈ సదస్సులో పురావస్తు శాస్త్రవేత్తలు అంగీకరించడం విశేషం. భాషోద్యమ స్ఫూర్తితోనూ, భాషాభిమానం తోనూ, జాత్యాభిమానంతోనూ, చరిత్రకారులు పురావస్తు శాస్త్రవేత్తలు తమ పరిశోధనలను కొనసాగించవలసిన అవసరాన్ని ఈ సదస్సు నొక్కి చెప్పింది.

కృష్ణాజిల్లా రచయితల సంఘం దృష్టిలో ఇదంతా భాషోద్యమంలో భాగమైన కృషి మాత్రమే ! తెలుగువారి ప్రాచీన తకు సంబంధించిన ఏ చిన్న ఆధారం దొరికినా దాన్ని వెలుగులోకి తేవడం ఏకైక లక్ష్యంగా ఈ సదస్సులకు రూపకల్పన జరిగింది.

**తెలుగు భాష-సంస్కృతీ చైతన్య యాత్ర :**

2008 ఆగస్టు 2 నుంచి 5 వరకూ తొలి "తెలుగుభాష సంస్కృతీ చైతన్యయాత్ర"ని మచిలీపట్నం నుంచి నెల్లూరు వరకూ నిర్వహించి, ఊరూరా తెలుగుభాష పట్ల మమకారాన్ని పెంచుకోవల సిందిగా ప్రజల గుండె తలుపులు తట్టే కార్యక్రమానికి కృష్ణాజిల్లా రచయితల సంఘం శ్రీకారం చుట్టింది. ఆగస్ట్ 5వ తేదీన డా॥ బెజవాడ గోపాలరెడ్డి శతజయంతి సంవత్సరం కావడంతో ఆయన చదువుకున్న బందరు జాతీయ కళాశాల నుంచి, ఆయన స్వస్థలం బుచ్చిరెడ్డిపాలెం మీదుగా నెల్లూరు వరకూ ఈ యాత్ర సాగింది. దారిలో ఎంపిక చేసిన ప్రాంతాలలో పాదయాత్రలు జరుపుతూ

300 మంది రచయితలతో ఈ యాత్ర సాగింది. గుంటూరు జిల్లా రచయితల సంఘం, ప్రకాశం జిల్లా రచయితల సంఘం, నెల్లూరు జిల్లా రచయితల సంఘాలను కూడా ఈ కార్యక్రమంలో భాగస్వామ్యం చేసి, ఆయా జిల్లాలలో భాషోద్యమంలో వారి పాత్రను కూడా ద్విగుణీకృతం చేయాలనేది లక్ష్యం.

పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ఈ కార్యక్రమానికి స్ఫూర్తి ప్రదాత. రూపకర్త కూడా ఆయనే. శ్రీ మండలి బుద్ధప్రసాద్ ప్రేరణతో ఈ కార్యక్రమానికి సమాయత్తం అయ్యారు రచయితలు. జస్టిస్ జాస్తి చలమేశ్వర్, శ్రీ వద్దే శోభనాద్రీశ్వరరావు, శ్రీమతి వి.యస్. రమాదేవి, పద్మభూషణ్ కె.ఇ.వరప్రసాదరెడ్డి, జ్ఞానపీఠ గ్రహీత డా॥ సి.నారాయణరెడ్డి, జస్టిస్ జి.రఘురాం, దగ్గుబాటి వెంకటేశ్వర రావు, శ్రీ ఎం.వెంకయ్యనాయుడు, ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ శ్రీ ఉండేల మాల కొండయ్య ప్రభృతులు ఈ యాత్రలో అతిథులుగా పాల్గొన్నారు.

“మన ఇంట్లో మనం తెలుగులోనే మాట్లాడుకుందాం” అనే నినాదంతో ప్రజల్లోకి పాదయాత్రల ద్వారా వెళ్లిన ఒక మహత్తర కార్యక్రమం ఇది. రాజకీయవేత్తగానే కాకుండా, స్వయంగా సాహిత్య వేత్తగా, చిరకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అధ్యక్షులుగా వున్న డా॥ బెజవాడ గోపాలరెడ్డి శత జయంతి ఉత్సవాలను రచయితలు ఇలా భాషోద్యమం కోసం పాదయాత్ర ద్వారా జరపడం ఒక అరుదైన నివాళి అనవచ్చు.

**న్యాయస్థానాలలో తెలుగు అమలుపై జాతీయ సదస్సు :**

ఎంత చదువుకున్నవారికైనా కోర్టుకెళితే అక్కడి వ్యవహారాలన్నీ అయోమయంగానే వుంటాయి. అసలే న్యాయ పరమైన సాంకేతిక పదాలు–పైపెచ్చు అంతా ఇంగ్లీషులో వుంటుంది వ్యవహారం. చాలామంది వాది ప్రతివాదులకు తమ తరపు లాయర్లు ఏం వాదిస్తున్నారో ఎదురుగా వింటున్నా అర్థం కాని పరిస్థితి.

అందుకే న్యాయస్థానాల్లో అన్ని స్థాయిల్లోనూ తెలుగు భాషను అమలుచేయాలని కోరుతూ, అందుకు సాధక బాధకాల మీద ఒక జాతీయ సదస్సును కృష్ణాజిల్లా రచయితల సంఘం 2007 డిసెంబర్ 2న నిర్వహించింది. ప్రఖ్యాత రచయిత, న్యాయమూర్తి, శ్రీ జింబో, శ్రీ సుబ్రహ్మణ్యం, శ్రీ మాడభూషి శ్రీధర్ ఈ సదస్సులో పాల్గొని న్యాయస్థానాలలో తెలుగు అమలుకుసాధ్యాసాధ్యాలను విశ్లేషించారు. ప్రముఖ న్యాయవాదులు శ్రీ కర్నాటి రామమోహనరావు ప్రభృతులు పాల్గొన్నారు. ఈ సదస్సు ప్రభావంతో చాలామంది న్యాయమూర్తులు తాము నెలకు ఒక కేసయినా తెలుగులో తీర్పు చెపుతామని ప్రకటించడం ఒక శుభ పరిణామేత. తెలుగులో అనేక తీర్పులు వెలువరించిన విజయవాడలో ఒక న్యాయమూర్తి శ్రీ సుబ్రహ్మణ్యం గారిని ఈ సదస్సులో సత్కరించడం జరిగింది !

**“నడుస్తున్న భాషోద్యమం” సమీక్షా సదస్సు :**

2010 జనవరి 25న విజయవాడలో నడుస్తున్న భాషోద్యమం తీరుతెన్నుల మీద ఒక సమీక్షా సదస్సును నిర్వహించడం జరిగింది. డా॥ యు.ఎ.నరసింహమూర్తి, ఆచార్య ఎన్.ఎస్. రాజు, డా॥ సామల రమేష్‌బాబు, శ్రీ నండూరి రాజగోపాల్, ఆచార్య వెలమల సిమ్మన్న, నూర్‌బాషా రహంతుల్లా, సంగనభట్ల నరసయ్య, ఆచార్య శరజ్జ్యోత్స్న రాణి ప్రభృతులు ఈ సదస్సులో పాల్గొన్నారు.

**చిన్నయసూరి ద్విశతాబ్ది జయంత్యుత్సవాలు :**

నాగార్జున విశ్వవిద్యాలయం, యూజీసీలతో కలిసి 2008 మార్చి నెలలో రెండు రోజులపాటు చిన్నయసూరి సాహిత్యం భాషాభివృద్ధికి చేపట్టదగిన చర్యలపై ఒక అధ్యయన సదస్సును కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహించింది. చిన్నయసూరి సాహిత్య పీఠం వారితో కలిసి, 2010 జనవరి 26న చిన్నయసూరి ద్విశతాబ్ది ఉత్సవాల సమాపనోత్సవాన్నికూడా నిర్వహించింది. పీఠం అధ్యక్షులు శ్రీ టి.శోభనాద్రి ఆనాటి సభను నడిపించారు.

**తెలుగు మాండలికాలపై జాతీయ సదస్సు :**

కృష్ణా విశ్వవిద్యాలయం, భారతీయ భాషాకేంద్రం (CIIL) లతో కలిసి, కృష్ణా విశ్వవిద్యాలయంలో తెలుగు మాండలికాలపైన ఒక జాతీయ సదస్సును నిర్వహించడం జరిగింది. విశ్వవిద్యాలయం పక్షాన ఈ సదస్సులో సమర్పితమైన పరిశోధనాపత్రాలను ఒక పుస్తక రూపంలో తీసుకొచ్చారు.

**తెలుగు మణిదీపాలు గ్రంథ ప్రచురణ :**

వివిధ రంగాలలో ప్రసిద్ధులైన 70 మంది తెలుగువారి జీవిత చరిత్రల్ని దాదాపు 1200 పేజీల ఉద్గ్రంథంగా వెలువరించింది కృష్ణాజిల్లా రచయితల సంఘం. రేపటితరం కోసం వైతాళికులన దగిన ప్రముఖుల జీవితాలను ఈ పుస్తకం ద్వారా పదిల పరిచినట్లయ్యింది. ప్రసిద్ధ ప్రచురణ సంస్థ ఎమెస్కోవారు ఈ పుస్తకానికి సౌజన్యం వహించారు.

**తెలుగు కథా సదస్సు :**

తెలుగు కథకు వందేళ్ల సందర్భంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం 2009 మార్చి 27, 28 తేదీలలో మచిలీపట్నంలో తెలుగు

కథ పైన ఒక జాతీయ సదస్సు నిర్వహించింది. భారతీయ భాషా కేంద్రం వారు ఈ సదస్సు నిర్వహణకు తోడ్పాటు నందించారు.

శ్రీ విహారి, శ్రీ మునిపల్లెరాజు, ఆచార్య కొలకలూరి ఇనాక్, శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల, శ్రీమతి కె.బి. లక్ష్మి, శ్రీ మధురాంతరం నరేంద్ర, శ్రీ శశిశ్రీ, శ్రీ కోడూరి శ్రీరామ చంద్రమూర్తి, శ్రీ వీరాజీ, శ్రీ శీలా వీర్రాజు ప్రభృతులు ఈ సదస్సులో పాల్గొన్నారు. అనేకమంది ప్రముఖ కథా రచయితలను ఈ సందర్భంగా సత్కరించారు. రెండు రోజులూ కథా సమ్మేళనంలో అనేకమంది కథకులు తమ కథలను చదివారు.

**శ్రీ శ్రీ సాహిత్య సమాలోచన సదస్సు :**

శ్రీ శ్రీ శతజయంతి సందర్భంగా, మచిలీపట్నం ఎల్.ఐ.సి. ఉద్యోగుల లలిత కళాసమితితో కలిసి శ్రీ శ్రీ సాహిత్య సమాలోచన సదస్సును 9-8-2009న మచిలీపట్నంలో కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహించింది. కృష్ణా విశ్వవిద్యాలయ కులపతి ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్, శ్రీమంగళగిరి ఆదిత్యప్రసాద్, శ్రీ కడియాల రామ్మోహనరాయ్, రావి రంగారావు, శ్రీ బీరం సుందరరావు, మాదిరాజు రామలింగేశ్వరరావు, శ్రీమతి కె.బి. లక్ష్మి ప్రభృతులు పాల్గొన్నారు.

**కృష్ణదేవరాయ వైభవం సదస్సు :**

2010 ఫిబ్రవరి 28వ తేదీన కృష్ణాజిల్లా రచయితల సంఘం మచిలీపట్టణంలో శ్రీ ప్రసన్నాంజ నేయస్వామి దేవస్థాన అభివృద్ధి కమిటీ సహకారంతో, శ్రీ కృష్ణదేవరాయ వైభవం సదస్సును నిర్వహించింది. కృష్ణదేవరాయలు తెలుగువాడేనని నిరూపించే సదస్సు ఇది. శ్రీమండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, ఆచార్య శరజ్జ్యోత్స్నారాణి, శ్రీటి.శోభనాద్రి, డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, డా॥ గుమ్మా సాంబశివరావు, డా॥ ధన్వంతరి ఆచార్య, శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్, ఆచార్య యస్. గంగప్ప, శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి, శ్రీ యస్. వెంకటేశ్వరరావు, శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్, డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు డా॥ సశ్రీ, శ్రీ శాలివాహన ప్రభృతులు పాల్గొన్నారు.

**సుప్రీంకోర్టులో కేసు - కక్షిదారుగా కృష్ణాజిల్లా రచయితల సంఘం:**

2008 అక్టోబరు 31 సాయంత్రం 4 గంటలకు వార్తా మాధ్యమాలలో ఒక మెరుపు వార్త వచ్చింది. శ్రీమతి అంబికా సోనీ తెలుగు - కన్నడ భాషలకు క్లాసికల్ గుర్తింపు నివ్వటానికి కేంద్రం సముఖంగానే ఉన్నదని ప్రధాన మంత్రి మాటగా ఆమె ప్రకటించారు.

1) చెన్నై హైకోర్టులో నడుస్తున్న కేసు తేలిన తర్వాత

2) కేంద్ర కేబినెట్ ఆమోదం పొందిన తర్వాత

ఈ నిర్ణయం అమలులోకి వస్తుందని ఆమె ప్రకటించారు. షరతులతో కూడినదే అయినప్పటికీ, అంబికా సోనీ ప్రకటన తెలుగు, కన్నడ ప్రజలలో హర్షామోదాలను కల్గించింది.

చెన్నై హైకోర్టులో కేసును ఎదుర్కొనేందుకోసం ఆనాటి ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షులు డా॥ ఎ.బి.కె. ప్రసాద్ తెలుగుభాష పక్షానా, కన్నడ ఫిలిం డెవలప్‌మెంట్ కార్పోరేషన్ కన్నడ భాష పక్షానా చెన్నై హైకోర్టులో ఇంప్లీడ్ అయ్యారు.

అయితే, కేసు విచారణకు రాకుండా వాయిదాలతో రోజులు గడుపుతున్నప్పుడు కృష్ణాజిల్లా రచయితల సంఘం కూడా కక్షిదారులుగా చేరి సుప్రీంకోర్టును ఆశ్రయించడం జరిగింది. ఇది రెండు రాష్ట్రాలు-తెలుగు, కన్నడ భాషలకూ-కేంద్ర ప్రభుత్వానికి మధ్య వ్యవహారం కాగా, మూడో రాష్ట్రమైన తమిళనాడుకూ, తమిళ భాషకూ ఇందులో ప్రమేయం అనవసరం కాబట్టి, తమిళులు ఇప్పటికే క్లాసికల్ హోదాను సాధించుకొని లబ్దిదారులుగా ఉన్నారు కాబట్టి, కేవలం మోకాలడ్డే ఈ కుతంత్రాన్ని ఆపుచేసి, చెన్నై హైకోర్టులో వేసిన వ్యాజ్యాన్ని రద్దు చేయించవలసిందిగా కృష్ణాజిల్లా రచయితల సంఘం సుప్రీంకోర్టును అభ్యర్థించింది.

సుప్రీం కోర్టులో కేసు దరిమిలా, చెన్నై హైకోర్టులో ఈ కేసు విషయమై న్యాయమూర్తి తన అశక్తతను వ్యక్తపరిచి వాయిదా వేశారు. అప్పటి వరకూ మౌనంగా ఉన్న కేంద్ర ప్రభుత్వం సుప్రీం కోర్టులో తన వాదనను వినిపించింది. తెలుగు, కన్నడ భాషలకు ప్రాచీనతా హోదాని ఇవ్వడం పట్ల తన నిబద్ధతను కోర్టుకు తెలియచేసింది.

2009 మే 16న ఎన్నికల ఫలితాలు వెలువడటానికి ముందు ప్రధానమంత్రి అత్యవసర కేబినెట్ సమావేశం జరపగా, తెలుగు-కన్నడ భాషలకు క్లాసికల్ హోదా ఇచ్చే విషయంలో కేంద్ర కేబినెట్ ఆమోదం లభించింది. దాంతో అంబికా సోనీగారు చెప్పిన క్యాబినెట్ ఆమోదం షరతు నెరవేరినట్లయ్యింది. ఇంక మిగిలింది చెన్నై హైకోర్టు కేసు.

ఇది ఇలా ఉండగా, సుప్రీంకోర్టు చెన్నై కోర్టు విషయంలో జోక్యం చేసుకోవడానికి నిరాకరించింది. చెన్నైలోనే దీన్ని పరిష్కరించుకోవలసిందిగా 2010 ఏప్రియల్‌లో తీర్పు వెలువరించింది.

దరిమిలా పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ప్రభృతులు ఢిల్లీలో మళ్లీ కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రులను కలిసి ఈ కేసు విషయమై కదిలించడంతో న్యాయశాఖ అభిప్రాయాన్ని కోరడం, కేంద్ర న్యాయశాఖ–చెన్నై హైకోర్టులో కేసు నడుస్తున్నప్పటికీ తెలుగు కన్నడ భాషలకు నిధుల విడుదల ఆపవలసిన అవసరం లేదని చెప్పడంతో చకాచకా ఫైళ్లు కదిలాయి. కేంద్ర మానవ వనరుల శాఖ, యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్, కేంద్ర సాహిత్య అకాడమీ, భారతీయ భాషా కేంద్రం (మైసూరు) వారికి ఈ న్యాయశాఖ అభిప్రాయం తెలియజేస్తూ, వివరాలు తెలియచేస్తూ, తక్షణం అన్ని కేంద్రీయ విశ్వవిద్యాలయాలలోనూ తెలుగు, కన్నడ పీఠాలు నెలకొల్పవలసిందిగా ఆదేశించింది. 2010 ఆగస్ట్ నెలలో హైదరా బాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఒక తెలుగు పీఠాన్ని నెల కొల్పారు కూడా. అయితే, దానికి పాలకవర్గాన్ని, పరిశోధకు లను, నిధులను, విధులను ఏర్పాటు చేయవలసి వుంది.

ఇది ఇలా ఉండగా చెన్నై హైకోర్టులో మన పక్షాన వాదిం చడానికి అధికార భాషా సంఘానికి అధ్యక్షులు లేకుండా పోవ డంతో, మన పరోక్షంలో కేసును మనకు వ్యతిరేకంగా నడిపించే ప్రమాదాలు కన్పించడంతో ముఖ్యమంత్రిగారి దృష్టికి ఈ కేసు పూర్వాపరాలన్నీ తీసుకు వెడుతూ, తక్షణం మద్రాసు కేసుని పరిష్కరించే చర్యలు చేపట్టవలసిందిగా కోరుతూ కృష్ణాజిల్లా రచయితల సంఘం ఒక లేఖని రాయడం జరిగింది.

నాటి ముఖ్యమంత్రి రోశయ్యగారు సాంస్కృతిక శాఖ నేతృ త్వంలో ఒక నిపుణుల కమిటీని నియమించి, దీని విషయమై తగు చర్యలు తీసుకోవలసిందిగా ఆదేశించారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులు, భాషోద్యమ నాయకులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ కూడా ఈ కమిటీలో ఉన్నారు.

ఈ కమిటీ నిర్ణయం మేరకు, 2010 ఆగస్ట్ 23వ తేదీన రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల సంచాలకులు శ్రీ చెల్లప్ప, చెన్నై హైకోర్టులో మన ప్రభుత్వం పక్షాన వాదించేందుకు రవీంద్రనాథ్ గారిని న్యాయవాదిగా నియమిస్తున్న విషయం తెలిపారు. కేంద్ర ప్రభుత్వం తరపున సొలిసిటర్ జెనరల్ స్వయంగా ఈ కేసును వాదిస్తారని చెప్పినట్లు కూడా చెన్నై నుంచి వెలువడే వార్త పత్రికలు సూచించాయి. ఈ వ్యాసం రాస్తున్న సమయానికి ఇదీ తాజాస్థితి.

**కృష్ణా విశ్వవిద్యాలయం కోసం, తెలుగు శాఖ కోసం పోరాటం :**

బెజవాడలో 1925లో ఆంధ్రవిశ్వవిద్యాలయాన్ని ప్రారంభించినట్లే ప్రారంభించి అనేక కారణాలతో దానిని విశాఖపట్నం (వాల్తేరు) తరలించిన తరువాత విజయవాడలో సిద్ధార్థ విద్యా సంస్థలు ఏర్పడేవరకూ ఈ ప్రాంతాన్ని 'విద్యలవాడ'గా తీర్చిదిద్దాలనే దృఢసంకల్పం ఇక్కడి నేతల్లో కరువవటం వలన, ఈ జిల్లాకు జరిగిన నష్టాన్ని మరొక విశ్వవిద్యాలయంతోనో, తత్సమానమైన దానితో పూడ్చే నిర్ణయాలు జరగలేదు. ఎన్టీరామారావు ముఖ్య మంత్రి అయ్యాక "ఆరోగ్య వైద్య విశ్వవిద్యాలయం" ఈ జిల్లాకు దక్కింది. వై.యస్.రాజశేఖరరెడ్డి తొలిసారిగా ముఖ్యమంత్రి అయ్యాక శ్రీ మండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, కృష్ణాజిల్లా రచయితల సంఘం విజ్ఞప్తులను పరిగణనలోకి తీసుకుని బందరులో కృష్ణా విశ్వవిద్యాలయం ఏర్పాటుకు ప్రభుత్వం అంగీకరించింది. అయితే, అలా ఏర్పడుతున్న ఈ కొత్త విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖ లేకుండానే కోర్సుల్ని నిర్ణయించిన వార్త తెలిసి కృష్ణాజిల్లా రచయితల సంఘం తీవ్రంగా తన నిరసనను తెలియజేసింది. విశ్వ విద్యాలయం ప్రారంభ సమయానికి జిల్లాలోని రచయిత లందరూ ధర్నాచేసి అరెస్టు కావడానికి సిద్ధం కావలసిందిగా పిలుపు ఇవ్వడమూ జరిగింది. ఆ దశలో నాటి జిల్లా మంత్రి వర్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ ఉన్నత విద్యామండలిని అంగీక రింపచేసి తెలుగుశాఖ ఏర్పాటుకు మార్గం సుగమంచేశారు. విశ్వ విద్యాలయ కులపతి ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్ స్వయంగా తెలుగు భాషాభిమాని కావడంతో ఆయన తీసుకున్న చొరవ వలననే తెలుగుశాఖ ఏర్పడింది.

విద్యార్థులు చేరడం లేదనే కారణంతో తెలుగు ఎం.ఎ. కోర్సులు పెట్టలేదని ఉన్నత విద్యా మండలి అన్నప్పుడు, ఫీజులు కట్టుకోలేని విద్యార్థులకు కృష్ణాజిల్లా రచయితల సంఘం వాటిని చెల్లించేందుకు సిద్ధం కావడంతో పరిమితిని మించి విద్యార్థులు చేరారు. దాదాపు ఎనిమిదిమంది ఫీజులను కృష్ణా జిల్లా రచయితల సంఘం రెండేళ్లపాటు చెల్లించింది..... రెండో సంవత్సరం చివర ఆ విద్యార్థులకే ప్లేస్‌మెంటులు జరిగి వారిలో ఐదుగురికి ఉద్యోగాలు కూడా వచ్చాయి. ఒక రచయితల సంఘం చేయగలిగిన, చేయ వలసిన కార్యక్రమంగా దీన్ని భావించాము.

ఇలా తెలుగు భాషోద్యమ స్ఫూర్తితో కృష్ణాజిల్లా రచయితల సంఘం అనితర సాధ్యం అనదగిన ఎన్నో కార్యక్రామలను నిర్వహించి తెలుగు భాషోద్యమ పరంగా, ప్రజల గుండె తలుపులు తట్టిందనడం అతిశయోక్తికాదు. జాతీయ కవిసమ్మేళనాలు, వచన కవిత్వం వర్క్‌షాపులు, జర్నలిజం వర్క్ షాపులనేకం నిర్వహించి కృష్ణాజిల్లా

రచయితల సంఘం కేవలం కృష్ణాజిల్లాకే పరిమితం కాకుండా, తెలుగునేల నాలుగు చెరగులా భాషా సాహితీ ప్రియులను ఉత్తేజితం చేస్తూ తన ప్రత్యేకతను చాటుకుంటున్నది.

**తెలుగు వ్యాసమండలి :**

తెలుగు భాష, సంస్కృతి, చరిత్ర, సాహితీ వైభవాల మూలాలను వెతుకుతూ ప్రసిద్ధులైన సాహితీవేత్తలు గత వందేళ్లుగా పరిశోధనలు చేస్తూ వ్రాసిన అనేక పరిశోధనాత్మక వ్యాసాల సంకలనంగా "తెలుగు వ్యాసమండలి" బృహద్గ్రంథం 2011లో కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురించింది.

అనేక అపురూప వ్యాసాలను ఈ పుస్తకంలో పదిలపర్చటం వలన పరిశోధకులకు ఎన్నో పుస్తకాలను పరిశీలించే శ్రమ తప్పినట్లయ్యింది.

**కృష్ణాజిల్లా సర్వస్వం గ్రంథ ప్రచురణ :**

కృష్ణాజిల్లా చరిత్ర తెలుగువారి చరిత్రతో ముడిపడి నడిచింది. ఈ చరిత్ర లోతులను త్రవ్వితీసే పరిశోధనలు చాలినంత జరగలేదనే చెప్పాలి. కృష్ణాజిల్లా గ్రామచరిత్రల సేకరణ ఉద్యమ స్థాయిలో జరగవలసిన ఆవశ్యకత కూడా ఉంది. కృష్ణాజిల్లా రచయితల సంఘం ఇందుకు పూనిక వహించి కొంత ప్రయత్నం చేసింది. 2008 మార్చి 21, 22 తేదీలలో మచిలీపట్టణంలో కృష్ణాజిల్లా చారిత్రక వైభవం సదస్సు నిర్వహించింది. ఈ సదస్సులో సమర్పితమైన అనేక పరిశోధనా వ్యాసాల సంకలనంగా "కృష్ణాజిల్లా సర్వస్వం" బృహద్గ్రంథం ప్రచురించి కృష్ణాజిల్లా చరిత్ర రచనకు ఒక కొత్త రూపునిచ్చింది.

**2వ ప్రపంచ రచయితల మహాసభలు : తెలుగు పున్నమి ప్రచురణ**

2011 ఆగస్టు 13, 14, 15 తేదీలలో విజయవాడ ఎస్.వి.యస్. కళ్యాణమండపంలో నిర్వహించిన 2వ ప్రపంచ రచయితల మహాసభలలో అప్పటి రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధుల సాంకేతిక రంగంలో తెలుగు భాషను చేర్చటానికి అనేక నిర్ణయాలను ప్రకటించడం విశేషం.

యూనికోడ్ కన్సార్టియంలో సభ్యత్వం, కొత్త కీ బోర్డులు, వ్యాకరణ నియమాలు, 14 రకాల నూతన ఫాంటులు ఇంకా అనేక పథకాలను ఈ మహాసభలలో ప్రకటించారు. తెలుగు భాష – చరిత్ర–సంస్కృతి ప్రధానాంశాలుగా ఈ మహాసభలు జరిగాయి. ప్రపంచ వ్యాప్తంగా అనేకమంది తెలుగు ప్రముఖులు ఈ మహా సభలలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా తెలుగు పున్నమి పరిశోధనా గ్రంథం ప్రచురణకి సహకరించిన ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ వారికి ధన్యవాదాలు. సభల ప్రత్యేక సంచికగా 'తెలుగు వెన్నెల' గ్రంథాన్ని కూడా ప్రచురించడం జరిగింది.

**2015 : 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు :**

ప్రాంతాల కతీతంగా ప్రపంచంలోని తెలుగు వారంతా ఒకటేననే ఏకైక లక్ష్యంతో 2015 ఫిబ్రవరి, 21, 22 తేదీలలో విజయవాడ శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూల్ సభా ప్రాంగణంలో జరుగుతున్న ఈ 3వ మహాసభలు లక్ష్యసాధన చేస్తాయని విశ్వసిస్తున్నాం. సహకరిస్తున్నందుకు పెద్దలందరికి మా నమోవాకాలు. ఈ సందర్భంగా తెలుగు భారతి వ్యాస సంకలనం ప్రచురణకు శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్ ప్రోత్సాహ ప్రోద్బలాలతో ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు చారిటబుల్ ట్రస్ట్ వారు గ్రంథ ప్రచురణ బాధ్యతను స్వీకరించారు.



# మాతృధరిత్రి

- డా॥ సి. నారాయణరెడ్డి, హైదరాబాద్

భూమి ఒక గోళమో
లేక అజ్ఞాత శక్తి చేసిన
ఇంద్రజాలమో.
అది తన చుట్టూ తానే తిరుగుతూ
తనను నమ్ముకుని ఉన్న సృష్టికి
తల తిరగకుండా చూస్తుంది
తన మట్టి ఎదపైన
మహోన్నత పర్వతాలను
దూది పింజల్లా మోస్తుంది.
చెట్ల వేళ్లు
తన లోలోపలికి చొచ్చుకుపోయినా
భూమి నొచ్చుకోదు.
ఆ చెట్లు ఆకుపచ్చని శాఖలతో
విస్తరించి
శిరసులూపుతూ వుంటే
తాను మురిసిపోతుంది
తన ఒడిలో నదులు
పసిపాపల్లా పారాడినా
ఉన్మత్త గతులతో విరుచుకుపడినా
సమదృష్టితోనే చూస్తుంది భూమి.
సృష్టికి మాతృమూర్తిగా వున్న ధరిత్రికి
సహనగుణం సహజాత లక్షణం.
పరిస్థితుల విషమప్రాబల్యంతో
తన సహనానికి రాపిడి అతిక్రమిస్తే
అది రౌద్రమూర్తిగా విజృంభిస్తుంది.
ఇంకేముంది?
ఝరులు దొర్లిపడతాయి.
గిరులు బోర్లపడతాయి.
సమస్త మానవ సముదాయం
అతలాకుతలమై పోతుంది.
ఈ స్వల్పకాలిక విపరిణామం
కన్నతల్లి కోపంలాంటిది.
బుస్సున పొంగుతుంది
చప్పున చల్లారుతుంది
పర్యవసానంగా మాతృధరిత్రి
తన బిడ్డలందరినీ
కౌగిట్లో పొదుగుకుంటుంది.



# తరతరాల తెలుగు సంప్రదాయాలు

- డా॥ కూచిమంచి అన్నపూర్ణ, సికింద్రాబాద్

ఆంధ్రభాష, ఆంధ్రులు, ఆంధ్రభూమి అంటే ఎక్కడో దేహం లోని ముఖ్య మూలాలలో పేగు లాగుతుంది. దీన్నే కాబోలు "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అనే ఆర్యవాక్కులో ఇమిడ్చారు. ఆంధ్రం మాట్లాడేవారు ఆంధ్రులు. వారియొక్క ముఖ్య భాష - సంస్కృతి - సంప్రదాయం ఎప్పటి నుంచో వస్తూంది. దానిని మార్పు చేర్పులతో మూలమార్గం మారకుండా, వాటిని నిన్న, ఇవాళ, రేపు, ఎప్పటికీ ఇలా నిలబెట్టుకు వస్తున్నారు. దానికి మూలము స్త్రీలేనని నొక్కి చెప్పవచ్చును. అనాదిగా ఆ స్త్రీలు సంరక్షించుకుంటున్న తెలుగుదనాన్ని అభివర్ణించడమే ఈ వ్యాసపుటుద్దేశం.

ఏ జాతి సాంఘిక చరిత్రనైనా తీర్చిదిద్దే శక్తి వెనుక నున్న మంచిని మరుగుపడనీయక తన సంప్రదాయాన్ని కాపాడుకుని వచ్చే గొప్పదనం ఆంధ్ర స్త్రీ జాతికే దక్కింది. ఆంధ్రత్వం అంటే, ఏ తరం అయినా మానవ జీవిత సరళిలో అనుబంధాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది. ఆదిలో స్త్రీలు తమ గృహాలకే పరిమితమై ఇంటిని చక్కదిద్దుకోవటంలో, ఆచార వ్యవహారాలలో, భాషలో, ఆహార విహారాలలో, ఆటపాటలలో తమ సంప్రదాయాన్ని వ్యక్తీకరిస్తూండేవారు. ఇప్పుడు జీవన లక్ష్యం, ధ్యేయం, భిన్నంగా మారినా, ఇంకా కొంత పాత వాసన లేకపోలేదు. ఆంధ్ర స్త్రీలలో గుబాళిస్తూనే ఉంది. ఉంటుంది కూడా! తరతరాలు ఇలా నిలబడటానికి ఆ స్త్రీల యొక్క మానసిక శక్తియే ముఖ్య కారణం. అది ఏ విధంగా నిలుపుకుంటూ వచ్చారో వాటిలోని ముఖ్యాంశాల్ని ఈ క్రింది విధంగా వర్గీకరించి వీటిని గూర్చి కొంత విషయవగాహన చేసుకునే ప్రయత్నం జరిగింది. ఆ విషయములే పరిశీలించాలి.

1. భాష
2. సంప్రదాయం - ఆచారం
3. వివాహ వ్యవస్థ
4. వేష భూషణాలు
5. భోజన వ్యవహారములు
6. సంస్కృతి - నాగరికత
7. ఉపసంహారము.

**1. భాష :** ప్రతీ ఇంట్లో స్త్రీలు పిల్లలతో సహా అందరితోను తెలుగు భాషలో మాట్లాడుతూ భాషకు జీవం పోస్తారు. చిన్న చిన్న సంఘాలు ఏర్పరుచుకుంటూ, సమావేశాలు జరుపుకుంటూ తమ భాషను విస్తారంగా ఆనందంగా వింటూ ఆనందిస్తారు. పిల్లల పోషణలో "కస్తూరి రంగ రంగా..." అని పాడుతూ, రేడియో, దూరదర్శన్‌ల నుండి వినే" అ,ఆ,లొచ్చాయా చాలా ఇ, ఈ, లొచ్చాయా"! అనే పాటలలో కల తియ్యందనాన్ని పిల్లలతో కలిసి పంచుకుంటూ వారితో కలిసి పెరుగుతారు కూడా. ఆ భాష తీయదనాన్నిఉగ్గుపాలతో రంగరించే జీర్ణించుకుంటారు. తెలుగు వారపత్రికలు, పుస్తకాలు, చదివి పిల్లలతో కలిసి ఆనందిస్తారు. సినిమాలు చూసి ఆనందించి నలుగురితో కలిసి ఆ ఆనందం పంచుకుంటారు. సభలు, సన్మానాలు జరుపుకుని సరదాగా రసభరితంగా కాలాన్ని గడుపుతారు. తెలుగు కళాకారులని పిలిపించి వారి మూలంగా తమ ప్రియ భాషను వినటానికి ఉత్సాహ పడతారు. ఆ భాషను వింటూ ఉప్పొంగిపోతారు.

**2. సంప్రదాయాలు - ఆచారాలు :** సంప్రదాయాలు, ఆచారాలు మనకి అనాదిగా వస్తున్నవి.

**"అంత కడివెడు పాలపై**
**ఒకింత మీగడ పేరినట్లుగ**
**మనకు మిగులును గతములోపలి**
**మంచి, అదియే సంప్రదాయము"** అని శ్రీ.సి.నా.రె. గారన్నట్లు గతంలోని మంచి మిగులుతోంది. మన సంప్రదాయములు మనిషి పుట్టుకతో ఆరంభమైతాయి. మనిషి పెరుగుతున్న కొద్దీ - ఆచారాలు చోటు చేసుకుంటాయి. ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకునే దాకా మనమెన్నో ఆచారాలు పాటిస్తూంటాం. ఇంటి ముందు నీళ్ళు చల్లి, ముగ్గు వేసి, శుభ్రంగా చూడటాన్ని ఇల్లాలు గమనిస్తూంటుంది. తల్లిగా మన ఆచారాల్ని తన పిల్లలకు సంక్రమింప చేస్తుంది.

ఈ సంప్రదాయాల్ని, ఆచారాల్ని, ముఖ్యంగా మన కుటుంబ వ్యవస్థలో ప్రతి ఒక్క పనీ ఒకే తీరుగా నడిపింప చేయటానికి, మనకు అనాదిగా వస్తున్న సంప్రదాయ ఆచారాలు దోహదం చేస్తాయి. ఇది ఇలా చేయాలి అనే ప్రాతిపదికకు తగినట్లు నడుచుకుంటూ పోతే మనకు తృప్తిని కలిగిస్తుంది. అందుకు భిన్నంగా జరిగితే మనసు కలవర పడుతుంది. పాశ్చాత్య నాగరికత, సంస్కృతి ప్రభావంగా వీటిలో కొంత మార్పు వచ్చినా పునాది మాత్రం మనదే అయి ఉంటుంది. వీటిని సక్రమంగా నిర్వహించే బాధ్యత స్త్రీ వహిస్తుంది. పురుషుడు వీటికంతగా ప్రాముఖ్యత నివ్వకపోయినా స్త్రీల వలన ఇవి సవ్యమవుతుంటాయి.

గర్భంలో పడినప్పటి నుండి ఆమరణాంతం మనల్ని అనేక ఆచారాలు అల్లుకొని ఉన్నాయి. సీమంతం, ముత్తైదువుల దీవెనలు, బ్రాహ్మణ ఆశీస్సులు, బారసాల (బాలసారె), అన్నప్రాసన, పుట్టు వెంట్రుకలు తీయటము, అక్షరాభ్యాసం, ఉపనయనం, పెళ్ళి ఇలా ఎన్నో మనల్ని అంటి పెట్టుకుని ఉన్నాయి. చివరికి చచ్చినా కూడ ఆ శవాన్ని అలా ఊరికే పంపలేము. ఎంతో కొంత తతంగాల్ని ఆచరించి తీరాలి. వీటి అన్నింటికి స్త్రీ ప్రాతినిధ్యం వహిస్తుంది. సాధారణంగా ఆచరణ విషయంలో భర్త భార్య యొక్క సలహాను పాటిస్తాడు. ప్రతి

చిన్న విషయాన్నీ ఆవిడతో సంప్రదించి మరీ ఆచరిస్తాడు. ఆచారాలలో, సంప్రదాయాలలో కొంత దైవభక్తి కూడ లేకపోలేదు. ఆ ఆచరణలో స్త్రీ కంకణబద్ధురాలవుతుంది. ఈ విషయం కూడ మనం ప్రత్యేకంగా గమనించాలి.

దైవభక్తి మాటకొస్తే ఇక పండుగలు, పబ్బాలు, దైవారాధన కోసం చేసే పనులు, కొంత వేడుకలుగా కూడా మారాయి. తెలుగు వారికి పండుగలకి కొదవలేదు. శారీరకంగా, ఆర్థికంగా, స్తోమత ఉండాలే కాని, ఆ ఆచారాలు ఎన్నో ఉన్నాయి. ఉగాది, శ్రీరామనవమి, శ్రావణ భాద్రపదాల్లో లక్ష్మి, గౌరి, వినాయకుడు తరువాత సంక్రాంతి ఇలా పట్టీ పెరుగుతూ పోతుంది. వీటి మధ్య నవగ్రహ పూజ, సత్యనారాయణ వ్రతం,రుద్రహోమాలు, ఆయుష్య హోమాలు, ఇలా ఎన్నో. వీటన్నింటిలో అనుసరించాల్సిన విధానాలు, పద్ధతులు వేనవేలు. స్త్రీ జాతి ఎక్కడున్నా ఈ విషయాల్లో తన కుటుంబ శ్రేయస్సు కోసం తనవారి మేలు కోసం తప్పనిసరిగా వీటిని ఆచరింప చేస్తుంది. ఇది ఆమెకు ఆత్మ తృప్తిని కలుగజేస్తుంది. మనదైన ఈ ఆచార విచారాన్ని వదలక అనుసరిస్తూ ఆచరిస్తూంటుంది. స్త్రీలకు ముఖ్యంగా వ్రతాలు, నోములు, ఎక్కువ ఆచరణలో ఉన్నాయి. స్త్రీ ఉద్యోగాలు చేస్తూన్నా ఉన్న సమయములోనే వీటిని వదలక ఆచరించుటయే ఒక గొప్ప. మారుతున్న సమాజంలో మనదైన విలువల్ని సంరక్షించుకోవటానికి, తాపత్రయ పడటం మనం ముఖ్యంగా మన స్త్రీలలో గమనిస్తాం. పండగల్లో హారతులు, పాటలు, ఇవన్నీ స్త్రీలకి సంబంధించినవే. వీటిని ఆచరించటములో స్త్రీ తన చుట్టుపక్కల వారితో స్నేహసౌహార్ధాలని పంచుకోవటమే కాక ఆనందాన్ని కూడ అనుభవిస్తుంది.

ఆడపిల్ల పుట్టింట్లో ముద్దు ముచ్చట్లు, గారాలతో గడిపి మెట్టినింట్లో బాధ్యతాధికారాల్ని చేపడుతుంది. తెలుగు జాతి సంప్రదాయ ప్రకారం తాను ఏ కాలంలో ఉన్నా నడుచుకుంటుంది. తరతరాల తెలుగు సంప్ర దాయాన్ని కాపాడుతుంది. తన గృహాలంకరణ విషయంలో శ్రద్ధ వహించి తెలుగిల్లు అనేమిటి, దాక్షిణాత్యుల ఇల్లు అని గుమ్మం ఎక్కగానే తెలిసేటట్లు చేస్తుంది. ముంగిట ముగ్గు, గడపకు పసుపు, పండుగల నాడు మామిడాకుల తోరణాలు ఆ ఇంటిని కళకళలాడేటట్లు చేస్తుంది. బాధ్యత గలఇల్లాలుగా భర్త పిల్లలు,అత్తమామలు,బావగార్లు, మరుదులు, ఆడపడుచులు, వచ్చిపోయేవారు. వీరందరికీ తగినట్లు సదుపాయాలు సమకూరుస్తూ కుటుంబ గౌరవాన్ని కాపాడుతుంది. మన తరువాత తరంవారికి ఈ ఆచార వ్యవహారాలు బోధించడం కష్టము కదా! అలా కాకుండా తల్లి నుండి కూతురికి అలా తరతరాలు వచ్చేటట్లు పాటుపడుతుంది ప్రతి స్త్రీ. అందుకు మూలాధారం ఎక్కడైనా, ఎప్పుడైనా ఇంట స్త్రీయే అవుతుంది. అవ్వాలి కూడా.

ఉగాది మామిడి తోరణాలు,వేపపూతలు,అభ్యంగ స్నానాలు, కొత్త బట్టలు, ఉగాది పచ్చడి, పక్వాన్న భోజనాలు, పంచాంగ శ్రవణం, శివ రాత్రిలో ఉపవాసాలు, భక్తితో పూజలు, జాగరణలు, మంగళగౌరీ వ్రతాలు-నోములు, ఆరాధనలు, అలంకరణములు, వాయనాలు, నాగులచవితి, వినాయక చవితి, దసరా, దీపావళి సంబరాలు, దీప లక్ష్మి పూజలు, మతాబులు, తారాజువ్వలు, టపాసులు,వేడుకలు, సంక్రాంతి పండుగల్లో ముత్యాల ముగ్గులు, గొబ్బిళ్లు, బొమ్మలు పెట్టుకోవడం, భోగిపళ్ళు, పొంగలి భోజనాలు, ఇలా సంవత్సరం పొడుగునా అనేక పండుగల్లో అనేక విధాలుగా ఆచారాన్ని పాటిస్తూ వస్తాం. కాల పరిస్థితుల రీత్యా ఆర్థిక సౌకర్యాల రీత్యా, ఆయా ఆచారాల్లో కొంత శ్రద్ధ, ఉత్సాహం తగ్గినా వీటి ప్రాముఖ్యం తెలుగు జాతి జీవ నంలో ముఖ్య భాగంగానే నేటికీ ఉంటోంది. దీంట్లో స్త్రీ పాత్ర కీలకమని చెప్పక తప్పదు.

**వివాహ వ్యవస్థ :** వివాహం హిందూ ధర్మ ప్రకారం మిక్కిలి ప్రాముఖ్యతని వహిస్తుంది. మనిషికి నిండుదనాన్ని కలిగిస్తుంది. కులం, గోత్రం, విద్య, గుణం, ధనం, వీటన్నింటిలో సమంగా తూగే సంబంధాన్ని చూసి పెద్దలు నిర్ణయించి వివాహం జరిపించే పద్ధతి ఆచరణలో ఇప్పటికీ ఉన్నా పిల్లలే స్వతంత్రంగా తమ జీవిత భాగస్వామిని ఎన్నుకునే పద్ధతి కూడ ఇప్పుడిప్పుడే సమాజంలో ప్రవేశించింది. పెళ్ళిళ్ళు శాస్త్రోక్తంగా, మంత్రయుక్తంగా, లాంఛనాలతో, కానుకలతో జరుపుకోవటం, ఇప్పటికీ ఉంది. వేడుకలు, ముచ్చట్లు, అలంకరణలు మిగిలే ఉన్నాయి. బుగ్గ చుక్క కళ్యాణ తిలకం, బాసికం, జీలకర్ర బెల్లం, మంగళ సూత్రధారణ, కాలిమట్టెలు, అరుంధతీ దర్శనం, అప్పగింతలు, మంగళ హారతులు వంటి తతంగాలు యింకా ఎన్నో ఇప్పటికీ మిగిలి ఉన్నాయి. మన వివాహ సమయాల్లో స్త్రీలు అత్యుత్సా హంతో పాల్గొంటారు. ముఖ్యంగా వీళ్ళు ఈ సందర్భాల్లో కీలక పాత్రని వహిస్తారు. అదే తెలుగుతనం.

**వేష భూషణాలు :** తెలుగువారి కట్టు, బొట్టు, మాట, ఆచార వ్యవహారాలు, జీవన విధానము, అన్నిటా తమదైనటువంటి ప్రత్యేక సంప్రదాయం ఉంది. దీన్ని మన వాళ్ళు తరతరాలుగా కాపాడు కొస్తున్నారు. కట్టే చీరల్లోని వైవిధ్యాన్ని వర్ణిస్తూ జానపదులు పాడే విధానం గమనిద్దాం.

**"పట్టంచు చీరతో పడతి రావమ్మా! మల్లెపూల చీరతో మగువ రావమ్మా!**
**సేలంచు చీరతో చెలియ రావమ్మా! ఉల్లి మళ్ళ చీరతో ఉవిద రావమ్మా!**
**నీలంచు చీరతో నెలత రావమ్మా! గోరంచు చీరతో కొమ్మ రావమ్మా!**
**కరకంచు చీరతో కలికి రావమ్మా**

ఇలా చీరల అందాల ప్రత్యేకత జానపదులు వర్ణిస్తారు. చీర, రవిక, కట్టు, బొట్టు, కాటుక, గాజులు, మంగళసూత్రం, నల్లపూసలు, ఇవన్నీ ధరించి తెలుగు స్త్రీ తనదైన ప్రత్యేకతని సంతరించుకుంటుంది. కాల ప్రభావం వల్ల వీటిలో కొంత మార్పు కనపడ్డా, కొన్ని ప్రత్యేక సందర్భాలల్లో వీటిని మర్చిపోవడం లేదు. ఏ దేశం వెళ్ళినా అక్కడ ఏ

వేషం ధరించినా తెలుగువారి చీరకట్టును, తెలుగుదనాన్ని మర్చి పోలేము. పండుగలు, పబ్బాలు, అలంకరణ అంటే ఆడవారికి ఆరవ ప్రాణం. నగల విషయంలో ఆడవారికి ప్రత్యేక ఆకర్షణ, అనురాగం ఉంది. కరకంకణాలు, చెవుల కమ్మలు, దుద్దులు, ముక్కు పుడకలు, కంఠాభరణాలు, నల్లపూసలు కలిసిన బంగారు సిరాలు, వజ్రవైఢూర్యాలు పొదిగిన కంఠహారాలు, ఇత్యాదులు తెలుగు వారికి నాడు-నేడు ఎక్కడున్నా, ప్రియమైనవే. పలుదేశాల వారిలో ఎక్కడున్నా తెలుగు పడతి ప్రత్యేకత ఆమెను తెలుగు అమ్మాయిగా తన ప్రత్యేకతే ఆమెను తెలియజేస్తుంది. అది మనకున్న ముద్ర యొక్క ప్రత్యేకత.

**భోజనం :** భోజనాల విషయంలో ఆంధ్రులు ఈనాటికీ తమ ప్రత్యేకతని కాపాడుకొస్తున్నారు. ఆంధ్రులు భోజన ప్రియులనే విషయం మన కావ్యాల్ని గమనిస్తే చాలు తెలుస్తుంది. ముఖ్యంగా శ్రీనాథ కవి సార్వభౌముడు భోజనాల విషయాల్ని కాలాల వారీగా ఆరోగ్య నిమిత్తం. తెల్లని బియ్యం, తెల్లన్నం, పచ్చళ్ళు, కూరలు, గారెలు, బూరెలు, అప్పడాలు, వడియాలు, నెయ్యి, గడ్డ పెరుగు, చిరోటీ, మండిగలు, ఫేణీలు మొదలైన తియ్యని తినుబండారాలు, మొదలైనవెన్నియో వర్ణించారు. గడ్డ పెరుగు, నెయ్యి, భోజనాలకి వాడడం తెలుగు వారికి ముఖ్యం. ఎంత మందికో వారే నేర్పారంటే అతిశయోక్తి కాదు. ఇవన్నీ తెలుగు వారి భోజన విశేషాలు.

పసిబిడ్డను ఒడిలో కూర్చోపెట్టుకొని అరచేయి తెరిచి ఇల్లలికి, ముగ్గుపెళ్ళి, ఆకేసి, తరువాతే అన్నం పెట్టడం. ఇలా చేస్తారు. అది ఆటతో వారికి నేర్పడం.

**"అన్నం పెట్టి, అప్పం పెట్టి గుంటపెట్టి, గుంట నిండ నెయ్యిపోసి**
**గారెపెట్టి, బూరెపెట్టి అన్నం పెట్టి, దప్పళం పెట్టి**
**పాలుపోసి పరమాన్నం పెట్టి కూరపెట్టి, నారపెట్టి...!"**

ఇటువంటి వంటకాలకు తెలుగువారి ఇండ్లలో కొదవలేదు. తెలుగువంటకాలు, పానీయాలు, శ్రీనాథుని కంటే చక్కగ వర్ణించ గలవారు లేరంటే అతిశయోక్తి కాజాలదు. ఆయన చవిచూడని భక్ష్య పదార్థాలు లేవు. వర్ణించని శాక పాకాలు లేవు. ద్రాక్షా పానకాలు, ఖండ శర్కరలు, రంభాఫల శ్రేణులు, గోక్షీరాలు, పప్పులు, చిత్రాన్నాలు, లడ్లు, ఇడ్డెనలు, కుడుములు, వడలు, అరిసెలు, అప్పాలు.. ఇలా ఎన్నో ఆయన అభివర్ణించారు. అరిటాకు భోజనం తెలుగువారికి ముఖ్య భోగం. ఆకులో ఎక్కడెక్కడ ఏమి వడ్డించాలో అది ఒక పద్ధతి. అది ఈనాటికీ ఆంధ్రులకి ప్రియమైన భోజనమే. అందులో ఆంధ్రులది అందె వేసిన చేయియే!

"గ్రామము చేత నుండి...నా స్వామి ఎరుంగు తత్కబళ చాతురి తాళఫల ప్రమాణముల్-" అని ఆనాడే ఆ కవీశ్వరుడు అన్నాడు. సుష్టుగా భోజనం చేయడం ఆంధ్రులకి సాటి ఎవరు లేరు అనడం అక్షర సత్యం. ఇది వీరు సంరక్షించుకున్న మరియొక ప్రత్యేకత.

**సంస్కృతి-నాగరికత :** ఎన్నో సంప్రదాయాలను, సదాచారా లను జీవన విధానంలో అనుసరింపజేసుకుని ప్రక్షాళనమైన తెలుగు నాగరికతని నలుమూలలా వ్యాపింప చేస్తున్నారు. ఈ సంస్కృతి ఎంతో పురాతనమైనది. పరమోదాత్తమైనది. మనవారు ఈ నాగరికతని నలుమూలలా వ్యాపింపచేస్తున్నారు. ఆంధ్రులు శాంతి ప్రియులు. అదే విషయం వారు వివిధ ప్రాంతాల్లో, అక్కడి జనంతో పాటు కలిసిపోవటం వల్ల తెలుస్తుంది. "ఏ దేశమేగినా - ఎందు కాలిడినా..." గర్వకారణమైన మన సంస్కృతిని రక్షించుకోవటం మన విధి. ధర్మం..."

ఆంధ్ర దేశమందలి సంగీతం, సాహిత్యం, నృత్యం, చిత్రకళలు వంటి వాటిని నేర్చి పాశ్చాత్యుల్లో శదితరులలో ఒక విశిష్ట స్థానాన్ని తెలుగు వారికి సంపాదించి పెడుతున్నవారు అధికంగా స్త్రీలే. ఉద్య మాల్లో రాణించినా, తెలుగుదనాన్ని నింపుకుంటున్నారు. మనవారు ఏ ఏ ప్రాంతములకు వెళ్ళినా మన సంస్కృతిని పంచి పెట్టినవారు మన మహిళామణులే. తెలుగు జాతి సంస్కృతి ఇది అని స్త్రీలు విధిగా ప్రచారం చేసినందువలన ప్రపంచ వ్యాప్తమైనది. అందుకనే వీటికన్నిటికీ స్త్రీ ఎక్కడైనా కీలక స్థానంలో ఉంది అనుటకు తిరుగులేదు. చదువుకున్న స్త్రీలు ప్రాచీన సంప్రదాయాల్ని బాగా తెలుసుకొని అందులోని మూఢ త్వాన్ని తొలగించి మంచిని మాత్రం చేపట్టి, ఆచరించి, పరిరక్షించు కొంటున్నారు. శతాబ్దాల పర్యంతం ఎంతో విస్పష్టతతో సంస్కృతీ సదాచారాలను భద్రంగా కాపాడుతూ తెలుగువారి నారి సమాజంలో కూడా తేనెలూరే తెలుగు చరితను ప్రపంచానికి తేటతెల్లం చేస్తూంది. అది ఆమె విధిగా భావిస్తూ పులకరిస్తుంది.

**ఉపసంహారం :** సామాజిక జీవితంలో ఉత్తమ సంస్కృతీ పరిరక్షణకు ఆధారభూతమై నిలచిన దానిని తరం తరువాత తరానికి అందిస్తూ వచ్చింది. అనాది కాలంగా స్త్రీలే పురాణ కాలాలైనా, ఆధునిక కాలాలైనా, స్త్రీ మన సంస్కృతికి ప్రతీకగా నిలచి ఉంది. సంఘ జీవ నంలో కాలాన్ని బట్టి అనేక మార్పులు వస్తున్నా నూటికి ఒక్కరైనా మన స్త్రీలు తమదైన జాతి నిండుగర్వాన్ని పది కాలాల పాటు నిలబెట్ట గలుగుతూ వున్నారు!

ఆంధ్ర భాష, సంస్కృతి, సంప్రదాయాలు మొదలైనవి పలు విషయాలు, పలు కాలాల పాటు నిలచి ఉండాలని చేసిన ప్రయత్నంలో ముఖ్యులు స్త్రీలే. అదే వారి గొప్పదనం. ప్రసన్నతని, శాంతిని, ముఖంలో ప్రతిబింబింప చేస్తూ స్త్రీ జాతి ఏ ఊరెళ్ళినా తన జన్మభూమి ధర్మాన్ని, సంస్కృతిని నిలబెట్టగలుగుతోంది. అది ఆమెకు భగవంతుడిచ్చిన వరం.

**ఉపయుక్త గ్రంథాలు :**

1. "తెలుగు-వెలుగు"-సి. వేదవతి
2. "శ్రీనాథుని రచనలు".
3. "ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి" సురవరం ప్రతాపరెడ్డి.
4. "ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు, ప్రయోజనములు" - డా॥ సి.నారాయణరెడ్డి.



# అక్షరాయుధుల కత్తిసాము

- శీలా వీర్రాజు, హైదరాబాద్

కష్టజీవుల కన్నీటిలో తడిసి
బరువెక్కిన అక్షరాలు నావి
వాటిని పొదిగిన అక్షరాల్ని ఎక్కడ తడిమినా
ఇప్పటికీ వేళ్ళ కొసలకి తడి తగుల్తూనే వుంటుంది
గుండెల్లో నిలుపుకోవాలనుకునే పాఠకులకు
గుండెలు బరువెక్కి పోవడం ఖాయం
ఒక్కొక్కప్పుడు కళ్ళల్లో కన్నీటి తెరలు వాలి
ఎదుటి దృశ్యం మసకబారిపోనూ వచ్చు
ఈ సత్యమే నా అక్షరమాలికలో దారం
ఈ దారంతోనే నేను ఏ దండనైనా అల్లేది
అందుకే నా మాలకంత ఒద్దిక
అందుకే దానికంత బిగువు
పాఠకుల్ని చప్పున ఆకట్టుకోగల ఆకర్షణ దాని లక్షణం!
మీరు పాఠకులైతే
మీలో కొందరికన్నా
లేదా కొందరిలో కొందరికన్నా
నన్ను చూడాలనీ కలిసి మాట్లాడాలనీ
కుతూహలం కలగడం అసహజమేం కాదు
రండి, తప్పకుండా రండి
మీలాటి అభిమానుల రాకల్తోనే కదా
నేనైనా మరెవరైనా
మా పేరు ప్రతిష్ఠల్ని కొలుచుకునేది
మీ గుర్తింపులే కదా
మేం అధిరోహించిన శిఖరాలకు
సూచికలుగా భావించుకునేది
ఏ సభలోనో రోడ్డు మీదో ఇంట్లోనో
ఎక్కడైనా నిస్సంకోచంగా కలవ్వొచ్చు
లాల్చీ షరాయిలకూ
గిరిజాల జుత్తూ చలవ కళ్ళద్దాలకూ
ఎప్పుడో కాలం చెల్లిపోయింది కదా
ఫాంటులూ బుష్ షర్టు రోజులివి
మీ అందర్లాగే నేనూ నా వేషమూ
మరందుకే నన్ను గుట్టు పట్టేందుకు
మీకొన్ని సూచనలు
మార్కెట్లో
భుజాన బరువు మూటతోనో
చేతిలో నిండుకూరల సంచితోనో
చెమట చుక్కల జిడ్డోడే ముఖాల్లో
నన్ను వెతుక్కోకండి
అర్థాంగికి ఇంట్లో సాయంగా
వంటగదిలో కూరలు తరుగుతూనో
పనిమనిషి రాని రోజున వాకిట్లో
చేతిలో చీపురుకట్టతోనో
నన్ను రూపించుకోకండి
రోడ్డు మీద
దారి పక్క ఏ ముష్టాడికో కుష్టాడికో
ఓ అరటిపండు కొనిస్తూనో
ఏ చిరుకాసో విదిలిస్తూనో

కనిపిస్తానని చూడకండి
వీలయితే ఓసారి
ఖరీదైన ఏ హోటల్లోకో తొంగి చూడండి
కులాసాగా పలావో పకోడియో తింటూనో
తాపీగా కాఫీయో టీయో చప్పరిస్తూనో
మీక్కనిపిస్తే కనిపించొచ్చు
రద్దీలేని ఏ బారులోనో
మారుమూల ఏ టేబిలు దగ్గరో
మసక మసక వెల్తురులో లీలగా
ఒక్కొక్కప్పుడు మీ దృష్టిలో పడితే పడొచ్చు
అంతెందుకు రోడ్డు మీదకు వచ్చి చూడండి
పాదచారుల్ని మాత్రం వొదిలేయండి
చిన్నప్పుడు నడిచిన కాళ్ళే నావి
లాగుడు రిక్షాలూ తొక్కుడు రిక్షాలూ
శ్రమ దోపిడీని గుర్తుకు తెస్తుంటే
బస్సులకే పరిమితమైపోక తప్పలేదు
అందుకే నడక మర్చిపోయిన కాళ్ళివి
బస్సుల్లో సైతం రోజు రోజుకీ రద్దీ పెరిగి
ఊపిరాడనట్టై
ఇంకప్పుడు మోటరుబైక్‌ని ఆశ్రయించక తప్పింది కాదు
ఎందుకైనా మంచిది
వచ్చీపోయే ఆటోల్లోకో టేక్సీల్లోకో తొంగి చూడండి
నేనిప్పుడు తరచుగా తిరిగేది వాటిల్లోనే మరి!
అవిప్పుడు సామాన్యులకి సైతం
సర్వసాధారణమైపోయాయి కదా!
విదేశాల మాటకేం గాని స్వదేశంలోనూ
ఇంకిప్పుడు గాలి బాటలు పడ్డాయి గనక
విమానాల్లోనైనా ఒక్కొక్కప్పుడు
మీక్కనిపించినా కనిపించొచ్చు
గుర్తుంచుకోండి
నేనంటే నేను కాదు
నేను
బహువచనానికి ఏకవచన సంకేతాన్ని
ఈ తెలుగు నేల మీద అక్షరాస్యుల్లో కోకొల్లలుగా వున్న
అక్షరధారుల కులానికి ప్రతినిధిని
అందులోనూ అత్యాధునిక శాఖీయుడ్ని
కలం నా ఆయుధం
కవిత్వం నా యుద్ధభూమి
నా కీర్తినామం
కవి !

# తెలుగు పద్యం అజరామరం

- అప్పారావు పంతంగి (పి.హెచ్.డి), నూజివీడు

"ప్రాతలోనే లేదు ప్రాశస్త్య మంతయు
క్రొత్తయెల్ల హాని కూర్పబోదు
క్రొత్త నీరు రాని కోనేరు పసరెక్కు
వాస్తవమ్ము నార్లవారి మాట"

నార్ల వెంకటేశ్వరరావుగారు అన్నట్లు కొత్త నీరు రాకపోతే కోనేరు పసరెక్కి పాచిపడ్తుంది!

కథలు, నవలలు, కవితలు, దీర్ఘకవితలు, మినీకవితలు, నానీలు, హైకూలు, టుమ్రీలు, స్కెచ్‌లు ఇలా ఎన్నో రకాల ప్రక్రియలు తెలుగు సాహిత్యంలో ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా ఎవరికి తోచిన రీతిలో వారు తెలుగు సాహిత్యంలో సృష్టించేశారు, సృష్టించేస్తున్నారు. ఈ నేపథ్యంలో తెలుగు పద్యాన్ని మాత్రం వదిలేస్తున్నారు. పద్యం రాయడానికి ఛందస్సు, వ్యాకరణ సూత్రాలు, నియమాలు మొదలైన వాటి మీద పట్టు ఉండాలి. అంటే వాటిని విపులంగా నేర్చుకోవాలి. అంత ఓపిక, తీరిక వాటన్నిటినీ నేర్చుకునే ఆసక్తి, అనురక్తి మారుతున్న సమాజంలో పెరుగుతున్న జనాభాకిలేక పద్యాన్ని మధ్యలోనే వదిలేస్తున్నారు. పద్యానికి ఉండే అందం, చందం తెలుగు సాహిత్య ప్రక్రియలలో దేనికి లేదు అనడంలో అతిశయోక్తి లేదు. ఈ విషయం తెలియనివారు ఎందరో ఎవరికి తోచినట్లు వారు విమర్శలు చేస్తుంటారు. వాటన్నిటికీ జవాబు అన్నట్లుగా...

పద్యమ్ము నెవడురా పాతిపెట్టెదనంచు
 నున్మాదియై ప్రేలుచున్న వాడు?
పద్యమ్ము నెవడురా ప్రాతవద్దది యంచు
 వెఱ్ఱివాడై విఱ్ఱవీగువాడు?
పద్యమ్ము ఫలమురా! పాతిపెట్టిన బెద్ద
 వృక్షమై పండ్ల వేవేల నొసగు
పద్యమ్ము నెప్పుడో పాతిపెట్టితి మేము
 లోకుల హృదయాల లోతులందు
ఇప్పుడద్దాని బెకిలింప నెవరితరము
 వెలికితీసి పాతుట యెంత వెఱ్ఱితనము
నిన్నటికి మున్ను మొన్ననే కన్ను దెఱచు
 బాల్యచాపల్యమున కెంత వదఱుతనము

(సహస్రావధాని కడిమెళ్ల వరప్రసాద్)

అనే పద్యంలో పాతని రోతగా భావించే వారిని హెచ్చరిస్తూ, పద్యం కొత్త పరవళ్లు తొక్కుతోందంటారు.

భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విడిపోయిన మనం మొన్న కులాల కోసం తన్నుకున్నాం. నిన్న మతాల కోసం కొట్టుకు చచ్చాం. నేడు ప్రాంతాల కోసం పోరాడుతున్నాం కాని అందరి భాష ఒకటేననే సంగతి మాత్రం మరిచాం. అమెరికాలో పుట్టినా, ఆంధ్రప్రదేశ్‌లో పుట్టినా... న్యూజిలాండ్‌లో పుట్టినా, నూజివీడులో పుట్టినా...

తల్లి కడుపు నుండి ధరణి పైబడు బిడ్డ
పాలకేడ్చునదియే ప్రథమ భాష
అన్ని భాషలకును అదే మాతృభాషరా!
మనసువిప్పి వినుము మంచిమాట.

అని "సత్యం శివం సుందరం" శతకంలో ఉండేల మాల కొండారెడ్డి నగ్నసత్యాన్ని నగుమోము ముందు నిలబెట్టారు.

పుట్టేటప్పుడు తెచ్చేదీ లేదు, పోయేటప్పుడు తీసుకుపోయేదీ లేదు. ఈ సత్యాన్ని ప్రతి మనిషీ తెలుసుకోవాలని వేమన చెప్తే, ఎంత గొప్పవాడైనా పోయే ప్రతి మనిషి చివరి మజిలీ స్మశానమేనని, కుల,మత, ప్రాంత భేదాలు వదిలి కలుసుకోవలసిన మహోన్నతమైన స్థలమని మనందరికి తెలుసు. అలాంటి సమస్త మానవ ధిక్కారము (సమాధి) ఉండే శ్మశానం గురించి తెలియని వారు లోకంలో ఎవరూ ఉండరు. నవయుగ కవితాచక్రవర్తి గుఱ్ఱం జాషువా ఏకంగా ఆ శ్మశానాన్నే ఎంత అద్భుతంగా వర్ణించాడో చూడండి.

ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని
 కలము నిప్పులలోన గఱగిపోయె
ఇచ్చోటనే భూములేలు రాజన్యుని
 యధికారముద్రిక లంతరించె
ఇచ్చోటనే లేత యిల్లాలి నల్లపూ
 సలసౌరు గంగలో గలసిపోయె
ఇచ్చోట నెట్టి పేరెన్నికంగొనినట్టి
 చిత్రలేఖకుని కుంచియనశించె... శ్మశానాలు ఉన్నా, లేకున్నా పద్యం ఎప్పటికీ నిలిచే ఉంటుంది.

ఆంధ్ర పద్య కవిత అజరామరం బెప్డు
దానికేది సాటిధరణిలోన

హృద్యముగను సరసపద్యమల్లెడు వాడు
జగతి కీర్తినొందు శాశ్వతముగ

అని బూర్గుల మురళీకృష్ణ చెప్పినట్లుగా తెలుగు సాహిత్యంలో ఎన్ని ప్రక్రియలు ఉన్నా, మరెన్నో ప్రక్రియలు వచ్చినా పద్యం యొక్క స్థానం ఎప్పుడూ గొప్పదే, పద్యం రాసినవాళ్ళూ, రాసేవాళ్ళూ గొప్పవాళ్ళే.

ప్రపంచంలో కేవలం తెలుగు వారికి మాత్రమే సొంతమైన భాషాక్రీడ, సాహితీ ప్రక్రియ అవధానం. ఇది అష్టావధానం, చతుర్గుణిత, శత, ద్విశత, సహస్రావధానం, మహా సహస్రావ ధానాలతో వికసించి ప్రపంచాన్నేలుతోంది. ఈ అవధానం కూడా సాగేది పద్యాలలోనే కదా. పద్యాలు ప్రపంచాన్ని ఉగ్రరూతలూగిస్తున్నా మనల్ని మాత్రం కదిలించలేకపోతున్నాయి. దూరపు కొండలు నునుపు, అందని ద్రాక్ష పుల్లన అన్నట్లు వేటికోసమో ప్రాకులాడుతూ ఉన్న వాటికి విలువనీయ లేకపోతున్నాం. మన విలువను మనమే తెలుసుకోలేకపోతున్నాం.

ఆంధ్రపద్య కవిత అజరామరంగా వెలిగిపోవాలనే ఆలోచన, అమ్మ భాషను బ్రతికించుకోవాలనే ఆలోచన ఉంటే పద్యాల తోరణాలు కట్టుకోవచ్చు. పద్యాలతో రణాలూ చేయవచ్చు. లోతుల్లోకి వెళ్తే తిరిగి రానంతగా మునిగిపోవచ్చు. కాబట్టి పద్యాన్ని గౌరవించాలి, ప్రేమించాలి, ప్రోత్సహించాలి. ఇంకా చెప్పాలంటే పద్యాన్ని అభిమానించాలి, ఆదరించాలి.



# నా కవిత

- అవనిగడ్డ సూర్యప్రకాష్, విజయవాడ

**నా కవిత**

జడత వహించిన మృత్పిండం కానే కాదు
నిగూఢత అసలే లేదు
ఏ వాదం కాని సదా సంవేదం
సర్వ జనామోదం....

**నా కవిత**

స్మృతి లేనిది విస్మృతి రానిది
రసికలోక రథసారథి
నిసర్గ జీవిత కుసుమాలకు పెన్నిధి
బాధా పరితప్త హృదయాఘాతాలకు వారధి...

**నా కవిత**

భావ నర్తకి పదకింకిణీ రవము
స్వేచ్ఛా సాగరుని ఉత్తుంగ తరంగ ప్లవము
తూర్పు పూచిన కుంకుమ రాగ శోణితము
విభావరి కన్నుల్లో ఎగరేసిన వెన్నెల పతాకము...

# కాల్పనిక సాహిత్యం - యువత

- వి. రామ్మోహనరావు, హైదరాబాదు

ఆలోచన, ఊహ, భావాలు సాధారణంగా ప్రతి మనిషికీ వుంటాయి. వాటిని అక్షరబద్ధం చేసిన వ్యక్తి రచయిత అవుతాడు.

తనకు పట్టిన ఊహల్ని రాతలో పెట్టేస్తే రచయిత అయిపోయినట్టేనా? కొంతవరకూ

కానీ రచనల్లో స్థాయీ భేదాలుంటాయి. వాటికి రకరకాల కారణాలుంటాయి. అవకాశం, నైపుణ్యం, కష్టపడే తీరు, పడే శ్రమలో వీలు... ఇలా.

'కాల్పనిక సాహిత్యం– యువత' అన్న విషయాన్ని పై అంశాల వెలుగులో అవలోకిద్దాం. తెలుగు వ్రాయటం, చదవటం, మాట్లాడ్డం కూడా పలచబడి పోతోందని చాలామంది ఆవేదన చెందుతున్నది వాస్తవం. డెబ్భై, ఎనభై దశకాలాలో వున్నన్ని తెలుగు పత్రికలు ఇప్పుడు లేవు. ప్రచురణ కర్తల సంఖ్య తగ్గింది కానీ, చిత్రంగా ప్రతి ఏడూ వెలువడుతున్న పుస్తకాల సంఖ్య పెరిగింది. కారణాలు ఏవైనా ఇది శుభ పరిణామం.

వెలువడుతున్న పుస్తకాల్లో నూటికి డెబ్భై వరకూ వచన కవిత్వ పుస్తకాలే. ఇవి వెలువరిస్తున్నది చాలావరకు యువవయస్కులే. ఈ రకంగా యువ రచయితలు ఎక్కువ మంది వెలుగులోకి రావటం సంతోషం అయితే, వీరిలో చాలామంది ఒకటి రెండు పుస్తకాలతో కనుమరుగైపోవటం దురదృష్టం.

వచన రచనల కన్నా కవిత ఎక్కువగా రాయటానికి కారణాలు చూద్దాం. కవిత్వ రచనకి పట్టే సమయం తక్కువ. ఊహకి కల్పనకి, సృజనకి పట్టే సమయం గురించి కాదు చెపుతున్నది. కాయితం మీదకి కవితని తీసుకువచ్చే రచనా సమయం గురించే. ఇంక రెండోది, తక్కువ ఖర్చుతో పుస్తకంగా వెలువడుతుంది. మూడో, నాలుగో వంతుల కాపీలు మిత్రులకి, రచయితలకి పంచేస్తున్నారు. ఆసక్తి గల పాఠకుల దగ్గరకి ఎంతవరకూ వెడతాయో చూట్టం లేదు. పుస్తకాల షాపుల్లో వీటి అమ్మకం తక్కువే. కొంతమంది మా షాపులో కవిత్వం పుస్తకాలు అమ్ముడవవు మాకు వద్దు అంటున్నారు.

కథ, నవల, వ్యాసం లాంటి రచనా ప్రక్రియలు కవిత్వం కన్నా ఉన్నతమైనవని అనుకోవద్దు. అన్ని ప్రక్రియలు, ప్రతిభావంతులైన రచయితకి సమానమే. పోతే సౌలభ్యం దృష్ట్యా చాలామంది కవిత వేపు మొగ్గుతున్నారేమో? అన్న విషయం వెలుగులోకి తేవటానికే.

'కాల్పనిక సాహిత్యం' అన్నమాట. మన రచనా ప్రక్రియల్ని పూర్తిగా ప్రతిబింబించటం లేదేమో కూడా ఆలోచించాలి. కాల్పనిక సాహిత్యం పూర్తిగా కల్పనే కాదు. నిజ జీవితం ఆధారంగా సాగే కల్పన. జీవితపు ఒక శకలం, రచన చేసే వ్యక్తి మనసుకి హత్తుకోవాలి. దాని తాలూకు ముందు వెనుకలు రచయిత పట్టుకోవాలి. కవిత రాయటానికి దీని కన్నా ఊహాశక్తే ప్రధానం. భావనాపటిమ మీద దృష్టికోణం మీద దానికి ఆధారం ఎక్కువ. ఓ ఊహ తడితే చాలు, మిగిలిన శ్రమ తక్కువ. గట్టి కృషి లేని వచన కవిత తొందరగా తేలిపోతుంది. చాలా వచన కవితలు ఇలాగే కనుమరుగైపోతున్నాయి.

కవితకన్నా, కథ, నవల తేలిపోకుండా రాయటం మరింత శ్రమ. అందుకని చాలామంది యువ వయస్కులు వెనుకడుగు వేస్తున్నారేమో? అన్ని ప్రక్రియలు ముందుకు సాగితేనే సాహిత్య ఫలం బావుంటుంది.

ఈనాటి సమాజంలోని ఆటుపోట్లు, వ్యక్తిగత స్థాయి నుంచి అంతర్జాతీయ స్థాయి వరకూ ముడిపడిన ఒత్తిళ్ళూ, అనుబంధాలు, ప్రేమానురాగాలు... ఇలాంటివన్నీ చాలా వరకు యువత కేంద్రంగానే సాగుతున్నాయి. సాహిత్యంలో వాళ్ళ ప్రతిబింబం చాలా చాలా అవసరం. సరైన వ్యక్తీకరణకి నోచుకోని వారి భావాలు పదిమందికి చేరటానికి, రచన – సాహిత్యం మంచి వేదికలు. రచన కన్నా ముందు అధ్యయనం చాలా అవసరం. ఓ రచన చెయ్యటానికి, పది రచనలు చదివి ఆకళింపు చేసుకోవాలి.

రాబోయే రోజుల్లో మరింత నాణ్యమైన జీవనస్థాయికి వీరి అభివ్యక్తి అవసరం ఎంతగానో వుంది. కవిత్వం రాయద్దని కాదు. దానికి సంబంధించిన ఊహా ప్రతిబింబం వద్దే ఆగిపోవద్దని. కవిత్వంతో పాటు, కథ,నవల, వ్యాస తదితర రచనా ప్రక్రియల్ని చేపడితే మరింత ప్రయోజనకరంగా వుంటుందని ఉద్దేశ్యం. శారీరక శ్రమ కొలమానం కాకూడదు. ప్రమోదం, ప్రయోజనం ఆశయంగా యువవయస్కుల రచన ముందుకు సాగాలి.



# యువతా! నీ మతమెక్కడ?

**- టి.వెంకటరమణ**, నూజివీడు.

మతం అన్న పదానికి "అభిప్రాయం" అని సాధారణార్థం. Religion అనే అర్థంలో తీసుకుంటే "మంచిని పెంచేది" అని మత శబ్దానికి మంచిని పెంచేది అని అర్థం. అది భక్తికి సంబంధించింది. భక్తి అనే పదానికి సేవ అని మూలార్థం. మానవ జాతి అవతరించి నప్పటి నుండి, భగవంతుడిని ఆరాధించాలనీ, బయటకు కనపడుతున్న రూపాల వెనుక దాగియున్న రహస్యాలను కనుగొని, ఆ మూల సత్యాన్ని గ్రహించాలని తహతహలాడుతూనే ఉంది. ఇదే మతం పుట్టుకకు కారణమయ్యింది. తన అంతిమ లక్ష్యం స్వర్గంలోని అనంతమైన మహానందమనీ లేదా అటువంటిదే మరొక స్థితి అని భావించి, ఆరాధకుడు తన దృష్టిని వాటిని కైవసం చేసుకోవడం పైననే నిలిపాడు. ఈ విధంగా మహనీయులైన సంస్థాపకులు స్వీయానుభావాలు ఆధారంగా, నియమబద్ధమైన రూపాలు, పూజాధిక అనుష్ఠానాలతో మతాలు వెలిశాయి. కాలక్రమేణా మతం మూల ఉద్దేశం మరుగున పడిపోయి, బాహ్యరూపం మాత్రమే మిగిలింది. తత్ఫలితంగా మతానికి కాలదోషం పట్టింది. నేటి మతం గతించిన కాలపు స్మృతి చిహ్నం మాత్రమే.

మతంలోని జీవం నశించి ఆ స్థానంలో లాంఛన ప్రాయమైన ఆచార వ్యవహారాలు మాత్రం మిగిలాయి. కేవలం బాహ్యరూపాలు, లాంఛనప్రాయమైన కర్మకాండలు మాత్రమే కనపడుతున్నాయి. మంచి తత్త్వ స్పృహ కొంచెమూ లేకుండా, వీటిని అతిఛాందసంగాను, మూర్ఖపు పట్టుదలతో అనుసరిస్తూ వస్తున్నారు. సాంప్రదాయాల పట్ల మనకున్న గుడ్డి నమ్మకం వాస్తవికతను దూరం చేసి మతదురభిమానాన్ని మిగిల్చింది.

భర్తపై అమిత ప్రేమ ఉన్న భార్య, అతని మరణాన్ని జీర్ణించుకోలేక అతనితో సహగమనం చేసింది. కాని దానిని అర్థం చేసుకోలేని నాటి నాగరికులైన అనాగరికులు దానిని ఒక సాంప్రదాయంగా మార్చి అంతర్గత విషయమైన మహోన్నత ప్రేమను మరుగున పడిపోయేలా చేశారు. దీనిని హిందూ సంప్రదాయాలలోనే అత్యంత నీచపు మూఢ నమ్మకంగా మార్చివేశారు.

ఏ దిక్కు లేని స్త్రీ భగవంతుని తన దిక్కుగా భావించి అతనిని నిత్యం ఆరాధిస్తూ మోక్షమార్గాన్ని చేరడానికి అతనికి సేవ చేస్తే, దానిని నాటి ప్రజలు దాసీతనంగా భావించారు. అప్పటి నుండీ ఏ ఆధారం లేని స్త్రీలను దేవదాసీలుగా మార్చారు. అది ఒక సాంప్రదాయంలా మార్చి వేశారు.

పురాణాలలో ఉన్న సంక్లిష్టమైన మోక్షమార్గాన్ని చేరుకొనేందుకు నాటి ఋషులు సాధారణమైన వ్యక్తి కూడా చేరుకునేందుకు దేవునికి ఒక రూపం ఇచ్చి ఆరాధించమన్నారు. ఈ ఆరాధన కేవలం నిర్మల మనస్సు కోసమే గాని కోర్కెల సాధన కోసం కాదు. కారణం మనుష్యునికి నిర్మల మనసు ఉన్నపుడే అతడు ఆధ్యాత్మికతను సొంతం చేసుకొని ముక్తి మార్గంలో ప్రయాణించి మోక్షం సాధించగలడు. కాని కాలక్రమేణా ఇందులోని మూల విషయాన్ని మరచి ఆరాధికులు విగ్రహాన్ని కేవలం కోర్కెలు తీర్చే సాధనంగానే భావిస్తున్నారు. దీనిని గూర్చి కబీర్ ఈ విధంగా అన్నాడు.

**"పాహన్ పూజే హరీ మిలేతో పూజియే పహాడ్**
**తాతేయహ్ చక్కి భలీ పీస్ ఖాయ్ సంసార్".**

'రాతిని పూజించడం వల్ల పరమాత్మను పొందగలిగితే నేను పర్వతాన్నే పూజించడానికి సిద్ధంగా ఉన్నాను. కాని అంతకంటే ప్రజల ఆకలిని తీర్చే గోధుమలు విసిరే తిరుగలిని పూజించడం మేలు'.

ఈ మతజాడ్యం ఒక్క హిందూ మతంలోనే కాక ప్రతి మతంలోనూ ఉంది.

క్రైస్తవ మతగ్రంథమైన బైబిల్‌లో ప్రభువు తన ఆరాధకులను ఉద్దేశించి ఈ విధంగా అన్నాడు.

"ఆత్మ విషయమై దీనులైన వారు ధన్యులు; పరలోక రాజ్యము వారిది. దుఃఖపడు వారు ధన్యులు; వారు ఓదార్చబడుదురు. సాత్వికులు ధన్యులు; వారు భూలోకమును స్వతంత్రించుకొందురు. నీతి కొరకు ఆకలి దప్పులు గలవారు ధన్యులు; వారు తృప్తి పర్చబడుదురు. కనికరము గల వారు ధన్యులు; వారు కనికరము పొందుదురు. హృదయ శుద్ధిగలవారు ధన్యులు; వారు దేవుని చూచెదరు. సమాధానపరచువారు ధన్యులు; వారు దేవుని కుమారులగుదురు. నీతి నిమిత్తం హింసింపబడువారు ధన్యులు; పరలోక రాజ్యం వారిది".

*-మత్తయి 5:*

కాని నేటి క్రైస్తవ ఆరాధికులు పైనున్న విషయాలు గూర్చి గాక ప్రతీరోజు ప్రార్థించువారు ధన్యులు వారి కోర్కెలు నెరవేర్చబడును, మత ప్రచారం చేయువారు ధన్యులు వారు పరలోక ప్రాప్తి పొందుదురు అని నమ్ముతున్నారు. ఈ విధంగా మతానికి మూలాధారమైన విశ్వప్రేమ పూర్తిగా అదృశ్యమై, భగవంతునికి మానవునికి మధ్య వారధిగా భాసిల్లవలసిన ఆ మతమే ఇప్పుడు సమాజ అభివృద్ధికి అడ్డుగోడగా నిలిచింది.

కొన్ని మత గ్రంథాలు భగవంతుని **సాకారుడు** అని, ఇంకొందరు **నిరాకారుడని** ఉటంకించాయి. వాస్తవానికి ఆయన ఈ రెండింటికి అతీతుడు, నిర్గుణబ్రహ్మ, ఆయనను సాకారుడని నమ్మేవారు ఆ అనంతునికి ఒక రూపాన్ని, ఆకారాన్ని ఇచ్చి ఆ హద్దులకు అతడిని పరిమితం చేస్తున్నారు. దాని ఫలితంగా వాళ్ళు సంకుచితత్వాన్ని అలవరచుకొని, ఆ హద్దులలోనే శాశ్వతంగా ఉండిపోతున్నారు. నిరాకారుడని నమ్మేవారు ఆయనను సృష్టి, స్థితి, లయ కారకునిగా పరిమితులను ఏర్పరుస్తున్నారు. ఈ విధంగా ఈ రెండు వర్గాల వారూ పరిమితులలోనే ఉండిపోతున్నారు.

మతం పరిధిలో మనం ఉన్నంత కాలం మత సంబంధమైన దేవుడే మన దృష్టిలో ఉండిపోయి సాకార భావనల్లో ఏదో ఒక దానిలో మనం చిక్కుకు పోతాము. మనం ఈ రెండింటికీ అతీతంగా వెళ్ళినపుడే అత్యున్నత ఆధ్యాత్మిక స్థితులను పొందడం సాధ్యమౌతుంది. నిజానికి మతం కేవలం మనిషిని ముక్తి మార్గంలో పయనించడానికి అనువుగా తీర్చిదిద్దే ప్రారంభదశ మాత్రమే. ముక్తిమార్గంలో అడుగుపెట్టినపుడే అతడు సత్యాన్ని పొందుతాడు.

భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ ఈ విషయాన్ని స్పష్టంగా చెప్పాడు.

"దేవుళ్ళను కొలిచేవారు మహా అయితే ఆ దేవుళ్ళున్న స్థాయికి మాత్రమే చేరుకుంటారు. ఆ స్థితి పరిమితమైనది. ముక్తి కన్నా ఎంతో తక్కువది. ఆ దేవుళ్ళనే దానిని మించి వెళ్ళడం సాధ్యం కాని పని. అటువంటప్పుడు వారి భక్తులకు అంతకంటే మించి వెళ్ళడమనే ప్రశ్నే లేదు. ఈ విధంగా సత్ తత్త్వమే మన లక్ష్యం అయినపుడు ఈ దేవుళ్ళు, దేవతలూ ఏ విధంగా ఉపయోగపడలేరని స్పష్టమౌతుంది.'

తమ ఇష్టదైవం గూర్చి కొందరు రాత్రి బాగా ప్రొద్దుపోయాక ప్రశాంత వాతావరణాన్ని భంగపరుస్తూ భజనలు చేస్తుంటారు. వారు దీనిని భగవంతుని దివ్య నామాన్ని అందరికీ చేరవేయడం అనుకుంటున్నారే తప్ప ఇతరుల ప్రశాంతత భంగం చేస్తున్నాము అని అనుకోరు. ఈ సంకీర్తనాపరుల సంకీర్తనలను ఒక రోగి మూలుగులతో పోల్చవచ్చు. ఆ మూలుగులు రోగికి తాత్కాలిక ఉపశమనం ఇస్తాయే తప్ప, అతనికి బాధల నుంచి ఉపశమనం లభించదు. కానీ ఆ మూలుగులు ప్రక్క నున్న వారికి ఇబ్బందిని కలుగ చేస్తుంది. నేడు అన్ని మతాల వాళ్ళు భగవంతుని స్థూలరూపం పైనే దృష్టి నిల్పి ప్రార్థిస్తున్నారు. ఈ స్థూల భావన వల్ల కలిగేది అంతర్గత స్థౌల్యత, కల్మషం తప్ప మరేదీ కాదు.

దీనిని గురించి యేసుక్రీస్తు ఈ విధంగా అన్నారు.

"ఈ ప్రజలు తమ పెదవులతో నన్ను ఘనపరచుదురు గాని వారి హృదయమును నాకు దూరముగా ఉన్నది; మనుష్యులు కల్పించిన పద్ధతులు దైవోపదేశములని బోధించుచు వారు నన్ను వ్యర్థములుగా ఆరాధించుచున్నారు' -మత్తయి *5*

మోక్షమార్గ సాధన గురించి "వజ్రసూచికోపనిషత్తు"లో ఈ విధంగా ఉంది-

**"అపక్రామంతు భూతాద్యాః సర్వేతే భూమి భారకా**
**యేతేషా మవిరోధేన వైశ్యకర్మ సమాఠః"**

'ఎవరైతే తమ విద్యుక్త ధర్మాలను సక్రమంగా నిర్వర్తిస్తూ జీవిస్తారో వారు సర్వప్రాణుల్లో ఒక ప్రాణిలా కాకుండా, భూమికి భారంగా మిగలకుండా మహాత్ములు అవుతారు'.

ఒక రాయి వజ్రంలా మారడానికి అధిక ఉష్ణోగ్రత గ్రహించాలి. అలాగే ఒక వ్యక్తి ముక్తిని పొందడానికి అతడు తను అనుసరిస్తున్న మతంలోని సారాన్ని అంతటినీ గ్రహించాలి. అపుడే అతడు బాహ్య బంధాల నుండి విముక్తి పొంది, పరిపూర్ణ ఆనందాన్ని పొంది, జీవిత సంపూర్ణతను సంతరించుకుంటాడు. యువతా, మతం పట్ల మరింత జాగ్రత్త వహించు. లేదా అదే నీలో ఉన్న భయాన్ని బానిసగా మార్చేస్తుంది.

# చిన్ని కవితలు

- డా॥ ఎన్. వసంత్, హోసూరు

### రారాజులు

❖ ప్రజల రక్తం ఏరులైతే
రాజులైనారు
చమట చుక్కలు నదులై పారితే
రారాజులైనారు.

### బుద్ధి జీవి

❖ శ్రమను నమ్ముకునే వాడు
శ్రమ జీవి (అ.)
శ్రమను అమ్ముకునే వాడు
బుద్ధి జీవి

### యాసిడ్డు గాయం

❖ యాసిడ్డు గాయంపై
ఎగిసిన 'ఆవిరి'
యముడిలా మారి
యన్‌కౌంటర్రై మాయమైంది.

### ప్రజాస్వామ్యం

❖ ఎన్నికల్లో కురిసిన
నోట్ల వర్షానికి కొట్టుకుపోయింది
ప్రజాస్వామ్యం
పౌరుల సాక్షిగా....

### చిన్న చీమ

❖ కోటి చీమల్ని
నలిపిన పాదం
తన చెవిలో చేరిన
చీమ వెంట్రుక్కి సమానం

### ప్రేమంటే?

❖ ప్రేమంటే ఏం రా?
మీరే చెప్పాలయ్య -
నువ్వు ఎవర్నన్నా ప్రేమించావేంరా?
మీకే తెల్వాలయ్యా...!

### మప్పిదాలు... మంగిడీలు

❖ నన్ను తిరస్కరించిన ఆమెను
నా మప్పిదాలు.. మంగిడీలు
ఆమెపై నాకున్న ప్రేమకూ
మాత్రం కాదు.

### ం - ం = ం

❖ నేను... నేను... నేను
శూన్యం శూన్యంలో
కలసి
శూన్యమైంది.

### నోట్లు.... కోట్లు

❖ చమటోడ్చి సంపాదిస్తే
'నోట్లు'
చమట పూడ్చి సంపాదిస్తే
'కోట్లు'

### గొప్ప ప్రేమ

❖ సెక్సాలజి పుస్తకంలో
సెక్స్ అలర్జి పుటలో
లికిస్తా నా ప్రేమ గొప్పది



# తెలుగు కవిత - వ్యంజకాలు

- తంగిరాల చక్రవర్తి, హైదరాబాద్

తెలుగు సాహిత్య వనంలో విరబూసిన "వ్యంజక" కవితా పుష్పాలు. వీటి సృష్టికర్త పొత్తూరి సుబ్బారావు. వీరు ప్రముఖ పాత్రికేయులు. ప్రెస్ అకాడమీ పూర్వ ఛైర్మన్ పొత్తూరి వేంకటేశ్వర రావుగారి సోదరుల కుమారులు. వీరు సాహితీ తేజం అనే సాహిత్య పత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు. 2009లో "సాహిత్య కిరణం"అనే పత్రిక స్థాపించి వ్యవస్థాపక సంపాదకులైనారు. 2010లో "వ్యంజకాలు" అనే సాహిత్య ప్రక్రియకు శ్రీకారం చుట్టారు. నిఘంటువు భాషలో "వ్యంజన" అంటే ఎగతాళి, సూచన, స్పష్టపరిచే, స్పష్టంగా తెలిపే, ధ్వనింపజేసే, ఇత్యాది అర్థాలున్నాయి. ఇంకా... పరుషోక్తి, దెప్పి పొడుపు... అనే అర్థాలున్నాయి. గత మూడు సంవత్సరాలుగా ఎందరో కవులు, కవయిత్రులు వ్యంజకాలు రాస్తున్నారు.

సామాజిక దృక్పథం, వర్గతత్వం, నీతిహిత బోధ, సందేశం, చిన్న పదాలతో పెద్ద అర్థం, సరళమైన భాష, భావం, వ్యంగ్యం, జీవితానుభవాలు కవిత్వీకరించడం, రాజకీయాలు, ప్రేమలు, సమకాలీన సంఘటనలు, వివిధ ధోరణులు, కళలు, సాహిత్యం, సంస్కృతి, బాలల స్థితి వృద్ధుల స్థితి... ఇలా ఎన్నో అంశాల్ని వ్యంజకాల్లో జొప్పించి అద్భుతమైన కవిత్వం రాస్తున్నారు. కొందరు కవితా సంకలనాలు కూడా తీసుకొచ్చారు, తీసుకొస్తున్నారు.

ఒక రచనను మరో రచనతో పోల్చి చెప్పడం... తులనాత్మక విమర్శ, ఒక భాషలో రచనను మరోభాషలోని రచనతో పోల్చి చెప్పడం కూడా తులనాత్మక విమర్శ అవుతుంది.

**"లయాత్మక సౌందర్య సృష్టియే కవిత్వం"**- అంటారు.

ఎడ్గార్ అలెన్ పో...

వ్యంజకాలు రాసిన కవుల ఆంతర్యం గమనిస్తే ఎన్నో... అంశాలు కనిపిస్తాయి.

మన పూర్వ కవులు... సమాజం నుండి, జనం నుండి, తీసుకున్న పలుకుబడులను, జాతీయాలను, నుడికారాలను, సామెతలను, తమ తమ "వ్యంజకాల్లో" కవులు పొందుపరిచి రాస్తున్నారు. జాతి జీవన విధానాన్ని అక్షర బద్ధం చేస్తారు.

నేటి ఆధునిక కవిత్వంలోని ముఖ్యలక్షణం, ప్రకృతిలో తన్మయత్వం పొందడం, లేదా చెందడం... ఇది ఆంగ్ల రొమాంటిక్ కవిత్వం నుండి తెలుగు కవిత్వంలో ప్రవేశించింది. నాటి భావ కవిత్వంలో కనిపించుతాయి ఈ ఛాయలు. కొన్ని వ్యంజకాల్లోనూ ప్రతిబింబిస్తాయి.

హైకూ కవిత్వంలో కనిపించే పొదుపరితనం, అనుభూతి సాంద్రత, భాషా సారళ్యం, తాత్విక గాఢత "వ్యంజకాల్లో" కనిపిస్తాయి.

ఈ విషయాల్లో ప్రముఖ సాహిత్యవేత్త, రంగస్థల దర్శక-నట ప్రయోక్త పొన్నాడ కుమార్ (విశాఖపట్నం) అనేకసార్లు ప్రశంసిస్తూ లేఖల ద్వారా వ్యంజకాల్ని అభినందించారు కూడా!

**పాశ్చాత్య మేధావుల్లో ముఖ్యంగా సాహితీలోకంలో... ఫిలిప్ సిడ్నీ: కోలరిడ్జ్‌లు కవిత్వానికి ఛందస్సు అవసరం లేదన్నారు.**

భారతీయుల కావ్యశాస్త్రంలో కావ్య నిర్వచనం, ప్రయోజనం, కావ్యభేదాలు, కావ్య హేతువులు, అలంకారాలు, గుణాలు, రీతులు, కావ్యాత్మ ఇవన్నీ చర్చనీయాంశాలే...

**భారతీయ అలంకారికులలో మమ్మటుడు, విశ్వనాథుడు, జగన్నాథ పండితరాయలు, చెప్పిన నిర్వచనాలు ముఖ్యమైనవి.**

**"తద దోషౌశబ్దార్థౌ సుగుణా వనలంకృతీ పునఃక్వాపి"**

అంటాడు తన కావ్య ప్రకాశంలో మమ్మటుడు.

(దోషాలు లేనటువంటి, గుణాలు కలిగినటువంటి, అలంకారాలతో కూడినటువంటి శబ్దార్థాలు "కావ్యమని" పై వాక్యార్థం)

**"వాక్యం రసాత్మకం కావ్యం"** అని విశ్వనాథుడు తనయొక్క 'సాహిత్య దర్పణం'లో నిర్వచించాడు. **దీన్నిఖండిస్తూ** జగన్నాథ పండితరాయలు తన 'రసగంగాధరం'లో **"రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్యం"** అని నిర్వచించారు.

"ఇష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళి కావ్యం" అని తన 'కావ్య దర్శనం'లో 'దండి' మహాకవి నిర్వచించాడు.

అలంకార శేఖరంలో శౌద్ధోదని... **'కావ్యరసాది మద్వాక్యం'** అని **నిర్వచించారు.**

శబ్దమే కావ్యమన్నాడు జయదేవుడు తన "చంద్రాలోకం"లో...

"నిర్దోషా లక్షణ వతీ సరీతిర్గుణసంహితా సాలంకార రసానేక వృత్తిర్వాక్ కావ్యనానుభాక్" అన్నారు.

కవిని గురించి మన అలంకారికుల అభిప్రాయంలో చెప్పాలంటే:

**"నానృషిః కురుతే కావ్యం"**

**కవయః క్రాంత దర్శనః అన్నవి లోకోక్తులు:** కానీ

ఆనందవర్ధనుడు తన "ధ్వన్యాలోకం"లో ఇలా అంటాడు.

**"అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః**
**యధాస్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే**
**శృంగారీ చేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్।**
**సవీవవీత రాగశ్చేత్ నీరసం జాతమేవతత్**
**భావాన చేతనానపి యథేష్టం సుకవిః కావ్యేస్వతంత్రతయా"..**

అపారమయిన కావ్య ప్రపంచానికి కవే సృష్టికర్త. అతని ఇష్టానుసారంగా లోకాన్ని మారుస్తాడు. శృంగారి అయితే లోకాన్ని శృంగారమయం చేస్తాడు. అతను విరాగి అయితే లోకాన్ని నీరసం చేస్తాడు. అచేతనాలను చేతనాలుగా, చేతనాలను అచేతనాలుగానూ మారుస్తాడు. కవి తన క్యావంలో స్వతంత్రంగా వ్యవహరిస్తాడు అని పై శ్లోకార్థం.

పై కవిత్వ నిర్వచనాల్లో చెప్పిన అన్ని అంశాలు... ఈ యొక్క వ్యంజకాల్లో కనిపిస్తాయి, వినిపిస్తాయి. (శబ్ద ప్రాధాన్యత రీత్యా)

**వస్తువు, శిల్పం, శైలి, ధ్వని, (శబ్దం), భాషపై పట్టు (అధికారం), మమకారం, గాఢత, చిక్కదనం, చిలిపిదనం; రూప, భావాలు ఆధునికత సంతరించుకొని, పునరుక్తులు లేకుండా, రాకుండా** ఎన్నో వ్యంజకాల్ని మన యువకవులు రాస్తున్నారు. సృష్టికర్త పొత్తూరి సుబ్బారావుగారి నుండి కొన్ని ప్రారంభించి పరిశీలిద్దాం!

**ఈ దేశానికిపుడు**
**అతని నాయకత్వం కావాలి**
**అవును అంతకుమించిన**
**రక్త పిపాసి మరెవరూ లేరు కదా!**

ఒక కేంద్ర రాజకీయ నేతను (ప్రధాని అభ్యర్థి) గురించి రాసాడని ధ్వనిస్తుంది. పై "వ్యంజకం"- (జూలై 2013 సంచిక-34వ పేజి. సాహితీ కిరణం. మంత్లీ)

**"అఘమేఘాల మీద**
**ఆసుపత్రికి తరలింపు**
**పడకేసిన ఆసుపత్రిలో**
**"ప్రాణ వాయువు" పవళింపు.**

బెంగుళూర్ నుండి జి. హెచ్. సంతోషి రాసిన పై వ్యంజకంలో మన ఆసుపత్రుల తీరు- ఆక్సిజన్ లేని వాటి (దు) స్థితి తెలియజేస్తుంది.

**ఉద్యమాలు**
**ప్రజాస్వామ్యానికి ఊపిరి**
**కొందరి స్వార్థపరుల చేతిలో**
**ఉద్యమం ఐస్‌క్రీం పుల్లే అవుతుంది.**

పై వ్యంజకం కవయిత్రి. కె. రాధిక. అనంతపురం.

పొత్తూరి వారి వ్యంజకాలు బెంగుళూరు, తమిళనాడు, ఢిల్లీ, ఆంధ్ర ప్రదేశ్, న్యూజెర్సీ దాకా విస్తరించాయి. యీ ప్రక్రియలో రాయడం చాలా తేలిక... మొదటి రెండు పాదాలు అనుకూల వాదాన్ని సూచిస్తే మిగతా రెండూ ప్రతికూల వాదాన్ని సూచిస్తాయి.

ఈ వ్యంజకాల్ని ప్రస్తుత కాల, మాన, రాజకీయ, సామాజిక పరిస్థితుల్లో వాస్తవాంశాలకు చాలా దగ్గరగా వుండేలా కవిత్వీకరణ చేయాలి. (రిలవెంట్)

మానవ సమస్యలకు, కారణాలు, మూలాలు వెదకి చెప్పాలి' చూపాలి.

సార్వజనీనత, సమకాలీనత, సర్వకాలాలకు కాలానికి నిలబడేలా (లైఫ్ సబ్జెక్ట్స్) వస్తు ఎంపికలో "వ్యంజకాలు" రాస్తే పాఠకాదరణ పొందుతాయి.

కేతవరపు రాజశ్రీ : నాగస్త్రమ్ (ప.గో.జిల్లా)

తదితరులు ఈ వ్యంజకాలపై పుస్తకాలు కూడా ప్రచురించారు. యిన్నారు.

తెలంగాణాకు చెందిన అనేకమంది కవులు చక్కటి మాండలిక పద ప్రయోగాలతో పలు వ్యంజకాలు రాసారు. వాటికి ఆదరణ లభించాయి. కవి తన పాఠకునికి ధైర్యం, భరోసా, జీవితంపై, జీవనంపై అవగాహన, ఆలోచన కల్పించేలా రచనలు, కవితలు రాయాలి. సూటిగా భావం స్ఫురించేలా చెప్పాలి. (అదీ మార్మికతతో)

**తిక్కన, పోతన, వేమన, శ్రీనాథుల్ని** మన కవులు బాగా అధ్యయనం చేయాలి. అలాగే శ్రీశ్రీ, శేషేంద్ర, విశ్వనాథల్ని బాగా చదవాలి... జూలై 2013 సాహితీ కిరణంలో ఈ వ్యాసకర్త రాసిన వ్యంజకం.

**"నాడు విగ్రహాలొద్దు మాకు**
**అనే నేతలుంటే**
**నేడు సచి (జీ)వులు సైతం**
**విగ్రహాలు కద్దు అంటున్నారు.**

కేతవరపు రాజ్యశ్రీ "బొమ్మ-బొరుసు" అనే పేరుతో తొట్టతొలిగా వ్యంజకాలు కవితా సంపుటి తెలుగు నాట వెలువరించారు. పే.జీ.25 ఈ వ్యంజకం చూడండి...

**అరిషడ్వార్గాలను**
**జయించిన సర్వసంగ పరిత్యాగి**
**అహం మాత్రం అతడిని**
**జయించింది...**
**ఆంధ్రదేశం అన్నపూర్ణ**
**ప్రపంచ బ్యాంక్ అప్పుల్లో ముందంజ** **(పేజీ. 28)**

ఇలా అనేక వ్యంజనాలు మనని అలరిస్తాయి...



# బాల్యం మరణ వాఙ్మూలం...

- సరికొండ నరసింహరాజు, జగ్గయ్యపేట

నాకు తెలుగులో మాట్లాడాలని వుంది.
కార్పో'రేటు' స్కూలు నిబంధన ఒప్పుకోదు!
నాకు తెలుగులో పాటలు పాడాలని వుంది...
ఇంగ్లీషు మీడియం ఒప్పుకోదు !
నాకు బొమ్మలు గీయాలని వుంది...
క్లాస్ సబ్జెక్ట్స్ ఒప్పుకోవు!
నాకు కూచిపూడి నాట్యం నేర్వాలని వుంది..
ఆధునికత ఒప్పుకోదు!
నాకు కవిత్వం రాయాలని వుంది!...
నా కలం ఒప్పుకోదు!
నాకు గెంతాలని వుంది...
స్కూల్ డ్రస్‌కోడ్ ఒప్పుకోదు !
నాకు ఇంటి దగ్గరైనా ఆడుకోవాలని వుంది.
హోం వర్క్ ఒప్పుకోదు !
స్వేచ్ఛగా అడవిలో తిరగాలని వుంది...
చట్టం ఒప్పుకోదు !
పచ్చని ప్రకృతిని ప్రేమించాలని వుంది...
కాంక్రీటు నగరం ఒప్పుకోదు!
నాకు నచ్చిన కోర్సు చదవాలని వుంది...
భవిష్యత్తు ఒప్పుకోదు !
నాకు ఇష్టమైందే చేయాలని వుంది!
అమ్మా నాన్న అసలే ఒప్పుకోరు!

నాకు పోట్లాడాలని వుంది...
బెత్తం ఒప్పుకోదు !
నాకు ఎదురు తిరగాలని వుంది...
రక్తం ఒప్పుకోదు!
నాకు అరవాలని వుంది...
కాలం ఒప్పుకోదు!
నేను నాలానే బతుకుదామంటే...
ఈ సమాజం ఒప్పుకోదు!
నేను బానిసను కాదంటే
బాల కార్మికుడిని కాదంటే
నా స్కూలు బ్యాగ్ ఒప్పుకోదు!
ఈ స్కూలో కారాగారం కాదంటే!..
తాళమేసిన గేటే కాదు...
చిద్రమైన నా హృదయం ఒప్పుకోదు!
ప్రతి అడుగు ఓ పరీక్షాపత్రమై...
ప్రతి ఉదయం ఓ ఉరి శిక్ష కాదంటే..
పచ్చి నిజం ఒప్పుకోదు!

(మానసిక వ్యధతో జీవచ్ఛవాలవుతున్న
మల్లెమొగ్గల బాల్యానికి అంకితం)





# పరివర్తనా కవిత్వోదయం

- జల్లి శ్రీ రఘుపతిరావు, తిరుపతి

తెలుగు సాహిత్యం, పురాణ ఇతిహాస సాహిత్యం, ప్రబంధ సాహిత్యం, దేశి సాహిత్యం, ఆధునిక (ప్రగతి) సాహిత్యం అనే రూపాల్లో వెలువడింది. కవిత్వ రీతుల్లో దాన్ని ప్రబంధ కవిత్వం, ఆధునిక కవిత్వం, నవ్యకవిత్వం, నవ్య సంప్రదాయకవిత్వం, సమకాలిక కవిత్వం అంటున్నాం. ప్రాచీన క్లాసిక్‌తత్వంతో కూడిన ఆధునిక రచనను నవ్యసంప్రదాయక కవిత్వం అన్నారు. ఈ సాహిత్యం ఆధునికత్వ దశను దాటి నవ్యత్వదశలో ప్రవేశించి వృద్ధి చెందింది.

ఆధునికంగా భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం, నవ్య సంప్రదాయ కవిత్వం, సమకాలిక కవిత్వం, బడుగువర్గ కవిత్వం అనే రూపాలలో సాగింది. అభ్యుదయ కవిత్వంలో తీవ్రరూపం దాల్చినది నగ్నకవిత్వం. ఇంకా జాతీయ పునరుజ్జీవన, దేశభక్తి, రాష్ట్రభక్తి, సంఘసంస్కరణ ప్రాతిపదికన కొంత కవిత్వం వెలువడింది.

సమకాలం అంటే అస్తిత్వఉద్యమాల కాలం. దానిని 1990 నుండి గణుతించారు. ఆ కాలంలో సరికొత్త సాహిత్యపరిణామాలు చోటు చేసుకున్నాయి. అవి అభ్యుదయ కవిత్వానికి కాస్త భిన్నంగా ఉన్నాయి. అవి దళితవాద, స్త్రీవాద, మైనారిటీవాద, ప్రాంతీయవాద కవిత్వాలు. అవి అసమానతలను తొలగించడానికి ఏర్పడ్డ వివిధ కవిత్వ ధోరణులు, అవి వాస్తవికతను నగ్నతను, తీవ్రమైన తిరుగుబాటును వెలిబుచ్చాయి.

ఆయా కవిత్వాలు మానవాళికి కొంత మేలు జేశాయి. ఆనందం కల్గించాయి. వినోదం ఇచ్చాయి. కాని సామాజిక మార్పుకు సరిపోలేదు. దానికి నిదర్శనం ఈనాటి సంక్షోభం, అనిశ్చిత, అభద్రతాభావం, ఆందోళన, ధనదాహం, పోటీతత్వం, పరుగులు, ఉరుకులు, వల్లమాలిన వినోదాలు, ఆహాకారాలు; కొంత మానసిక వికాసం కనిపించినా, అది మానసిక ఉల్లాస స్థాయిలో ఆగిపోతోంది. అంటే ఘాటైన ఘనీ భవించిన నేటి మానసిక నిబద్ధతను (బండరాయిగా మారిన మనసును) బ్రద్దలు చేయలేకపోయాయి.

అందుచేత సంపూర్ణ మానసిక వికాసాన్ని కల్గించేదీ మనిషిలో, మనసులో మార్పు తీసుకువచ్చేదీ, ఆలోచింపచేయడంలో ఆగిపోకుండా, అనుదిన జీవితంలో ప్రకాశించేదీ, వినోదం,ఉల్లాసం, ఆత్మతృప్తిని మించి మెదడు కణాల్లో మార్పును తెచ్చేదీ కవిత్వం. ప్రేమ-కళ-చైతన్యం- వాదం – విప్లవం అనే బలీయమైన అంశాలను సమన్వయ పరిచే శక్తి మార్పు కవిత్వానికి ఉండాలి. గ్రూపు కవిత్వాలు, విభేద కవిత్వాలు గాక పరివర్తనా కవిత్వం వెలువడాలి. పాఠకుని-పరివర్తింప చేయాలి. అంతశక్తివంతంగా ఉండాలి. ఒక సినిమా పాట ప్రభావం శ్రామికుని వరకు జాలు వారినట్లు మార్పు కవిత్వం సమాజాన్ని పరివర్తన కల్గించేదిగా కవిత్వం విశుద్ధి జెందాలి.

వస్తు, రూప ప్రక్రియ నిర్ణయంలో కవికి పూర్తి స్వేచ్ఛ వుందని వేరే చెప్పనవసరం లేదు. అయితే కవిత కల్గించే ప్రభావం మున్ముందుగా దృగ్గోచరమై ఉండాలి. మార్పు కవిత్వపు స్వభావం, రూపురేఖలు ఇప్పుడే నిర్ధారించలేము. దీనికి తాత్వికపునాది అవసరం. సృజనత్వం గల తత్త్వ దర్శకుడు కొన్ని కవితలు వెలువరించిన మీదట, స్పందన తెలిపిన మీదట, విమర్శలు సాక్షాత్కరించిన మీదట దాని హృదయం, ఆకృతి నిశ్చయాత్మక స్థితిని చేరుకోగలవు. కాకపోతే కవితా గుణ లక్షణాలలో కొన్ని చేర్పుల గూర్చి చర్చించుకోవచ్చు.

కవిత్వానికి ప్రధానలక్షణాలైన వస్తు భావ రూపాలకు అదనంగా ప్రవర్తనాశీలత అనే అంశాన్ని జేర్చుకోవచ్చు. ఆరాధన, ప్రణయం, ప్రీతి, ప్రియత్వం, స్వేచ్ఛ, స్మృతి, ఆత్మాశ్రయత, మృదుపద భంగిమ, అంతరంగిక ఆసక్తి మున్నగునవి హృదయకుహరంలో సావధానత జెందాలి. వాటి సమ్యక్ రూపసాంద్రత కవిత్వంలో ప్రతిఫలించాలి. మార్క్సిస్టు సాహిత్య విమర్శనాదృష్టి కమ్యూన్ నిర్మాణానికి ముందే ఆర్థిక సమత్వం చేకూరాలన్నది. ఆ క్రమంలో పరివర్తనాశీలతను కూడా జోడించాల్సివుంది.

అస్థిత్వం సచేతన చైతన్యం కోరుతుంది. సచేతన చైతన్యం సమగ్ర సామాజిక చైతన్యం కావడానికి పరివర్తనా కవిత్వపు ఉషోదయ అరుణ కిరణాలు ప్రసరించాలి. అభ్యుదయ కవిత్వ దర్శనంలో సామాజికాంశం బలంగా ప్రతిబింబించింది. అది కొంత మార్పు అంచులను తాకింది. ఆ ప్రతిబింబం వినూత్న కవిత్వంతో రసాయనీకరణ జెంది మెదడు కణాలను మార్చాలి. 'ప్రాహ్లాద కవిత్వం' ముందడుగు వేసింది. దానికి పాతగంధపు వాసన లేకుంటే పరివర్తనాశక్తిని సంతరించుకోగలదు. రసాత్మకత, రమణీయార్థ ప్రతిపాదికత కావ్య ప్రధాన లక్షణాలు. నేటి పరిస్థితులలో దానికి పరివర్తనాశీలత చేర్చడం అవసరం. అప్పుడు శబ్దం, రసం, రమణీయత, పరివర్తన కావ్యయుక్త లక్షణాలు కాగలవు. కావ్యం మార్పు తెచ్చేది, ప్రవర్తన చేకూర్చేది, అంతరంగిక విప్లవం కలిగించేది, మనస్తత్వం మార్చేది, మహోన్నతమైంది కాగలదు. విప్లవ కవిత్వానికి మించిన విశేషత్వం ఈ సరికొత్త కవిత్వానికి ఒనగూడాలి. విశేష ప్రవర్తన కల్గించేది కావాలి. అందుచే దీన్ని 'వివర్తన కవిత్వం' అని కూడా చెప్పవచ్చు. దీని ప్రథమ లక్షణం రచయిత ముందుగా పరివర్తన చెందినవాడై యుండాలి.

మానసిక పరివర్తనవల్ల అహంభావం పాలు తరుగుతుంది. ఉద్రేకాల విజృంభణ తగ్గుతుంది. కులభావన సన్నగిల్లుతుంది, మతం మత్తు వదులుతుంది, వివేకం ఉదయిస్తుంది. "కళా సృష్టి పారమార్థిక సత్యం కాదు. ఇది ప్రతిబింబానికి ప్రతిబింబం. కళాసృష్టి పారమార్థిక సత్యం కాదు. ఇది ప్రతిబింబానికి ప్రతిబింబం.

కళాసృష్టి కూడా ప్రయోజనకారి. అంటే మానవుని పరమార్థ సిద్ధికి వినియోగపడాలి. అందుకు తప్ప ఇది తనకు తాను పరమార్థం కాదు. కాబట్టి సాహిత్యాదికం పరమార్థబోధకంగా ఉండాలి కాని తానే పరమార్థమైనట్లుగా తనయందే సర్వం లీనమై పోయేటట్లుండకూడదు. అంటే ధర్మోపదేశం కావాలి". 'జేగంటలు' లో ఇవి జి.వి. కృష్ణారావు పలుకులు కనుక కళ ధర్మాచరణకు, శీల నిర్మాణానికి ప్రేరణ నివ్వాలి.

అనుకరణం, ధర్మప్రతిపాదన, రామణీయకత ప్లాటో సాహిత్య విమర్శలో ప్రముఖాంశాలు. అతని దృష్టిలో కళాస్రష్ట కన్నా సహృదయుడు ఉత్తముడు. సహృదయుని కంటే రమణీయకతత్త్వ విచారపరుడు ఉత్తమోత్తముడు.

"ఇతర మార్గాలన్నింటినీ తిరస్కరించినపుడే
నీ సొంత మార్గాన్ని కనుక్కోగలవు"
చచ్చిన గతంతో ఉన్నంతకాలం భవిష్యత్తు లేదు"
"నిజమైన గురువు ఎవరైనా ఉంటే
అతడు మిమ్మల్ని తన నుండి విముక్తుల్ని చేస్తాడు"
"వెళ్ళిపోయాక తన వెనుక
గంపెడు గందరగోళం వదిలిన వాడే ప్రవక్త"

అని 'యుజి' చెప్పగా రాజశేఖర్ రాశాడు.

ఇవి భాగాలుగా, చమత్కార యుక్తంగా ఉన్నప్పటికి ఆంతరంగిక మార్పును సూచిస్తున్నాయి.

మచ్చుకు కొన్ని భావాలు ప్రసరించడమైంది.

మనసు మిథ్య, మనసు ప్రమాదకారి, మనసు నిర్మాణాత్మకమైంది. మనసు గతానుభవయుతం అనే పార్శ్వభాగాలు కళాకారుని అవగాహనలో ఉండవలసిన అంశాలు. ఇది ఊహాపోహ, గాలిమేడ, అవాస్తవిక ప్రతిపాదన అని ప్రక్కకు నెట్టకుండా ఉచిత స్పందనకు తావీయగలరు.

# ప్రేమకానుక

- చలపాక ప్రకాష్, విజయవాడ

నేనూ ఓ నదిని కావాలనుంది!
నది పాయలా
అనేక దిశలూ చీలిపోయి కలిసిపోవాలనుంది!!
ఎత్తు పల్లాల్లో
చెట్టు పుట్టల్లో కలిసి నడవాలనుంది !
వల విసుర్లు, జల పుష్పాలనే
జాతి భేదాలు చూడని సమస్త
ప్రకృతిలోని అణువణువునీ
నాలో కలుపుకోవాలనుంది!!
రెండు తరాల్ని కలిపే ఒక వంతెన
బరువును జీవితమంతా మోయాలనుంది!!!
ఎన్ని అడ్డుకట్టలేసి అడ్డంకులు సృష్టించినా–
ఆగీ ఆగని నిరంతర ప్రవాహంతో–
కులమత ప్రాంతీయ భేదాలులేని
సమస్త ప్రాణకోటి కడుపుల్లో
దాక్కోవాలనుంది !
మంచిని మిగిల్చేందుకు
మంచినీటి వ్యాపారాన్ని ముంచెత్తుకు పోయే
ఓ మహా ఉప్పెనవతారం
ఎత్తాలనుంది!!
నది నది కలగలిసి
మహా సముద్రం అవతారమెత్తినట్లు –
అక్షరం అక్షరం కలగలిపి
అనంతమైన భావనాశక్తితో
కవితా ప్రవాహంలో ముంచెత్తాలనుంది!
ఊపిరున్నంతవరకు
ప్రజలతో మమేకమై
కష్టసుఖాలలో ప్రకాశవంతాన్ని చిలికిస్తూ
శాంతి స్థాపనకు తీవ్రకృషి సల్పాలనే ఉంది
నేనే ప్రేమకానుకనై అర్పించుకోవాలనుంది!!!



# చెత్తబండి

- గుంటి నరసింహరాజు, రాజమండ్రి

బొచ్చెలో పడ్డ చప్పటి మెతుకుల్ని
నోటినిండా కుక్కుకొని
వెక్కిళ్ళతో తల్లకిలాపడి
ఉక్కిరిబిక్కిరితో
దాహమై సైగ చేస్తే .....
'విశ్వాసం' ఒక్కటే దీనంగా
సమాజంవైపు చూసి
భౌభౌల విన్నపం చేస్తుంది
మనిషి జన్మ ఎక్కడ శాపమైందో
వృద్ధాప్యం ఆ బ్రతుక్కు దోషమైందో
ఇప్పుడు ఆ 'శ్వాస'
బండబారిన గుండెల వైపు
భౌ భౌ శాపనార్థాలతో
కసితో వాళ్ళవైపు
కాలెత్తి చూపుతూ
మానవత్వం తెలియక పోయినా
విశ్వాసపు భక్తితో
ప్రాణం నిలపడానికి కొసరి కొసరి
అతని నోటిలో
అమృతమే పోసిందో
తులసి తీర్థమే వదిలిందో
అందరూ చూస్తుండగనే
చెత్తబండి వచ్చి ఆగింది



# తెలుగు కథలో - మాజిక్ రియలిజం

- డా॥ బండారు విజయ్‌కుమార్, హైదరాబాద్

**మాజిక్ రియలిజం – నేపథ్యం :** "మాజిక్ రియలిజం"ను తెలుగులో 'మాంత్రిక వాస్తవికత' అంటారు. కాని ఇది సరైన మాట కాదని చాలామంది విమర్శకుల అభిప్రాయం. కాబట్టి ప్రస్తుతం మాజిక్ రియలిజం అనే దీనిని పిలుచుకుందాం అని విమర్శకులు భావి స్తున్నారు". (విజయ కుమార్ బండారు: 2005 పుట: 6) ఇది ఒక సాహిత్య రచనా రూపం. ఇది 1920 లో లాటిన్ అమెరికాలోని ఫైన్‌ఆర్ట్ (School of Paints) లో వచ్చింది. 1940 లో ఈ పదాన్ని క్యూబన్ నవలాకారుడైన 'అలెజో కార్పెన్‌టైర్' మొదటిసారిగా సాహిత్యంలో ప్రయోగించాడు. లాటిన్ అమెరికా రచయితలు ఫాంటసీ, మైథాలజీని వాస్తవిక సాహిత్యం (realistic fiction) తో కలిపి సృష్టిస్తున్న ధోరణిని ఆయన గుర్తించాడు. ఈ ధోరణిని చెప్పడానికి ఆయన ఉపయోగించిన పదం 'మార్వలెస్ రియాలిటీ'. ఈ ప్రక్రియను విస్తృతంగా ప్రచారంలోకి తెచ్చింది 'గాబ్రియెల్ గార్షియా మార్క్వెజ్' ఈయన రాసిన 'వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్' (1967) అనే నవల ద్వారా 'మాజిక్ రియలిజం' కథన పద్ధతి ప్రపంచ దృష్టిని ఆకర్షించింది.

**మాజిక్ రియలిజం నిర్వచనాలు :** ఆంగ్లంలో మాజిక్ రియ లిజానికి సంబంధించిన నిర్వచనాలు సుమారు నలభై వరకు ఉన్నాయి. కానీ అవన్నీ కూడా దేనికవే భిన్నమైనవి.

"నేటి మానవుడి చైతన్యానికి రెండు పార్శ్వాలైన సామాజిక స్పృహ, జీవన స్పృహ పరిభ్రమణాల రహస్య ప్రకంపనలను అభివ్యక్తీకరించే ప్రయత్నమే మాజిక్ రియలిజం. లాటిన్ అమెరికాలో ఈ ప్రక్రియ వ్యాప్తి కావడానికి ఆయా దేశాల ప్రత్యేక రాజకీయ వ్యవస్థల నిరంకుశ ధోరణులే కారణం. నిరంకుశాన్ని అన్యాపదేశంగా ఎదుర్కొనే సాహిత్య ధోరణిగా అక్కడి రచయితలకు మాజిక్ రియలిజం ఎంతో దోహదం చేసింది.

కాని భారతీయ జానపద వాఙ్మయ, రామాయణ, మహాభారత, భాగవత పురాణాల్లోనూ దర్శనమిచ్చేది ఈ అద్భుత మాయావాదరసమే దీన్ని అనితర సాధ్యంగా నిర్వహించిన ఆద్యుడు వ్యాసమహర్షి మహా భారత కథల్లో వందలకొలది ఆఖ్యానాలలో ఇట్టివి మహాద్భుతంగా గోచరమవుతాయి" (రాజు మునిపల్లె : 2002 : పుట IV)

"ఏకకాలంలో భిన్న వాస్తవికతలను, భిన్న లౌకిక దృక్పథాలను దర్శింపజేసే ప్రయత్నంలో భూత భవిష్యత్తు వర్తమాన కాలాలు కలగలిసి మేధోలక్షణాలు కలిగిన అల్పసంఖ్యాక పాఠకుల రచనా రూపమే మాజిక్ రియలిజం" (విజయ్ కుమార్ బండారు : 2005 : పుట :45)

ఈ విధంగా మాజిక్ రియలిజానికి భిన్న నిర్వచనాలను గమ నించవచ్చు. ఎన్ని నిర్వచనాలున్నా అవన్నీకూడా భిన్నంగా ఉన్నాయి.

**తెలుగు కథాసాహిత్యం – మాజిక్ రియలిజం :** తెలుగు కథా సాహిత్యంలో మాజిక్‌రియలిజం కథనంతో కథలు రాసిన తొలి కథకుడు డా॥ వి. చంద్రశేఖరరావు. "ఈయన రచనల్లోని వాస్తవికతే మాంత్రిక వాస్తవికత అవుతుందని అదే దాని శిల్ప విశేషమని కథాకథనం ద్వారా మనకు తెలుస్తుంది. ఏ కథా దానంతట అది అనంతంగా కొనసాగదని ఏ పాత్ర దానంతటదే మహోదాత్తమవదనీ అన్నీ విడివిడి భాగాలుగా ఉంటూనే అవన్నీ వాటి వాటి అస్తిత్వాలని పొందుతాయనేది ఇటీవల ఆధునికానంతర సాహిత్య" (గ్రంథాలయ సర్వస్వం : 2001: పుట: 17) మని విమర్శకుల వాదం, "మాజిక్ రియలిజం కథలను అర్థం చేసుకోవడం ఎంత కష్టమో గుర్తించడం కూడా అంతే కష్టం. కానీ కథలను జాగ్రత్తగా నిశితంగా పరిశీలించడం ద్వారా కొన్ని అంశాలు ఈ రూపంలో కనిపిస్తాయి. అవి ఈ కింది విధంగా సూచించవచ్చు.

1. అస్పష్టత (Ambiguity)
2. సంక్లిష్టత (Complexity)
3. అపరిచితీకరణ (Defamiliarization)
4. కేంద్రస్థానరాహిత్యం
5. పాత్ర అనుశూన్యత
6. విచ్ఛిన్నత
7. రూపక లక్షణం

ఈ అంశాలన్నింటి వల్ల అది మాజిక్ రియలిజం కథ అవు తుంది. అయితే ఫ్రాంజ్ రో చెప్పినట్టు సంప్రదాయికత, ప్రాచీనత వంటి లక్షణాలు తెలుగులో వచ్చిన మాజిక్ రియలిజం కథల్లో కని పించవు". (విజయ్‌కుమార్ బండారు: 2005:పుట : 61)

**1) అస్పష్టత (Ambiguity) :** ఈ పదాన్ని సాహిత్య విమర్శలో ఎక్కువగా వాడడం కనిపిస్తుంది. 'సెవెన్ టైప్స్ ఆఫ్ అంబిగ్విటి (1930)ని విలియం ఎంప్సన్ ప్రచురించినప్పటి నుంచి ఈ పదం విమర్శ రంగంలో విస్తృతంగా వినిపిస్తుంది. ఆధునిక తెలుగు కవిత్వంలో తొలుత ఈ లక్షణం కనిపించింది. సర్రియలిస్టు కవిత్వంలో ఎక్కువగా ఎదురుపడే ఈ లక్షణం తర్వాత కథ, నవల ప్రక్రియలకు కూడా విస్తరించింది.

"వాస్తవానికి అస్పష్టత శైలీ గత సమస్య కాదు. అది ఒక అసంబంధ ఫలితం. పాఠకుడికి కవితో ఏర్పడిన అసంబంధ ఫలితమే అస్పష్టత. కవి పాఠకులు కలుసుకునే సమానక్షేత్రం. (common ground) అదృశ్యం కావడమే అస్పష్టత" (శివశంకర్ పాపినేని : 1996: పుట: 139) అని విమర్శకుల అభిప్రాయం. కవి, రచన పూర్తయిన తర్వాత బయటివాడు (Out sider) గానే వుంటాడు. కాబట్టి రచనతో మాత్రమే పాఠకుడికి సంబంధం ఉంటుంది. అందువల్ల అస్పష్టత

అనేది రచనతో పాఠకుడు సంబంధాన్ని ఏర్పరుచుకోవడంలో జరిగే వైఫల్య ఫలితమని చెప్పుకోవచ్చు.

అస్పష్టతా బీజాలు వివరిస్తూ పాపినేని శివశంకర్ ఇలా అన్నారు. "అస్పష్టతకు సంబంధించిన మానసిక దృక్కోణం (Psycological aspect) తప్పకుండా ఉంది. కవి మానసికంగా సంక్షోభజీవి. సామాజిక అల్లకల్లోలాల మధ్య వాస్తవాల తాకిడికి కలలు చిట్లి పోతున్నప్పుడు, "అంతరాళ ప్రాంతరాలలో" అశాంతితో అలమటించేటప్పుడు ఈ క్రమాన్నంతా బహిర్గతం చేస్తూ తనను తాను వాస్తవీకరించు కోవాలనుకునే దశలో అంతకుముందున్న రచన చట్రం ఇరుగ్గా, అసౌకర్యంగా అసహ్యంగా అనిపించవచ్చు." (శివశంకర్ పాపినేని : 1996: పుట: 145) ఆ క్రమంలోనే తాను కొత్త నిర్మాణ పరిధిలోకి వ్యక్తీకరణ రూపాన్ని మళ్ళిస్తాడు.

పాపినేని శివశంకర్ ప్రస్తావించిన సామాజిక అల్లకల్లోలాలు, అశాంతిని చిత్రించే ప్రయత్నం మాజిక్ రియలిజం కథల్లో ఏ విధంగా కనిపిస్తుందో పరిశీలిస్తే....

డా॥ వి. చంద్రశేఖరరావు రాసిన "మోహనా! మోహనా!" కథలో అస్పష్టతను చూడవచ్చు. మోహనరావు అధికార పార్టీ బ్లాక్‌మెయిల్‌కు గురయ్యాకే పతనమైనట్లు కథ ఎస్టాబ్లిష్ చేస్తుంది. ఆ సంఘటనకు ముందు మోహనరావు దుర్మార్గుడే. పదివేలు కొట్టేశాడనే అనుమానంతో కార్యకర్తను కొట్టి చంపించేంత, స్త్రీ కార్యకర్తల్ని బలవంతంగా అనుభవించేంత అరుదైన దుర్మార్గుడితను. నిజానికతడు దళితనేత వేషంలో ఉన్న మాఫియా కింగ్. ఇలాంటి వాడిని రచయితగాని, కథలోని మాలతి 'ప్యాట్రనైజింగ్' గా చూడడం విచిత్రం. అలా చూడటం రచయితకు అవసరమైంది. 'తన కాన్సెప్టును నాటకీకరించటం కోసం అధికార పార్టీతో రాజీపడి దళిత శ్రేణితో తన్నులు తిన్న మోహనరావును పోలీసులు కుళ్ళబొడవటం ఎందుకో అర్థం కాదు. అతనితో కొట్టించుకున్న దళిత కార్యకర్తను 'ఓబులేసు' అనే పేరుతో పరిచయం చేసి, తర్వాత పేరానుంచి 'కోటేశు' అని వ్యవహరిచటంలో కవితాత్మకత ఏదో ఉండి ఉండాలి." (చూపు: 1999 : పుట: 33) అని హెచ్చార్కే వివరించాడు.

"రెండు ఎర్రని గాలి పటాలు" కథలో కూడా అస్పష్టత కనిపిస్తుంది. గుజరాత్‌లో ముస్లింలను ఊచకోత కోసిన దారుణాన్ని ఈ కథలో చిత్రించారు. ఫాతిమా, రషీద్, హమీద్ పాత్రల చుట్టూ అల్లిన కథ ఇది. సామాజిక అల్లకల్లోలాన్ని, మానసిక సంక్షోభాన్ని కథలో చిత్రించారు. 'రషీద్-పళ్ళతో ఎలుకను చంపటం, బొద్దింకపై పెట్రోల్ పోసి తగలబెట్టడం, హమీద్‌ను కొరికి చంపటం" ఇవన్నీ కూడా మత ఘర్షణల వల్ల చిన్నపిల్లలు మానసికంగా ఎంత డిస్టర్బ్ అయ్యారో ఈ కథలో చెప్పబడింది.

మాజిక్ రియలిజం కథానిర్మాణంలో ఏకసూత్రత లేకపోవటం వల్ల, సంఘటనలు శకలాలుగా ప్రదర్శించటం వల్ల ఈ అస్పష్టత వస్తుంది. సూటిగా సరళంగా చెప్పటం అనే వాస్తవిక వాద శైలికి భిన్నంగా ఈ రూపం ఉంటుంది. అందువల్లే బహుళ ముఖాలున్న వాస్తవికతను ప్రదర్శించే క్రమంలోనే ఈ శకల పద్ధతిని స్వీకరించారు. మాజిక్ రియలిజం కథకులు, ముక్కలు ముక్కలుగా వాస్తవాన్ని చెప్పడం ఈ పద్ధతి. 'రెండు ఎర్రని గాలిపటాలు' కథలో ఫాతిమా కథను శివరాం చెబితే, రషీద్, హమీద్‌ల కథను సదాశివ చెప్తాడు. రెండు శకలాలను ప్రదర్శించటం వల్ల పాఠకుడికి అనిర్వచనీయమైన అస్పష్టత కనిపిస్తుంది. మాజిక్ రియలిజం కథలన్నింటిలో ఈ లక్షణం ఉంటుందని చెప్పవచ్చు.

**2) సంక్లిష్టత :** "వస్తు రూపాల్లో ఎన్నో విభిన్నాంశాలు దట్టంగా కలగలిసిన స్థితి సంక్లిష్టత. అది వాస్తవికతకి అపసవ్య ప్రతిఫలనం (It is the deviated Reflection of Reality) అంటే ఇక్కడ వాస్తవ ప్రపంచానికి దాని కళాత్మక చిత్రణకీ మధ్య సూటి సంబంధం భగ్నమవుతుంది. దాన్ని గుర్తించడం సాధారణ పాఠకుడికి క్లేశం కలిగిస్తుంది". (శివశంకర్ పాపినేని : 1996 : పుట : 146)

సమాజంలోని సంక్లిష్టత వల్ల జీవితంలో ఈ అంశం ఏర్పడుతుంది. జీవితం యొక్క కళాత్మక ప్రతిఫలనం సాహిత్యాం కాబట్టి సాహిత్యంలో కళాత్మక సంక్లిష్టత కనబడుతుంది. ఆధునిక వ్యవస్థలో, మానవజీవితంలో వేగవంతమైన మార్పుల్ని తీసుకువస్తుంది. యాంత్రికత, వేగం, పరాయీకరణ వల్ల వ్యక్తి ఒంటరి పాటుకు గురై ఏకాకిగా మారతాడు. వ్యక్తిగత ప్రాధాన్యతలను సీరియస్‌గా తీసుకోవడం వల్ల సామూహికత కొరవడుతుంది. పాపినేని శివశంకర్ చెప్పినట్టు ముక్కలు ముక్కలుగా స్పందించాల్సి వస్తుంది. ముక్కలు ముక్కలుగా ఆలోచించాల్సి వస్తుంది. ముక్కల మధ్య సామరస్యం కుదరదు. ఒక స్పందన సంపూర్ణ వ్యవధి లేకుండానే మరో క్లిష్ట సన్నివేశం మీద పుడుతుంది. ఈ సమస్యల్లోంచే సంక్లిష్టత తలెత్తుతుంది.

డా. వి. చంద్రశేఖరరావు రాసిన 'కాకుల ఇల్లు' కథ సంక్లిష్టంగా ఉంటుంది. దానిలోని వస్తువును, కథ అందించే సందేశాన్ని లేదా అర్థాన్ని గ్రహించడానికి ఎంతో కష్టపడాల్సి ఉంటుంది. దళితులను సంకేతించడానికి కాకులను మెటఫర్‌గా తీసుకున్నాడు రచయిత. అయితే వస్తువును కథగా మలిచే పనిలో ఇతివృత్తం అజంతా, రాజ్యం చుట్టూ తిరుగుతుంది. ఒక అమ్మాయి చెప్పే కథ ఇది. 'విలియం సార్' ను కత్తులతో పొడిచి చంపిన ప్రస్తావనతో కథ నడుస్తుంది. కథ మొత్తంలోఈ హత్య ప్రధానమైందని అనిపించినా అది పరోక్షమే తప్ప కనిపించదు. 'కాకులు ఉన్నఇల్లు, వాటిపట్ల నాన్న (పేరు లేదు) పెంచుకున్న నమ్మకం, గుడ్డివాడైన అజంతా, ప్రజలవద్దకు పాలన నాటకం, హత్యమీద విచారణ కమీషన్, కాకుల హత్య, అమ్మాయిపై అత్యాచారం' ఇదంతా ఒక క్రమంలో ఉన్నట్టు కనిపిస్తుంది. కాని, ఆ క్రమం అస్పష్టంగా ఉంటుంది. అందువల్ల సంక్లిష్టమైన కవితలా ఉంటుంది.

నిజానికీ కథలో సూచించిన ముఖ్యమైన అంశం. సుందరం అంకుల్ పాత్ర. ఇతడు ఆరెస్సెస్‌వాది. ఈ పాత్ర అప్రధానమైనా, కీలకమైంది. ఈ భావజాలానికి సంబంధించినవారే విలియంను చంపింది. తెల్ల ఆవును 'మాయ' గా పిలవటం దేన్ని సంకేతిస్తుంది? తెల్ల ఆవు హిందూ మతానికి ప్రతీకగా తీసుకుంటే అది కులవ్యవస్థ, అగ్రకుల వ్యవస్థను నమ్ముకోవటం వల్ల న్యాయం జరగదని భావించిన అమ్మాయి, అజంతా నల్ల వస్త్రాన్ని ఆవుపై కప్పి, దాని మీదెక్కి పైకి ఎగిరిపోతుంటారు. ఎక్కడినుంచో రెండు బుల్లెట్లు వచ్చి ఆవును గాయపరుస్తాయి. అప్పుడా ఆవు పైకి ఎగురలేదు కిందికి రాలేదు అంటే దళిత ఉద్యమాన్ని నమ్ముకున్నవారు, దళితోద్యమం ప్రభుత్వ అణచివేతకు గురై ఉవ్వెత్తున లేవలేక, పూర్తిగా ఆగిపోక మధ్యస్తంగా ఉన్నదాన్ని సూచిస్తుంది. అంత క్లిష్టంగా సూచించిన కథను అనుభవించవచ్చు. ఆస్వాదించవచ్చు. కానీ, క్లిష్టత వల్ల పాఠకుడి మేధస్సుకు పదును పెడతాయి. దీనికి కారణం ఆలోచిస్తే దళిత ఉద్యమం చుట్టూ, దళితుల జీవితాల్లోనూ ఎంతో సంఘర్షణ, సంక్లిష్టత ఉంది. అందుకే ఈ కథ అంత క్లిష్టంగా రూపొందింది. ఈ ఒక్క కథేకాదు. మాజిక్ రియలిజం కథనంలో వచ్చిన కథలన్నీ అదేవిధమైన సంక్లిష్టతను కలిగి వుంటాయి.

**3) అపరిచితీకరణ (Defamiliarization) :** ఈ పదం మొదటిసారిగా రూపవాదులు (Formalists) ప్రయోగించారు. 'విక్టర్ ష్కోలో విస్కీ' రాసిన "Poetry as Technique" (1917) లో ఈ పదాన్ని వాడాడు. బాగా పరిచయమైన వాటిని గ్రహించడం ఒక అలవాటుగా మారుతుందని ఆయన అన్నాడు. అది స్వయంచాలనంగా మారుతుందనీ అన్నాడు. అలాంటి స్థితి నుంచి వస్తువును అపరిచితీకరించడం వల్ల అది సరైన వాస్తవాన్ని ప్రదర్శిస్తుందని, ఆ కృషిని కళ నెరవేరుస్తుందని ఆయన అన్నాడు.

అపరిచితీకరణ అనేది ఈ కథల్లో ఒక ముఖ్య లక్షణంగా కనిపిస్తుంది. కథావస్తువును చూడటంలో మాజిక్ రియలిజం కథకులు అలవాటైన పద్ధతికి భిన్నంగా వ్యవహరించారు. ప్రపంచాన్ని చూడటంలోనే సంప్రదాయిక అలవాటుని వాళ్ళు ధిక్కరించారు. ఆ క్రమంలో ఆయన రూపాత్మక భాషను ఎన్నుకొన్నారు. కథానిర్మాణంలో సహజంగా కనిపించే సంఘటన సమన్వయాన్ని అసంబద్ధ ప్రయోజనాలుగా మార్చడం ద్వారా వ్యతిక్రమవ్యూహం అనుసరించారు. ఫలితంగా కథ పరిచితమైన దానికన్నా అపరిచితంగా మిగిలిపోతుంది. ఫలితంగా నిష్పాక్షిక పరిశీలన కనిపిస్తుంది. కథ లేదా సాహిత్యరూపం ఏదైనా వస్తువును అపరిచితం చేయటమనే సూత్రీకరణను ఆమోదించడం సరైందే! అందువల్ల ఇది ఒక్క కథకు సంబంధించిన వ్యవహారం కాదు. భాషను అలంకారికంగా వాడటంవల్ల అపరిచిత వ్యాపారం సాధ్యమౌతుంది.

'ఐ హేడ్ ఎ డ్రీమ్, టు లివ్ లైక్ ఎ పోయెమ్!" నా చిన్నతనంలో మాకో కుంచెడు పొలం ఉండేది. జనుము పంట వేసేవాళ్ళం! ఏపుగా పెరిగి, పూలన్నీ విరిసి, మా నాయన శరీరంలోని బలమంతా తాగి, ఆ పూలు పకపకలాడేవి! ఊరు చివర, ఒంటరి చేను, చేనులోనే మా పాక. పాక తలుపు తెరిస్తే ఒక రంగుల స్వప్నం. ఆ చేనులో రోజుల్లా నడుస్తూనే ఉండేదాన్ని! ఒక స్వప్నంలోంచి యింకో స్వప్నంలోకి నడుస్తున్నట్లుగా ఉండేది. దేనికోసమో నిరంతరం వెతుకుతున్నట్లు గడిపేదాన్ని! ఈ వెతుకులాటే నన్ను కవిని చేసింది." (డా. చంద్రశేఖరరావు. వి.: లెనిన్ ప్లేస్ : పుట 42) ఈ రకమైన కవిత్వం వల్ల సంభాషణ పూర్తిగా అపరిచితం అయింది. 'కుంచెడు పొలం' అనే పదమే అరుదైన కవితాత్మకం.

'వెదుర పొద, వేణుగానం, తుళ్ళిపడ్డ నది లాంటి పదో, ఇరవయ్యో పదాలతో ఒక ఫేర్‌వెల్ నోటు రాసి పత్రికలకు పంపితే, సాటి రచయితగా ఆమె గురించిన నా బాధ్యత తీరిపోతుంది. కానీ అట్లా రాస్తే ఆమెనే కాక, ఆమె రచనల్ని కూడా అవమానించినట్లు కాదా! ఉట్టుట్టి పదాలతో రచనల్ని, రచయితల్ని గుర్తుచేసుకోవడం సాహిత్య ప్రపంచంలో కొత్తేమీ కాదు. వీలైతే కాస్తంత సన్సేషన్ కూరి, రచయిత చుట్టూ ఒక మిస్టన్ను సృష్టించడం మనం ఎరిగిందే! ఈ తరహా సమీక్షల వల్ల రచయిత రత్నమాలతికి ఇప్పటికే ఎంతో అపకారం జరిగింది. ఆమెనో అనుమానంలాగో మిత్‌లాగో మిగల్చడం చరిత్రకు అపకారం చెయ్యటమే" (డా. చంద్రశేఖరరావు. వి. లెనిన్ ప్లేస్: పుట : 54) అని ఉపమను ఎంతో బలంగా ఉపయోగిస్తాడు రచయిత.

మరో కథలో "పైన ఆకాశం నల్లగా, పెద్ద కళేబరంలా ఉంది" (డా. చంద్రశేఖరరావు. వి : మాయాలాంతరు: పుట : 125) ఎంతో తెలిసిందిగానే ప్రతికథ కనిపిస్తుంది కాని చదువుతున్న కొద్ది అపరిచితంగా ఉంటుంది. అందువల్ల కథను గొప్ప మెటఫర్‌గా మలిచి మనముందు నిలుపుతాడు రచయిత.

స్కాట్ సింప్కిన్స్ " Perhaps magic realism's goal is to return our four to the backdrop of textual reality, its production and function, by defamiliarizing it". (Simpkins Scott : 1998: P-147) అని చెప్పినట్టుగానే మాజిక్ రియలిజం కథల్లోని వాస్తవికత నేపథ్యాన్ని, వాస్తవికతను అపరిచితం చేయటం సర్వత్రా కనిపిస్తుంది.

**4) కేంద్ర స్థానరాహిత్యం :** ప్రతికథకు ఒక కేంద్రస్థానం ఉంటుంది. అలవాటైన సంప్రదాయిక రచనా విధానం ఇది. ఒకే అంశాన్ని బిందువుగా చేసుకుని దాన్నిచుట్టూ కథ అల్లటం అందరికి తెలిసిందే. అందువల్ల కేంద్రీకరించిన అంశం కీలకం అవుతుంది. ఆ కీలకాన్ని కళాత్మకంగా మలచటం కోసం వాతావరణాన్ని కల్పించి

క్రమంగా పాత్రల్ని ప్రవేశపెట్టి, వాటిమధ్య జరిగే సంఘర్షణలను వివిధ అంగాలుగా కూర్చి సమన్వయం చేయడం ఇప్పటి వరకు అందరూ అనుసరిస్తున్నదే! దీనివల్ల ప్రతికథ అనుకోకుండానే కొన్ని పరిమితులకు లోబడుతుంది. పాత్రలు సంఘటనలు పరిధిని అతిక్రమించకుండా ప్రవర్తిస్తాయి. ఒక నియతి క్రమశిక్షణల మధ్య సైనిక కదలికలుగా పాత్రల ప్రవర్తన, వ్యక్తిత్వం మారి యాంత్రికతకు లోనవడమో లేదా వార్తా రచనగా మారడమో జరగడం మనం అనేక కథల్లో చూడవచ్చు.

సబ్జెక్టును వస్తువుగా గ్రహిస్తే కథలో కేంద్రస్థానం ఏర్పడుతుంది. భావనగా స్వీకరిస్తే కేంద్రబిందువు లేకుండా విస్తృతంగా-రూపొంది ంచడం జరుగుతుంది. జాక్వెస్ దెరిడా దృష్టిలో కేంద్రస్థానం అనేది "to represent a point of presence, a fixed origin". (Hawtharn, Jeremy : 1998 : P : 37) ఇది రచనా నిర్మాణం మీద పరిమితులను రుద్దుతుందని కూడా ఆయన గుర్తించాడు. వినిర్మాణ వాదంలో కేంద్రస్థానం నుంచి నిర్మాణాలను విముక్తి చేయడానికి ప్రయత్నించింది. ఈ లక్షణం మాజిక్ రియలిజం కథల్లో ముందు నుంచీ కనిపిస్తుంది. మాజిక్ రియలిజం కథలన్నీ దాదాపు ఏక కేంద్రక నిర్మాణాలు కావు.

డా.వి. చంద్రశేఖరరావు రాసిన 'వెలుగు ఎక్కడ సోనియా' కథలో కేంద్రస్థానం ఏమిటో చెప్పడం కష్టం. మోహన సుందరం సోనీతో ప్రేమలో పడటం, ప్రేమవైఫల్యం కథకు కీలకం అనుకుంటాం. కాని కథ మరోవైపు నడుస్తుంది. మోహన సుందరం మామయ్య హత్యతో రాజకీయల్లోకి రావడం, రాజకీయాల్లో భాగంగా ఎన్నికల్లో పోటీ చేయటం, 'యంగ్ ఇండియా' కుర్రాళ్ళను హత్య చేయించడం, శవాలతో ఊరేగింపుగా వచ్చిన జన సందోహం మోహన సుందరం ఇంటిపై రాళ్ళు విసరటం, చివరగా సోనీ వచ్చి 'వేటాడి చంపదగ్గ జంతువ్వి నువ్వు' అని దూషించి అసహ్యించుకోవటం కథలో కనిపించే అంశాలు. ఒక అంశాన్ని చెప్పినట్టుగా కనిపించదు. ఒక పరిణామాన్ని, వైఫల్యాన్ని చిత్రించడానికి ప్రయత్నం చేసినట్టు కనిపిస్తుంది. అయితే మోహన సుందరం కీలకం కాదా! అనిపించవచ్చు కానీ, మోహనసుందరం ఒక సంజ్ఞ మాత్రమే. ఆ పాత్ర ఆధారంగా రాజకీయాల్లో లంపెన్ మూకలు ఎలా ఎదుగుతాయో, ప్రజల ప్రతిఘటనను ఎలా ఎదుర్కొంటారో తెలపటమే ఈ కథ ఉద్దేశం. అందువల్ల మోహన సుందరం కీలకం కాదు.

ఆయనే రాసిన 'మాయాలాంతరు' కథ కూడా భిన్నమైందే. ఈ కథలో దళిత సినిమా ప్రదర్శించడం కీలకంగా భావించలేము. అలాగని నిరంజన్‌ను కీలకంగా భావించలేము. ఈ కథ నిండా ఎన్నో మోసాలు, దగాలు చిత్రీకరించబడ్డాయి. ఏ ఒక్క సన్నివేశం మరో సన్నివేశానికి కొనసాగింపు కాదు. విడివిడి ప్రాధాన్యతలున్న అంశాలే. మనోహర్ దళిత రచయితైన సుందరంను మోసం చేయటం ఇలా ఎన్నో దృశ్యాల, సంఘటనా మాలిక ఈ కథ. మనోహర్, మోహిని, నిరంజన్‌లు 'సుందరం' అనే వ్యక్తి గురించి , ఉద్యమాల గురించి ప్రజల మధ్య తీసిన సినిమా ఇది. మాయాలాంతరు అనే మాటను మోహిని అంటుంది. ఆమె వ్యభిచారం చేస్తుంది. కెరీర్ కోసం తప్పదు అంటుంది. అందుకే "మన పరిచయం, స్నేహం, దాదాపు ముగిసినట్టే. నీకు అప్పుడే చెప్పాను.. మామూలు హౌస్‌వైఫ్ జీవితం నాకు నచ్చదని, అన్నీ చెరిపేసుకో మోహిని ఒక మాయాలాంతరు అని సరిపెట్టుకో". (డా. చంద్రశేఖరరావు. వి. మాయాలాంతరు: పుట : 110) అని అంటుంది. ఈ మాటల వల్ల కథాశీర్షిక వల్ల మోహిని కేంద్రం అనుకుంటాం. కథ ఆమె గురించి అనుకుంటాం. కాని వాస్తవానికి కథ ఏ ఒక్కరి గురించీ కాదు. ఆ కథలోని పాత్రలన్నింటి గురించి అందువల్ల బహుళ కేంద్రాలు ఈ కథలో కనిపిస్తాయి.

ఈ లక్షణం వల్లనే వాస్తవం యొక్క విస్తృతిని, బహుళత్వాన్ని మాజిక్ రియలిజం చిత్రించగలుగుతుంది. జీవితంలోని విలోమాన్నీ, దైన్యాన్ని పట్టిస్తుంది. సుందరం లాంటి మోసగాళ్ళ రూపాలను ప్రవర్తనలను చిత్రించగలుగుతుంది. సమాజం, జీవితం రెండూ కూడా ఒక్క అంశం చుట్టూ మాత్రమే ప్రవర్తించవని, వాటి ప్రమేయం (Function ) ఆయా నిర్దిష్టతలకి విరుద్ధంగా కూడా ఉంటుందనే వాస్తవికతను ఆవిష్కరిస్తుంది.

**5) పాత్ర అనుశూన్యత :** మాజిక్ రియలిజం కథల్లో కనిపించే మరో ముఖ్య లక్షణం – కథల్లోని పాత్రలు స్థిరంగా ఉంటాయి. 'మోహనసుందరం', 'ఆనంద శంకరం', 'మోహిని','మాలతి' లు దాదాపు అన్ని కథల్లో కనిపిస్తాయి. కొన్నిసార్లు 'సలీం సుందర్', 'రత్నమాలతి' 'సుందరం' 'మోహన్', 'మనోహర్' 'శంకరం' వంటి పేర్లతో పునరావృతం అవుతుంటాయి. పాత్రలు అనుశూన్యంగా-కొనసాగటం వల్ల అన్ని కథలకూ సంబంధం ఉందని పాఠకుడు ఊహిస్తాడు. కాని అది నిజం కాదు. ఒక్కో కథ ఒక్కో సంఘటనకి, భావానికి మెటఫర్?

పాత్రలు రూపాంతరం చెందటం కూడా అ అనుశూన్యతలో భాగంగానే పరిగణించాలి. బి. తిరుపతిరావు ఈ అంశాన్ని గురించి, "పాత్రల భౌతిక రూపు రేఖల్ని వివరణాత్మకంగా చిత్రించటం ద్వారా వాటి ఆత్మిక స్వభావంతో పాటు భౌతిక రూపాన్ని కూడా పాఠకుడికి పరిచయం చేయటం, తద్వారా ఆ పాత్రని పాఠకులు మరిచిపోకుండా చేయగలగటం చంద్రశేఖరరావు తరుచుగా చేసే పని, అసలు కొన్ని పాత్రలైతే అదే పేరుతో చాలా కథల్లో మళ్ళీ మళ్ళీ కన్పిస్తూ ఉంటాయి. 'మోహిని, మోహన సుందరం, ఆనంద శంకరం, బహురూపాల్లో ఆయన కథల్లో మనకు తారసపడుతూ ఉంటారు. ఆనంద శంకరం అయితే మరీ ఎక్కువ కథల్లో కనిపిస్తాడు". (డా. చంద్రశేఖరరావు. వి. మాయాలాంతరు: పుట : 246) అని అంటాడు.

మాజిక్ రియలిజం కథనంలో కనిపించే పాత్రల పరివర్తన గురించి తిరుపతిరావు ఇలా అంటాడు. "ఆనందశంకరంలాంటి పాత్రలు బహుళ అస్తిత్వాల్ని ఏకకాలంలో కొనసాగిస్తూ ఉంటాయి. ఒక స్థితిలోకి, ఒక వేషం నుండి మరొక వేషంలోకి చాలా త్వరత్వరగా ఇవి మారి పోగలవు." (డా. చంద్రశేఖరరావు. వి. మాయలాంతరు: పుట : 249)

రూపాంతరం చెందటం అనే టెక్నిక్ వల్ల పాత్రను కొన సాగించవచ్చు. పాత్రల కొనసాగింపు అనేది ఇతర రచనా రూపాల్లో సాధారణంగా కనిపించదు. మాజిక్ రియలిజం కథల్లోనే కనిపించే లక్షణం ఇది. ఈ లక్షణమే మాజిక్ రియలిజం ప్రత్యేకత.

**6) విచ్ఛిన్నత :** విచ్ఛిన్నత అనేది సాహిత్య పరిభాషలో కొత్తదేమీ కాదు. ఆధునికానంతర కవిత్వంలో భాగంగానే కనిపిస్తుంది. అఖండత అనేది రచనల్లో ఉండదని ఇప్పటికే నిరూపించారు. ఏకత లేదా సంగ్రహంగా ఉండటం అనేది రచనకు తప్పనిసరిగా ఉండాల్సిన అంశం కాదని వినిర్మాణవాదులు భావించారు. సంఘటనల మధ్య ఐక్యత ఉండటం వల్ల వాచకానికి సంపూర్ణత వస్తుందనే భావనను తిరస్కరించటం మాజిక్ రియలిజంలో కనిపిస్తుంది.

విచ్ఛిన్నతకు వ్యతిరేకమైంది అవిచ్ఛిన్నత. ఈ అవిచ్ఛిన్నతను పాపినేని శివశంకర్ సామాజిక అంశంగా గుర్తించాడు. దీని గురించి ఆయన "విచ్ఛిన్నత అనేది సమాజంలో వచ్చే మౌలిక మార్పులకు సంకేతంగా వాడారు. సంప్రదాయం వారసత్వంగా రావటమనే లక్షణం భారతీయ సమాజంలో ఉందని" ఆయన భావించారు. అంతేకాక "భారతీయ సామాజిక రూపానికి సమాజ వస్తువు మీద ఎట్లాగైతే పట్టు వుందో, అట్లాగే సాహిత్య రూపానికీ సాహిత్య వస్తువుపై పట్టు వుంది. పద్యం ఆధునిక వస్తువును ఏదో ఒక మేరకు శాసించటం నేటికీ కనిపిస్తుంది. తెలుగు కవిత్వంలోని ఒకవిధమైన అవిచ్ఛిన్నతకి పద్యం గొప్ప ఉదాహరణ" (శివశంకర్ పాపినేని : 1996 : పుట : 117) అని అంటాడు.

పాపినేని శివశంకర్ ఆశించినట్టు విచ్ఛిన్నత కేవలం వస్తు గతమైందే కాదు. రూపసంబంధం కూడా. పద్యాన్ని రూపంగా పరి గణించటం కన్నా ప్రక్రియగా స్వీకరించటం వల్ల రూప సంబంధ పరి ణామాలను లోతుగా పరిశీలించవచ్చు.

విచ్ఛిన్నత, అవిచ్ఛిన్నతలు రచనలోని సంఘటనలకు, భావన లకు సంబంధించినవిగా ఉంటాయి. వివిధ సంఘటనల మధ్య ఉండే అంతర్గత సంబంధాన్ని కూర్చుతూ అల్లటమే రచనా శిల్పంగా భావిస్తాం. అయితే కథలో సంఘటనలు లేనప్పుడు అవిచ్ఛిన్నత సాధ్యం అవుతుందా? అనే సందేహానికి సమాధానం మాజిక్ రియలిజం కథల్లో దొరుకుతుంది.

"కథలో సంఘటనలు లేనప్పుడు కథకుడు అనివార్యంగా వర్ణనల మీద ఆధారపడటం జరుగుతుంది. కథ ఎక్కువగా వర్ణనలు మీద ఆధారపడటం జరుగుతుంది. కథ మరీ ఎక్కువ వర్ణనాత్మకంగా ఉన్నప్పుడు "narative" అనేది విచ్ఛిన్నమవుతూ ఉంటుంది. సంఘటనల మధ్య ఈ విచ్ఛిన్నత మాజిక్ రియలిజం కథల్లో మరీ ఎక్కువగా కనిపిస్తుంది. సంఘటనకీ, సంఘటనకీ మధ్య సంబంధం చాలా తాత్కాలికంగా మాత్రమే ఉంటుంది. మాజిక్ రియలిజం కథల్లో ("డా. చంద్రశేఖరరావు. వి. మాయాలాంతరు : పుట: 251")

ఈ పద్ధతి వల్ల కథలో కొత్తదనం వస్తుంది. సంఘటనలు ఒక క్రమంలో కాక శకలాలుగా పొరకుణ్ణి తాకటం జరుగుతుంది. అని అంతకుముందు కవిత్వంలో ఉన్న ధోరణి ఈ మధ్యకాలంలో కథల్లోకి విస్తరించిందని తిరుపతిరావు భావించటం సరైందే! డా. వి. చంద్రశేఖర రావు రాసిన 'ఫాతిమా గది' 'మాయాలాంతరు' 'మోహనా! మోహనా!, 'రెండు ఎర్ర గాలిపటాలు' వంటి కథల్లో అది భాగం ఇలాంటి కథలే.

**7) రూపక లక్షణం :** మాజిక్ రియలిజం రచనల్లో కనిపించే కవితాత్మకత విమర్శకులు రచయిత శైలికి సంబంధించిన అంశంగా పరిగణించారు. అయితే, అందరూ విస్మరించిన అంశం ఏమిటంటే రూపకాత్మకత, కవితాత్మకత అనే రెండూ అంశాలు మాజిక్ రియలిజం ముఖ్యమైన లక్షణాలు. మార్క్వెజ్ కథలను పరిశీలిస్తే ఈ విషయం మనకు అర్థమౌతుంది.

మాజిక్ రియలిజం కథల శీర్షికలన్నీ మెటఫారికల్‌గా ఉండటం అసహజమేమీ కాదు. కథల్లోని సంఘటనలు వాస్తవికంగా శిలా సదృశ్యంగా ఉండకుండా రూపకాలుగా కనిపిస్తాయి. ఒక్కోపాత్ర ఒక్కో రూపకం.

"Mixing, Juxataposition, shuffing" మొదలైన ప్రక్రియల్లో సన్నివేశాల్ని ఒడుపుగా అల్లుతాడు చంద్రశేఖరరావు తన కథల్లో అంతేకాక 'తూనీగలాగో, వెన్నెలలాగో, బిడియపడే అజ్ఞాత స్వప్నంలాగో ఉండాల్సిన వయస్సు' అంటూ కవితా శైలిని అందుకుంటాడు. అతని రచనా కౌశల్యం మట్టిని సైతం మణిపూసగా మలిచింది." (ఆంధ్రజ్యోతి సమీక్షణం: 1998:పుట:78) అని పాపినేని శివశంకర్ వ్యాఖ్యానించాడు.

"చంద్రశేఖరరావు సహజంగా కవి, దానికి తోడు ప్రతిదాన్నీ అంటే పాత్రనూ, పాత్ర ఆలోచననూ సంఘటననూ కవితాత్మకంగా చెప్పాలన్న అతని కోరిక కూడా అతనిలో ఎక్కువగానే ఉంది. అందుచేత అతని శైలిలో వైవిధ్యం తగ్గిపోయింది." (ఆంధ్రజ్యోతి ఆదివారం 1998: పుట : 24) అని వల్లంపాటి వెంకట సుబ్బయ్య నిర్ణయించటం వెనుక కవితాత్మకత మాజిక్ రియలిజం రూపం యొక్క ప్రధాన లక్షణమని గ్రహించకపోవటమే.

"కవికి ఉండే భాషా సంబంధమైన వ్యామోహం, భావుకత ఈయనలో పుష్కలంగా ఉంది. పద చిత్రాల పట్ల అత్యంత ఆకర్షణతో కూడా ఈ కథకుడు కవులకు ఏమాత్రం తీసిపోడు". (డా. చంద్రశేఖరరావు వి. మాయాలాంతరు : పుట: 243) అని వ్యాఖ్యానించడం కూడా దీని వల్లే జరిగింది.

"బోధివృక్షం, ఒక మేడ" కథలో కవిత్వాన్ని చూస్తే..... ఒంటరి రాత్రి, నిదురిస్తున్న మేడ, నాశరీరంపై అల్లుకున్న ఈ మోహిని దృశ్యం మొత్తం చాలా అబ్సర్డ్‌గా, అనీజిగా వుంది. కానీ ఏదో పురాతన దృశ్యం తిరిగి ప్రత్యక్షమైనట్లుగా హాయిగా కూడా ఉంది. మోహిని చేతులు రెండూ చూస్తుండగానే లతల్లా మారిపోయి, మోహిని శరీరం మళ్ళీ అలనాటి బాల్యపుతోట తిరిగి ప్రత్యక్షమై మోహిని అనే వృక్షం పెరిగి పెరిగి మహాబోధిలా తోచి, చటుక్కున లేచి ఆమె పాదాలను కళ్ళ కద్దుకున్నాను.

సరిగ్గా అప్పుడే మేడలోంచి ఏడుపులు, గగ్గోళ్ళు వినబడ్డాయి. లైట్లన్నీ భగ్గుమన్నాయి. సుందర రామయ్య మరణం గొప్ప దుఃఖాన్ని, వందలాదిగా మనుషులు మూగటంగా, షామియానాగా, మేడపై అవనతమైన జెండాగా మైకుల్లో జోహారు పాటలా రూపాంతరం చెందింది". (డా. చంద్రశేఖరరావు. వి. మాయాలాంతరు: పుట : 223)

కవితాత్మకంగా లేని మాజిక్ రియలిజం కథను ఊహించలేము. సూటిగా ఉండటం అనే వాస్తవికవాద రూపానికి కవితాత్మకతతో పనిలేదు. కాని వాస్తవాన్ని బహుళ ముఖీనమైనదిగా ప్రదర్శించాలంటే వస్తువుకు బదులు సారాన్ని మాత్రమే రూపు కట్టించాల్సి ఉంటుంది. అప్పుడు వర్ణనా రహిత వాక్యాన్ని మాజిక్ రియలిజం కథల్లో వాడటం అన్యాయమే అవుతుంది. ఇక్కడ scott simpki మాటల్ని ప్రస్తావించటం సబబుగా ఉంటుంది...... "And, the conciously poly - scenictext portrays more accurately an Imporctant aspect of reality" (Simpkins Scott : 1990 : P : 140 ) అని మాజిక్ రియలిజం గురించి అన్న మాటని విస్మరించలేము.

పై అంశాలను గమనిస్తే ఈ సాహిత్య రూపంలో పూర్వరూపాలకు పూర్తి విరుద్ధమైందని అర్థమౌతుంది. అలాగే వ్యక్తి స్వాప్నిక వ్యక్తీకరణలను కూడా ఈ సాహిత్య రూపంలో ప్రధానమైన అంశంగా కనిపిస్తాయి. స్వప్నాల ప్రస్తావన, ఆందోళన, మానసిక సంక్షోభం వంటి అస్తిత్వ వికారాలు కనిపిస్తాయి. అలాగని వాస్తవికతతో పోల్చలేము. కనిపించే వాస్తవికత వెనక ఉన్న రహస్యాన్ని ప్రకటించే ప్రయత్నం కూడా ఇందులో కనిపిస్తుంది. చైతన్యస్రవంతి శిల్పం వలే కనిపించినా దానికి చాలా దూరంలో ఉంటుంది. డేవిడ్ కె.దానవ్ మాటల్ని ఇక్కడ ప్రస్తావించటం సమంజసంగా ఉంటుంది. "మాజిక్ రియలిస్ట్ వాచకాల్నొక అతి విస్మృతి యొక్క సౌందర్యాత్మకత ఆవరించే ఉంటుంది. దాని గమనం నిర్దిష్టమైన మూసలో సాగే క్రమమే గాని అందులో అద్భుతం నుండి ఊహాతీత తత్వానికి, అసంభావ్యత నుంచి సంభావ్యతకి ప్రయాణం సాగుతుంది. సంతోష వాగ్దానంతో, శక్తితో ప్రాణభరితంగా పొంగిపొరలే ప్రపంచాన్ని గాక మాజిక్ రియలిజం జీవితవేదనా స్వరూపాన్ని. (Danav David K. 1995 : P:65)

సమాజంలోని అన్ని సంక్షోభాలు, అసమర్ధమైన జీవితాలు, కామనలు, నిరసనలు అన్నీకలిసిన కళాత్మక వ్యక్తీకరణ మాజిక్ రియలిజం. అంతేకాని, తెలుగు సాహిత్య విమర్శకులు భావించినట్లుగా అలౌకికమైనదో, మంత్రపూరితమైనదో అయిన సమాజ వ్యక్తీకరణ కాదు.



**ఆధార గ్రంథ సూచి :**


1. చంద్రశేఖరరావు .వి : "లెనిన్‌ప్లేస్" , చరిత గ్రాఫిక్స్, హైదరాబాదు, 1998
2. చంద్రశేఖరరావు వి : మాయాలాంతరు, అక్షర క్రియేటర్స్, హైదరాబాదు, 2003.
3. నవీన్ వాసిరెడ్డి, శివశంకర్ పాపినేని (సంపా) : కథ 1996, కథాసాహితి, సికిందరాబాదు, 1996
4. రాజు మునిపల్లె : "అస్తిత్వవాదం ఆవలి తీరాన, మాజిక్ రియలిజం కథలు", కణ్వస గ్రంథమాల, హైదరాబాదు, 2006.
5. విజయకుమార్ బండారు : "మాజిక్ రియలిజం. డా. చంద్రశేఖరరావు కథలు, ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసం, హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 2005.
6. Danow David, K : "The Spirit of cornival magic realism and the grotesk, University press of kyp, Lexinton. 1995.
7. Simpkins Scott : "Magical strategies the supplement of realism 'Duke University press, Durham, 1995.

గజల్

## యవ్వన తోరణం

- డా॥ దేవరాజు మహారాజు, హైదరాబాద్

మంచి గృహము కట్టి దానికి రూపుదిద్దుట కష్టము
స్వేచ్ఛగా తిరుగాడు జీవికి పరిధి ఎక్కడ సాధ్యము?
శక్తిమయము వికాసము, నిండె అంతట సుగంధము
ఇదియే కాదా మనము కోరిన వింత కారాగారము
కదలికే మన లక్ష్య సాధ్యము ఆగిపోవుట మరణము
బాటసారులు తెలుసుకొనగల ఇదియే జీవరహస్యము
నీ జ్ఞాపకాలను తట్టుకుంటూ లోకం, చేసే రోదన చెప్పదు
అంతదాకా పెద్ద మనసుతో - నీకు నిరీక్షణ తప్పదు
తెంచుకున్నా వేరుపడినా దేని నుండి ఎదుగుతానో
దానినే నా వృక్షచాయగ మలచుకొని నేనొదుగుతాను
క్షణకాలమైనా పురుగు మిణుగురు వెన్నెలను మరపించదా?
చిన్నపాటి నిప్పురవ్వ అగ్నిశిఖ కురిపించదా?
ముడత పడిన తనువు కద ఇది, ఒకప్పటి యవ్వన తోరణం
కాల గతిలో దేహ వస్త్రం కాక తప్పదు జీరణం
శిలువకూ విజయానికీ ఉన్న బంధం గొప్పది
గెలిచి ఓడిన కోట గోడ చరిత అడుగున ఉన్నది
మూత పడిన హృదయమే ద్వారమొక్కటి తెరిచెనే
చూడు అటు చూడు తిరిగి, జగతి నిన్ను మరిచెనే !



## శ్రీ కృష్ణరాయ నృపా!

'పద్యకళాప్రవీణ' డా॥ ఆచార్య ఫణీంద్ర

వీర సార భూమి 'విజయనగర' మందు
తెలుగు ధీరయుక్తి, ధిషణ శక్తి -
ఒక్క రూపమందె ఉద్దీపనము చెంద
'కృష్ణరాయ' దగుచు కీర్తి నొందె ! 1

కత్తి కలమ్ముగా సమర కావ్యమునన్ రుధిరాక్షరంబులన్
విత్తగ కృష్ణ రాణ్ణృపుడు - విక్రమ గీతులు పొంగు ! ఆతడే
మెత్తని పాళి గల్గు కలమే ఝళిపించగ కత్తిగాన్, సిరా
హత్తుకొనంగ కావ్యమె మహాద్భుత మౌ రసయుద్ధమయ్యెడిన్ ! 2

రాజ సూర్యుడు, కవి రాజునున్, రెండయి
తెలుగు రాజ్యరమకు దీప్తి గలుగ -
దిద్దె వీర రక్త తిలక మామె నుదుట !
అద్దె కవన మధువు నామె నోట ! 3

అష్ట దిగ్గజాల్ మోయగా, ఆంధ్ర సాహి
తీ ప్రబంధ మండిత మహాదివ్య 'భువన
విజయ' విస్తృత విఖ్యాత విశ్వ మకుట
ధారి - సర్వజ్ఞ శేషాహితాన యయ్యె ! 4

పలుకది యున్నంత వరకు -
తెలుగది యున్నంతవరకు - దేదీప్యముగాన్
వెలుగది యున్నంత వరకు -
నిలుచును శ్రీ కృష్ణరాయ నృప! నీ యశమున్ ! 5



# MAXIMS IN WRITER - ANOYMOUS "GUVVALA CHENNA"

- *Prof. Kakuturu Naga Raja Rao,* Hyderabad

"Temples may fall down / wells may be dried up and buried, Floods cause breaching of Tanks., Forests may be denuded of stress, But the one (i.e. poem) remains".

So says the poet "Guvvala Chenna" . Poetry is indestructible and is not transient. One may be reminded of Shelley's maxim that the 'One remains, the many change and pass,' though the comparison is far - fetched.

The book with about one hundred verses, entitled "Guvvala Chenna Satakamu" Gains its popularity as even the illiterate find it easy to get the verses by heart easily and recite them and also because they are replete with meaning containing Universal truths, maxims and message.

"O, Pardon me Sarathy, I'm a sinner Now I've come to you, resue me. "So prasys the poet (whose name is not all mentioned any where in this book of verses) seeking his blessings. The book is dedicated to one Lord "Chenna" the shortened form the Chenna Kesava, and another name for Lord Vishnu, one of the Trinity. Temples exist in Andhra Pradesh (South India), for Chennakesava, in places like Pushpagiri of Kadapa District and on a hill -top near Guntur. The Maha Bharata refers to Krishna (Kesava / Vishnu) who jumps out of the Chariot at the Grand old Man Bhisma, and at that time Lord Krishna's locks of hair, in that fit of emotion lay scattered on Krishna's head and hence, Chenna Kesava (Chenna meaning scattered; Kesava, meaning Krishna)

In another poem the poet speaks of the corner - stone to test true friendship and relationship.

"Friend in distress, life - partner in poverty; Brothers and cousins in distribution / share of property".

Examples of Karna of the Maha Bharata who was true to salt in refusing to desert Suyodhana and join Pandavas despite Krishna's alluring words and promises to test him. Damayanti, the wife of king Nala stood by her husband through thick and thin stand as shining examples in this respect.

Wealth is fickle - minded, the poet feels. Like Fortune's wheel or Giant wheel turning. The Kubera, (God of wealth) may become the kuchela (Symbol of Poversty - stricken state)

"In wealth, man should earn name and fame, what wealth? Is it a mount Olympus not to be shaken!" In the opinion of the poet, wealth is to be used for the welfare of society and well - being of the people.

Ayurveda has a special place in the Indian system of Medicine. In fact, the small box containing all ingredients like black - pepper, coriander leaves and asafoetida (Popu Box commonly called in Telugu) is said to be the Health - Box of the Kitchen.

"Chenna, pieces of crushed pepper with ghee, Boiled, if taken as first - gulp during meal taking would act as anti - indigestive power and curative".

The modern man suffering from ailments, indigestion, owing to overeating, should take the clue from the lines mentioned above.

"Eat according to the capacity to digest; Live with wife interested in your well -being".The evil effects of over eating brings in indigestion and the like in its wake. So the poet advises readers to eat according to the capacity to digest. He also suggests that one should choose, the woman who is solely interested in his welfare, as the life partner otherwise life which ought to be a heaven becomes a hell - which must have been experiences by many unfortunate husbands..!

Low - minded people should be avoided at all costs and it is no use trying to transform them to the golden mien of goodness.

"Enlightening a low - minded one like sculptor adding hues and art to a dung-doll - will it transform it!" This verse bears resemblance and similarity to other writers like Vemana and Sumathi. Authority or power vested in a low - minded fellow is like making a scorpion the ruler, only to get stung again and again and again ! It is also like enthroning a Dog on the throne at an auspicious time. Can it change its nature ? It is a rhetorical question like" can an Ethiopian change his skin or a leopard its spots? " The poet further asks," surrounded by various musical instruments can the playing ox be called the Lord?"

The poem about the low or mean - mindedness reminds one of Bhaskara Sataka', where the poet says, "The monkey on the top most branch of a Tree with the hordes of mighty Lions and Elephants below." Another poet Pandit Rayalu echoes the same sense when he writes," O Cat, be not proud that thou movest freely, among the harems and royal courts, thinking the entire area is yours / (You are not the Lord of all that survey) Remember for the coronation of the Prince - Designate, It's only the Cub- Elephant, that is tied to, at the outskirts that is invited and not you!".

Those who go for prostitutes are also the targets of the arrows from the bow of the poet Guvvala Chenna.

"First money wealth, then Lands / Pledge (mortgage) and selling them a way / Then wife's ornaments, jewellery these are all the features of a he going for other women."

This verse again makes one remind of words of the scholar in "Chintamani" (a play by the late Sri Kallakuri Narayana Rao) wherein he, enamoured of Chintamani, having lost his entire property to her speaks pathetically.

"I have given away to you the mango - grove/ presented to me by my mother - in - law like a Dog in your house watching ! I'm like this, O Chintamani" ! a fitting lesson to all who unfortunately go to women of low morals!

"No name either here (on earth ) or there (other world) for the son who childs and turns away mother, feeling/ that he has got his wife".

A satire and attack on the present - day world, where many married men in most cases drive away mothers from house. Another Telugu poet's words "mother becomes poison, wife becomes jaggery" may ring in readers minds.

Man's life or Human life itself is superior and unique to the birth of other living beings. Unaware of this man plays havoc with himself and others. Bhagawan Sri Ramana Maharshi of Thirumannamalai advises people to think "Who am I?" and this self - realization is a virtue.

The writer of "Guvvala Chenna" too says: "Whereever he is - man should learn to know himself and live accordingly."

Negroes and white men taking food at the common Table Brotherhood had been the cherished dream of the late Martin Luther King Jr; In Andhra Pradesh " Chaapala Kudu" during the Bramha Naidu's regime in the Palanadu area, where all people, without the distinction and discrimination of class, caste or stature used to sit together and had their meal.

"Some rich thinking of self - importance / Vainly create differences while dining food / which is considered improper by wise men".

It is high - time Satakas are presented for study from the elementary school level in education so as to inculcate in children essential values from the formative period in one's life.

# తెలుగు భావితరాలకు వెలుగు

- షేక్ అబ్దుల్ హకీం జాని, తెనాలి

తెలుగ దేలయన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకండ!
ఎల్లనృపులు గొలువ నెరుగవే బాసాడి
దేశభాషలందు తెలుగులెస్స!

ఈ విధంగా విజయనగర ప్రభువు శ్రీకృష్ణదేవరాయల వారు తెలుగుభాషను కీర్తించారు. తెలుగుభాష అత్యంత ప్రాచీనమైనది. భారతదేశంలో ఎక్కువగా మాట్లాడే భాష హిందీ. ఇది 11 ప్రాంతీయ భాషల సమ్మేళనం. అయితే ప్రపంచవ్యాప్తంగా 120 దేశాలలో 15 కోట్లమంది తెలుగువారున్నట్లు ఒక అంచనా. మన దేశంలోని 20 రాష్ట్రాలలో తెలుగువారున్నారు. తమిళనాడులో 41 శాతం, కర్నాటకలో 33 శాతం తెలుగువారు ఉన్నారు. ఈ రెండు రాష్ట్రాలలో తెలుగు మాట్లాడే ప్రజలు నివసిస్తున్న గ్రామాలు సైతం అధికంగానే ఉన్నాయి. ప్రపంచంలో ఎక్కువమంది మాట్లాడే భాషల్లో తెలుగు ఆరవస్థానాన్ని సంపాదించుకుంది. కావ్యనిర్మాణానికి ఉపయోగించే వ్యాకరణం, ఛందస్సు, నిందాస్తుతి, వ్యాజనింద, లోకోక్తులు, సామెతలు, చాటువులు, పద్యాలు, అవధాన ప్రక్రియ ఇత్యాదివి తెలుగుభాషకు వన్నె తెచ్చాయి.

వాల్మీకి రామాయణంలో రామలక్ష్మణులు దండకారణ్యానికి వచ్చే సందర్భంలో ఆంధ్రదేశంతో పాటు పలుదేశాల ఉనికిని గూర్చి చక్కగా వివరించారు. భరతుడు నాట్యశాస్త్రంలో దక్షిణాపథ రాజ్యాలలో ఆంధ్ర రాజ్యం ఒకటి అన్నారు. క్రీ.పూ.600 సంవత్సరం నాటికి ఐతరేయం అనే ఋగ్వేద బ్రాహ్మణంలో ఆంధ్ర అనే పదప్రయోగం కనిపిస్తుంది. క్రీ.శ. 2వ శతాబ్దంలోని బౌద్ధ వాఙ్మయంలో ఆంధ్రుల ప్రస్తావన వుంది. 3-4 శతాబ్ద కాలానికి చెందిన ముఖారి ఈశానవర్మ శాసనంలో ఆంధ్రాధిపతి అని పేర్కొన్నారు. 10వ శతాబ్దం నుండి తెలుగు, తెనుగు పదాలు విరివిగా వాడకంలోకి వచ్చాయి. మౌర్య చంద్రగుప్తుని ఆస్థానంలో గల మెగస్తనీస్ మౌర్యుల పిదప ఆంధ్రులే బలవంతులని పేర్కొన్నారు. హాలుడు రచించిన గాథాసప్తశతి గ్రంథ రచనాకాలానికే తెలుగుభాష వాడుకలో ఉన్నట్లు చారిత్రక ఆధారాల వల్ల తెలుస్తుంది.

**శాసనాలు**

నన్నయకు ముందే తెలుగు భాషపై అనేక శాసనాలను ఆవిష్కరించారు. కొన్ని శిలాశాసనాలు కాగా మరికొన్ని తామ్రశాసనాలు. నన్నయకు పూర్వం కందుకూరు, అద్దంకి, కొఅవి శాసనాలలో కావ్యభాషా శైలి కానవస్తుంది. క్రీ.పూ.200 నుండి క్రీ.శ.6వ శతాబ్దం వరకు తెలుగు శాసనాలు ప్రాకృత, సంస్కృత భాషల్లోనే ఉండేవి. వీటిలో అక్కడక్కడ తెలుగు వ్యక్తుల పేర్లు, గ్రామాల పేర్లు ఇత్యాదివి చోటుచేసుకునేవి. క్రీ.శ.575లో కడప జిల్లా కమలాపురం తాలూకా ఎర్రగుడిపాడులోని చెన్నకేశవస్వామి ఆలయంలో 'ఎరికల్ ముత్తురాజు' వేయించిన వచన శాసనమే తెలుగులో తొలి శాసనంగా పరిగణిస్తున్నారు. దీంతో తెలుగులో శాసన భాషా యుగానికి శ్రీకారం చుట్టినట్లైంది. అనంతరం క్రీ.శ.848 ప్రాంతంలో పండరంగని అద్దంకి శాసనం తెలుగులో తరువోజ ఛందస్సులో తొలి పద్య శాసనంగా గుర్తించారు. ఆ మీదట క్రీ.శ.898లో యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో కవిత్వ పద్ధతిని తిలకించవచ్చు. ఇలా అనేక శాసనాల వల్ల తెలుగుభాష గొప్పతనాన్ని మనం తెలుసుకోవచ్చు. చాళుక్యుల కాలంనుండీ ప్రజలు అందుబాటులో ఉన్న పద్ధతుల్లో వినోదంతో ఆనందాన్ని పొందు తున్నారు. ఆనాటి ప్రజల భాషలో ద్విపదలు, త్రిపద, షట్పద, రగడలను రచించి పాడుకునేవారట. ఇంకా పర్వత పదాలు, తుమ్మెద పదాలు, నివాళులు, వెన్నెల పదాలు, శంకరపదాలు, వాలేసు పదాలు, నివాళులు ఇత్యాది జానపద గేయాలు ప్రచారంలో ఉండి తెలుగు భాష రమణీయతను చాటేవి.

**తెలుగు వాఙ్మయంలో తొలి గ్రంథం మహాభారతం**

నేడు మనం అనుకునే ఆధునిక తెలుగుభాషకు పరిణామ బీజాలు 11 నుండి 14 శతాబ్దాల మధ్యకాలంలోనే ఏర్పడినాయి. 16వ శతాబ్దం తరువాత రాయలసీమ, కోస్తాజిల్లాల మాండలీక భేదాలు ఏర్పడినాయి. తెలుగు వాఙ్మయంలో మనకు లభించిన తొలి గ్రంథం మహాభారతమని చెప్పవచ్చు. సంస్కృత భాషలోని ఈ గ్రంథ అనువాదానికి శ్రీకారం చుట్టినవాడు నన్నయ. ఇతనే తెలుగులో తొలి అనువాదకుడని తెలుస్తుంది. క్రీ.శ.1020 నుండి 1060 వరకు నన్నయ మహాభారతంలోని కొంతభాగాన్ని మాత్రమే అనువదించారు. అనంతరం తిక్కన, ఎర్రన మహాభారతాన్ని తెనుగించారు. ఈ ముగ్గురిని కలిపి కవిత్రయం అంటారు. 1000-1600 వరకు కవిత్రయ భాషా యుగంగా పిలిచారు. అనంతరం 1600-1900 వరకు తెలుగుభాష చరిత్రలో పరిణామాత్మకమైంది. ఈ కాలంలోనే అనేక నూతన సాహితీ ప్రక్రియలకు శ్రీకారం చుట్టడం జరిగింది. క్షేత్రయ్య, త్యాగరాజు భక్తి గీతాలతో పాటు అనేక ప్రబంధాలలో వాడుకభాష కావ్యభాషలో మిళితమైంది. ఆంగ్ల విద్యావిధానం ఊపందుకోక ముందు తెలుగు భాషను నాలుగు రంగాలలోనే వాడేవారు. కావ్యభాష, శాసన రచన, జానపద సాహిత్యం, సామాన్య జన వ్యవహార భాషగా వాడేవారు. శాసనభాషకు, జానపద సాహిత్యానికి సామాన్య జన వ్యవహారమే

ఆధారమని చెప్పవచ్చు. 19వ శతాబ్దం వరకు వచన సాహిత్యం తెలుగులో పెరగలేదనే చెప్పాలి. విజయనగర కాలం నుంచి తయారైన కైఫియత్‌లు, స్థల చరిత్రల్లో మాత్రమే వచన రచన కనిపించేది. ఒకప్పుడు తెలుగు అధికార భాషగా ఉన్నప్పుడు ఆంగ్ల పాలకులు సైతం విధిగా తెలుగు నేర్చుకునేవారు. ఈ నేపథ్యంలోనే సి.పి.బ్రౌన్, కాంప్‌బెల్, విలియంబ్రౌన్ ఇత్యాది అనేకమంది తెలుగు భాషను నేర్చుకుని వ్యాకరణాలు, కోశాలు సైతం రాశారు.

### తేనెలూరే అజంతభాష

తెలుగుభాషలోని పదాలు అచ్చుతో అంతమౌతాయి. అందుకే దీన్ని అజంత భాష అంటారు. ఇందులో హలంతాలు తక్కువగా ఉంటాయి. ఇటలీ భాషలోని పదాలు సైతం ఇదే విధంగా ఉండి వినసొంపుగా ఉంటాయి. అందుకే తెలుగు భాషను 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అంటారు. 1858లో చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణం ముద్రితమైంది. అనంతరం విజ్ఞానవ్యాప్తి అనేది ప్రాచీన కావ్యభాషల కంటే ప్రజలు మాట్లాడే వ్యావహారిక భాషలోనే సాధ్యమనే వాదన 1909లో మొదలైంది. అటు గిడుగు రామమూర్తిపంతులు గారు, గురజాడ అప్పారావు వ్యావహారిక భాషవైపు మొగ్గు చూపారు. అయితే గ్రాంథిక భాషదే పైచేయిగా వస్తూ 1940 తరువాత ఆధునిక భాషకు చేయూత లభించింది. మేధావుల రచనలు, వార్తాపత్రికల వల్ల వచన సాహిత్యానికి పెద్దపీట వేశారు. కథానిక, నవల, నాటిక, ఏకాంకికలు ఆవిర్భవించాయి. సినిమా, రేడియో ఇత్యాది మాధ్యమాల వల్ల మాండలీ కాలకతీతంగా ఆధునిక భాష ప్రామాణికమైంది. ఆ మీదట ప్రభుత్వ పాఠ్య పుస్తకాలు ఆధునిక భాషలోనే ఉండాలని 1964లో తిరుపతిలో నిర్ణయించారు. కారణాంతారాల ఆ ప్రక్రియలో అచ్చు కాకుండా నిలిచిపోయాయి. 1966లో తెలుగు అధికారభాషగా గుర్తింపు పొందింది. అటుపిమ్మట 1967లో తెలుగు అకాడమీవారు ముద్రించిన పుస్తకాల్లో ఆధునిక భాషను అమల్లోకి తెచ్చారు. 1969లో ఉన్నత విద్యను తెలుగులో బోధించడం మొదలుపెట్టారు. తదుపరి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు తెలుగులో పి.హెచ్.డి కోసం రాసే సిద్ధాంత వ్యాసాలు ఆధునిక భాషలో ఉండవచ్చన్నారు. అనంతరం ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ఆధునిక భాషలో విశ్వవిద్యాలయ పరీక్షలు రాయవచ్చని 1973లో తీర్మానించారు.

### భారతీయ భాషల్లో నేడు తెలుగు ద్వితీయ స్థానం

మన దేశంలోని భాషల్లో తెలుగు ద్వితీయస్థానంలో ఉంది. పలు రాష్ట్రాలు తెలుగుకు ద్వితీయభాషా స్థానాన్ని కల్పించాయి. స్వాతంత్ర్యానంతరం తెలుగుభాషలో అనేక నూతన పరిణామాలు చోటుచేసుకున్నాయి. వేల ఏళ్ళనాటి తెలుగుభాష సుదీర్ఘమైన చరిత్ర ఒక భాగమైతే, స్వాతంత్ర్యానంతర చరిత్ర మరో భాగంగా చెప్పవచ్చు. అప్పటివరకు రాజులు, రాజ్యాలు, సంస్థానాల వల్ల తెలుగు, తమిళ, కర్నాటక, ఒరిస్సా ప్రజలు పలు ప్రాంతాలలో కలిసి జీవించేవారు. తెలుగువాళ్ళంతా ఆంధ్రప్రదేశ్‌గా ఏర్పడిన పిదప మన భాషాభివృద్ధికి మార్గం మరింత సుగమమైంది. తెలుగుభాషను జాతీయ, అంతర్జాతీయ భాషగా గుర్తింపు తెచ్చుకోవాలనే తెలుగువాడి తపన నీరుగారిపోయింది. ఆంగ్లభాషపై పెంచుకున్న మక్కువ వల్ల మన భాష ఆ స్థాయికి చేరుకోలేకపోయింది. అయితే గిడుగు రామమూర్తి వంటి మహనీయుల కృషి ఫలించిందనే చెప్పాలి. ఎవరు ఎన్ని అడ్డంకులు ఏర్పరచిన వ్యావహారిక భాషదే పైచేయి అయింది. తమిళ, కన్నడ భాషలతో పోల్చుకుంటే మనం తెలుగు భాషలో అనూహ్యమైన మార్పులు తెచ్చుకున్నామనడంలో ఎటువంటి సందేహం లేదు.

### విద్యారంగంలో తెలుగు మరుగు

నేడు మన విద్యారంగంలో తెలుగుభాష విఫలమౌతుందని చెప్పడానికి ఆవేదన కలుగుతుంది. ఈ విషయంలో కొన్ని కారణాల వల్ల కొంత అసంతృప్తి కనిపిస్తుంది. తెలుగు మాతృభాషగా ఉన్న ప్రతి తెలుగువాడు తెలుగు మాధ్యమంతో విద్యాభ్యాసం చేసుకునే సౌకర్యం కల్పించాల్సిన ప్రభుత్వంవారు తమ పాఠశాలల్లోనే ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెట్టారు. ఒకవైపు పుట్టగొడుగుల్లా కార్పొరేట్ సంస్థలు పుట్టు కొస్తున్నాయి. కనీసం అయిదవ తరగతి వరకైనా పిల్లలు తెలుగు మాధ్యమంలో చదివి ఆరు నుండి ఆంగ్ల మాధ్యమంలో చదివినప్పటికీ త్రిభాషా సూత్రాన్ని అనుసరించి ఒక పాఠ్యపుస్తకమైన తెలుగును విధిగా చదవాలన్న నియమం ఉంది. నేడు కార్పొరేట్ సంస్థల్లో పదవ తరగతి చదివే విద్యార్థులు కాంపోజిట్ తెలుగు అనే అందమైన పేరుపెట్టి పరీక్షలు రాయిస్తూ తెలుగుభాషకు తీరని అన్యాయం చేస్తున్నారు. సాధారణంగా 10వ తరగతి చదివే ప్రతి విద్యార్థి పద్యభాగం, గద్యభాగంతోపాటు ఉపవాచకమైన బారిస్టర్ పార్వతీశం చదవవలసి ఉంటుంది. ఉపవాచకం చదివితే సమయం చాలా పడుతుంది. పైగా మార్కులు అంతగా రావు. అందుకని కేవలం దొడ్డిదారిన అత్యధిక మార్కులు సాధించే ప్రక్రియ కాంపోజిట్ తెలుగు. ఇది తీసుకున్న వారు ఉపవాచకమైన బారిస్టర్ పార్వతీశం చదవాల్సిన పనిలేదు. 80 మార్కులకు పద్య, గద్య భాగాల్లో మొదటి పేపర్ ఉంటే కేవలం 20 మార్కులకు సంస్కృతం ఉంటుంది. జనరల్ తెలుగు వారికంటే కొన్ని పాఠాలు తగ్గుతాయి. ఇంకా సిలబస్ కూడా తగ్గుతుంది. పైగా ఆ సంస్కృతం కూడా తెలుగులో రాయవచ్చు. ఈ ప్రక్రియలో నూటికి 99 మార్కులు వస్తాయి. అదృష్టం బాగుంటే నూటికి నూరు మార్కులు తెచ్చుకోవచ్చు. ఇంటర్‌లో అయితే అసలు తెలుగే చదవరు. సంస్కృతాన్ని తీసుకుని జవాబులు తెలుగులో రాసుకుని నూటికి నూరు మార్కులు తెచ్చుకుని ర్యాంకులు ప్రచారం చేసుకుంటున్నారు. ఈ ప్రక్రియలో అటు తెలుగు, ఇటు సంస్కృతాలు సరిగా నేర్చుకోలేక పోతున్నారు. తెల్లవారిందిమొదలు మమ్మీ, డాడీ సంస్కృతిలో మగ్గుతున్న

మన విద్యార్థులు ఆంగ్లభాష అయినా సరిగా మాట్లాడు తున్నారా అంటే అదీలేదు. అటు అమ్మానాన్నలు గొప్పగా ఇష్టపడే ఆంగ్లభాష, ఇటు భాషా పరిరక్షణలో భాగంగా తెలుగు నేర్చుకొనే ప్రక్రియలో పిల్లలు ఒత్తిడికి గురౌతున్నారు. భాష అనేది మన భావాలను మరొకరితో పంచుకోవడానికి, మన సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించు కోవడానికి వారధి. అసలు తెలుగుభాషకు ఇంతవిపత్తు రావడానికి కారణాలు పరిశీలిస్తే ఈ తప్పిదం బ్రిటీషువారిదేనని చెప్పక తప్పదు.

**ఆర్థిక అంశాలు**

బ్రిటీషువారు తమ ఆంగ్లభాషను నేర్చుకున్నట్లయితే కార్యాలయాల్లో గుమస్తాగిరి చేసే అవకాశం ఇస్తామని ఆనాడు ఎరచూపారు. నాటినుండి ఆంగ్లభాష నేర్చుకుంటే ఆర్థికంగా వెసులు బాటు ఉంటుందనే విషయం తెలుగు హృదయాలలో నాటుకు పోయింది. పెరుగుతున్న సాంకేతిక పరిజ్ఞానం సైతం తెలుగుభాషకు శాపంగా మారుతుంది. ఆంగ్లం నేర్చుకుంటే అమెరికాకు వెళ్ళవచ్చు. డాలర్ల కాసులు సంపాదించవచ్చని అనేకమంది ఋజువు చేశారు. ఇక అంతా గొర్రెల మందలా ఆంగ్లం వైపు పరుగులు తీస్తున్నారు. పైగా అంతర్జాలంలో తెలియని విషయాలను ఆంగ్ల పరిజ్ఞానముంటేనే తెలుసు కోగలమని, పొరుగు రాష్ట్రాలతోపాటు ఏదేశంలో మనుగడ సాగించి రాశుల్లా కాసులు సంపాదించవచ్చనే భావన అనేకమందికి నరనరాల్లో జీర్ణించుకు పోయింది.

**భాషా పరిరక్షణ**

మన భాష నేర్చుకోవడానికి పరాయిభాషను చులకన చేయవలసిన పనిలేదు. ఆంగ్లభాషను నేర్చుకోవద్దంటే ఎవరూ వినే పరిస్థితుల్లో లేరు. మాతృభాషలో పట్టు ఉన్నవారికి పరభాషలు తేలికగా పట్టుబడతాయి. అందుకోసమైనా తెలుగుభాషను రక్షించుకోవలసిన అవసరం ఉంది. దీనికోసం కొత్త నినాదాన్ని ప్రజల్లోకి తీసుకుని వెళ్ళాలి. "ఆర్థికంగా ఎదగడానికి కావలసినంత పరభాషను నేర్చుకోండి. అందుకు కావలసిన మనోవికాస సంపన్నత పొందడానికి తెలుగు భాషను నేర్చుకోండి" అనే నినాదం ద్వారా ప్రతి తెలుగు హృదయాన్ని జాగృతపరచి మన అమ్మ భాషపట్ల మక్కువ పెంచవలసిన అవసరం ఉంది. లేకుంటే తెలుగుభాషకు హాని కలిగే ప్రమాదం ఉంది. ఒకప్పుడు ప్రతి విద్యార్థి పద్యాలు నేర్చుకునేవారు. చివరకు ఎక్కాల పుస్తకంలో సైతం అడుగుభాగాన చక్కటి పద్యాలు ముద్రించి పిల్లలకు నైతిక విలువలు నేర్పేవారు. పద్యం అనేది తెలుగువారి సొత్తు. అటువంటి పద్యాలపట్ల నేటితరం ఆసక్తి చూపడం లేదు. టి.వి.లో సైతం ఎవరైనా కళాకారుడు పద్యాలు పాడుతుంటే వృద్ధులు వినడమేతప్ప నేటియువత తలనొప్పి అని భావించి ఛానల్ మార్చేస్తున్నారు. సురభి వంటి ప్రముఖ సంస్థలు అత్యాధునిక పరిజ్ఞానంతో పద్యనాటకాల్ని ప్రదర్శిస్తుంటే 40 ఏళ్ళు పైబడిన వారు మాత్రమే చూస్తున్నారు.

నేటి యువత కేవలం మూడు నిముషాలు సైతం ఒక ఆంగ్లపదం లేకుండా మాట్లాడలేకపోతున్నారు. ప్రపంచంలో ఏ ఇద్దరు ఒకే ప్రాంత వాసులు తారసపడినప్పుడు వారి మాతృభాషలోనే మాట్లాడుకుంటారు. కానీ మన తెలుగువారు ఇద్దరు కలిస్తే ఆంగ్లంలోనే మాట్లాడుకుంటారని ఛలోక్తులు ప్రచారంలో ఉన్నాయి. "అభ్యాసం కూసువిద్య" అన్నారు పెద్దలు. భాషపై మనం ఎంతగా ఏకాగ్రతను కేంద్రీకరిస్తామో అంతగా నేర్చుకోవచ్చు. తెలుగువారి సొత్తు అవధాన విద్య. అలా అని చెప్పి ప్రతి ఒక్కరూ అష్టావధానో, శతావధానోకా నక్కరలేదు. మన మాతృ భాషకు ద్రోహంచేయని విధంగా, దాన్ని బ్రతికించుకునే విధంగా కృషిచేస్తే చాలు. కొత్తగా వచ్చిన పదాలను పరిచయం చేసుకోవాలి. పర్యాయపదాలు, జంటపదాలు, జాతీయాలు, నానార్థాలు ఇత్యాది వాటిని తెలుసుకోవాలి. శబ్దరత్నాకరం, పదబంధ పారిజాతం, తెలుగు సామెతలు, లోకోక్తులు, ఆంధ్రసూక్తి సుధాకరం ఇత్యాది గ్రంథాలను పఠిస్తుండాలి. దినపత్రికలు, వార, మాస ప్రతికల్లో వస్తున్న భాష, భావ ప్రకటనాతీరును పరిశీలనా దృష్టితో చూడాలి. సజీవమైన భాష ఎప్పటికప్పుడు మారుతూ ఉంటుంది. దశాబ్దం క్రితం తెలుగుభాషకు ఇప్పటి తెలుగుభాషకు ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది. కాబట్టి చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలుకొని చలం, కొడవటిగంటి, చక్రపాణి, రంగనాయకమ్మ, గోపీచంద్ ఇత్యాది వారి రచనలు చదివే అలవాటు చేసుకోవాలి, బాల్యం నుండే శతక పద్యాలను భావంతో పిల్లలకు నేర్పాలి. భాషతో పాటు చక్కటి నైతిక విలువలు నేర్పినవార మౌతాము. నేడు తెలుగుభాషను నేర్పాలనే తపనతో కాకుండా మార్కులు వేటలో పిల్లల్ని చిన్నవయస్సునుండే హాస్టళ్ళలో పడేస్తున్నారు. పిల్లలు పెరిగి తన కాళ్ళపై తాను నిలబడిన తరువాత తల్లిదండ్రులను వృద్ధాశ్రమాలకు పంపిస్తున్నారు.

తెలుగుభాషను బ్రతికించుకోవడానికి అనేక సంస్కరణలు చేయాలి. మార్కుల వేటలో సంస్కృతం ద్వితీయభాషగా చదివేవారు సంస్కృతంలోనే పరీక్ష రాయాలని నియమం పెట్టాలి. ప్రభుత్వం ఉత్తర ప్రత్యుత్తర కార్యకలాపాల్లో విధిగా తెలుగును ఉపయోగించాలి. ప్రసారసాధనాల ద్వారా సరళమైన తెలుగును ప్రజలకు చేరేలా చేయాలి. మాతృభాషా బోధనలో అనూహ్యమైన మార్పులు తేవాలి. ఆధునిక భాషకోసం సమగ్రమైన వ్యాకరణాన్ని ప్రతిభావంతులైన అధ్యాపకులచే రాయించాలి. తెలుగుభాష ఉపకరణంగా మన విజ్ఞానం ఎంతగా పెరుగుతుందో భాషకూడా అంతే ఎదుగుతుంది. విద్యాసంస్థలు, దృశ్య, శ్రవణ, పత్రికామాధ్యమాలు, ప్రభుత్వం సమన్వయంగా చక్కటి సహకారంతో కృషిచేస్తే మన తెలుగుభాషకు ఎటువంటి ముప్పు వాటిల్లదు. కమ్మనైన అమ్మభాషను కాపాడుకోవడంలో ప్రతి ఆంధ్రుడూ పూనుకోవాలి. తనవంతు కర్తవ్యంగా భావించి కృషిచేస్తే అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ తెలుగుభాష సజీవంగానే ఉంటుంది. ఇందులో ఎటువంటి సందేహం లేదు. ❑

# భువన విజయం - ప్రజాకవి

- గొల్ల నారాయణరావు

'భువనవిజయం' ఒక సాహిత్య కళాప్రక్రియ. ఇంద్ర సభలు, కైలాస సభలు, వగైరాలలో ఏ పాత్రనైనా చొప్పించవచ్చు. 'భువన విజయం'లో మాత్రం రాయలు అష్టదిగ్గజాలు మాత్రమే పాల్గొంటారు. ఈ భువన విజయంలో ఒక ప్రజాకవి పాల్గొన్నాడు.

ప్రజాకవి : ముందుగా విజయనగరానికి మా విజయవాటికా నగర వాసుల దండాలు. రాయల సన్నిధి - రతనాల పెన్నిధి అని తెలిసి వచ్చాను. శ్రీకృష్ణదేవరాయల ప్రభువుకు, తిమ్మరుసయ్యకు, కవి - పండితులకు, పెద్దలకు యీ ప్రజాకవి దండాలు. మా వూరు నుండి వచ్చే ముందు మా పెద్దలు,"ఒరే అబ్బాయ్! మన పల్లెటూళ్లో ముల్లుకర్రలు - రాజాస్థానంలో పొన్నుకర్రలు" అన్నారు. పద్యాలే కాక కావ్యాలతో సహా, అప్పటికప్పుడు చెప్పగలిగిన మహాకవులున్న ఈ సభలో, పొలాలలో పశువుల మధ్య తిరిగే నేను - ఈ ఆశుకవుల మధ్య నిలబడి నశుకవిని.

ప్రజల గుండెలలోని మాటలు ఒక్కటి కూడా మరువకుండా మీకు వినిపించేందుకు నేను ఈ తాళపత్రాల మీద వ్రాసి తీసుకు వచ్చాను. నన్ను ఆశీర్వదించండి. ప్రజల నోట మా పాట - మా పాటలో మీ మాట

**సాహితీ సమరాంగణ సార్వభౌముడవు**

పద్యాలు రాసేవు - రాయలో రాయలా
యుద్ధాలు చేసేవు - రాయలో రాయలా
తాళపత్ర, గంటాలను - రాయలో రాయలా
శత్రువుల కంఠాలను - రాయలో రాయలా
ఒడిసిపట్టుకున్నావు - రాయలో రాయలా

**భువన విజయంలో కవన విజయం చేస్తున్నావు. కవి పండితులను, కళాకారులను ఆదరిస్తున్నావు.**

ఈ అష్టదిగ్గజాలతో - రాయలో రాయలా
నీ ఇష్టదిగ్గజాలతో - రాయలో రాయలా
కావ్యాల సృష్టిదిగ్గజాలతో - రాయలా రాయలా
పద్యాల వృష్టిదిగ్గజాలతో - రాయలో రాయలా
తీయ తేనెతెలుగుకు కళాపుష్టినిచ్చావు - రాయలో రాయలా

**తిమ్మరుసు అయ్యవారిని తండ్రిలా చూస్తున్నావు.**

శత్రువుల సంహారం - రాయలో రాయలా
పరదేశ వ్యాపారం - రాయలో రాయలా
రాయబార వ్యవహారం - రాయలో రాయలా
నమ్ముకున్న పరివారం - రాయలో రాయలా
దశదిశలా కీర్తించగా - రాయలో రాయలా
కన్నతండ్రిలా ప్రజలను సాకేవు - రాయలో రాయలా
కంటిరెప్పలా ప్రజలను కాచేవు - రాయలో రాయలా

**పంటల పురులను పెంచుతున్నావు. రతనాల సిరులను పంచుతున్నావు.**

చెరువులను తవ్వించి - రాయలో రాయలా
కాలువలను తీయించి - రాయలో రాయలా
భూమాత గొంతు తడిపి - రాయలో రాయలా
పల్లెటూళ్ళ గుండె నింపి - రాయలో రాయలా
అన్నమో రాయలా ! - రాయలో రాయలా
అనేవాళ్ళు లేకుండ - రాయలో రాయలా
ఏలుబడి చేశావు - రాయలో రాయలా

**తిరుపతి వెంకటేశుని సతుల సమేతంగా కొలుస్తున్నావు.**

మా యిలవేల్పు వెంకన్నను - రాయలో రాయలా
భక్తితో కొలిచావు - రాయలో రాయలా
వినయంతో విగ్రహమై - రాయలో రాయలా
ఆ స్వామి ఎదుట నిలిచావు - రాయలో రాయలా
వంద వేల ఏళ్ళైనా - రాయలో రాయలా
ధన్యభక్తుడయ్యావు - రాయలో రాయలా

**జాతులమధ్య సామరస్యాన్ని పెంచుతున్నావు. ఆముక్తమాల్యద రాశావు.**

కన్నడ ప్రభువు నీవు - రాయలో రాయలా
తమిళ పొన్ను నాయికగా - రాయలో రాయలా
తమిళ - ఓఢ్ర - కన్నడిగులు - రాయలో రాయలా
మళయాళీ - మరాఠాలు - రాయలో రాయలా
తెలుగువారి సోదరులుగా - రాయలో రాయలా
కలకాలం నిలిచేలా - రాయలో రాయలా
ధన్యుడవై వర్ధిల్లు - రాయలో రాయలా
చిరకాలం వర్ధిల్లు - రాయలో రాయలా
చరిత్రలో మిగిలేవు - రాయలో రాయలా

# రైలూ - నేనూ - ఒక పూలనది మరణమూ...

- శిఖా ఆకాష్, నూజివీడు

మా ఊరి సంతేదో రైలెక్కినట్టున్నాది
తిర్నాలేదో వీధిపట్టినట్టున్నాది
ఊరేగింపేదో మొదలైనట్టున్నాది
ఎవరెవరో ఒక ఊరై బండెక్కి నట్టున్నాది
నది ఈదుతున్న చేప ఈనినట్టు రైలంతా
క్రిక్కిరిసిన జనం
పల్లెలన్నీ పట్నానికో... పట్టణాలన్నీ పల్లెలకో...

* * *

గరీబోల్ల గల్లీ కూలీకి పోతోంది
శ్రామికుల్ని ప్రసవించే నిండుగర్భిణిలా
వాడ రైలెక్కింది
పొద్దుని సద్దిమూటజేసి
పలుగూ పారల కూలితట్టలో
కదలిపోతోంది రైలు
దినాన్ని ఒలుచుకుంటూ
యేటిగట్లని, పంటచేలని.
మసక మసక వెన్నెల్ని
కలువ పూల కలల్ని వెంటేసుకుని
మనుషుల్ని వాళ్ళ బతుకుపుటల్ని
పరిచయం చేస్తుంది
ప్రపంచాన్ని నీతో చదివిస్తుందీ రైలు
ఒక మామూలు మొక్కలా కాదు
బతుకునే ఇసుక నేలన పసుపు కొమ్ములా నాటుకుని
చెలమల్లోంచి నీటి ఊటల్లె
బుంగలు బుంగలుగా ప్రేమతో సాకి
కలలూ కన్నీళ్ళూ రక్తమూ చెమటా కలగలసిన
నిరీక్షా ఫలమేదో జీవన భరోసాయేదో
సిరిగంధాల పాటై అనుబంధాలతోటై

ఈ సాయంకాలం
రైలు ఆమై పరిమళిస్తుంది
లోని వేసవికాలాన్ని
ఒక చల్లని నదిలో ముంచి
బుట్టలో పెట్టి పెట్టెల్లోకి పదిలంగా -
వానల వేడుకకు వేదికగా మారింది
ఒక్కసారిగా
వడగళ్ళు వానేదో చిందేసినట్టు
మబ్బుల లోకమేదో ముగ్గేసినట్టు
నిట్టూర్పు సెగల హృదయాల్లో
ప్రశాంత పావురాల పల్లవేదో
రెక్క విప్పినట్టు
రంగు రంగుల సీతాకోక కలలేవో
చిగురించినట్టు
కొండలనల్లుకున్న నదిలా ఆమె
పాద స్పర్శలో
పరిమళాల పరామర్శతో
సాయంకాలం రైలు
కచేరీలో ఆనందరాగాల
అందమైన షాయిరీ -
పెట్టె పెట్టెలో పూల చెట్టు లేవో
సుతిమెత్తగా కొత్త కొత్తగా
మనసంతా వసంతాల వేణువై
వెన్నెల జలపాతాల వీణయై
రైలు
వయసు వలపుల సొగసుల నారబోస్తూ
తలకొప్పున తలపులు విరబూస్తూ...

* * *

కుబుసం విప్పిన కాలసర్పం సునామీలా
దాటేసిన గమ్యమేదో పట్టుదప్పి
బతుకు జారి
నేల రాలిన సాయంసంధ్య
నెత్తుటి పూలనదియై
ఆమె కనురెప్పల్లో ఇంటి మీద బెంగేదో
బతుకు మీద ఆశేదో బావురుమంటూ...
పెదవుల మీద పువ్వేదో
చివరి మాటొక్కటి చెప్పేందుకు –
సమీపాన రెక్కలల్లాడిస్తూ తల్లడిల్లిన
రావాకుల మాను
కన్నీటి ఊడలుదించి
కకావికలమైన సాయం రెక్కల సంధ్య
సంతాప గీతాలాలపిస్తూ...
అలవాటుగా మనుషుల వింత జాలేదో
విచిత్రమై తచ్చాడి
రైలెల్లి పోనాది
బతుకు బండాగి పోనాది
నేలపాలైన ఆకాశం
నెత్తురు మడుగై అలుక్కుపోయిన
నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ...

* * *

ఆమె ఎవరో
దించి వదిలేసిన దిగులు
నాలో నడుస్తున్న సంచలనమూ
చతికిలబడిన నవ్వూ
తెరలేచిన నల్లని భయమూ
రాత్రి కన్నీళ్ళు పెట్టిన స్వప్నమూ
వెళ్ళిపోయాక
ఇంకా నేను ఒంటరినే..
ఇది ఈ యుగానికి కాదు
మొలచిన జారుడు బండల మీంచి
వణుకుతున్న ఉదయాల్లోంచి
రాబోయే కాలాల్ని వెంటేసుకొని
కొలతలకందని దృశ్యాల్ని
దొరికినప్పుడల్లా రాజేసుకుని
ఊహల్లో సరిహద్దు రాళ్ళేసుకుని
కాలాన్నోగది చేసుకునేందుకు
మారు వేషంలో చరిత్ర
రథచక్రాల కింద
రూపాయి బిళ్ళంత బతుకు –

* * *

*(చీరాల ప్రాంతంలో రైలులో పూలమ్ముకునే ఓ తల్లి, రైలు కిందపడి మరణించిన దృశ్యం చూసి)*

# యువత ముందున్న లక్ష్యాలు

- *యర్రమిల్లి విజయలక్ష్మి*, తణుకు

ప్రపంచానికి ఒక ప్రత్యేక సందేశమివ్వటానికి మహాయోగులు ఆవిర్భవిస్తారు. భారతదేశాన్నే కాక సమస్త ప్రపంచం చేసిన యతి వరేణ్యుడు శ్రీస్వామి వివేకానంద. భారతదేశ యువజనులపైనే ఆయన ఆశలన్నీ.. విచక్షణా రహితంగా ఆధునికత వైపు పరుగులు తీస్తున్న ఈతరం యువత మన దేశపు సామాజిక, నైతిక, ఆధ్యాత్మిక విలువలను గుర్తించి ఆచరించాలంటే స్వామీజీ బోధనలు ఎంతో దోహదం చేస్తాయి.

మన దేశ జనాభాలో యువత 4వ వంతు కన్నా అధికంగా వుంటారు. స్వతంత్ర భావాలు, ఉత్సాహం, ఉద్రేకం, ఆదర్శాలతోపాటు శారీరక శక్తి కూడా వారిలో ఎక్కువగా వుంటుంది. అందువల్లనే సృజనాత్మకంగా పని చెయ్యటానికి ఏ రంగంలోనైనా కావల్సినవారు కోరబడుతున్నవారు కూడా యువజనులే! కాబట్టి బాధ్యత కూడా వారిపై ఎక్కువ వుంటుంది. యువతకు భవిష్యత్ వుంది. ఉత్సాహం - ఉత్తేజం రెండూ వారిలో సమృద్ధిగా వుంటాయి. ఉన్నత ఆదర్శాలను లక్ష్యంగా చేసుకుని కృషిచేసి పట్టుదలతో దేనినైనా సాధించగల శక్తి యువత స్వంతం. ఆదర్శం సరైనదైతే వారి ఆలోచన, ఆవేశం, కదలిక అన్నీ సవ్యదిశలోసాగి వారి వ్యక్తిత్వాలను ప్రకాశింపచేస్తాయి. గొప్పతనాన్ని సాధించటం వారి వారి హక్కు - విజయం వారి సొత్తు అయినప్పటికీ అనేకమంది వైఫల్యాలతో అస్తవ్యస్తమైన జీవితాలు గడపటం సమాజంలో చూస్తున్నాం. ఆధునిక సమాజంలో విజయుడైన వ్యక్తి ఒకరుంటే అనేక వందలమంది పరాజయాలతో నిరాశా నిస్పృహలతో కృంగిపోయే వారున్నారు. వ్యక్తులు తమసహజ సిద్ధమైన శక్తి సామర్థ్యాలను తెలివిగా సక్రమంగా వినియోగించుకోలేక పోవటమే దీనికంతకు కారణం. మన దేశంలో యువతను 4 రకాలుగా విభజించవచ్చు మొదటి వర్గం ప్రజ్ఞా వంతులు, తెలివైనవారు. వీరు కష్టించి తమ ప్రజ్ఞతో గొప్ప గౌరవనీయ మైన ఉన్నత స్థితులు పొంది జయప్రదంగా జీవిస్తారు. రెండవ వర్గం అసంతృప్తికి గురైనవారు సాధారణంగా వీరు మధ్యతరగతి వర్గానికి చెందినవారై వుంటారు. వీరిలో కొందరు సాంఘిక అసమానతకు నిరాదరణకు గురై తీవ్రమైన అసంతృప్తితో న్యూనతాభావంతో బాధపడు తుంటారు. ప్రతిఘటనగా తమ నిరాశా నిస్పృహలను ప్రకటించటానికి గుంపులలోనూ వర్గాలలోనూ చేరి ఆందోళనలతో - విద్రోహచర్యలతో సమాజానికి సమస్యగా తయారౌతారు. మూడవ వర్గంవారు దోపిడీ చేయబడిన వర్గానికి చెందినవారు. వీరిలో చాలామంది బాల్యంలోనే కూలీలుగా, సేవకులుగా, అసంఘటిత సంస్థలలో కార్యాలయాలలో కర్మాగారాలలో, హోటళ్ళలో పనివారుగా ఉపయోగపడతారు. మించిన పనిభారం బాధ్యత కనీస వేతనాలతో ఆర్థిక సమస్యలతో బతుకు భారంతో కృంగి పోతుంటారు. నాల్గవ వర్గం ఎవరూ పట్టించుకోని గ్రామీణ యువత. ఆధునిక విద్యా ఉద్యోగ సదుపాయాలు వీరికి అందు బాటులో వుండవు. చాలామటుకు వీరు కుటుంబ సమస్యలకే పరిమితమై పోయి - వృత్తిపనులు, చేతిపనులు, వ్యవసాయకూలీలుగా పరిమితమై పోతుంటారు. ఈ నాలుగు వర్గాల వారిని జాగ్రత్తగా పరిశీలిస్తే యువత లోని అసంతృప్తి ఎక్కడ వుందో తెలుస్తుంది. దేశ ప్రగతిలో పాలుపంచు కోలేక దేశ సౌభాగ్యాన్ని పెంపుచెయ్యలేక అధిక సంఖ్యాకులు పరిమిత చట్రంలో ఇరుకిరుకు జీవితం గడుపుతుంటారు.

మానవుని అసలు స్వభావం పరిపూర్ణత్వం. అతనిలో అనంతమైన శక్తి దాగివుంది. తమకు, ఇతరులకు సుఖశాంతులను పంచి ఇవ్వగల శక్తి సమర్థత తమలో వున్నాయని యువత గుర్తించగలగాలి. తమలో వున్న ఈ నిగూఢ శక్తిని గ్రహిస్తూ దానిని జాగ్రత్తగా పరిరక్షించు కోవటానికి వీలుగా నడుపుకునే జీవితమే సార్థకమౌతుంది. 'మీ నిజ స్వరూపాన్ని గురించి మీకు మీరు బోధించుకుని-ప్రతీవారికీ బోధించండి. నిద్రాణమైన ఆత్మశక్తిని మేల్కొల్పండి. అది ఎట్లా జాగృత మౌతుందో చూడండి. నిద్రిస్తున్న ఆత్మశక్తి స్వయం వేద్యమై మేల్కొనగానే శక్తి వస్తుంది. ఖ్యాతి వస్తుంది. మంచి వస్తుంది. మాన్యత వస్తుంది. పవిత్రత పరమ ఐశ్వర్యం వెల్లివిరుస్తుంది, అంటారు స్వామి వివేకానంద. అయితే ప్రస్తుతం యువశక్తి ఎలా ప్రవహిస్తోందో తెలిసిందే. సరైన లక్ష్యం లేకపోవటమే జరుగుతున్న అనర్థాలకి కారణం నేటి విద్యా విధానం విద్యార్థులకొక లక్ష్యాన్నిచ్చి - దిశా నిర్దేశం చేసేదిగా లేదు. విలువలతో కూడిన విద్యా విధాన లోపం వలన యువత సంస్కార యుతంగా జీవించలేక పెడదారి తొక్కుతోంది. భావోద్రేకాలకు లోనై - స్థిరమైన భావాలు, తగిన ధైర్యం లేక ఎవరికి వారు చెల్లాచెదరై పోతున్నారు. ఇటువంటి యువశక్తిని ఏకీకృతం చేసి -ఫలప్రదం చెయ్యా లంటే ఉదాత్తమైన లక్ష్యాలను నిర్దేశించి, వారి దృష్టి జాతీయత వైపు మళ్ళించే ప్రయత్నం జరగాలి.

నేడు మన దేశంలో ఆధునికమైన విద్యాబోధన బాగా జరుగు తోంది. దాని వల్ల యువతలో ప్రాజ్ఞత పెరుగుతోంది. కానీ ఈ ప్రాజ్ఞ తను తమతమ రంగాలలో అన్వయించుకునే కళ, శక్తి మాత్రం

లోపిస్తుంది. జ్ఞాన సంపాదన ప్రాజ్ఞత అయితే – కార్యరూపంలో దానిని అనువదించే నేర్పు ప్రావీణ్యత అవుతుంది. జీవితంలో సమన్వయశక్తి కొరవడటం వల్ల ఒకరికి ఎన్ని ప్రజ్ఞలున్నా జీవితంలో అతడు విఫలమయ్యే ప్రమాదం వుంది. తనకున్న ఒక్కప్రజ్ఞనైనా సక్రమంగా వినియోగించుకోగలిగినప్పుడే వ్యక్తి విజయం పొందుతాడు. వ్యక్తి విజయం యావత్తూ అతని మీదే ఆధారపడి వుంది. 'ప్రతి చరిత్రలోనూ తమయందు విశ్వాసమున్న దేశాలు మాత్రమే గొప్ప బలిష్టమైనవయ్యాయి. ప్రతీ జీవిత చరిత్రలోనూ తమయందు తమకు విశ్వాసమున్న వ్యక్తులు మాత్రమే శక్తివంతులుగా రూపొందారు. మీరు భౌతిక సంపద కావాలనుకుంటున్నారా మీయందు విశ్వాసం కలిగి వుండండి. దానికై పాటుపడి సాధించండి. విజ్ఞానవంతులు కావాలనుకుంటున్నారా బుద్ధిపై పరిశ్రమ చెయ్యండి. మీరు మేధావులౌతారు' అంటారు స్వామి. కేవలం ఇచ్ఛాశక్తితో జీవిత లక్ష్యాలను సాధించలేం పనిచేసి దేన్నైనా పొందాలన్న కోరిక పెంచుకున్నాక అందుకవసరమైన బలాన్ని అతడూ తనలోనే సంపాదించుకున్న ఆ బలాన్ని కార్యరంగంలో తెలివిగా ఉపయోగించినప్పుడు మాత్రమే సత్ఫలితాలు పొందగలరు. ఇందుకు ఆత్మవిశ్వాసంతో కూడిన పట్టుదల – సంకల్పబలం చాలా అవసరం. ఇంద్రియాలు ఆధీనంలో లేని వారికి బయట ప్రపంచంపైన ఏ అధికారమూ లేదు. అతడు ప్రపంచానికి బానిస అవుతాడు. శక్తులన్నీ వ్యర్థమైపోయి నిర్వీర్యుడౌతాడు. విశ్వాసంతో అంతర్శక్తుల్ని పోదుపుచేసుకోవాలి బాహ్యప్రపంచంతో శారీరక స్థాయిలో విచక్షణతో ఏర్పరుచుకున్న క్రమబద్ధమైన సంబంధం వ్యక్తికి అపరిమితమైన శక్తి నిస్తుంది. అదే బ్రహ్మచర్యం. వివేకంతో శారీరక స్థాయిలో పాటించవలసిన విధి బ్రహ్మచర్యం. దీనితోపాటు శ్రద్ధ, ఆత్మ విశ్వాసం కార్యసాధకులకు అవసరం. 'మనస్సులో ఏ విషయం ఆలోచిస్తూ – అభ్యాసం చేస్తూ వుంటామో అదే మన వ్యక్తిత్వమౌతుంది. ఏదైన లక్ష్యం సాధించాలంటే దానిని గూర్చి కలలుకనండి అదే భావుకతగా మారుతుంది. అదే మీ జీవితం కావాలి. ఇదే విజయానికి మార్గం' అంటారు స్వామి వివేకానంద. మంచి లక్ష్యం, పవిత్రమైన ఉత్సాహం, విజ్ఞాన తృష్ణ, పొరుగు వారికి తోడుపడాలన్న తపన, దేశాన్ని గూర్చిన శ్రద్ధ నేటి యువతీ యువకులు పెంపొందించుకోవలసిన సల్లక్షణాలు.

ఆధునిక కాలంలో మనం గమనిస్తున్న మరో ప్రమాదం ఇతర దేశాలకు ఉపయోగపడిన ప్రతిదానిని మన దేశంలో అమలు చెయ్యాలనుకోవటం. మన అవసరాలను పాశ్చాత్యదృష్టితో చూడటం వల్ల మన జాతీయ విధానాలు, పద్ధతులు, సాంప్రదాయాలు ఈ కాలానికి పనికి రానివిగా భావించబడుతున్నాయి. కానీ సక్రమమైన కోణంలో ఆలోచిస్తే మన జీవనాడి ఎక్కడ వుందో తెలుస్తుంది. ఆధునిక కాలంలో మనిషి ఐహిక భోగాలకు బానిసగా మారుతూ తన జీవితానికి నిజమైన అర్థాన్ని, సార్థకతను ఇచ్చే అసలైన సత్యాన్ని గ్రహించలేకపోతున్నారు. వారి కలలకు వాస్తవ అనుభవాలకు మధ్య అగాధం ఏర్పడుతోంది. చదివిన చదువులు పరిష్కారం చూపలేక పోవటం వల్ల సమస్యలను ఎదుర్కునే వ్యక్తిగత స్థైర్యం వారిలో లోపిస్తోంది. ఈ పరిస్థితి మారాలంటే వారు చేరుకోవలసిన గమ్యం ముందే వారి ముందు ఏర్పడి వుండాలి. యదార్థమైన విలువలతో కూడిన జాగృతి కూడా వారి మనస్సులలో వృద్ధిపొందుతూ వుండాలి. ఈ విషయంలో స్వామీజీ ఇలా అంటారు. 'ధనం రక్షించదు... కీర్తి రక్షించదు – ప్రతిష్ట రక్షించదు.. పాండిత్యం రక్షించదు.. కష్టపరంపరలు అనే దుర్భేద్యమైన అంతరాయాలను చీల్చుకుని పోగలిగేది శీలమే... తేజమును కలిగి వుండు... కార్యదీక్ష వహింపుడు అన్ని వైపులకు వ్యాపింపుడు నాయకత్వం వహించునప్పుడు సేవకులుగా మెలగండి నిస్వార్థంతో వుండండి.. సత్యమును అంటిపెట్టుకోండి. ఓర్మి కలిగి వుండండి. అపారమైన ఓర్మి కలిగివుంటే ఇక విజయం మీదే' పాశ్చాత్య దేశాలు పనిచేసి వ్యక్తియొక్క శక్తిని ప్రదర్శించమంటాయి – సహించుటచే మీ శక్తిని ప్రదర్శించమంటుంది భారత దేశం. మానవుడు ఎంత ఎక్కువ సముపార్జించుకో గలడనే సమస్యను పాశ్చాత్యదేశాలు పరిష్కరించాయి. మానవుడు ఎంత తక్కువతో జీవించగలడనే సమస్యను భారతదేశం పరిష్కరించింది.

తమ అశక్తత వల్ల తామే బాధపడుతూ పెడదారిన పడిపోతూ అశాంతి పాలయ్యే యువతకు మతం అవసరం ఎంతోవుంది. మతం అంటే లోక పరిస్థితులు తీర్చే ప్రయత్నంకాదు. మనిషి కోరికలు తీర్చటం–ఉన్నత జీవన ప్రమాణాలను కలిగించటం మతం లక్ష్యం కాదు.మతం మనిషికి జీవితకళను నేర్పి–నైతిక విలువలను పెంపొందింప చేస్తుంది. దానివలన అన్ని పరిస్థితులను సమర్థవంతంగా ఎదుర్కొనగల ఆత్మస్థైర్యం మనిషికి లభిస్తుంది. 'ఈ జాతి జాతీయ జీవన సంగీతానికంతటికీ జీవస్వరం మతం. ఈ విశ్వమంతా ఆత్మ స్వరూపమని బోధిస్తుందనీ – దాన్ని లలోపేతం చేస్తే మిగిలినవన్నీ వాటికవే చక్కబడతాయనీ – మారే ప్రపంచంలోని అన్ని సమస్యలనూ వ్యక్తి జీవితంలోని అన్ని పరిస్థితులను శక్తియుతంగా పరిష్కరించుకునే సమర్థత ఏర్పడుతుందని స్వామి ఆధునిక మానవుడికి మతం ఏ విధంగా మార్గదర్శి అవుతుందో వివరిస్తారు. మతమంటే వ్యక్తి తనను తాను స్వాధీనంలోకి తెచ్చుకుని పరిపూర్ణమైన జీవితాన్ని జీవించే విధానం.

'మనస్సుని లొంగదీసుకో ప్రపంచాన్ని లొంగదీస్తావు' అనేది ప్రాచీన ఋషుల నినాదం. కానీ ఈ ఆధునిక మానవుడు మాత్రం తన అంతర వ్యక్తిత్వాన్ని బాగుచేసుకోవటం కన్నా బాహ్యప్రపంచాన్ని

తీర్చిదిద్దటంలోనే ఎక్కువ శ్రద్ధచూపుతున్నాడు. వివేచనాయుతమైన బుద్ధితో మనలను మనం విమర్శనాత్మకంగా పరిశీలించి తెలుసుకునే విధానాన్ని విజ్ఞానశాస్త్రం నేర్పలేదు. ప్రపంచాన్ని సమగ్రంగా అనుభవం లోకి తెచ్చుకోవటానికి శరీరం, మనస్సు, బుద్ధి అనే మూడు పరికరాలు మనకి వున్నాయి. ఈ మూడింటిని సమన్వయపరచే కళని మనిషి నేర్చుకోవాలి. బాహ్య ప్రపంచాన్ని గూర్చిన జ్ఞానమే బలమని శాస్త్రజ్ఞులు చెప్తారు. అంతర్వక్తిత్వాన్ని గూర్చిన జ్ఞానమే బలమని ఋషులు చెప్తున్నారు. ఈ జ్ఞానం వల్లనే మనిషి తనను తాను ప్రయోజనాత్మకంగా మలుచుకుంటూ – తన చుట్టూ వుండే సమాజంతో సరైన సంబంధాన్ని ఏర్పరుచుకోగలుగుతాడు. ఈ ప్రపంచంలో రాజకీయ వాదులు మనిషికి తోటి మనిషితో వున్న సంబంధాన్ని చెప్తారు. ఆర్థిక శాస్త్రవేత్తలు దేశంలోని సంపదతో మానవుని సంబంధాన్ని నిర్ణయిస్తారు. శాస్త్రజ్ఞులు నైసర్గిక ప్రకృతితో మనిషి సంబంధాన్ని నిర్దేశిస్తారు. వీటన్నిటిలో ప్రపంచము వ్యక్తి అనే రెండు అంశాలున్నాయి. ప్రపంచం – ప్రపంచంలో జరిగే సంఘటనలు వ్యక్తి ఆధీనంలో లేవు. కానీ తన మీద తను స్వాధీనం సంపాదించుకోగలడు దృష్టిని తనవైపుకు మరల్చుకుని, తనను తాను సరిదిద్దుకుంటే ప్రపంచంలో ఆరోగ్యవంతమైన సంబంధాన్ని పెంచుకోగలడు. కారులో ప్రయాణించేటప్పుడు మరమత్తులో వున్న రోడ్డు ఎదురైతే రోడ్డును సరిచేసి ప్రయాణించాలనుకునేవాడు అవివేకి. దిశను మార్చుకుని మంచి మార్గంలో ప్రయాణం చేసేవాడు వివేకి. ఎవరికైనా ఓటమి కలగటం ఆశయలోపం వల్లకాదు సమాజంతో తప్పుగా వ్యవహరించటమే వారి ఓటమికి కారణమౌతుంది. యువత ఏదో ఒక ఆదర్శాన్ని లక్ష్యంగా కలిగి వుండటం మంచిది. ఏదన్నా ఒక ఆదర్శాన్ని కలిగి వున్న వ్యక్తి వెయ్యి తప్పులు చేస్తే ఏ ఆదర్శమూలేని వ్యక్తి ఏభైవేల తప్పులు చేస్తాడు. కాబట్టి బలంగా ధైర్యంగా వుండండి. బాధ్యత మొత్తాన్ని మీ భుజాల మీద వేసుకోండి. మీ తలరాతకు మీరే సృష్టికర్తలు అని తెలుసుకోండి. ఒక మహత్తర యదార్థమిది బలమే జీవం – బలహీనతే కారణం, భయమే మృత్యువు – భయమే పాపం, భయమే నరకము – అధర్మము. ప్రపంచంలో నెలకొని వున్న వ్యతిరేక ఆలోచనలన్నీ భయమనే దుష్టశక్తి నుంచే ఉద్భవించాయి. కావుననే 'అభీ అభీ..' (భయపడవద్దు...భయపడవద్దు) అంటారు వివేకానందులు.

నేడు చాలామందినోట ఇది చేస్తే నాకేం ప్రయోజనం అనే మాట వినిపిస్తుంది. ఏమీకోరకు... ఏ ప్రతిఫలాన్నీ ఆశించకు... నీవు ఇవ్వ వలసింది ఇచ్చివెయ్యి... దాన్ని గురించి ప్రస్తుతం తలపొయ్యను. అది వృద్ధియై – సహస్రగుణాధికమై తిరిగి నీ వద్దకు వస్తుంది నీవు దానిని లక్షింపరాదు.. మహాత్యాగం వల్లనే మహాకార్యాలు సిద్ధిస్తాయి. భారత జాతీయ ఆదర్శములు త్యాగము – సేవ! ఈ మార్గాలలో దేశాన్ని బల పరచండి. ప్రతీ జీవి సాక్షాత్తు భగవత్ స్వరూపమని గుర్తించి – దరిద్ర నారాయణులను, ఆర్తనారాయణులను లోకానికి చూపండి. కావల్సినది త్యాగము, శాంతము, నిరాడంబరత, ఉదాత్తమైన లక్ష్యం, అచంచల కృషి ఇలా యువత పెంపొందించుకోవలసిన లక్షణాలను మళ్ళీ మళ్ళీ అనేక పర్యాయాలు బోధించారు స్వామి వివేకానంద.

'ఉత్తిష్ఠత..! జాగ్రత...! ప్రాప్యవరాన్ నిబోధత.. లేవండి... మేల్కొనండి... గమ్యంచేరే వరకు విశ్రమించవద్దు... యువకులు ఉత్సాహవంతులై, బుద్ధిమంతులై, ధీరులై సేవానిరతులై వుండాలి.

ఈ దేశం యువతది. భవిష్యత్ వారిది. వారినెలా తీర్చిదిద్దితే సమాజం అలా రూపొందుతుంది. కావున వారు మన ప్రాచీన సంస్కృతి పునాదులపై – అధునాతన విజ్ఞానశాస్త్రము, సాంకేతిక నైపుణ్యమూ మేళవించి – సంఘటిత శక్తిగా ఉద్యమించి నవసమాజాన్ని నిర్మించ వలసి వుంది. తనను తాను ధనం తయారుచేసే యంత్రంగా మార్చుకుంటున్న ఈ కాలంలో మనిషి తనను తాను సంస్కరించుకుని దేశప్రగతిలో భాగస్వామ్యం వహించాలంటే స్వామి వివేకానంద ఉపదేశాలు మార్గదర్శకాలు.

# తెలుగు పద్యం- జాతీయోద్యమం

- డా॥ పానుగంటి శేషకళ, హైదరాబాద్

తెలుగు సాహిత్యంలో కొత్త పాతల మేలు కలయిక క్రొమ్మె ఱుంగులు చిమ్మిన కాలం క్రీ.శ. 1850 నుండి 1950. ఈ యుగం క్రీ.శ. 1850నుండి ప్రారంభమైంది. అంటే అప్పటికి భారతదేశంలో బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ పాలన రద్దయి బ్రిటిష్‌రాణి పరిపాలన ప్రత్యక్షంగా ఆరంభమైంది. ఈ యుగంలోనే తెలుగు నేల మీద సాంస్కృతిక పునరుజ్జీవనానికి బీజాలు పడ్డాయి. స్వాతంత్ర్య పోరాటాలు ప్రారంభమయ్యాయి. ఇలా సామాజికమైన మార్పులు అనేకం చోటు చేసుకున్నాయి. వీటన్నింటినీ సాహిత్యం తనలో ప్రతిఫలిస్తూనే ఉంది.

ఈ యుగంలో తెలుగు సాహిత్యంలో నవలాది కొత్త ప్రక్రియలు వచ్చాయి. అయినా సంప్రదాయ ప్రక్రియలంటే అభిమానం పోలేదు. అయితే ఆధునికంగా కలిగే భావాలకు, ఆధునిక ప్రక్రియలే సరియైనవని పద్యరూపంలో ఉండే సంప్రదాయ కావ్యం, ప్రబంధం, ఖండకావ్యం, శతకం వంటి ప్రక్రియలు సరిపోవని అభిప్రాయపడతారు. ఈ అభిప్రాయాన్ని పూర్వపక్షం చేస్తూ ఈ కాలంలో సుమారు 240కి పైగా కావ్యాలు వెలుగులోకి వచ్చాయి. ఈ కావ్యాలలో వస్తు వైవిధ్యాన్ని పరిశోధిస్తే అద్భుతమైన విషయాలు ఆవిష్కృతమవుతాయి.

ఏ కాలంలోనైనా తెలుగు నేలమీద ఆధ్యాత్మికతకు మొదటి స్థానం. అదే ధోరణి క్రీ.శ. 1850-1950 కాలంలో కూడా కనిపిస్తుంది. 'ఆధ్యాత్మ, గోవింద, బాల, తులసీ, సహస్రకంఠ, గోపీనాథం వంటి పేర్లతో రామాయణాలు', 'లవ కుమార శతకం' (వద్ది తాతయ్యగారు క్రీ.శ. 1900), ఇందుమతి – అజుల కథను త్రిపురాన వేంకట సూర్య ప్రసాద రాయకవి 'ఇందుమతీ మందారం' అనే పేరుతో ద్విపద రూపంలో రచించారు. రావణ చరిత్రను 'పౌలస్త్య హృదయం' పేరుతో కాటూరి వెంకటేశ్వరరావుగారు క్రీ.శ. 1937లో ఖండకావ్య రూపంలో రచించారు. ఇటువంటి కావ్యాలు ఈ కాలంలో సుమారు పదిహేను వరకు వచ్చాయి. అలాగే భారత సంబంధి కావ్యాల్లో కోలాచలం శ్రీనివాసరావుగారి 'ఆంధీకృత అగస్త్య భారతం' (క్రీ.శ. 1907), కందుకూరి వారి 'శుద్ధాంధ్ర భారత సంగ్రహం' (క్రీ.శ. 1878) అచ్చ తెలుగు ఖండకావ్యం, శొంఠి భద్రాద్రి రామశాస్త్రి క్రీ.శ. 1898లో 'శంతనూపాఖ్యానం' అనే పేరుతో పద్యకావ్యాన్ని రాశారు. అలాగే ఉత్పల సత్యనారాయణగారు క్రీ.శ. 1945లో 'కచుని వీడ్కోలు' పద్య కావ్యాన్ని గోపీనాథం వెంకటకవి క్రీ.శ. 1887లో 'శిశుపాలవధ'ను, ఆ కొండి వ్యాసమూర్తి గారు క్రీ.శ. 1933లో 'విదుల' పద్యకావ్యాన్ని రచించారు. ఇటువంటి పద్యకావ్యాలు ఈ కాలంలో సుమారు తొమ్మిది వచ్చాయి. భారత రామాయణాలను గర్భకవిత్వంలో బంధిస్తూ నిర్వచన భారతగర్భ రామాయణ కావ్యం వెలువడింది. భాగవత సంబంధి, కృష్ణ సంబంధి కావ్యాలు సుమారు తొమ్మిది వచ్చాయి. అవి విశ్వనాథసత్యనారాయణగారి 'ప్రద్యుమ్నోదయం', అల్లమరాజు సుబ్రహ్మణ్య కవి 'భద్రాపరిణయం' (క్రీ.శ. 1879), గోపీనాథం వేంకటకవి 'శ్రీకృష్ణ జన్మఖండం' (క్రీ.శ. 1889) మొదలైనవి. అలాగే పౌరాణిక కావ్యాలలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి 'ఏకావళీ పరిణయం' (క్రీ.శ. 1908). మద్దిసెట్టి పులియప్పరేడు 'కేదారవ్రత కథ' మండపాక పార్వతీశ్వరకవి 'ఈశ్వర శతకం' (క్రీ.శ.1833), నల్లూరి రంగాచార్యుల 'తిరుమంగయాళ్వారు చరిత్ర' (క్రీ.శ. 1909) మొదలైనవి.

ప్రాచీన కాలం నుండి క్షేత్రమాహాత్మ్యాలకు ప్రత్యేక స్థానం ఉంది మన సాహిత్యంలో. అందే పంథా ఈ కాలంలో కూడా కొనసాగింది. పొన్నూరు క్షేత్రమాహాత్మ్యాన్ని వివరిస్తూ కాశీ కృష్ణాచార్యులు "గోష్ఠీవన మాహాత్మ్యం' (క్రీ.శ. 1911) ఘటికాచల ప్రాశస్త్యాన్ని వివరిస్తూ కొక్కొండ వెంకటరత్నం 'ఘటికాచల మాహాత్మ్యాన్ని', మంగళగిరి క్షేత్ర మాహాత్మ్యాన్ని వివరిస్తూ 'పానకం' కావ్యాన్ని రచించారు. పుట్టపర్తి నారాయణాచార్యులు పెనుగొండ క్షేత్ర మాహాత్మ్యాన్ని వివరిస్తూ 'పెనుగొండ లక్ష్మి' పద్యకావ్యాన్ని క్రీ.శ. 1926లో రచించారు. అలాగే తిరువెళ్ళం క్షేత్ర మాహాత్మ్యాన్ని వివరిస్తూ 'బిల్వేశ్వరీయం' వంటి కావ్యాలతో పాటు 'రామచంద్రుని హంపీయాత్ర', 'వేమగిరి కొండలుదేవి శతకం', 'హంపీక్షేత్రం' వంటి కావ్యాలు వచ్చాయి.

సామాజిక ప్రతిఫలనం కావ్యాలలో కనిపిస్తుందనడానికి ఈ కాలంలో వచ్చిన జాతీయోద్యమ, ఆంధ్రోద్యమ, సంఘసంస్కరణ నేపథ్యంతో వచ్చిన కావ్యాలే నిదర్శనం. అయితం ఇందిర, భారతి అనే ద్వయం 'అన్నపూర్ణ సుభాషిత రత్నావళి'వంటి దేశభక్తి ప్రేరక పద్య కావ్యాన్ని రచించారు. దుర్భాక రాజశేఖర శతావధాని క్రీ.శ. 1950లో రచించిన 'అమరసింహుని చరిత్ర' చారిత్రక కావ్యాల్లో ఎన్నదగిందిగా కీర్తిని పొందింది. జాతీయవాదుల్ని, జాతీయోద్యమాన్ని కావ్య వస్తువులుగా గ్రహించి జంధ్యాల పాపయ్య శాస్త్రి 'ఉదయశ్రీ' (క్రీ.శ. 1944), శ్రీనివాస సోదరకవులు 'ఓరుగల్లు కోట' (క్రీ.శ. 1942), దువ్వూరి రామిరెడ్డి నైవేద్యం (క్రీ.శ. 1921), బ్రిటిష్ పాలనలో ఉన్న భారతజాతిని ఉద్ధరించే నాయకుడి అన్వేషణలో చామర్తి రాజశేఖర కవి క్రీ.శ. 1921లో 'బృందావన'కావ్యాన్ని రచించారు. భారతమాత వైశిష్ట్యాన్ని చెప్పే 'భరతమాతృ శతకం', 'భారతాంబికా శతకం', 'విజయశ్రీ' వంటి రచనలు వచ్చాయి. ఈ సమయంలోనే ఆంధ్రోద్యమ స్ఫూర్తిని కలిగిస్తూ విశ్వనాథ సత్యనారాయణ గారి 'ఆంధ్ర పౌరుషం' (క్రీ.శ. 1917), ఆంధ్రప్రశస్తి (క్రీ.శ.1917), కొండూరి వీరరాఘవా చార్యులు రచించిన 'తోరణం' (క్రీ.శ.1939), తుమ్మల సీతారామమూర్తి 'రాష్ట్రగానం' (క్రీ.శ. 1938), వజ్ఝల వెంకటేశ్వర్లుగారి 'మాతృ వందనం (క్రీ.శ.1940-47), పుట్టపర్తి నారాయణా చార్యులు గారి 'మేఘదూతం' వంటి కావ్యాలు వచ్చాయి. అలాగే సంఘసంస్కరణ కూడా ఆ కాలంలో ప్రధాన విషయమన్నది తెలిసిన విషయమే. ఈ నేపథ్యం నుండి వచ్చిన పద్య కావ్యాలకు కూడా కొదువ లేదు. సంఘ సంస్కరణలో భాగమైన అస్పృశ్యతా నివారణ, వితంతు పునర్వివాహాలు, బాల్యవివాహ నిరసనలను కావ్య వస్తువులుగా గ్రహించి పెన్మత్స సత్యనారాయణరాజుగారు 'ఆరాధన' (క్రీ.శ. 1949), జి. జోసఫ్ కవి 'కన్నీటి కబురు' (క్రీ.శ. 1943), దాసు శ్రీరాములుగారు 'తెలుగువాడు' (క్రీ.శ. 1947) వంటి కావ్యాలు

రచించారు. వాటితో పాటు 'విజయేంద్ర విజయం', 'లక్ష్మీనారద సుభాషితాలు', 'వసంత కుమారి', 'స్నేహలతా దేవి', 'హృదయాభి రామం' వంటి రచనలు వెలువడ్డాయి. ఆంగ్లసాహిత్య ప్రభావంతో తెలుగు వారిని గిలిగింతలు పెట్టింది భావకవిత్వం. తెలుగు సాహిత్యాన్ని, సాహితీ ప్రేమికులను ఇంకా చెప్పాలంటే ప్రతి తెలుగు వాడిని మరచిపోలేనంతగా ప్రభావితం చేసింది ఈ భావకవిత్వం, దానికి సంబంధించిన ఇతరాంశాలూను. ఈ ప్రక్రియలో కృష్ణశాస్త్రిగారి 'కృష్ణపక్షం' (క్రీ.శ. 1925), కొడవటిగంటి వెంకట సుబ్బయ్యగారి 'భిక్షువు', ఉదయరాజు శేషగిరిరావు గారి 'మనోరమ' (క్రీ.శ. 1928), కాళ్ళకూరి గోపాలరావుగారి 'సౌందర్య మంజరి' (క్రీ.శ. 1934), నాయని సుబ్బారావుగారి 'సౌభద్రుని ప్రణయ యాత్ర' (క్రీ.శ. 1935), రాయప్రోలు సుబ్బారావుగారి 'స్వప్నకుమారం' (క్రీ.శ. 1914) వంటి పద్య కావ్యాలు వచ్చాయి. వాటితోపాటు 'భవ్యభారతి', 'సరస్వతీ నారద విలాపం','ఉమర్ ఖయ్యాం' వంటి రచనలు వెలువడ్డాయి. ఆత్మాశ్రయధోరణిలో వచ్చిన 'పసిపాప', 'పాపాయి', 'వరలక్ష్మీ త్రిశతి' వంటి స్మృతి కావ్యాలు, రాయప్రోలువారి అమలిన శృంగారాన్ని రచనా వస్తువుగా గ్రహించి 'తృణకంకణం', కష్టకమల' వంటి రచనలు 'ప్రణయవాహిని','జలదాంగన'వంటి కావ్యాలు వచ్చాయి.

సమకాలీన సమాజపు ధోరణులు, పరిస్థితులు, భావజాలాలు తదితర అంశాలు తరువాత తరాల వారికి తెలియాలంటే జీవిత చరిత్రలు చక్కని ఆకరాలు. ఇవి భావితరాలను సమర్థవంతంగా ప్రభావితం చేస్తాయి. అటువంటి జీవిత చరిత్రలు ఈ కాలంలో పద్యరూపంలో వెలువడడం గమనించదగ్గ అంశం. గౌతమబుద్ధుని జీవితాన్ని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 'శ్రీశాలివాహన సప్తశతీ సారం' (క్రీ.శ. 1931) గానూ, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి 'గాథా సప్తశతి' (క్రీ.శ. 1944) పేరుతో బౌద్ధయుగం నాటి కథలను, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి 'జాతక కథాగుచ్ఛము' (క్రీ.శ. 1939) కావ్యాలుగానూ రచించారు. అలాగే 'రామకృష్ణ పరమహంస చరిత్ర' పేరుతో కూచి నరసింహంగారు క్రీ.శ. 1904లో రామకృష్ణ పరమ హంస జీవితాన్ని 'కల్యంధ కౌముది' పేరుతో వడ్డెపాటి నిరంజనశాస్త్రి క్రీ.శ.1909లో పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి జీవితాన్ని మహాత్మాగాంధీ జీవితాన్ని సంక్షిప్తంగా పళ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులు 'ఆత్మసమర్పణం' పేరుతో పద్యకావ్యాలుగా అక్షర బద్ధం చేశారు మనకవులు. ముదిగొండ వీరభద్రమూర్తి టంగుటూరి ప్రకాశం పంతులు జీవితాన్ని 'ఆంధ్రకేసరి' పేరుతో క్రీ.శ. 1950లో పద్యకావ్యంగా రాశారు. 'శ్రీ జయతీర్థ విజయం' పేరుతో పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు క్రీ.శ. 1937లో పద్యకావ్యాన్ని రచించారు. ఇలా జీవిత చరిత్రలల్ని పద్యకావ్యాలుగా తీర్చిదిద్ది సమాజానికి అందించారు సామాజిక స్పృహ ఉన్న మన కవులు.

ఆ కాలంనాటి కవులలో సామాజిక దృక్పథంతో పాటు స్త్రీ చైతన్య స్పృహ కూడా కనిపిస్తుంది. సుగుణవతియైన గృహిణి జీవితాన్ని మంత్రిప్రెగడ భుజంగరావుగారు క్రీ.శ. 1909లో 'చారుమతీ పరిణయ' మనే కావ్యాన్ని రాశారు. 'చిత్రకథాలహరి' పేరుతో వెంకట పార్వతీశ్వర కవులు క్రీ.శ. 1910లో స్త్రీలకు శీలం ప్రధానమంటూ పద్యకావ్యాన్ని రాశారు. అలాగే రైతు జీవన విధానాన్ని వివరించే కావ్యాలు ఎన్నో ఈ కాలంలో వచ్చాయి. దువ్వూరి రామిరెడ్డిగారి 'కృషీవలుడు' (క్రీ.శ. 1919), ఏటుకూరి వెంకటనరసయ్యగారి 'క్షేత్రలక్ష్మి' (క్రీ.శ. 1943)లో రైతుల దైనందిన జీవితాన్ని వివరించారు. అలాగే రైతులకు సంబంధించిన సామాజిక వాస్తవికతను గంగుల శాయిరెడ్డిగారు 'కాపుబిడ్డ' (క్రీ.శ. 1937)లో వర్ణించారు.

కవులు వివిధ సందర్భాలలో వేర్వేరు ఆస్థానాలను సందర్శించి నపుడు అక్కడ చెప్పిన పద్యాలను సంకలనం చేస్తూ వచ్చిన సంకలనాలూ మనకు కనబడతాయి. ఈ కాలంలో తమ అవధానాలతో, పద్యాలతో తెలుగు నేలను ఒక ఊపు ఊపిన తిరుపతి వేంకట కవుల 'నానారాజ సందర్శనం' నిజంగా సమకాలీన సమాజాన్ని అద్దంలో పట్టి చూపే దర్పణమే. కవులు తమకు ఆశ్రయమిచ్చిన సంస్థానాలను స్తుతిస్తూ సంస్థాన చరిత్రలు రాయడం ఈ కాలంలో పరిపాటి. అటువంటి వాటిలో దోమకొండ సంస్థానాన్ని వర్ణిస్తూ ఆదిపూడి ప్రభాకరామాత్యుడు క్రీ.శ. 1900లో 'ఉమాపత్యభ్యుదయం' అనే కావ్యాన్ని రాశారు. అలాగే నిష్ఠల సింహాచల సిద్ధాంతి గారు క్రీ.శ. 1885లో 'కిమ్మూరి వారి వంశావళి' పేరుతో సాలూరు సంస్థానాధిపతుల వంశక్రమాన్ని రచించారు. వీటితో పాటు నదీప్రాశస్త్యాన్ని వివరించే 'గోదావరి వర్ణన', 'కృష్ణానదీ మాహాత్మ్యాలు', 'అమరుకం',-'అనుమతి', 'ఆంధ్రభామినీ విలాసం', 'ఆంధ్ర మేఘసందేశం', 'రఘువంశం', 'గౌరాంగ చరిత్ర' 'నవయామిని' వంటి అనువాదకావ్యాలు వచ్చాయి.

ఇటువంటి రచనలతోపాటు 'ఆంధ్ర దశరూపకం', 'ఆంధ్ర ధ్వన్యాలోకం', 'ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణం' వంటి లక్షణ గ్రంథాలు వెలువడ్డాయి. వీటిలో లక్షణాలు సంస్కృతం నుండి గ్రహించినా లక్ష్యాలను మాత్రం పూర్వ కవుల కావ్యాల నుండి చూపడం కానీ, లేదా తామే స్వయంగా రచించి చూపడం గానీ చేశారు. ఇదీ వీటి ప్రత్యేకత. ఈ కాలంలో నిఘంటువు అంటే అకారాది క్రమ ఆరోపాలే తెలుసు. క్రీ.శ. 1850–1950 మధ్య కాలంలో మనకు పద్య రూప నిఘంటువులు వచ్చాయి. పద్యరూపంలో ఉండటం వల్ల ఇవి ధారణకు ఒదుగుతాయి. తూము రామదాసుగారి 'ఆంధ్ర పదనిధానము' (క్రీ.శ. 1904) తెలంగాణాలో వాడే నిత్యవ్యవహార పదాలతో కూడిన నిఘంటువు. అలాగే పూసపాటి వీరరాజుగారు కేవలం అచ్చ తెలుగు పదాలతో 'ఆంధ్ర పదాకరము' (క్రీ.శ. 1893) అనే పద్య నిఘంటువును తయారుచేశారు. వీటితో పాటు పద్య వ్యాకరణాలు, భాషా సంబంధి కావ్యాలు అనేకం వచ్చాయి. ఈ కాలంలో ఆంధ్రశబ్దచింతామణి, అథర్వణకారికలకు పద్యరూప అనువాదంగా 'నారాయణీయాంధ్ర వ్యాకరణాన్ని' శ్రీ చర్లనారాయణశాస్త్రి క్రీ.శ. 1937లో రచించారు. భాషాసంబంధి విషయాలను వివరిస్తూ గిడుగు సీతాపతిగారు క్రీ.శ. 1936లో 'భారతీ శతకాన్ని' రచించారు. గ్రాంథిక భాషావాదం మొదలైన అంశాల్ని వివరిస్తూ తాపీ ధర్మారావుగారు క్రీ.శ. 1911–25 మధ్య కాలంలో 'పాతపాళీ' అనే పేరుతో ఖండకావ్యాన్ని రచించారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఈ కాలంలో వచ్చిన సాహిత్యంలో వైవిధ్యాలు పాలు ఎక్కువగానే కనిపిస్తుంది. ఇప్పటి వరకు చెప్పుకున్నది కేవలం అర్థభాగం కూడా కాదేమో. పాతధోరణుల కొనసాగింపు, కొత్తదారుల ఆకళింపుల సమ్మేళనంగా ఈ కాలపు సాహిత్యాన్ని భావించవచ్చు.



# వరులు ప్రవరులు కావాలి

- లక్ష్మీ నారాయణ గంగిశెట్టి, హైదరాబాద్

కొండ కొన నుండి ప్రవహించే సెలయేటి నుండి చీలిన చిన్న కాలువ ప్రక్కన ఉన్నాడు ప్రవరుడు.

"మృగమద సౌరభవిభవ
ద్విగుణిత ఘనసార సాంద్రవీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపుఁ దెలుపునొక్క మారుత మొలసెన్"

*(మనుచరిత్ర 2-24)*

కస్తూరి పచ్చ కర్పూరం వంటి పరిమళ ద్రవ్యాలు కలిసిన సువాసన ఇతర వాసనలను మటుమాయం చేసే గాలి ఓ అప్సరస జాడను తెలియజేస్తుంది.

వరూధిని అందచందాల్ని కవి వర్ణిస్తున్న తీరు అనిర్వచనీయం.

"అతడావాత పరంపరా పరిమళ వ్యాపారలీలన్ జనా
న్విత మిచ్చోటయని
చేరబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణ చంచరీకచికురన్ చంద్రాస్య
చక్రస్తనిన్
నతనాభిన్ నవలానొకానొక మరున్నారీ శిరో రత్నమున్"

*(మనుచరిత్ర 2-24)*

ఆ గాలుల పరంపర వలన ప్రవరుడు మెరుపుతీగ వంటి శరీరం, కమలం వంటి కన్నులు, తుమ్మెదలవంటి కురులు, చంద్రుని వంటి ముఖము గల వరూధినిని చూచాడు.

ఆ విశ్వసౌందర్యాన్ని చూసిన ప్రవరుడు సదనపు చందాలనే చింతించాడు.

నల్ల కలువల వంటి కళ్లతో ఉన్న ప్రవరుడిని ఆమె కూడా చూచింది. నా వరుడు ప్రవరుడేనని భావించింది.

ప్రవరుడు మాట్లాడిన తీరు యువతకు అపరిచితురాలైన స్త్రీతో ఎలా మాట్లాడాలన్న విషయాన్ని తెలుపుతుంది.

*"ఎవ్వతెవేవు భీత హరిణేక్షణ"...* (మనుచరిత్ర 2-39) ఈ పద్యభావం ఇలా భవ్యంగా భాసిస్తుంది. లేడి చూపులతో చూస్తున్న లేడీ!నువ్వెవరివి? ఈ కీకారణ్యంలో ఒంటరిగా ఎలాసంచరిస్తున్నావు. నీకు భయం లేదా? నేను బ్రాహ్మణుడిని, నా పేరు ప్రవరుడు క్రొవ్విక్కి ఈ ప్రాంతానికి వచ్చాను ఏ విధంగా నేను నా ఊరికి చేరగలనో చెప్పమన్నాడు. *"తెల్పగదవే తెరువెద్ది... శుభంబు నీకగున్"* (మనుచరిత్ర 2-39) అని తన సహజ బ్రాహ్మణ సంప్రదాయ దీవెనను కూడా ఇచ్చాడు. ఇందుకు విరుద్ధంగా వరూధిని ఈ ప్రశ్నలన్నీ మనసు నచ్చినవారు మెచ్చినవారు అడిగే ప్రశ్నలుగా భావించింది. నిండైన మనస్సుతో వరూధిని *"ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెద భూసురేంద్ర"...* (మనుచరిత్ర 2-41) ఓ బ్రాహ్మణుడా అంత పెద్ద కళ్ళు పెట్టుకొని ఇతరుల్ని దారి ఎటో అడుగుతావా? ఒంటరిగాఉన్న అందమైన అమ్మాయిని పలకరించాలన్న భావమేకాని నువ్వు వచ్చిన మార్గం నీకు తెలియదా అంటుంది. వరూధిని ఉద్దేశ్యాలతో కాక కవి తన కవితాత్మక శక్తిలో భావగర్భితంగా నైతిక విలువల్ని పొందుపరిచాడు. వరూధిని యొక్క అంతరుద్దేశ్యాలతో కాక అపరిచిత పురుషునితో మాట్లాడాల్సిన పరుష విధానాన్ని సమర్థించవచ్చు.

*"చిన్ని వెన్నెల కందు వెన్నుదాని సుధాబ్ధి..."* (మనుచరిత్ర 2-43) అంటుంది వరూధిని. పాల సముద్రంలో బాలచంద్రుని వెనుక పుట్టిన లక్ష్మి మాకు తోబుట్టువు. వేణుగానంలో, కంఠ గానంలో మేటి అని తన యోగ్యతలను చెప్పుకుంటుంది.

*భూసుర కైతవ కుసుమశరాసన...* (మనుచరిత్ర 2-46) అంటూ వరూధిని తన గృహానికి ఆతిథ్యానికి ఆహ్వానించగా చేయదలచిన మర్యాదలన్నీ చేసినట్లుగానే భావించమంటాడు ప్రవరుడు. ఇంటి వద్ద తల్లిదండ్రులు వేచి ఉన్నారని తొందరగా వెళ్ళాలనే నీతిజ్ఞత ప్రదర్శిస్తాడు.

వరూధినీ *"ఎక్కడికి యూరుకాల్నిలువకింటికి* (మనుచరిత్ర 2-50) అంటూ మీ ఊరేమిటి? అచ్చట గంధపు తోటలున్నాయా అంటుంది. ఇంకా?

*"నిక్కము దాపనేల ధరణీసురనందన"* (మనుచరిత్ర 2-51) అంటూ కౌగిలి లోగిలిలోకి ఆహ్వానిస్తుంది.

జననీ జనకుల్ కడువృద్ధుల్... (మనుచరిత్ర 2-53) ఓ పిచ్చిదానా మా ఊర్లో గంధపు తోటల్లేవు. అంతకంటే సువాసనలు వెదజల్లే తల్లితండ్రులు ఉన్నారు. అయ్యో వారు ఆకలితో ఉన్నారేమో అంటాడు.

వరూధిని "ఎన్ని భవంబులం గలుగు నిక్షుశరాసన..." అంటూ నా కౌగిట చేరుట ఎన్నో జన్మల భాగ్యమని చెప్తుంది. అందుకు ప్రవరుడు బ్రాహ్మణుడికి ఇంద్రియనిగ్రహం ముఖ్యంగా ఉండాలని ఇంద్రియ నిగ్రహం లేనివాడు మోక్షం పొందజాలడని అంటాడు.

"ఆనందో బ్రహ్మ" అంటూ తన అర్థంలో ఆహ్వానం చేసి ఆనందం అనుభవించమంటూ పరిపరివిధాలా ఒప్పించే ప్రయత్నం చేస్తుంది వరూధిని. అందుకు చిరునవ్వు నవ్విన ప్రవరుడు వరూధినిని కామశాస్త్ర అధ్యాపకురాలివిలాగా ఉన్నావు అంటాడు. వేదవాక్యాలకు ఇటువంటి వక్రభాష్యం గీయడం సబబా అని ప్రశ్నిస్తాడు.

ఇంకా "తరుణీ రేపునుమాపు" అంటూ నిత్య కర్మల వల్ల ఫలితం ఏంటి అన్న వరూధిని మాటలకు ప్రవరుడు నిత్యకర్మల వల్ల కలిగే సౌఖ్యం నీకేం తెలుస్తుంది. నీవు చెప్పే సౌఖ్యాలు మీసం మీది తేనె బొట్టులా క్షణికాలని నిరసిస్తాడు.

"హా శ్రీహరి అనుచున్"... ప్రవరుడు మాయాస్త్రీల కపట కృత్యాలు ఆత్మనిగ్రహం గలవారిని ఏమీ చెయ్యలేవంటాడు.

"పాటునకింతులోర్తురే అంటూ దొంగకన్నీళ్ళు కారుస్తున్న వరూధిని భూతదయలేకపోతే అన్ని వ్యర్థాలు అంటుంది. ఆమె ఉద్దేశ్యంతోనే దీన్ని సమర్థించవచ్చు. ఇతరుల పట్ల దయ చూపడం మంచి నైతిక లక్షణం.

ప్రవరుడు "దాన జపాగ్ని హోమపరతంత్రుడనేని భవత్సా దాంబుజ ధ్యాన రతుండనేని అంటూ అగ్నిని ప్రార్థిస్తాడు.

ఇక్కడ ప్రవరుడు తనను ఇంటికి ఎప్పుడోకప్పుడు చేర్చమని ప్రార్థించలేదు. సరిగ్గా సూర్యుడు పశ్చిమ సముద్రంలో మునగక ముందే చేర్చమంటాడు. ప్రవరుడిలోని నిశ్చలనైతికత్వం అలాంటిది. సంధ్యావందనాది నిత్యకర్మ చేయాలన్న ఆతురత ప్రవరుడిలో దర్శనమిస్తుంది.

దీనిద్వారా మన సంప్రదాయాలను, ఆచారాలను గౌరవించాలనే ఉదాత్త నైతిక భావన దర్శనమిస్తుంది. వరూధిని ఇతివృత్తంలోని శృంగారాన్ని మాత్రమే చూస్తే పెద్దనార్యుని కృషి నిరర్థకంగానే కనిపిస్తుంది.

ఇంటిని గూర్చి తల్లితండ్రుల గురించి యువతీయువకులు ఆలోచించాలి. తల్లితండ్రులు చెప్పేమాటలు సరైనవని తెలుసు కునేనాటికి ఆ పిల్లలు తల్లితండ్రులయ్యుంటారు అంటారు పెద్దలు.

పెద్దన వర్ణనలో అంతర్గతంగా ఉన్న సందేశాలను, ఉపదేశాలను నిష్ఠ తిష్ఠ వేయగా కామాన్ని కాలుని వద్దకు పంపిన ప్రవరుని నిశ్చల నైతిక కోణంలో చూడాలి. అంతటి శృంగారం మితిమీరినా శాంతియుత మోక్షమే శరణ్యమని పెద్దన భావించాడు. అందుకే కావ్యాన్ని శాంతరసంతో ముగించాడు.

ప్రాచీన సాహిత్యాన్ని యువతీయువకుల వ్యక్తిత్వ వికాసానికి అనుగుణంగా సమకాలీన సామాజిక కోణాలతో సమన్వయం చేస్తూ ప్రాచీనసాహిత్యంపట్ల యువతలో గౌరవభావనని పెంపొందిం చటమే కాక ప్రకృష్ట బంధాల వలన వారి నికృష్ట బంధాలను తెంచి వారిని ఉత్తమ నాగరికులుగా తీర్చిదిద్దాలి. తద్వారా సమాజ శ్రేయస్సు కలుగుతుంది. అందుకే "విశ్వశ్రేయః కావ్యం" అన్నారు. ఇలా నైతిక విలువల భూషణంగా వరూధినీ ప్రవరుల సంభాషణని ప్రతి పాదించటంలో అతిశయోక్తిలేదు.

# ఆధునిక తెలంగాణా రచయిత్రులు

- జిల్లా కళ్యాణి, హైదరాబాద్

**వచన సాహిత్యం :**

తెలుగు సాహిత్యంలో తెలంగాణ కథకు ఒక ప్రత్యేకమైన గుర్తింపు ఉంది. ఆంధ్ర ప్రాంతాలలోని కథకంటే తెలంగాణ కథ భిన్నంగా, విలక్షణంగా కనిపిస్తుంది. పేదరికం, నిరక్షరాస్యత, భూమి సమస్య, వెట్టి చాకిరి, చాలీ చాలని వ్యవసాయం, అణచివేత మొదలైన ప్రాంతీయ సమస్యలు తెలంగాణ కథల్లో ఉండే మౌలికమైన లక్షణాలు. అందువల్లనే తెలంగాణ కథ సామాన్య మానవుని జీవితాన్ని నిలిపి వాస్తవికతా దర్పనంగా రూపొందింది.

**తెలంగాణ రచయిత్రుల కథా సాహిత్యం :**

బండారు అచ్చమాంబ మొట్టమొదటి కథ వెంకట శివుడు సంపాదకత్వంలో వెలువడిన 'తెలుగు జనానా' పత్రికలో 1898 జూలైలో 'ప్రేమ పరీక్షణం', 1898 సెప్టెంబర్‌లో 'ఎఱువు సొమ్ము పరువు చేటు' పేరిట అచ్చయ్యాయి. 'గుణవతి అగు స్త్రీ' అనే కథను ఈమె రాసిన మొదటి కథగా స్వీకరించాల్సి ఉంది అని పరిశోధకుల అభిప్రాయం. బండారు అచ్చమాంబ రాసిన పది కథలతో సంగిశెట్టి సంపాదకత్వంలో 'బండారు అచ్చమాంబ – తొలి తెలుగు కథలు' అనే పుస్తకం వెలువడింది.

రచయిత్రి ఆచార్య పి.యశోదారెడ్డి గారు మహబూబ్‌నగర్ జిల్లా, బిజినేపల్లిలో 1929లో జన్మించారు. డా. పి. యశోదా రెడ్డిగారు అచ్చమైన తెలంగాణ పలుకుబడులను, భాషను ఉపయోగించి తెలంగాణ యాసలో కథలు రచించారు. యశోదారెడ్డి రాసిన కథలు, మావూరి ముచ్చట్లు, ఎచ్చమ్మ కథలు, ధర్మశాల అనే మూడు సంపుటాలుగా వచ్చాయి. "మావూరి ముచ్చట్లు" 1972 లో వెలువడింది.

తెలంగాణ ప్రాంతానికి చెందిన మరొక రచయిత్రి గీతాంజలి. ఈమె 'బచ్చేదాని' అనే కథల సంపుటిని రచించారు. దీనిలోని 'బోన్సాయ్ మొక్క' కథ అందరికీ సుపరిచితమే. మరొక రచయిత్రి తాయమ్మ కరుణ. 'కరుణ' కలం పేరు. అసలు పేరు పద్మ. తెలంగాణ గ్రామీణ స్త్రీ జీవిత పరిణామాలు వస్తువుగా రాసిన 'తాయమ్మ కథ' ఆమెకు గొప్ప పేరు తెచ్చిపెట్టి అదే ఇంటి పేరుగా మారింది. కరుణ రాసిన పదహారు కథలతో 2009 జనవరిలో 'తాయమ్మ కథ మరికొన్ని కథలు' అనే శీర్షికతో సంకలనం వెలువడింది. తెలంగాణ ఉద్యమ నేపథ్యంగా అమృత లత, అనిశెట్టి రజిత, తుర్లపాటి లక్ష్మి, కిరణ్ బాల సంపాదకత్వంలో 2011లో "వెతలే... కథలై!" అనే పేరుతో తెలంగాణ రచయిత్రుల కథా సంకలనం వెలువడింది. ఈ గ్రంథంలో 61 మంది రచయిత్రులు కథల్ని రాసారు.

**తెలంగాణ రచయిత్రుల నవలాసాహిత్యం :**

"పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్ల ఈ ప్రక్రియ తెలుగులోకి ప్రవేశించింది. ఈ ప్రక్రియ సమాజ పరిస్థితులనూ, పరిణామాలనూ, మానవ ఔన్నత్యాన్నీ చిత్రించడంలో అద్భుత విజయాన్ని సాధించింది. కథకంటే నవల విస్తృతమైనది. జీవితాన్ని కొంత విపులంగా, విశ్వసనీయంగా చిత్రించడానికి ఈ ప్రక్రియ తోడ్పడుతుంది" (దేవకీ దేవి, తిరునగరి, 2008 : 93)

మానవ జీవితంలో ఉన్న సంక్లిష్టతను, వాస్తవికతను పూర్తి నిబద్ధతతో వస్తు శిల్పపరంగా, శక్తివంతంగా నవలలో వ్యక్తీకరించడం ముదిగంటి సుజాతారెడ్డిగారి ప్రత్యేకత. సంఘ సాయుధ పోరాటంలో గమ్యాన్ని చేరలేక జనస్రవంతిలో కలిసిన విప్లవ వీరుల గాథను నేపథ్యంగా తీసుకొని ముదిగంటి సుజాతారెడ్డి 'మలుపు తిరిగిన రథ చక్రాలు' నవలను రచించారు.

వట్టికొండ విశాలాక్షిగారు 'నిష్కామ యోగి' (1956) అనే నవలను రచించారు. అలాగే కె. రమాదేవి (నెత్తుటి ధార), జాజుల గౌరి (మన్నుబిడ్డ), తిరుకోవలూరు శశిరేఖ (కాలానికి సమాధి), శాంతి ప్రబోధ (జోగిని), గీతాంజలి (ఆమె అడవిని జయించింది), అమృత లత (సృష్టిలో తీయనిది), మాదిరెడ్డి సులోచన (80 నవలలు), పోల్కంపల్లి శాంతాదేవి (62 నవలలు), బొమ్మా హేమాదేవి (30 నవలలు), రాజీవ(2 నవలలు) సాకేతపురి కస్తూరి (బతుకమ్మ మునిగింది) మొదలైనవారు తెలంగాణ నవలా సాహిత్యాన్ని పరిపుష్టం చేసారు.

**తెలంగాణా రచయిత్రుల కవిత :**

"కేవలం పదజాల కూర్పు కవిత్వం కాదు. భాషను కవిత్వంగా మార్చే ప్రక్రియ సృజనాత్మకతకు సంబంధించింది. ఈ మర్మం తెలిసినవారే కవిత్వం రాయగలరు. భాషను తన కవిత్వావసరాలకు అనుగుణంగా వాడుకోగలిగే సామర్థ్యం ఉన్నవారే పాఠకులను సృష్టించుకోగలరు" (సుజాతారెడ్డి, ముదిగంటి (సంపా) 2005 :47) సాహిత్యంలో కవిత్వం అనేది ముందంజలో ఉంటుంది. కనుక ఏ ఉద్యమం వచ్చినప్పటికీ మొట్టమొదట స్పందించేది కవిత్వమే.

ఆధునిక యుగారంభం వరకు ప్రధానంగా పద్య కవిత్వమే తెలుగు సాహిత్య రూపంగా ఉండేది. తదనంతర సామాజికోద్యమాల ప్రభావంతో అనేక కవిత్వోద్యమాలు బయలుదేరాయి. ఈ ఉద్యమ కవిత్వోద్యమాల్లో తెలంగాణ స్త్రీలు కూడా కవిత్వాన్ని రాసారు. ఆ కవిత్వాన్నంతటిని ఈ కింద పేర్కొన్న విధంగా స్థూలంగా పరిచయం చేసాను. ఈ పత్రానికున్న పరిమితి వల్ల ఒక్కో కవిత్వ ఉద్యమంలో కేవలం ఒకే కవితను విశ్లేషించాను.

**తెలంగాణా రచయిత్రులు - విప్లవకవిత :**

తెలుగులో విప్లవ కవిత్వం 1967 నాటికి అంకురించి, మరో మూడేళ్ళల్లో, మొలకై, వేళ్లూనుకుంది. 1970 లో విప్లవ రచయితల

సంఘం (విరసం) ఏర్పడిన తరువాత రెమ్మలుగా, కొమ్మలుగా విస్తరించి తెలుగు కవిత్వ వస్తువులోనూ, వ్యక్తీకరణలోనూ విశిష్టమైన మార్పులు తెచ్చింది.

"విప్లవ సాహిత్యం, విప్లవ కవిత్వం అనే మాటలకు నిర్దిష్టమైన నిర్వచనం అంటూ లేదు. విప్లవాన్ని సమర్థిస్తూ, విప్లవోద్యమ చరిత్రను ప్రతిఫలిస్తూ విప్లవ భావాలను ప్రచారం చేస్తూ రాసే సాహిత్యం విప్లవ సాహిత్యం, రాసే కవిత్వం విప్లవ కవిత్వం. ఒక్కమాటలో చెప్పాలంటే విప్లవం వస్తువుగా వచ్చే కవిత్వం విప్లవ కవిత్వం అనవచ్చు. 'విప్లవం ఈనాటి కావ్యానికి స్పందన' అని వరవరరావు కవిత్వం రూపంలో విప్లవ కవిత్వాన్ని గురించి చెప్పిన మాట విప్లవ కవిత్వానికి ఒక రకమైన నిర్వచనం వంటిదే" (మంజులత, ఆవుల. (సంపా) 2003 : 151)

తెలంగాణ ప్రాంతం నుండి విప్లవ కవిత్వం రాస్తున్న రచయిత్రుల సంఖ్య పరిమితం. వాళ్ళలో రత్నమాల ఒకరు. "మాకు మా మట్టి తెలంగాణే కావాలి" అనే కవితను రత్నమాల ఇలా రాశారు.

*'మేం మట్టి మనుషులం హలం గట్టిన మనుషులం*
*పది జిల్లాల తెలంగాణ మట్టి బిడ్డలం*
*తప్పుకొండిక తప్పుకోండి*
*మా మట్టి తెలంగాణ రాష్ట్రం వచ్చి తీరాల్సిందే"*

**(తెలంగాణ విరసం కవిత్వం 2011:84)**

విప్లవ కవిత్వం రాసేవారు మట్టితెలంగాణ కావాలనుకుంటారు. అంటే, ప్రజాస్వామిక తెలంగాణ కావాలని కోరుకుంటున్నారు. తెలంగాణ తరతరాలుగా పెట్టుబడిదారులతో దోచుకోబడుతుంది. తెలంగాణపై ప్రాంతేతరుల దోపిడీ ఎక్కువగా ఉంది. కాబట్టి, తెలంగాణ ప్రత్యేకరాష్ట్రం వచ్చిన తర్వాత అయినా తెలంగాణను ప్రజలు పాలించుకునేలాఈ ప్రాంత పెట్టుబడిదారులు దోచుకోకుండా ఉండేం దుకు మా మట్టి తెలంగాణ కావాలని రచయిత్రి ఈ కవితను రాశారు.

### తెలంగాణా స్త్రీవాద కవిత్వం :

తెలుగు సాహిత్యంలో జాతీయోద్యమ, కాల్పనిక, అభ్యుదయ, విప్లవ కవిత్వోద్యమాల తర్వాత అత్యంత ప్రభావం చూపిన ఉద్యమం స్త్రీవాద కవిత్వోద్యమం. 1975 తర్వాత రూపుదిద్దుకొని, 1985 నుంచి స్థిరపడి క్రమంగా అన్ని ప్రక్రియలకూ విస్తరించిన ఉద్యమం స్త్రీవాద కవిత్వోద్యమం.

"స్త్రీ పురుషుల మధ్య అసమానతలున్నాయని, వాటి కారణంగా కుటుంబంలోనూ, సమాజంలోనూ స్త్రీలు అణచివేత, పీడనలకు గురవుతున్నారని తెలిసి, ఆ విధమైన స్త్రీల జీవితాలను, అనుభవాలను వస్తువుగా చేసి రాస్తే అది స్త్రీవాద కవిత్వం"(కాత్యాయని, విద్మహే. 1999:13) 'తల్లికుండ' కవితలో అనిశెట్టి రజిత తల్లి గొప్పదనాన్ని వివరించారు.కుండను తల్లికి ఉపమానంగా తీసుకున్నారు.

*"ఎవలింట్లయినా బువ్వకుండ*
*ఉన్నదంటే సాలు*
*బువ్వబెట్టె తల్లికి నిమ్మలముంటది*
*నట్టింట్ల తల్లి ఉన్నదంటే సాలు*
*బువ్వకుండ వున్నట్లే*
*పొయిమీనికి ఎక్కేకుండ*
*దిగేకుండ గా తల్లి*
*ప్యాదల బత్కుబాల బండిని తోలే*
*కొండంత అండ*
*నిండుకుండ తల్లి"*

**(అనిశెట్టి రజిత, 2002: 18,19)**

ఈ కవితలో రచయిత్రి తల్లి ఓపికనూ, సహనాన్నీ, గొప్పతనాన్నీ వివరించారు. తరతరాలుగా స్త్రీని వంటింటికే పరిమితం చేశారు. ఒక యంత్రంలా పునరుత్పత్తి కేంద్రంగా, లైంగికత్వం, జెండర్ అనే భావనలు స్త్రీ జీవితాన్ని నియంత్రిస్తున్నాయి. స్త్రీ తన అస్తిత్వాన్ని కోల్పోయి వంటింటికే పరిమితం కావటాన్ని ఈ కవితలో కవయిత్రి గొప్పగా చూపించారు.ఈమెతోపాటు శిలాలోలితకూడా సాహిత్యాన్ని సృజించారు.

### తెలంగాణా దళిత రచయిత్రులు :

భారతీయ సమాజం మిగతా సమాజాల కంటే నిర్మాణంలో ఎన్నో వైరుధ్యాలను, సంక్లిష్టతలను కలిగి ఉన్న సమాజం. మిగతా సమాజాలలో లేని వర్ణం, కులం భారతీయ సమాజం ప్రత్యేకత. ఆ కులం కూడా వేలాదిగా శాఖోపశాఖలుగా విస్తరించింది.

పంచమ కులస్థులుగా ముద్రవేసి, ఊరికి దూరంగా నెట్టబడి, నీచమైన వృత్తులు అంటగట్టి, వారిపట్ల అస్పృశ్యతను పాటిస్తూ వారిని కనీస మానవులుగా గుర్తించలేదు. భారతీయ సమాజం. దీనికి పూర్వజన్మలో చేసుకున్న 'కర్మ'లే కారణమని ఒక అభూత కల్పనతో కూడిన కర్మ సిద్ధాంతాన్ని ప్రచారం చేసింది. దీనివల్ల ఎన్నో ఏళ్ళుగా, ఎన్నో తరాలుగా ఊరికి దూరంగా, ప్రధాన జీవన స్రవంతికి దూరంగా బతుకులు వెళ్లదీస్తూ వచ్చారు.

"తరతరాలుగా అస్పృశ్యతకు గురై మతం పేరిట, సాంస్కృతికంగా హీనంగా చూడబడి, విద్యా సౌకర్యాలు కరువై, సమాజంలో ఉంటూ కూడా ప్రధాన జీవన స్రవంతికి దూరమై, ఆర్థికపరమైన అణచివేతకు, శ్రమదోపిడీకి గురైనవారు దళితులు." (మంజులత, ఆవుల. 2003 : 209) జూపాక సుభద్ర "దప్పు సప్పుల్లతో దండోరేసే నా రోజెన్నడో?" కవితలో సమాజంలో దళితుల స్థానాన్ని, వారు అనుభవిస్తున్న అస్పృశ్యత గురించి చెపుతున్నారు.

*"ఓ పెద్ద మనిషన్నట్లు / నేను కోటి రతనాల వీణనేమో గాని/*
*కోటి గాయాల గద్దను అనేది నిజం*

ఎల్లి ఎల్లమ్మ, నర్సిగాడు నర్సయ్యలు కారు రా బిడ్డలాంనా పీడలకు పాడెగట్టి నా గద్ద మీద నాకు

*బొట్టు పెట్టి బోనమండి అస్సోయి దూలాలతో*
*దప్పు సప్పుల్లతో దండోరేసే రోజెన్నడో..."*

**(సుభద్ర, జూపాక. 2009 : 82, 85)**

ఈ కవితా శీర్షికలోనే దళితవాద భావాలు కనిపిస్తున్నాయి. దళిత మాండలికంలో తెలంగాణ దళిత జీవితాన్ని చిత్రిక పట్టారు. దప్పు, దండోరా, పాడె అనే దళిత జీవితంలో నిత్యకృత్యమైన మాండలికాన్ని వాడారు. పేర్లను బట్టి కూడా దళితులపై వివక్ష జరుగుతుంది. ఎల్లి, నర్సిగాడు అనే పేర్లు దళితులను అగ్రవర్ణాల వాళ్ళు పిలిచే వైనాన్ని వివరించారు. ఈమెతో బాటు గోగు శ్యామల, జాజుల గౌరి మొదలైన తెలంగాణా రచయిత్రులు తెలంగాణ సాహిత్యాన్ని సంపద్వంతం చేసారు.

**తెలంగాణా రచయిత్రులు - మైనారిటీ అస్తిత్వవాదం :**

ఆధునిక తెలుగు కవిత్వంలో స్త్రీ, దళిత వాదాల తరువాత మైనారిటీ అస్తిత్వ వాదం ఉనికిలోకి వచ్చింది. తమల్ని ఈ దేశపౌరులుగా గుర్తించని హిందూ మతోన్మాదాన్ని ప్రశ్నిస్తూ మైనారిటీ కవిత్వం బయలుదేరింది. మేమూ ఈ దేశ మూలవాసులమేననే విషయాన్ని తమ కవిత్వం ద్వారా బలంగా ప్రకటించారు. ముస్లిం మతంలోని ఛాందస భావాల్ని కూడా తమ కవిత్వంలో ఎండగట్టారు.

ముస్లిం స్త్రీలు మతపరంగానూ, పురుషాధిక్యతపరంగానూ రెండు రకాలుగా వివక్షతను ఎదుర్కొంటున్నారు. వీరు ఇటు భారతదేశంలో తమ అస్తిత్వం ప్రశ్నార్థకం కావడాన్ని, అంతర్గతంగా ఇస్లాం మతంలోని ఛాందస భావాలను రెంటినీ వ్యతిరేకిస్తూ కవిత్వాన్ని సృష్టించారు. ఈ వరసలో ముందు షాజహానా ఉంటుంది. ఈమె అంతర్గతంగా ముస్లిం స్త్రీలపై ఉన్నటువంటి మతాధిపత్యాన్ని ఈ విధంగా కవిత్వీకరించారు.

***"ఈ క్షణమే/ నా నిశ్శబ్దాన్ని మీకు బదలాయిస్తున్నా/ బురఖాల్ని దుపట్టాల్ని/ పీలికలుగా చేసి నీ మీదకు విసిరేస్తున్నా/ కలిపి బొంత కుట్టుకొని పొర్లుకో"* (జల్‌జలా, 1998 :77)**

ముస్లింలలో పురుషులకు లేని ఆంక్షలు స్త్రీలకు ఉన్నాయనీ, వాటిని ఇంతకాలం నిశ్శబ్దంగా భరించిన స్త్రీలు ఇక భరించరని ధిక్కార స్వరాన్ని వినిపిస్తుందీ కవిత. ఇస్లాం మత సంప్రదాయమైన బురఖా పద్ధతిని వ్యతిరేకించడం, స్త్రీలను అణగదొక్కుతున్న కట్టుబాట్లను ఎండకట్టడం ఈ కవితలో కనిపిస్తుంది. షహనాజ్ ఫాతిమా, షంషాద్ బేగం, మహెజబీన్ లాంటి మైనారిటీ రచయిత్రులు తెలంగాణ సాహిత్యాన్ని సృజించారు.

**తెలంగాణ ప్రాంతీయ కవిత్వం :**

ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ, రాయలసీమ, కోస్తాంధ్ర, ఉత్తరాంధ్ర ప్రాంతాలున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఈ మూడు ప్రాంతాలు నిర్లక్ష్యానికి, వివక్షకు గురయ్యాయి. అభివృద్ధిలో వెనకబడిన ప్రాంతాలుగా మిగిలిపోయాయి. వీటిలో తెలంగాణ ప్రాంతం అన్ని రంగాల్లో ప్రాంతేతరుల అన్యాయానికి గురైంది. కనుకనే ప్రాంతీయ అస్తిత్వవాద కవిత్వమంటే తెలంగాణ కవిత్వం అనే భావన ఏర్పడింది. ఉత్తరాంధ్ర కూడా మరీ వెనుకబడిన ప్రాంతమే. కానీ, ఇప్పటికీ ఆ ప్రాంత కథల్లో వ్యక్తమైనంత వేదన కవిత్వంలో వ్యక్తం కాలేదు. రాయలసీమ సైతం వివక్షకు గురైన ప్రాంతం. కానీ, అక్కడా కథల్లోనే జీవితం వ్యక్తమయింది. కవిత్వానికి పదును తక్కువే. సూరేపల్లి సుజాత 'ఈ మట్టి పై ప్రేమెందుకు?' కవితలో ఆత్మహత్యలు చేసుకోవద్దనే సందేశాన్నిచ్చారు.

*"నీ రక్తం ఈ మట్టిని మారుస్తుందనా?*
*నీ ఆత్మ ఘోష ఈ రాళ్ళను కరిగిస్తుందనా?*
*ఒక్క క్షణం ఆలోచించకుండా*
*కాల్చుకొన్న*
*నీ చితిమంటలలో రగిలే గుండెలకి*
*బాధలో నీ వూరు మరింత ఉక్కిరిబిక్కిరి అయితుంటే*
*ఈ నేల తల్లికి ఏం సమాధానం చెపుతావు"*

**(సుజాత, సూరేపల్లి. 2010 : 54,55)**

ఆత్మహత్యల ద్వారా తెలంగాణ సమస్య పరిష్కారం కాదు. సమస్యేదైనా పోరాడి సాధించాలి అని కవయిత్రి పై కవితా పాదాలలో అంటున్నారు. బతికి సాధించాలనే సందేశాన్ని ఈ కవిత ద్వారా సూరేపల్లి సుజాత తెలంగాణ ప్రజలకు చాటింపు వేశారు. ఆత్మహత్యలు చేసుకోవడం వల్ల తెలంగాణ ప్రాంతం పోరాడే ప్రజానీకాన్ని కోల్పోతుంది. ఎంతో భవిష్యత్తు ఉన్న యువ ఉద్యమకారులు తమ జీవితాలను మధ్యలోనే బలి తీసుకుంటున్నారు. దీన్నంతటిని సూరేపల్లి సుజాతగారు కవిత్వీకరించారు. త్రివేణి, తాయమ్మ కరుణ, కిరణ్ బాల, అనిశెట్టి రజిత, నాంపెల్లి సుజాత, తిరునగరి దేవకీ దేవి, అడువాల సుజాత, హిమజ, పైడిపాల శ్యామల (నూటెంటి), తెన్నేటి సుధ, మారుబడి సుజాత, గీతాంజలి, తుర్లపాటి లక్ష్మి మొదలైన ఎందరో ప్రతిభావంతమైన కవయిత్రులు తెలంగాణలో ఉన్నారు.

తెలుగు సాహిత్య పరిపుష్టికి తెలంగాణ ప్రాంత కవయిత్రులు/ రచయిత్రులు తమ రచనల ద్వారా ఎంతో దోహదమొనర్చారు. ఎన్నో సాహిత్య, సాంస్కృతిక సంఘాలను నెలకొల్పారు.

# కుటుంబంలో యువతి

- ఎస్. సువర్చల, విజయవాడ

కుటుంబవ్యవస్థలో యువతియొక్క పాత్ర ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నది. ఒక చెల్లిగా, అక్కగా, కూతురుగా, కోడలిగా, తల్లిగా, అత్తగా మొదలగు వైవిధ్యభరితమైన పాత్రలను పోషిస్తూ పలు సమస్యల చిక్కుముడులను సహనంగా విప్పుకుంటూ, ఎంతో సమర్థతతో ముందుకు నడుస్తోంది.ప్రతి పాత్ర (పదవి) నిర్వహణలోనూ ఒక్కో రకం విధానం. అనేక ఒడుదుడుకులు. ఏ పాత్ర పోషణలో ఏ చిన్నపొరపాటు జరిగినా అంతా అస్థవ్యస్థమై అలజడులు రేగి కుటుంబ గౌరవానికి భంగం కలిగే అవకాశం ఉంది. అందుకే కుటుంబంలోని యువతి ప్రవర్తన పైనే కుటుంబ గౌరవం, సర్వతోముఖాభివృద్ధి ఆధారపడి యుంది. "ఇతరులను నొప్పించక, తానొవ్వక" అన్న సూత్రాన్ని అనుసరించడం ఆమెకు తప్పని సరి!

**ఇంటి దీపంగా యువతి :**

నాటి యువతి ఎదిగిన కూతురిగా తల్లిదండ్రులను గౌరవించేది వారి మనోభావాలను అర్థం చేసుకొని విలువనిచ్చేది. పెండ్లి విషయంలోగాని, చదువు, మరే విషయంలోగాని సున్నితంగానూ, సుస్పష్టంగా నూతన మనస్సులోని భావాల్ని వారికి తెలియ చేయలేకపోయేది. తనకు స్వతంత్ర భావాలున్నప్పటికీ, స్వయం నిర్ణయ శక్తి ఉన్నప్పటికీ భయపడో, ధైర్యం లేకో పెద్దలకు తెలియచేయలేక, అనుసరించ లేక అవస్థ పడేది! తన కంటే వాళ్ళే తమ భవిష్యత్తును తీర్చిదిద్దే సామర్థ్యం కలవారని నమ్ముతుండేది. అదీ కాక ఆ రోజుల్లో యువతికి చదువుకొనే అవకాశాలు చాలా తక్కువ. అసలు లేవనే చెప్పాలి. ఎంతసేపటికీ ఇళ్ళలోనే పరిమిత జీవనం చేసే మూధా చారాలతో గిరి గీసుకొని బావిలోని కప్పలా తనకు తెలిసినదే లోకమని వ్యవహరించేది. ఇంటికి మాత్రమే పరిమితమయి ఇంటిని చక్కగా తీర్చిదిద్దుకుంటూ భర్త, పిల్లలను, అత్తమామలను చూచుకుంటూ, వచ్చే పోయే బంధువులకు అతిథులకు వండి వడ్డించుతూ కృత కృత్యురాలయ్యేది. అలా కాక స్వంతనిర్ణయాలు తీసుకుని, పెద్దలను నొప్పించి ఇష్టానుసారం ప్రవర్తించి, చుక్కాని లేని నావలా జీవితం ఏ దరికో చేరి కూతురి పాత్రను అసంపూర్ణంగా మిగుల్చుకొన్న యువతులూ ఆనాడు అక్కడక్కడా ఉండేవారు కూడా!

కాలక్రమేణా మార్పులు వస్తున్నాయి. నేటి యువతి చదువుకొని విజ్ఞానవంతురాలవుతోంది. తనను, తన యింటిని నేర్పుగా, చాకచక్యంగా తీర్చిదిద్దుకోగల నైపుణ్యతను సంతరించుకుంటున్నది. విద్యతో పాటు వినయం, సంస్కారం అలవర్చుకొని సుఖమయ జీవితాన్ని అనుభవిస్తున్నది. ఇంటిని చక్కదిద్దుకోవడంతో పాటు బయటకు వెళ్ళి చదువుకొని విద్యావంతురాలై ఉద్యోగం చేస్తూ అనేక రంగాలలో రాణిస్తున్నది. రాజకీయలలోనూ తన ప్రతిభను చాటుకుంటోంది. ఉన్నత విద్య కోసం విదేశాలకు సహితం వెళ్ళి విజయాలను సాధిస్తోంది. కుటుంబంలో ఒక యువతి విద్యా వంతురాలైతే ఆ కుటుంబంలోని వారు విద్య నేర్చుకొనే అవకాశం ఉంటుంది. ముఖ్యంగా తన పిల్లలను వేరే ప్రయివేట్లకు పంపకుండా స్వయంగాతానే విద్యాభ్యాసం చేయిస్తూ వారికి విజ్ఞాన వికాసాలను అందించగల్గుతుంది. ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా ఈ రోజుల్లో కుటుంబంలోని యువతి తప్పనిసరిగా ఉద్యోగం చేయవలసిన పరిస్థితి ఉంటున్నది. ఉద్యోగం చేసి కుటుంబానికి ఆర్థికంగా కూడా తన సహాయ సహకారాలనందిస్తున్నది. ఉద్యోగిని అయిన యువతి ఇటు ఇంట్లో అటు ఆఫీసులో పని వత్తిడికి తట్టుకోలేక సతమతమవుతున్నది. ఇంట్లో వారు సహాయ సహకారాలను అందించగల్గితే ఆమెకు కాస్త వూరట గల్గి కొంతవరకు కృతకృత్యురాలౌతుంది. విద్యావంతురాలిగా యువతి ఏమీ చదువుకోకపోయినా సంస్కారంతో గౌరవమందుకొనే వారెందరో ఉన్నారు. విజ్ఞత గల్గిన యువతి తన కుటుంబంలోని వారిని గాని, సమాజంలోని వారితోగాని సహృదయంతో అర్థం చేసుకొని మృదు మనస్కురాలై వారిని గౌరవిస్తూ, వారిచే గౌరవింపబడుతుంది. ఈ సంస్కారానికి విద్యతోడైతే బంగారానికి తావి అబ్బినట్లే! అలా కాక పెద్ద చదువులు చదివి కూడా వివేకం కోల్పోయి తమ ప్రవర్తనతో అందరిని బాధపెట్టేవారున్నారు. అహంకారం, స్వార్థం, మితిమీరిన స్వేచ్ఛలు, చదువు వలన కలిగేవిగా ఉండకూడదు.

ముఖ్యంగా నేటి యువతిపై సినిమాల ప్రభావం, టెలివిజన్ ప్రభావం ఎక్కువ కావడంతో విదేశీ సంప్రదాయాల వ్యామోహం పెరుగుతోంది. నాగరికత పేరుతో నేటి యువతి కట్టూ, బొట్టూ విషయంలో గాని సంస్కృతీ సంప్రదాయాల విషయంలో గాని తన యింటి గౌరవాన్ని లెక్కచేయక పోవటమే ఒక గొప్పగా భావిస్తోంది.

1. వస్త్రం 2. వదనం 3.వాచం 4. విద్య 5. వినయం. ఈ వకార పంచకాలనుసరించే వ్యక్తిత్వాన్ని అంచనా వేయవచ్చు.

నేటిని ఒకనాటితో పోల్చినప్పుడు యువతి చిన్నతనంనుండీ స్వతంత్ర భావాలను అలవర్చుకోగలుగుతోంది. చదువు, పెళ్ళి మరే విషయంలోనైనా స్వంత నిర్ణయాలు తీసుకోగలుగుతోంది. అంతేస్థాయిలో భార్యాభర్తల మధ్య వివాహబంధం సడలి, బీట్లుపడి విడాకులదాకా వెళ్తోంది. పెళ్ళయి సంవత్సరం తిరిగేలోపే ఎవరికి వారై విడిపోతున్నారు. జీవితాన్ని నరకప్రాయం చేసుకుంటున్నారు. కొన్నిచోట్ల పెద్దలు నిర్ణయించిన పెళ్ళిళ్ళు సైతం విఫలమయి విడాకులు తీసుకుంటున్నారు కూడా! భార్య పాదదాసిలా పడి ఉండాలనే పురుషాహంకారం, ఆర్థిక స్వాతంత్ర్యం పొందిన స్త్రీ ఆత్మాభిమానం (ఇగో)లు రెండూ ఇందుకు సమాన బాధ్యత వహించాల్సినవే!

నేటి యువతిలో సహనం, సర్దుకుపోయే మనస్తత్వం లోపించటం ప్రధానంగా కన్పిస్తోందనే ఆరోపణ పురుషాహంకారం రహస్యంగా పని చేస్తున్న వైనాన్ని కప్పివేస్తోంది.

భార్యాభర్తలిద్దరూ సంయమనం పాటించాలి! సర్దుకుపోయే ధోరణిని అలవాటు చేసుకోవాలి. కుటుంబ, ఉద్యోగ నిర్వహణలలో యువతి తన ఆత్మాభిమానానికి (ఇగోకి) దెబ్బ తగలనీయకుండా (ఇగోని) కాపాడుకుంటూ భర్తతో, కుటుంబసభ్యులతో, ఎవరితోనైనా గాని సమయస్ఫూర్తితో, సౌహార్ద్రతతో మసలుకుంటే అంటే నొప్పించక, తానొవ్వక అన్నట్లుగా మృదువుగా సంభాషిస్తూంటే ఏ ఒడిదుడుకులూ లేక సజావుగా జీవనం సాగుతుందనుటలో సందేహం లేదు. అప్పుడు ఏ యువతీ విడాకుల జోలికి పోనక్కర లేదు. మామిడాకుల తోరణాలు కట్టుకుని ఎప్పుడూ పండుగలు జరుపుకోవచ్చు. అప్పుడు ఆ కుటుంబంలో యువతి పాత్ర విజయం సాధించినట్లే.

అన్ని సందర్భాలలోనూ ఇలానే జరుగుతుందనుకోనవసరం లేదు. కొన్నిచోట్ల స్వయం నిర్ణయాలు తీసుకొనే శక్తి ఉన్నా వాటిని ఆచరణలో పెట్టే ధైర్యం లేక, అవకాశాలు రాక వాటిని తమ మనసులోనే సమాధి చేసుకొనే యువతులున్నారు. వారు శక్తి సామర్థ్యాలుండీ ఏదీ సాధించలేక నిరాశగా ముందుకు అడుగేయలేకపోతున్నారు.

ఏ సందర్భంలోనైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏ విషయంలోనైనా సరే కుటుంబంలోని యువతి ఆత్మ స్థైర్యంతో, కుటుంబసభ్యులతో ముఖ్యంగా భర్తతో సలహా సంప్రదింపులతో, బాగా యోచించి చక్కని నిర్ణయాలు తీసుకుంటే సత్ఫలితాలను పొందవచ్చు.

కుటుంబంలోని యువతికి సమాజంతోనూ సంబంధ బాంధవ్యాలుంటాయి. చదువుకోటానికో, ఉద్యోగానికో,బంధుమిత్రుల ఇండ్లకో వెళ్ళడానికి బయటకు వస్తే ఆమెకు తగినంత భద్రత ఉండటం లేదు. ప్రతిరోజూ ఎక్కడపడితే అక్కడే అత్యాచారాలూ, అవమానాలూ జరుగుతూనే ఉన్నాయి. చోరీలు, కిడ్నాపులు, హత్యలు, ఒకటేమిటి! అసలు యువతి బయటకు వెళ్ళాలంటేనే భయం భయంగా వెళ్ళాల్సిన పరిస్థితి కనుపిస్తున్నది. ఈ విషయంలో ప్రభుత్వం కల్పించుకొని సమాజంలో శాంత భద్రతలు కల్పించవలసిన బాధ్యత ఎంతైనా వుంది!

## ఒక మంచి కోడలిగా యువతి :

ఇక కుటుంబ సభ్యుల మధ్యన యువతి ఎంతో చాకచక్యంగా తన బాధ్యతలు నిర్వర్తింపవలసి యున్నది. కూతురి పదవి నుండి ప్రమోషన్ పొంది పెళ్ళై కోడలిగా అత్తవారింట్లో భార్యామణిగా, భర్త జీవితంలోకి అడుగుపెట్టిన తరువాత యువతి బాధ్యత మరింత పెరుగుతుంది. కుటుంబ నిర్వహణాభారం తోడౌతుంది. పని ఒత్తిడి పెరుగుతుంది. కొత్త మనుషులు, కొత్త వాతావరణం, బెరుకుగా ఉంటుంది. ఇప్పటిదాకా పుట్టింట్లో అమ్మా నాన్నా, అన్న, తమ్ములు, వదినామరదళ్ళు అక్కచెల్లెళ్ళతో చనువుగా స్వతంత్రంగా గడిపిన యువతి మెట్టినింట్లో అత్తగారు మామగారు ఆడపడుచులు తోటికోడళ్ళు, బావమరుదులు నడుమ మెలగవలసివస్తుంది. వారందరికీ తన స్నేహహస్తాన్నందించి అందరికీ సౌహార్ద్రతలను పంచుతుంది. నేడు సమాజంలో అనేక కారణాల వల్ల ఎవరికి వారు విడిపోయి చిన్న కుటుంబాలే ఉన్నప్పటికీ కొన్ని ఉమ్మడి కుటుంబాలూ అక్కడక్కడా ఇంకా కనపడుతున్నాయి. కూతురు పదవి నుండి కోడలిగా మారిన యువతి తాను మెట్టినింటి ఆచార సంప్రదాయాలను, ఆహార వ్యవహారాలను ఆడవారిలో కుటుంబ పెద్ద అయిన అత్తగారి ద్వారానే తెలుసుకోవలసి ఉంటుంది. అవన్నీ ఆచరించాలి కూడా! అవన్నీ కొత్తగా ఉండొచ్చు! నచ్చకపోవచ్చును కూడా! ఇప్పటిదాకా వేరే పద్ధతులతో పెరిగిన నేను నాకు నచ్చినట్లు ఉండాలిగాని పెళ్ళైనంత మాత్రాన అవన్నీ మార్చుకుని అత్తగారు చెప్పినట్లు ఎందుకు మారాలి. అంటూ దులపరించుకుంటుంది కోడలు. తన మాట సాగలేదనే కోపం అత్త అహాన్నీ రెచ్చగొడుతుంది. ఇద్దరి ఆత్మాభిమానాలూ బుసలు గొడతాయి! (ఇగోలు) గోరంతలు కొండంతలౌతాయి. ఇద్దరికీ కొడుకు కేంద్రబిందువౌతాడు! కని పెంచాను కావున నా కొడుకు నా సొంతం. నా పక్షం పలుకుతూ, అండగా ఉండాలని తల్లి ఆరాటం; తాళి కట్టించుకున్నాక నా భర్త నావాడు నా సొంతం నా వైపు మాట్లాడాలని కోడలి పోరాటం! ఇద్దరి మధ్యన నలిగిపోతాడు కొడుకు.

తన కొడుకును చెంగున ముడేసుకొని తన చెప్పుచేతల్లో పెట్టుకున్నదని కోడలిపై చిరుబురులాడిన అత్తగారే తన అల్లుడు చాలా మంచివాడని తన కూతురు ఎంత చెపితే అంతే, గీత దాటడని, తన కూతురు చాలా అదృష్టవంతురాలని అల్లుని గూర్చి పొగుడుతూ

సంబరపడుతుంది! ఈ రెండూ వైవిధ్యమైన భావాలలో స్వార్థం కనిపిస్తుంది. నాటి కోడలేగా నేటి అత్త! కోడలిగా – తల్లిగా– అత్తగా ఒక స్త్రీలోని అంతర్మథనం, ఆ పాత్రల నిర్వహణలోని తీరు తెన్నులు ఆయా సందర్భానికి తగినట్లు మనస్తత్వాలు దర్శనమిస్తాయి. అనుభవించి ఇదంతా సహించాలంటే కొంచెం ఇబ్బందిగానే ఉంటుంది. ఇద్దరిలో సరైన సదవగాహన, సుహృద్భావన, నిస్వార్థత కలిగి ఉంటే ఈ పాత్రలలో మార్పు చోటు చేసుకుంటుంది. పెళ్ళైనంత మాత్రాన కొడుకుపై తల్లికి అధికారం, మమకారం, హక్కు ఎందుకుండగూడదు? ఆమె కెందుకు కొడుకు దూరం కావాలి? అని కోడలూ; అన్నిటికీ తానై కొడుకు తన కనుసన్నలలో ఉండాలనుకోక, కొడుకు బాధ్యతలు, అతని పనులు కొన్ని కోడలికి అప్పజెప్పి ప్రతీదానికీ తాను కల్పించు కొనక వారిద్దరి అన్యోన్యతకు దోహదకారి అవుతూ అత్తగారూ, ఒకరినొకరు అర్థం చేసుకొని మెలిగితే ఆ యిల్లు స్వర్గలోకమంత హాయినిస్తుంది. పైన చెప్పిన పాత్రలన్నిటికిని యువతి న్యాయం చేసినట్లే!

### మంచి 'అమ్మ'గా యువతి :

యువతి తల్లి అయినప్పటి నుండి తన పిల్లలపై మమకారం పెంచుకుంటూ వారిని గొప్పవారిగా తీర్చిదిద్దాలని కలలుగంటూ గారాబంగా పెంచుకొస్తుంది. తన సర్వస్వం వారి కోసం వెచ్చిస్తూ అపురూప భావనలతో ఆశాసౌధాలు నిర్మించుకుంటుంది. వారిని ముద్దాడుతూ నా బంగారు తండ్రి, నా రత్నాల కన్న, వజ్రాల మూట అంటూ మురిసి పాడుతుంది. వారు పెద్ద వారైతే బంగారంలాగా కావచ్చు. ఇత్తడీ కావచ్చు, రత్నాలుగానూ కావచ్చు, రాళ్ళగానూ మారచ్చు వారి సుకృతం బట్టి జరుగుతుంది. వాళ్ళు రత్నాలయితే తల్లిదండ్రులను దైవాలుగా భావించి పూజించి ప్రేమానురాగాలందిస్తారు. రాళ్ళు అయితే వారిని వృద్ధాశ్రమాలకు పంపేస్తారు!

ఏది ఏమైనప్పటికీ కుటుంబంలో యువతి అనేక బాధ్యతల నడుమ జీవనం సాగించవలసి వస్తున్నది. ఇంట్లో పనివత్తిడి, ఉద్యోగ నిర్వహణ! సమస్యల భారం, సమాజంలో అభద్రతాభావం! ఇవన్నీ యువతి అభ్యుదయానికి ఆనకట్టలే! ఏ ప్రభుత్వాలు ఏం చేస్తున్నాయి? ఎవరో వస్తారని ఏదో చూస్తారని ఎదురుచూస్తే ప్రయోజనం లేదు. సమాజంలో మార్పు రావాలి. జనాల మనస్తత్వాలు మారాలి. స్నేహ భావం అలవర్చుకోవాలి. మానవత్వ లక్షణాలు పెంపొందించుకోవాలి. ఇవన్నీ ఎవరికి వారు చేయాల్సినవేగాని ఎవరో వచ్చి చేసేదేమీ ఉండదు. ఒకరికొకరు పరస్పరం సహాయ సహకారాలనందించుకోవాలి!

స్థిత ప్రజ్ఞ అయిన యువతి అబలకాదు, సబల. కాలమాన పరిస్థితుల దృష్ట్యా అప్పుడప్పుడు అపజయాలు చవి చూడవలసి వచ్చిన, సమర్థతతో వాటిని అధిగమించి ఎన్నో విజయాలను చేజిక్కించు కుంటున్నది. యువతి ధీశక్తి, మనోధైర్యం సాటిలేనివి. పురుషాధిక్యత కుటుంబంలో ఆమె ఆత్మాభిమానం (ఇగో) దెబ్బ తగిలినపుడు సహనంతో, ధైర్యంతో ముందుకు అడుగేస్తున్నది. అన్ని రంగాలలో ఉద్యోగం చేస్తూ రాకెట్‌లా దూసుకుపోతోంది. అచంచలమైన ప్రేమాను గాలనందించి అమృతతుల్యమౌతుంది. అవసరమైతే ఆటంబాంబై అదరగొట్టగలదు! అమ్మ అయి అమృతం పంచగలదు. ఇంత ఔన్నత్యం, అపురూప వ్యక్తిత్వం గల యువతి ప్రగతికి, అసమానత అడ్డుగోడయి బాధిస్తున్నది. ఈ 21వ శతాబ్దినందయినా స్త్రీ పురుషుల మధ్య నున్న అసమానతను తొలగించి సమానత్వంతో గౌరవించితే ఆమె ప్రశాంతచిత్తంతో కార్యోన్ముఖురాలై కర్తవ్యాన్ని సాధించగలదు.

# హాస్యం దివ్యౌషధం

- ఆచార్య విజయశ్రీ కుప్పా, హైదరాబాదు

ప ॥ ప్రశమాయ చ రోగాణాం
శోకానాం చ నివృత్తయే ।
జఠరాగ్ని వివృద్ధాయ
హాస్యం దివ్యౌషధం స్మృతమ్ ॥

చాలా కాలం క్రితమే ప్రాచీనులు హాస్యానికి సముచిత స్థానాన్ని ఇచ్చారు. రసరాజం శృంగారం అని కవులందరూ ఏకగ్రీవ తీర్మానాలు చేసి బ్రహ్మాండమైన శృంగార రసపోషణ చేసినా – ఆ శృంగారాన్ని అంటిపెట్టుకొని హాస్యరసం ఎక్కడికక్కడ తన స్థానం నిలుపుకుంది. శృంగార భావం కలగాలంటే ముందు సున్నితమైన సంభాషణ స్త్రీ పురుషుల మధ్య చోటు చేసుకోవాలి. ఆ సున్నిత సంభాషణలో సునిశిత చమత్కారపు జల్లులూ– శృంగార భావ ప్రకటనలో చిన్నపాటి పరిహాసపు మల్లెలూ – వియోగంలో వ్యంగ్య వైభవ మొగలి ముల్లులూ అన్నీ కలిసి శృంగార హాస్యాలు ఆశ్రయ ఆశ్రితాలుగా కనిపిస్తాయి. శృంగారం లేని జీవితం ఎలా నీరసమో – హాస్యం లేని శృంగారం కూడా లవణంలేని లక్షాధికారి భోజనం లాంటిది – అప్పుడు కూడా నీరసమే అనిపిస్తుంది. మరి రసం ఆస్వాదనీయమైనది కదా! (రసః ఇతి కః పదార్థః ఉచ్యతే ఆస్వాద్యత్వాత్ – భరతుడి నా.శా. 6 అధ్యాయం)

మనిషి ఆరోగ్యంగా ఉండటానికి ఆనందం ప్రధానమైన విషయం. కాకపోతే ఆనందంగా జీవించటం ఎవరికి కూడా అంత సులభమైన విషయం కాదు. 'ఆనందోబ్రహ్మ' అన్న ఉపనిషద్వాక్యాన్ని చదవటం ఎంత సులభమో, ఆచరణకి అంత క్లిష్టతరం. కారణం ఒక్కటే! దుఃఖాన్ని జయించటం ఎలాగన్న గౌతమబుద్ధుడిని పరిశోధించినా, పరిశీలించినా చివరికి తెలిసేది ఒక్కటే !!

నిత్యసత్యమైన ఆనందం బ్రహ్మజ్ఞానంలోనే తెలియబడుతుందని – అప్పుడే బ్రహ్మానందం కలుగుతుందనీను. (సుఖం ద్విధేవ కథితం నిత్యానిత్య విభేధతః నిత్యం బ్రహ్మ స్వరూపం హి అనిత్యం విషయోద్భవమ్ – రసరత్న దీపిక) అయితే మనకు ఉన్న కొద్దిపాటి లౌకిక జీవిత కాలంలో శాశ్వతానందానికి అవకాశం లేదని తెలుసుకున్న కవులు సాహిత్య ప్రపంచంలోని సద్యఃపరంగా ఆనందాన్ని కవిత్వ రూపంలో అందించారు. జీవించినంత కాలం కొంత భాగమైనా సాహిత్య సేవ చేసినట్లైతే ఆ సేవలో ఆనందం దొరకడంలో అనుమాన మేమీ లేదు. అయితే ఇక్కడొక విషయం చెప్పవలసి ఉంటుంది. కావ్య రచన విషయంలో (రసా హి సుఖదుఃఖావస్థా రూపా : –భోజుడు) రస పోషణ అన్నది ఒక అనివార్య పద్ధతి కథానుగుణంగా నవరసాల్లో లేదా ఎనిమిది రసాల్లో ఒక రసం ప్రధానంగా తీసుకోవటం జరుగుతుంది. కవి హాస్య రసపోషణ చేయటం ద్వారా హాస్యాదులు కలుగుతాయి. శృంగార రసపోషణ వలన ఆనందం కలుగుతుంది – అందుకని 'శృంగారాద్ధి భవేత్ హాస్యం' అన్న విషయం హాస్య విలాసాదుల నుంచి జనించే ఆనందానికి అన్వయంగా చెప్పవచ్చు. నిత్య జీవనస్థాయిలో కొంత ఆనందాన్ని పొందగలిగినా సాహిత్య పఠనం ద్వారా కలిగే ఆనందంలో వ్యక్తిత్వ వికాసం ఏర్పడుతుంది. – వ్యవహారజ్ఞానం తెలిసొస్తుంది. రసోదయం ఏర్పడుతుంది. "వాక్యం రసాత్మకం కావ్యమ్" అని విశ్వనాథుడన్నాడు. అయితే ఈ రసస్వరూపాన్ని – స్వభావాన్ని – స్థాయిని మనం పరిశీలిస్తే భిన్న భిన్న వాదాలు వినిపిస్తాయి. అలంకారికుల గ్రంథాల నుండి రసముల సంఖ్య 8 లేక 9 అని దానిలో మనిషికి ఆనందాన్నిచ్చే శృంగార హాస్యాల ఆవశ్యకత, నిత్య జీవితంలో ఈ రెండు రసాల యొక్క ప్రాముఖ్యత, ఇత్యాది విషయాలు అలంకార గ్రంథాల్లో చక్కగా విడమర్చి చెప్పారు కవులు. మన దేశంలోని ప్రాంతీయ భాషలన్నింటిలోను గల సాహిత్య శాస్త్ర గ్రంథాలన్నీ సంస్కృత భాషలోని అలంకార శాస్త్రం మీదనే ఆధారపడ్డాయి. ఈ గ్రంథాల్లో అలంకార వివేచన, కావ్య సౌందర్యాన్ని తెలిపే అనేక విషయాలు ఉన్నాయి. ప్రతాపరుద్రీయకర్త విశ్వనాథుడు ('యద్యపి రసాలంకారాద్యనేక విషయమిదం శాస్త్రం తథాపి ఛత్రిన్యాయేన అలంకార శాస్త్రముచ్యతే') అని విషయాన్ని స్పష్టంగా చెప్పాడు. అలాగే శబ్ద శక్తి జ్ఞానంతో కావ్యార్థాలే కాకుండా అందులో పోషింపబడిన రసాదులు కూడా ఆస్వాద్యమవుతాయి. వాచ్యార్థం కంటే ప్రతీయమానార్థం అందంగా ఉంటుంది. 'ప్రాప్త పరిణతీనాం తు ధ్వనిరేవ కావ్యం' అన్నాడు ఆనందవర్ధనుడు. ఏది ఏమైనా కవి తన స్వహృదయాన్ని (ర) సహృదయులకు అందించగలిగినప్పుడు కావ్యం సార్థకమవుతుంది. అలా రస హృదయులకు వినోదాన్ని, హాస్యాన్ని, హాసమిళిత ఆనందాన్ని కలిగించే శ్లోకాలు తెలుగు, సంస్కృత, ప్రాకృత కావ్యాలలో కోకొల్లలు. కొన్ని శ్లోకాలు చమత్కార జనితాలు, మరికొన్ని శృంగారోద్భవ హాస్య గుళికలు, మరికొన్ని వ్యంగ్య చమత్కార వైభవ కళికలు, ఇంకొన్ని అకర్తృత్వ చాటూక్తి హాస్యపు చురుకులు – ఇలా అనేకానేక సాహిత్యంలో అనంతంగా కనిపిస్తాయి.

**శబ్దాయుత హాస్యం :**

చమత్కారియైన యువకుడు చతురత గల యువతి మధ్య జరిగిన అక్షర జగడంలో చిత్రమైన వినోదం తెలిపే పద్యం.

పురుషుడు : సతులు, మాయాధుర్యచతురులౌదురు గదే!

స్త్రీ : ఔరా! యా మాట మేలగునటోయి!!

పురుషుడు : జవరాండ్రు కుటిల ప్రచారులౌ గదే!

స్త్రీ : నడిమి 'టి' మాట మానవుగదోయి!

పురుషుడు : జవ్వనులే శోకభాజనలు గదే ! ఔరా

స్త్రీ : 'క' లగించి పల్కమేలే కాదటోయి?

ఇక్కడ అక్షరచ్యుతితో కలిగే వినోదంలో అంతరార్థాలు మారిపోయి ఉత్తమ హాస్యం పండిస్తాయి. ఇందులో వివేకంతో కూడిన వినోదం మనసుని అలరిస్తుంది. మొదటివాక్యంలో

మాయాధుర్యలో 'యా' తీసివేయమన్నది – మాధుర్య చతురులు

కుటిల ప్రచారులు 'టి' మాట మానమన్నది – కుల ప్రచారులు

శోకభాజనలు 'క'ని పలకద్దన్నది – శోభాజనలు

ఇటువంటి అక్షరాలను కలిపి విడదీసి రాసిన కవులు శుద్ధ వర్ణ సరస్వతీ సదృశులు. కవ్వింపు చర్యలతో ప్రారంభమయ్యే సంభాషణ కలహానికి దారి తీయకుండా కలభాషిణి కిలకిలలతో పూర్ణమవుతుంది. హాస్యం త్రివిధం – ఉత్తమ మధ్యమ అధమ ఇతి. వాటిల్లో ఇది ఉత్తమ హాస్యం క్రిందికి వస్తుంది. ఈ సంభాషణలో షడ్విధహాసాల్లో స్మితానికి అవకాశం ఉంది. కొద్దిగా కనిపించే పలువరుసతో చిరునవ్వుతో కవ్వించే ప్రశ్నలు చిరుపెదవులపై చలాకీగా తిరిగే చిన్నారి నవ్వుతో కూడిన చిన్న నవ్వుతో సమాధానం

**ప ॥ చాకివాని తోడ జగడాలు పడలేక**
**సిరిగలాడు పట్టుచీర గట్టి**
**శివుడు తోడుగట్టి 'సీ'యని మదిరోసి**
**భైరవుండు చీర పారవైచె!**

వాషింగ్‌మిషన్లు లేని కాలంలో వీరపురుషులైన శివాదులకు కూడా చాకలి బాధ తప్పలేదు. విష్ణుమూర్తి పీతాంబరము వదలకపోవటం, శివుడు ఎప్పుడూ గజ చర్మాన్నే స్కూల్ డ్రస్‌లా రోజూ వేసుకోవడం భైరవుడు చీరను పారేసి నగ్నంగా తిరగడం – ఇవన్నీ చాకలి వాళ్ళ బాధపడలేకట. ఎప్పుడూ ఒకే బట్టలతో వేలాడుతూ తిరిగేవాళ్ళను తరచూ ఉచ్చుకీ, పీతికీ పీతాంబరం అల్లె... అంటే గేలిచేయడం.

ఏదైనా ఇది మధ్యమస్థాయి హాస్యమే. హాస్యం ద్వివిధం – ఆత్మస్థం, పరస్థం. ఇది పరస్థహాసానికి దారి తీస్తుంది.

గిరిజా కళ్యాణంలో గంటి కృష్ణవేణమ్మగారు రచించిన త్రిమూర్తుల సరససల్లాపాలు వినోదంగా అనిపిస్తాయి. వివాహానంతరం భోజనవేళలో విష్ణుమూర్తి శివుడితో ఇలా అంటాడు.

**ప॥ విసము తిన్న నోట కసవయ్యె కాబోలు**
**భక్షణంబులెల్ల పార్వతీశ ।**
**అట్టి దివ్యమైన ఆహారములులే**
**వటంచుబల్కె విష్ణుడభవుతోడ.**

అపుడు శివుడు విష్ణుమూర్తితో మరింత పరిహాసమాడుతూ

**ప॥ నిక్కము నీవు పల్కినది నీరజనాభ ఇటిందుముచ్చిలన్**
**చిక్కదు వెన్న తెత్తుమన చిక్కవు ఎంగిలికాయలెందునీ**
**కెక్కడ దెత్తుమయ్య అవి యిప్పుడంచు శివుండు నవ్వినన్**
**అక్కడ పంక్తి భోజనమునందు పకాలున నవ్విరందరున్ ॥**

విష్ణువు బ్రహ్మతో మరింత ఎకసెక్కాలాడుతూ పకపకలాడాడు.

**ప॥ వండి వడ్డింప దొకనాడు వనిత నీకు**
**ఉండు తటవాకిటనెగాన – ఓ విధాత ।**
**భుక్తి సలుపుము యిపుడైన బొజ్జనిండ**
**అనుచు పరిహాసమాడె నా హరియు నపుడు ॥**

ఇటువంటి సన్నివేశాలు తరచూ మనం చూసుంటాము. శునకానికి కనక సింహాసనంలా విషం అలవాటైన వాడికి కషాయాలేమైనా సహిస్తాయేమోగానీ, మంచి రుచి గల భోజనం సొక్కుతుందా? అని విష్ణువు ఎత్తిపొడుపు. అలాగే విష్ణుమూర్తికి ఇక్కడ వెన్న దొరకదు నాయనా– ఎక్కడ నుంచి తెస్తాము! 'పాలు – పెరుగు – జున్ను ఇక్కడ దొరుకును' అన్న బోర్డు పెట్టరు ఎవ్వరూ, ఈ లోకంలో! నీకు ఏమీ దొరకదులే! అని త్రిప్పి కొట్టాడు త్రిలోచనుడు!! ఆ దెబ్బకు విష్ణుమూర్తి బ్రహ్మను పట్టుకొని రుసరుసలాడాడు. ఉక్రోషం ఆగక సరస్వతమ్మ మీద విరుచుకుపడ్డాడు. ఏనాడైనా నీ పెళ్ళాం నీకు వండిపెట్టిందా అంటూ– కనీసం ఇప్పుడైనా కడుపు నిండా తిను అంటూ ఈసడించాడు. వీళ్ళ ముగ్గురినీ చూసి పెళ్ళివారంతా కడుపుబ్బ నవ్వారట.

ఇక్కడ షడ్విధహాసంలో (స్మితం/హసితం/విహసితం/ఉపహసితం/అతిహసితం/అట్టహాసం) చెప్పిన అన్ని రకాల నవ్వులు కనిపిస్తాయి. విష్ణుమూర్తి శివుడితో పరాచికమాడిన విధానం విహసితమైతే, శివుడు రియాక్టయిన తీరు ఉపహసితం – విష్ణువు బ్రహ్మను దులిపిన తీరైతే అతి–అపహసితం. ఈ రకమైన నవ్వులను నవ్వేటప్పుడు పలువరుస, పెదవులు, దంతాలు, ముక్కు, బుగ్గలు, కళ్ళు ఏ విధంగా ఉంటాయో నాట్య శాస్త్రంలో భరతుడు వర్ణించాడు.

అలాగే వరకట్న బాధితులు వరుడిని వ్యంగ్యంగా మాట్లాడే హేళన ఉందీ పద్యంలో. 'మొహం లేకపోయిన మొగవాడే' అన్నది మోటు సామెత. మొహం వికృతంగా ఉన్నా, డబ్బులేనివాడైనా మగాడైతే చాలని కట్నం ఇచ్చి కన్య జీవితాన్ని బలిచేసేవాడి మీద హేళనా పూర్వకమైన విసురు–

**శబ్దవ్యంజనాగత హాస్యం –**

**ప॥ గణపతికి పెండ్లి చేయవు!**

**'మని' లేదా? మాకు పంపు! మగవాడైనన్**

**కనుముక్కు తీరు లేకు**

**న్నను భువి కట్నంబు లెదురు నడుచును శంభో!!**

ఆదికవి నన్నయ్య – మహా కావ్య పితామహుడు పెద్దన్న తెలుగు కవిత్వాన్ని ఔపోసన పట్టినవారే! కానీ హాస్యరసం ఎవరినైనా తన పరిధిలోకి లాక్కొని పెద్దన్నలని (పెద్ద) అ (న) న్నయనీ కూడా చమత్కరిస్తుంది. నన్నయగారి మీద పరిహాసమాడి ధన్యత చెందిన పద్యరత్నం.

**అర్థవ్యంజనాగత హాస్యం –**

**ప॥ ఆంధ్రలోకోపకారమ్ము నాచరింప**

**భారతమ్మును నన్నయభట్టు తెనుగు**

**చేయుచున్నాడు సరియె బదాయి గాక**

**తొలుత సంస్కృత పద్యమెందులకు చెపుడి?**

ఈ పద్యంలోని పరిహాసానికి సమర్థింపుగా నన్నయగారి గురించి చెప్పవచ్చు. తెలుగువారి కోసం భారతాన్ని ఆంధ్రీకరించినా సంస్కృత పద ప్రయోగం లేకుండా కావ్యం పూర్ణం కాదు – మరి ఆ సంస్కృతాన్ని ముందుగా తెలుగు వారికి పరిచయం చేసి తరువాత గృహప్రవేశం చేయమన్నాడు తెలుగింటికి – తెలుగింటి గృహప్రవేశానికి సంస్కృత తోరణంలో స్వాగతం చెప్పిన నన్నయ్యని విశ్వనాథవారు చెప్పిన భాషలో మంగళమయ్య నీకు ఆదికవివయ్య నీవు అంటూ అభినందించాల్సిందే తప్ప మరేమీ చెప్పినా బావుండదు.

అదే విధంగా పెద్దన గురించి

**అర్థ వ్యంజన**

**ప॥ ముసలితనమున నదియేమి ముచ్చటయ్యొ**

**తాతగారికి? మనుచరిత్రమ్మునందు ।**

**వెట్టిబాపడు ప్రవరుని పేరు చెప్పి**

**ఎంత ప్రేమ కలాపమాడించినాడు ॥**

నిజమే! విలసవిభ్రమమదోన్మత్త అయిన విలాసిని వరూధిని!! వెట్టి వెంగళరాయుడు లాంటి విప్రవర్యుడు ప్రవరుడు!! వీరి మధ్య ప్రణయ చర్చలు – కానీ పెద్దనగారు తాతగారి వయసులో, రంగేళీ రాజావారిలా ఎంత శృంగార రస సామ్రాజ్యాలని దృశీకరించారు పాఠకులకి – "ఎవ్వతె నీవు భీత హరిణేక్షణ" అని ప్రవరుడి చేత ప్రశ్నింపచేసి వరూధినిలో ఆశలు పెంచే ప్రశంస చేయించి మళ్ళీ "శ్రీహరీ! పాపము శమించు గాక" అంటూ కళ్ళు మూసుకునే ప్రయత్నంలో ప్రవరుడి పాత్ర చిత్రణ – ఆ రస సన్నివేశం విప్రలంభమన టానికి లేదు.ఎందుకంటే సంయోగ శృంగారం లేదు కనుక. విఫల ప్రణయమనటానికి లేదు – ఫలవంతమవటానికి అక్కడ ప్రణయాంకు రాలే ప్రవరుడిలో లేవు కనుక – ఇటువంటి శృంగార జనిత చమత్కార కవితాచంద్రికల చల్లదనాన్ని కర్పూరంలో వెలిగించిన పెద్దన పెద్దన్నే.

సంగతత్వమంటే శబ్దార్థాలు రెండు ఐక్యతను పొందటం లాంటిది. కవి శస్త్రాన్ని – వస్త్రాన్ని కలిపి హాస్యానికి జోడించాలనుకున్నాడు. హాస్యం శృంగారాన్నే కాదు వీర రస ప్రస్తావనలో ఉపమానాన్ని పొంది మనోజ్ఞభావాన్ని కలగజేస్తుంది.

**శృంగారోద్భవ హాస్యం**

**ప॥ స్త్రీణాం వితంబాద్వసనం శస్త్రంచ ద్విషతాం కరాత్ ।**

**పతతో యేషు దృష్టేషు త ఏవ కృతినో నరాః॥**

స్త్రీల సౌందర్య స్థానమైన నితంబం నుండీ వస్త్రమూ, శత్రువు చేతిలో వున్న శస్త్రము జారిపడిపోయే దృశ్యం చూసినవారు ధన్యులంటాడు కవి. నేత్రద్వయానికి ఒక దృశ్యాన్నిచ్చి రసద్వయంలో వాటిని ముంచి ఆ నేత్రాలు సార్థకత చెందాయన్న కవి చతురుడు – విషయం చిన్నది. అన్వయం ఏకీకృత భావం గొప్పది.

**జ్యోతిశ్శాస్త్రంలో హాస్యం –**

**ప॥ కన్యా ప్రసూతస్య ధమః ప్రసంగాత అంగాధి కాసాదిత విక్రమస్యః**

**ధనంజయాధీన పరాక్రస్య హిమస్య కర్ణస్య చ కో విశేషః॥**

హేమంత ఋతువు – కర్ణుడు ఇద్దరు ఒక్కరే అంటాడు కవి. ఋతురాజుని రారాజుతో కలపటమేమిటి, అని సందేహం కలుగుతుంది. కన్యకి జన్మించిన కర్ణుడు కన్యారాశి నుండి ఏర్పడిన హేమంతమూ ఒకరే! కో విశేషః? అని ప్రశ్న! 'కన్య' అన్న శబ్దాన్ని భిన్న సంగతులకు అన్వయించి శబ్దార్థ సౌందర్యంలో – శబ్ద పునరావృత్తిలో హాస్యాన్ని పండించారు కవి. మరోచోట ఋతువుని కవి భిన్న పార్శ్వంలో ప్రయోగించి హాస్యానికి సహజ వస్తువులని పేర్చుకున్నాడు.

**సహజ సిద్ధ హాస్యం -**

**ప॥ హేమంతకాలేత్ర వియోగకాలే శితస్యరుక్ పశ్యనతస్య ।**

**యస్య అంకే హసంతీ దయితా హసంతీ పార్శ్వే హసంతీ వసనాని సంతి॥**

హేమంత ఋతువులో విరహ బాధ ప్రియులకి, శరీర బాధ వృద్ధులకు ఉండకుండ కొన్ని కవితా వస్తువులు మన దగ్గరుంటే చాలంటాడు కవి. వాటిని చమత్కారంగా చెబుతూనే వాస్తవిక పదార్థాలను లిస్టు తయారు చేసి పెట్టాడు కవి. ఒకటి 'అంకే హసంతీ' అంటే ఒడిలో నవ్వుతున్న ప్రియురాలు. ఆమె అంకములో హసిస్తుంటే ప్రియుడికి చలి బాధ ఎక్కడా? 'హసంతీ పార్శ్వే' అంటే పక్కనే నిప్పుల కుంపటి. హసంతీ వసనాని – ఇది గాక మెత్తని కంబళి. హసంతీ అన్నపద ప్రయోగం పునరుక్తి అయిన సందర్భ విషయం వేరు కావడంతో హాస్యం పదార్థ త్రయంలో చక్కగా తయారవుతుంది.

**చనువిస్తే నెత్తికెక్కే హాస్యం :** ఊహాచిత్ర గతహాస్యం – అద్భుత రసహాస్యం –

**ప॥ తస్యాః కచభరజాత తనయ స్నేహలాలితః ।**

**ఆరూఢ పార్వతీ బుద్ధ్వా గుహబర్హీవ మూర్ధని ॥**

శంకరార్థాంగి పుత్రుడితో పాటు పురివిప్పే నెమలిని కూడా లాలించింది. మరి ఆమె విశ్వమాత, ఆ బ్రహ్మకీటజనని. ఆ లాలనలో నెమలిగారు మేను మరచి ఆమె శిరోజాల మీద ఎక్కి కూర్చున్నారట. అంటే నెత్తికెక్కి కూర్చుందట. ఇది కేశ సౌందర్య వర్ణనకి వాడుకున్న విషయమైనా నెమలి పురి విప్పినప్పటి సౌందర్యవర్ణాలు అద్భుత దృశ్యంగా కవి చెప్పాడు. అమ్మవారి కేశపాశ విలాసంలా పురి విప్పిన నెమలి పింఛముల వర్ణ విశేషాన్ని పోల్చి చెప్పాడు కవి. ఇంతకీ నెమలి ఇక్కడ గుడ్డిది కాదు. వ్యోమకేశి అయిన పార్వతీ కేశ సౌందర్యానికి మోహపడి ఆ శ్రీమాత శిరోభాగాన్నెక్కి తానూ పింఛము విప్పి పరవశ నృత్యం చేసిందేమో!

సాహిత్యం ఏ కోవకి చెందినదైనా అలంకారాలు, గుణాలూ, ధ్వని, రసం, వక్రోక్తి, ఔచిత్యం ఇత్యాది విషయాలు తప్పకుండా ఉంటాయని ఆలంకారికుల అభిప్రాయం. ఆ రసాన్ని ఎంతో బాగా తమదైన అనుభవంలో నిర్వచించారు వారు.

ప॥ రసే సారశ్చమత్కారః సర్వత్రాప్యనుభూయతే।

తచ్చమత్కార సారత్యే సర్వత్రాప్యద్భుతో రసః ॥

తస్మాదద్భుత మేహహా కృతీ నారయణోరసమ్ ॥ (సాహిత్య దర్పణం - 3-2-3)

అలాగే ఉజ్జ్వల నీలమణి స్థాయీ భావ ప్రకరణంలో ఇలా అంటాడు.

ప॥ బీజమిక్షుః స చ రసః స గుడః ఖణ్డ ఏవ సః ।

సశర్కరా సితా సా చ సా స్సుర్భావాః స్నేహదయాస్తు షట్ । (439 అ.శీ.)

ఒక రసం అన్ని రసాలకు కారణం అందుచేత అది ప్రకృత రసమే. ఇతర రసాలన్ని దీని వికృతిలే అని ఒక వాదం. ప్రాచీనాలం కారికులలో ఒక్కొక్కరు ఒక్కో రసాన్ని భవభూతి కరుణ రసాన్ని, భోజుడు శృంగారాన్ని ప్రకృతి రసంగా అంగీకరించారు. ఈ ప్రకృతి వాదాన్ని ప్రారంభించినవాడు అభినవగుప్తుడే అన్నట్లు కనబడుతుంది.

ఇలా రసాస్వాదన చేసుకుంటూ పోతే తెలుగు సామెతలో చెప్పినట్లు "తిన్నమ్మకే వాపిరి కన్నమ్మకే వాపిరి" అన్నట్లు ఉంటుంది పరిస్థితి. అందునా రసరాజమైన శృంగారాన్ని చక్కగా తనలో కలుపుకున్న హాస్య రసం ఎంత సేవించినా ఇంకా... ఇంకా అనిపించే స్థాయిలోనే ఉంటుంది జిహ్వ. ఆనందం కన్నా రుచికల పదార్థం లోకంలో లేదు. అది నిత్య స్థాయిలో ఉన్న పదార్థమైతే బ్రహ్మానంద స్థితికి చేరుకుంటాము. నిత్యజీవనంలో హాస్యం అనిత్యమైనా దాని కోసం ఆరాటపడి మన వశంలో ఉంచుకోవాలి. హాస్య రసం తెల్లని వర్ణంలో ఉంటుంది. ప్రమథలు దేవతలు, శృంగారంతో చెలిమి చేస్తుంది. బీభత్స భయానకాలని దూరంగా పెడుతుంది. అందరినీ తనలోకి ఆహ్వానిస్తూ హాయిగా నవ్వుకోమంటుంది. తెల్లని మనసుల్లోనూ – తెల్లని (శుద్ధ) వర్ణాల్లోనూ – తెల్లని పలువరుసలోనూ నృత్యం చేస్తుంది. పాత రోజుల్లో అల్లరిపిల్లలనూ ఆకతాయిగా నవ్వే పిల్లలనూ "హాసినీ" అంటూ గుడ్లు ఎట్టి చేస్తూ హంగామా చేసే పెద్దవాళ్ళని మీరు చూసే ఉంటారు. కేకలేసేటప్పుడు కూడా హాస్యాన్ని దాని స్థాయీ భావమైన హాసాన్ని తలచుకొనే పెద్దల మాటలు మరి పెరుగన్నం మూటలే కదా!

# సామాజిక మనుగడలో స్త్రీ

- పులి జమున, మహబూబ్‌నగర్. ఫోన్ : 8500169682

భారతీయ సంస్కృతిలో స్త్రీని తల్లిగా, దేవతగా, లక్ష్మి, సరస్వతి, పార్వతి ప్రతిరూపాలుగా ఆరాధిస్తారు. ఆడదంటే ఆటబొమ్మ, అంగడిబొమ్మ కాదని ఆదిపరాశక్తిగా పూజిస్తారు. తరతరాలుగా భారతీయ సంస్కృతిలో రక్తగతంగా పెనవేసుకున్న సనాతన సంస్కృతి మనది. అందుకే ఆడపిల్లను పెళ్ళి, పేరంటములలో, నోములు, మొదలగు సందర్భాలలో పసుపు, కుంకుమలతో, చీరె సారెలతో, బంగారు ఆభరణాలతో, కట్న, కానుకలతో సంభావించి, సన్మానించడం మన సంస్కృతి. ఆడపిల్ల పుట్టింటికి దేవత లాంటిది. అందరూ ఆమె సుఖ సంతోషాల కోసం పాటు పడతారు. అవసరమైతే త్యాగం కూడా చేస్తారు. ఎంత పేద కుటుంబమైనా కూలీ, నాలీ చేసుకునే వారైనా ఆడపిల్లను అప్పు సప్పు చేసి అయినవారింటి కోడలిగా పంపాలని ఆరాటపడతారు. తల్లిదండ్రులు వాళ్ళకు కలిగిన ఆస్తి, పాస్తులను సైతం అమ్మి అమ్మాయిని బుద్ధిమంతుని చేతిలో పెట్టి ఆనందంగా, తృప్తిగా ఊపిరి పీల్చుకుంటారు. పూర్వకాలంలో ఆడపిల్లను ఏనాడు భారంగా భావించేవారు కాదు.

అయితే ఆధునిక సమాజంలో కాలం తిరగబడింది. ఆడపిల్ల పుడితే అష్ట దరిద్రాలు చుట్టుకున్నట్లుగా భయపడుతున్నారు. ఈనాడు ఆడపిల్ల అంటేనే శనేశ్వరంగా భావించి, ఆడపిల్లలు పుట్టవద్దని దేవుళ్ళను వేడుకుంటున్నారు. కొందరైతే మమతానురాగాలను మంటగలిపి పుట్టిన పసిబిడ్డలను పురిట్లోనే గొంతునులిమి చంపుతున్నారు. ఇది మాతృత్వానికి మాయని మచ్చ. మారుతున్న సమాజంలో ఆడపిల్ల పెళ్ళంటేనే భయాందోళనలు కలిగిస్తున్నది. అందుకే ఏ తల్లీ ఆడపిల్లను కనడానికి ఇష్టపడటం లేదు. కొందరు ప్రబుద్ధులు ఆడపిల్లను కన్నదని భార్యను పుట్టింటికి పంపుతున్నారు. కాదంటే విడాకులు ఇస్తున్నారు. మరికొందరు మగపిల్లవాడి కోసం రెండవ పెళ్ళికి సిద్ధం అవుతున్నారు. ఇలాంటి సందర్భంలో ఆడపిల్ల ఉనికి అభద్రతా భావానికి గురి అవుతున్నది. అందుకే ప్రతి స్త్రీ కొడుకు కావాలని కోరుకుంటున్నది. ఆడపిల్లనికన్న తల్లిని చూసి భర్త మాత్రమే గాకుండా, అత్తమామలు, ఆడబిడ్డలు, తోడికోడళ్ళు, ఇరుగు, పొరుగు, బంధువర్గం సైతం ముక్కు విరుస్తున్నారు. ఆడపిల్ల తల్లిని హీనంగా చూడటమే కాకుండా, కఠినమైన పదాలతో దుర్భాలాషలాడటం కూడా జరుగుతున్నది.

"వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్లు ఆడపిల్ల ఆవిర్భావాన్ని ఏ కుటుంబము స్వాగతించడం లేదు. రాబోయే మహా ప్రళయానికి ఇది నాందీ వాచకమవుతుంది. ఇంచుమించు అన్ని కుటుంబాలలో ఆడపిల్ల ఆవిర్భావానికి వ్యతిరేక భావాలు బలంగా వీస్తున్నాయి. అందుకు కారణం పురుషుల్ని మాత్రమే తప్పు పట్టాల్సిన పని లేదు. కొంతమంది స్త్రీలు సైతం ఆడపిల్లలకు జన్మనివ్వడానికి అంత సుముఖంగా లేరు. శాస్త్ర, సాంకేతిక రంగాలలో సమాజం ముందడుగు వేస్తున్నప్పటికీ గ్లోబలైజేషన్, యూనివర్సలైజేషన్ కాలంలో బ్రతుకుతున్నప్పటికి ఆడపిల్లల పట్ల తక్కువ భావాన్ని ప్రదర్శించే తల్లిదండ్రుల ప్రవర్తనలో మార్పు రావడం లేదు. పుట్టబోయే శిశువు ఆడైనా, మగైనా సమభావంతో ఆహ్వానించే ఆరోగ్యకర పరిణామం రావాలి. సామాజికులు మారనంతకాలం సాహిత్యపరంగా ఎంత చెప్పినా నిష్ప్రయోజనమే. కాబట్టి యువతీ, యువకులు ఆడశిశువుల పట్ల అవగాహనతో, ఆలోచనతో వ్యవహరించాలి.

స్త్రీ, పురుషులు సమానమని సర్వశాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నా, వేద పురాణాలు వివరిస్తున్నా, ఈనాటికీ స్త్రీల పట్ల చిన్నచూపే ప్రదర్శిస్తున్నారు. మగవాడు ఏది చేసినా చెల్లుబాటు అవుతుందని తల్లిదండ్రులే వత్తాసు పలకడం రావణ సంతతిని పెంచి పోషించినట్లవుతుంది. వాడికేం వాడు మగమహారాజని అనడం మగపిల్లల్ని తప్పుత్రోవలో నడవడానికి ప్రోత్సహించినట్లవుతుంది. స్త్రీ, పురుషులు సమానమని విశ్వమంతా గగ్గోలు పెడుతున్నప్పటికీ ఆచరణకు వచ్చేటప్పటికీ స్త్రీల పట్ల నేటికీ గౌరవభావం మృగ్యమే. శాస్త్ర, సాంకేతిక రంగాలలో కొందరు స్త్రీలు ముందడగు వేసినప్పటికి, చంద్రమండలాన్ని చుట్టి వచ్చినప్పటికీ, చట్టసభలలో ప్రాతినిధ్యం లభించినప్పటికీ, స్త్రీలకు సముచిత గౌరవం లభించడం లేదు. "యత్రనార్యస్తు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాః" ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు విహరిస్తారు. కాబట్టి స్త్రీలను సంతోష పెట్టగలిగే ఆదర్శమైన సమాజ నిర్మాణం జరగాలి. "కలకంఠి కంట కన్నీరొలికిన ఇంట, సిరి వుండనొల్లదు" ఏ ఇంట స్త్రీలు దుఃఖిస్తారో, ఆ ఇంట్లో సిరిసంపదలు ఉండవని సుమతీ శతకకర్త తెలియజేశారు. కాబట్టి సమాజంలో ఏ స్త్రీ కూడా వేదనకు గురికాకుండా, వంచనకు బలికాకుండా ఎల్లప్పుడు ఆనందంగా, సంతోషంగా, హర్షాతిరేకంతో విలసిల్లే శాంతియుతమైన, సమాజ నిర్మాణం కావాలని ఆకాంక్షిద్దాం. ●

## నవ ఉగాదికి ఆహ్వానం

- తాళ్ళూరి రాధ, ఖమ్మం, ఫోన్ : 9705408345

ఎపుడు పడతి బ్రతుకున కన్నీటి వెతలు మాయమౌనో
కదుపే కనుల కాంతిరేఖల వెలుగుజిలుగులు విరజిమ్మునో
ఉగ్రవాదపు ఉక్కుపాదం
అవినీతి అక్రమాల మాయాజాలం ఎపుడు అంతమౌనో
అపుడే మనకు నవ ఉగాది
అదే నవ్య శకానికి క్రొత్త నాంది
ఆ శుభ పర్వదినానికి మనందరం ఆహ్వానం పలుకుదాం
ఆ నవ ఉగాదిన
కుహు కుహురాగాల కోయిలమ్మ సరాగాలు
లేత మావి చిగుళ్ళ పలకరింపులు
వేపపూత సోయగాల శుభాశీస్సులు
షడ్రుచుల సమ్మిళిత ప్రసాదాలు అందరికి పంచుదాం
ఆ నవ్య ఉగాదికి మనందరం ఆహ్వానం పలుకుదాం.

# ఓడి గెలిచిన జీవితం

- మల్లేపల్లి ప్రమోద్ కుమార్, కేశంపేట ఫోన్ : 9441947364

నా ఎనభయ్యేళ్ళ జీవితం వృథాగా గడిచిపోయింది. పుట్టుక నుండి ఊహ తెలిసేనాటికే పదేళ్ళ జీవితం గతంలో కలిసిపోయింది. స్నేహాలు, సినిమాలు, షికార్లు అంటూ మరో పదేళ్ళు వృథాగా గడిచిపోయాయి. ఆ తరువాత ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్న నాన్న సర్వీసులో చనిపోతే నేనేమీ కష్టపడకుండానే కారుణ్య నియామకం పేరుతో ఓ ఉద్యోగం వచ్చింది. ఉద్యోగం రాడంతోనే జీవితంలో స్థిరపడ్డానని పెళ్ళి చేసుకొని ముగ్గురు పిల్లల తండ్రినై బ్రతుకుబండిని లాక్కుంటూ వచ్చి వెనక్కి తిరిగి చూస్తే మరో నలభయ్యేళ్ళ విలువైన జీవితం కనిపించకుండా కనుమరుగైపోయింది. కన్నబిడ్డల ఈసడింపులతో పదేళ్ళు, పక్షవాతంతో పదేళ్లు – ఇలా తెలియకుండానే నా ఎనభైయేళ్ళ విలువైన జీవితం వృథాగా గడిచిపోయింది.

నిన్న మొన్నటివరకూ చావెప్పుడొస్తుందా అని ఎదురుచూశాను. కానీ గతరాత్రి జరిగిన సంఘటన నాలో చావాలన్న కోరికనే చంపేసి కొత్త కోరికకు పునాదులు వేసింది.

ఇదే హాస్పిటల్లో నా ప్రక్క బెడ్‌పైని ఓ పాతికేళ్ళ కుర్రాడు కేన్సర్ ముదరడంతో చనిపోయాడు. పాపం రోజూ నాతో ప్రేమగా మాట్లాడేవాడు. తాను త్వరలో చనిపోతానని తెలిసినా ఎంతో ఆహ్లాదంగా ఉండేవాడు. ప్రతిరోజూ ఎంతోమంది ప్రముఖులు వచ్చి అతన్ని పలకరించి వెళ్ళేవారు. బాగా డబ్బు, పలుకుబడి ఉన్నవాడేమో అని ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. కాని రాత్రి ఆ అబ్బాయి చనిపోగానే ఢిల్లీ నుండి భారత ప్రధాని వచ్చి నివాళి అర్పించి వెళ్ళాడు. ఇంత చిన్న కుర్రాడి కోసం ప్రధాని రావడమేంటా అనిపించింది. అదే విషయాన్ని హాస్పిటల్ సిబ్బందినడిగాను. వారు చెప్పిన విషయం విని నా ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది. ఆ పాతికేళ్ళ కుర్రాడు గణిత శాస్త్రానికి ఎనలేని కృషి చేశాడట! గణితశాస్త్రంలో ముఖ్యమైన సిద్ధాంతాలు తయారుచేశాడట. అతని పేరు నోబెల్ బహుమతి కోసం పంపించబడిందట!

అప్పుడు ప్రారంభమయ్యింది నాలో అలజడి! అప్పుడు ప్రారంభమయ్యింది నాలో సంఘర్షణ!! నా వయసులో దాదాపు నాలుగోవంతు జీవితాన్నే గడిపిన ఆ కుర్రాడు ఈ దేశం గర్వించదగ్గ స్థాయికి ఎదిగాడు. మరి అతడికంటే వయసులో, అనుభవంలో మూడు నాలుగు రెట్లు అధికంగా ఉన్న నేను... ఏం సాధించాను? ఏమీ కష్టపడకుండానే నాకు ఉద్యోగమిచ్చి, నాకు, నా కుటుంబానికి బంగారు భవిష్యత్తునిచ్చి, పెన్షన్ పేరుతో ఇంకా నన్ను పోషిస్తున్న ఈ దేశానికి నేనేమిచ్చాను? నా వల్ల ఈ దేశానికి ఏ ఒక్కరూపాయి ఉత్పాదనైనా వచ్చిందా? ప్రతి ఒక్కడూ నాలాగే సోమరియైపోతే ఈ దేశమెప్పుడు బాగుపడు తుంది? అవును నేనీ దేశానికి తీరని ద్రోహం చేశాను. పుట్టిన ప్రతి వ్యక్తీనీ నిర్లక్ష్యం చేస్తున్నాం. ఈ దేశానికి ఏదో ఒక సేవ చేయడం కోసమే ఈ దేశంలో పుట్టాం. మరి నన్ను కన్న నా దేశ ఋణం నేనెలా తీర్చుకోవాలి...? ఏదో చేయాలి...! నా దేశానికి ఏదో చేయాలి! నిన్ననే నా కొడుకుతో డాక్టర్స్ చెప్తుంటే విన్నాను – 'ఇక మీ నాన్నగారి రోజులు లెక్క పెట్టవలసిందే! ఏమీ లేదన్నారు. మరణానికి ఇంత చేరువగా వచ్చిన నేను నా భారతమాత ఋణం ఎలా తీర్చుకోగలను?' నా మనస్సు వేదనతో కృంగిపోతోంది.

అంతలోనే మదిలో ఆశావహ దృక్పథం దీపంలా మిణుకు మిణుకు మంటోంది. నా జీవితం రోజులలోకొచ్చిందన్నారు కానీ అది ఎన్ని రోజులని చెప్పలేదు. అది రెండు రోజులు కావచ్చు – వారం రోజులు కావచ్చు – లేక నెలరోజులైనా కావచ్చు! సంకల్ప బలముంటే సాధ్యం కానిదేదీ లేదు. సంకల్ప మనేది కేవలం యువకులే పెట్టుకోవాలనేదేమీ లేదు కదా! ఎవరైనా పెట్టుకో వచ్చు. అందుకే ఈ క్షణమే ఏదో ప్రారంభించాలి...! ఏమిటది..? పక్కనున్న కుర్రాడిలా గణిత శాస్త్రవేత్తనవుదామంటే కనీస గణిత సూత్రాలు కూడా నాకు తెలియవే! పోనీ సైంటిస్టునవుదామంటే నేను ఆర్ట్స్ స్టూడెంటును కదా! పోనీ నా సబ్జెక్టులనైనా ఏమైనా చేద్దామంటే ఆ సబ్జెక్టు మరిచిపోయి ఎంతో కాలమయ్యింది. మరేంటి నాలో ఉన్న శక్తులేమిటి? చాలా రోజులకు మెదడుకు పని పెట్టాను. నాలోని ప్రతిభల్ని బయటికి తీసే ప్రయత్నం చేస్తున్నాను.

అప్పుడు.... సరిగ్గా అప్పుడు... మదిలో ఏ మూలనో దాగిపోయిన నా రచనా శక్తి మెల్లగా తొంగిచూసింది. ఎప్పుడో కాలేజి రోజుల్లో కవితలు, కథలు వ్రాశాను. అప్పట్లో ఒకటి రెండు పత్రికల్లో అవి ప్రచురించబడ్డాయి కూడా. అప్పట్లో నా రచనల్ని నా మిత్రులు, లెక్చరర్లు మెచ్చుకునేవారు. అవును... తనలో ఒక శక్తి ఉంది. ఆ సృజనాత్మకతను నా ఈ చరమాంకంలో ఉపయోగించుకోవాలి. కానీ ఎలా...? ఎలా...? ఎంతోసేపు ఆలోచించాను.

చాలాసేపటికి ఓ ఆలోచన తట్టింది. నేను పుట్టినప్పటినుండి ఈ రోజు వరకు సమయాన్ని ఎలా వృథా చేశానో, ఆ సమయాన్ని ఏ రకంగా ఉప యోగించుకోవచ్చో నా కథ ఆధారంగా మరే యువకుడూ తన జీవితంలో సమయాన్ని వృథా చేయకూడదు అనే సందేశంతో, నా జీవితంలోని అను భవాల్ని, మానవసంబంధాల్ని, సామాజిక పరిస్థితుల్ని తెలుపుతూ ఒక గ్రంథం వ్రాయాలి. ఒక్క మాటలో చెప్పాలంటే నా ఆత్మకథ రాయాలి. అది యువతలోని సోమరితనాన్ని పారద్రోలే మహత్తర మంత్రంలా ఉండాలి. వివేకానందుడి బోధనలలా, రామకృష్ణుని రమణీయ వాక్కులలా ప్రతి ఒక్కరికీ ఓ గుణపాఠం కావాలి. అదే నా దేశానికి నేనిచ్చే పెద్ద కానుక అని నిర్ణయించుకున్నాను.

అంతలోనే నా బలహీనతలు గుర్తుకు వచ్చాయి. నేను లేచి కూర్చొని వ్రాయగలిగే శక్తి ప్రస్తుతం నాలో లేదు. పోనీ ఎవరికైనా చెప్తుంటే వ్రాస్తారేమో ననుకుంటే అంత ఓపికతో నా కథ వినేవాళ్ళెవరూ లేరు. మరెలా..? నా లక్ష్యం నెరవేరే మార్గం ఏది? ఎన్నో రోజుల తరువాత నా మెదడు పని చేయడం మొదలుపెట్టింది. నాకు ఓ సలహానిచ్చింది. నా సెల్‌ఫోన్‌లో 8 జి.బి. మెమోరీ కార్డు ఉన్నదన్న విషయం గుర్తుకు వచ్చింది.

అయితే...?

నేను వ్రాయాలనుకున్న ప్రతి విషయాన్ని నా నోటితో పైకే అంటూ అందులో రికార్డు చేయాలి. రికార్డు చేసిన మెమోరీ కార్డు ద్వారా పుస్తకం తయారు చేయించాలి. అంతే...! ఆ ఆలోచన వచ్చినదే తడవుగా ఎగిరి గంతేసే వయసుకాదు గానీ అంతటి ఆనందంతో నా మనసు నిండిపోయింది.

గత నాలుగు రోజుల నుండీ సెలైన్ ఎక్కించడం తప్ప నేనేమీ తినడం లేదు. ఇంజక్షన్ ఇస్తే తప్ప నిద్ర రావడం లేదు. ఈ విషయాలు గుర్తుకు

రాగానే నా మెదడులో ఫ్లాష్‌లా ఓ ఆలోచన మెరిసింది. ఒకప్పుడు మూడుసార్లు తినడానికి రెండు గంటలు, నిద్రకు ఆరు గంటలు పోయేది. ఇప్పుడు ఆ ఎనిమిది గంటల సమయాన్ని నా లక్ష్యాన్ని సాధించడానికి ఉపయోగిస్తే... అవును – ఇరవై నాల్గుగంటలూ నావే! పక్షపాతంతో నా కళ్ళు, చేతులు చచ్చుబడిపోయినా నా గొంతు స్పష్టంగానే ఉంది. బాగానే మాట్లాడగలుగుతున్నాను. బహుశా దేవుడు నా చేత ఈ కార్యాన్ని నిర్వర్తింపజేయడానికే నాకున్న మాట్లాడగలిగేశక్తిని నిలబెట్టాడనిపిస్తుంది.

కొద్దికొద్దిగా కదిలే ఎడమచేయితో నా సెల్‌ఫోన్ అందుకున్నాను. అందులో నాకు నచ్చిన ఎన్నో వందల పాటలున్నాయి. చిన్ననాడు నా పిల్లలతో మాట్లా డించిన మాటల రికార్డింగ్స్ లాంటి ఎన్నో విలువైన అంశాలున్నాయి. కానీ ఇప్పుడు వాటన్నింటి కంటే నా లక్ష్యం ఎంతో ముఖ్యమైంది. అందుకే ఆ మెమోరీకార్డును ఫార్మాట్ చేశాను.

అప్పుడు రికార్డింగ్ ప్రారంభించాను. ఎన్నో ఏళ్ళ నుండి నా మనస్సు అంతర్భాగంలో నిక్షిప్తమైపోయిన నా అనుభవాలు, పరిచయాలు, జ్ఞాపకాల్ని తవ్వి తీస్తూ, వాటిని విశ్లేషిస్తూ, నా ఎనభైయేళ్ళ జీవితాన్ని ఎలా వృధా చేసుకున్నది – అలా గట్టిగా ఎదుటి వ్యక్తితో చెప్తున్నట్లుగా చెప్తూనే ఉన్నాను.

మధ్యలో నర్స్ నిద్రకోసం ఇంజక్షన్ ఇవ్వడానికి వస్తే వద్దని వారించాను. సెలైన్ బాటిల్ మాత్రం మార్చి వెళ్ళిపోయింది. ఇక ఇరవైనాలుగ్గంటలూ నావే! నన్ను పలకరించడానికి కూడా ఎవరూ రారు. ఉదయం ఆఫీసుకు వెళ్ళేటప్పుడు పెద్దోడు మాత్రం వచ్చి వెళతాడు. మళ్ళీ ఉదయం వరకు రాడు. నిన్నమొన్నటి వరకూ నాతో ఎవరైనా మాట్లాడితే బావుంటుందనిపించేది. కానీ ఈ రోజు ఎవరూ రాకూడదని కోరుకుంటున్నాను.

నా ఒక్కొక్క అనుభవాన్ని విశ్లేషిస్తూ, దాని వల్ల నేను కోల్పోయిందేమిటో వివరిస్తూ, నేడు యాంత్రికంగా మారిపోతున్న యువత మేల్కొనాలంటూ నా ప్రతి అనుభవం వెనకా యువతకు సందేశాన్నిస్తూ చెప్పుకుంటూ పోతున్నాను. అలా రెండు రోజులపాటు సాగింది నా రికార్డింగ్. డాక్టర్లు వద్దని వారిస్తే, “నేనెలాగూ చనిపోబోతున్నాను. మాట్లాడినా చనిపోతాను. మాట్లాడకపోయినా చనిపోతాను. మాట్లాడితే ఇంకాస్త తొందరగా చనిపోతానేమో! ఏమీ చేయకుండా చనిపోవడం కంటే ఏదో ఒక మంచి పని చేస్తూ చనిపోవడం నయం కదా! ఈ చివరి క్షణాల్లో ఈ దేశానికి ఈ కాస్త సేవైనా చేయనీయండి’ అని వేడుకోవడంతో వారూ కాదనలేకపోయారు.

రికార్డింగ్ పూర్తి కాగానే మా పెద్దవాడితో చెప్పి, ఓ ప్రింటింగ్ ప్రెస్ అతన్ని పిలిపించాను. అతనికి రికార్డింగ్ గురించి చెప్పి, పుస్తకంగా చేసివ్వాలన్నాను. దానికతను “పని ఎక్కువగా అవుతుంది. రికార్డింగ్ విని ఒకసారి రాసుకొని దాన్ని ప్రింట్ చేయడానికి చాలా శ్రమ అవుతుంది. ఖర్చు కూడా యాభైవేల దాకా అవుతుంది. పుస్తకంగా రావడానికి నెలపైన పడుతుంది” అని చెప్పాడు.

“నాకంత సమయం లేదు. యాభై కాదు లక్ష రూపాయలిస్తాను. నాకా పుస్తకం పదిహేను రోజుల లోపల ఇవ్వాలి. నన్ను చూస్తున్నావుగా రేపో మాపో అన్నట్లుగా ఉన్నాను. నా కళ్ళతో ఆ పుస్తకం చూసుకుంటే తృప్తిగా కళ్ళు మూయవచ్చు.” అన్నాను.

డబ్బు ఎక్కువగా ఇస్తాననడంతో వెంటనే ఒప్పేసుకున్నాడతను. నా పెన్షన్ డబ్బులు దాచుకున్న నా అక్కౌంట్లో ఓ పదిలక్షల దాకా ఉన్నాయి.

## ఆడజన్మ – నీ విలువెంత?

– డా॥ మంద సురేఖ. ఫోన్ : 9449098465

సూర్యునికెందుకో అంత ఉద్రేకం
కడలిని మరిగించి తరిగించాలని
సంద్రానికెందుకో అంత తపన
మరిగి తరిగయినా సూర్యతాపాన్ని చల్లార్చాలని
మేఘానికి, పుడమిని తడపాలని
తొలకరికి పుడమిని పులకింపజేయాలని
అదే పోరాటం – అంతే ఆరాటం
ఆడ – మగ జాతికి మధ్య
హు – హు – ఇంకా నయం
అమ్మ – నాన్నలకు చదువూ
ఆడో – మగో – వైద్యునికీ తెలియదు – నాడు
కాబట్టే – కడుపుదాటి – గడపదాట గలిగాను – నేడు.
అందుకు ఆటంకాలు ఎన్నో
ముందడుగు వేద్దామంటే – ఏడడుగులు నడిపించారు.
ఆడపిల్లనుగదా! ఆటపాటలెరుగను.
తాటిమట్ట మూల పరచిన నాడే
అమ్మ నాన్నలకు గుండెల మీద పర్వతాన్ని
పెద్దల మాటలే పెండ్లిపత్రికలు
భార హృదయాల చప్పుళ్లే
భాజా భజంత్రీలు – పెళ్లంటే
చీరలూ – సొమ్ములూ
ఏడంతస్తుల మేడలో ఎక్కడుండాలని తపన
చందమామ కథలో యువరాణినా
ఊహాపోహలు కాకపోతే
తాళి కుదువ బెడితేగానీ తెలియలేదు
పెళ్లి బంధానికి ఇంత బలముందని
ఆడజన్మే నాకు ఆత్మస్థైర్యాన్నిచ్చింది
జీవన రణరంగంలో చస్తూ – బ్రతికి
బ్రతుకుతూ – చచ్చే నాఆత్మకు మరణమే లేదు
బిడ్డకు జన్మనిచ్చాక నాకెంత గర్వం వచ్చిందనీ!
మరుజన్మకూడ, జంబూద్వీపంలోనే ఆడపిల్లగానే పుట్టాలని నా ఆకాంక్ష!



అతనికి అడ్వాన్స్‌గా కొంత డబ్బుకు చెక్కు రాసిచ్చి, మిగతా డబ్బులు పుస్తకమివ్వగానే ఇస్తానన్నట్లుగా ఒప్పందం చేసుకున్నాను.

అతడన్నట్టుగానే పన్నెండు రోజులలో అందమైన బైండింగుతో పుస్తకాన్ని నా చేతులలో పెట్టాడు. ఆ పుస్తకాన్ని చూసి నా కళ్ళలో ఆనందభాష్పాలు రాలాయనుకున్నాను కానీ కళ్ళలో నీరు ఎండిపోయింది కాబోలు ఒక్క చుక్క కూడా రాలేదు. కానీ అంతకుమించిన ఆనందం నా హృదయంలో కలుగుతుంది. మా పెద్దవాడు రాగానే ఆ పుస్తకాల్ని గ్రంథాలయాలకు, కళాశాలలకు, వ్యక్తిత్వ వికాస తరగతులకు ఉచితంగా అందించమని చెప్పాను. నేనంటే కాస్త ప్రేమ కదా అందుకే చెప్పిన వెంటనే చేసేశాడు.

మరోవారం రోజుల్లో నా ఆరోగ్యం మరింత క్షీణించింది. రేపోమాపో అన్నట్లుంది నా పరిస్థితి. కోరిక తీరనిదే దేహం నుండి ఆత్మ వేరు కాదనేది ఆధ్యాత్మికవాదుల వాదన కదా! నిజమేనేమో ! నా పుస్తకం పదిమందికి తెలిసే వరకూ నా ప్రాణం పోదేమో! నా కోరిక అతి త్వరలోనే తీరింది. ఒకరోజు ఓ టివి ఛానెల్ వాళ్ళు నా దగ్గరకు వచ్చి, "మీరు రాసిన పుస్తకంపై విమర్శలు వస్తున్నాయి. దానికి మీరిచ్చే సమాధానమేమిటి?" అని అడిగారు.

అది నేనూహించిన సంఘటన. ఆశ్చర్యంతో, "విమర్శలేంటి?" అనడిగాను.

"అవును మీకు తెలియదా? మీ పుస్తకంలో సమాజం జీర్ణించుకోని సత్యాలెన్నో వ్రాశారు. ఆడవాళ్ళ అంగాంగ ప్రదర్శనలే అత్యాచారానికి కారణమని, పార్టీలు మారేవారు ప్రాంతాలు విడదీస్తాననడం ఎంతవరకు సమంజసం లాంటి వాదనలు ఈ సమాజాన్ని దూషిస్తున్నట్లుగా అనిపించడం లేదా?" అని ప్రశ్నించారు.

దానికి నా తరపు వాదన నేను వినిపించాను. అలా ప్రారంభమైన విమర్శల పర్వం ఇంతింతై వటుడింతై అన్నట్టుగా ర్యాలీలు ప్రదర్శనల దాకా అయ్యింది. టి.వి చానెళ్ళలో ఆ పుస్తకం గురించి చర్చలు వస్తున్నాయి. మొత్తం మీద మరో నెల రోజుల్లో నా పుస్తకం ఓ సంచలనమే అయ్యింది. విమర్శే విజయానికి ప్రారంభం అన్నట్టుగా అన్ని టి.వి చానెల్ వాళ్ళు నాతో ఇంటర్వ్యూలు తీసుకుంటున్నారు. నా పుస్తకాన్ని ఇతర భాషల్లోకి అనువదించాలనుకుంటున్నారట! ఓ యూనివర్సిటీ వాళ్ళు వ్యక్తి వికాసానికి దోహదపడే మంచి పుస్తకాన్ని వ్రాశానని హాస్పిటల్‌కే వచ్చి నాకు డాక్టరేట్ ప్రదానం చేశారు. ప్రతి వ్యక్తిత్వ వికాస తరగతిలో నా పుస్తకాన్ని ఓ రిఫరెన్స్‌గా ఇస్తున్నారు.

చాలు... నేను పుట్టినందుకు నా దేశానికి నేను తీర్చుకోగలిగాను. ప్రతి ఒక్కరూ ఆదర్శవంతంగా తీసుకునే గ్రంథాన్ని ఈ దేశానికి అందించగలిగాను. ఒకరోజు ఓ టివి ఛానెల్ వాళ్ళు నన్నో ప్రశ్నడిగారు, "ఈ చివరి రోజులలో మీరింత సాహసమెలా చేయగలిగారు?" అని. నేను చెప్పిన ఆ మాటలే నా పుస్తకంలోని చివరి వాక్యాలు.

"ప్రతి మనిషీ ఏదో కార్యం నిర్వర్తించడం కోసం ఈ భూమి మీద అవతరించాడనడం నిర్వివాదాంశం. కానీ చాలామంది తమ జీవితమంతా వృధాగా గడిపేసి ఈ భూమిపైకి ఎలా వస్తున్నారో అలాగే వెళ్తున్నారు. ఇంత కాలం మనకు స్థానాన్నిచ్చిన భూమికి, జన్మనిచ్చిన దేశానికి ఋణం తీర్చుకోకుండానే వెళ్ళిపోతున్నాం. కాబట్టి ప్రతి ఒక్కరూ ఈ దేశ భవిష్యత్తును నిర్మించే రథసారథులు కావాలి. ప్రతి ఒక్కరూ ఈ దేశానికి తమ వంతు సేవ ఏదో ఒకటి చేయాలి. పుట్టిన ప్రతి వ్యక్తి ఓ లక్ష్యం కోసం బ్రతకాలి. ఆ లక్ష్యసాధనలోనే జీవించాలి. లక్ష్యమనేది కేవలం కాలేజీ కుర్రాళ్ళకే కాదు - ఇంట్లో ఉన్న గృహిణి కావచ్చు, మనుమలు, మునిమనుమలు ఉన్న అవ్వ కావచ్చు, ఆఖరికి నాలా బెడ్‌పై చివరి క్షణాల్లో ఉన్న ఓ పేషెంట్ కూడా ఓ లక్ష్యాన్ని ఏర్పరుచుకొని సాధించే దిశగా అడుగులు వేస్తే సాధ్యం కానిదేదీ లేదు. సంకల్పం, దీక్ష, పట్టుదల ఇవి ఉన్నవాడెవడూ ముసలివాడు కాదు. అవి లేనివాడు నవ యువకుడైనా ముసలివాడికంటే హీనాతిహీనం. యవ్వనమున్నది ఎంజాయ్ చేయడానికి కాదు - నీ లక్ష్యాన్ని సాధించడం కోసం. అందుకే ఓ యువతా.... మేలుకో...! నీలోని శక్తిని నిద్ర పోనివ్వకు. నీ శక్తినంతా నీ దేశానికి ధారపోయి. అప్పుడే నీ జన్మ సార్థకమవుతుంది."

అందరి కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. నా గుండె ఆనందంతో ఎగిసి పడుతోంది. పాపం ముసలిగుండె కదా తట్టుకోలేకపోయింది! అదే ఆనందంతో ఆగిపోయింది. గుండె ఆగిపోయినా నా కళ్ళలో ఆత్మవిశ్వాసం చెరగలేదు. నా బోసి నోటిపై చిరునవ్వు చెదరలేదు. అందుకే నేను జీవితమంతా ఓడి - చివరిక్షణాన గెలిచిన వీరుడిని. చనిపోతూ చరిత్రలో శాశ్వతత్వాన్ని ఏర్పరుచుకున్న అజరామరుడిని.

## గంగరాజు నానీలు

- గంగరాజు మోహనరావు, తమిళనాడు. ఫోన్ : 044-26342499

1. కులమతాలు లేవని అంటారు
ప్రతి కులానికి కావాలి రాయితీలు

2. మనకు మనమే శత్రువులం
గాంధీగారిని కాల్చిన గాడ్సేలా

3. మానవుడే ఇలపై దేవుడు
ధర్మం తప్పితే వాడే దెయ్యం

4. నిత్యానందస్వామి నీకో నమస్కారం
రాసకేళికే నీ ఆశ్రమం

## మనందరి భాష

- బి.వి. సురేష్ కుమార్, జగ్గయ్యపేట. ఫోన్ : 9849907978

చదువుల తల్లి
సరస్వతి వీణ నుండి
జాలువారిన
అక్షర ఝరి
ప్రాణం పోసుకుని
పరిఢవిల్లినది
సాహిత్య ప్రపంచంలో
తేనెలూరు పలుకులుగా
తెలుగు తల్లి
పదాలుగా పెదవులు దాటి
పద్యాలుగా మనసును దోచి
కావ్యాలుగా కలలను రేపి
కథలుగా నడతను నేర్పి
"దేశభాషలందు తెలుగు లెస్స"గా
రాజుపేద తేడా లేక
విరాజిల్లిన తెలుగు భాష
సంస్కృతి సమయాలకు
వారధిగా నిలిచి
తనవారందరి తలలో నాలుకల వలె
ఓలలాడిన తెలుగు భాష
ఇంకిపోతున్నది తెలుగు కలాల్లో
ఈ కష్టాలు
ఇంకెన్నాళ్ళంటూ?
అయ్యో !
తెలుగు భాష
బ్రతుకు తెల్లారిపోతున్నది
పరభాష మోజుతో
అయ్యో !
తెల్లారక ముందే
తెలుగోడా మేలుకో
తెలుగు తల్లి
పాదాలకు ప్రణమిల్లి
పాలించు తల్లి తెలుగాభాషను

# కుల కళి

- దోమలపల్లి పాపయ్య, హైదరాబాద్. ఫోన్ : 9966124963

కులము. కులము... ఎక్కడిదీ... దీని రూపమేది. దీని నేపధ్యమేమిటి. వైదిక సమాజం ఆవిర్భవించిన తొలిరోజుల్లో వృత్తిగతంగా ఏర్పరచుకున్న గురుతుల జాడలు, పిలుచుకోడానికి పెట్టుకున్న పేర్లు ఈనాడు సమాజాన్ని విభజించి వీధి పోరులకు, విద్యాలయాల్లో ఆధిపత్య ధోరణులకు ప్రతీకలౌతున్నాయి. నాటి నుండి నేటి వరకు 'కులము' మనిషిని ఆవహించిన ఒక 'చెడు' పాతర. కులమనే పాతరలో ఉండి మానవుడు సహజంగానే మంటల్లో ఉడికిపోతున్నాడు. ప్రపంచీకరణ చెందుతున్న ఈ రోజుల్లోనూ సంప్రదాయ ముసుగులో కులజాడ్యంతో కుచించుకుపోతుందీ సమాజం. ప్రపంచ దేశాలన్నింటికీ ఆదర్శంగా నిలవాల్సిన మనదేశం మన సమాజం అలా నడుచుకుంటుందా, చదవేస్తే ఉన్న మతిపోయినట్లు విద్యావంతులు సైతం కులకళితో కాలిపోతున్నారు. ఎవరో ఒకరు నాటినుండి నేటివరకు కులతత్వాన్ని ఎండగట్టే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. అందులో భాగంగానే మా ఈ చిన్ని ప్రయత్నం.

దుర్యోధన ఏకపాత్రాభినయం (క్షాత్రపరీక్ష)



పలనాటి బ్రహ్మనాయుని చాపకూడు



వివాహ మహోత్సవం



(వ్యాఖ్యానం)

చూశారుకదా! నాటినుండి నేటి సమాజాన్ని. మరి ఎందుకు మనం కులవ్యవస్థను పోసిస్తున్నాము. కుల కుళ్ళను త్రాగుతూ బతికే ఓ మూర్ఖుడా... నీవు జన్మించేపుడు కులం పేరును నుదుటిపై రాసుకుని వచ్చావా ?

నీవు పుట్టిన హాస్పిటల్ నీ కులానికి చెందినవాడిదేనా? నీకు పురుడు బోసిన పోచవ్వది నీ కులమేనా?

నీకు చదువు చెప్పే గురువుది ఏ కులము? రోజూ నువ్వు తినే ఆహారం నీ కులము వారు పండించినదా? నువ్వు తొడిగే రంగురంగుల వస్త్రాలు నీ కులము వారే నేశారా?

నీవు ఉద్యోగం చేసేది నీ కులము వాడి దగ్గరేనా ?

ఆఖరికి నువ్వు చచ్చినాక నీ కులమువాడే నీ గోతిని తీస్తాడా?

నువ్వు పుట్టినప్పటి నుండి చచ్చేవరకు నీ కులము కాదని సకల సౌకర్యాలు అనుభవించకుండా ఉండడం లేదే! మరి ఎందుకు ఈ కులభేదం.

నీవు ఎవరికన్నా ఎక్కువ? ఎవరికన్నా తక్కువ? నీకు నీవు ఏర్పరచుకున్న కులపు కాష్టంలో కాలిపోతావా? కులం లేదు మతం లేదు. ఉన్నది ఒకటే మానవకులం. మనకు ఉండాల్సింది మతతత్వం కాదు మానవత్వం.

మానవునిగా పుట్టిన ప్రతి ఒక్కరూ కుల, మతతత్వాలను వీడి మానవత్వాన్ని పెంపొందించుకుందాం.

"లోకాసమస్తా సుఖినోభవంతు"

## ఎవరి తరం ?

- శైలజామిత్ర, హైదరాబాద్. ఫోన్ : 9290900879

ఎన్నో అనాథ హృదయాలకు
అగ్నిపరీక్ష అవని
జన్మనిచ్చిన అమ్మ ముందు నిలబడి
ముఖంమీద దోబూచులాడే వెన్నెలను
దాచుకోవాలనుకోవడం ఎవరితరం ?

కడుపులో ఒక వైపుగా కదులుతున్న
సుకుమారపు మునివేళ్ళు
కన్నతల్లి హృదయంలో మెదలుతున్న
అతీంద్రియ భావపు లోగిళ్ళు
కుంచెమీద దిద్దడానికి రంగులు
లేవడానికి ఎవరితరం ?

నిత్య నీరాజనాల అట్టడుగున
కన్నబిడ్డ పిడికిలి వెనుక
సమాజపు పరిక్రమణపు పదును వెనుక
ఎక్కడో ఏదో సందిగ్ధావస్థలో తడబడే
తొలి నెత్తుటి జీరకు రూపం
కనిపించదు అనడానికి ఎవరితరం ?

వెలుగుందనీ, ఆగని పరిమళముందనీ
ఆకాశం నీలిరెక్కలతో దిక్కుదిక్కుకూ
సమాధానం చెబుతోందని
నిలిచేందుకు పెరిగేందుకు
శూన్యపు శక్తి సంస్థితి రూపాంతరం
చెందిందనడానికి ఎవరితరం ?

వాక్కులో సున్నిత రసమాధ్యుం ఒలికి
ఆత్మలో ఆనందం చిలికిన
మొదటి కిరణ దివ్యశక్తి స్త్రీని
ఒకనాటికి అంతమవని కథగా స్పష్టతని ఏర్పరుచుకుని
శ్రవణ సుభగమే అనుభవ జ్యోతిగా
వెలుగుతూనే ఉండాలి అనడానికి ఎవరితరం ?

యుగయుగాల వెలుగులో
తరతరాల చీకట్లను భుజాన వేసుకుని
వడబోసిన సంస్కారం బరువు నీడలు మోసుకుంటూ
యథాతథమైన ఆర్ద్రతతో ఆడితప్పక
ఉలిక్కిపడే మనసుకు కనిపించేది
మొదట సూర్యుడే అనడానికి ఎవరితరం ?

అనుభవం గూడులో వివేకం ఒక విహంగం
ఆవేశపు అనాలోచితంలో వినయం ఒక చిద్విలాసం
నీడకోసమో, నీటికోసమో
ఫలంకోసమో, ప్రేమకోసమో
నేలపైని విలయతాండవానికి కారణం
నీవా నేనా అనుకునేందుకు ఎవరితరం ?

ఇపుడిక్కడ జరిగే యుద్ధాలు ప్రశ్నలు, సందేహాలు
రకరకాల సుస్వరాలు అన్నీ నీ నీడలే !
నేడు మాతృత్వం మొనదేరిన శిలాఫలకం
దాతృత్వం అన్వేషణకు పురారూపం!
మధ్యమధ్య ఎడారులతో మనోశిఖరం
చరిత్ర మాత్రం కొత్తపేజీల సంకలనం !
అయినా
ఒక్క తూర్పునే కాదు
అన్ని దిక్కులా మార్పు రాదనడానికి
ఎవరితరం ?

# సాహిత్యం - సమాజం - యువత

- గుంటూరు గీతా గాయత్రి, గన్నవరం, ఫోన్ : 9347585370

"హితే న సహితం సాహిత్యం", "సహితస్య భావః సాహిత్యం, మేలును కల్గించి, నీతి బోధించి, ధర్మ ప్రతిపాదనం చేసేది, మానవతకి పట్టం కట్టేది, సమభావన కల్గించేది సాహిత్యం. ఇది ఒక దర్శనం. మానవుని ఆంతరంగిక జగత్తుకి సంబంధించింది. హేతువాద విశ్లేషణలకి, తత్త్వ ప్రమాణాలకు అతీతమైనది. సకల శాస్త్ర విషయాలతో కూడుకున్నది సాహిత్యం. మానసిక పరివర్తనకి దారి చూపించేది సాహిత్యం. మానవుని ఆలోచనలకు పదునుపెట్టి సంస్కారాన్ని పెంచుతుంది.

జీవన పరిస్థితులనూ, జాతి సంస్కారాన్ని మెరుగుపరచటమే ఏ యుగంలో అయినా సాహిత్యానికి ఏకైక లక్ష్యం. కాలానుగుణంగా సాధించిన ప్రగతిని తెలియజేసే మహత్తర సాధనం సాహిత్యం. సామాజిక స్పృహ కలిగించి, లోకానికి హితాన్ని కలిగించుటయే సాహిత్యం యొక్క పరమావధి. కవుల రచనలు ఆ కాలం నాటి సామాజిక స్థితిని తెలియజేసేవిగా ఉన్నప్పుడే ఆ సాహిత్యం చిరకాలం మనగలుగుతుంది.

సార్వజనీనం, సార్వకాలికమై కవియొక్క ఆత్మీయతను స్ఫురింపచేస్తూ, రస ప్రధానములుగా, ఆనంద ప్రదములలో ఉండే కావ్యజాలమే సాహిత్యం. హేతువాద విశ్లేషణలకి, తత్త్వ ప్రమాణాలకి అతీతమైనది సాహిత్యం. లిఖిత రూపమైన భావ సముదాయం అంతా సాహిత్యమనే అనవచ్చు.

"సాహిత్యం ఒక సమరరంగం. అక్కడ పోరాటానికి కాకలు తీరిన మేధావులు అవసరం" అన్న లూసన్ మాటలు యథార్థములు.

ఏ కాలం నాటి సాహిత్యం అయినా శ్రమని మరిపించి మిత్రునిలా తోడు నీడగా ఉండి, ఆనందాన్ని కల్గిస్తూ, నైతిక ధర్మాలని బోధించాలి. అప్పుడే ఆ సాహిత్యాన్ని సామాన్యప్రజలు ఆదరిస్తారనుట అత్యుక్తి కాదు.

నిర్ణీత ప్రదేశంలో నియమిత కట్టుబాట్లకి లోబడి నివసించే ప్రజాసముదాయమే సమాజం. సమాజం సర్వోన్నతమైనది. కాలబద్ధమైనది. సాంఘిక కట్టుబాట్లే ప్రజలను నీతివంతులుగా చేస్తాయి. ఈ సమాజం అనేది వికాసం వైపు మనం సాగించే పయనంలో ఒక మజిలీ మాత్రమే. సామాజిక పరిస్థితులకి అనుగుణంగా సర్దుకొని పోవటమే జీవిత రహస్యం.

అటువంటి సమాజాన్ని ఉత్తేజపరచడానికి చక్కని సాధనం రచయిత. తన రచనల ద్వారా సమాజానికి సమాజాన్ని చూపించి, ఆత్మ విమర్శ చేసుకొనే రీతిగా రచనలు సాగించి, దేశ పురోభివృద్ధిని, సామాజిక శ్రేయస్సును కోరాలి రచయిత. వాస్తవికత ప్రతిబింబించాలి.

సమాజం నుండే సాహిత్యం పుడుతుంది. సాహిత్యసృష్టి చేసేవాడు కూడా, సమాజంలోని ఒక వ్యక్తే. సాహిత్యం యొక్క మనుగడ సమాజంపైనే ఆధారపడి ఉంటుంది. సాహిత్యం సమాజం కోసమే. కారణం లోకవృత్తం అందులో ప్రతిబించించుటయే.

ఏ సాహిత్య రచనైనా సమాజాన్ని మంత్రదండంలా మార్చివేస్తుందనుకోవటం సరైనది కాదు. కాలక్రమేణా మార్పు తేవడానికి సాహిత్యం తోడ్పడుతుంది. సాహిత్యం సమాజంలో కొత్తకోణాన్ని ఆవిష్కరింప చేస్తుంది. సామాజిక అభ్యుదయానికి, మంచికీ, మానవతకీ సాహిత్యం ఎప్పుడూ అవసరమే. మానవ హృదయమును కదలించు సాహిత్యం మాత్రమే సమాజానికి అవసరం. అదే శాశ్వతంగా మదిలో నిలుస్తుంది.

మంచి సమాజం కోసం సాహిత్యం, మంచి సాహిత్యం కోసం సమాజం అనవచ్చు. ఇవి రెండూ అవినాభావ సంబంధం గల పరస్పర పూరకాలే. ఏ యుగంలో అయినా సంఘసంక్షేమాన్ని ఆశించి సాహిత్యం స్పందించిన సంఘటనలు ఎన్నో, ఎన్నెన్నో... బ్రతుకుల్లో నూతనత్వాన్ని నింపాలన్నదే సాహిత్యం ప్రధాన ఉద్దేశ్యం. జీవిత పరిస్థితుల్లో, వ్యక్తుల సంస్కారాల్లో ఉన్న

## • నేతల తలరాతలు మార్చాలి •

- కూతురు సత్యనారాయణ, హన్మకొండ. ఫోన్ : 9866660374

ప్రజాస్వామ్యపు నాయకులంతా
అందలమెక్కే నేతలు
ఓటుకు నోటును పణముగా పెట్టి
నోట్లతో ఓట్లను దండుకుండిరి
ఖర్చుపెట్టిన నోట్ల కట్టలను
ఖరాఖండిగా కూడబెట్టుటకు
సిగ్గును ఎగ్గును వదిలిరి నేతలు
కమీషన్లతో కులుకుచుండిరి !
సచివాలయమును గ్రామము నుడి
శాసనసభలకు పార్లమెంటుకు
మండల స్థానిక చట్టసభలకు
ఎన్నిక అయ్యేడి నాయకులంతా
లక్షల లక్షలు కోట్లు కోట్లుగా
మూటలు విప్పి నోట్లను పంచి
పచ్చనోట్లతో ఓట్లను కొన్నా
చట్టసభలకు ఎన్నికలయ్యే
లబ్ధిదారుల రాజ్యం ఇదిరా
చట్టసభల్లో సాగెడి తంతు
తూతూ మంత్రపు తంత్రపు నీతి
దుడ్డు వారిదే దొడ్డవారిదే
దొడ్డిదారుల దారులు ఎన్నో
నోట్లతో ఓట్లను అడిగే నేతల
ఓటు పోటుతో గీత మార్చరా
భారత నేతలు భవ్య నేతలు
జగతికి నేడు చాటాలన్నా
మార్చాలన్నా మార్చాలి!
తలరాతలు మార్చాలి
నార్యపునేతను తేవాలి!

ఆటంకాలను, కాలుష్యాలను బహిర్గతం చేయటం సాహిత్యం యొక్క కర్తవ్యంగానే ఎప్పుడూ ఉంటుంది. సాంఘిక చరిత్ర నిర్మాణానికి సమాజం సదా తోడ్పడుతూనే ఉంటుంది. ఉదా : శతకపద్యాలలో ఉన్న సంఘనీతి.

సామాజిక సమస్యల కారణాలు అన్వేషించటం, సమస్యను విశ్లేషించటం, పరిష్కారం చూపటానికి సాహిత్యం అత్యుత్తమ సాధనం.

సామాజిక సమస్యలైన కుల మత తత్త్వాలు అస్పృశ్యత, లంచగొండితనం, స్వార్థం, గుండాయిజం, తీవ్రవాదం, మూఢనమ్మకాలు, బాలికల పట్ల న్యూనతా భావాలు, దళితుల సమస్య, కట్నాల దురంతాలు, కుహనా నైతిక విలువలు, ఆర్థిక లాలసత్వం మొదలగు ఈనాటి సాంఘిక వికృతులపై సాహిత్యం దృష్టి నిల్పాలి. వ్యక్తుల జీవితాలలో మార్పు కల్గించే దిశలో రచనలు సాగాలి. అప్పుడే అది ఉత్తమ సాహిత్యంగా భావించబడుతుంది.

సమాజ భవితవ్యం ఆ సమాజంలోని వ్యక్తులపైనే ఆధారపడి ఉంటుంది. భావిభారత నిర్మాతలు అందలి యువకులే. ధైర్యం, ఉత్సాహం, బలం సత్యశీలం, న్యాయవర్తన, నిస్వార్థపరులైన యువకుల మీదే ఆధారపడి అభివృద్ధి ఉంటుంది.

యువత వ్యర్థకాలయాపన చేయకుండా, అసూయ, ద్వేషం, మోసం, అహంకారం విడిచి సాహసవంతులు అయినపుడే పురోభివృద్ధి సాధ్యమౌతుంది. విస్తారమైన పఠనాసక్తి అలవరచుకొని సమయం సద్వినియోగం చేసుకోవాలి.

యువత మదిలో విశ్వజనీనత, వసుధైక కుటుంబం, భిన్నత్వంలో ఏకత్వం, ఉన్నత ఉత్తమ లక్ష్యాలు, మానవసేవే మాధవసేవ, శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్, విచక్షణా జ్ఞానం అనే అత్యున్నత భావాలు ఉన్నప్పుడే సమాజ నిర్మాణం ఉన్నతంగా ఉండి ప్రగతిని సాధించగల్గుతుంది.

నేటియువత జాతి, మత, వివక్షతల కన్నా, మానుషత్వమే ఔన్నత్య హేతువుగా గుర్తించి దేశభక్తి కల్గి లక్ష్యాల పట్ల ఏకాగ్రత కల్గి ఉండాలి. యువత వ్యక్తిత్వం సద్గుణాల సంపుటంగా ఉండి, పరోపకార దిశగా సాగాలి. మంచి, చెడు ఆలోచనల సముదాయమైన మన మనస్సును మంచి సాహిత్యం చదివి పురోభివృద్ధికి దారితీసే సుగుణాలను అలవరుచుకొని స్వేచ్ఛవైపు పయనించేలా చేయాలి. నేటి యువత కృషిపైనే భావిభాగ్యోదయం ఆధారపడి ఉంది. కావున కవులు, రచయితలు రచనలు యువతను మంచి మార్గంలో నడిపించేవిగా ఉండాలి.

సమాజంలో మనిషిని మహోన్నతునిగా తీర్చిదిద్దే భావమే మతం. అన్ని మతాలసారం ఒక్కటే. మతాలు వివిధ రూపాల్లో, విభిన్న సంప్రదాయాల్లో ఉన్నా వాటి అంతర్వాహినిగా ఉన్న తత్త్వం ఒక్కటే అనే అవగాహనను సాహిత్యం కల్పించాలి. అట్టి సాహిత్యం సృజింపబడాలి.

యువత మద్యం మత్తులో తూలకుండా, సమాజసేవకై నడుంబిగించి అంకితభావంతో, నిబద్ధతతో, నిజాయితీగా పట్టువిడువక, అవిరళకృషి చేస్తేనే ప్రగతిపథంలో సమాజం పయనించగలదు. హింసామార్గం వీడి, విధ్వంసానికి పూనుకోక ఆదర్శం కోసం యువత శ్రమించేలా ఉత్సాహపరిచే సాహిత్యం సృజించబడాలి.

కోరికలే బాధలకు కారణం కనుక ఇంద్రియ నిగ్రహంతో నిష్కామకర్మలు చేసేవిధంగా యువత మనసులో ఆలోచనలు ప్రేరేపించాలి. లోక సంక్షేమం లక్ష్యంగా ప్రశాంతంగా ఉండి, తదేక దీక్షతో సమానత్వ లక్ష్యంగా ఆత్మ విశ్వాసంతో అడుగిడి అభివృద్ధి పథంలో వెళ్ళే కార్యక్రమాలను పూనుకోవాలి.

కవుల, రచనలు, సృజింపబడే సాహిత్యం, విజ్ఞాన వినోదాలతో పాటు వివేకాన్ని, వినయ విధేయతలని, ముందుచూపు కల్గించేలాగా ఉండాలి. ప్రాణికోటి పట్ల దయ, సత్యమార్గానురక్తి పెంపొందించాలి.

ఏ సాహిత్యమైనా సమాజ వ్యక్తులలో శీల సంవర్ధనాన్ని, త్యాగ ఆవశ్యకతను, సేవాభావాన్ని, జనహితాన్ని, శ్రద్ధాసక్తులను మాతాపితృ గురుభక్తిని, సద్గుణాలని కల్గించే విధంగా ఉండాలి. ఎదుగుదలని నిరోధించే ప్రతికూల పరిస్థితుల మధ్య వికాసం పొందటము, ధైర్యంగా నిలబడి బ్రతకటమే జీవితం. అందుకే స్వామి వివేకానంద "బలమే జీవితం, బలహీనతే మరణం అని, ధైర్యమే జీవితం - భయమే మరణం అని; ఈ భూమి గొప్ప వీరుల చేత ఆనందం పొందుతుంది. గతం చాలా గొప్పదే అయినా భవిష్యత్తు ఇంకా వైభవోపేతంగా ఉంటుందని విశ్వసించాలి" అని అన్నారు.

సమాజంలోని వ్యక్తులలో స్వశక్తిపై నమ్మకం, చిత్తైకాగ్రత ఉండాలి. సర్వమతాల సారం స్వార్థాన్ని త్యజించటమే అనే విషయం యువత గ్రహించాలి. నీతి బాహ్యమైన స్వార్థం కన్నా నైతికమైన నిస్వార్థం మిన్న అని, కులం సాంఘిక ఆచారం, కట్టుబాట్లకు ఆలవాలం అని తెలుసుకోవాలి.

## భాషా 'విజయం'

- కె.వి.ఎస్. నరసింహం. ఫోన్ : 8341810063

పరిణామక్రమంలో మార్పులు సహజం
స్వాగతించడం మన విధ్యుక్త ధర్మం
ఈ నేపథ్యంలో ....
కొత్తవి చేరుతూ ...
పాతవి కనుమరుగౌతూ ....
రూపాంతరం చెందుతూ ...
ఆధునికతలు కలబోసుకుంటూ ... సాగుతాం!
కాలగర్భంలో కలిసిపోయాయి
ఎన్నో సంవత్సరాలు !
అంచెలంచెలుగా అల్లుకుపోతున్న
సాంకేతిక పరిజ్ఞానం
తదనుగుణంగా మారుతున్న
నైసర్గిక స్వరూపం
ప్రపంచీకరణ ఛత్రం క్రింద
ఒక్కటొక్కటిగా విలీనమౌతూ
సంక్షిప్తభావ జగత్తు వైపు
పరుగులు తీశాయి !
భాషా సంక్షోభాన్ని సృష్టించాయి !
మూలాల బలిమితో
నిలకడగా నిలిచాయి
తరతరాలను చూసిన 'తెలుగు తరువు'
ఆవహించిన సాంకేతిక సెగనధిగమించి
వికాస పవనాలను వీస్తూ ....
తెలుగు పరిమళాలను పంచుతోంది

సనాతన ధర్మం స్వార్థత్యాగం, పరోపకారమే. మానవుని మహోన్నతునిగా తీర్చిదిద్దే భావమే మతము. ఏ కులమైనా, ఏ మతమైనా, ఏ ధర్మమైనా ఎదుటి వారి శ్రేయస్సునే కోరుతుందని, సమాజంలోని వ్యక్తులు అందరూ గ్రహించిన ప్పుడే ఎటువంటి అల్లర్లూ, విధ్వంసాలు జరుగవు.

అణగారిన వారికి చేయూత; పేద ప్రజలకు సాయం అండ; జీవకారుణ్యం, క్షుధార్తునకు అన్నదానం మనకున్నంతలో చేయాలనే భావన ప్రజలలో కల్గించేలా సాహిత్యం ప్రోత్సాహం కల్గించాలి.

నేడు ఆత్మజ్ఞానం లేని యువత ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. పురోభి వృద్ధికి దారితీసేది సుగుణమని, పతనానికి దారితీసేది దుర్గుణమని తెలుసుకో లేకపోవటమే పరోపకారమే జీవితం, పుణ్యం; పరపీడనమే మరణం, పాపం అని; ప్రేమే జీవితం – ద్వేషమే మారణం అని; బలమే జీవితం, సుఖం, శాశ్వత జీవితం అని; బలహీనతే మరణం, దుఃఖం, నిరంతర ప్రయాస అనే వివేకానందుని బోధనల సారం యువతకి తెలియకపోవటమే అని ఖచ్చితంగా మనం చెప్పవచ్చు.

## ఆంధ్రభాషలో అమ్మతనం

- పులపర్తి శ్రీనివాసరావు. ఫోన్ : 9491265859

ఆపాత మధురం
ఆనంద హేయం
మకుటాయమానం మాతృభాషామయం
శిల్ప సౌందర్యం
కల్పన కమనీయత
కనుమరుగులేని ఆంధ్ర భాషాభిమానం
అపురూపమైన అనుబంధం
ఆకృతినిచ్చే భావజాలం
ఆంధ్రుల అన్నప్రాసనకు ఆదిగురువు ఆంధ్రభాష
సనాతన పునాది
నూతన దృక్పథ వారధి
పురాతన చరిత్ర రథసారధి ఆంధ్రభాష
స్వచ్ఛమైన సంస్కారం నేర్పేది
మరువలేని మమకారం నిలిపేది
బంధుత్వానికి భక్తిమార్గానికి ఆంధ్రభాష అద్భుతం!
కన్నతల్లి పేగుబంధం
ఆటవిడుపు ఆనందం
అచ్చమైన అమ్మతనం ఆంధ్రభాష
తేనెలూరే తేట పలుకులు
మదిని దోచే మాట విరుపులు
చమత్కారపు చాటువులు ఆంధ్రభాషావధానాలు
నీతులు నేర్పించే నాణ్యత
జ్ఞాన సంపాదనలో సమర్థత
అన్యభాషల ముందు
అగ్రభాగననిదే ఆంధ్రభాష

సమాజంలో నేటి యువతకి కావలసిన రావలసిన ముఖ్య లక్షణాలలో ఆత్మవిశ్వాసం, ఆత్మనిగ్రహం, ఆత్మ సంయమనం, ఆత్మ విమర్శ, అవసరమైతే ఆత్మార్పణ చేసుకొనే తెగువ, ఆత్మ సంతృప్తి, ఆత్మజ్ఞానం, ఆత్మగౌరవం మొదలైనవి ముఖ్యమైనవి. ఎప్పుడైతే యువత మదిలో ధైర్యం, ఏకాగ్రత, మానసిక స్థైర్యం సన్నగిల్లుతుందో బ్రతుకుభారమై, జీవితేచ్ఛ నశించి చావుని ఆహ్వానించటం జరుగుతుంది. అట్టి దుర్భర మానసిక స్థితి నుండి యువతను కాపాడాలంటే మంచి సాహిత్యాన్ని మించిన ఔషధం లేదనవచ్చు.

యువత సమాజాభివృద్ధిలో కీలకపాత్ర వహించాలంటే మంచి సాహిత్యం సృజింపబడాలి. ఆ సాహిత్యం ప్రజల మనసులను చేరాలి. వారిలో ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగించాలి.

**ముగింపు :** సమాజంపై సాహిత్యం, యువతల ప్రభావం ఎక్కువ.

మేలుని కలిగించి, మానవజాతి ప్రగతికి తోడ్పడేది; సంస్కృతి సంపదల నందించి, సంస్కారం మానవత్వాలను వికసింపచేసేది. ప్రజలను చైతన్యవంతు లను చేసే సాహిత్యం నేటి సమాజానికి అత్యవసరం.

విభిన్న కుల, మత, సంస్కృతి, సంప్రదాయాలకు చెందిన ప్రజలతో ఏర్పడిన (ఉన్న) సమాజంలో; ఐక్యత, సహకారం, సమానత్వం వంటి ఉన్నత భావాలను యువతలో కల్గించాలంటే ఉన్నత విలువలు గల్గిన సాహిత్యం, ఆలోచనలను రేకెత్తించే రచనలు అత్యంత ఆవశ్యకం.

కవులు, రచయితలు నిస్వార్థంతో సామాజిక అంశాలను ఇతివృత్తంగా గ్రహించి, సామాజిక స్పృహ కలిగించే రచనలు చేయుటకు పూనుకోవాలి. కాసులకు, కీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడక వాస్తవస్థితిని తెలియజేయాలి. సమా జంలోని సమస్యలు వివరించి, విశ్లేషించి, సమస్యల పరిష్కారాలను సూచించాలి. అపుడే ప్రజలు ఆ సాహిత్యం యొక్క పూర్తి ప్రయోజనాన్ని పొందగలరు.

యువత దుర్వ్యసనాలకు లోబడక ధైర్య, సాహసాలతో, సద్గుణాలతో ప్రగతి మార్గంలో పయనించాలి. మంచి సాహిత్యాన్ని పఠించి, ఉత్తమ నైతిక విలువలు కల్గి, చైతన్యం కలిగి ఉండాలి. సమాజాభివృద్ధిలో సమిధలు కావాలే కాని సమాజానికి ప్రశ్నార్థకం కాకూడదు. మహోన్నత వ్యక్తుల జీవితాల నుండి స్ఫూర్తిని పొందాలి. ఉత్తేజితులు కావాలి.

ఏది ఏమైనా సమాజాభివృద్ధికి ఉన్నత విలువలు గల సాహిత్యం, ఉన్నత ఆశయాలు గల యువత అత్యంత ఆవశ్యకము అని ఖచ్చితంగా చెప్పవచ్చు. ●



# అతీతమైనది

- రుద్రపాక జితేంద్రకుమార్, మచిలీపట్నం. ఫోన్ : 7893789981

మధ్యాహ్న సమయాన మహానగరంలో సూర్యుడు పదునుతేరి ఎదురు తిరిగిన జీవరాశి శక్తినంతా పీల్చి మట్టి కురిపిస్తున్నాడు. సరిగ్గా అదే సమయంలో అన్నం తిని నాలుగు రోజులయ్యిందంటూ రెండుచేతులు మహానగరాన్ని అర్థిస్తున్నాయి. "కడుపునున్న ఆకలి కానక చేతులనున్న దారిద్ర్యాన్ని దర్పంగా చూస్తున్నాయి. పరిసరాలు". ఆ చిట్టిచేతులకు తెలియదు నగరంలో వాసులంతా వేషగాళ్ళేనని... ఒట్టి పగటి వేషగాళ్ళేనని. ఆ చెమ్మగిల్లే కళ్ళకు తెలియదు రంగుల జీవితంలో నడిచే యంత్రాలు తన ముందున్నవని అయినా.. ఆకలి... "కలికాలంలో తనూ సమాజం బయట వెలివేయబడిన వారెందరో ఆ చిన్ని హృదయానికి తెలియదు".

వీధివీధినా ఆ చిట్టిచేతులకు ఛీత్కారాలే స్వాగతం పలికాయి. చివరి ఇల్లు... ఆ వీధిన అది చిట్ట చివరి ఇల్లు. ఒంట్లో ఓపికంతా కూడదీసి... అమ్మా ఆకలౌతోంది అంటూ చిన్నారి గొంతు ప్రతిధ్వనించింది. ఆ ఇంటి తలుపులు సమాధానం చెప్పలేదు... ఒళ్ళంతా మట్టితో జతకట్టిన ఆ పిల్లవాడు ఆకలిత్తో... ఆర్తితో... అమ్మా... ఆకలియంటూ నరనరాల శక్తినంతా తోడి స్వరాన కలిపాడు. ఒక్క ఉదుటున ఇంటి తలుపు తెరుచుకుంది. ఆ ఇంటామె రవి.... రవి... అంటూ కేకలు పెడుతూ గేటు దగ్గరికి వచ్చింది. "ఆ రూపం... ఆరూపం తనది కాదు... పైగా ఆ స్వరం తనకు పరిచయం లేదు" కానీ తన బిడ్డ రవిలా ఆ పిలుపు. వెక్కివెక్కి ఏడ్చింది. లోపలికి వెళ్ళి పట్టెడన్నం తెచ్చి, ప్రేమగా నీ పేరేంటి బాబు? అని పలుకరించింది. "పిల్లవాడి చూపులో ఆకలి బాధ, ఆ తల్లి కన్నుల మాతృత్వపు శోధ సంఘర్షణ పడుతున్నట్లున్నది ఆ క్షణం" పేరా... నా పేరు నయీమ్. నేనో అనాథను అంటూ రక్కున అన్నమంతా తీసుకుని పరిగెత్తాడు. ఆనందం.... పట్టలేని ఆనందం.... పట్టెడన్నం దొరికిందని పట్టలేని ఆనందం. గుటుక్కున ఓ అన్నపు ముద్ద... చిన్న అన్నపుముద్ద ముద్దగా జారి చిన్నారి కడుపును చల్లబరిచింది.

లలితమ్మ... లలితమ్మ అంటూ కేకలుపెడుతూ పరిగెడుతున్న జనం. అయోమయంతో... ఆకలితో... వారివెంటనే పరిగెత్తాడు నయీమ్. ఓ పెద్దావిడ ముఖం మీద నీళ్ళు చల్లి... క్షణమాగి కంట తడి పెడుతోంది. జీవితం చిగురు తొడిగే సమయంలోనే భర్త రాజా, బిడ్డ రవి ఇద్దరూ రోడ్డు ప్రమాదాన కరిగిపోయారు. అప్పట్నించి ఒక్కతై... తనొక్కతై.. నవ్వుతూ పలుకరించె లలితమ్మ... పాపం లలితమ్మ అనంత లోకాలకు తరలిపోయింది. ఆ మాటలు చిన్నారి నయీమ్ చెవినపడ్డాయి. కాదు... కాదు... హృదయాన్ని తాకాయి. పసి హృదయం పొంగి పొరలింది. నయీమ్ గేటును మరింత అదిమి పట్టుకున్నాడు. తన ఆకలి తీర్చిన దేవత ఎదురుగా నిర్జీవమై నవ్వుతుంది. ఆ కొయ్యబారిన దేహం వాడికంటికే భాష నేర్పిందో... జలజలా కన్నీరు పసివాడి హృదయాన్ని తరిగింది. ఓ చేత ఆ తల్లి పెట్టిన పట్టెడన్నం... మరో చేత పట్టలేని దుఃఖం. "చివరకు పట్టెడన్నం నేలపాలైంది. ఆకలిని ... దారిద్ర్యపు ఆకలిని... అమ్మప్రేమ జయించింది." పట్టలేని దుఃఖము... వాడికేదో... ఆ పసివాడికేదో పరమార్థాన్ని పంచింది. ఎక్కడో గుండె లోతుల్నించి పొంగి పొరలిన దుఃఖం... అమ్మా!.... అమ్మా... అంటూ ఆక్రోశిస్తున్న పసివాడి స్వరం... గద్గద స్వరం... ఆ తల్లి విన్న స్వరం... మళ్ళీ ఆ తల్లి లేచి వినాలకునే స్వరం... చిన్న స్వరం... భిన్న స్వరం..." బహుశా అన్ని బంధాలకు అతీతమైనది అమ్మ ప్రేమేనేమో...!" మాతృదేవోభవ.

## ఉగాది

- ఆలపాటి శ్రీనగేష్

అనాదిగా ఈ యుగాది సత్సంకల్పాలకు నాంది!
మదిలో భావి జీవితపు ఆశల సమున్నత సౌధానికి పునాది!
ఉగాది అంటే...
నభోమండలాన నక్షత్ర గమనం గమనింపు,
జీవరసాల ప్రతీకగా సేవించే పచ్చడిలో షడ్రుచుల మేళవింపు,
తరుణ వ్యాధి నివారిణి, ఆరోగ్యప్రదాయిని వేపపూత గుబాళింపు,
చైత్రలక్ష్మి కాలి అందెలను తలపిస్తూ, గుత్తులుగా చెట్లకు
వ్రేలాడే మామిడి పిందెలు కనులకింపు!
ఉగాది అంటే...
ఇంటి గుమ్మానికి మామిడి తోరణాలు,
వృక్షాలకు నవపల్లవాల ఆభరణాలు,
మనసును కుసుమించే క్రొత్త ఆకాంక్షలు ఆహ్లాద కారణాలు!
ఉగాది అంటే.... ప్రాతఃకాల అభ్యంగనం, నూతన వస్త్రధారణం,
విజయసూచికగా ఇంటిపైన ధ్వజారోహణం,
భవిష్యత్ కార్యాచరణ నిర్ణయానికై పంచాంగ శ్రవణం!
ఉగాది అంటే...
నాసికకు మత్తెక్కించే మల్లెపూల పరిమళాల ఆఘ్రాణం,
వీనులకు మత్తకోకిల మధురగాన అవధారణం,
జిహ్వకు చవులూరించే మామిడికాయల ఆస్వాదనం,
అనంత ఆనందపు ఆవిష్కరణకు అంకురార్పణం!
నాసికకు మత్తెక్కించే మల్లెపూల పరిమళాల ఆఘ్రాణం,
సృష్ట్యారంభమైన ఈ రోజున జరగాలి సత్కార్య సదాలోచనా సృష్టి!
కృతయుగం మొదలైన ఈ దినం చేద్దాం విశేష సుకృతం!
ఈ 'జయ' ఉగాది పర్వం లిఖించాలి మన జీవిత 'భారతాన' విజయ 'పర్వం'!
ఈ చైత్రం... చైతన్య రూప జైత్ర చిత్రం!
పుడమి నావరించిన ప్రకృతి సౌందర్య ఛత్రం!
ఆమని చెపుతోంది... ఉత్సాహపు ఉషోదయాలకు ఊపిరులు ఊదమని!
నవ్య, సవ్య, భవ్య, దివ్య దిశలో వడివడిగా అడుగులు వేయమని!
ఓ వసంతమా, శుభ సంతక సంకేతమైన నీ రాకతో కలిగే సంతసం సంతతమై సాగనీ సుమా!!
సర్వజనులకు సకల మంగళదాయక అమేయ, అప్రమేయ విజయాల
నందీయ విచ్చేసిన నూతన వత్సర జయా!
నీకిదే మా సాదర, సవినయ, కృతజ్ఞతామయ హార్దిక సుస్వాగతం!!!

# జీవిత సత్యం

- చింతపల్లి ఉదయజానకి లక్ష్మి ఒంగోలు. ఫోన్ : 9440731068

లక్ష్మీరాజ్యం మధ్యతరగతి గృహిణి, గృహస్తు ధర్మాన్ని చక్కగా నిర్వర్తిస్తున్న స్త్రీ మూర్తి, ఉదయాన్నే లేచి, తన ఇంటిపనులలో మునిగిపోయేది, ఇంటిపని, వంటపని, బయటపని, పిల్లల పని తానే చేసేది, భర్త నారాయణ బారెడు ప్రొద్దు ఎక్కినా నిద్రపోయేవాడు, ఏ పని సరిగా చేయడు. భర్తను గూర్చి పూర్తిగా తెలిసిన రాజ్యం, మనస్సులో బాధపడేది కానీ బయటపడేది కాదు.

లక్ష్మీరాజ్యం, నారాయణలకు 5 గురు సంతానం "రాజు" 10వ తరగతి చదువుతున్నాడు, రెండవ సంతానం 'విజయ్ 8వ తరగతి, మూడవ సంతానం 'అజయ్' 5వ తరగతి, నాల్గవ సంతానం 'కమల' 4వ తగరతి, చివరి విమల 1వ తరగతి చదువుతున్నారు.

'చిన్నకుటుంబం చింతలేని కుటుంబం' అనే ప్రభుత్వ స్లోగన్‌ను పట్టించుకోలేదు, దాని పర్యవసానం వారిది పెద్దకుటుంబంగా సమస్యల కుటుంబంగా ఉన్నది. కానీ ఆ సమస్యలు బయటకు రానిచ్చేది కాదు రాజ్యం. లక్ష్మీరాజ్యంకు చదవటం, వ్రాయటం రాదు, అక్షరాస్యురాలు కాదు. ఐదుగురు సంతానంలో, భర్తతో ఎన్నో ఇబ్బందులు పడుతూ తన కుటుంబాన్ని ఓర్పుతో, నేర్పుతో నెట్టుకొస్తున్నది. అంతేనా పట్టుబట్టి పిల్లలను ప్రభుత్వ పాఠశాలలో చదివిస్తున్నది. పిల్లలను చదివించడానికి ఒక కారణం ఉన్నది. తన చిన్న తనంలో ఒక కవి చెప్పిన కవిత ఆమె హృదయంలో నిలిచిపోయినది, ఆమె ఏకసంతాగ్రహి కావటం వలన, ఆ మాటలు తనలోతాను జ్ఞాపకం తెచ్చుకునేది.

విద్య - ఓ దివ్యమైన తపస్సు
పెంచును నీ తేజస్సు
వచ్చును ఎనలేని యశస్సు
వృద్ధి పొందును మేధస్సు
నీకు చూపించును ఉషస్సు
నీ దరిచేరనీయదు తమస్సు
అయిన ఒదిగి ఉండు నీ శిరస్సు
ఎన్నటికీ తరగని నీ వర్చస్సు
ఇది - జీవిత సత్యం! జీవిత సత్యం!

అన్న ఆ కవి మాటలు మంత్రాలులాగా ఆమెలో నిలిచిపోయాయి. పిల్లలను చదివించి, మంచి విద్యావంతులను చేయాలని, వారిని తీర్చిదిద్దాలని, వారి కొరకై నిరంతరం శ్రమిస్తున్నది. తాను పస్తులున్నా పిల్లలను పస్తులు పెట్టదు, కష్టం అంతా తాను భరించి, పిల్లలకు ఆనందాన్ని నింపేది.

* నారాయణ లారీ డ్రైవర్, బాధ్యత తెలియని మనిషి, ఏమి పట్టించుకునే వాడుకాదు, వచ్చిన ఆదాయంలో తన సరదాలు తీరగా మిగిలినది, రాజ్యంకు ఇచ్చేవాడు, భర్త ఇచ్చిన దానిలోనే పొదుపుగా కుటుంబాన్ని నడిపేది. నారాయణ ఊరంతా అప్పులు చేస్తుండేవాడు, అప్పులవాళ్ళు ఇంటిమీదకి వస్తే మౌనంగా రోదించేది రాజ్యం, తాను తీర్చగల్గినవి అయితే తానే తీర్చేది. భర్తను నిలదీస్తే చితక బాదేవాడు. భర్త ప్రభావం పిల్లలపై పడకుండా ఎంతో జాగ్రత్త వహించేది. భర్త మారాలని రోజూ పూజలు చేసేది.

నారాయణకి ఉన్న వ్యసనాల వలన HIV/AIDS గురైనాడు. ఆ వ్యాధితోనే 40 సంIIలకే మరణించాడు. భర్త మరణంతో లక్ష్మీరాజ్యం కృంగిపోయినది, గుండెలు బాదుకున్నది. లక్ష్మీరాజ్యంకు పేరుకు తగ్గట్లు ఇంట్లో లక్ష్మి లేదు, దారిద్ర్యంలో రాజ్యం చేస్తున్నది. రాజ్యం తన బాధను దిగమింగుకొన్నది, తన బాధ్యతను జ్ఞాపకం చేసుకున్నది, ఓదార్పు కోసం ఎదురుచూడలేదు, ఎవరో వస్తారని, ఏదో చేస్తారన్న ఆలోచన లేదు, బిడ్డలను తీర్చిదిద్దాలి, మంచివారిగా తయారుచెయ్యాలి అదే ఆలోచన అంతా.

* రాజ్యం తన కుటుంబాన్ని నడుపుటకు నిశ్చయించుకుంది. రోజురోజుకూ పెరుగుతున్న ధరలు - సామాన్యులైన వారు జీవించడం దుర్లభమైన పరిస్థితి అయినా ధైర్యం వీడలేదు, ఒక ఇంటిలో వంటమనిషిగా కుదిరినది, నెలకు రూ.3000/- జీతంతో కుటుంబాన్ని నేర్పుతో, పొదుపుతో నెట్టుకొస్తున్నది. పిల్లలు 5గురు ఆణిముత్యాలు, తల్లిమాట బాగా వినేవారు, గౌరవించేవారు, పిల్లలే తన ఆస్తి అని రాజ్యం మురిసిపోయేది.

* తల్లి కష్టం చూసిన పెద్దవాడు రాజు చదువును మానేసి ఏదో ఒక పనిచేసి, తల్లికి అండగా నిలుద్దాము అని నిర్ణయించుకున్నాడు, తల్లి దగ్గరకు వచ్చి, నేను చదువుమానేద్దాము అనుకుంటున్నా అని అన్నాడు. రాజ్యం వెంటనే వాడి చెంప పగులగొట్టింది, ఏమి మాట్లాడుతున్నావురా చదువు లేక నేను మీ నాన్న పడిన పాట్లని చూసావు గదరా, చదువుకుంటే నీకు మంచి భవిష్యత్తు ఉంటుంది. ఈ లోకంలో నీవు జీవించగల్గుతావు నీ విద్యయే నిన్ను కాపాడు తుంది అనే "జీవితసత్యం" నేను గ్రహించానురా, అని కంటతడిపెడుతుంది. ఎప్పుడు ఈ ఆలోచన పెట్టుకోకు నాయినా అని బుజ్జగిస్తుంది.

* రాజు కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ అమ్మను ఆప్యాయంగా చుట్టుకుపోతాడు. అప్పటివరకు మౌనంగా అన్నని, అమ్మని చూస్తున్న మిగతా నలుగురు ఒక్కసారిగా వచ్చి లక్ష్మీరాజ్యం మీద పడి బోరుమన్నారు. పిల్లలందర్నీ ఓదార్చి, వారికందరికి అన్నం కలిపి తినిపిస్తుంది. పిల్లలు అందరూ అన్నం తిని, అమ్మ చెప్పే కథవింటూ నిద్రపోతారు. రాజ్యం మాత్రం తన మనస్సులో తన సంకల్పంను దృఢపర్చుకొంటుంది.

పిల్లలకు "జ్ఞానజ్యోతిని" అందించాలనే రాజ్యంలాంటి గృహిణి, మిగత స్త్రీలకు ఆదర్శంగా నిలిచినది. చదువు యొక్క ప్రాముఖ్యాన్ని అనేకులకు చాటి చెప్పినది. తాను తెల్సుకున్న "జీవితసత్యం" అందరికీ తన పిల్లల జీవితం ద్వారా తెలియపరిచినది. •

## ఓ యువతా మేలుకో

- శ్రీనివాస్, ఫోన్ : 7306773666

ఓ యువతా మేలుకో నీ జీవితాన్నే కోరుకో
ఆశపడి ప్రేమించకు మోసపోయి మరణించకు
ఇదే నా సందేశం ఇదే నా సంకేతం.

# రెండు పిచుకలు

- అరిపిరాల సత్యప్రసాద్, హైదరాబాద్. ఫోన్ : 09966907771

భద్రం రిక్షా సంగతి చాలా మందికి తెలుసు. ఏ మాట లేకుండా ఆ రిక్షా ఎక్కి కూర్చుంటే భద్రం నేరుగా తీసుకెళ్ళే చోటూ వాళ్ళకి తెలుసు. రాత్రి సుఖాన్ని పంచే చీకటి ప్రపంచానికి టికెట్టు - భద్రం రిక్షా. పెద్ద మార్కెట్ దగ్గర బస్సు దిగగానే కనిపించే ఆటోల వెనుకగా వదలిపోయిన ముసల్దానిలా ఆ రిక్షా పడుంటుంది. దాని సీటు మీద కూర్చొనో, పక్కనే గోడవారగా నిలబడి బీడీ కాలుస్తూనో కనిపిస్తాడు భద్రం. బస్సురాగానే దాని వెనక పరుగెత్తే ఆటోవాళ్ళతో ఏ మాత్రం పోటీపడకుండా, అలాగే నిడబడతాడు. ఎవరైనా తమంతట తాము వచ్చి అడిగితే తప్ప రిక్షా కట్టడు. అలా వచ్చేవాళ్ళు క్రమం తప్పకుండా వుంటారని అతని నమ్మకం.

భద్రం రిక్షా తీసుకెళ్ళే చీకటి రాజ్యంలో వెలుగు చుక్క దుర్గ. ఒక్కసారి ఆమె సరసన చేరినవాళ్ళు పదే పదే కలవాలని కోరుకునేంత అందం, జాణతనం ఆమె సొంతం. ఆ చుట్టుప్రక్కల ఊర్ల నుంచి వచ్చే పోయే విటులతో అటు దుర్గకు, ఇటు భద్రానికి తీరికే ఉండదు. వచ్చినవాళ్ళని దుర్గ ఇంటి దగ్గర చేర్చడం, వాళ్ళకి కావాల్సినవన్ని సమకూరుస్తూ బయట వరండాలోనే తుండుగుడ్డ పరుచుకొని పడుకోవటం అతనికి అలవాటు. ఏ అర్ధరాత్రో లేకపోతే మార్నాడు ఉదయమో వచ్చిన వాళ్ళు తిరుగు ప్రయాణం కడితే వాళ్ళని మళ్ళీ బస్టాండులో దించడంతో అతని బాధ్యత పూర్తవుతుంది. మళ్ళీ పెద్ద మార్కెట్టు - రాత్రి - గోడపక్కన, ఆటోల వెనక బీడీ తాగడంతో కథ మళ్ళీ మొదలౌతుంది.

"ఈ నాలుగు రోజులూ ఇక్కడే చూరు పట్టుకొని వేలాడకపోతే నాలుగు రిక్షా బేరాలు చేసుకోకూడదూ..." అంటుంది దుర్గ.

"భలేదానివే దుర్గా... నీ యాపారానికి బ్రోకరు పని సేతన్నా కాబట్టి నా రిచ్చా ఎక్కుతున్నారు కానీ లేకపోతే ఈ రోజుల్లో ఎవల్లే రిచ్చాలెక్కేది?" అంటాడు వాడు బీడీ కాలుస్తూ.

నిజానికి దుర్గ ఆ పనీ, ఈ పనీ చేసుకుంటూ పాడే పాటలు వినాలని వాడి కోరిక. దుర్గ గొంతులో నుంచి వచ్చే మంచుతెమ్మర లాంటి ఆ పాటల మత్తులో నిద్రపోతాడు వాడు. ఓరోజు ఉండబట్టలేక అనేశాడు కూడా-

"ఏమైనా మంచి పాటగత్తెవే నువ్వు... నీ పాట ఇంటంటే ఏదో లోకాల్లో తిరిగినట్టూంటాది"... అన్నాడు.

"ఎందుకుండదూ... నాటు సారా కొట్టి వింటే గాడిద గొంతు కూడా బ్రహ్మాండంగా వుంటుంది" మూతి తిప్పింది దుర్గ.

"ఛీ... ఛీ... నీ ఇంటికాడ వుండే నాల్రోజులు ఏనాడైనా మందు కొట్టానటే.." కాస్త కోపంగానే సమర్ధించుకున్నాడు భద్రం.

"అయినా... నీ గొప్పదనం నీకు తెలియదే... చీకటి కొట్లో దీపం లాగా ఇక్కడ పడ్డావు కానీ..."

"ఆ కానీ... నేను గానీ సినిమా స్టారు అయ్యేదాన్నా?" ఇష్టంగానే వున్నా ఇష్టంలేనట్లు అడిగింది.

"ఏమో... అయ్యేదానివేమో... నీ మాట, నడక ఏం తక్కువనీ..." ఎగదిగా చూస్తూ అన్నాడు భద్రం.

అలాంటి చూపులు ఎన్నో చూసినా దుర్గకి, భద్రం చూపు మాత్రం సూటిగా తగిలింది. "చాల్లే సంబడం... రా బూజు దులుపుదాం..." అంటూ వెనక్కి తిరిగింది. తిరిగిందన్న మాటే కానీ, భద్రం చూపులు వెనుక నుంచి కూడా తడుముతున్నట్లే అనిపించి నవ్వుకుంది.

ఇద్దరూ కలిసి ఇల్లంతా దులిపారు. వరండాలో బూజు దులుపుతుంటే




## తెలుగుజాతి

- బెహరా ఉమామహేశ్వరరావు, పార్వతీపురం

కదలిరండి యువకులారా
కదలిరండి యువతులారా
నవసమాజ నిర్మాతలు మీరే
భావి సమాజ మూలధనం మీరే
తెలుగుకీర్తి పలుదిశలా విరబూయగ
నవచైతన్య దీపికలు ప్రసరింపగ
నీతికి మారుపేరుగ నిలవండి
నిజాయితీని నిలుపగ రారండి
చదువులందు అపర బృహస్పతులై
విద్యలందు వీణావాణి స్వరూపులై
అలనాటి కాకతీయ రుద్రమ్మ
పలనాటి వీరబ్రహ్మ నాయన్న
విప్లవజ్యోతిగ విలసిల్లిన అల్లూరి
భరతజాతి గర్వించే ప్రకాశం
తెలుగుకవుల ప్రతిభచాటి
నేటి తెలుగు భాష వర్ధిల్లగ
నవశకానికి నాంది పలికిన తెలుగింటి కోడలు సరోజిని
తెలుగుజాతి మణిరత్నం దుర్గాభాయమ్మ
విజయశంఖం పూరిస్తూ
మనజాతి పతాక నెగరేయండి

ఒక మూలగా వున్న పెద్ద పెద్ద పటాల వెనుక పిచుకల గూడు కనిపించింది భద్రానికి.

"ఇదెక్కడి నుండి వచ్చిందే... మనం చూణ్ణేలేదు..." అన్నాడు కర్రతో కదిలిస్తూ...

"అలాగే వుండనీయరాదూ... పాపం..." అంది దుర్గ.

"ఊ... భలేదానివే... ఇవి వుంటే ఇల్లంతా ఆగం ఆగం చేస్తాయి... గుడ్లు లేవులే..."

"అయినా సరే... వుండనీ..." తెగేసి చెప్పింది దుర్గ.

"నీ ఇష్టమమ్మా... నీ ఇల్లు... నీ ఇష్టం... నేనేమన్నా నీ మొగుణ్ణా?" అన్నాడు స్టూలు దిగుతూ.

"పోనీ చేసుకుంటావా చెప్పు...." అనేసి నవ్వి లోపలికెళ్ళిపోయింది దుర్గ.

మరో క్షణం అక్కడే వుంటే చేసుకుంటానంటాడేమో అని ఆమె భయం. మరో క్షణం వుండి వుంటే చేసుకుంటానని చెప్పేవాడినే అనుకున్నాడు భద్రం.

మళ్ళీ ఎప్పటిలాగే కథ మళ్ళీ మొదలైంది.

భద్రం రిక్షా... అదే ఆటోల వెనక... గోడపక్కన.. బీడీ తాగుతూ భద్రం.

అయితే అప్పటి నుంచి భద్రం దుర్గ ఇంటికి వచ్చినప్పుడల్లా పటాల వెనుక వున్న పిచుకులగూడునే చూసేవాడు. తనతో వచ్చినవాళ్ళని లోపలికి పంపాక ఆ గూడు వైపు చూస్తూ పడుకుంటున్నాడు. పగటిపూట వస్తే ఆ గూడు చుట్టూ తిరుగుతూ అల్లరల్లరి చేస్తున్న పిచుకల్ని చూసేవాడు. అవి లేనప్పుడు చెక్కబల్ల వేసుకోని గుడ్లు పెట్టయేమో అని చూస్తున్నాడు.

"ఊర్లో పిచుకలే కనపడటం లేదు దుర్గా... నీ ఇంట్లో ఎట్టా వచ్చి చేరాయో..." అన్నాడు ఒకరోజు.

"నీలాంటోళ్ళు బతకనిస్తే కదా వుండటానికి..." అంది.

"ఎందుకు ఎప్పుడూ నా మీద పడతావు... నేనేం చేశాననీ..." ఉడుకున్నాడు భద్రం.

"మొన్న నువ్వు తీసెయ్యబోలేదూ... నేను ఆపకపోతే ఇక్కడ కూడా లేకుండా పోయేవి..."

"అవున్నిజమే..." అని మళ్ళీ గూడు దగ్గరకు వెళ్ళి చూసి తన పనికి తాను వెళ్ళిపోయాడు భద్రం. మళ్ళీ పెళ్ళి చేసుకుంటావా అని అడుగుతుందేమో అని అనుకున్నాడు కానీ, ఆ మాట కానీ, అలాంటి సందర్భం కానీ రాలేదు.

రిక్షా చక్రం తిరిగినట్టే రోజులు కూడా దొర్లిపోయాయి.

.....

ఆడపిచుక గుడ్లు పెడుతోంది. కిచకిచ మంటూ మొగ పిచుక తెగ హడావిడి చేస్తోంది.

భద్రం, దుర్గ ప్రక్కప్రక్కనే కూర్చొని దాని వంక చూస్తూ గడిపారు.

"అబ్బబ్బ.... పాడుపిచుక... ఎంత గొడవో...!" అంది దుర్గ నవ్వుతూనే.

"ఎంత ప్రేమో కదా...!!" అన్నాడు భద్రం. దుర్గ ముందు సూటిగా చూసింది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. చప్పున లేచి లోపలికి వెళ్ళిపోయింది.

భద్రంకి తాను చేసిన తప్పేమిటో అర్థం కాలేదు అడగాలనుకున్నాడు. ఏడ్చే దుర్గని చూసే ధైర్యం లేక బయటే వుండిపోయాడు.

ఇక ఆ తరువాత దుర్గ ఉలకలేదు పలకలేదు. రోజులు దొర్లుతున్నా దుర్గ అలాగే చడీ చప్పుడు లేకుండా వుండిపోయింది. దుర్గ పాడే పాట వినపడకుండానే నిద్రపోతున్నాడు. లేస్తున్నాడు భద్రం. అతనికి మనసంతా పిచ్చిక గూడు మల్లే గందరగోళంగా అనిపించింది. మూడు రోజుల తరువాత దుర్గని నిలదీశాడు.

"ఏటే మరీ ఎడముఖం పెడముఖం పెడతన్నావు?"

"సచ్చినోడా... నా బతుకులోకి ఎందుకొచ్చావురా?" అని మాత్రం అంది దుర్గ.

"వస్తే వచ్చాను... వచ్చి ఏం చేశాననీ?" అన్నాడు దుర్గతో అర్థంకాని భద్రం.

## • అందివచ్చిన వసంతం •

- కూరపాటి నాగరాజు, నాదెండ్ల. ఫోన్ : 9247617214

పిచ్చిగడ్డి మొక్కలా
ఎక్కడా పడివున్నాను నేను ?
రెక్కలు తెగిన పక్షినై
చేయూత స్నేహం కరువై,
ఆధారం లేని గాలిపటలంలా

దిశలే కరువైన
నడిసంద్రం నావల
నడకరాని పసివాడి
తప్పటడుగులా,

మౌనం అనే గుహలో
మాట అనే శబ్దంలా
ఒడిదుడుకులు అనే
జీవిత ప్రయాణానికి

సడలిక లేని బాటసారిలా,
బ్రతుకు భారమంటు

దేహం దీనమైన వేళ
ఎవరో నన్ను తట్టి లేపినట్టయింది

చెల్లుచీటి తనఖా
మరల తిరగ రాసినట్లుంది
అక్కరకు రాని అక్షరం
సుడులుతిరిగే కన్నీటికి
ఆనకట్ట అయింది.

మాసానికో పదం వ్రాసేన్నేను
నమ్మలేని నిజాన్నయ్యాను
కాంతిరేఖలతో ప్రకాశాన్నయ్యాను
నీ అడుగు అగ్నికే ఆహుతి అన్న
ఆ నాగరికులే గులాబి రేకుల
మెత్తని తివాచితో స్వాగతం పలికారు

ఇప్పుడు కదా
రెప్పచాటున దాగిన
తిమిరం కరిగిన కేరింతలు
భయమే భాజభజింత్రులు
హర్షధ్వనులయ్యాయి
చేదు స్మృతులను మరపించి
తియ్యని మధుర క్షణాలు
ముంగిట మిగిల్చాయి !



"నీళ్ళలో నూనె పోసి కలవమంటే కలుస్తాయా... కొన్ని బతుకులింతే.." అంటూ లోపలికి వెళ్ళిపోయింది. దుర్గ మాట అర్థం అయినట్టే వుంటుంది. కానీ అర్థం కాదు భద్రానికి.

ఆరోజు రాత్రి ఎవరో పెద్దమనిషి రిక్షా వద్దకు వచ్చాడు.

"భద్రం అంటే నువ్వేనా?" అన్నాడు. భద్రం తలూపాడు. "దుర్గట... తెలుసా?"

"కూచోండి బాబూ" అంటూ ఎక్కించుకున్నాడు. ఆరాత్రి మొత్తం దుర్గ ఇంటి వరండాలో పిచుకగూడు చూస్తూ వుండిపోయాడు. అప్పటికే ఆడపిచుక గుడ్లు పెట్టేసి రెండు రోజులైంది. రాత్రంతా ఆడపిచుక గుడ్లను పొదుగుతుంటే, మగపిచుక గూడు పక్కనే కూర్చుంది. అప్పుడప్పుడు మగపిచుక అరుస్తున్నా భద్రం నిద్ర చెడలేదు. ఆ అరుపులే జోలపాట అన్నట్టు నిద్రపోయాడు.

మర్నాడు పొద్దెక్కాక కానీ లోపలికెళ్ళిన మనిషి తిరిగి రాలేదు. మళ్ళీ భద్రం రిక్షా ఎక్కి కూర్చున్నాడు. బస్టాండ్‌కు వెళ్ళంగానే వంద కాగితం చేతిలో పెట్టి – "చూసుకో... మళ్ళీ వస్తాను" అన్నాడు. భద్రానికి ఇదంతా అలవాటవడం మూలానా –"ఎప్పుడొచ్చినా ఇబ్బందిలేదు.." అంటూ ప్రకటించాడు.

ఆరోజు మళ్ళీ దుర్గ దగ్గరకు వెళ్ళినా ఆమె మాట్లాడలేదు. పలకరిస్తే చిరాకుపడింది.

పిచుకగుడ్లు అలాగే వున్నాయి. ఆడపిచుక పొదుగుతూనే ఉంది.

అన్నమాట ప్రకారమే మళ్ళీ వచ్చాడు అతను అయిదు రోజులు వరుసగా ప్రతిరోజు వచ్చాడు. భద్రానికి వేళ్ళ సందుల్లోంచి ఏదో జారిపోతున్నట్లు అనిపించింది.

గూటిలో గుడ్లు పగిలి పిల్లలు బయటికి వచ్చాయి. వాటిని చూసే నెపంతో బయటికి వచ్చింది దుర్గ.

ఒక్కసారైనా దుర్గని చూడాలని ఎదురుచూస్తున్న భద్రం దగ్గరికి వెళ్ళాడు. ఎలా వున్నావని అడగలేదు.

"ఎవరే ఆయన?" అన్నాడు.

దుర్గ వాడి కళ్ళలోకి చూసింది. గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

అదే ఆఖరు భద్రం దుర్గని చూడటం.

...

ఇప్పుడు రిక్షా భద్రం సంగతి అందరికీ తెలుసు. పెద్దమార్కెట్ దగ్గర బస్సు దిగగానే కనిపించే ఆటోల వెనకగా వదలిపోయిన ముసల్దానిలా ఆ రిక్షా పడుంటుంది. దాని సీటు మీద కూర్చోనో, పక్కనే గోడవారగా నిలబడీ బీడీ కాలుస్తూనో కనిపిస్తాడు భద్రం. బస్సు రాగానే దాని వెనుక పరుగెత్తే ఆటోవాళ్ళతో ఏ మాత్రం పోటీపడకుండా, అలాగే నిలబడతాడు. ఎవరైనా తమంతట తాము వచ్చి అడిగినా సరే రిక్షా కట్టడు. "దుర్గ వస్తుంది... తప్పకుండా వస్తుంది" అని తప్ప ఇంకో మాట మాట్లాడడు. వాడి చేతిలో ఖాళీ పిచుకగూడు ఉంటుంది. వాడి జేబులో ఒక ఉత్తరం ఉంటుంది.

ఆ ఉత్తరం దుర్గ రాసిందే –

"భద్రం,

ఈ ఉత్తరం, నీకు అందేసరికి నీకు తెలిసిపోయే ఉంటుంది. నేను రామచంద్రరావుగారితో వెళ్ళిపోతున్నాను. రెండో భార్యగా. నీకు ఇది నచ్చకపోవచ్చు. బాధ కలిగించవచ్చు. కానీ తప్పదు. ఇది నీకు స్వార్థం అని కూడా అనిపించవచ్చు. నువ్వు ఏమనుకున్నా నాకు అభ్యంతరం లేదు.

మనిద్దరం రోజు చూసే పిచుకలు గుర్తున్నాయి కదా? మనం కూడా అలాంటివాళ్ళమే. నువ్వే అన్నావు కదా -- బయటెక్కడా పిచుకలు కనపడటం లేదని. బహుశా మనం కూడా ఆ పిచుకల లాంటి వాళ్ళమే అని వాటికి తెలుసనుకుంటాను. అందుకే అవి మన దగ్గరకు వచ్చి చేరాయి. ఆ పిచుకల లాగానే మనం కూడా అంతరించిపోయే జాతుల్లో ఉన్నాము. పరుగులెత్తే కాలంలో ఒకనాటికి నీ రిక్షా కాలదోషం పట్టిపోతుంది. కరిగిపోయే కాలంలో నా పరువం కరిగిపోతుంది. ఈ మార్పులను తట్టుకోవాలంటే ఇది తప్పదు. నీ కోసం కొంత డబ్బు..."

ఆ వాక్యాల తరువాత ఏముందో ఎప్పుడూ చదవలేదు భద్రం. ●

## ప్రభుత్వ అధికారి

- దాసరి బాలయ్య

సర్కారు కొలువన్న
గాజు అద్దముల మధ్య గద్దె!
నలుచెఱగులా నిను చూడ
నాలుగు వేల కళ్ళు !
ఆంతరంగిక విషయమున్నూ
నగరమంతా షికారు !
గద్దెపై నేనుండ,
నా స్వంత అన్నదమ్ములెవరూ లేరు
నా సొంత బంధుమిత్రులెవరూ లేరు
అందరూ నావారు
నేను అందరివాడ
పక్షపాతమనిన నాకొకపట్టాన గిట్టదు
బంధుప్రీతి యనిన బహుదూరము నాకు
నేను మీ అందరి వాడ
నేను మీ సేవకుడనే !



# కవిత్వంలో యువత్వం

ఎమ్.వి.జె. భువనేశ్వరరావు, అనకాపల్లి. ఫోన్ : 8500669505

ఈ రోజుకీ కూడా మనం శ్రీశ్రీ, గురజాడ సాహిత్యాన్నే స్మరించుకోవల్సి వస్తున్నది. శ్రీశ్రీ మహాప్రస్థానం, గురజాడ కన్యాశుల్కంల గురించి తప్ప - మరో చర్చగాని, మరో విమర్శగాని, మరో ఆలోచన గాని, లేకుండానే మన సాహితీ యాత్రను కొనసాగిస్తున్నాం. దీనర్థం నేటికీ కూడా వారి రచనలకు మించిన గొప్ప సాహిత్యం తెలుగులో రాకపోవటమే మనం గుర్తించలేక పోతున్నామా ?

యౌవనంలో ఉన్నవాడు ప్రేమ గురించో, చదువుగురించో వ్రాస్తే సహజంగా ఉంటుంది. వాస్తవానికి దగ్గరగా కూడా ఉంటుంది. అతని ఆలోచనలు, అనుభూతులు నిజానికి దగ్గరగా ఉంటూ, ఉన్న విషయాన్ని ప్రతిబింబిస్తూ ఉంటాయి. అలా కాని పక్షంలో అంటే ప్రేమ గురించి పెద్దలు వ్రాసినా లేక పెద్దలు గురించి పిల్లలు వ్రాసినా ఆమోదయోగ్యంగా ఉండక పోవచ్చు. వాస్తవ విరుద్ధం గానూ తోచవచ్చు. ఎవరి అనుభవాల్ని వారు వ్రాస్తే మాత్రం చదివేవారికి ఆసక్తి కరంగానూ, అనుసరణీయంగానూ ఉండవచ్చు. కాని నేడు జరుగుతున్నదేమిటి ?

ఏడు పదుల వయస్సు దాటి, కాటికి కాళ్ళు చాపి ఉన్న ముదుసలి - ప్రేమ కవితలల్లితే అది ఏం బాగుంటుంది ? అతడు 'యువకుడు' లోనికి పరకాయ ప్రవేశం చేసినా గాని అది అసహజం కాదని అనగలమా? ఆ కవిత్వం ఆ రచయిత దిగుజారుదుతనాన్ని వెల్లడి చేస్తుందే తప్ప 'పెద్దరికం' నుండి, వెలువడిన సందేశాత్మక భావ పరంపర కాబోదు. ఈ పరిస్థితిని అధిగమించటానికి సదరు పెద్దమనిషినే కవి పుంగవుడు తన అసలు పేరును ప్రక్కనపెట్టి, మారుపేరుతోనో, కలం పేరుతోనో ఆ ప్రేమ కవితనో, ప్రణయ కవితనో పత్రికలకు చేరవేస్తాడు. అలా చేకపోయాడో, ముసలాడికి దసరా పండగన్చెప్పి, 'జనం గుసగుసలాడుకుంటారేమో నన్న భయం అంతర్లీనంగా దాగి ఉండవచ్చు కూడా!

పెట్టుబడిదారులేమో పనివాళ్ళ గురించి, పారిశ్రామిక వేత్తలేమో పరిశ్ర మల్లో పనిచేసే కార్మికుల గురించి, ప్రజాప్రతినిధులేమో ప్రజల సమస్యల

## నాన్నగారు

- బి.సురేష్‌బాబు. ఫోన్ : 8019428204

నాన్న !
ఉద్యోగం అంటూ ఉదయాన్నే లేచివెళ్లే
నాన్న
ఇంటిపట్టున ఉండలేదు
కంటినిండా నిద్రపోలేదు!
ఇంటినే కాదు
అందర్ని ఒంటిస్తంభంలా మోస్తున్న
నాన్న ... ఎప్పుడూ ఒంటరివాడే!
సంపాదనంతా కుటుంబానికే వెచ్చించి
మిగిల్చి దాచి
పిల్లల్ని మెరుగు పెట్టటం కోసం
పదును పెట్టటం కోసం
ఆంక్షల్నీ, శిక్షల్నీ రచించి
తాను శత్రువై కుటుంబం సౌఖ్యం కోసం
ఇంటా బయటా నిరంతరం
పోరాటం చేసే
నిస్వార్థ యోధుడు - నాన్న!
"ఎవరక్కడ" అని అధికారం
చెలాయించే నాన్నే గనుక
ఒక్క క్షణం మనసు మార్చుకొని
నా సంపాదన ... నా ఇష్టం అనుకుంటే
ఎవరెక్కడ ...?
అమ్మ - కొవ్వొత్తై కరిగిపోతూ
వెలుగునిస్తుంది
నాన్న - అగ్గిపుల్లై
ఆ వెలుగుకు కారకుడవుతాడు.

## తెలుగు భాషకు వెలుగు

- రెవ.డా॥ బోండ్ల సైమన్ కవి, ఖమ్మం.

తల్లిభాషకు సంతసం యెల్లల్ దాటె
అల్లన రాయల్ పొగడెను ఉల్లసించి
మెల్ల మెల్లగ చీకటుల్ తెల్లవారె
కేంద్రపాలకుల్ గుర్తించి కీర్తినిడిరి.

వాసికెక్కినట్టి భాషలయందున
దేశభాషలందు తెలుగు లెస్స
బోసిబోయి యుండె భాసుర జగతిలో
లెస్సకోలు పోక ఉస్సు రనక

అక్టోబరు ముప్పదొక్కటి హాయి గొలిపె
రెండువేల యెనిమిదికి పండు గాయె
ఎదురు తెన్నులు చూచిన యెదలు పొంగె
ప్రాచీనత్వపు హోదాను ప్రభుతనొసగ.

చార్లెస్ ఫిలిప్ బ్రౌను దొర చారుమతిని
మదిని నుంచుక సాగుము మరువబోకు
వృద్ధి చేయుము భాషను వృద్ధిచేసి
చరిత తిరుగవ్రాసి నీవు చరితనొందు.

తల్లిదండ్రుల కుండాలి తల్లిభాష
పయిన మమకారం తరగక పగలు రేయి
మాటిమాటికి యున్నట్టి మార్దవంబు
మాతృభాష మాధుర్యమున్ మరువరాదు.

గురించి, కారులో తిరిగేవాడేమో కర్షకుల గురించి, కూజా, కుండల ముఖం చూడని వాడేమో కుమ్మరి వాడి గురించి, వృద్ధులేమో 'యువప్రేమ' గురించి కవితలు అల్లేస్తారు. కథలు వ్రాసేస్తారు. వ్యాసాలు వెలువరించేస్తారు. అయితే ఇదంతా ఎందుకు జరుగుతోంది ?

సాహిత్యంతోనో, సంగీతంతోనో ప్రత్యక్ష బంధమో, పరోక్ష అనుబంధమో ప్రజలందరూ కలిగియుండ రోజుల్లుండి, వాటితో ఏ మాత్రమూ సంబంధం లేని రోజుల్లోకి తెలుగుజాతి యావత్తూ ప్రయాణం సాగించడంవలన ఏర్పడిన అనర్థాలు అన్నీ యిన్నీ కావు. గతంలో శ్రోతగానో, పాఠకుడిగానో, కనీసం ప్రేక్షకుడి గానో ప్రతీ సామాన్యవ్యక్తీ సముచితమైన పాత్ర పోషించేవాడు నేడా పరిస్థితి లేదు. కవిత్వం అనగానే అది కవుల కోసం, కవుల వల్ల, కవులచేత వ్రాయబడేది - అన్నట్లుగా తయారైంది పరిస్థితి. కవిత్వమనే కాదు ఇతర ఏ ప్రక్రియ అయినా గాని ఎవరి ఆత్మ సంతృప్తికి వారే అన్నట్లుగా ఉంది నేటి దుస్థితి. ఈ పరిస్థితికి ఎవరు కారణం ?

"మాతృభాషా తృణీకారం
మాతృదేవీ తిరస్కారం"

అన్నారు పూజ్య బాపూజీ.

"ఏ దేశమేగినా, ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము"

అని చెప్పారు శ్రీ రాయప్రోలు సుబ్బారావు.

"దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"

"వట్టిమాటలు కట్టి పెట్టవోయ్
గట్టి మేలు తలపెట్టవోయ్..."

అన్నారు శ్రీ గురజాడ అప్పారావు.

పైన చెప్పినవన్నీ మంచి విషయాలే. నిస్సందేహంగా గొప్ప విషయాలే. కాని అవన్నీ ఎవరికి తెలుస్తాయ్? ఎంతమందికి అర్థమవుతాయ్ ? చదివితేనో, వింటేనో కదా ఎవరికైనా బోధపడేది ? ఇవేమి చెయ్యకుండా వీటియందలి మాధుర్యాన్ని ఎలా గుర్తిస్తాడు ? ఆ తీపిని ఎలా గ్రహిస్తాడు ?

ఎంత గొప్పగా చదువుకున్నా, ఎంత తెలివైనవాడైనా కంప్యూటర్ పరిజ్ఞానం లేకపోతే నేడు నిరక్షరాస్యుడితో సమానంగా చలామణీ అవుతున్నాడు. సాహిత్యం తెలియనివాడు, అర్థం చేసుకొనే శక్తి లేనివాడు, సాహిత్యాభిలాషే లోపించినవాడు నిరక్షరాస్యుడి కన్నా అధముడు అనేటట్లుగా పరిగణింపబడిన రోజున సమాజం, సంస్కృతి మరింత విస్తృతంగా ఉజ్జ్వలంగా వికసిస్తాయనటంలో ఎటువంటి సందేహమూ లేదు. ఈ అవలక్షణాలు లేనివాడికి దేశాభిమానంతో పాటు, జాతిఔన్నత్యం, భాషానురక్తి, తల్లిదండ్రులపై ప్రేమ, సమాజం ఎడల బాధ్యత మరింతగా వృద్ధి చెందుతుందని నమ్మకంగా చెప్పవచ్చును.

## మనిషి తత్త్వం - గేయం

- షేక్ బషీరున్నీసా బేగం. ఫోన్ : 9985193970

మనిషీ ఓ మనిషీ
మనిషీ ఓ మనిషీ
లోకానికి రేరాజువి
జీవాలకు రారాజువి
మనసున్న మహరాజువి
మేలుకొంటే మనిషివి ॥ మ ॥

గోడకట్టి మేడకట్టి
నీకు నీవె కట్లుకట్టి
సంపదే ముద్దనుకొని
తెగమురిసీ పోయేవు మనిషీ
ఒంటరిగ మసిలేవు మనిషీ ॥ మ ॥

వెన్నెలంత నీదేనని
నేలనంత దున్నుకొన్ని
పంటనంత తిందామని
తెగమురిసీపోయేవు మనిషీ
పక్కనోడ్ని మరచేవు మనిషీ ॥ మ ॥

నీరు నిప్పు చెట్టూ చేమా
సూర్యచంద్ర సముద్రాలు
నీకన్న మేటియని
మనసుతో చూడవేమి మనిషీ
గొప్పతనమదికాద మనిషీ ॥ మ ॥

## రైతు కవిత

- మిడతాని సురేష్ కుమార్, వడలి. ఫోన్ : 9573980822

మన్నుమీద "మమకారంతో" బ్రతికే
మనసున్న మనిషిని నేనన్న !
నాపేరే రైతన్న ....
అందరికి పట్టెడు అన్నం పెట్టాలని శ్రమించే
శ్రామిక జీవిని నేనన్న !
నాపేరే రైతన్న .... ॥ మన్ను ॥

నా "చిట్టి చేతులు" ఒడ్లగింజతో ఓనమాలు నేర్పిన
విత్తిన విత్తి వరిదుబ్బలోనే జోలపాడిన
పచ్చగడ్డి నాకు పాన్పు ఆయేలే!
ఆ గట్టుపుట్ట నాకు స్నేహమాయేలే !
ఆ "వరిపైరే" నాకు జీవమాయేలే, ॥ మన్ను ॥

"ఎరువుల ధరలు" సబ్సిడీల కోత కోసిన,
మందుల ధరలు కల్తీల పాట కోరిన
మాయ మర్మం! తెలియదు నాకు,
కాయ కష్టమే ! తెలిసే నాకు,
ఆ పచ్చని పైరే నాకు జీవమాయేలే !
ఆ వరిపైరే నాకు ప్రాణమాయేలే ! ॥ మన్ను ॥

'మ్రోయింపకోయ్ మురళి మ్రోయింపకోయ్
తీయతేనియ బరువు మోయలేనిదీ బ్రతుకు"

ఇలాంటి భక్తి కవిత్వం చదవక పోటం వలనో ఏమో, ఆరాధనా భావం, భక్తి ప్రభావమూ కనుమరగై మరో మతంలోనికి ఊసరవెల్లిలా మారి సాధరణ ప్రజలు సైతం మార్పు చెందటానికి సిద్ధమై పోతున్నారు. కులమతాల పట్టింపులు లేని పరిస్థితులు, విశాల దృక్పథం ఆహ్వానించదగ్గవే. కాని కులమతాల పట్టింపులు ఉంటే వచ్చిన నష్టమేమిటి? ఓ పదిమంది కలిసికట్టుగా ఓ మంచిపని చేయటానికి, కలిసి ఆడుకోవడానికి, నలుగురు కలిసి పాడుకోవటానికి ఓ వేదికగా ఏర్పడి, ఐకమత్యంతో వృద్ధి సాధిస్తే దాంట్లో తప్పేముంది? ఇతరులను ద్వేషించనంత వరకూ, ఇబ్బంది పెట్టనంత కాలం ముమ్మాటికీ అది అనుసరణీయమే కాని ఆక్షేపణీయం కానే కాదు.

నేటి యువతరంకి కులమత పట్టింపులు కేవలం ప్రేమ వ్యామోహంలో మాయమైతే కావొచ్చును కాని ప్రాంతీయ జాతీయాభిమానం లేని వాళ్ళం కాదు. విద్యార్జన నిమిత్తమో, ఉద్యోగాన్వేషణార్థమో, స్వీయ ప్రయోజనమైతేనేమి, కుటుంబ శ్రేయస్సు కోసమైతేనేమి – నేటి యువతరం బాధ్యతల్లోనో, బాధల్లోనో మునిగి తేలుతున్న నేపథ్యం మన కళ్ళెదురుగా కల్పిస్తున్న దృశ్యాన్ని వీక్షిస్తున్న సందర్భంలో – వారెందుకు సాహిత్యానికి దూరంగా జరుగుతున్నారో బోధ పడనంత జటిల విషయమేమీ కాదు. దీనకంతటికీ ముఖ్యకారణం ఈ సాహిత్యం ఏ ఒక్కరికీ కడుపు నిండా కూడు పెట్టకపోవడమేనని చెప్పటం అతిశయోక్తి కాజాలదు. ఏ చదువు చదివితే ఉద్యోగం వస్తుందో, ఏ విద్య నేర్చితే డబ్బు రాలుతుందో, ఏ కళను అభ్యసిస్తే ఔన్నత్యం సిద్ధిస్తుందో, ఏ ప్రాంతానికి వెళితే గౌరవం లభిస్తుందో, ఏ దేశానికి చేరితే కల్లకపటంలేని సమాజం బ్రతకటానికి అవకాశమిస్తుందో, ఏ సాహిత్యం చదివితే నలుగురిలో ప్రత్యేకంగా గుర్తింపు దొరుకుతుందో నేటి యువతరానికి ఖచ్చితంగా తెలుసును అని ఒప్పుకోకుంటే అది మన తప్పే తప్ప వేరేమి కాదు.

### వాడుక భాషగా తెలుగు

- ఎస్. శ్రీనివాస్, నిమ్మకూరు. ఫోన్ : 9849036311

వ్యవహారంలో తెలుగు వాడకం హమేషా
పెరుగన్నంలో ఆవకాయలా బహు తమాషా
ఇది మా వాడుక భాష; ఇది మా వేదుక భాష
ప్రాచీన భాష, ప్రామాణిక భాష
పరువము తప్పని పరిమళాల భాష
అమందానంద రసానంద విలసిత
వీనుల విందైన భాష
వేనవేల చరిత గల
వేదతుల్య భాష
అమరనదియై ప్రవహించే
అమృతతుల్యమా భాష
ఇది
మా తెలుగు భాష
ఇది
తెలుగువారి గుండె శ్వాస

నేటి తెలుగు విద్యార్థులకు ఇక్కడ ప్రభుత్వం చాలినన్ని ఉద్యోగాలు ఇవ్వగలదా? కేవలం తెలుగులో చదువుకున్నవాడికి భాషా పండితుల ఉద్యోగాలైనా అందరికీ ఇవ్వగలుగుతుందనే విశ్వాసం ఉందా? అలా కానప్పుడు వ్యక్తిగతమైన భాషాభిమానం మెండుగా ఉంటే తప్ప ఆ చదువును చదవలేదు. ఒకవేళ తెలుగులో చదివిన వారికి ఖచ్చితంగా జీవనోపాధి దొరుకుతూ ఉంటే మాత్రం – అలా చదవకుండా ఎవరిని ఆపగలం ? విద్యార్జన పరమార్థం ఉద్యోగమే ననటం సబబు కాకపోయినా, ఆర్థికాకాంక్షలు, పేదరికం – ఉద్యోగాన్నిచ్చే విద్యవైపు తోలుకెళ్తాయనటం వాస్తవమే కదా!

నేటి పరస్థితుల నేపథ్యంలో తెలుగులో చదవనివాడికి తెలుగు సాహిత్యం గురించి ఏం తెలుస్తుంది. తెలుగు సాహిత్యమే ఎరుగనివాడు తెలుగు సాహితీ ప్రక్రియలలోనికి ఎలా ప్రవేశించగలుగుతాడు ? సాహితీ వికాసానికి ఎలా తోడ్పడగలుగుతాడు? అయితే తెలుగు యువతరాన్ని సాహిత్య లోకంలోనికి ప్రవేశించేటట్లు చెయ్యలేమా? అలా చెయ్యాలనుకుంటే ఏం చెయ్యాలి? నేటి యువతరం అనే ఒక తరం అర్థంతరంగా సాహిత్యం నుండి దూరంగా జరిగితే – ఒక తరం పూర్తిగా సాహిత్య సృజనాకు సంబంధం లేకుండా ఉండిపోతుంది. దాంతో ఒక తరం నుండి మరో తరానికి చేరాల్సిన సాహితీ సంపద, సాహిత్య వికాసం అందాల్సినంత స్థాయిలో అందక తెలుగు సాహిత్య ప్రగతి కుంటు పడుతుంది. లేదంటే ఆగిపోతుంది. ఈ ప్రమాదం జరగకుండా, ఈ నష్టం వాటిల్లకుండా తెలుగు సాహిత్యం నిరంతరం ప్రగతి బాటన పయనించాలంటే యువతరాన్ని సాహితీ బాటన నడిపించటం అత్యంతావశ్యకం. యువతరంలో సాహితీ స్ఫూర్తిని, భాషోత్సాహాన్ని నింపటంతోపాటు సామాజిక బాధ్యతతో వారంతా ముందుకు కదిలేలా దిశానిర్దేశం చేయటం తక్షణావసరం.

ఇంటిభాషగా, బడిభాషగా, ఏలుబడి భాషగా, ప్రపంచభాషగా, తెలుగు క్రొత్త వైభవాన్ని, పూర్వ గౌరవాన్ని పొంది తీరాలి. తెలుగు సాహిత్యం, ప్రపంచాంధ్ర సమాజంలో విశ్వమంతా విస్తరించి యున్న తెలుగు యువత భాగస్వాములు కావాలి. యువతలోని సృజనాత్మకతను వెలికితీసి తెలుగుసాహితీ వికాసానికి ఇంధనంగా ఉపయోగించి ఆకాశమే హద్దుగా దూసుకుపోయే అంతరిక్ష నౌకయే తెలుగుభాషా వికాసానికి ఆదర్శం కావాలి. అందుకోసం తెలుగువాడనే ప్రతివాడు కొంతైనా తమవంతు ప్రయత్నం చెయ్యాలి.

### అనుకోక హృదయాన

- కొణతం నాగేశ్వరరావు, గుంటూరు. ఫోన్ : 9985144963

సీ॥ అనుకోక హృదయాన జనియించు మేలైన
సహజాత చిహ్నము సరిగ ప్రేమ,
స్వార్థమ్ము గననీక వంచించు మార్గమై
అత్యంత నీచమౌనదియు ప్రేమ !
అట్టి ద్విముఖి నేటి కసివారి యువతపై
నెన్నియో ఘోరాల నెలయజేసె
నేయొక్క భావమో యెల్లరూ గైకొన్న
నీ యుపద్రవములు పృథివి మునునె?
తే॥ కాన బలమైన మీడియా తానె కడగి
పెండ్లికై ప్రేమ యర్థమ్ము విడువవలయు
ప్రేమ శబ్దమ్ము వాడెదు నీమరిగి
మహిని ప్రేమను లోకుల మనుపవలయు

సాహిత్య సృజనకూ, తెలుగుభాషా పాండిత్యానికి విద్యార్థుల పాఠ్య ప్రణాళికలో తగిన చోటు లభించాలి. ఈ రెండింటినీ మేళవించిన పాఠ్య ప్రణాళికలో అదొక ఐచ్ఛికాంశంగా కాకుండా తప్పనిసరి అంశంగా ప్రవేశపెట్టి తీరాలి. ఈ రకమైన అభ్యాసం ఒకటవ తరగతి నుండి కాకపోయినా, కనీసం ఐదవ తరగతి నుండైనా మొదలు కావాలి. ఈ రకమైన పాఠ్య ప్రణాళిక ప్రభుత్వ పాఠశాలతో పాటు ప్రైవేటు పాఠశాలలో సైతం ఉండి తీరాలి. ఇది తప్పేం కాదు. ఈ రకమైన బలమైన పునాది బాల్యం నుండే ఏర్పడితే – అది పదికాలాల పాటు ఆ విద్యార్థి జీవితమంతా బ్రతికే ఉంటుంది. ఇలాంటి పాఠ్య ప్రణాళిక సాంప్రదాయ పట్టభద్రుల విద్యలతో పాటు, నిర్మాణ శాస్త్రం, వైద్యశాస్త్రం, న్యాయశాస్త్రంలలో సైతం ఖచ్చితంగా అమలయ్యేలా చర్యలు తీసుకోవాలి. ఇలా చెయ్యటం వలన ఏ వృత్తి సంబంధిత కోర్సుల చదువులకీ ఆటంకం కలగదు. పైగా వారికి భాషానురక్తి మరింతగా పెంపొందుతుంది. ఎవరి మాతృభాషలో వారు చదివితే – ఆ జ్ఞానార్జన స్థాయి నిండుగా మెండుగా ఉంటుందనేది వాస్తవం. తల్లి భాషలో ఉండే తియ్యదనం, అజమాయిషీ, అవలోకనా – ఇతర భాషల్లో చదివినపుడు ఎంతో కొంత శాతం నష్టపోతామనేది ఎవరూ కాదనలేని వాస్తవం. అయినా ఎందుకు మనం ఆ పని చేయలేక పోతున్నాం ? కొన్ని దశాబ్దాల పాటు పట్టించుకోకుండా, భాషోద్యమం కేవలం కవుల సమస్యగానో, సాహితీవేత్తల అవసరంగానో భావించి, తెలుగు సమాజం నిర్లిప్తంగా ఉండిపోవటం వలన ఏర్పడిన ఈ సమస్యను తిరిగి తెలుగు సమాజం పూర్వోత్సాహంతో ముందడుగు వేయటం ద్వారానే పరిష్కరించటం సాధ్య మవుతుంది తప్ప మరెవ్వరి వలననూ ఈ నష్టం తొలగిపోతుందని అనుకోలేం. ఈ విషయంలో ప్రభుత్వ బాధ్యత కూడా ఎక్కువగానే ఉంది. కాని ప్రభుత్వం ద్వారా ఈ సమస్యను పరిష్కరించటం కోసం భాషాభిమానులు ఓ ఉద్యమంలా పని చేయక తప్పదు.

దాదాపుగా సగానికి పైగా ఉన్న యువతరం ప్రపంచమంతా విస్తరించి యుండటం ఆనందించాల్సిన విషయమే. అంతర్జాలం ద్వారా తెలుగు యువ తరాన్ని ఏకం చేయటం కూడా అంత కష్టం కూడా కాబోదు. ఏమీ నేర్వనివాడి కంటే ఎంతో కొంత తెలుగు తెలిసున్న వాళ్ళ వలన తొందరగా ప్రయోజనం సిద్ధిస్తుంది. వాళ్ళలో తెలుగు సాహితీ సృజన పరిఢవిల్లేలా రకరకాల ప్రోత్సాహాలు అందించక తప్పదు. రచయితలతో విరివిగా ముఖాముఖీలు, తెలుగు పత్రికల సౌలభ్యత, సులభంగా లభించే ఏర్పాటు, వారి సృజనలకు తగిన ప్రోత్సాహం, వారి ఆలోచనలకి తగిన ప్రాముఖ్యం, వారి అభిరుచులకు సముచిత గౌరవం ఉండేలా ఓ కార్యాచరణ ప్రణాళికతో కృష్ణాజిల్లా రచయితల సంఘం గాని, ప్రపంచం తెలుగు రచయితల సంఘం గాని ముందుకు సాగితే తప్పనిసరిగా మంచి ఫలితాలు సిద్ధిస్తాయనటంలో సందేహం లేదు. తెలుగు పత్రికలు సైతం యువ రచయితలను తగిన విధంగా ప్రోత్సహించాలి. వీరి రచనలు బాగుండక పోయినా, తగిన సూచనలిచ్చి ఎలా వ్రాస్తే ప్రచురణకు నోచుకుంటాయో తెలియజేస్తే, అది వారికి ఉపయోగకరంగానూ, ఉపయుక్తంగానూ ఉంటుంది. శ్రమయినా ఈ విధమైన ఏర్పాటు వలన వారు భవిష్యత్తులో ఇనుమడించిన ఉత్సాహంతో మంచి రచయితలుగా ఉద్భవించే అవకాశం ఉంటుంది. యువ తరంలో సాహితీ సృజనకూ, తెలుగుభాషా పటిమకూ పదును పెట్టే పాఠ్యశాలలను ఏర్పరచటం కూడా అవసరమే. ఉద్యోగ పరీక్షల కోసమో, ఉన్నత విద్యా పోటీ పరీక్షలకే అనేక అభ్యాస కేంద్రాలు ఏర్పరచబడుతున్ననూ, తెలుగు భాషను నేర్చుకొనేందుకు సైతం అటువంటి అభ్యాసకేంద్రాలు ఏర్పడక పోవటం నేటి దుస్థితికి అద్దం పడుతుంది. యువతరంలో సృజనాత్మకతకు లోటు లేనే లేదు. వారిని తగిన రీతిలో ప్రేరేపిస్తే – తెలుగు భాషా సాహిత్యాభి వృద్ధిలో మరో క్రొత్త కోణం బయటపడుతుందనటంలో ఏ రకమైన సందేహమూ లేదు. కవిత్వంలో సైతం క్రొత్త ఒరవడులకు, క్రొత్త ప్రయోగాలకు శ్రీకారం చుట్టినట్టవుతుందనటంలో ఏ రకమైన అనుమానం ఉండనక్కర్లేదు. కేవలం యువతరాన్ని సాహిత్య రంగంలోకి బలవంతంగానైనా, తాత్కాలికంగానైనా ఆకర్షించబడేట్లు చేయగలిగితే వారు ఇక్కడే తిష్టవేసి, అద్భుతాలు సృష్టిస్తారనేది నిజానికే నిజం. ●

## ప్రజాస్వామ్యం

- మహ్మద్ ఖాజా మైనద్దీన్, షాషాబ్‌గుట్ట.
ఫోన్ : 9396626276

ఇప్పుడు ప్రజాస్వామ్యం కంటే
పెరిగిపోయిన ధనస్వామ్యం
తుపాకీతో ధనంతో తన్నుకుపోవడమే
ప్రజాస్వామ్యమైంది
గుత్త పెత్తందారీతనాన్ని
చిత్తు చిత్తుగా చేయలేని
పౌరుష భాషలో మాట్లాడలేని
ఇప్పటి ప్రజాస్వామ్యం
అంతం చేస్తున్నది దేన్ని?
ప్రపంచ బ్యాంకులకు అమ్ముడుపోయి
ప్రపంచీకరణతో అపహాస్యమైపోయిన
ప్రజాస్వామ్యానికి అర్థమే లేదు
హత్యలు, ఆత్మహత్యలు, నిత్యకృత్యాలౌతున్నాయి
వీటికి కారణాలు అనంతం. అంతం ఎప్పుడో
దోచుకొని దోచుకునే జబ్బులను మాయం చేసినపుడు
డబ్బును ప్రజలకోసం వాడినపుడు
ప్రజాస్వామ్యం సమసమాజంగా మారినప్పుడు
సమాజ రుగ్మతలు అంతమౌతాయి
ప్రజలు ప్రజలుగా జీవిస్తారు.

క్షమించు మిత్రమా, ఇంగ్లీషు చదువులు చదివి తెలుగు పూర్తిగా మరిచిపోయావు. మాతృభాషను మరిచిన వాడు కన్నతల్లిని మరిచిన వాడితో సమానం
INTERVIEWS
నీకు ఈ ఉద్యోగం ఇవ్వట్లేదు!

# తెలుగుభాష ప్రతిజ్ఞ

- కర్నాల సురేష్‌బాబు

("తెలుగు అకాడమీ వారు ముద్రించే అన్ని తరగతుల పాఠ్య పుస్తకాలలో ప్రతిజ్ఞ ఈ క్రింది విధంగా ఉంటే బాగుందని బాగా ఆలోచించి ఈ ప్రతిజ్ఞను తయారుచేశాను" అని రచయిత తెలిపారు)

తెలుగు నా మాతృభాష తెలుగు పౌరునిగా పుట్టినందుకు నేను చాలా గర్విస్తున్నాను. నేను నా యొక్క మాతృభాష అయిన తెలుగును రక్షించుకునేందుకు నా శాయశక్తులా కృషి చేస్తాను. నేను తెలుగుభాషకే ప్రాముఖ్యత నిస్తాను. తోటి తెలుగు ప్రజల పట్ల గౌరవంగా నడుచుకుంటాను. నాకు జన్మనిచ్చినందుకు నా తల్లిదండ్రులను, నా మాతృభాష అయిన తెలుగుకు రుణపడి యుంటాను. నేను నా తెలుగుభాషను ప్రేమిస్తాను. తెలుగువాడిగానే కీర్తించబడతాను. తెలుగు పుత్రునిగా జన్మించిన నేను ఎప్పటికీ నా మాతృభాష పట్ల విధేయతతో ఉంటాను.

జై తెలుగునేల
జై మాతృభాష.

## ఎందుకో ? అందుకే !

- డా. అర్థి రఘునాథవర్మ, బరంపురం. ఫోన్ : 09338426472

ఆదిశంకరుడు అలనాడు
చండాలుని చూసే కాశీలో
అడ్డు తొలగమని చెప్పిననాడు
నాలో ఆత్మ నీలో ఆత్మ
ఒక్కటియే అని చండాలుడు
పలికినవాడే శివుడని తెలిపిననాడు

మానవులంతా ఒక్కటే
సకల జీవరాసులు ఒక్కటే
పరబ్రహ్మం ఒక్కటే అన్నాడు
తక్కువ ఎక్కువ జాతులు లేవని
చాటిచెప్పిన ఆదిశంకరుడు
చిన్నవయసులో పోయాడు. ఎందుకో ?

బ్రహ్మ ఒక్కటే! పరబ్రహ్మ ఒక్కటే
అన్నమయ్య ఆనాడే పలికాడు.
చండాలుడు, బ్రాహ్మణుడూ
మెట్టిన భూమది ఒక్కటే!
జాతి భేదము దూరము చేసిన
ఆ అన్నమయ్య పోయాడు
తొందరగా ఎందుకో?

స్వామి వివేకానందుడు పుట్టిన భూమి
మనదేశం భారతదేశం అయినపుడు
అమెరికాలోని చికాగోలోని
ప్రజలెందుకు స్పందించారో ఎందుకో ?

మానవ సమాజం ఒక్కటే
మానవతావాదం ఒక్కటే
భారతదేశం గణతంత్రం
అంతా సమమని చాటిన దేశం
రోజురోజుకి పెరిగిన దేశం, కాని
విద్యావిధానంలో ఒకటే లోపం
నాడూ నేడూ కన్పించే లోపం
బాగా సాగిన చదువులలో
మానవ విలువలు ఏవన్నా
మరి నైతిక విలువలు లేవన్నా
చదువుల్లో ఈ రెండూ గుండుసున్నా!

కోట్ల సంఖ్యలో నిలిచారు
డబ్బయిశాతం విద్యాహీనులు మన ప్రజలు
విద్యావిధానం
కొత్తసీసాలో పాతసారాయి
మార్పుపేరుతో నేటికీ సాగుతోంది
వివేకానందుడు గమనించిన ఈ లోపం
తొలగించడానికి కంకణ బద్ధుడై
తూర్పు, పడమర, దక్షిణ, ఉత్తర
భారతదేశం నలుమూలల
తిరిగి తిరిగి వింత ధోరణులు
పెద్దలు అతి పెద్దలనుండి
వినివినీ విసుగుజెందక
తుదకు తుట్ట తుదకూ

కొంతలో కొంత తమిళనాడులో
సాధించిన మార్పు మంచితరుణంలో
తొందరగా ఎందుకు పోయాడు, ఎందుకో ?

స్వామిలోని తీరని దాహం
తీర్చడానికి ఇంకో వివేకానందుడు
రాకమానడు రాకమానడు
అతడే నేనెందుకు కాకూడదు ?

ఏడు పదులూ దాటినా విద్యా విధానం
మార్పుకోసం పోరాటం సాగించడానికి
నేనందుకే నిలిచాను ఇంకా, ఇంకా
ఈ జీవితాన్ని ఇంకా సాగించాలని
దేవుడు మార్పుకోసమే నిలిపాడు
ఎందుకో? మరి అందుకే !

## లేచి రారా ! అమరవీరా...

- తిరుపతి రమేష్ బాబు, ఏలూరు. ఫోన్ : 9396510976

అన్యదేశపు రాయబారులు
ఆహా ! ఓహోఁ! యన
జరిపించినావు భువన విజయము
ఈ ఏలుబడే
ఒక స్వర్ణయుగము
అష్టదిగ్గజ కవులు తెచ్చిరి
అమరకీర్తి నీకు
ఓ కృష్ణదేవరాయా !
దేశభాషలందు
తెలుగు లెస్సని
తేల్చి చెప్పిన
ఓ అమర వీరా !
లేచి రారా !

# రాయలనాటి రచనలు

- యస్. ఝాన్సీరాణి, ముత్యాలంపాడు, కర్నూలుజిల్లా.

**శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన కవుల సాహిత్యం :**

శ్రీకృష్ణదేవరాయల పాలనాకాలంలో నూతనంగా అవతరించిన సాహితీ ప్రక్రియకే ప్రబంధం అని పేరు. ఈ కాలంలో అనేకమైన అద్భుత ప్రబంధాలు రావడం మూలాన ఈ యుగానికి "ప్రబంధయుగం" అనే పేరు వచ్చింది. తెలుగు సాహిత్య చరిత్రలో రాయల యుగానికి "ప్రబంధయుగం" అనే సార్థక నామధేయం ఏర్పడింది. శ్రీకృష్ణదేవరాయల స్థానంలో గల అష్టదిగ్గజకవుల్లో అగ్రగణ్యుడైన పెద్దన వ్రాసిన "మనుచరిత్ర"యే సంపూర్ణ ప్రబంధ లక్షణాలు కలిగిన మొదటి ప్రబంధంగా చెబుతారు.

ప్రబంధం అంటే ప్రకృష్టమైన బంధం కలది అని అర్థం. పురాణేతిహాసాల నుండి చిన్న కథను తీసుకొని వర్ణనలతో పెంచి చక్కటి స్వతంత్రకావ్యంగా వ్రాస్తే అది ప్రబంధం అనబడుతుంది. దీనిలో అష్టాదశ వర్ణనలు ఉంటాయి. వస్తు ఐక్యత కలిగి ఉంటుంది. అంటే ప్రధాన కథనే ప్రధానంగా వర్ణించడం అన్య ఉపఖ్యానాల జోలికి పోకుండా రచించాడన్నమాట.

సాహితీ సమరాంగణ సార్వభౌమునిగా, ఆదర్శ చక్రవర్తిగా, సకల కళా విశారదునిగా, కవిజన పోషకునిగా, సంగీత ప్రియునిగా, పాలనాదక్షునిగా వినుతికెక్కిన ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయలు తెలుగు సాహిత్యాభ్యుదయానికి విశేష కృషి చేయడం ద్వారా "ఆంధ్రభోజుడు"గా కీర్తించబడ్డాడు. శ్రీకృష్ణదేవ రాయలు స్వయంగా కవి మాత్రమే కాదు తన ఆస్థానంలో కవులకు స్థానమిచ్చిన కవిజనపోషకుడు. ఇతని ఆస్థానంలో "అష్టదిగ్గజకవులు" కలరు.

తెలుగులో "జాంబవతీ పరిణయం" అనే నాటకాన్ని, శ్రీకాకుళాంధ్ర విష్ణువు కోరిక మేరకు "ఆముక్తమాల్యద" అనే భక్తిరస ప్రాధాన్యత కల్గిన ప్రబంధ కావ్యాన్ని వ్రాశారు. "ఆముక్తమాల్యద" అంటే ఆ + ముక్త + మాల్యద = తాను ధరించుకున్న మాలలను భగవంతునికి సమర్పించినది." అని అర్థం.

**అల్లసాని పెద్దన : (క్రీ.శ.1475-1535)**

సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానము నందు గల అష్టదిగ్గజకవులలో అగ్రగణ్యుడు. రాయలకు అత్యంత హితుడు అల్లసాని పెద్దన. పెద్దన రచించిన "స్వారోచిషమను సంభవానికి "మనుచరిత్ర" అనే పేరు కూడా కలదు.




"అల్లసాని వారి అల్లిక "జిగిబిగి" అని ఇతని కవితకు ప్రసిద్ధి. 'జిగి' అంటే "కాంతి"; 'బిగి' అంటే "పటుత్వము" అని అర్థం

చ॥ ఆట జని కాంచె భూమి సురు డంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటక చరత్కరేణు కర కంపిత సాలము శీతశైలమున్"

ఈ పద్యాన్ని పురస్కరంచుకొని చూడగా "అల్లసాని" వారి అల్లిక జిగిబిగి" అనడానికి పద్యము మచ్చుతునక అనిపిస్తుంది.

**నందితిమ్మన :**

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములోని అష్టదిగ్గజకవులలో నంది తిమ్మన ఒకరు. ఇతనికి "ముక్కు తిమ్మనగా" వ్యవహార నామం ఉంది. ఈయన రాయల ఆస్థానానికి "ఆరణపు" కవిగా వచ్చినట్లు చెబుతారు. తిమ్మనగారి శైలి మధురంగా ఉంటుంది. సహజసుందరమైన సంభాషణలతోను, మనోహరమైన ప్రకృతి వర్ణనలతోనూ అలవోకగా సాగిపోతుంది. కాబట్టి "ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు" అని సాహితీలోకాన కొనియాడబడ్డాడు. ఇతను రాయల యొక్క వంశాన్ని గూర్చి పరాక్రమం, విజయాలను గూర్చి వర్ణించాడు.

## కాలం కళ్ళపైన ...

- డా॥ జడా సుబ్బారావు. ఫోన్ : 9849031587

కాలం కళ్ళపైన
కలల దుప్పటి కప్పి
కాగితాల్ని ముందేసుకుని
కలం సిరా ఒంపుతున్నాను ...!
మౌనం ముళ్ళపైన
మాటల్ని పేర్చి
మనసుతో యుద్ధం చేస్తూ
మమతల కోసం పాకులాడుతున్నాను ...!

జీవితమంటే ఇంతేనేమో !
కాసిని కన్నీళ్ళు ...
కాసిని కష్టాల ముళ్ళు ...
ఆవేశాల వెతుకులాటలు
ఆశల బతుకుబాటలు!
నిలకడలేని మనసుకీ
నడవలేని జీవితానికీ
నడుమ దోబూచులాట ..!

ఎగసిపడే అలలకీ
ఎదురుచూసే కలలకీ
తీరం తెలియని మిడిసిపాటు ...!
ఎంత కాదనుకున్నా ...
జీవితం ఒక వల....!
చెదిరిపోయిన కల ...!
ఆశకీ .. శ్వాసకీ నడుమ ...
ఒంటరి వానచుక్కలా నేను ...
కాలం కళ్ళపైన కలల దుప్పటి కప్పి
కలం సిరా ఒంపుతూనే వున్నాను ..!?!




ముందుగా ఆయన మూల పురుషుడగు చంద్రుడు చల్లగా చూడాలని ఆశీర్వదిస్తూ కావ్యాన్ని వ్రాసాడు.

'వలిమల యల్లువాడు తలవాక ధరించిన పూవు గుత్తి వే
ల్పుల గమి జీవగఱ్ఱ యుడివోవని చల్వలటెంకి వెన్నెల
ల్మొలచిన పాదు పాల్కడలి ముద్దుల పట్టి నృసింహకృష్ణరా
యల కరుణారసంబు నిను పాటెడి చూపుల జూచు కావుతన్."

**సరసకవి - తెనాలి - రామకృష్ణుడు : (క్రీ.శ.1500)**

తెలుగు సాహిత్యంలో హాస్యప్రియునిగాను, వికటకవిగాను, ప్రసిద్ధి చెందిన రాయల ఆస్థానకవి తెనాలి రామకృష్ణుడు, రాయలవారు రామకృష్ణుని పరీక్షించదలచి "రాధేయుడు నందినెక్కి రావణుగెలిచెన్" అనే సమస్యను పూరించమన్నాడు. రామకృష్ణుడు ఇలా పూరించాడు.

"యోధుడెవ్వడు కురుబలమున ?
మాధవ సఖుడేమి యెక్కిమరి తిరుగాడున్ ?
సాధించె రాముడెవ్వరి?
రాధేయుడు, నందినెక్కి రావణుగెలిచెన్

ఆ తర్వాత పెద్దనామాత్యులవారు "గోలకొండ", "మూలముండ" "పూలదండ", "కొత్తకుండ" అనే పదాలను ఇచ్చి భారతార్థం వచ్చేటట్లుగా చక్కటి పద్యాన్ని చెప్పమనగా రామకృష్ణుడు ఇలా చెప్పారు.

ఓయి కురురాజ! నీ సుతుదుత్తగోల
కొండ వలెనుండు, విను మూలముండదిక
భండనంబున గెల్పింతు బాందుసుతుల
నురమునకు పూలదండ రేకొత్తకుండ"

**కవితాశైలి :** "నీటిమీది అలలను - నీటి దొంకలుగాను" "వంట ఇంటిని రసవలి"గాను వర్ణిస్తూ నూతన పదాలనెన్నింటినో కల్పించాడు.

**ధూర్జటి :** శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమందుగల అష్టదిగ్గజకవులలో ఒకరు. ధూర్జటి కవితామాధుర్యానికి ముగ్ధుడైన రాయలు "స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గెనీ యతులిత మాధురీ మహిమ" అని పొగడెనని తెలియుచున్నది. ధారాళమైన పద్యశైలి ఇతనిది. ●

## అమ్మబాస - వెన్నపూస

- వశిష్ఠ, హైదరాబాద్. ఫోన్ : 9440906832

"తలకట్టు" తెనుగుభాషకు
తలమానికమై వెలుంగు తలపాగవలెన్
తలకట్టు భాష సొగసును
తలచిననే తెనుగువాడి తనువుప్పొంగున్
ఉ. నన్నయ తిక్కనాది కవి నాథుల కైతలయింపు
సొంపులో
వన్నెలు చిందె కావ్యసుధ వందల యేండ్లుగ
వైభవమ్ముతో
మన్నన పొందె జానపద మాటల పాటల
తోటలందునన్
మన్నన లేదు నేడు మన మాత తెనుంగుకు
మాతృగడ్డపై

## మినీ కవితలు

- కందేపి రాణీప్రసాద్. ఫోన్ : 9866160378

సముద్రంలో
ఎంత సర్ఫ్ ఒలికిందో
ఎన్నటికీ తరగని
నురగలు

మొగ్గలపై
మోయలేని భారం
కొన్ని వాలిపోతూ
కొన్ని రాలిపోతూ

ఆమె చేతిలో
గోరింటాకే కాదు

కవిత్వమూ
పండుతుంది

బాల్యం
దొంగిలించబడింది
అమ్మా, నాన్న, పాఠశాల
దొంగలెవరో?

చెమ్మచెక్క ఆట
అటకెక్కింది
చేతవెన్నముద్ద
చెయ్యిజారిపోయింది !

స్త్రీల కళ్ళలో
కన్నీటి కాపురాలు
బహుశ
అందంగా ఉన్నాయని కాబోలు

నెమలీక
పాఠాలు చదువుతోంది
గాలిపటం
స్కూల్లో చిక్కుకుపోయింది

చిన్నగుండెకు
చిల్లిపడింది

మమతలు, బంధాలు
జారిపోయాయి

సూర్యుడు
సూటిగా చూశాడేమో
ఆకాశం బుగ్గలు
కెంపులయ్యాయి

ఆకాశంలో
చుక్కలు పెట్టే ఉన్నాయి
ముగ్గులు వెయ్యటమే
ఇక తరువాయి

# యువతకోసం ఏం చెయ్యాలి...?

- గుండాన జోగారావ్, విశాఖపట్నం. ఫోన్ : 9490185708

ఒక సంఘటనకు స్పందించి తమ భావావిష్కరణకై ఎంతోమంది తపిస్తుంటారు. అక్షరీకరించి నలుగురికీ వినిపించాలని తహతహలాడుతుంటారు. అయితే వారికి పాఠకునికి లేదా శ్రోతకు చేరుకునే మాధ్యమం అందుబాటులో లేకపోవడంతో అయోమయంలో ఉంటారు. అటువంటి వారి వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ యువనవ ఔత్సాహిక కలాల చిరునామాగా నిలిచింది సాహితీ సంస్థ 'సృజన... విశాఖ'. ప్రతినెలా మూడవ ఆదివారం విశాఖపట్నంలో గోపాలపట్నం శాఖా గ్రంథాలయంలో సాహిత్య కార్యక్రమాల్ని గత ఐదేళ్ళుగా నిర్వహిస్తోంది.

ప్రముఖకవి శ్రీ కొంపెల్ల కామేశ్వరరావు వ్యవస్థాపక అధ్యక్షునిగా జనవరి 2009లో ప్రారంభమైన ఈ సాహితీ సంస్థ వైవిధ్యభరిత కార్యక్రమాల రూపకల్పనలో తన కంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. యువ నవ కవి రచయితల్ని కేవలం శ్రోతలుగా మిగల్చకుండా కార్యక్రమం భాగస్వామ్యం చేస్తూ భావావిష్కరణకు అవకాశం కల్పిస్తోంది. 'మీ భావం - మీ అక్షరం' 'వేదిక మీదే - వినిపించడం!' 'కవనభోజనం!' సమీక్ష', మినీకథాసౌదామిని, కవి సమ్మేళనం, 'వాక్యం మాది - కథనం మీది', 'ఉత్తరాల అత్తరు' పేరుతో లేఖా సాహిత్యం, పుస్తకావిష్కరణలూ, పోస్టుకార్డు మినీ కథల పోటీలు, కవితల పోటీలూ నిర్వహిస్తూ ప్రముఖ కవులూ రచయితల్ని సత్కరిస్తూ సాహితీ ప్రియుల ప్రశంసల్ని అందుకుంటోంది. ఈ సంస్థ ప్రత్యేకత ఏమిటంటే కార్యక్రమానికి హాజరయ్యే వారికి ఏదైనా ఒక పుస్తకాన్ని బహుమతిగా ఇవ్వడం. 'కవితా సేద్యం' శీర్షికతో యువనవకవుల కవితల్ని ఆహ్వానించి ప్రముఖ కవులతో ఆ కవితల్ని విశ్లేషింపజేసి కవితా రచనలో మెలకువల్ని నేర్పుతుంది. అలానే కథావైద్యం శీర్షికతో యువనవ కథకుల కథల్ని ఆహ్వానించి కథా రచనలో ఎత్తుగడ, కథనం, కొసమెరుపు, శీర్షికల విషయమై సూచనలూ సలహాలూ అందిస్తోంది. ఈ సాహితీ సంస్థ ద్వారా అక్షరాలకు లక్షణాలు నేర్చుకుని మంచి రచనలు చేస్తూ సాహితీ లోకంలో పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తూ పోటీల్లో బహుమతులు అందుకుంటున్న కవులూ రచయితలూ ఎందరో ఉన్నారు.

పఠనం తగ్గి వీక్షణం పెరిగిన ఈ రోజుల్లో సాహిత్య సభలకూ కార్యక్రమాలకూ ఉద్యోగ విరామానంతరం జీవితాన్ని గడిపేవారు కాలక్షేపానికి వచ్చి వెళ్తున్నారు. అయితే యువనవకలాన్ని ఆకట్టుకోవాలంటే వారిని కార్యక్రమంలో భాగస్వాములుగా చేస్తూ కార్యక్రమ రూపకల్పన చేస్తూ ఫలితం ప్రయోజనాత్మకంగా ఉంటుంది. 'మేం ప్రసంగిస్తాం - మీరు వినండి' అనే ధోరణిలో సాగితే కార్యక్రమాలు నడిస్తే యువతని ఆకట్టుకోలేం. ఈ విషయంలో 'సృజనం... విశాఖ' ప్రయోగాత్మక కార్యక్రమాలతో సరికొత్త కవులూ రచయితల్ని సమావేశాలకు తప్పనిసరిగా హాజరయ్యేలా చేస్తోంది. ప్రతి కార్యక్రమంలో కనీసం ఏభై మంది యువనవ రచయితలు సాహిత్య విశేషాల్ని ఆకళింపు చేసుకుంటూ, ప్రముఖ రచయితల దిశా నిర్దేశంలో సంతృప్తిగా కార్యక్రమంలో పాలు పంచుకుంటున్నారు.

సాహిత్య సమావేశం అనగానే ప్రముఖుల శత జయంతులూ వర్ధంతులూ అంటూ హడావిడి చేసేకన్నా యువ నవ రచయితలకు ప్రయోజనాత్మకంగా కార్యక్రమాల్ని రూపకల్పన చేస్తే హాజరయ్యే వారి సంఖ్య పెరుగుతుంది. యాభై ఏళ్ళ క్రింద రాసిన నవలను సమీక్షిస్తూ పదేపదే ప్రసంగిస్తే ఎవరు వింటారు? కవితలూ కథలపై శిక్షణా శిబిరాలు నిర్వహించాలి. వర్తమాన సాహిత్యంపై చర్చించాలి. ప్రయోజనాత్మక అంశాలపై రచనలు చేయడానికి యువనవ రచయితల్ని ప్రోత్సహించాలి. ఏ పుస్తక రూపేణా ప్రోత్సాహకమివ్వాలి. వర్తమాన

## నాగులేటి ఒడ్డు ....

- కోసూరి రవికుమార్, దాచేపల్లి. ఫోన్ : 9491336488

ఏటొడ్డున నుంచుంటే,
చిన్నప్పుడు అచ్చుపుస్తకం గూటిపడవతో
ఏరంతా ఈదిన జ్ఞాపకం

తుంగ కాడను తుంచి
హారాలుగా చేసి
తరగతి గుమ్మానికి తగిలించినట్లు గుర్తు !
గట్టుమీద పాకుతున్న
నత్త నెత్తిన సుతారంగా తాకినట్లూ ...
నిశ్శబ్దంగా నీళ్లలోకి తొంగి చూస్తూ
తాబేలు తల అంత వేగంగా
లోపలికెలా వెళ్తుందోనని
ఆలోచనలో మునిగినట్లూ ...
ఒక చల్లని కల.

ఏటొడ్డు ఒక స్నేహితుడు
ఎన్ని వింతులు చూపి
నన్ను తీరం చేర్చిందో....

తడిసి, ఎండి, దమ్ము చక్రాల గాట్లు పడిన
జీవిత చిత్రమీ ఏటొడ్డు
ఇపుడు మాత్రం
కొంగు బిగించిన ఒక స్త్రీ
ఏదో లోహపు గొట్టం
తన రెల్లుపైటలోంచి తొంగి చూస్తోంది
బహుశా అది ఆయుధమే నేమో...
తప్పనిసరి ఆయుధమై
ఎవరికోసమో మాటేసి ఉన్నట్టుంది.

నలుగురైదుగురు కలిసి
ఒకేసారి చిందరవందరగా హింసించినప్పటి బాధ ఏదో
ఇంకా వొళ్ళంతా సెగలు కక్కిస్తున్నట్లు
తన చుట్టూ వున్న గాలి వేడిగా వీస్తోంది.

బలవంతంగా లాక్కుపోయిన గుర్తులు
ఇంకా ఆ చిత్తడినేలలో నెత్తురుడికిస్తూనే వున్నాయి
నిన్న .. ఈ రోజు.. రేపు
పసిపంట మీదకి ఎగబడ్డ పశువుల కోసం
కాపేసే ... వున్నట్లుంది.

ఇప్పుడు
ఏటొడ్డు ఒక స్నేహితుడే కాదు
మృగం కోసం మాటేయటాన్ని నేర్పే
మార్గదర్శకుడు కూడా.




సమాజాన్ని ప్రతిబింబిస్తూ కవి సమ్మేళనాలు, కథా పఠనం కార్యక్రమాలు విరివిగా జరగాలి.

యువ నవ రచయితల్ని వెలికితీసే ప్రయత్నంలో భాగంగా కళాశాల తెలుగు అధ్యాపకులతో చర్చించి ఒక అంశం ఇచ్చి కవిత లేదా చిన్న కథ రాయమని చెప్పాలి. కార్యక్రమాల్ని వీలైతే కళాశాల సభా ప్రాంగణంలో నిర్వహిస్తూ విజేతలకు అక్కడే ప్రధానాచార్యుల వారి చేతులమీదుగా పుస్తక రూపేణా బహుమతులు అందజేస్తే ఉత్సాహాన్ని ఉత్తేజాన్ని పొంది కొత్త రచయితలు రచనా ప్రక్రియకు శ్రీకారం చుడతారు.

బాలల్లో నిబిడీకృతమైన సృజనాత్మకతకు పదునుపెట్టి, చక్కని వాక్యాలుగా తీర్చిదిద్దడానికి 'కథ చెబుతాం – విని రాయండి' 'అంశం మాది – అక్షరం మీది' వంటి కార్యక్రమాల్ని నిర్వహించి అనూహ్య స్పందనతో ముందుకు సాగిపోతుంది. 'సృజన... విశాఖ' తెలుగు సామెతల్ని విడమర్చి పిట్టకథలుగా చెప్పమని ఆహ్వానిస్తే పిల్లలు ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. బాలల కార్యక్రమాలకు పిల్లల్ని ప్రోత్సహిస్తూ పంపిస్తున్న తెలుగు ఉపాధ్యాయులకు ధన్యవాదాలు. ప్రముఖుల రచనల్ని బహుమతులుగా అందుకుంటూ పిల్లలు ఎంతో మురిసిపోతున్నారు.

ఈ రోజు పరిణతి చెందిన రచయితలు ఒకానొక దశలో కొత్తవారే కదా కాబట్టి కొత్తగా రాసేవారి రచనల్ని చెత్తగా తీసి పారేయకుండా శిక్షణా శిబిరాలతో దిశా నిర్దేశం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. సాహితీ సంస్థలు దీన్ని బాధ్యతగా తీసుకుని కార్యక్రమాల్ని జరపాలి. చిన్నా, పెద్దా కొత్త పాత రచయితలందరూ తెలుగు భాషాభిమానులే. తెలుగు భాషపై మమకారంతో అంతులేని ప్రేమతో రచనలు చేస్తున్నవారే.

సాహిత్య కార్యక్రమాల్ని నిర్వహిస్తున్న సంస్థలకూ, కొత్త రచయితల్ని ప్రోత్సహిస్తున్న చిన్న పత్రికలూ అధికార భాషా సంఘం వారు ఆర్థిక హార్థిక సహకారాన్ని తప్పకుండా అందించాలి. ప్రతి తెలుగువాడూ అక్షర ప్రేమికునిగా మారడానికి తగిన వాతావరణం కల్పించాలి.

తెలుగు నిత్యం వెలుగు జిలుగే. అజంతమైన అందమైన భాషా మాధుర్యాన్ని రకరకాల ప్రక్రియల ద్వారా ఆస్వాదించే అవకాశాన్ని పీఠాధిపతులు కల్గించాలి.

నిరుడు కురిసిన హిమ సమూహములు స్వచ్ఛ సలిల సుజలవాహినిగా సదా ప్రవహించాలి

జై తెలుగుతల్లి!

## మనిషికెంత బరువో

- కన్నెగంటి వెంకటయ్య, లాలాపురం, ఖమ్మంజిల్లా. ఫోన్ : 9885657582

ధనం విలువ పెరుగుతుంటె మనిషికెంత బరువో
జనం విలువ తరుగుతుంటె ప్రగతికెంత కరువో

స్పష్టమైన రీతిలేని పుస్తకాల సంచులు
పుష్టిలేని పిల్లవాడి వయసుకెంత బరువో

కళ్ళలో పెట్టుకొని పెంచుకున్న బిడ్డలు
పెళ్ళితోటి దూరమైతె మనసుకెంత బరువో

భావాలకు అడ్డుతగిలె పరభాషల మాటలు
తియ్యనైన తెలుగుభాష సొగసుకెంత బరువో

పదిమందికి మంచికోరె చైతన్యపు బాటలో
నడవకుంటె 'కన్నెగంటి' శ్వాసకెంత బరువో

## తెలుగు భారతి నీకు జయము

- డా॥ ఆంజనేయుడు, కర్నూలు. ఫోన్ : 9494736351

**పల్లవి**

తెలుగుతల్లీ నీకు వందనం –తెలుగు భారతి నీకు చందనం
సకల కళల కల్పవల్లికి – సకల జనులు ప్రణమిల్లిరి ... (2)

**చరణం**

1. పల్లె పదమె పరిమళించి – రాచనగరులో భరిత మాయెను
వికసమాయెను అఖిలమందు – విజయమాయెను వాదమందు
పదకవుల పదనిసలు – భువన విజయ వన్నె చిన్నెలు
నాటి వీరుని విజయగీతికా – నేడు విశ్వమంతా వెలుగు దీపికా

2. గోదావరి గల గలలు – కృష్ణవేణి కులుకు హొయలు
ఒద్దియైన పాడిపంటలు – వరములిచ్చెడు వనరులెన్నో
అమరావతి, ఓరుగల్లు – అపురూప శిల్ప కళలు
సాటిలేని శిఖర శ్రేణులు – తేజరిల్లెను తెలుగుజాతి

3. వెన్నుచూపక రొమ్ము విరచిన – ధీరులు మగధీరులు
నుదుట సింధూరం దిద్దిన – వనితలు వీర వనితలు
అమరజీవుని ఆత్మత్యాగం – అవతరించెను ఆంధ్రరాష్ట్రం
వివిధ భాషలు సంగమించిన – భారతి నీకు జయము
తెలుగు భారతి నీకు జయము .....

# బహుముఖ ప్రజ్ఞాశాలి గిడుగు

- అగతముడి మరియదాసు. ఫోన్ : 9490596240

"భాషాశాసన చణుడై
పరగినట్టి గిడుగు
తెలుగువారి వెలుగుదారి
తెలివెన్నెల మడుగు ..." శ్రీశ్రీ...

కోనసీమ నుండి ఉపాధికోసం కళింగసీమకు వచ్చిన కుటుంబాలలో ఎక్కువ పేరు ప్రఖ్యాతులు పొందిన వ్యక్తులలో గిడుగు వేంకట రామమూర్తిగారు ఒకరు.

1830లో కోనసీమలో తీవ్రకరువు కాటకాలు వచ్చినపుడు తూర్పు గోదావరి జిల్లా, అమలాపురమునకు మైలుదూరంలో ఉన్న ఇందుపల్లి గ్రామము నుండి ఉద్యోగం కోసం విజయనగరం వలసవచ్చిన వారు వీర్రాజుగారు.

శ్రీకాకుళం జిల్లా, సరుబుజ్జిలి మండలం, పర్వతాల పేట గ్రామంలో వీర్రాజు, వెంకమాంబ దంపతులకు తే.29.08.1863న గిడుగు వేంకట రామమూర్తిగారు జన్మించారు. గిడుగు వేంకట రామమూర్తి గారికి కీ॥శే॥ వారణాసి గున్నయ్య శాస్త్రి గారు చదవడం, రాయడం నేర్పారు. గిడుగువారికి విజయనగరంలో గురజాడ అప్పారావు గారు సహాధ్యాయి.

గిడుగువారు మెట్రిక్యులేషన్ పాసై పర్లాకిమిడి రాజావారి మిడిల్ స్కూల్‌లో ఫస్టుఫారం టీచర్‌గా చేరారు. 16వ యేట 1879లో కందికొండ రామదాసు పంతులుగారి కుమార్తె అన్నపూర్ణతో వివాహం జరిగింది. 1885లో పుత్రోదయం. పేరు వెంకట సీతాపతి.

రామమూర్తి గారికి ఉన్న నిరుపమానమైన మానవతాదృష్టి తరువాత తరాల వారికి మార్గదర్శకం అవుతుందని, నేడు ఆయనను పలువురు కేవలం వ్యవహార భాషావాదిగా మాత్రమే పరిగణించటం ఆయన బహుముఖ ప్రజ్ఞను కేవలం ఒక కోణం నుండి దర్శించడమే అవుతుంది. ఆయన డేనియల్ జోన్స్ వంటి బ్రిటీష్ ధ్వని శాస్త్రవేత్తలతో చర్చలు జరిపారు. ఓట్టో జెస్‌పర్సన్ వంటి వ్యాసకర్తలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన అంతర్జాతీయ స్థాయి భాషా శాస్త్రవేత్త. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, వేదం, వేటూరి వంటి సమకాలీన పండితులను ఆశ్చర్యపరచిన కావ్యభాషా పరిశోధకులు.

ఎపిగ్రాఫికా ఇండికా సంపుటాల్లోను, విన్‌సెంట్ స్మిత్ రచించిన ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియాలోను స్వీకరించబడిన నిర్ణయాలు ప్రకటించిన శాసనపరిశోధకులు. ఈయన థర్‌స్టన్ రచించిన కాస్ట్స్ అండ్ ట్రైబ్స్ ఆఫ్ సదరన్ ఇండియా సంపుటాల్లో సవరజాతికి సంబంధించిన అంశాలకు ఆధారమైన పరిశోధక రచనలు చేసిన శాస్త్రవేత్త. సవరలకు వారి భాషలోనే విద్య నేర్పాలని ధ్వన్యాత్మక లిపిలో వాచకాలు, ఆధునిక పద్ధతిలో వ్యాకరణ, నిఘంటువులు రూపొందించిన సవర భాషా శాస్త్రవేత్త. మైదాన ప్రాంత ప్రజలచే దారుణంగా మోసపోతున్న సవరల జీవితాలను గమనించి వారిలో చైతన్యం కలిగించాలని, వారిని విద్యావంతులుగా తీర్చిదిద్దాలని సొంత డబ్బులతో బడులుపెట్టి వారికి సౌకర్యాలు కల్పించేలా ప్రభుత్వంపై ఒత్తిడి చేసి వారి అభివృద్ధికి పాటుపడిన మానవతావాది. నాటి విద్యాశాఖాధికారి జె.ఎ.యేట్స్‌తో చర్చలు జరిపి తెలుగువారు ఇంగ్లీషు నేర్చుకోవడానికి ప్రత్యక్ష బోధన పద్ధతిని ప్రవేశపెట్టి ఇతర శాస్త్రాంశాల బోధనను పటిష్ట పరచడానికి 'ద టీచర్' అనే పత్రికను నిర్వహించిన శాస్త్రవేత్త. వ్యవహారిక భాషావాదాన్ని ఊతంగా వాడుక భాషకు, పత్రికా రచనకు మార్గదర్శకంగా 'తెలుగు' అనే పత్రికను నడిపిన పత్రికా రచయిత. గాంధీగారి అస్పృశ్యతా నివారణోద్యమానికి ముందుగానే నాడు అస్పృశ్యులుగా చూడబడే గిరిజన బాలుడిని ఇంటిలో పెట్టుకొని సవరభాష నేర్చుకోవడం, సవరలు చదివే పాఠశాలలకు వెళ్ళి పర్యవేక్షించడానికి కొందరు అధ్యాపకులు నిరాకరించినప్పుడు తాను వెళ్లడం, కందుకూరి వీరేశలింగం ప్రభావంతో ఒక బాల వితంతువుకు గిడుగే స్వయంగా కన్యాదానం చేసి పెళ్లి చేసిన సంఘసంస్కర్త. పర్లాకిమిడి పరిసర ప్రాంతం ఆంధ్రప్రాంతంలో కలపాలన్న ప్రజాందోళనలో ప్రధాన పాత్ర వహించిన ఉద్యమకారులు. చివరికి పర్లాకిమిడి ఒరిస్సాలో కలిసినప్పుడు సొంత ఇంటిని ఎన్నో యేళ్ళుగా నివానముంటున్న ఊరిని కూడా వదులుకొని తన నివాసాన్ని రాజమహేంద్రవరానికి మార్చుకున్న ఆంధ్రాభిమాని. చరిత్రకారుడు రాబర్ట్ సూయల్ 1882లో పురావస్తు విశేషాలపై రెండు సంపుటాలు ప్రకటించగా, వీటిలో నమోదుకాని ముఖలింగ క్షేత్రానికి చెందిన శిలా తామ్ర శాసనాలను ఎన్నింటినో గిడుగు పరిష్కరించారు. ఆయన శాసనపరిశోధకుడు. సవరల అభివృద్ధికి చేసిన కృషికి గుర్తింపుగా గిడుగుకు 1913లో అప్పటి ప్రభుత్వం పారితోషికం ప్రకటించగా దానిని ఆయన వద్దని ఆ డబ్బుతో విద్యలేకుండా అజ్ఞానంలో ఉన్న సరవలకు వారు ఉన్నచోటే బడులు పెట్టి వారి అభివృద్ధికి కృషి చేయాల్సిందిగా ప్రభుత్వాన్ని కోరిన సమాజాభ్యుదయ భావాలు గల మానవతావాది. ఆయన చేసిన సేవలకు గుర్తింపుగా 1913లో రావు సాహెబ్ బిరుదు బ్రిటీష్ ప్రభుత్వం ఇచ్చింది. 1943లో కైజర్-ఇ-హింద్ సువర్ణపతాకం బ్రిటీష్ ప్రభుత్వం బహూకరించింది. అటువంటి మహోన్నత వ్యక్తి నడయాడిన ఈ గడ్డపై పుట్టడం మన అదృష్టం. ఆయన జీవితం మనకు ఆదర్శం కావాలి.

ఆయన అనారోగ్యంతో 1940, జనవరి 22వ తేదీన గిడుగు రామ్మూర్తి గారు చెన్నపట్నంలో నిర్యాణం చెందిన సమయంలో రాయప్రోలు సుబ్బారావు గారు

"ఆంధ్రసామ్రాజ్య విజయధ్వజాంకమైన
ఉత్తరపు సరిహద్దున ఉదయమంది
దక్షిణపు పొలిమేర నస్తమయమాయె
నీ మహాంశ సమస్తాంధ్ర నిబిడమగుచు".... అని దుఃఖించారు.



# ఆ ప్రశ్నకు బదులుందా ?

- కోడూరి సుమన కుమారి, తిరుపతి. ఫోన్ : 9490401968

శ్రీమయికి ఇది ఎనిమిదో పెళ్ళి చూపులు. అందమైన, చదువుకున్న, పెద్ద జడగల తెల్లని ఛాయగల (ఇన్నోసెంటు గర్ల్?) అమాయికపిల్ల కావాలి అనే వివాహవేదిక ప్రకటనకు అచ్చుగుద్దినట్లు సరిపోయే శ్రీమయికి పాపం పెళ్ళెందుకుక్కుదరట్లేదూ? అనేది మిలియను డాలర్ల ప్రశ్న. తల్లి ఫక్తు తెలుగు గృహిణి. సంగీతం పాఠాలు చెప్తుంది. తండ్రి శ్రీరామ్మూర్తి. విశ్రాంత బడిపంతులు. అక్క కిరణ్మయికి పెద్ద అమెరికా సంబంధం అనుకోకుండా కుదిరింది. ఆ ఆనందంలో ఉన్న కాసింత కాసూ, పూసా, రెండెకరాల పొలం నోట్లకట్టలుగా మారిపోయి ఫెళ్ళున పెళ్ళి చేసేయగా ఝామ్మంటూ విమానమెక్కి అమెరికా అత్తారింటి కెళ్ళిపోయి మిసెస్ కిరణ్మయిమోహన్‌గా మారింది. శ్రీమయికీ ఇరవై రెండేళ్ళు వచ్చాయి. వాళ్ళ నాన్నగారికి పెళ్ళిచేసే స్తోమత రాలేదు. కానీ సమాజం దుమ్మెత్తి పొయ్యదూ? ఎదిగిన బిడ్డను ఇంట్లో కూచో పెట్టుకుని ఉంటే. కాబట్టి కిడ్నీలో, ఇడ్లీలో అమ్మి అయినా సరే శ్రీమయి భారం దింపు కోవడం ప్రస్తుతం శ్రీరామ్మూర్తీ వైదేహిల జీవిత లక్ష్యం. శ్రీమయి బికాం కంప్యూటర్సు చేసింది. ఆపై ఏదో కంప్యూటరు కోర్సులవీ చేసేసింది. ఓ కంప్యూటర్ ఇనిస్టిట్యూట్‌లో డి.టి.ఇపి. విజన్ మిక్సుంగులవీ చేస్తున్నది. ఎంత లేదన్నా నెలకో మూడు వేలు ఇస్తారు. తనే స్వంతంగా ఓ కంప్యూటర్ కొనుక్కుని ఆ పని ఇంటి వద్దనే చేసుకుంటే ఆదాయం బాగుంటుందని ఆమె అంటుంది. కొంత డబ్బు దాచుకుంటోంది. అందుకోసం అక్కనూ ఓ మారు అడిగింది. వీలుపడితే బావగార్కి చెప్పి ఈ తడవొచ్చేప్పుడు పట్టుకొస్తానన్నది కిరణ్మయి. ఎప్పుడు వస్తుందో చెప్పలేదు కాబట్టి అందాకా అరపట్నం లాంటి ఆ ఊర్లో గాంధీ బజారులో ఓ కంప్యూటరు కేంద్రంలో పనిచేస్తోంది. ఆమె అందచందాలకు మురిసిపోయి లవ్వు లవ్వు అంటూ వెంటబడ్డ వాళ్ళు లవ్వు లెటర్లిచ్చినవాళ్లూ స్నేమ్ క్యాస్ట్ పెళ్ళాడేస్తానన్నవాళ్ళూ పాపం ఆ మర్నాడామర్నాటికి ఆమె ఆ వీధిలో కనిపిస్తే ఈ వీధిలోంచి జారుకుంటారు. అంత సున్నితంగా కన్పించే శ్రీమయి ఏ ఆయుధం ప్రయోగిస్తుందో మరి. చాలామంది అమ్మాయిలు రోమియోల బారి నుండి ఎలా తప్పుకుంటున్నావూ అని అడిగేస్తుంటారు. సంతూర్ మమ్మిలా... నేనా లవ్వులోనా హహ్హా... అని నవ్వేస్తుంది చెప్పదు. పెళ్ళి చూపులకు వచ్చిన వాళ్లందరికీ నచ్చుతుంది. కట్నపు కట్ట పెద్దదుచిగా లేకున్నా అబ్బాయి నసుగుడుతో అందంతో సర్దేస్కుందామనుకున్నా అమ్మా యిలతో ఐదు నిముషాలు విడిగా మాట్లాడాదంటే ఇక ఆ సంబంధంపై ఆశ లొదిలేస్తారు శ్రీమయి తల్లిదండ్రులు. ఇక వెళ్ళిపోయిన పెళ్ళి వాళ్ళ నుంచీ ఫోన్లూ, ఉత్తరాలు, ఎస్సెమ్మెస్‌లు ఏం ఉండవు. ఈ చర్యకు కారణం ఏంటి... అని శ్రీరామ్మూర్తి జుట్టు పీక్కునీ పీక్కునీ... వైదేహి బట్ట తల అని వెక్కిరించకుండా బోడిగుండు మిగిలింది. వైదేహి కూడా రకరకాలుగా పలువిధాలుగా విషయం రాబట్టే ప్రయత్నం చేసి చేతకాక నిస్సహాయంగా ఊర్కుంది. పోనీ కిరణ్మయికి చెప్పాలంటే అది నెలకోమారు ఫోన్ చేస్తుంది. క్షేమ సమాచారాలు ఆరోగ్య సమాచారం అందుకుని అమ్మో ఇక ఉంటా బిల్ పెరిగిపోతుంది అని పెట్టేస్తుంది. సెంటిమెంటుతో కొట్టినా, సిమెంటురాయితో కొట్టినా, కోపం చూపినా నా కోరపళ్ళతో కొరుకుతానని బెదిరించినా శ్రీమయి చిరునవ్వే జవాబు ఇంకా టైం రాలేదనుకోమ్మా అని వేదాంతపు డైలాగు విసిరి వెళ్ళి పోతుంది. ఇది వేదాంతమా రాద్ధాంతమా అసలు దీని సిద్ధాంతమేంటి... అని తెలిసిన సిద్ధాంతులందరికీ జాతకం చూపినా బ్రహ్మాండంగా ఉంది. ఈ సంవత్సరాఖరికి పెళ్ళయిపోతుందనేస్తున్నారు. ఇక "మౌనమె శ్రేయము ఓ మూగమనసా" అని పాడుకుని ఊరుకుంది వైదేహి.

ఆరోజు శ్రీమయికి "అష్టమ వివాహ దృక్కులు" అనగా ఎనిమిదోసారి పెళ్ళి చూపులన్నమాట. అదీ కిరణ్మయి అత్తారింటి తరపున. పెద్దమ్మాయత్తగార్కి వేలూ, కీలూ విరిచిన దూరపు చుట్టరికం. కొడుకు వరసవుతాడట. అందం సాంప్రదాయం బంధుత్వం ఉన్నాయి కాబట్టి ఖచ్చితంగా చేసుకుంటారని కిరణ్మయి మొగుడు ఫోన్లో హామీ ఇచ్చేశాడు. అబ్బాయి కాస్త చామనఛాయే గానీ, చాలా తెలివిగలోడు. ఫస్ట్ అటెంప్ట్‌లో ట్రిపుల్‌ఐటీ సాధించి చదివేసి ఆపై ఉద్యోగమూ సాధించేసిన వ్యక్తి. త్వరలో "విదేశీ"గా మారతాడట కూడా.

## రెక్కలు

- చిమ్మపూడి శ్రీరామమూర్తి, ఖమ్మం. ఫోన్ : 9704177270

నింగిలో సగమన్నావు
నేలపైన ఆమెకు
అంగుళమివ్వడానికి
భయపడుతున్నావు
మగాడా ! నీకంటె
పిరికివాడున్నాడా?

ఆమె తన అందాన్ని
తల్లిదండ్రుల్లో
భర్తలో, పిల్లల్లో
చూసుకుంటూనే వుంటుంది
అతివకు
అద్దం ఎందుకు?

మెరుపు చీలిస్తేనేం?
మళ్లీ గగనం
కలిసిపోతుంది
ఘనంగా ....
వసుధకు సుధనివ్వడమే
దాని నైజం !

చెట్టు నరికాక
తనపనికూడా
పడతాడని
పసికట్టేసిందేమో ...!
ముందుగానే వేరు
నేరుగా వెళ్లినేలలోదాక్కుంది.

యువతిసిగకోసం
వేల్పుపాదాల కోసం
ప్రేమికుల చేతికోసం
వీరుల సమాధికోసం
తపిస్తాయి పూలు
రాలుస్తాయి అశ్రువులు

నవ్వుతూ
జన్మించు
నవ్వుతూ
మరణించు ...
నగవునుమించిన
నగవుందా!?

బతికున్నంతవరకు
అప్పులోళ్లతో పని
చచ్చి, కాలే వరకు
డప్పులోళ్లతో పని
పైకెళ్లాక
ఎవరితో పని?

అమ్మో మా గొప్ప సంబంధము. పెద్దమ్మాయికి మాట రాకుండా ఇదైనా కుదిరితే చాలని ఓ వందమంది దేవుళ్ళకి మొక్కేసింది వైదేహి. ఎప్పుడూ చేసే అరిటికాయ బజ్జీలు కేసరి చేస్తే కల్సిరావటం లేదని మార్పుగా రవ్వలడ్డూ, ఉల్లి పకోడీ వేసింది. ఒసేయ్ ఆ పకోడీ చేశావ్ మనం కోటీశ్వరులనుకుంటా రేమోనే అంటూ శ్రీరామ్మూర్తి చణుకు విసిరాడు. ఆ సర్లెండి బంధువులూ మన స్థితి స్తోమతా తెలీదేం వాళ్లకి అన్నది వైదేహి. ఒసేయ్ సిరీ ఈ నీలంచీర కట్టుకోబాకు. అక్క పెళ్ళికొన్నావే గన్నేరు రంగుదీ ఆ చీర కట్టుకో కనకాంబ రాలొద్దు జాజులు పెట్టుకో కూతురికి ఆజ్ఞలిచ్చింది. శ్రీమయి పాటించింది. ఆ సమయం రానే వచ్చింది. ఇన్నోవాలో దిగారు పెళ్ళివాళ్ళు. అబ్బాయి తల్లిదండ్రి ఆడబడుచూ ఆమె భర్తా వచ్చారు. ఇరుగూ పొరుగూ తలలోమారు బయటికొచ్చి తిలకించి, తాబేళ్ళలా లోనికి పోయాయి. పెళ్ళీడమ్మాయిలు కిటికీకి ఫెవికాల్ వేస్కున్నారు. ప్రభాస్‌లా ఆరడుగులా... మహేష్‌బాబులా తెలుపూ.... కాదు పవన్‌కళ్యాణ్‌లా పర్‌ఫుల్‌గా ఉన్నాడనుకుంటూ... పరిచయాలూ, మర్యాదలూ... మాటామంతీ... జరుగుతూ ఉన్నాయి.

ముఖ్యఘట్టం. అమ్మాయి వచ్చింది. చాపమీద కాకుండా వైదేహి ఈ మారు కుర్చీలో కూచోబెట్టింది. అంతా చూశారు తృప్తిగా ఉన్నాయి వారి ముఖార విందాలు. వైదేహి గుండె గుబగుబలాడుతుంది. ఒంటరిగా మాట్లాడే ప్రోగ్రాం పెట్టకుంటే బావుణ్ణు అనుకుంటుంది. ఆమె ఆశలు తుంచేస్తూ ఆ అబ్బాయి అన్నాడు శ్రీమయిగారు మీతో కొంచెం పర్సనల్‌గా మాట్లాడొచ్చా అని. శ్రీరామ్మూర్తికీ వైదేహికీ తాగుతున్న కాఫీ ఆముదమైంది పాపం. ఎప్పట్లా పెరట్లో కాక పక్కన గదిలోకి వెళ్ళమంది వైదేహి. ముందు జాగ్రత్తగా అక్కడున్న నవారు మంచం తీసేసింది. రెండు కుర్చీలు మధ్యలో ఓ చెక్క బల్ల వేసి ఉంచింది. ఆ గదికి హాల్లోకి మధ్య ఉన్న కిటికీ తన కనుసన్నల్లో ఉండేలా చూసుకుంది. అసలే కంప్యూటర్ల కాలప్పిల్లలూ మాటలు కాక మరేమైన మొదలెడ్తారనే సందేహం వైదేహికి. ఈ మధ్య డబ్బింగు హిందీ సీరియళ్ళు తెగచూస్తోంది ఆమె కరచాలనం దాటి పరిచయమంటే కౌగిలించేసుకుంటున్నారు బొత్తిగా ఆడా,మగా తేడాలేకుండా. అందుకే అక్కడున్న వాళ్ళకనుమానం రాకుండా చూపులా కిటికీలోంచి పంపటం కష్టంగా ఉన్నా శ్రమిస్తోంది పిచ్చితల్లి. ఇవేం అర్థంకాని శ్రీరామ్మూర్తి తన ఆదాయ వ్యయాలూ అదీ చెప్పుకుంటున్నాడు కాబోయే వియ్యంకుడికి. శ్రీమయి




ఆ అబ్బాయి ఏదో మాటాడేస్కుంటున్నారు. అప్పుడప్పుడు చిన్ని నవ్వులు కూడా. మరి కాసేపటికి శ్రీమయి ఏదో అన్నది అతని ముఖానికి వైట్ పెయింటంటి నట్లుంది. వైదేహి గుండెల్లో గ్రానైటు పడింది. అయిపోయింది ఈ సంబంధమూ కుదర్నివ్వదిది. గో.. విందా... అనుకుంది. మళ్ళీ చూసింది అతను ఏదో చెప్పాడు. కొంతసేపటికి ఇద్దరూ హాల్లోకి వచ్చారు. ఏం నీతూ అన్నీ మాటాడావా అన్నదతని తల్లి. అతను ఇబ్బందిగా నవ్వి తలాడించినట్లు అన్పించింది వైదేహికి. ఆమె వేపు చూస్తున్న శ్రీరామ్మూర్తి ఇది వైదేహి కాదు సందేహి అనుకున్నాడు.

వరుడి పాత్రధారి నితీష్ అమ్మా అన్నీ మాట్లాడినట్లే కానీ కొంతకాలం పరిచయము పెంచుకుని ఒకర్నొకరం బాగా అండర్‌స్టాండ్ చేస్కోవాలనిపిస్తోంది అన్నాడు నిర్మొహమాటంగా. మిగతా అన్నీ ఓకే. బావగారూ ఇంతవరకూ చూసిన ఏ ప్రపోజల్‌లోనూ మా వాడు ఇలాంటి అభిప్రాయం చెప్పలేదంటే నమ్మండీ. మాకు అంతా నచ్చింది. మరికాసేపు ఏదో పిచ్చాపాటీ మాట్లాడి మరోసారి కాఫీ సేవించి బయల్దేరారు. తాంబూలంలో రవికెలు కూడా పెట్టింది. వైదేహి కాబోయే వియ్యపురాలికీ ఆమె కూతురికీ... శ్రీమయి వాళ్ళు తిని తాగి అక్కడుంచి వెళ్ళిన పళ్ళాలు గ్లాసులు తీస్తుంది. శ్రీరామచంద్రా! ఈ సంబంధ మైనా కుదిరితే బాగుండు. రుక్మిణీ కళ్యాణం చదువుకోవే అంటే వినవూ అన్నది వైదేహి... ఆ అపుడు ఏ కృష్ణుడో రథం మీదొచ్చి తీసుకెళ్ళేవాడా అన్నది కించిత్ వ్యంగ్యం శ్రీమయి. అదికాదమ్మా నీ పెళ్ళి అయిపోయి మనవళ్ళూ, మనవరాళ్ళనూ చూసేస్తే ఆనక గుట్టుక్కుమన్నా చింత ఉండదు మాకు అన్నది వైదేహి. పిచ్చితల్లీ అసలు సమస్యలూ, పనులూ పెళ్ళాయ్యాకే మొదలవుతాయి. ఎదురింటి సుజాతతో వాళ్ళూ, పక్కింటి సంజ్ఞతో వీళ్ళూ ఎలా తలలు పట్టుకుంటున్నారో చూస్తూ కూడా అలా అంటారేంటి... అన్నది చీపురుతో చిమ్ముతూ శ్రీమయి.

మరునాడు ఏదో ముస్లిం పండుగ. అందరికీ సెలవు కావటంతో శ్రీమయి స్నేహితురాళ్ళు శిరీష, జ్యోతి, సుధలు వచ్చారు సినిమాకు వెళ్దాం అంటూ. వీళ్ళంతా చిన్నప్పట్నుంచీ ఒకే తరగతిలో చదువుకుంటూ డిగ్రీ దాకా స్నేహితుల్లా ఉన్నవారే. అందుకే వైదేహి, రామ్మూర్తీ అభ్యంతరం పెట్టరు. జ్యోతి మరీ సన్నిహితురాలు. ఎన్నోమార్లు వైదేహీ శ్రీమయి పెళ్ళి గురించి జ్యోతితో చెప్పుకుంది. నీ ఫ్రెండు పెళ్లికొడుకుల్ని ఏవంటుందో తెలుసుకోవే అన్నీ నచ్చా యంటూనే పారిపోతున్నారు అని. శ్రీమయి ముస్తాబయ్యేలోగా పెళ్ళిచూపుల విశేషాలన్నీ వైదేహి వాళ్లకి చెప్పింది. జ్యోతిని సైగలతో హెచ్చరించింది. తన

## • తెలుగు... ఎప్పుడు వెలుగు •

- మేళ్ళచెరువు మాధవి. ఫోన్ : 9492466301

దేశభాషలందు లెస్స తెలుగు !
ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అని ఒక జిలుగు !
కాని ఆచరణలో లేదు ఆ వెలుగు !
తూట్లు పొడిచిందెపుడో పాశ్చాత్య చదువనే పలుగు
కనీసం ఇంట్లో మాట్లాడి పూడుద్దామనుకుంటే ఆ కలుగు
ఆంగ్లములో పట్టులేదంటు ఇంటిలోని వారు అలుగు !
భయంగా, సిగ్గుగా రెండుమూడు పదాలు ఒక వాక్యంలో మెలుగు
'మాతృభాషా వికాసమే జీవనోన్నతి' అనే భావన మనకు ఎప్పుడు కలుగు !!?
అప్పుడే తెలుగుకు పట్టిన మూగతనం తొలగు
అందరి నోళ్ళలోను మధురంగా భాష నలుగు

కూతురి మనసు కనుక్కోమన్నట్లు. జ్యోతి భరోసా ఇస్తున్నట్లు తలాడించింది. అందరూ వస్తాం ఆంటీ అంటూ బయలుదేరారు. నడుస్తూ వెళ్లాలనుకున్నారు.

ఆమాట, ఈమాటా అనుకుంటూ నడుస్తుండగా జ్యోతి అసలు విషయం కదిపింది. ఏంటో సిరీ అందం చందం అన్నీ ఉన్నా, వచ్చిన వరుడికి నీకూ, ఎక్కడ చెడుతుందో అర్థం కాక నా బుర్ర వాచిపోతుందే కాసింత క్లూ అన్నా ఈయవే. నీకు తెల్సుగా నాకు చిన్నప్పట్నుంచి డిటెక్టివ్ నవల్లు ఆ పనీ అంటే ఎంతిష్టమో నవ్వుతూ అడిగింది జ్యోతి. శ్రీమయి తలపైకెత్తి మరీ నవ్వుతుంది. అంతా నివ్వెరపోయారొక్షణం. ఏమిటే ఆ నవ్వు అన్నది సుధ. నేనేం జోక్ చేయలేదే అన్నది జ్యోతి. హు జోక్ నువ్వెయ్యలేదు. అసలు ఆడబతుకే పెద్ద జోకయిన కాలమిది. నా నవ్వు మాత్రమే మీ క్కన్పించింది. అందులో వేదన కన్పించలేదా? అన్నది. ఆమె గళం బరువుగా మారింది. ఏంటో అర్థం అయ్యేలా చెప్పు మహానుభావీ అన్నది శిరీష. ఓ మగువ అంతర్మథనం, ఓ స్త్రీ వేదన, ఓ మాతృమూర్తి ఆక్రందన. ఇవన్నీ నా పెళ్ళిని ఆపుతున్నవి అన్నది శ్రీమయి. నువ్వేదో అప్పుడప్పుడూ కథలు, కవితలూ రాస్తావని తెలుసుగానీ, ఇప్పుడు నీ రచయిత్రి భాష నాకర్థం కాలేదు తల్లీ! అన్నది సుధ బుర్ర గోక్కుంటూ... మీరు నాలాంటి ఆడవాళ్ళు తప్పక చెప్తా అంటూ నా కారణం మీకూ రేపటి సమస్యే. అదేంటంటే పెళ్ళి చూపులకి రావటం ఎంతో నచ్చినంత తీసుకొని పెళ్ళి చేస్కోవటం మగమహారాజుల పని. మనకు అసలు బతుకు అక్కడే మొదలు, అందుకే నేను పెళ్ళి చూపులకు వచ్చిన వారిని మూడు ప్రశ్నలడుగుతా. ఇంతవరకూ ఏ ఒక్కరు నా ప్రశ్నకు జవాబివ్వలేదు. తప్పించుకొనేందుకు పెళ్ళి వద్దనుకుంటున్నారు.

ఏం ప్రశ్నలూ ఆతృతగా అన్నది జ్యోతి.

1. నేను తొలిచూలు ఆడపిల్లను కంటే మీరు ఊరుకుంటారా?
2. అబార్షను చేస్కోమనో, పుట్టాక చంపేయమనో పారేయమనో అనరుగా?
3. నీలో 'Y' క్రోమోజోమ్స్ కౌంట్ బాగుందో లేదో నీకు తెలుసా. ఎందుకంటే నాలోని 'X' క్రోమోజోమ్స్‌కి నువ్వు Y ఇస్తేనే నేను నీకు వారసుడిని ఇవ్వగలను. తప్పు నాది కాదు. లోపం నీది. అందుకే అందుకు సంబంధించిన టెస్ట్‌లు వుంటే చేయించుకుని నాకు ఆ రిపోర్ట్సు చూపగలవా ? ఇవే నేనడిగే ప్రశ్నలు.

మైగాడ్... అందుకేనా మాయల ఫకీరు మంత్రదండం ఊపినట్లు మాయమవుతున్నారు ఈ మగాళ్ళు అన్నది సుధ. శ్రీమయి తలెత్తి చూసి అదేంటే జ్యోతి శిరిషా "అవాక్కయ్యారా!" అన్నట్లుండిపోయారు. నా ప్రశ్నలు తప్పా! అన్నది. వాళ్ళు తేరుకుని తలాడించారు అడ్డంగా.

ఏం చేసేది చెప్పు. మన క్లాస్‌మేట్ విజ్జని ఇద్దరాడపిల్లల్ని కన్నదని తన్ని తగలేసి వదిలేశాడా మొగుడు. పిల్లల్తో చావలేక, బతకలేక అనుదినం ఏడుస్తోంది అదీ దాన్ని కన్నవారునూ, గాయత్రికి నాలుగైదు మార్లు అబార్షన్లు చేయించగా ప్రాణాలే పోయాయి. నవనీతక్క ముగ్గురూ కూతుళ్లనే కన్నదని దాని మొగుడు వారసుడి కోసం రెండో పెళ్ళి చేసుకున్నాడు. అక్క ఆత్మహత్య చేసుకోగా బిడ్డలు అనాథలయ్యారు. ఎందరో ఇలా పల్లెపట్నం తేడా లేకుండా స్వదేశం విదేశం భేదం లేకుండా చదువున్న వారైనా, నిరక్షరాస్యులైనా అందరికీ ఆడది మరో ఆడపిల్లను కనకూడదనే భావన. అసలు మా అక్కయ్య కూడా రెండేళ్ళ నుంచీ ఎంతో ఆశగా ఎదురుచూస్తున్న మా అమ్మానాన్నలకు తల్లినవుతున్నాననే విషయం చెప్పకపోవటానికి కారణం ఇదే అనుకుంటున్నా అన్నది ఎంతో ఆవేదనగా శ్రీమయి.

సుధ కల్పించుకుని నువు చెప్తుంటే అర్థం అయినట్లనిపిస్తోంది. ఈ మగవాళ్ళు ఎంతో స్వార్థపరులు. భర్తగా ఉండే అధికారం కావాలి. బిడ్డగా కూడా తనకు తనే కావాలి. కాదని ఆడబిడ్డను కంటే భార్యనో, బిడ్డనో సులువుగా చంపేస్తారు. మళ్ళీ అందుకు ఆయుధాలుగా అత్త ఆడబడుచుల రూపంలో ఆడదాన్నే వాడేంత తెలివైనవారు అన్నది అందుకుంటూ...

అంతేనే నా ప్రశ్నకు జవాబు అది చెప్పగల మనిషీ దొరికేవరకూ నేను కుమారి శ్రీమయిని. సరేనా మా అమ్మతో ఇదంతా అనకు. బాధపడుతుంది. ఏదో సర్దిచెప్పు అన్నది జ్యోతితో... మనని మనం అర్థం చేసుకోకపోతే ఈ జన్మంతా బాధపడాలి అలాగే అన్నది జ్యోతి. ఆడవాళ్ళలో ఐక్యతుంటే ఈ సమస్యకు జవాబు సులువు అన్నది శ్రీమయి. ●

## ఆంధ్రావని

- దూబగుంట రామకృష్ణ, తిరుపతి. ఫోన్ : 9490108518

ప॥ ఆంధ్రావని వెలసింది - అభ్యున్నతి పొందింది
అమరజీవి దీక్షపై ఆత్మాహుతి కానుకై ॥ ఆంధ్రా ॥

చ॥ పరరాష్ట్ర పరిధి నుంచి పురుడు పోసుకుంది
కష్టాల పొత్తిళ్ళ ఉయ్యాలలూగింది
నష్టాల మధ్యనే దినదినము పెరిగి
భాగ్యనగర మేటియై బలము పుంజుకొంది ॥ ఆంధ్రా ॥

చ॥ రత్నాల సీమయే రాయలసీమయై
తెనాలికే ఫలాలకే తెలంగాణాయై
పుట్లకొలది పంటలకే కోస్తాయే నిలయమై
మాతృదేశ ప్రగతికే వన్నెగా నిలచింది. ॥ ఆంధ్రా ॥

చ॥ దేశానికి సిరిపూత ఆంధ్రావని అన్నపూర్ణ
కళారంగపు చేయూత కావ్యాల పల్లవింత
ఎన్నెన్నో రంగాల్లో రంగరంగ వైభవం
తరతరాల తెలుగువెలుగు నలుమూలల నిలవాలి! ॥ ఆంధ్రా ॥

## అమ్ముడుబోతే...

-నందిగామ రత్నకుమార్

మంచితరుణం మించితే దొరకదని
ఏ జెండా కోతలో నమ్మి
పచ్చనోటుకో పావుసారాకో
నీ పవిత్రమైన ఓటును
తగలేసినావు కాబోలు
మూడు గోడల నాలుగు గడల
ఐదాకుల మధ్యన ఇరుక్కుపోయిన నీ బ్రతుకు
వానవస్తే వలవల...
గాలివస్తే గలగల....
రెండూ వస్తే లభలభ....

# తెలుగువారి ఉగాది కానుక

- మైనేపల్లి సుబ్రమణ్యం, ఆకునూరు. ఫోన్ : 9490420476

తెలుగుభాష చదవటం రాయటం వచ్చిన ప్రతివారికి సరళమైన భాషా ప్రయోగం. సంస్కృత పదములను కూడా చేర్చి ప్రతి సంవత్సరం ఉగాది కానుకగా మనకు అందించే మహత్తరమైనది తెలుగు పంచాంగము.

ప్రతిరోజు ఏ వారం అనేది తెలియటానికి, రెండు అక్షరములతో లేదా, మూడు అక్షరములతో ఆ రోజు ఏవారం అనేది మనకు తెలియజేస్తారు. పూర్తిగా వారం పేరు రాయటానికి జాగ తగ్గటం కొరకు తీసుకొనే జాగ్రత్త.

ఒక్కోవారం, ఒక్కో ప్రత్యేకతను కలిగి ఉంటుంది. ఏవారం అయినప్పటికి కొంత దోషపూరితం అనేది ఆ వారం (రోజు) దుర్ముహూర్తం అనే పేరుతో మనకు తెలియజేస్తారు. దు.ఉ. అనగా ఉదయం అనియు, దు.ప. (పగలు) అనగా మధ్యాహ్నంనకు అనియు, దు.సా. అనగా సాయంత్రం ఈవిధంగా మొదలు – చివర వరకు సమయం వ్రాసి గంటలు, నిముషములతో సహా రాయుదురు.

ఇక తిథుల విషయం అంటారా! వాడుక భాషలో మూడు అక్షరములకు మించవు. అమావాస్య తదుపరి వచ్చే పాడ్యమికి శుద్ధపాడ్యమి లేక శుక్లపాడ్యమి అంటారు. విశేషం ఏమిటంటే దీనికి ఆ నెల తెలుగు పేరు కూడా జత చేస్తారు. ఉదాహరణకు కార్తీక శుద్ధ పాడ్యమి అని రాయుదురు. ఒకటవ రోజు పాడ్యమి నుండి పదిహేనవ (15) రోజు పౌర్ణమి అని రాయుదురు. ఆ తరువాత ప్రారంభం అయ్యే రోజును బహుళపక్షం అని గుర్తించి, కార్తీక బహుళ పాడ్యమి – విదియ. ఈ విధంగా చివరకు అమావాస్య అని రాయుదురు.

కొన్ని సందర్భాలలో పౌర్ణమికి కొంత ప్రత్యేకత సంతరించుకొన్నప్పుడు, కార్తీక పౌర్ణమి. జ్వాలాతోరణం మాఘమాసంలో మాఘ పౌర్ణమి అని రాయుదురు. శుద్ధపక్షం – శు॥ అనియు, బహుళపక్షంకు బ॥ అని బండ గుర్తులు పెట్టి జాగా తగ్గిస్తారు.

తెలుగుమాసంలో పాడ్యమి 15 తిథులు రెండుసార్లు వచ్చి మాసం పూర్తి అవుతుంది. అనగా శుద్ధ పక్షం పాడ్యమి మొదలు, బహుళ పక్షం చివరకు అనగా అమావాస్య వరకు. రెండు అమావాస్యల మధ్యకాలాన్ని తెలుగుమాసం అంటారు. ఉదా॥ చైత్రమాసం, వైశాఖమాసం, జ్యేష్ఠమాసం, ఈవిధంగా 12 మాసాలు ఉంటాయి. చివర ఫాల్గుణమాసం. ఈ మాసములలో అధిక మాసం అని ఒక్కటి. ఎప్పుడయినా (అరుదుగా) వస్తుంది.

పాడ్యమి, విదియ నుండి పౌర్ణమి అయిన లేక అమావాస్య అయినా, తిథి ఒక్కటికి రెండు కరణాలు ఉండును. విశేషం ఏమిటంటే కరణాలు మొత్తం 11 మాత్రమే. బవ – బాలవ – కౌలవ – తైతుల – గరజి – వణజ – భద్ర వీటిని చర కరణములు (7) అందురు. ఇవి తిథి ఒక్కంటికి రెండు చొప్పున శుద్ధ పక్షం పాడ్యమి సగం నుండి భవకరణం ప్రారంభమవుతుంది. ఈ విధంగా బహుళపక్షం చతుర్దశి-తిథి సగం వరకు భవ నుండి భద్ర వరకు కొనసాగును. ఈ ఏడు కరణములు మాత్రమే ఒకదానివెంట ఒకటి కొనసాగును. బహుళ చతుర్దశి తిథి చివర అనగా సగం నుండి 8) శకుని 9) చతుష్పాత్ 10) నాగవ 11) కింస్తుఘ్న ఈ 11వ కింస్తుఘ్న కరణం అనేది శుద్ధ పక్షము పాడ్యమి తిథి సగం వరకు ఉండును. తదుపరి భవకరణం మొదలగును. గుర్తుంచుకోవలసిన విషయం. ప్రతిమాసం చివరలో చతుర్దశి తిథి అమావాస్య, పాడ్యమి. ఇవి ఏ మాత్రం శుభం కాదు.

కొందరు పంచాంగకర్తలు వీటిని వదిలేశారు. మరికొందరు తిథి కరణమును, రెండు అక్షరములతో తెలియజేసి జాగ –జాగ్రత్తగా భర్తీ చేస్తున్నారు. ఈ మధ్య సౌర పంచాంగములలో కొందరు కరణంలు పూర్తిగా వివరిస్తున్నారు. దీనివలన చాలా ప్రయోజనం. జ్యోతిష్కులకు ఉపయోగం. కొన్ని కార్యక్రమాలకు కరణమును ప్రామాణికంగా ఉపయోగిస్తారు.

ప్రతిరోజూ ఏదో ఒక నక్షత్రం ఉంటుంది. అశ్వని నుండి రేవతి వరకు మొత్తం 27 నక్షత్రాలు. (మనలో చాలామంది ఈ రోజు మనస్టార్ ఎలా ఉంది అని మననం చేసుకుంటారు.) కొనసాగును. ముందు నక్షత్రం పేరు రాయుదురు. సమయం కూడా గంటలు – నిమిషాలతో రాయుదురు. ఆ నక్షత్రం ప్రమాణం (పవరు) అప్పటివరకు ఉండును అని అర్థం. అంతేగాని అక్కడ నుండి మొదలు కాదు. (తిథి కూడా ఈ విధంగానే భావించాలి సుమా) కొందరకు ఈ విషయం తెలియదు.

నక్షత్రంలో ప్రామాణికంగా ఇంత సమయం అనేది ఉండదు. నక్షత్ర ప్రమాణం అనగా మన కాలంలో 22 గంటల నుంచి 26 గం. 55 నిమిషాల వరకు రకరకాలుగా ఉండును. ప్రతి నక్షత్రం ప్రమాణంను బట్టి త్యాజకాలం (వర్జ్యం) ఉండును. దీనినే అందరికి అర్థం అయ్యేటట్లు "వర్జ్యం" అనే పేరుతో ప్రారంభం. చివర వ్రాయుదురు. అలాగే నక్షత్రాలకు 27 యోగాలు కలవు. మొత్తం వివరించటం అనేది ఈ వ్యాసంలో సాధ్యపడదు. కొన్ని దోషం కలవి వాటిని వివరించుతాను 1) నిష్కంభము 6) అతిగండం, 9) శూల, 10) గండము, 13) వ్యాఘాతము, 17) వ్యతీపాత, 19) పరిఘ, 27) వైధృతి. ఈ 27 యోగములలో దోషము కలవి సంఖ్యాపరంగా వివరించాను.



కొంతమంది సిద్ధాంతులు యోగం అనేది పూర్తిగా వదిలేశారు. కొందరు "రెండు" అక్షరాలతో సమయం నిర్ధారణ చేస్తారు. మరికొంతమంది సిద్ధాంతులు అమృతయోగం ప్రారంభం - చివర గంటలు, నిమిషాలతో వివరిస్తున్నారు.

ముఖ్యంగా తెలుగు పంచాంగకర్తలు, చాలావరకు ఆంగ్లపదములను ఉపయోగించరు. కొంతమంది పండితులు. తెలుగు సంఖ్యలను మరియు ఘడియ - విఘడియలు వాడేవారు ఉన్నారు.

హిందువులకు సూర్యోదయముతోటే ఆరోజు ప్రారంభమగును. అనగా సూర్యోదయం నుండి మరునాటి సూర్యోదయం వరకు ఒక్కరోజు. వారం ప్రారంభం పగలు ప్రారంభమై రాత్రితో అంతమగునని గమనించాలి. ప్రభుత్వం వారి అర్థరాత్రి ప్రమాణం హిందువులకు పంచాంగకర్తలకు ఏ మాత్రం వర్తించదు.

పంచాంగం ప్రముఖ పట్టణానికి ప్రామాణికంగా ఉంటుంది. తెలుగు పంచాంగములు ఎక్కువగా, రాజమండ్రి, విజయవాడ, మచిలీపట్నం, హైదరాబాద్, అనంతపూర్ మొదలైనవి. ఒక పట్నం ప్రామాణికంగా తీసికొంటే ఆ రోజు పగలు సమయం ఎంత అనేది "దినం... గంటలో... ఘడియలో రాయుదురు.

పంచాంగంలో నవగ్రహ స్థితి గతులు రాయుదురు. గణితం ప్రకారం ఎక్కడ ఏ గ్రహం ఉన్నది నక్షత్రం, పాదములతో సహా వివరిస్తారు. దీనిని ఆధారం చేసుకొని జ్యోతిష్య పండితులు జన్మలగ్న పత్రికలు వ్రాయుదురు. జన్మలగ్న పత్రిక రాయటం ఒక ఎత్తు. దానిలోని సారాంశము, వివరణ అనేది చాలా కీలకమైనది. దీన్ని మథించటం అనేది సిద్ధాంతి ఆలోచన. వారి వాక్‌శుద్ధి. హస్తవాసిపై ఆధారపడింది. కొంతమంది జన్మించినది జ్యోతిష్యం కొఱకేనా! అనిపిస్తుంది. అందుకే చిన్నవారైనా, పెద్దవారయినా తూలనాడటం జరగదు. జ్యోతిష్యం చెప్పటం పూర్వజన్మసుకృతం (నుదిటి గీత రాయుదురు) నుదుటి గీత మార్చగల శక్తి ఎవరికీ లేదు. కాకపోతే కొంత ఉపశాంతికి (రెమిడిస్) నియమాలు చెబుతారు.

జన్మలగ్న కారకత్వములు 12 భావములు. వీటిలో 8వ భావముల వరకు (ఆయుర్దాయము) జీవితాంతం ఉండును. మిగిలినవి 9, 10, 11, 12 భావములు మోక్షం కొరకు అని పెద్దలు సెలవిచ్చారు. వీటి సారాంశం వివరించటం అందరి వలన కాదు. నూటికి 20% జాతకాలు అర్థంకావు. వీటిని మథించటం కష్టసాధ్యం. నూరుగురు సిద్ధాంతులలో 10 మంది ఉందురు. వారు ఎవరు? ఎక్కడ? మనిషికి వాస్తు అనేది 20% మాత్రమే మిగిలినది తలరాత. తెలుగు వెలుగులలో నేటి - నాటి పంచాంగకర్తలు. జ్యోతిష్యుల సేవ అపురూపమైనది. ఈ మధ్యకాలంలో విదేశాలలోని తెలుగువారి కోసం (ఇంగ్లీషులో) ఆంగ్లములో కూడా కొంతమంది సిద్ధాంతులు ముహూర్తములు రాస్తున్నారు. తెలుగు-సంస్కృతుల మేలు కలయక వీరిదే. ●

## గతంలో మా పల్లె మరి నేడు

- శ్రీ అబ్దుల్ అజాద్ ఖాన్. పఠాన్, గిద్దలూరు. ఫోన్ : 9000853019

గతంలో మా పల్లె పంట పొలాలు
ప్రశాంత సాకారాల నిశ్శబ్ద
సౌందర్య నిలయాలు

ఒంగోలు గిత్తల ఎడ్ల పట్టెడల సవ్వడి
పాలెగాండ్ల అదలింపుల ధ్వని
పనివారాల పాటల ఘలరుల సవ్వడి
ప్రతి పల్లె ఊరుగా ముప్పిరిగొనేది

మాపల్లె పంట పొలాల గట్టున నడుస్తున్న వారి గుండె
ఆనంద పారవశ్యం చెందేది
స్వర్గలోకపు ప్రశాంత చిత్తాన్ని
ప్రభాత సంధ్యల మట్టి పరమళాల
పసందును ఎగదోసి అక్కడనే కాలం నిలిచిపోతే!
ఎంత బావుండుననే వాంఛ ప్రబలేది.

ఉదయాస్తమానపు సప్త సముద్రాల
ఆకాశపు రంగులన్ని, మా పల్లె పంట పొలాల
పని పాటల్ని కనేందుకు, వినేందుకు,
నిలిచిపోయాయా! అని అనిపించేది మరి
నేడు మాయమారి యంత్రాల రణగొణ ధ్వనులు
ఎటు చూచినా యంత్రాల అలజడి సవ్వడి

కిరోసిన్, డీజిల్, పెట్రోల్ వాసనలు కమ్మేసి
మా పల్లె పంట పొలాలకు ఏదో గ్రహణం పట్టేసి
ఇక ఎప్పటికి విడిచి పెట్టదనే దగ్ధ అంతరంగతాలలో
మిషన్ హస్తం జోనిపి పిండేస్తున్న భావన

ఏరువాకకు ముందే పంటసాగును చల్లే
మా పల్లె పంట పొలాలను పదంతాలు చేస్తున్నామని సంతోషిస్తున్నారు
గాని రోగాలను వదంతాలు చేశామని వాపోతున్నారు.
మా పల్లె పంటపొలాల్లో నేలంతా రసాయనాల మయం

రానున్న తరాలను, శూన్య భవిష్యత్తులోకి నెట్టుకొస్తున్నామన్న స్పృహ
ఎవరితోనో ఒకరిద్దరిలో లేకపోను లేదు.
అభివృద్ధి పథంలో అనారోగ్య సంధిని
మోస్తూ ఆయువు క్షీణింప జేసుకుంటున్నాం!

కవి అజాద్ అను నేను అభివృద్ధి నిరోధకుడ్ని కాదు ఆనంద వాంచితుడ్ని
మనో ప్రశాంతత ఆరోగ్య నిశ్చింత
ఆహ్లాద వాతావరణం శోభిత మానవ మనుగడను కోరుకునేవాడ్ని - యంత్ర అభివృద్ధికి కాదనలేను కానీ, ఈ కలుషిత రణధ్వని, వాయు కాలుష్యాలను చూచి రోదిస్తున్నాను.

ప్రపంచమంత నాతో గళం కలపండి
మా పల్లె సీమలను గ్రామీణ ప్రాంతాలనైన
తాజా స్వచ్ఛత వాతావరణాన్ని విషం విత్తని
వ్యవసాయాన్ని ఆకాంక్షించండి.

# కైవారం నారాయణ తాతగారు

- డాక్టర్ అగరు (స్వామి) వసంత్, హోసూరు. ఫోన్ : 9488330209

ఈయన 1726న ఇప్పటి కర్నాటక, కోపూరుజిల్లా కైవారం సమీపంలోని కొత్తపల్లి అనే కుగ్రామంలో జన్మించారు. నారాయణప్పగా వృత్తిరీత్యా గాజుల వ్యాపారం చేస్తూ తన యాభైయవ ఏట చిత్తూరుజిల్లా మొగలి వెంకటగిరి కనుమల్లో వానప్రస్థాశ్రమ వాసులైన పరదేశీస్వాముల దర్శనం వల్ల సంసారాన్ని త్యజించి సన్యాసిగా మారి తాతగారిగా ప్రసిద్ధి పొందారు.

వీరబ్రహ్మేంద్ర యతీంద్రుల్లా తనకంటూ ప్రత్యేక శిష్యవర్గాన్ని కలిగి మత సాంప్రదాయంలో లక్షలాది మంది భక్తులపాలిట కల్పవృక్షంగా పూజలందుకుంటున్నారు.

తాను అధిక విద్యావంతుడుకాకున్ననూ పండిత పామరులు మెచ్చేటట్లు వేదాంతసారాన్ని భక్తి, రక్తి, విరక్తితో ఎంతో స్వభావసిద్ధంగా, సున్నితంగా, సులభంగా, తన తత్వాలు, కీర్తనలు, కాలజ్ఞానం, ఆత్మ బోధామృత వచనములు, బ్రహ్మాండపురి నాద బ్రహ్మానంద నారేయణ కవి శతకం, శ్రీకృష్ణచరిత తత్వామృత యోగసారము, తారక బ్రహ్మానంద ద్వయకంద శతకంగా రచించి తన ఇష్టదైవం అమరనారాయణ స్వామికి అంకితమిచ్చారు.

ఈయన సమాజసంస్కారి, సంఘ సంస్కరణాభిలాషి ముఖ్యంగా అనాటి సమాజంలోని జాతి, మత, వర్ణ భేదాలను ఖండించి బ్రాహ్మణాధిక్యాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు.

"అగ్రజులమనుచు అనుదినము తప్పక
ముక్కులు బిగియించి మునిగి నీళ్లలోన
గొణుగుచు సంధ్యావందన మంత్రములు...
-అంటేరు ముట్టేరు అందురు ప్రజలను
ఎందుకు కదగండ్లు యెరుగరు బ్రాహ్మణులు'

ప్రజల్లో తరతరాలనుంచి నరనరాల్లో ఇంకిపోయిన కుల, మతాలను కొన్ని అవాస్తవ విషయాలను, విశ్వాసాలను, మూఢనమ్మకాలను అరికట్టడానికి జానపదుల భాషలో సరళశైలిలో పద్యరచన చేశారాయన.

మానవ దేహాన్ని తొమ్మిది వాకిళ్ళ యిల్లుగా (నోరు, ముక్కు, చెవి) పోల్చి చెప్పిన ఈ పద్యంలో జానపదతత్వం ఎలా తొణికిసలాడిందో చూడండి.

"తొమ్మిది వాకిండ్లు కొంప - దుఃఖములకిది మూల దుంప
యెంచితే కలగూర గంప తెలుసుకోనీతాదు తెంప...
మలమూత్రల గంట - మాంసమునెత్తర పెంట
మురికి పేగల ముద్దుజింట - కూడినది మలకేవి తంట"

దేవుణ్ని చూడాలని లేదా చేరుకోవాలని నాటినుంచి నేటిదాకా ఎందరో ఎన్నో విధాలసాధనలు చేస్తూనే వున్నారు.అలాంటి వారి గూర్చి తాతగారన్న మాటలివి.

"సీమభూములు తిరిగి సృష్టి వెదుకగ నేల
కొండగుహలు చేరి వుండనేల
సతిసుతుల యెడబాసి సన్యాసికానేల
హృదయలింగముండే వునికి తెలియలేక"

దొంగస్వాముల గూర్చి...

విభూతి పూసి, రుద్రాక్షలు మెడవేసి
కావిదుప్పటి కప్పి జోలిచంకవేసి
బట్టదారములోన బంధించి లింగంబు
హృదయలింగముండే వునికి తెలియలేక..."

ఆనాటి ముస్లిం సమాజంలోని కొందరు దొంగ గురువుల గూర్చి...

"లలాట శూన్యము కంటగళ్ళావి
మెడనిండ దారాలు మణిపూసలు కొన్ని
వడ్డు పొడుగున పెద్ద గడ్డాలు పెంచుక
లుంగీ కట్టుకుని గంజాయి పొగదీసి
అల్లానెరుగని కల్లకాజీ ఫకీరులారా!"

తాతగారు కులమతాలను తప్పు పడతారు, తోసి పుచ్చుతారు. ఆదియందు ఇలా వుండేది కాదంటారు.

"పెక్కు మతములని చిక్కు పురాణములు
చిక్కుదు మార్గము చీకటిరా...!"
ఏ జాతివారమో... యెరుగరెమయ్యా...
స్త్రీ...పురుష జాతులివి సృష్టిలో రెండు"

### నాద బ్రహ్మానంద నారాయణ కవి శతకం

ఈ శతకంలోని పద్యాలు ేమన పద్యాలను తలపించే విధంగా ఉంటాయి. తన పద్యం ఆఖరిపాదాన్ని 'విశ్వదాభిరామ వినురవేమ' అంటూ వేమన ముగిస్తే తాతగారు 'నాద బ్రహ్మానంద నారాయణకవి' అంటూ ముగిస్తారు. కాకపోతే కోలారుజిల్లా, హోసూరు ప్రాంతపు తెలుగు మాండలికాలతో



పాటు గ్రామ్యధోరణి కనిపిస్తుంది.

ఒక మతగురువుగా రామా, కృష్ణా అంటూ భక్తితో ఎన్నో కీర్తనలు రాసిన తాతగారు ఒక్కసారిగా హేతువాదిలా మారి ఎదురు తిరగడము కద్దు. ఈ పద్యం చూడండి.

"అజుడెందుబోయెనో... హరియెందు బోయెనో...
శివుడెందు బోయెనో... చిక్కలేదు ఎవ్వరు
కనబడరు వెదికేది యాలరా?
నాదబ్రహ్మానంద నారేయణ కవి

తాతగారి కీర్తనల్లో సదా రామానామామృతం వినిపిస్తుంది. రామునైనా, శివునైనా ఆత్మలో చూడమంటారు. ఆత్మసాక్షాత్కారం పొందమంటారు.

"దేవుడనగ వేరే దేశమున లేదు. దేవుడుండు తనలో దండిగాను ధరణి నిండుగాను" అంటూ వివరిస్తారు విగ్రహారాధనను తిరస్కరిస్తారు.

"ప్రాణలింగము తనలో ప్రత్యక్షమై వుండ
చరలింగపూజలు సేయనేలా
చట్లు, రాళ్ళు పూజ చాలించవలెననయా ॥నాద॥

మాలలగూర్చి...

మాలవాడని జనుల ఏలనిందింతురు
మాలవాని ఆత్మ మందిరమున
సకలదేహ విహారి సద్గురుడు వుండురా ॥నాద॥

కవులగూర్చి...

కవులు మేమనుచు కడువిర్రవీగుదురు
ఆత్మయెరుగని వట్టి కవనగమ్యాల
స్వల్పులు యీరీతి పొక్కుచున్నారయ ॥నాద॥

ఒక మనిషి యీ ప్రపంచంలో తన పనిని ముగించి, చక్కదిద్ది వెళ్ళతాడో యీ పద్యం ద్వారా చక్కగా చెబుతారు.

"ఇల్లు శృంగారించి విధవిధంబులు గాను
అట్టువ గొంతులు అదునుపరచి
కడపట జీవడు కాపురము విడుచురా ॥నాద॥

(అట్టువ, దొంతలు – ఇంటిపై కప్పు కిందవుండె అరలు)

అలనాటి కర్నాటక రాష్ట్రం గురించి...

కర్నాటకం బెల్ల కలగూర గంపాయ
కబలిగుడవులు దండించలేరు
అల్లామతము వకటి అడ్డుగా నిలచెరా ॥నాద॥

తప్పుడు పనులు చేయకుండా చెడు వ్యాధుల బారిన పడకుండా ప్రజలను జాగృతి పరిచే విధంగా వున్న ఈ పద్యం చూద్దాం.

"పంట చేను విదము పదతి ఇంటను వుండ
వారకాంతల మీద వలపుయాల
చేతికాసు పోవు చెడువ్యాధులు వచ్చురా" ॥నాద॥

ఇలాంటి పద్యాలు నాదబ్రహ్మానంద నారాయణకవి శతకంలో నాలుగైదు వందల దాకా ఉన్నాయి.

## నాగేంద్ర నానీలు

- ఎ.ఎ. నాగేంద్ర. ఫోన్ : 9490188263

కోస్తాలోని
తుఫాన్ వర్షమైనా సరే
కనీసం చినుకులు
సీమకందుతై

చేనేలేదు
ఆదర్శరైతట!
ఊకదంపుడు సలహాలకు
కొదువ లేదు.

అయ్యో!
మేతలేదా ఆవుకు
అవును నాయకులు
మేసేశారు

వ్యవసాయం
దండగంటున్నాడు
రేపటి నుంచి
ఏం తింటాడో మరి!

ÔÔÔ

## సుస్వరాల సుమధురాలు

- అడప రాజు, వరంగల్. ఫోన్ : 9177825265

సుస్వరాల సుమధురాలు
సుశ్యామల మధురపు తెలుగు వెలుగులు
సుమగంధాల హరివిల్లుల మూటలు
సాహిత్యపు తెనుగు తోటలో పూబాటలు.



# పర్యావరణ పరిరక్షణలో మన పాత్ర

- ఎ. వాణి. నల్లగొండ. ఫోన్ : 9848412525

"ఆకాశంలోకి సాగే ప్రతిచెట్టు నేనున్నాను. మీకేంభయంలేదని ప్రకృతి సంపదను దీవిస్తున్నట్లుగా తన కొమ్మలను ఊపుతూ, చల్లటి గాలితో జీవరాశిని ఆశీర్వదిస్తున్నట్లుగా ఉంది."

పై వాక్యాలను మనం పూర్తిగా అనుభూతి చెందగలగాలంటే పర్యావరణ పరిరక్షణలో మనపాత్రను సమర్థవంతంగా పోషించగలగాలి.

**పర్యావరణం :** మన చుట్టూ ఆవరించి ఉన్న గాలి, నీరు, నేల, జంతువులు, వృక్షాలు అనగా జీవ, నిర్జీవ సమన్వయ వ్యవస్థనే పర్యావరణం అంటారు. అంటే భూమి కేవలం మానవులదే కాదు. కోటానుకోట్ల జీవరాసులకూ ఆవాసమే. కానీ క్రమంగా మానవుడు భూమిమీద తన ఆధిపత్యాన్ని పెంచుకుంటూ, ప్రకృతిని శాసించే స్థాయికి ఎదిగాడు. తన అవసరాలకోసం ప్రకృతి వనరులను సద్వినియోగ పరుచుకోవడానికి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని కనుగొన్నాడు. కాని ప్రకృతి వనరులకు కొన్ని ఎల్లలు ఉన్నాయి. మహాత్మాగాంధీగారు "సహజవనరులు మన అవసరాలని తీర్చుకోవడానికే గానీ, మన అత్యాశల్ని తీర్చుకోవడానికి కాదు" అన్నారు. కాని నేటి ఆధునిక మానవుడు సహజ వనరుల్ని విచక్షణారహితంగా వినియోగించుకుంటూ తన అత్యాశల్ని తీర్చుకోవడమే కాకుండా అజ్ఞానంతో వాటిని ధ్వంసం చేస్తున్నాడు.

మంచి గాలి, పరిశుభ్రమైన నీరు, సారవంతమైన నేల ప్రకృతి మనకు ఇచ్చిన వరాలు. పర్యావరణము, పరిసరాలు ఈ రెండూ ప్రకృతికి రెండు పర్యాయపదాలు. మనం మన చుట్టూ ఉన్న పరిసరాలని శుభ్రంగా ఉంచుకోగలిగి, మన చుట్టూ ఆరోగ్యకరమైన వాతావరణాన్ని ఏర్పరచుకోగలిగితే పర్యావరణాన్ని పరిరక్షించినట్లే. కానీ నేటి పరిస్థితి అలాలేదు. రకరకాల కాలుష్యాలతో మన భూమి అల్లాడిపోతుంది. పరిశ్రమలు, వాహనాలు విసర్జించే వ్యర్థపదార్థాల వలన గాలి, నీరు, నేల కలుషితమై ప్రకృతి సమతుల్యత దెబ్బతింటుంది. జనాభా విపరీతంగా పెరగటం వల్ల ప్రకృతి వనరులను విచక్షణా రహితంగా వినియోగించుకోవడం, అడవులు నాశనమవడం, వ్యర్థవాయువులు వాతావరణ పొరలలోకి ప్రవేశించడం వల్ల ఓజోన్ రక్షణ కవచం క్షీణించిపోవడం, ఆమ్ల వర్షాలు ఏర్పడడం, గ్రీన్‌హౌస్ వాయువుల ఫలితంగా గ్లోబల్ వార్మింగ్ పెరిగి భరించరాని వేసవి ఎండలు, కరువు కాటకాలు, అకాలవర్షాలు, వరదలు, తుఫాను బీభత్సాలు సంభవించడం జరుగుతుంది. పరిశ్రమల నుండి వెలువడే వ్యర్థాల వల్ల జలవనరులు, సారవంతమైన నేలలు కలుషితం కావడం, ఫలితంగా పంట దిగుబడులు తగ్గిపోవడం, పంట దిగుబడి పెంచాలన్న కాంక్షతో మితిమీరి రసాయన ఎరువులు వాడటం, చీడపురుగుల నివారణకు విచక్షణా రహితంగా క్రిమిసంహారక మందులను వాడటం మొదలైన కారణాలన్నీ పర్యావరణ క్షీణతకు దారితీస్తున్నాయి. వీటన్నిటినీ మించిన కాలుష్య కారకాన్ని ఇంకా బాగా చెప్పాలంటే మన ప్రియమైన శత్రువుని రోజుకి లెక్కకు మిక్కిలి వాడుతూ పర్యావరణ క్షీణతకు ప్రతివ్యక్తీ దోహద పడుతున్నాడు. అదే - పాలిథీన్ (ప్రియమైన శత్రువు).

**పర్యావరణ పరిరక్షణలో మన పాత్ర :-**

"ప్రవర్తతాం ప్రకృతి హితాయ పార్థివాః" కొన్ని వేల సంవత్సరాల క్రితమే మహాకవి కాళిదాసు ప్రకృతి ప్రాధాన్యతను పైవిధంగా వర్ణించాడు. దాని అర్థం దేశాన్ని పాలించే పాలకులు కేవలం ప్రజల హితాన్నే కాదు ప్రకృతి హితాన్ని సైతం దృష్టిలో ఉంచుకోవాలి. ప్రకృతిని పాలకులే కాదు ప్రజలందరూ కాపాడుకోవాలి. అప్పుడే ప్రకృతి మనల్ని కాపాడుతుంది. ఇది అక్షరాలా నిజం. చెట్టూచేమలను, అటవీ సంపదను మన తాతలనాటి ఆస్తిగా కాదు, మనముందు తరాలవారికి వడ్డీతో సహా చెల్లించవలసిన అప్పుగా భావించి, మనమిప్పుడు మొక్కలు నాటాలి. నాటిన ప్రతి మొక్కను శ్రద్ధగా పెంచాలి. అలా చేయకుంటే ఋణభారం పెరిగినట్లుగా కాలుష్యభారం పెరిగి మానవ జాతి అస్తిత్వానికే ప్రమాదం వాటిల్లుతుంది. మరియు పర్యావరణ పరిరక్షణ లక్ష్యానికి తూట్లు పొడిచినట్లవుతుంది. ●

## బతుకు చిత్రం

- యస్.ఎం.సుభాని,

నేను అనాథను
ఎవరికీ పట్టని గాథను
గుడిలో ప్రసాదమే నా అల్పాహారం
కొసరిన, విసిరిన ఎంగిలి మెతుకులే నా ఆహారం
నా కన్నీళ్ళే నాకు త్రాగు నీరు
నా తలరాత, ఈసడింపులు - ఛీత్కారాలు
నేను అనాథను
వసివాడుతున్న పసిమొగ్గను
ఉదయం చెట్టునీడే నాగూడు
రాత్రికి సిమెంటు తూములే నాగూడు - నాకుతోడు
ప్లాట్‌ఫామ్‌లు రాత్రికి ప్రభుత్వం నాకు రాసిచ్చింది
ఋతువులు తమకాలాల్లో ప్రతిరోజూ నన్ను ఫ్రీగా ముద్దాడుతాయి
రెండు చేతుల మడతలే నాకు తలగడ
చెత్తా చెదారమే నాకు పరుపు
నేను అనాథను
ఒంటరిగా మిగిలిన నావను
నేను అనాథను
తెగిన పతంగాన్ని
నా బతుకు చిత్రకారుడికి అద్భుత కళాఖండం
నా ఆర్తనాదం సంగీత దర్శకుడికి గుండెల్ని పిండే విషాద గీతం
నా వ్యథ కథకుడికి మంచి మలుపును తిప్పే కథావస్తువు
నా బాధ కవికి మహాకావ్యం
నా గాథ దర్శకుడికి ఆస్కార్ స్థాయికి తీసుకెళ్ళే వెతల కథ
నేను అనాథను
తీగ తెగిన వీణను
ఇదీ నా బతుకు చిత్రం
విసిరేసిన అభాగ్య జాతక చక్రం.

# నారిగాడు - నారీమణి

- సి.హెచ్. జయరాజు (రాజా) యర్రగొండపాలెం. ఫోన్ 9908898919

సరేనంటూ తలూపి అతను పనిలో నిమగ్నమయ్యాడు.

"సుబ్బారావు నువ్వు కిందకెళ్లు ఎండకు నల్లబడిపోతావు" అన్నాడు జానీ సీరియస్‌గా. "అసలే పొడలేని కాకినలుపు... ఇంకేముంది నల్లబడటానికి నా బొంద. ఏమైనా... సుబ్బిగా నీ పండ్లు కూడా నల్లగా పుట్టుంటే భలే ఉండేవాడివోయ్" అంతే సీరియస్‌గా అందుకున్నాడు భుజంగం. పనులాపేసి పడీపడీ నవ్వుకున్నారందరు సుబ్బారావుతో సహా.

ఇంతలో సెల్ మోగింది. అతను ఫోనెత్తి 'హలో' అన్నాడు. "అరే అబ్బాయ్... కిరణ్‌కి యాక్సిడెంట్ అయిందట. ఇప్పుడెలా వుంది" కంగారుగా అడిగాడు వాళ్ళ మావయ్య.

"ప్రాణాపాయం ఏమి లేదు మామా... ఐ.సి.యూలో ఉంచారు. నేను హాస్పిటల్‌కి వెళ్ళి వచ్చాను. నీకు ఫోన్ చేస్తే కలవలేదు."

"సరే... మేమిప్పుడు బయలుదేరి వస్తున్నాం. మరీ... అమ్మాయిని కూడా తీసుకురమ్మంటావా..."

"ఏమో ఆమె ఇష్టం..." అంటూ ఫోన్ కట్‌చేశాడు అతను.

అతని ముఖం పాలిపోయింది. ఏదో తెలియని అసహనం. దుఃఖం పైకి తన్నుకొచ్చాయి. దూరంగా వెళ్ళి సిగరెట్ ముట్టించి ఆలోచిస్తూ గోడకు జారగిలపట్టాడు.

* * *

అతను అంటే నేను. బాదర నారాయణ నా పేరు. సగం నిరుద్యోగిని. చేసేది పాలిష్ పనైనా ఫర్నిచర్ షోరూమ్‌లో మేనేజర్‌నని బిల్డప్ ఇచ్చే పట్టభద్రుడ్ని. భార్య, ముగ్గురు పిల్లలతో బతుకు బండిని లాగుతున్న సగటు భారతీయుడ్ని. చేసే పనికి, వచ్చే జీతానికి పొంతన కుదరక అప్పుడప్పుడు.సంసార సాగరంలో సునామీలు, తుఫాన్లు ఎదురౌతున్నాయి.

ఈ మధ్య నా బెస్ట్‌ఫ్రెండ్ శ్యామ్ కలిశాడు. పదిహేను సంవత్సరాల తర్వాత వాడు నన్ను చూసి "ఒరేయ్... నారీగా ఎన్నాళ్ళయిందిరా నిన్ను చూసి... ఎలా ఉన్నావ్... ఏం చేస్తున్నావ్ అంటూ తెగ సంబరపడ్డాడు. "ఏదోరా దేవుని దయవల్ల 'నార' సాగుతుంది కానీ ముడిపడట్లోదు" అని బాధంతా వాడితో పంచుకుని తేలికపడ్డాను. శ్యామ్ పెదవులు రెండు నోట్లోకి పోనిచ్చి గట్టిగా గాలి వదిలి "తప్పు చేశావురా నారిగ... స్థిరపడకుండా అంత తొందరగా పెళ్ళెందుకు చేసుకున్నావురా?... సరేలే అయిందేదో అయిపోయింది. నేను కోటప్పకొండ హైస్కూల్లో టీచర్‌గా చేస్తున్నా. బియిడి చేసిన అమ్మాయి కోసం చూస్తున్నా. అయినా... నీలాంటి బ్రిలియంట్ ఇలా బతకటం ఏం బాగోలేదురా... నీకు అన్నివిధాలా నేను సపోర్టు ఇస్తా. నా మాటవిని నువ్వు మళ్ళీ పుస్తకం పట్టుకో.." అన్నాడు భుజం తడుతూ.

"ఇప్పటికే అరెకరం పోయిందిరా... ఇప్పుడు చదువేందిరా" అన్నాను మాట తుంచేస్తూ

"పోతే ఇంకో అరెకరం పోయిద్ది. జుట్టుకంటే జీవితం గొప్పదిరా... బాగా ఆలోచించి నిర్ణయం తీసుకో..." అన్నాడు.

చదువులో నాకంటే వెనకుండే శ్యామ్‌ని చూసి నాలో అణగారి ఉన్న, ఇంటర్‌లో నా పేరు ప్రక్కన 'బి.ఎ.బియిడి' అని వ్రాసుకుని మురిసిపోయిన క్షణాలు గుర్తుకొచ్చాయి. కానీ వర్తమానం కర్తవ్యంలోకి నెట్టేసింది.

ఓ రోజు ఉదయం పూట నేను మాలచ్చీ (మాఆవిడ) సరదాగా కబుర్లు చెప్పుకుంటూ టీ తాగుతున్నాము. సెల్ రింగయింది. తనే ఫోనెత్తి "హలో అన్నయ్యా.. బాగున్నారా... అమ్మా నాన్నా బాగున్నారా... 'పప్పన్నాలు' ఎప్పుడు పెడుతున్నావ్.. ఒకసారీ రాకూడదూ ఇంటికి" అని రొటీన్‌కి కొంత నాటకీయత జోడించి నవ్వి "ఇదుగో ఆయనకిస్తున్న మాట్లాడు" అంటూ సెల్ నా చెవి దగ్గర పెట్టింది.

"బాగున్నావా శ్యామ్..." ఆప్యాయత నిండిన గొంతుతో పలికాను.

"బాగానే ఉన్నా కానీ... నే చెప్పింది ఏం ఆలోచించావ్..."

మా ఆవిడవైపు చూస్తూ మౌనంగా ఉన్నాను.

"రేయ్ కాలం గడిచినా, అవకాశం చేజారినా తిరిగిరావు. ఇప్పటికే సగం జీవితం సంకనాకిపోయింది. నా మాట విని అమ్మాయిని ఎలాగోలా నచ్చజెప్పి ఊరికి పంపించు. నీకు చదువుకోటానికి ఇబ్బంది ఉండదు. ఏమంటావ్..." శ్యామ్ ఆజ్ఞాపించినట్లుగా అన్నాడు.

## ● మినీ కవితలు ●

- మాధవీ సనారా, అనకాపల్లి. ఫోన్ : 9440103134

స్త్రీలంటూ
పురుషులంటూ
తేడాలెందుకు?
ప్రగతిపథంలో
పోదాం పదండి
ముందుకు !

కాటువేస్తే
వేటు వెయ్యండి !

త్రాచునైనా సరే
త్రాష్టుడినైనా..

అప్పుడు
కురూపి అయినా
అందగత్తె
అయింది కుబ్జ !
ఇప్పుడు
ఆడదైతే చాలు

గుంటడి చేతిలోనూ కబ్జా !

పెళ్లిళ్లలో
వధూవరులు
ఫోటోగ్రాఫర్ సూర్యుడు
తిరగమన్నట్టు తిరిగే
పొద్దు తిరుగుడుపూలు.

దెబ్బతిగిలినప్పుడు
'అమ్మా' అంటాడు!
దెబ్బలాడేటప్పుడు
'నీయమ్మా..' అంటాడు

హీరోవాడే !
విలనూ వాడే!

అద్దంలో
కొండను చూపడం

మినీ కవిత
రాయడం.

మా ఆవిడ
చీర కొన్నది !
చీర ఖరీదైందే –
నా అనుమానమల్లా
దాని మన్నిక మీదే !

"సరే అన్ని విషయాలు తనతో మాట్లాడి చెప్తాను" అని ఫోన్ ఆపేశాను.

మా ఆవిడ ముఖంలో కొంచెం కోపం, అనుమానం రంగులు మారటం గమనించాను. కనుబొమలు ఎగరేసి పెదవులు చుట్టి అటూ ఇటూ తిప్పింది. అలాంటి సందర్భంలో భలే ముద్దొస్తుంది తను. పెదవులు ముందుకు చాపి దగ్గరికి జరిగాను. "సాల్లే సంబడం... ముందు ఆ గూఢుపురాని ఏంటో చెప్పు..." అని తోసేసింది. ఇన్నాళ్ళు తన బాధపడుతుందేమోనని దాసిన విషయమంతా వివరించాను.

"ఈ డొంక తిరుగుడంతా ఎందుకు. మిమ్మల్ని సాకలేను. నాచేత కాదని ఒప్పుకోరాదు. అన్నీ ముందే మాట్లాడుకుని ఏమీ ఎరగని నంగనాచిలా ఆ ముఖం చూడు. ఇదుగో ఎక్కడికి వెళ్ళేది లేదు. నీ అగసాట్లు నువ్వు పడు." దురుసుగా లేచి టీగ్లాసులు బాత్రూమ్ దగ్గరికి విసిరి వంటిట్లోకెళ్ళింది. నాకు కోపం ముక్కులో ఎగదన్నింది.

"ఏం నిన్నేం దుబాయ్ పొమ్మన్నానా? బీహార్ పొమ్మన్నానా? మనింటి దగ్గరే కొన్నాళ్ళు ఉండమంటున్నాను. అంతేగా..."

"ఆ..హా...హా...హా...హ... నీకేం ఇక్కడ హోటల్ తిండి తిని అప్పుడప్పుడు మందుకొట్టి జల్సాగా తిరగాలి. మేమేమో ఆ పల్లెటూర్లో, అగసాట్లు పడాల. ఆ పప్పులేమి ఉడకవ్ గానీ నోరు మూసుకో..." అరిసింది వంటిట్లో నుంచి.

"నన్ను నోరుమూసుకోమంటావా... అప్పో సప్పో తెచ్చి పెడుతుంటే ఒళ్ళు బలిసి ఏం అర్థం కావటం లేదు నీకు..."

## అమ్మ

- బాబు, ఖమ్మం

**పల్లవి**

అమ్మ అనే మాట ప్రతి మనిషినోట
పలికించి ఆ దైవం - మనకిచ్చిన పెద్దవరం

**చరణం**

అమ్మకన్న గొప్పది - లేదూ ఈ లోకంలో
కమ్మనైన ఆ పిలుపే - మన జన్మకు ధన్యతరా
ధనం వున్నా ధాన్యం వున్న - ధరిత్రిలో నీకేదివున్నా
'అమ్మ' లేని జీవితం - అగుపించును వెలితిగా

**చరణం**

నీవునేర్చే మొదటిపదం - అమ్మని తెలుసుకో ...
నీ ఆకలి గుర్తెరిగే - ఆ దేవత అమ్మేగా
సుఖంవున్న శాంతివున్న - సృష్టిలో నీకేదివున్నా
అమ్మప్రేమ పొందలేని - ఆ మనిషిది శాపమేరా

**చరణం**

నీ కంటిలో నలుసుపడితే - తాను తల్లడిల్లిపోవు
జగతి నిన్ను వెలివేసిన - తన ఒడిలో ఓదార్చును
బరువులున్న బాధలున్న - అడ్డుగోడలెన్ని వున్న
అమ్మను నువు మరువబోకు - ఆమె మనస్సు నొప్పించకు




"ఓయబ్బో... లోకంలో నువ్వొక్కడివే ఇరగబడి పోషిస్తున్నావు. పెళ్ళాం పిల్లల్ని. ఇంకెవరైనా ఎరుగుదురా..."

"నోరు ముయ్యకపోతే తంతా..." ఆవేశంగా లేచాను.

"ఆ... రాయ్యా... ఇక్కడ తేరగా ఉన్నాం... తందుపుగానీ..." వంటింట్లో నుండి పేళాలు పేలుతున్నాయి.

గబగబ వాకిట్లోకెళ్ళాను కోపంతో అప్పటికే పిల్లలు లేచి బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు. కొంచెంసేపు బొమ్మలా నిలబడి బయటికి వచ్చేశాను.

కొంతకాలం గడిచింది. పనిలో ఇంతకుముందు ఉన్నంత హుషారు లేదు. పైగా పని ఎక్కువవటం, అప్పులు, ఇంట్లో చికాకులు నాలో అసహనాన్ని పెంచుతున్నాయి. పాలిష్ అలా పట్టుకుంటే ఇలా ఊడిపోతుందని శేఠ్ చీవాట్లు పెడుతున్నాడు. 'స్కూలు టీచరు శ్యామ్' నాలో కుర్చీవేసుకుని కూర్చున్నాడు. రోజురోజుకి చదువుకోవాలనే కోరిక పెరిగిపోసాగింది. మాలచ్చీ మాట్లాడం మానేసి చాలా రోజులయింది. అన్నంపెట్టు, నీళ్ళుతోడు, బియ్యంలేవు, సరుకులు అయిపోయినయ్... ఈ కమ్యూనికేషన్ అంతా పిల్లలపై నడుస్తుంది.

ఓ రోజు డ్యూటీనుండి వచ్చేసరికి మా ఆవిడ తలనిండా పూలు పెట్టి, నా కిష్టమైన చీరకట్టి నీళ్లచెంబుతో ఎదురొచ్చింది చిరునవ్వుతో. ఈసారి మూతి మూడు వంకర్లు తిప్పి "ఆమ్లెట్ వెయ్యనా..." అంటూ ఆ జానెడు జడని వెనక్కి వేస్తూ వయ్యారంగా లోనికెళ్ళింది. మనసెంత గుంజుకుందో? చిటికెలో తయారయి బెడ్‌రూమ్‌లోకెళ్ళాను. అప్పటికే తను సత్యభామ లెవల్లో పడుకుని ఉంది. ప్రేమగా దక్కరికి చేరి

తల నిమురుతూ తన చేతిని నా చేతిలోకి తీసుకున్నాను. తను నా గుండెలపై వెంట్రుకలను వేళ్ళతో సుతారంగా మెలితిప్పుతో గోప్యంగా నవ్వి "బావా... మధ్యాహ్నమే రాణి... ఊరి నుండి వచ్చింది" అంది.

"ఏరాణి..." అయోమయంగా అడిగాను.

"అబ్బ... మన పక్కింటి రాణండీ..."

మా పక్కింట్లో రాణి ఊరి నుండి వస్తే మాకు పండగేంటో నాకు గోచరం కాల.

"అహ... దాంట్లో విశేషమేముంది" అన్నాను మామూలుగ.

".... ఆమెగార్కి ఆల్రెడీ రెండు జతల కమ్మలున్నాయా! మళ్ళీ పాతికవేలు పెట్టి బుట్టలు చేయించిందట వాళ్ళమ్మ. నా కూతురికి లేకుండా నాకొద్దని అలిగితే... పాపం పిల్లక్కూడా తీసిందంట. చూశావా... ఆ వగలాడి

తెంపరితనం. నాకు చూపించి తెగ సంబరపడిపోయిందిలే. కానీ ఎంత బాగున్నాయో ఆ బట్టలు. నాకు చాలా ముచ్చటేసింది వాటిని చూసి".

"మంచిదేగా... పైగా ఒక్కగానొక్క కూతురు. ఏమైనా ఆ అమ్మాయికేగా..." తల నిమురుతూనే బుజ్జగింపుగా అన్నాను.

"మరి నాకెప్పుడు తీస్తున్నారు." కొంచెం కఠినత్వం వినిపించింది ఆ గొంతులో. చక్కగా సోకు చేసుకుని రోడ్డుమీద నడుస్తుంటే ఒంటిమీద బురదనీళ్ళు పడ్డట్లైంది నా పని.

"కొంచెం టైం పడుతుంది బంగారం... ఉద్యోగం రానీ... నీకు" తడబడుతూ అన్నాను.

చెయ్యి తీసేసి లేచి కూర్చుని "అంతేలే అప్పులు తీర్చటానికి, మీ అమ్మా నాన్నలకు సర్దటానికి, మందికి ఇప్పించటానికి ఉంటాయి గానీ, నా దగ్గరికి వచ్చేసరికి పైసా ఉండదు. నా కర్మ...." ఏడుపు ఏరులైంది.

ఎలా ఓదార్చాలో తెలీక "అదికాదు బంగారం... నే చెప్పేది విను..." బతిమాలబోయాను.

"బంగారం... బంగారం... అని ఇన్నాళ్ళు మురిపించి మాయచేశావు. నువ్వు ఒంటినిండా దిగేసిన ఈ బంగారం ఇక మొయ్యలేను. రేప్పొద్దున్న చార్జీకివ్వు. ఊరెళ్ళిపోతాము." ముక్కులు ఎగిసిపడుతున్నాయి. ముఖం ఎర్రగా కందింది. జుట్టు ముడేస్తూ, హెచ్చరించినట్లు చూస్తూ వెళ్ళి పిల్లల పక్కలో దూరింది.

అదుగో అప్పుడెళ్ళిన ఆవిడ ఇప్పుడు వస్తుంది. ఈ మూణ్ణెళ్ళు పిల్లలు తను లేరన్న బాధ ఉన్నా, పగలు పని, రాత్రి చదువుతో సతమతమవుతున్నాను. పుస్తకం తెరిస్తే కళ్ళు మూతలుపడుతున్నాయి. చదివింది అర్థంకాదు. గుర్తు ఉండదు. అందుకే ఎప్పుడు చెయాల్సింది అప్పుడే చెయ్యాలంటారు.

ముందస్తు నైరుతి రుతుపవనాలు సన్నటి జల్లులతో మొదలయింది. నల్లటి మేఘాలు ఒకదానిపై ఒకటి ఒరుసుకుని మహావేగంతో ఆకాశాన్ని కమ్మేశాయి. మేడపైన ఎక్కడో శూన్యంలోకి చూస్తూ వర్షం ఎక్కువవటంతో ఇంట్లోకి వచ్చాను. ఈవిడగారు గ్లాసు తిరగేసింది. ఇప్పుడెలా ?

అని ఆలోచించి రివర్స్‌లో పడుకున్నాను. అటు తిరిగాను. ఇటు తిరిగాను. వెల్లికిలా పడుకున్నాను. బోర్లా తిరిగాను. ఫ్... నిద్ర రావటం లేదు. చిన్నప్పుడు తెలుగుపంతులు చెప్పిన "నిద్రసూత్రం గుర్తొచ్చింది. "వెల్లికిలా పడుకుని, కాళ్ళు చేతులు బార్లాచాపి, ఈ కాళ్ళు నావి కావు. ఈ చేతులు నావికావు. అసలు నేనే లేను. అనుకుని కళ్ళు మూసుకుంటే నిద్ర ముంచుకొస్తుందన్నాడు. అదీ ట్రై చేశాను.

నేను గమనిస్తూనే ఉన్నాను. నా అవస్థ ఊసి మహాలక్ష్మి లోలోపల నవ్వుకుంది. బయట వర్షం, హోరు గాలి మొదలైంది. ఉరుములు మెరుపులు గర్జిస్తున్నాయి. గాలి తెమ్మెర ఒకటి కిటికీని బలంగా మూసేయటం, కరెంట్ పోవటం ఒకేసారీ జరిగాయి. అనుకోకుండా ఇద్దరు తడుముకున్నారు. మేనిలో మెరుపులు పుట్టాయి. ప్రేమావేశం, ఉద్రేకం కట్టలు తెగి ఇద్దర్నీ ఒకవైపు నెట్టేశాయి. రాత్రంతా ఆకాశం నుండి మేఘాలు కరుగుతున్నాయి. భూమి పులకరిస్తూనే ఉంది. ఏ తెల్లవారుజాముకో తెరపిచ్చింది. ప్రకృతి నిర్మలంగా, ప్రశాంతంగా, స్వచ్ఛంగా కనిపిస్తుంది. ఆ ఇంట్లోంచి..

"బంగారం..."

"ఊ..."

"నాలుగు రోజులు ఉండి పోరాదు..."

"..................?!"

## తెలుగుతల్లికి స్వాగతం

- చివుకుల శ్రీలక్ష్మి, విజయనగరం. ఫోన్ : 9441957325

స్వాగతం ! సుస్వాగతం ! మా తెలుగుతల్లీ !
సర్వాలంకార భూషిత ఓ తెలుగమ్మ !
కవితాసదస్సుకు విచ్చేయవమ్మా !
తేనెలొలుకు తెలుగు పలుకుల స్వాగతింతుమమ్మా!
తెలుగుపీఠమను సస్యశ్యామల శాంతినేల ఇది
చిరునగవుల వెన్నెలొలుక ఆసీనురాలవుకమ్మా !
అచ్చుల అర్ఘ్యమిచ్చి హల్లుల పాద్యమిడి
వర్ణమాల అక్షరాలు ఆచమనీయమ్ముగా
గుణింతాల పూల గుత్తులను తోమాలగ
పంచకావ్యములను పంచామృతములుగా
ముచ్చటైన తెలుగున అభిషేకింతుమమ్మా !
ప్రబంధ పద్యసాహిత్యపు కంచుకము తొడిగి
ఆధునిక గద్యసాహిత్యపు చీరెను చుట్టి
భాషాసంకర వేదననుండి సేదదీర
తెలుగువారి సొంతమైన గద్యపు గంధమునిడి
అలరించే అవధానపు అక్షతలనిడి
సంగీత సాహిత్యాలు పసుపుకుంకుమలుగ
పదాల అలంకారాల ఆభరణాలను అలంకరింపచేసి
నానావిధ ప్రక్రియలు విరుల దొంతరలుగా
కోటినామమ్ముల కీర్తిస్తూ పూజింతుమమ్మా
నాటకమ్ముల ధూపమ్మిడి హరికథల దీపమ్మిడి
నవరసముల సాహితీ విందు నైవేద్యమ్మిడి
మువ్వల సవ్వడుల తాంబూలమ్మిడి
తెలుగుబిడ్డల కనుల వెలుగులు కోటి నక్షత్రాల హారతికాగ
షోడశోపచారముల తెలుగుతల్లిని పూజింప స్వాగతింతునమ్మా !



# ఉపనిషత్తులు మనకు ఏమి చెబుతున్నాయి ?

- గాజుల సత్యనారాయణ (పెద్దబాలశిక్ష రచయిత), విజయవాడ. ఫోన్ : 9848687652

మానవ శరీరానికి శిరస్సు ఎంతటి ప్రధానమైన భాగమో, వేదాల్లో ఉపనిషత్తులు అంతటి ప్రధానమైనవి. ప్రతి వేదంలోను నాలుగు భాగాలున్నాయి. అవి సంహితలు, బ్రాహ్మణాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులు. ఉపనిషత్తులు అంటే బ్రహ్మవిద్య, జీవాత్మ, పరమాత్మ, జ్ఞానము, మోక్షము, పరబ్రహ్మ స్వరూపమును గురించి వివరించేవి. ఇవి వేదాలకు చివరన ఉన్నాయి కాబట్టి వీటిని వేదాంతాలు అనికూడా అంటారు. ఉపనిషత్తులని వేదంలోంచి తీసి వేస్తే వేదాలు అర్థరహితం అవుతాయి.

ఒకప్పుడు మహా ఋషులు, ఋషి పుత్రులు ఒకచోట చేరి ... ఆత్మ అంటే ఏమిటి? అనాత్మ అంటే ఏమిటి? జీవుడు ఎవరు? జీవుల ఈశ్వరుల నడుమ సంబంధం ఎటువంటిది ? చివరికి ఎక్కడికి పోతాం? అన్న ప్రశ్నల గురించి చర్చలు జరుపగా వచ్చిన జవాబులే ఉపనిషత్తులు

పరతత్వాన్ని దర్శించిన ఋషులు ప్రేమతో అప్రయత్నంగా, అసం కల్పితంగా దివ్య వాక్కు ఏర్పడింది. ఇలా ఒకరి నుండి మరొకరు ఆ దివ్య తత్వాన్ని దర్శించ గలిగారు దానికి ఉప-నిషద్ అని పేరు పెట్టారు. ఉప- దగ్గరగా, నిషణ్ణా అంటే చూపునది. అట్లా ఉపనిషత్తు అని పేరు ఏర్పడింది. పరబ్రహ్మ తత్వాన్ని ఇతరత్ర లభించే చోటికంటే దగ్గరగా తెచ్చి చూపగలుగుతుంది.

ఉపనిషత్తులు ప్రధానంగా ఆత్మ గురించి, మరణం గురించి, సృష్టి పట్ల సర్వజీవుల పట్ల మనిషికి ఉండాల్సిన దృక్పథం గురించి వివరిస్తాయి. భగవంతుడు శాశ్వతమైనవాడు, ఎప్పటికి ఉండేవాడు, పరి మితులు లేనివాడు, మాటలకు, వర్ణనలకు అతీతమైనవాడు. అటువంటి పరమేశ్వరుడిని చర్మ చక్షువులతో (బాహ్య నేత్రాలతో) చూడటం దాదాపు కష్టం. ఎందుకంటే శరీరం ఈ రోజు ఉంటుంది, రేపు నశించిపోతుంది. అలా అనీ మనసుతో కూడా చూడలేము. ఎందుకంటే మనసుకు కొన్ని పరిమితులు ఉన్నాయి. వాటిని దాటి మనసుపోలేదు. కానీ భగవత్ తత్వాన్ని అర్థం చేసుకోవాలన్నా, భగవంతుని చూడాలన్నా, అది ఆత్మ ద్వారా మాత్రమే సాధ్యం. దానికి కారణం ఆత్మ కూడా పరమాత్మ వలె శాశ్వతమైనది, మార్పు చెందనిది. ఈ ఆత్మగురించి అన్ని వివరాలు ఉపనిషత్‌లలో లభిస్తాయి.

మనిషి తనను తాను తెలుసుకోగలిగే వివేక మంతా ఉపనిషత్తుల్లోనే ఉంది. వేదాలు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామ వేదము, అధర్వణ వేదము. వీటిని యాభై విభాగాలుగా విభజించారు. వీటి సారాంశాలను ఒక వేయి నూట ఎనభై ఉపనిషత్తుల్లో సమకూర్చారు. వీటిలో ముఖ్యమైనవిగా ముక్తికోపనిషత్తు 108 ఉపనిషత్తులను ప్రస్తావిస్తున్నది. ఒక్కొక విశ్వాసం వారు ఒక్కొక్క విధంగా ఉపనిషత్తులను తమకు అనుకూలంగా ఉదహరిస్తున్నారు. ప్రామాణికంగా చెప్పడానికి ఆస్కారం లేదు. ఏది తెలుసుకోవడం వల్ల మరేదీ తెలుసుకోనవసరం లేదో అదే ఉపనిషత్సారం. ఈ 108 లో 10 ఉపనిషత్తులకు శంకర, రామానుజ, మధ్వాచార్యులు తమతమ సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ భాష్యాలు రాశారు. వీటినే దశోపనిషత్తులు అంటారు. ఈ దశోపని షత్తులు ఏమిటనేవి క్రింది శ్లోకం వివరిస్తుంది.

"ఈశ కేన కఠ ముండ మాండూక్య ప్రశ్న తిత్తిరి
ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ"

(1.ఈశావాస్య ఉపనిషత్తు, 2. కేనోపనిషత్తు, 3.కఠ ఉపనిషత్తు, 4.ముండకోపనిషత్తు, 4.ప్రశ్నోపనిషత్తు, 6. మాండూక్య ఉపనిషత్తు, 7. తైత్తిరీయ ఉపనిషత్తు, 8.ఐతరేయ ఉపనిషత్తు, 9.ఛాందోగ్య ఉపనిషత్తు, 10.బృహదారణ్యక ఉపనిషత్తు)

ఒక్కోవేదానికి ఉపనిషత్తుల సంఖ్య నియతంగా ఉంటుంది. ఋగ్వేదానికి సంబంధించినవి - 10, కృష్ణ యజుర్వేదానికి సంబంధించినవి - 32, శుక్ల యజుర్వేదానికి సంబంధించినవి - 19, సామవేదానికి సంబంధించినవి - 16, అధర్వణ వేదానికి సంబంధించినవి - 31 (మొత్తం - 108)

నిద్రాణమైన మానవజాతిని చైతన్యవంతం చేసి, పావన హృదయు లుగా మార్చగలుగుతున్నది ఈ ఉపనిషత్తులే. ఉపనిషత్తులు విద్యా వివేక ఆసక్త్యాదులచే సాధించగలిగినవీ, సాధించదగినవీ. ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థ ఫలితాలనీ, ప్రభావాలనీ విశ్లేషించగలిగినవి ఈ ఉపనిషత్తులే.

మనకు లభించే సర్వశక్తులూ పరమాత్మ సంకల్పంతో ఆవిష్కృతమైనవే. మనం కేవలం నిమిత్తమాత్రులం. పునర్జన్మ కలిగించే సుఖం లౌకిక సుఖమనీ, పునరావృత్తి లేని మోక్షమే అలౌకిక సుఖమనీ, దానికే మానవుడు నిరంతర జ్ఞానసాధన చేయాలనీ ఉపనిషత్తులు మానవాళికి హితబోధ చేస్తున్నాయి.

మరణం తర్వాత ఆత్మ ఎక్కడకు వెళుతుంది, ఎలా వెళుతుంది. అసలు మరణం అంటే ఏమిటి? ఇటువంటి అనేక విషయాలను ప్రపంచానికి చెప్పిన తత్వ శాస్త్ర నిధులే ఉపనిషత్తులు. మరణం మనిషికి అంతం కాదు, ఒక సుదీర్ఘమైన ప్రయాణం మధ్యలో వచ్చే తాత్కాలికమైన విరామం మాత్రమే అంటాయి ఉపనిషత్తులు.

మన పూర్వ ఆచార్యులందరూ ఉపనిషత్ భాగాన్నే వేదాంతంగా తీసుకున్నారు. ఈ ఉపనిషత్తులు పరమాత్మ ఏమిటో, మనం ఉండే ప్రకృతి ఏమిటో, అత్మ ఏమిటో, ఆత్మకు ప్రకృతికి ఉన్న సంబంధం ఏమిటో, ఆత్మకు పరమాత్మకు ఉన్న సంబంధం ఏమిటో, మనిషిగా అత్మ యొక్క లక్ష్యం ఏమిటో ఇలా ఎన్నో విషయాలను తెలుపుతాయి.



శరీర సుఖసాధనాలకై చేసే యజ్ఞయాగాదులకీ ఉపవాసములాంటి కొన్ని నియంత్రణలు ఉంటాయి, అట్లానే ఆత్మ సుఖాన్ని కోరుకున్నప్పుడు కూడా కొన్ని శారీరక సుఖాలని క్రమబద్ధం చేసుకోవాల్సి ఉంటుంది. మన సుఖాన్ని అంటే ఆత్మ సుఖాన్ని గురించి తెలిపే వేదంలోని భాగాన్ని ఉత్తర భాగం లేదా బ్రహ్మభాగం అంటారు. జ్ఞాన కాండ అని కూడా అంటారు, ఇవే ఉపనిషత్తులు.

మనిషి అనుసరించాల్సిన ధర్మం గురించి అతనికి సమాజం పట్ల బాధ్యతల గురించి ఉపనిషత్తులు బోధిస్తాయి. ఈ బోధనలు పూర్వం, ప్రస్తుతమూ, భవిష్యత్తులో కూడా అనుసరణీయాలే! ఉపనిషత్తులు వివేకానికి పరాకాష్ట. విజ్ఞాన ఖనులు. అందుకే అవి మానవ జాతికి స్ఫూర్తిదాయకాలవుతున్నాయి. ఉపనిషత్ సారాంశం వర్ణించేందుకు భావాలు చాలవు. ఆదిశంకరా చార్యులు, రామానుజులు, వివేకానందుడు లాంటి మహాను భావులు ఉపనిషత్తులనుంచే స్ఫూర్తి పొందారు. వేదాంత సారాన్నంతా ఇముడ్చుకున్న ఉపనిషత్తులు మానవాళికి శాంతి సాంత్వ నను చేకూర్చాయి. అవి విలువకట్టలేని జ్ఞాననిధులు. శోధించిన కొద్దీ లభించే అంతులేని జ్ఞానసంపదలు ఉపనిషత్తుల్లోనే ఉన్నాయి.

మన కంటికి కనిపించని పరమాత్మను ఉపనిషత్తులు హృదయంలో ఆవిష్కరింపజేస్తాయి. నేనెవరు? ఎక్కడి నుండి వచ్చాను? నా ప్రస్థానం ఎటువైపు? అనే అంతుదొరకని ప్రశ్నలకు ఉపనిషత్తులు సమాధానం చెబుతాయి. ఆది మధ్యాంత రహితుడైన పరమాత్మ గురించి ఉపనిషత్తులు వివరిస్తాయి. అమృతత్వం సాధించేందుకు ఉపనిషత్తుల సారాంశం దోహదం చేస్తుంది.

ఉపనిషత్తులు జ్ఞానం ప్రధానంగా ఉన్నాయి. గురువు ముందు శిష్యుడు కూర్చొని జ్ఞానాన్ని ఆర్జించాడు. వీటిలో ప్రధానంగా విశ్వాంత రాళంలో మనిషికి ఉండే స్థానం గురించి చర్చ జరిగింది. ఉపనిషత్తులు తాత్త్విక గ్రంథాలు. ఆత్మ-అంతరాత్మ ప్రపంచానికి మూలం. ప్రకృతి రహస్యాలు మొదలైన వాటి గురించి ఇవి చర్చించాయి. వేదకాలం నాటి ఆలోచన ధోరణికి ఉపనిషత్తులు పరిపూర్ణతను కలిగించాయి. సరైన జ్ఞానానికి, సన్మార్గానికి ఇవి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాయి.

ప్రతి వేదంలోనూ కొన్ని మహావాక్యాలున్నాయి. ఇవి మహనీయమైన సూక్తులు. కాని ఒక్కొక్క వేదం నుంచి ఒక్కొక్కటి చొప్పున నాలుగు మహా వాక్యాలు బాగా ఆలోచింప చేసేవి. శక్తి మంతమైనవీను. జీవునికీ బ్రహ్మానికీ భేదం లేదని ఇవి చూపుతాయి. వీటిని జపిస్తూ దీర్ఘంగా చింతిస్తే ఆ అద్వైత స్థితి అనుభవసిద్ధమవుతుంది. ఈ నాలుగు మహా వాక్యాలూ ఉపనిషత్తులలోనే ఉన్నాయి. ఎన్నో క్రతువులూ. కర్మలూ, రకరకాల ఆరాధనా పద్ధతులూ, సంహితలోను, బ్రాహ్మణాలలోనూ విశదీకరింపబడ్డా జీవనయాత్ర చరమదశలో అంతిమ లక్ష్యాన్ని చేరుకోవటానికి సాధనాలు ఉపనిషత్తులే.

క్రీ.శ. 1788-1860 మధ్య జీవించిన విశ్వవిఖ్యాత జర్మన్ ఆధ్యాత్మిక వేత్త ఆర్థూర్ షోపున్ హావర్ రోజూ నిద్రించే ముందు ఛాందోగ్యోపనిషత్‌లోని ముఖ్యమైన అధ్యయాలను చదివేవాడు అంటారు. ఉపనిషత్తు యొక్క మొట్ట మొదటి ఆంగ్ల అనువాదాన్ని హెన్రీ థామస్ కొలెబ్రూక్ 1805 లో రచించడం జరిగింది. మొఘల్ చక్రవర్తి షాజహాన్ కుమారుడు, దారా షిఖ్, 1657లో పర్షియన్ భాషలోకి 50 ఉపనిషత్తులు అనువాదం చేయడము జరిగినది.

మనిషి తన పరిమితమైన చైతన్యాన్ని, ప్రజ్ఞను బ్రహ్మ చైతన్యంతో, ప్రజ్ఞతో అనుసంధానం చేసి పరిమితత్వాన్ని దాటి శాశ్వత స్థితిని పొందడానికి ఉపయోగపడే మోక్షవిద్య ఉపనిషత్తులలో ఉన్నదని కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య అంటారు.

కేవలం శాస్త్ర జ్ఞానంతోనో,పాండిత్యం వలనో ఉపనిషత్తుల నిజమైన అర్థాన్ని గ్రహించడం సాధ్యం కాదు. నిజమైన సాధనామయ జీవితంలో పాల్గొని, మనస్సుని పావనం చేసుకుని భగవదభిముఖంగా సాగే కొద్దీ వాటి అంతరార్థం మనకి మరింత లోతుగా అవగతమవుతుంది.

ఏ ఉపనిషత్తు ఎలా బోధించినా సారాంశము ఒకటే. అది అనేకత్వంలో నుంచి మన బుద్ధిని ఏకత్వంవైపు మళ్ళించడమే. అనేకము అనేది నిజానికి ఏకత్వము నుంచి వచ్చినదే. కాని మనకు అనేకత్వం మీద దృష్టి ఉన్నంత వరకు మనకు కనిపించదు. ఈ అనేకత్వం మీదనుంచి ఏకత్వంవైపుకు మన దృష్టిని ఈ ఉపనిషత్తులు మళ్ళిస్తాయి. ●

## నా హృదయం

- యస్. అన్నపూర్ణ

చీలిన నా హృదయం కార్చిన రుధిరధారలు
ఇంకినాయి వెలుగు కిరణాలకే

అధికారంకై కుమ్ములాటలో
కాలిన నా మనసు ఘోష
వినిపించిందా ఎవరికైనా ?

ఎవరో విసిరిన ఎంగిలాకుకై
కొట్లాడుకునే బడుగు జీవులు
హృదయాల్లో రక్తపుటేరులు
ఇంకిపోయినాయి ఏనాడో

మండేధరల సూరీడు
భగభగమంటూ ఉంటే
నీ కన్నీళ్ళు ఇంకా ఎక్కడ
కనిపిస్తాయి ఈ దుర్బలులకి

కరిగిన కన్నీటి ఏటిలో
నా బాధల బరువులు కొట్టుకుపోయాయి
ఆశల ఊపిరులూది బ్రతికిద్దామనే
వెర్రి ఆశతో దీపం దగ్గర శలభంకాకు సుమా

నా ఆశల చిగుళ్ళు మోసువేయకనే
యలిగిపోతున్నాయి
కన్నీటిస్నానం చేయించి
బ్రతికిద్దామనుకోకు మిత్రమా

ఎండిన నా కనుకొలుకుల్లో
రేపటి ఆశలు లేవు
చిరునవ్వుల వర్షం కురిసి
ధరిత్రి చిగురు వేస్తుందా

ఏమో?
నీ ఆశయాల కిరణరేఖలు
పృధ్విని పునీతం చేస్తాయేమో ?

# క్షమాభిక్ష

- సకలాభక్తుల కృష్ణమూర్తి, బెంగుళూరు.

హైద్రాబాద్, అక్టోబర్ 10 : రెండు సంవత్సరాల క్రితం జంట నగరాల్లో కలకలం సృష్టించిన అపరంజి రేప్, హత్యకేసులో దుండగులకు సుప్రీంకోర్టు మరణదండన విధించడం అందరికీ తెలిసిన విషయమే. ఆ ముగ్గురికీ క్షమాభిక్ష పెట్టినట్లు నిన్న ఢిల్లీలో రాష్ట్రపతి భవన్ ప్రకటించింది.

ఆ వార్త నన్ను ఉలిక్కిపడేలా చేసింది. ఎందుకంటే ఆ చనిపోయిన అమ్మాయి నా ఆప్తమిత్రుడు అరవింద్ కూతురు. ఓ మంత్రికొడుకు, వాడిద్దరి స్నేహితులు కలిసి అపరంజిని కోఠీ జంక్షన్ నుండి పట్టపగలే ఎత్తుకెళ్ళి, మానభంగం చేశారు. గట్టిగా ప్రతిఘటించిన ఆ అమ్మాయిని చావుదెబ్బలు కొట్టి, ఊరవతల పారేశారు. చిలుకూరు బాలాజీ టెంపుల్‌కి చీకటితోనే వెళ్తున్న వారెవరో పోలీసులకు ఫోన్ చేసి కబురు చెప్పారు. సంవత్సరం పైన నడిచిన ఆ కేసులో ఆ ముగ్గురికీ సుప్రీంకోర్టులో కూడా మరణశిక్ష పడింది. అటువంటి కరుడుగట్టిన దుర్మార్గులకి క్షమాభిక్ష పెట్టడం ఎలా జరిగింది ?

“చూసావురా ఈ అన్యాయం! ఘోరమైన నేరాలు చేసినవాళ్ళకు శిక్షపడిందన్న ఊరట కూడా లేదురా” అంటూ టేబుల్‌మీదున్న ఓ ఫైల్ తెచ్చి నా చేతిలో పెట్టాడు అరవింద్. అది అపరంజి కేసు ఫైలని నేను గ్రహించగానే, నాకూ దుఃఖంతో కళ్ళంట నీళ్ళు చిప్పిల్లాయి. ఓ పది నిముషాలకు గాని మనసు కుదటపడలేదు.

తనకు రాత్రి పదకొండు గంటలప్పుడు తెలిసిందని చెప్పాడు. వాడి ముఖంలోనికి పరీక్షగా చూశాను. కళ్ళు ఉబ్బి, ఎర్రగా ఉన్నాయి. అంటే అప్పటినుండి బాధపడుతూనే కూర్చున్నాడన్నమాట. లోపల పావని కాఫీ తాగమని మిగతావాళ్ళను బుజ్జగించటం డ్రాయింగ్ రూమ్‌లోనికి వినపడు తోంది. అరవింద్ కళ్ళు మూసుకొని మౌనంగా, నిస్త్రాణంగా సోఫాకి ఆనుకొని చేరబడ్డాడు. ఫైల్‌లోని కాగితాలపైన నా చూపులు నిదానంగా పయనించాయి. అదొక కంప్యూటర్ ప్రింటవుట్. అందులో :

మాన్యులు, గౌరవనీయులు అయిన భారత రాష్ట్రపతిగారికి -

ఎంతో మర్యాదగా నమస్కరిస్తూ చేసుకున్న విన్నపం. నా పేరు కె. అరవిందకుమార్, వయసు 57 సంవత్సరాలు, ఆంధ్రప్రదేశ్‌లోని హైద్రాబాద్ నివాసిని. నా కూతురి పేరు అపరంజి. ఇది చదవగానే ఈ కేసు పూర్వాపరాలు, నేను, మీకు జ్ఞాపకం వచ్చి ఉంటాం. సంవత్సరం క్రితం నా కుమార్తె అపరంజి కేసు విషయంగా మిమ్మల్ని కలవటానికి, మీరు దయతో రెండు నిముషాల సమయమిచ్చారు. నేరస్తులను క్షమించకండి, నాకు కాస్త ఊరట కలిగించండని మీకు ఒక అర్జీ యిచ్చి, మీ కాళ్ళమీద పడి, నాకన్నీటితో వాటిని అభిషేకించాను. తప్పక చూస్తానని నాకు మాట ఇచ్చి, ధైర్యం వహించమని, నా భుజం కూడా తట్టారు.

సరిగ్గా సంవత్సరం తరువాత ఈరోజు నాకు విశ్వసనీయంగా తెలిసింది. అన్ని దినపత్రికలలోను వచ్చింది మీరు ఆ దుర్మార్గులకు క్షమాభిక్ష పెట్టారని. ఈ వార్త నాకు విస్మయం కలిగించి, నా దుఃఖాన్ని తిరగతోడింది. అందువల్లనే మీకు ఈ విన్నపం సమర్పించుకుంటున్నాను.

## నా తెలుగు పచ్చగా ఉండాలి

- డా॥ తిరునగరి, హైదరాబాద్. ఫోన్ : 9392465475

నాకు కావలసింది
నా తెలుగుతనం పచ్చగా ఉండడం
కుళ్ళు రాజకీయాల్ని నేనెన్నడూ
కోరుకోలేదు
ఆత్మీయతకు పర్యాయపదం తెలుగు
అనురాగానికి మరోపేరు తెలుగు
తెలుగు హృదయం
కలకాలం విశాలంగా ఉండాలని
కోరుకుంటాను
తెలుగు కాపురం
నిత్యకల్యాణం పచ్చతోరణంగా
వెలుగొందాలని
కలలు కంటాను
భౌగోళికంగా
తెలుగునాడును
ఎన్ని ముక్కలు చేసినా
సాంస్కృతికంగా
తెలుగుజాతి
ఒక్కటే అన్నది
కాలమంత సత్యం
కానీయండి
తెలుగునేల
రెండు ముక్కలు
అంతమాత్రాన
తెలుగుతనం ఓడిపోదు
అలా అంటే
భూమి ఫక్కున నవ్వుతుంది
కాలం ఎన్ని మార్పులు తెచ్చినా
కవిత్రయానికి పోతన్న
కైమోడ్పుచేస్తూనే ఉంటాడు
వేమన్న అందరివాడంటూ
తెలుగువాడు
విశ్వదాభిరామ పద్యం వల్లిస్తూనే ఉంటాడు
మల్లినాథ సూరిని గిర్వాణ పండితులు
మల్లికా సుమాలతో అర్చిస్తూనే ఉంటారు
ఆదిభట్ల నారాయణదాసుకు
అఖిలాంధ్ర ప్రజలు
అంజలిస్తూనే ఉంటారు
ఇది నా తెలుగు సాహితి
ఇది నా తెలుగు సంస్కృతి
ఈ తెలుగునాడు
భౌగోళికంగా
ఎన్ని ముక్కలైనా కానీ
నా తెలుగుమాట
ఒక్కటి
నా తెలుగుబాట
ఒక్కటి
కుళ్ళు రాజకీయాన్ని నేనెప్పుడూ
కోరుకోలేదు
నాకు కావలసింది
నా తెలుగుతనం
పచ్చగా ఉండడం.

నా కుమార్తె 'అపరంజి' జూకా మందారంలా అందమైనది, సుకుమారి గాని ఎంతో ధైర్యం, తెలివితేటలు గలది. కాలేజీలో అన్ని సబ్జెక్ట్స్‌లోనూ టాపర్. దేశానికి, పేదలకు సేవలు చెయ్యటమే తన లక్ష్యమని చెప్పేది. అమ్మాయికి వచ్చిన బహుమతులు, కప్పులు, గొప్ప గొప్పవాళ్ల ప్రశంసలు చదువుతున్న కాలేజీలో కొన్ని మా యింట్లో కొన్ని ఉన్నాయి. ఆమె మా ఇంటిల్లిపాదికి ప్రాణం లాంటిది. కాలేజీలో కాని, రోడ్డుపైన గాని ఎవ్వరితోనూ, ఏనాడూ గొడవ పడలేదు. ఏ రోజు కూడా స్కర్ట్స్ లాంటి పొట్టి డ్రస్సులు వేసుకోలేదు. అసలు దుర్మార్గులైన ఆ మంత్రి కొడుకుని, అతని స్నేహితుల్ని ఎప్పుడూ చూడను కూడా లేదట. ఆ దురదృష్టకరమైన రోజున కాలేజీ నుండి మిగతా వారితో కలిసి బయటకు రాగానే, మాటేసిన ఆ దుష్టత్రయం బలవంతంగా ఎత్తుకెళ్లారు. మిగతా అమ్మాయిలు, రోడ్డుమీద ఉన్న జనం, కాలేజీ ఎదురుగుండా డ్యూటీ చేస్తున్న రక్షకభటుడు ఈ అమానుషాన్ని అడ్డుకోవాలని ప్రయత్నించగా, గాలిలో కాల్పులు జరిపి అందర్నీ భయపెట్టి ఎక్కడికో రహస్య స్థావరానికి పారిపోయారు. ఆ తరువాత జరిగిన విచారణలో ఆ ముగ్గుర్నీ గుర్తుపట్టిన పబ్లిక్, ఆ పోలీస్, తోటి విద్యార్థులు కోర్టులో నిర్భయంగా సాక్ష్యం చెప్పారు. ఏ ఒక్కరూ కూడా వ్యతిరేకంగా చెప్పలేదు. సుమారు వందమంది అబద్ధం చెప్పరు కదా!

మా అమ్మాయి అపరంజిని రక్షించమని ఆ మంత్రిగారి కాళ్ళమీద పడి వేడుకున్నాం. ఏడుపుతో ప్రార్థించాం. కొడుకు తనమాట వినడని, సెల్‌ఫోన్ ఇంట్లోనే వదలి వెళ్లాడని బుకాయించాడు. రక్షించటానికి ఎటువంటి ప్రయత్నం చెయ్యలేదు. పదవిలో ఉన్న మంత్రి అందువల్ల పోలీసులు ఏం చెయ్యలేకపోయారు. ముఖ్యమంత్రి ఆ సమయంలో విదేశాల్లో ఉండటం ఈ మంత్రికి బాగా అనుకూ లించింది. అయినా వాళ్లిద్దరూ జిగ్రీ దోస్తులే.

మర్నాడు తనను రక్షించటానికి వెళ్ళిన పోలీస్ టీమ్‌ని బతిమాలి దగ్గర్లో ఉన్న ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ గారి దగ్గరికి తీసుకువెళ్ళమంది. రికార్డింగ్ చివరి దశలో ఉండగా మేము అక్కడకు చేరుకున్నాం. మా కడుపున పుట్టినందుకు, మాకేమీ సేవ చెయ్యకుండా వెళ్ళిపోతున్నందుకు క్షమించమని చేతులు జోడించి, ప్రాణాలు వదిలిన సంస్కారవంతురాలు మా అపరంజి.

ఎలాగూ చంపేస్తామని ఆ రాక్షసులు వాళ్లపేర్లు, వివరాలు స్వయంగా చెప్పారట, ఎటువంటి భయాలు లేకుండా, వాళ్లు బలాత్కారం చేస్తున్నప్పుడు, వాళ్ళ చేతులు, ముఖాలు కొరికి గాయపరిచిన వివరాలు స్టేట్‌మెంట్లో ఉండటం వల్ల, పోలీసులకి సరియైన సాక్ష్యాలు దొరికాయి. నిజాయితీగల ఆ పోలీసు బృందం రెండురోజుల తర్వాత వాళ్ళని అరెస్ట్ చేయడంతో ఈ వివరాలన్నీ మీడియాలో దేశమంతా చూసింది. గమ్మత్తుగా వాళ్ళందర్నీ వివిధకారణాలు చూపించి సస్పెండ్ చేశారు. నాకు సంబంధమే లేని విషయాల మీద ఏవేవో సృష్టించి నన్ను కూడా సస్పెండ్ చేయించారు. ట్రిబ్యునల్‌లో నా కనుకూలంగా తీర్పు వచ్చింది. లేకపోతే ఈపాటికి నేను రోడ్లమీద అడుక్కోవలసి వచ్చేది. నా కిప్పటికీ బెదిరింపులు వస్తున్నాయి. నా మిగతా ఇద్దరు పిల్లలు ఈసరికి చదువులు పూర్తిచేసి ఉద్యోగాల్లో ఉండవలసినవాళ్ళు, వాళ్ళను కాలేజీలు మాన్పించి ఇంట్లోనే కూర్చోబెట్టాను. రెండు సంవత్సరాలుగా వాళ్ళు వీధిలోనికి రాలేదంటే మీరు నమ్ముతారా?

నేనొక్కడినే ఎంతో జాగ్రత్తగా ఆఫీసుకు వెళ్ళి వస్తున్నాను. ఇంటిపక్కన ఉన్న బడ్డీకొట్టు, వీధిలోనికి, అమ్మకానికి వచ్చే కూరగాయలే మాకు శరణ్యం. నేను లోయర్ మిడిల్ క్లాసువాణ్ణి. అంగబలం, ఆర్థికబలం, రాజకీయబలం లేనివాడిని. మా వీధిలోని వాళ్ళు, స్నేహితులు, ఒకరిద్దరు బంధువులే మాకు తోడు, నీడ. అన్యాయంగా మా పిల్ల ప్రాణాలు పోయి, మేము బాధలు పడుతూ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని బ్రతుకుతున్నాం. నీచులు వాళ్ళు, గాని నీచంగా బ్రతుకుతున్నది మేము.

ఇది మొదటి అత్యాచారం కాదు, అంతకు మునుపు కూడా వాళ్ళిటువంటి అఘాయిత్యాలే చేశారు. అప్పటి పోలీసులు వాళ్ళకు సహకరించటంతో ఆ

## విజయలక్ష్యం

- పోరండ్ల సత్యనారాయణ, హుస్నాబాద్. ఫోన్ : 9912385513

గుండె పొంగితే ఆనందం
వెల్లువ అవుతుంది, పరుగును తీస్తుంది.
గుండె రగిలితే ఆవేదన
సునామి అవుతుంది, తుడిచిపెడుతుంది.

కాలంతో పోటీపడి
పరుగెత్తాలనే తపన
గాలమైనీ గుండెను గాయం చేస్తుంది
మధ్య తరగతి మనిషికి
అంతులేని ఆశలు, గొంతెమ్మ కోర్కెలు.

ఆత్మీయత చచ్చి, ఆశయాలు నీరుగారి,
ఆవేదన వేదనగా మిగిలి,
నిరాశ నిన్ను ఆవహిస్తే
యువతరం - నవతరం ఉత్సాహాన్ని
ఆసక్తిని కోల్పోయి, అశక్తులుగా మిగలొద్దు,
ఆశయసాధనకై ఉత్సాహంతో
లక్ష్యం దిశగా సాగిపోవాలి
విజయదిశగా ఎదిగిపోవాలి.

## మనసు నానీలు

- జంజం కోదండరామయ్య. ఫోన్ : 8985938861

మనిషిని
నడిపించేది మనసు
దాని నెన్నడూ
చేయకు అలుసు !

మనసు కరిగితే
కవిత్వం
మనసు విరిగితే
శత్రుత్వం !

కంటికి కనిపించని
మనసు
అది పెట్టే బాధలు
ఎవరికి తెలుసు?

మనసు తరిగితే
దానవత్వం
మనసు పెరిగితే
మానవత్వం !

మనసు
పిచ్చికుక్క పరుగులు
అనుభవాలే
గురువులు

కేసులు వెలుగు చూడలేదు. మా కేసులో పోలీసు బృందానికి పట్టిన గతే వాళ్ళకూ పడుతుందని, ఆయా పోలీసులు నోళ్ళు కుట్టేసుకున్నారు. హంతకుల ఆచూకీలు దొరకలేదని ఫైళ్ళు మూసేశారు.

ఈ సందర్భంగా మరో విషయం మీకు గుర్తుకు తెస్తున్నందుకు నన్ను మన్నించండి. సంవత్సరం క్రితం మీకు అర్జీ ఇవ్వటానికి వచ్చినప్పుడు, మీ విజిటర్స్ రూములో శ్రీరాముడు బాణం సంధించినట్టు, శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం చేస్తున్నట్టున్న రెండు అందమైన నిలువెత్తు పెయింటింగ్‌లను చూశాను. ఈ ఉత్తరం మీకు వ్రాస్తున్నాను కాబట్టి అవి నాకు గుర్తుకు వచ్చాయి. ఒక సీతను అపహరించినందుకు శ్రీరాముడు రాక్షస వంశాన్నే నాశనం చేశాడు (విభీషణుడిని, స్త్రీలను విడిచిపెట్టి). ద్రౌపదిని జుత్తు పట్టుకొని సభలోనికి ఈడ్చుకెళ్ళినందుకు కౌరవవంశం నాశనమయ్యింది. బంధుమిత్రులను చంపటానికి అర్జునుడు విముఖుడైనపుడు శ్రీకృష్ణుడు గీతను బోధించి కర్తవ్యముఖంగా నడిపించలేదా? రాముడు, కృష్ణుడు చెప్పిన, ఆచరించి చూపిన ధర్మసూత్రాలను, దేశానికే ప్రథమ పౌరులైన మీరు పాటించకపోతే ఆ చిత్రాలను మీరు అవమానించినట్టవుతుంది!

తప్పుడు త్రోవలో వెళ్ళి నేరాలు, ఘోరాలు చేసినవాళ్ళని శిక్షించటం, ఉరితియ్యటం మన చరిత్రలోను, పురాణాల్లోను ఉన్న లక్షలకొద్దీ ఉదాహరణలు మీకు ఎంతమాత్రం కొత్తకాదు గదా! అటువంటప్పుడు ఇటువంటి నిర్ణయాన్ని ప్రకటించడం నాకుటుంబ సభ్యులను, బంధుమిత్రులను విషాదంలో ముంచింది.

ఈ శిక్షాస్మృతి ఒక్కమనదేశంలోనే కాదు, ప్రపంచంలోని సుమారు 200 దేశాల్లోనూ ఉంది. అన్ని న్యాయస్థానాల్లోను, నిందితులు రాజ్యాంగాన్ని అవహేళన చేశారు. కోర్టులు ఎటువంటి శిక్షలు విధించినా, తమకేం ప్రమాదం లేదని నిర్భయంగా జతపరుస్తున్నాను. వాటిని పరిశీలించమని గౌరవనీయులైన రాష్ట్రపతి గారిని వేడుకుంటున్నాను.

క్షమాభిక్ష కమిటీ సిఫార్సు ప్రకారం అలా చెయ్యవలసి వచ్చిందని మీరనుకోవచ్చు. గాని ఆ కమిటిలో ఉన్న ముగ్గురు లేక నలుగురు మంత్రులు మన దేశ జనాభా 120 కోట్ల ప్రజల మనోభావాలకు విరుద్ధంగా, మీ కెందుకు అర్థించారు ?

రాజకీయ లబ్ధి, డబ్బు, పలుకుబడి ముఖ్యంగాని ఎంతవరకు సమంజసం, న్యాయం అన్నవి వాళ్ళకు అసలు పట్టదు. వ్యక్తిత్వం లేని స్వార్థపరులు ఆ కమిటీ సభ్యులు. మీలాంటి సచ్చీలురు వాళ్ళ యత్నాలకు అడ్డుపడాలి. ఇంతకు మునుపు కూడా మన దేశ రాష్ట్రపతులు మంత్రిమండలి సూచనలే కాదు, పార్లమెంటులో ఆమోదం పొందిన ఎన్నో బిల్లులను సైతం తిరస్కరించారు. అది వాళ్ళ గొప్పతనం.

ఇప్పుడు మీరు క్షమాభిక్ష పెట్టినంత మాత్రాన ఆ రాక్షసులు బుద్ధిమంతులవుతారన్నది ఒట్టి అపోహ. వాళ్ళు మరిన్ని అఘాయిత్యాలు చేస్తారు. విచ్చలవిడిగా రెచ్చిపోతారు. వీళ్ళను చూసి మరికొంతమంది యువకులు అదేబాట పడతారు. వాళ్ళకు లేని శిక్షలు మాకెందుకు ? అని ప్రశ్నిస్తారు. ఇప్పటికే మన యువత త్రాగుడికి, మత్తుమందులకు బానిసలవుతున్నారని మీకు తెలియంది కాదు. ఈ రెండింటికీ అలవాటుపడిన వాళ్ళు మానభంగాలు, హత్యలు చెయ్యటానికి వెనుకాడరు. కాబట్టి ఈ ముగ్గురికి మీరు పెట్టిన క్షమాభిక్షను రద్దు చేసుకోమని నా వినయపూర్వక ప్రార్థన.

ఇలా చేస్తే నాకు కాస్త ఊరట కలగవచ్చు కూడా. పైగా దేశంలోని 60 కోట్ల మహిళలను, వారి మనోభావాలను గౌరవించిన వారౌతారు.

నా రెండో మనవి తమ ఉద్యోగ ధర్మం నిజాయితీగా నిర్వర్తించినందుకు ఆ పోలీస్ బృందం అన్యాయంగా సస్పెన్షన్ పాలయ్యింది. ఈ విషయంలో కూడా మీరు కలుగజేసుకొని వాళ్ళకు న్యాయం జరిగేలా చూడమని ప్రార్థిస్తున్నాను. లేకపోతే పోలీసుల కర్తవ్య నిర్వహణ సరిగ్గా చెయ్యక మొత్తం వ్యవస్థ భ్రష్టుపట్టి చెడిపోతుంది.

మీకు నా ధన్యవాదాలు!

జైహింద్.

ఇట్లు,

నిజాయితీగా మీ పౌరుడు

అరవిందకుమార్

P.S : ఇప్పటికీ విషయం మీ చేయి దాటిపోలేదని భావిస్తున్నాను.

సుదీర్ఘమైన ఉత్తరాన్ని చదివాక, ఓ చక్కని కథని చదివినట్టు, ఓ సినిమా చూసినంత అనుభూతినిచ్చింది. అదే అరవింద్‌లోని ప్రత్యేకత. ఏ విషయాన్ని విడిచిపెట్టకుండా, అన్ని పాయింట్లను సమన్వయపరిచి, సౌమ్యంగా చెప్పినట్టనిపించినా, చీడపట్టిన మొక్కల్ని పీకి పారెయ్యాలన్నట్లు, ఈ చీడపట్టిన యువకుల్ని సైతం సమాజం నుండి తొలగించాలని సూచించాడు.

ఉత్తరాన్ని చక్కగా డ్రాఫ్ట్ చేసినందుకు అరవింద్‌ని అభినందించి, తప్పక పంపించమని ప్రోత్సాహించాను. అప్పటికే ఆలస్యమవటంతో పావని బలవంతంగా ఇంట్లో ఉన్నవాటితోనే వంట చేసింది. వాళ్ళ మనసులు కాస్త కుదుటపడాలని, ఆ మాటలు, ఈ కబుర్లు చెప్తూ సాయంకాలం వరకు మేం అక్కడే గడిపాం. "ప్రయత్నిస్తూ మరణిస్తే గెలిచినట్టే! ప్రయత్నం విరమిస్తే మరణించినట్టే!" అన్నాడు అరవింద్. ●

## ● తెలుగు వెలుగు ●

- తాడినాడ భాస్కరరావు, తణుకు.

తేట తెలుగు వెలుగు తెలుగేనురా
మనమంతా తెలుగువారమేరా
తెలుగింటి వాడ, తేనెపలుకులోడ
తెలుగు జాతి మనదని తరతమ భేదం లేదని
తెలుగునేల ఏలరా! ఈ నేల తల్లి నీదేరా ॥ తేట ॥

అయినవారి దీవెన అలుపెరుగని లాలన
ఆవుపాలు కమ్మన, అమ్మమనసు చల్లన
అఆలు నేర్పనిదే, అమ్మపాలు త్రాగనిదే
ఇంతవాడవయ్యావా, ఎంత లోకంలో
ఊరేదైనా పేరేదైనా భాషేదైనా, భావం ఒకటేరా
మాతృభాష తెలుగు మమతలలోగిలి కది వెలుగని మరువకురా! ॥ తేట ॥

అక్షరాలవనంలో అక్షరాలతో ఆడుకో
అనుబంధం పెంచుకో గమనం ఎంచుకో
తెలుగుభాష గొప్పదనం ఎడదెదకు అందించు
తెలుగుజాతి ఉన్నంతవరకు గౌరవించు
తెలుగుభాష ఒక్కటేరా ! తెలుగువారమొక్కటేరా
అని గమనించు, జీవనయానంలో పయనించు ॥ తేట ॥

# సాహిత్యం - సమాజం - యువత

- బద్దెపూడి కుమారశర్మ, గన్నవరం. ఫోన్ : 9396546696

తల్లి గర్భంలోనుంచే శిశువు నేర్చుకొనే భాష మాతృభాష. నవ్వినా, ఏడ్చినా, సంభాషించినా మాతృభాషలోనే చేస్తారు. మనిషి పుట్టుకకు పూర్వమే మాతృభాషతో బంధం మొదలవుతుంది. అమ్మ మాట్లాడుతున్న చిన్న చిన్న మాటలను కడుపులోని బిడ్డ గ్రహించి అర్థం చేసుకునేందుకు ఆయత్తమౌతుందని శాస్త్రవేత్తలు నిరూపించారు. తల్లిదండ్రుల భా సంబంధమైన జన్యువులు పిల్లలలో ఉంటాయని నిరూపితమైంది. ఎంతోమంది ఉన్నా అమ్మ గొంతును పసివాడు గుర్తించడం, స్పందించడంలోని రహస్యం అదేనని తేల్చారు. అలా అమ్మ నుండి నేర్చిన భాష కనుక అది మనకు అమ్మ భాష అవుతుంది. "అమ్మ భాషతో మనిషి బంధం శిశువు ఉమ్మ నీటిలో ఉన్న నాటిది." మాతృభాషను సులభంగా నేర్చుకోవడానికి వీలుగా ఉంటుంది. మాతృభాషే ఎందుకంటే అది సులభంగా వస్తుంది. ఏ భావాన్నయినా మనం మాతృభాషలో వ్యక్తం చేసినంత సులభంగా, స్పష్టంగా వేరే భాషలో వ్యక్తం చేయడం కాని పని. భావ వ్యక్తీకరణకు మించిన సాధనం లేదు. భాష మానవ అస్థిత్వానికి మూలం భావ వ్యక్తీకరణకే కాదు జీవన నిర్వహణకు బుద్ధి వికాసానికి భాష ఉపకరిస్తుంది. భాషపై పట్టు సాధించిన వ్యక్తి సాహిత్యంపై అభిలాష, మక్కువ పెంచుకుంటాడు.

మనో విజ్ఞాన శాస్త్రవేత్త అరిస్టాటిల్ చెప్పినట్లుగా చిన్న పిల్లల మనస్సు నిష్క్రియాత్మకంగా అంటే ఏమీ వ్రాయని పలకలా ఉంటుంది. అటువంటి వారిలో మనము చిన్నప్పటినుండి ఏవిధమైన అలవాట్లు అలవరుస్తామో అవే వారికి అలవడతాయి.

పూర్వము ఉమ్మడి కుటుంబములుండేవి. వారందరూ కలిసికట్టుగా ఉంటూ సమైక్యతను పిల్లలకు అలవర్చేవారు. మరియు పెద్దలు, తల్లిదండ్రులు వారి పిల్లలకు సరైన నడవడిక మరియు మంచి చెడులు వారి భవిష్యత్‌కు కావలసిన అన్ని రకములైన విషయములను కథలు, పద్యాలు, నీతిపద్యాలు, శతక పద్యాలు, పొడుపుకథలు ఈ రూపంలో తాతయ్యలు, నానమ్మలు, అమ్మమ్మలు వారి మనుమలు మనుమరాళ్ళకు అందించేవారు. వారికి ఊహ తెలిసే సరికి అనేక విషయములను, పద్యములను, నీతి పద్యములను, సుభాషిత రత్నాలను అశువుగా వల్లె వేయగలిగేవారు.

కాని నేడు సమిష్టి, ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. పిల్లలతో గడుపు సమయం తల్లిదండ్రులకు లేకపోవడం మరియు పెద్దలు సరిగ్గా పట్టించుకోకపోవడం "ఎవరికి వారే యమునా తీరే" అన్నట్లుగా ఉండడం నేటి తరపు పిల్లలకు మంచి చెప్పే వారు కరువవుతున్నారు. పెద్దలు పిల్లలకు మాతృభాష పట్ల మక్కువ పెరిగే విధంగా పునాది వెయ్యాలి. "మొక్కై వంగనిది మ్రానై వంగునా" అన్నట్లు పిల్లలలో మాతృభాష పట్ల అభిలాషను, మక్కువను పెంచుకునే విధంగా మాతృభాషలోని మాధుర్యాన్ని పిల్లలకు చిన్నతనంలోనే రుచి చూపించాలి. తెలుగు సాహిత్యపు బీజాలు పిల్లలలో నాటుకునేలా చూడాలి.

కుటుంబ నేపథ్యంలో నేర్చుకున్న అనేక విషయములు, పాఠశాల ఉపాధ్యాయుల వద్ద భాష మరియు భాషణ, వ్రాత నైపుణ్యములను నేర్చుకుంటాడు. తెలుగుభాష పట్ల మక్కువ పెరిగే విధంగా, ఆకట్టుకునే విధంగా ఉపాధ్యాయులు పాఠ్యాంశములను బోధించినప్పుడు విద్యార్థులలో భాష పట్ల మరియు సాహిత్యం పట్ల మక్కువ కలుగుతుంది. కాని నేటి విద్యా వ్యవస్థలో విద్యా ప్రమాణాలు నానాటికి దిగ జారుతున్నాయి. దీనికి గల కారణాలు

* పాఠశాలల నిర్వహణలో పాశ్చాత్య ధోరణులు
* ఆంగ్లభాషా ప్రభావం మాతృభాషపై ఎక్కువగా ఉండటం.

## తేనె తెలుగు మధురిమలు

- కరెడ్ల సుశీల, మచిలీపట్నం ఫోన్ : 9440330500

తేనె లొలుకు భాష నా
తేట తెలుగు మాతృభాష
వసంత గమనంలా...
మధురఫల సమ్మేళనంలా...
ఉషోదయాన ప్రతిఫలించే మంచుముత్యంలా
పలికే ప్రతిపలుకు సంగీత స్వరమధురిమలా
వినసొంపుగా మదినిండుగా
అలలా... బంగారు జలతారులా
కవుల కల్పనకు ఆలంబనగా
వెలిగే భాష నా తెలుగుభాష.

## ఉదయ కిరణాలు

- వేముల తిరుపతిరెడ్డి, హుస్నాబాద్. ఫోన్ : 9000190800

పచ్చని ఆకులపై జాబిలి సంతకంలా
నిండుపున్నమి వెన్నెలలా
కాలానికి నిర్వచనంలా
ఉదయ కిరణాలు పరవళ్ళు తొక్కాలి

గుండెగూటిలో ఆనందపు దివ్వెల్లా
విరబూసిన ఆశపు పూవుల్లా
అశాంతి చీకట్లు తొలగించే
ఉదయ కిరణాలు వెలగాలి

పూచే పువ్వు పరమార్థం - ప్రయోజనం
జీవితం కోరే ప్రతిఫలం - యశస్సు
నీతి - సమతలు విరజిమ్మే
ఉదయ కిరణాలు రావాలి

బాధల్లోంచి అద్భుత కవిత్వం రావాలి
బాదరబందీల్లోంచి మానవత్వం పరిమళించాలి
నిరంతరం ఎదుగుదలే ధ్యేయంగా
ఉదయ కిరణాలు కావాలి

* మాతృభాష పట్ల హీనమైన భావాలను పిల్లలలో స్ఫురింపచేయడం (పర భాష వ్యామోహంతో)

* పాఠ్యప్రణాళిక కూర్పులో దోషాలు లేకుండా, భాష నైపుణ్యములను పెంచే పాఠ్యాంశాలను ఉత్సాహపరిచే వచన, శతక, పద్య, గద్య సాహిత్యాలను కూర్చినట్లయితే భాషపై మక్కువ పెంచుకుంటాడు. దానివలన పుస్తక పఠనపై ఆసక్తిని కలిగి సంభాషణా చాతుర్యం భావ ప్రకటనా సామర్థ్యం కలిగి అతడు సమాజంలో ఒక ఉన్నతశక్తిగా ఎదుగుతాడు.

* విద్యార్థులలో భాషపై అభిమానాన్ని ప్రేరేపించడానికి సాహిత్యం పట్ల అభినివేశం కలిగిన భాషా పండితుల కొరత కూడా ఉంది. మిగతా పాఠ్యాంశాలకు, భాషా బోధనకు చాలా భేదం ఉంది కనుక భాషా పండితుల నియామకాలలో ప్రలోభాలకు, ప్రభావాలకు లొంగక సమర్థవంతమైన ఉపాధ్యాయులను నియమించాలి. ఈ స్థితి మన వ్యవస్థలో లేదు. చక్కటి బోధనా వ్యవస్థలో విద్యార్థులు పఠనం, పాఠనం, రచన చేయగల్గితే మంచి సాహిత్యం వెల్లువలాగా ప్రవహిస్తుంది.

* పరభాషపై మక్కువ, అది చదివితే గాని బ్రతుకు తెరువు దొరుకుతుందనే భావం పెంపొందించరాదు. పరభాష పఠనం అవసరం అనే కంటే అన్ని సామాజిక వర్గాలలోను ఫ్యాషన్‌గా మారింది. దానిని నిర్మూలించాలి. సాహిత్యం సమాజాన్ని ముందుకు నడుపుతుంది. దేశభక్తిని పెంపొందిస్తుంది. మనలో ఉన్న శక్తులను వెలువరించగల అవకాశాన్ని ఇస్తుంది. మాతృభాషలో చదవడం వలన తక్కువతనం అనే దానిని వీడాలి. సాహితీ సంపద కొన్ని కోట్ల రూపాయల కన్నా విలువైనదని యువత అర్థం చేసుకోవాలి. మాతృభాషలో అభినివేశం ఉంటే అన్ని భాషలు మనకు వచ్చినట్లే. ఏదైనా పుస్తక పఠనం తద్వారా సమాజాన్ని అర్థం చేసుకొని సామరస్యంగా ప్రవర్తిస్తే ఆ దేశం సుభిక్షంగా ఉంటుంది. నేటి యువత పఠనాశక్తిని పెంచుకుని సాహిత్యంలో నిష్ణాతులై సమభావన కలిగిన సమాజాన్ని నిర్మించినప్పుడే సాహిత్య ప్రయోజనం జరుగుతుంది.

* పద్య గద్యములను బోధించు ఉపాధ్యాయులు పద్యములను రాగయుక్తంగా సరియైన పద విరుపుతో శ్రావ్యంగా పద్యములను చదవగలిగిన ఉపాధ్యాయులను మనం వేళ్ళమీద లెక్కించవచ్చు.

కావున నేటి విద్యార్థులలో తెలుగుభాష యొక్క మాధుర్యమును, కమ్మదనమును ఆస్వాదించే అభిరుచి మన పిల్లలలో క్రమంగా కనుమరుగవుతున్నది. తెలుగును ఒక విషయంగా మాత్రమే చదువుతున్నారే తప్ప, తెలుగు మన

## • దివ్య దివిసీమ శ్రీకాకుళం •

- పువ్వాడ తిక్కన సోమయాజి, విజయవాడ. ఫోన్ : 9885628572

1. శ్రీకాకుళాంధ్ర జనులా
రా! కృష్ణాధిపు లిరువురు రత్నద్వయమున్
మాకిడిరి ప్రతిష్ఠ నిలుప,
శ్రీకా"రాముక్తము"ను సుశీలుని బుద్ధున్ !

2. నవ్యాంధ్ర రాజధానికి
దివ్యత చేకూర్చగలుగు దేవాలయముల్
కావ్యాళి నిలిచియున్నవి
స్తవ్యములగు నాంధ్ర, విష్ణు సంసన్మహిమన్ !

3. ఏసుకృంతపు పంటలిట నిబ్బడి ముబ్బడిగాగ పండెనో
భాసురుడాంధ్ర విష్ణు పద పంకజముల్ సిరికాకుళమ్ము వేం
చేసిన కారణాన రససిద్ధ కవీశులు కృష్ణరాయలున్
కాసుల పూరుషోత్తముడు కబ్బపు టర్చ లొనర్చి రిచ్చటన్

4. ఏ సుకృతంపు పంటలిట నిబ్బడి ముబ్బడిగాగ నిండెనో
వాసిని గొన్న మండ సువంశ్యుల శూరుడు సూరి యుల్లసత్
హాస ముఖారవింద సుజనాప్తుడు బుద్ధప్రసాదభీష్టతన్
వేసరి కృష్ణరాయ విభువిగ్రహ మిట్లు ప్రతిష్ఠజేసెడిన్ !

5. ఏమి గొప్పతనమ్ము రాష్ట్రమున కంటే – తెన్గు మా బాసయే
ప్రామాణ్యంబని చెప్పు; మింకను భవత్ప్రాగల్భ్య మేమన్నచో
భూమిశుం డొక కృష్ణరాయలనుచున్ ముమ్మాటికిం జెప్పు; మిం
కేమైనన్ నిను బ్రుచ్చుజేసినయెడన్ శ్రీకాకుళం జూపుమీ!

6. అలనాటి శాసనాలాంధ్రభోజుని దాన
ధర్మాల నిరతి కద్దమ్ము పట్టు,
తిరువేంకటస్వామి తెరతీయకన్పట్టు
రత్నరాసుల సువర్ణార్థ పేటి
అరిరాజకురుల సింహస్వప్నమాతని
యుద్ధతంత్రవ్యూహయుక్తిశక్తి
దేశభాషల తెన్గుతీపి లెస్సని చాటె
అష్టదిగ్గజ కవీంద్రాప్త విభుడు

ఒక్క ఆముక్త మాల్యద నుర్వినింపి
సాహితీ సమరాంగణ సార్వభౌము
డనగ నొప్పు శ్రీకృష్ణదేవరాయల బ్రశంస
జేయని కవుల కవులనజెల్లుటెట్లు ?

7. ప్రకృతి యందాలకు స్వకృతి భావనల లే
పనమద్దు చిత్రలేఖన విరాట్టు
కావ్యసుందరి కలంకారముకి సమకూర్చు
భాషావిభూషా సువర్ణశిల్పి
తెలుగువెల్గులవేల్పు ధిషణాకషణ శీల
గీర్వాణ వాణికి గర్వరేఖ
అన్వయక్లిష్ట వైయాత్య ప్రయోగ వి
ద్వాప్రబంధక పరీక్షాధికారి

విజయనగర విభుం డరివీర విజయు
డీ శ్రీకాకుళిన్ నాడు నిద్రించుటేమి ?
ఆంధ్రవిష్ణువు ప్రత్యక్ష మగుటదేమి ?
దైవఘటనలు దివిసీమ భావుకతలు !

మాతృభాష. దీనిని మనం ఇష్టంగా చదవాలి. ఈ భాషలోని మాధుర్యాన్ని ఆస్వాదిద్దాం అని అనుకునే విద్యార్థులే కరువవౌతున్నారు. విద్యార్థులలో తెలుగుభాష గొప్పతనాన్ని మరియు వైశిష్ట్యాన్ని, మాధుర్యాన్ని రుచిచూపే విధంగా బోధించే ఉపాధ్యాయులు కరువయ్యారు. తెలుగుభాష యొక్క గొప్పదనాన్ని తెలుసుకోలేని నేటి విద్యార్థులు తెలుగు సాహిత్యామృతాన్ని గ్రోలడం ఒకింత కష్టమైనపనే అని చెప్పాలి. నేటి విద్యార్థి లోకంలో చదువు అనేది జీవితానికి మంచిమార్గాన్ని చూపేది గాను, మంచి ఉద్యోగాన్ని అందించేదిగాను ఉండాలను కుంటున్నారే కాని చదువు అనేది జ్ఞానమును, మరీ ముఖ్యంగా భాష పట్ల అవగాహన, సాహిత్యం పట్ల అభిరుచి కల్గించేదిగా ఉండాలని అనుకోవడం లేదు. నేడు తెలుగులో పట్టభద్రులైన వారు దేనికీ పనికి రానివారనే నానుడి ఉంది.

నేటి సమాజం చాలా వేగవంతమైనది. ఈ సమాజంలోని సభ్యులందరూ "ఎవరికి వారే యమునా తీరే అన్నట్లుగా" ఒత్తిడితో కూడిన వేగవంతమైన యాంత్రిక జీవనం గడుపుతున్నారు. నాటి కుటుంబాలలో సంతానం ఎక్కువగా ఉండటం, పెద్దలు చెప్పిన విధంగా నడుచుకోవడం వల్ల పిల్లలు తల్లిదండ్రులు చెప్పిన రీతిలో చదువుకునేవారు. పాతతరం వారిలో చాలావరకు తెలుగుభాష పట్ల మక్కువ కలిగినవారు ఎక్కువగానే ఉండేవారు. తెలుగుభాష పట్ల, సాహిత్యం పట్ల అభిలాష కలిగినవారు, అధ్యయనము అధ్యాపన జరుపువారు ఎక్కువగానే ఉండేవారు. నేటితరంలో గ్రాంధికమైన తెలుగు పుస్తకమును చదవగలిగిన వారు ఎంతమంది ఉంటారు? నేడు తల్లిదండ్రులు పిల్లలను తమ కిష్టమైన వాటికి ప్రాధాన్యతనిస్తూ వారికి నచ్చిన విధంగా విద్యనభ్యసించేటట్లు ప్రోత్సహించుచున్నారు. పిల్లలలో (కేజి-పిజి) ఆంగ్ల మాధ్యమం పట్ల ఉన్న మక్కువ తెలుగు మాధ్యమం మీద కన్పించుట లేదు. తెలుగు అక్షరములు సవ్యంగా వ్రాయలేని, పలకలేని దుస్థితిలో ఉన్నారు. అమ్మా అని కమ్మగా పిలిచే పిల్లలు ఎంతమంది నేడు ఉన్నారు ? అమ్మా నాన్నల యుగం పోయి మమ్మీ డాడీల యుగం వచ్చింది. ఓం నమః, శివాయః, సిద్ధం నమః అని అక్షరాభ్యాసం చేయించే తల్లిదండ్రులు ఎందరు ? తెలుగు మాట్లాడితే శిక్షించే పాఠశాల యాజమాన్యాలు ఎన్నో ఉన్నాయి. "ఆదిలోనే హంస పాదులాగా" ప్రాథమిక దశలోనే పిల్లలను మాతృభాషకు దూరం చేస్తే వారికి భాష పట్ల అభిలాష మక్కువ ఎలా పెరుగుతుంది ? భాషేరాని వారు సాహిత్యం పట్ల అభిలాష ఎలా చూపగలుగుతారు ?

స్వామి వివేకానంద చెప్పినట్లు "యువత" సమాజ నిర్మాణమునకు ముఖ్య భూమిక. ఏ దేశంలో యువత అత్యధిక శక్తివంతులుగా ఉంటారో ఆ దేశపు సామాజిక అభివృద్ధి ఎక్కువగా జరుగుతుంది. అందుకే వారు ఇనుప కండరాలు, ఉక్కు నరాలు కలిగిన 100 మంది యువకులను నాకందిస్తే ఈ సమాజమును అభివృద్ధి పథంలో నడిపిస్తానని చెప్పారు. దీనిని బట్టి యువత తలచుకుంటే సాధించలేనిది ఏదియూలేదు. వివేకానందుడు యువతలో సాహిత్యభాష కలిగి ఉండాలని అభిలషించేవారు. ప్రతి యువకుడు సాహిత్యమును నేర్చుకున్న అతనిలో భాషపై పట్టు, దేశభక్తి పోరాట పటిమ, సమైక్యతత్వం కలుగుతాయి. అటువంటి వారే నవసమాజ నిర్మాతలు.

మన పూర్వీకులు తెలుగు సాహిత్యమునకు వయస్సులను బట్టి చిన్నతనం నుండి లాలిపాటలు జోలపాటలు పిల్లలకు సులువుగా అర్థమయ్యే రీతిలో అందించారు. కాని నేటితరంలో ఇది దాదాపు కనుమరుగయ్యాయనే చెప్పాలి. కులవృత్తులు కనుమరుగవుతున్నవి. జానపదుల కళారూపాలు, కళాజాతాలు, జానపద సాహిత్యాలు కనుమరుగవుతున్నాయి. హరికథలు, బుర్రకథలు, ఒగ్గుకథలు, నాటకాలు, నాటక పరిషత్తులు, వీధి భాగవతులు, నాటికలు వేసేవారు, వినేవారు, చెప్పేవారు కరువయ్యారు. నేటి తరపు హరిదాసులు, జంగం దేవరల పాటలలో సాహిత్యం కనుమరుగవుతున్నదనే చెప్పాలి. గంగిరెద్దులు, బుడబుక్కలవారి, కోయదొరల పాటలలోని సాంప్రదాయతత్వం పోయి నూతనత్వాన్ని సంతరించుకుంటున్నాయి. సాంప్రదాయ బద్ధమైన శాస్త్రీయ సంగీతంలోని మధురిమలు మనలో ఎందరికి తెలుసు. రామదాసు,

## • అమ్మా! నన్ను చంపొద్దు •

- యడ్ల శ్రీనివాసరావు, విశాఖపట్నం. ఫోన్ : 9493707592

ఆడపిల్ల కడుపు బడంగ
తలచిరి ఎందుకు పెనుభారంగ
నీ అమ్మమ్మ ఆడది
నీ తల్లి ఆడది
నీ చెల్లి ఆడది
తోటి ఆలి ఆడది
ఆడపిల్లని చెవిన బడంగానే
బిడ్డ నేలబడకుండా
బుడిబుడి అడుగులేయకుండా
కన్నవారే కడుపున బిడ్డను
కడుపు కడుగుకునే తీరును
క్షణమైనా పాపమని యోచించరా ?
నవమాసాలు మోసి
నీ రక్తము యిచ్చేసి
జీవము నాలో పోసి
నీది ఈ హక్కంటూ
చివరికి నీవిచ్చిన ప్రాణాలు
నీవే తీసుకుని పోతివి
అమ్మా
నేల బడంగ
నిన్ను జూచి
నమస్కరిద్దామనుకున్నా
ఎందుకంటె నా ప్రాణదేవతవు
వయసొచ్చి పెద్దయ్యి
నిన్ను కష్టబెట్టక
కన్నీరు పెట్టనియ్యక
నీకు జేతును సాయం తల్లీ
అని అనుకొని పరవశించు
సమయాన
నేలబడని ముద్దుటుంగర మల్లి
కడుపున కాయనుకొని
తుంచావా తల్లి ! ?
డాక్టరు గారూ
తుదకు
మీరైనా చెప్పరే
నా కొరకు వున్న చట్టాలు
నా కొరకు వున్న స్మశానవాటికలు
అమ్మా చేర్చకు మరుభూమి చెంతకు
అమ్మా ..!
నన్ను చంపొద్దు.



అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్యల సంగీతాన్ని, అందలి సాహిత్యాన్ని ఆస్వాదించే వారెందరున్నారు ఈ రోజుల్లో ? నేటి ఈ తరము యువతలో పాశ్చాత్య భాషల, ఆచార వ్యవహారాలు, కట్టుబొట్టులపైన, సాహిత్యాలపైన ఉన్న వ్యామోహం మన తెలుగు సాహిత్య సాంప్రదాయములపై లేదనే చెప్పాలి. నేటి ఈ కంప్యూటర్ యుగములో రేడియో వినే వారెందరో? సాంప్రదాయ బద్ధమైన లలిత, శాస్త్రీయ జానపద గీతాలను, కృతులను ఆస్వాదించే వారెందరున్నారు ? కూచిపూడి, భరతనాట్యం ప్రదర్శనలను వీక్షించే వారెందరున్నారు ? ఒక సినిమాను చూడడంలో, టీవీ సీరియళ్ళు, క్రికెట్ మ్యాచ్‌లు చూడటంలో ఉన్న ఆసక్తి పుస్తక పఠనం, సాహిత్యాభిలాషను పెంచుకునే కార్యక్రమాలపై, రచనలపై లేదనే చెప్పాలి. గ్రంథాలయాలు తెలుగు సాహిత్యానికి నిధులు. గ్రంథాలయాలకు వెళ్ళి ఆ గ్రంథములలోని విషయములను తెలుసుకోవాలనే ఆసక్తి గల యువకులెందరున్నారు.

ప్రభుత్వాలు ఎన్నో వస్తున్నాయి పోతున్నాయి. కాని ప్రభుత్వాలు మాతృభాష పట్ల (తెలుగు) చేసిన అభివృద్ధి తక్కువనే చెప్పాలి. వ్యవహారికంగానే మనం తెలుగు భాషను ఉపయోగిస్తున్నామే కాని ప్రభుత్వ శాఖల కార్యకలాపాలు అంతయు ఆంగ్ల మాధ్యమంలోనే జరిగాయి. జరుగుతున్నాయి. ప్రక్క రాష్ట్రాల ప్రభుత్వాలు వారి మాతృభాషలోనే కార్యకలాపాలు కొనసాగిస్తున్నాయి. ఇతర రాష్ట్రాలలో ప్రభుత్వాలు వారి మాతృభాష మనుగడను నిల్పుకోవడానికి యువతకు వివిధ రకములుగా ప్రోత్సహిస్తున్నాయి.

పాశ్చాత్య భాషల వ్యామోహం, మాతృభాషల భవితవ్యం ప్రశ్నార్థకంగా మారుతున్న ఈ రోజులలో యువతను మాతృభాషపై మక్కువ పెరిగే విధంగా రాష్ట్ర ప్రభుత్వాలు వివిధ రకాల ప్రోత్సాహకములతో ప్రోత్సాహిస్తున్నాయి. కాని నేటి మన రాష్ట్ర ప్రభుత్వము మాతృభాషపై అంటే తెలుగుపై మక్కువ చూపే విధంగా యువతకు అందించే ప్రోత్సాహకాలు మృగ్యం అనే చెప్పవచ్చు. సాంకేతిక శిక్షణా కోర్సులకు ఇచ్చిన ప్రాధాన్యత, భాషలపై ఉన్న కోర్సులకు లేదనే చెప్పాలి.

ప్రభుత్వాలు అధికారికంగా యువతలో మాతృభాషపై మక్కువ పెరిగే విధంగా వివిధ రకములైన కోర్సులను మరయు కార్యక్రమములను రూపొందించవలసిన, ప్రోత్సాహించవలసిన అవసరం ఎంతైనా ఉంది. సాహిత్యానికి ప్రతిరూపాలై మరుగున పడుతున్న కళలు, సంస్కృతికి ప్రతీకలైన నాటకాలు, నాటికలు, జానపద కళారూపాలు, హరికథలు, బుర్రకథలు, కూచిపూడి, భరతనాట్యం జనపదాలలో ఉండే వివిధ రకములైన సాంస్కృతిక రూపాలను వాటిని పోషించే కళాకారులను చేయూత కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వాలపై ఉన్నది.

నేటి సమాజంలో విలువలు నశిస్తున్నాయి. మానవీయ విలువలకు ప్రాధాన్యత కల్పిస్తూ మానవీయ సంబంధాలు వాటి ప్రాముఖ్యతను తెలియ చేస్తూ, విద్యార్థులలో ప్రేరణ కలిగే విధంగా ఉండే పాఠ్య ప్రణాళికను రూపొందించాలి. పిల్లలకు, పెద్దల యొక్క ప్రాముఖ్యతను వివరించడం తల్లిదండ్రుల కర్తవ్యం. పిల్లలకు తాతయ్యలను అమ్మమ్మ నానమ్మ, అవ్వలను దూరంగా ఉంచకుండా వారితో కలిసి చిన్నారుల బాల్యమును గడిపేలా చూడటం చేయాలి. ఈ విధంగా పిల్లలు చిన్నప్పటి నుంచి మానవీయ బంధాలు, అనుబంధాలను గూర్చి తెలుసుకొన్నప్పుడు పూర్వపు వైభవం తిరిగి వస్తుంది. అప్పుడు సమాజంలో మానవీయ విలువలు, సంస్కృతి, సాంప్రదాయాలు, సాహిత్యం, కళలు ఇలా అన్ని అంశాలు అభివృద్ధి పథంలో నడుస్తాయి అనడంలో ఎటువంటి సందేహం లేదు. ●

## రాజభాష (గీతం)

- వై. మనోరమ, నరసరావుపేట. ఫోన్ : 9912363534

అమృతమై అలరు భాష శాశ్వతమై వెలుగు భాష

**పల్లవి**

దేశభాషలందు లెస్స శాశ్వతమై నిలుచు భాష
అదే అదే తెలుగు భాష - ప్రతి హృదినీ మీటు భాష

**చరణాలు**

పల్లెనోట పలుకు పాట - పద్యానికి ప్రాణదాత
పదం పలుకు ప్రతి పెదవి - తేనెలొలుకు మధురకవి
అదే అదే తెలుగుభాష
(ప్రతి) మదిపలికే వేదఘోష
కమ్మని కవితల కోట - అన్నమయ్యముక్తికాంత
అవధానం నడచుబాట - వేమన వజ్రపు తేట
అదే అదే తెలుగుభాష
ప్రతి చెవిలో పిలుచు ధ్యాస
త్యాగరాజ దివ్యపథము - శ్రీనాథుని వైభవము
కూచిపూడి పదనర్తన - అమరావతి శిల్ప ఘనత
అదే అదే తెలుగు భాష
ప్రతి కంటిలో వెలుగు ఆశ
విశ్వానికి వెలుగుబాట - విద్యార్థికి జ్ఞానదాత
తరతరాల తల్లిభాష - నరనరాన కదులుభాష
అదే అదే తెలుగుభాష
ప్రతి ఇంటిని నిలుపుభాష
దేశభాషలందు లెస్స శాశ్వతమై వెలుగుభాష
అదే అదే తెలుగుభాష - ప్రతి గళమున స్వరమీ భాష
అదే అదే తెలుగుభాష - అమృతమయమీ భాష
అదే అదే తెలుగుభాష - మన రాష్ట్రానికి రాజభాష



# తుఫాను

- అనూరాధ శివపురపు, హైదరాబాద్.

కోస్తా తీరంలో వరద జాలరులను నిర్దాక్షిణ్యంగా ముంచుతూ నాట్యం చేస్తోంది. పగలంతా శ్రమించి జాలరులను ప్రాణాలను అరచేతి గుప్పెట్లో పెట్టుకొని బ్రతుకు ఈడ్చుమంటోంది, భీతి చెందిన మనిషి కన్నీటి సాగరం గుండెలో పదిలంగా దాచుకుంటూ దొరకని తనయుడు కోసం ఓ అమ్మ పడే ఆవేదన వినకముందే అనుబంధాలను చూడకుండా చెట్టుకొక్కరిని, పుట్టకొక్కరిని విసిరేసి వరద చిరు దరహాసం చేస్తూ, ఆ అభాగ్యుల స్వప్నం క్షణంలో కూల్చివేస్తూ, పల్లెలను, పంటలను, మింగేస్తూ విజయపతాకము అంబరానికి ఎగరవేస్తుంది.

కోస్తాతీరానికి ఇది పిలవని అతిథి. అంతం కాదు ఆరంభం మని పేదరైతు భుజం తట్టీ మరీ చెపుతోంది. ప్రళయం సృష్టించి రేపటి ఉదయానికి ఆహ్వానం చావు కబుర్లుతో అందిస్తోంది. సానుభూతితో సూరీడు పడమర సముద్రస్నానం చేసి అస్తమయమవుతున్నాడు!! ●

## ● చిన్ని కవితలు ●

- డా॥ ఎన్. వసంత్

**రారాజులు**

ప్రజల రక్తం ఏరులైతే
రాజులైనారు
చమట చుక్కలు నదులై పారితే
రారాజులైనారు.

**బుద్ధిజీవి**

శ్రమను నమ్ముకునే వాడు
శ్రమ జీవి
శ్రమను అమ్ముకునే వాడు
బుద్ధిజీవి

**యాసిడ్డుగాయం**

యాసిడ్డు గాయంపై
ఎగసిన 'ఆవిరి'
యముడిలా మారి
ఎన్‌కౌంటరై మాయమైంది.

**ప్రజాస్వామ్యం**

ఎన్నికల్లో కురిసిన
నోట్ల వర్షానికి కొట్టుకుపోయింది
ప్రజాస్వామ్యం
పౌరుల సాక్షిగా...

**చిన్న చీమ**

కోటి చీమల్ని
నలిపిన పాదం
తన చెవిలో చేరిన
చీమ వెంట్రుక్కి సమానం

**ప్రేమంటే ?**

ప్రేమంటే ఏం రా ?
మీరే చెప్పాలయ్య -
నువ్వు ఎవర్నన్నా ప్రేమించావేం రా?
మీకే తెల్వాలయ్యా...!

**మప్పిదాలు... మంగిడీలు**

నన్ను తిరస్కరించిన ఆమెకు
నా మప్పిదాలు... మంగిడీలు
ఆమెపై నాకున్న ప్రేమకూ
మాత్రం కాదు.

**0-0=0**

నేను... నేను... నేను...
శూన్యం శూన్యంలో
కలసి
శూన్యమైంది.

**నోట్లు... కోట్లు**

చెమటోడ్చి సంపాదిస్తే
'నోట్లు'
చెమట పూడ్చి సంపాదిస్తే
'కోట్లు'

**గొప్పప్రేమ**

సెక్సాలజి పుస్తకంలో
సెక్స్ అలర్జి పుటలో
లిఖిస్తా నా ప్రేమ గొప్పది

## ● చైతన్యపు యువతరం ●

- డా. పోలేపెద్ది వెంకట హనుమచ్ఛాస్త్రి

ప॥ చైతన్యపు యువతరం కదలి కదలి వస్తున్నది
మదిమదిలో నవతేజం ఉరకలు వేస్తున్నది. ॥చైతన్యపు॥

చ॥ యుగయుగాల మౌఢ్యాలను కులమత ద్వేషాలను
ప్రాంతీయ తత్వాలను, క్రోధ లోభ మోహాలను
భాషా భేధాలను బాగుమీర పరిమారిచి
సమజీవం సమభావం చిందించగ వస్తున్నది ॥చైతన్యపు॥

చ॥ అనురాగపు జంటలే దాంపత్యపు ప్రతిరూపం
వరకట్నపు వ్యామోహమే నేటి వివాహం
నాడైనా నేడైనా ఏడడుగుల బంధమే
కట్నపు వలయాల నుండి ఛేదించుకు వస్తున్నది ॥చైతన్యపు॥

చ॥ భారత స్వాతంత్ర్యాన్ని సార్థక మొనరించగ
స్వార్థమ్మును విడనాడి ప్రగతిపథం నడిపించగ
బాపూజీ కలలు కన్న రామరాజ్యమేర్పరచగ
ఐక్యతతో అందరం కలసి మెలసి జీవించగ ॥చైతన్యపు॥

## ● నానీలు ●

- పి.రామకృష్ణారెడ్డి, నంద్యాల. ఫోన్ : 9848995643

చెట్లను నరకకురా
నరుడా ....
తరువు విరిగిన
భవితకు కరువు

జాలిలేదని
చెట్టు ఏడ్చె
ఊతమిచ్చింది నీ కొమ్మని
గొడ్డలి విడమర్చె

రోగం నయంకాదు
మాత్రలు దొరకలేదు
కారణం
ఔషధ మొక్కలు లేవు

భావితరాలు
గతాన్ని తిట్టుకుంటాయ్
ప్రాణవాయువుని
కొనడమేంటని



# తరం - అంతరం

- పి. కృష్ణతేజ, విజయవాడ.

రాఘవయ్య ఇంటి వసారాలో కూర్చుని రేడియోలో సంగీతాన్ని వింటున్నాడు. సాయంత్రం ఐదు గంటలైనా వీధిలో అలికిడి లేదు. ఎండలకు చల్లగాలి అసలే లేదు. కరెంటు కోతలతో మధ్యాహ్నం నిద్ర లేకుండా గడిపిన చిరాకు అలసట ముఖంలో కనిపిస్తున్నాయి. మొక్కలకు నీళ్ళు పడదామనుకొన్నా కరెంటు భయం ట్యాంకు నీళ్ళు అయిపోతే ఎలాగని భార్య ప్రశ్నలకు సమాధానం దొరకక ఊరుకున్నా మనసు ఉండబట్టక రోజుకు సీసా నీళ్ళు పడుతున్నాడు. ప్లాస్టిక్ సీసాలలో నీళ్ళు నింపి క్రింది రంధ్రం చేయటం ద్వారా చుక్క చుక్క పడేటట్లు అమర్చి తృప్తి పడ్డాడు. ఎక్కడో చదివిన బిందు సేద్యం అంటే ఇదేనేమో అనుకున్నాడు. మొక్కలంటే ఉన్న మమకారం అతనిచేత ఆ పని చేయించింది. చిన్నపాటి నగరమయిన తన ఊళ్ళో ఇలా ఉంటే ఆ హైదరాబాదులో తన కూతురు అల్లుడూ ఎలా ఉన్నారో అనిపించింది. అంతలోనే వాళ్ళకేంటీ రాత్రి వరకూ ఆఫీసులు, అలసిన శరీరాలు నిదురించటానికి అపార్టుమెంటు ఇళ్ళు. ప్రణతి ఎలా అలవాటు చేసుకుందో ఆ వాతావరణాన్ని అనుకుంటుండగానే రేవతమ్మగారు టీ తెచ్చి యిచ్చింది. మామూలుగానే ఐతే వాసన తగలగానే టీ కోసం తొందరపడే మనిషి ఎదురుగా గ్లాసు కనపడుతున్నా పట్టించుకోనట్లు ఉండడంతో ఆవిడ గట్టిగా పిలిచింది. పొద్దస్తమాను అలా ఆలోచించి బాధపడకపోతే దాని దగ్గర నాలుగు రోజులు దాని దగ్గర ఉండివద్దామంటే వినిపించుకోరు అనటంతో ఆలోచనలను తప్పిస్తూ టీ అందుకొని రెండుసార్లు చప్పరించి 'అలా కాదు రేవతీ మనం ఆ వాతావరణానికి ఇమడలేము. అర్థం చేసుకో" అన్నాడు. బ్రతుకంటే సర్దుబాటని చెప్తారుగా మరి. ఆ మాత్రం సర్దుకోలేరా అంటూ వ్యంగ్యంగా మాటలతో చురకంటించి సమాధానం కోసం చూడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

తనలో తను చిన్నగా నవ్వుకుంటూ రోడ్డుపైకి వచ్చి అటూ-ఇటూ చూశాడు. తన ఇంటిలాగే వీధి కూడా అలికిడి లేకుండా నిశ్శబ్దంగా ఉంది. వేసవి సెలవులు కదా పిల్లలు ఎవరూ ఆడటం లేదా రోడ్డు మీద అనుకుంటూ మళ్ళీ వసారాలోకి వచ్చి గాలికి ఎగురుతున్న దినపత్రిక ఐ.పి.ఎల్ చివరి మ్యాచ్ అన్న వార్త చూసి పిల్లలు రోడ్డుమీదకు రాకపోవటానికి గల కారణం అర్థం చేసుకున్నాడు. క్రికెట్ అంటే ఇష్టమున్నా ఎందుకో ఈ ఆటను ఆస్వాదించలేకపోతున్నాడు.

రేవతీ అని పిలవటంతో ఆవిడ ఏమిటన్నట్లు ఎదురొచ్చి కనుబొమ్మలెగరవేస్తూ ప్రశ్నిస్తుంటే ఏమీ లేదు ఏవైనా యాత్రలు చేయాలనుందే ఎక్కడికి వెళదాం అన్నాడు. హైదరాబాద్ వెళ్ళి అమ్మాయి వాళ్లింటిలో వారం ఉండివద్దాం అని ఎప్పటినుండో చెబుతుంటే వినిపించటం లేదు కాని ఇప్పుడు యాత్రల మీదకు గాలి మళ్ళిందా అంటూ చిరునవ్వుతో నేనేం చెప్పినా మీకు తోచిందే చేస్తారు. ఇప్పటికీ మీకు తోచిందే మాట - పక్క వాళ్ళ ఆలోచనలు అర్థం కావు అంటూ అందివచ్చిన అవకాశాన్ని వాడుకుంటూ రాఘవయ్య మీదకు




## ఆడజన్మ

- రాణ రాజేంద్రబాబు. ఫోన్ : 9491888024

ఆమె
నోములు, పూజలు
ఇంటికి సస్యశ్యామలాలు

ఆమె
వసందైన పిండివంటలు
ఇంటికి పండగోత్సవాలు
ఆమె
చిరునవ్వులు
ఇంటికి అనురాగాప్యాయతలు
ఆమె
నడకలు
ఇంటికి నవ్యకాంతులు
సూర్యోదయానికి ముందే నిద్రలేచి
అన్ని పనులు చక్కదిద్ది
సూర్యోదయాన్నే నిద్రలేపుతుంది ....

ఇన్ని కాంతులు నింపే
ఇంటి ఇల్లాలను చూస్తే
అసూయ పుట్టక తప్పదు,
సృష్టికి వెలుగునిచ్చే సూర్యుడికైనా !
సృష్టికర్తకైనా !

ఋణం తీర్చలేం
ఈ జన్మకైనా ! వెయ్యిజన్మలకైనా !
అపురూపమైన
ఆరాధ్య దైవమైన
"ఆడజన్మ"కు

మాటలతో దాడికి దిగింది. తను అడిగిన విషయానికి వచ్చిన సమాధానం రాఘవయ్యకు చిరాకు తెప్పించింది. ఇక లాభం లేదనుకొని తన మనసులో మాటను చెప్పనారంభించాడు.

"మన రాజేంద్ర ఇలాగే కొడుకు దగ్గరికి హైదరాబాద్ వెళ్ళాడు కదా. అక్కడ ఉదయం ఎనిమిదింటికి ఇల్లంతా ఖాళీ అయ్యి వీడొక్కడే ఇంటికి కాపలానా అన్నట్లు ఉండేవాడట. మధ్యాహ్నం భోజనానికి ఉదయం ఎనిమిదింటికి వండినదో లేక వేడి చేసుకొని తినటమో చేయవలసి వచ్చేదట. పోనీ మనవడి కోసం ఉందామనుకుంటే వాడు స్కూలు నుండి ట్యూషన్‌కి వెళ్ళి వచ్చేటప్పటికి రాత్రి ఎనిమిది గంటలు దాటేది. హోం వర్కులనేవాడట. ఏం చేయాలో అర్థంకాక రెండు నెలలన్నవాడు వారంలోనే ఊళ్ళో వాలాడు. అందుకే ఆలోచించి వాళ్ళనే ఇక్కడికి రమ్మన్నాను. మనం అక్కడికి వెళితే చిన్న పనులకు వాళ్ళను అడగవలసి వస్తుంది. వాళ్ళకు ఇబ్బంది. వాళ్ళ పనులు మానుకోలేరు అలాగని మనని విడిచిపెట్టి వెళ్ళలేరు. అయినా నిత్యం పని ఒత్తిడిలో ఉండేవాళ్ళు ఇక్కడికి వస్తే ఆ నాలుగు రోజులు విశ్రాంతిగా ఆనందంగా గడపగలుగుతారు. మనకు ఆనందం అదే కదా. నీకు గుర్తుందో లేదో ప్రణతి చిన్నతనంలో సెలవులనగానే మానాన్న వాళ్ళ దగ్గరికి తుర్రుమనేది. దానికి పల్లెటూళ్ళంటే ఎంత ఇష్టం. సంక్రాంతికి అమ్మతో పాటు అదీ ముగ్గులు నేర్చుకొని పెట్టేది. దాని బొమ్మల పుస్తకం నా దగ్గర ఇంకా జాగ్రత్తగా ఉంది. బొమ్మలన్నీ ప్రకృతి రమణీయతను పల్లెల్లో జీవనాన్ని చిత్రించేవి... చెరువు గట్లు చేలగట్లు తిరిగి తిరిగి ఆడుకొనేది. పల్లెనుండి భారంగా తిరిగివచ్చేది. దానికి పల్లెలంటే అభిమానం మా అమ్మలా. కాదు అది మా అమ్మే. దాని బాల్యం తల్చుకొంటే నాకు ఆనందంగా ఉంటుంది. కాని ఈ కాలం పిల్లలను చూడు ఎవరిదాకానో ఎందుకు ప్రణతి పిల్లలను చూడు శృతి – ఆదిత్యలకు స్కూలు–ఇల్లు–టి.వి తప్ప మరో ప్రపంచం లేదు. గెంతుతూ తుళ్ళుతూ ఆడాల్సిన వయస్సులో అలా నిస్సారంగా కూర్చొంటే నా మనసు విలవిల లాడపోతుందంటే నమ్ము. లేకుంటే నాకు మాత్రం వాళ్ళదగ్గరుండాలని ఉండదా. నువ్వు కొంచెం ఆలోచించు. అన్నాడు.

ఈ మాటలు పూర్తికాక మునుపే అన్నిటికీ మీ దగ్గర మీ జవాబులు సిద్ధంగా ఉంటాయి. మొదటి నుండి ఇదే వరుస. ప్రపంచమంతా నడుస్తున్న దారిని విడచి తప్పులు ఎన్నటం ఎందుకు ? కృష్ణా! రామా! అనుకోవాల్సిన వయస్సులో ఈ ప్రపంచాన్ని సంస్కరించాలన్న వాదనలెందుకు ? బి.పి. బిళ్ళలు వేసుకోవటానికి కాకపోతే. ఈ పల్లెలో మీకు తోడుగా నేనున్నాను చాలదా. వాళ్ళను కూడా ఎందుకు ఇబ్బంది పెట్టడం. అక్కడ వాళ్ళకు కావాల్సిన వస్తువులు అందుబాటులో ఉంటాయి. మొన్న వాళ్ళువచ్చినపుడు పిల్లలు ఎంత గోల చేశారు. వంటింటిలోకి వచ్చి అమ్మమ్మా కంప్యూటర్ లేదు, వీడియో గేమ్ లేదు, బొమ్మల ఛానల్ ఒక్కటే వస్తోంది అది వచ్చే సమయంలో కరెంట్ పోతోందంటూ ఒకటే గోల. ఇదిలా ఉంటే అల్లుడు ఆదిత్యకు జ్వరం రాగానే మందులు వాడుతున్నా ఈ డాక్టర్లపై తనకు నమ్మకం లేదంటూ వచ్చిన మూడోనాడే ప్రయాణం కట్టేశాడు హైదరాబాదుకి. ప్రణతి కూడా చాలా బాధపడి అమ్మా ఆయనంతేలే మీరే ఒక పదిరోజులు వీలు చూసుకొని రండమ్మా అంటూ బాధపడుతూ బయలుదేరింది. వాళ్ళకి ఇక్కడ నచ్చనప్పుడు ఎందుకు ఇబ్బంది పెట్టడం. ఆ చిన్న వెధవలకి వచ్చిన రెండు రోజుల సెలవులు వాళ్ళకు కావలసిన విధముగా గడపనీయండి అంది రేవతి.

అలాగా ఆ పిల్లలు మరి వేపచెట్టుకు ఊయాల వేయించుకొని ఊగుతూ అన్నం తినటం ఆనందం కాదా. జున్ను పాలుకోసం ఉదయాన్నే లేచి మాధవయ్య గారింటికి పాలకు వెళ్ళటం, వెన్నెలలోనే పడుకొంటామంటూ మారాం చేసి ఆరుబయట మంచ మీద పడుకోవటం, కరెంటు పోగానే కథలు చెప్పమని గోల చేయటం, పంటకాలవ స్నానాలు ఇవన్నీ వాళ్ళకి ఆనందం కలిగించలేదా. అయినా పిల్లలు కోరింది కాదు ఇవ్వాల్సింది. వారికి సంస్కృతి పట్ల అభిమానం, వారిపట్ల ఆత్మవిశ్వాసం కలిగించే ప్రపంచజ్ఞానం కల్పించాలి

## తాళపత్రం ! (కవిత్వం)

- సంకేపల్లి నాగేంద్రశర్మ, కరీంనగర్.

చరిత్ర వెలుగురవ్వలు !
అక్షరబద్ధమైన ఆశాకిరణాల గుచ్ఛం !
అద్భుత చిదంబర కాలరహస్యం
జానపదుల పంచమవేదం,
సాంస్కృతిక వారసత్వపు
నాగరికతల వాఙ్మయ గవాక్షం !
చెరిగిపోని విజ్ఞాన నేత్రం,
అర్వాచీన ప్రబంధ కావ్యాల జనితం
ఆయుర్వేద వైద్యవిధానాల సౌగంధితం
సర్వశాస్త్రాల సమన్వితం,
ఆర్కివ్స్ వారసత్వాన్ని కొనసాగిద్దాం
పేర్చివున్న లక్షలాది తాళపత్రాల
కాలనాళికల్ని ఛేదిద్దాం !

## బతుకు

- ఎం. ప్రసాద్.
ఫోన్ : 9701425718

బతుకులో అన్ని రోజులూ ఒకేలా ఉండవు
కాలేజీ అమ్మాయిల్లా అందంగా ఉంటాయి
కొంటె కుర్రాడి కంటి చూపుల్లా
చురుగ్గా ఉంటాయి
వసంతకాలపు చిగురు మీద
లేత ఎండ పరచినట్లు మెరుస్తాయి
పగటి చందమామలా కళావిహీనంగా ఉంటాయి
రాజకీయ నాయకుల హామీల్లా ఉంటాయి
చావుల్లా నిగూఢంగా ఉంటాయి
బతుకులోని అన్ని రోజులు ఒకేలా ఉండవు
అందుకే ... మంచిపొద్దుచూపే
బతుకుమీద ఆశ చావలేదు.

## మినీ కవితలు

- సబ్బని లక్ష్మీనారాయణ, కరీంనగర్,
ఫోన్ : 9247270941

**ప్రేమ**
లోతు తెలియని అఖాతం
ఇంకా చూస్తే మహాసముద్రం
**నవ్వు**
ముఖ కమలంపై వికసించే పువ్వు.
**కళ్ళు**
కమనీయ కావ్యాలు
ప్రేమ సామ్రాజ్యానికి వారధులు
**చెట్లు**
చెమ్మగిల్లే నయనాలు లేవుగాని
బతుక్కు ఆదర్శం
**వసంతం**
ప్రకృతి పూదోటలో కోయిల రాజ్యం



అని సమాధానమిచ్చి రాత్రి కూడా అదేవిషయాన్ని ఆలోచిస్తూ ఆలస్యంగా నిదురలోకి జారుకున్నాడు రాఘవయ్య.

అనుకొన్నట్లు మూడు రోజులుండేందుకు వచ్చారు ప్రణతి – అరవింద్‌లు తమ పిల్లలతో. రాఘవయ్య ఆశించినట్లు పిల్లల ఆటపాటలను చూస్తూ పగలు, సాయంత్రం సమయంలో చేలు చూపిస్తూ పంటకాలువ స్నానాలు చేయిస్తూ గడిపేశాడు. పిల్లలు బాగా ఆడుకొంటూ కబుర్లు చెబుతుంటే తాను మైమరచి పోయాడు. స్నానం చేసి వస్తూ వస్తూ కాలవలోని చేపలు తమతో తెచ్చి యింటి తొట్టిలో వాటిని పెంచారు. వాటిని తమతో పాటు తీసుకెళ్ళి ఆక్వేరియంలో పెంచాలని వారి ఆరాటం. వద్దని వారించినా మొండికేయటంతో తాను వారించలేదు.

అయితే రేవతమ్మ కూతుర్ల మధ్య సాగుతున్న గుసగుసలు రాఘవయ్య దృష్టి దాటిపోలేదు. ఏదో జరుగుతోందని అర్థమయ్యింది. అనుకున్నట్లు మూడోరోజు ఉదయం అరవింద్ ఢిల్లీ వెడుతున్నాడనీ మనం పిల్లల్ని చూసు కుంటే తాను కూడా భర్తతో వెడతానని ప్రణతి అడుగుతోందని తాను కూతురి కోరికను కాదనలేకపోయానని సాయంత్రం బయలుదేరాలని వివరించింది రేవతమ్మ. చేసేది లేక కూతురి కోరిక మేరకు తాను బయలుదేరాడు రాఘవయ్య.

వారం రోజుల ప్రయాణానికి వెడుతూ తల్లికి అన్ని జాగ్రత్తలూ చెప్పింది ప్రణతి. పాలూ, కూరగాయలూ అన్నీ వాచ్‌మెన్ తెచ్చి యిస్తాడనీ, మందులు కావాలంటే తెచ్చి పెడతాడని చెప్పి బయలుదేరారు. పిల్లలకు కావలసిన తినుబండారాలు ఫ్రిజ్‌లో ఉంచిన కూతురి ముందుచూపుకి మురిసిపోయింది రేవతమ్మ. పిల్లలు అమ్మకోసం కాసేపు ఏడ్చినా, టి.వి. చూస్తూ మరచిపోయారు. చేప పిల్లలను రోజూ చూసుకోవటం మురిసిపోవటం కూడా రాఘవయ్య గమనిస్తూనే ఉన్నాడు.

ఆధునిక వసతులన్నీ ఉన్న యిల్లది. నీటికి మాత్రం ఇబ్బంది తప్పటం లేదు. రాఘవయ్యకు కాంక్రీట్ జంగిల్ నచ్చదని ఆమెకు తెలుసు. ప్రతిరోజూ వచ్చే నీళ్ళలారీ ఢీ కొట్టడంతో ట్రాన్స్‌ఫార్మర్ దెబ్బతిని కరెంట్ లేక ఇబ్బంది పడాల్సివచ్చింది రెండురోజులు. ఆ సమయంలో పిల్లల వేడినీళ్ళు మొదలుకొని వంటదాకా అన్నీ స్తంభించిపోయాయి. సరియైన గాలి వెలుతురు లేక ఆ రెండురోజులు అందరూ పైన పడుకోవటంతో పిల్లలందరూ కలిసి ఆడుకోవటం బాగా నచ్చింది ఆ దంపతులకి. అయితే అందరూ ఉద్యోగస్థులవటం వలన రాత్రికి వంటలకు బదులు పిజ్జాలు తెప్పించుకు తినటం వారికి నచ్చలేదు. చివరికి ఒక ఆదివారం అందరినీ జేర్చి వంటబాధ్యత తానే తీసుకొని భోజనాలు ఏర్పాటు చేయటంతో వారితో మరింత చనువు ఏర్పడింది రేవతమ్మకి. ఆ మహిళా ఉద్యోగస్థులతో మాట్లాడుతూ ఇంటాబయటా వారి పని ఒత్తిడిని చూసి జాలిపడింది. కానీ వారు ఉద్యోగం చేయటానికి గల కారణాలను మాత్రం అర్థం చేసుకోలేకపోయింది. ఇంత కష్టపడి సరయిన ఆహారం పోషణ లేని వారి జీవనవిధానం బాధ కలిగించినా పెద్దరికంగా మౌనంగా నిలబడింది.

తన కూతురు కూడా ఇటువంటి ఒత్తిడి భరిస్తోందని అర్థం చేసుకున్నా ఏమి చేయలేని స్థితి. ఇంక అక్కడ ఉండబుద్ధి కాలేదు. అందుకే ప్రణతి – అరవింద్‌లు రాగానే బయలుదేరాలని నిశ్చయించుకొన్నది. పిల్లల ఆక్వేరియంలో ఆక్సిజన్ అందించే పనిచేయని కారణంగా చెరువు చేపలు చనిపోవటం పిల్లలు తేలిగ్గా అర్థం చేసుకోలేకపోయారు. వీటన్నిటినీ గమనించిన రాఘవయ్య రేవతమ్మకు పట్టణ నివాసం నచ్చలేదని అర్థం చేసుకొని మౌనంగా ఉండిపోయాడు.

ఢిల్లీ నుండి వచ్చిన తరువాత రెండు రోజులుండమని ఎంత బతిమిలాడినా వినకుండా రేవతమ్మ బయలుదేరటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. తిరుగు ప్రయాణంలో రేవతమ్మగారు తన ప్రయాణానికి కారణం భర్తకు చెబుదామనుకుంది. కాని ఆ అవసరం రాలేదు. అర్థమయిందా రేవతీ చెరువులో చేపలు అక్వేరియంలో బ్రతకలేవు అలాగే ఆక్వేరియంకు అలవడిన చేపలు చెరువులో బతకలేవు. చెరువులో తమ రెక్కల కష్టంతో బతికే చేపలకి, సహజమయిన ప్రకృతిలో బతికే చేపలకు అక్వేరియం బంగారు బందిఖానా. అలాగే అక్వేరియం చేపలను చెరువులో వదిలినా అవి బతకలేవు. మన అలవాట్లు తరానికి – తరానికి మారుతుండటంతో వాళ్ళు మన పల్లెల్లో ఇమడలేకపోతున్నారు అంటూ ముగించాడు రాఘవయ్య. రేవతమ్మ భర్త భుజంపై వాలి చిరునవ్వుతో అవునన్నట్లు తృప్తిగా నవ్వింది. నిజమే కాలానికి అనుగుణంగా సాగిపోవటమే జీవితం అని ఆమె మనసులోనే నిశ్చయించుకొన్నది.

## ● మినీ కవితలు ●

-బి. నాగరాజు, ఫోన్ : 9640317108

**హాఫ్‌బెండ్లు**

సమాజంలో జేమ్స్ బాండ్లు
సతుల సిగల్లో రబ్బరుబ్యాండ్లు

**రక్తదాహం**

కొట్లాటలో కత్తుల కాళ్ళతో
కంఠాలు కోసుకుంటూ కుక్కుటాలు
కసిగా కాలుదువ్వుతూ రక్తదాహం
దప్పిక తీర్చుకుంటూ కర్కోటకులు

**గుప్పెడు గుండె**

ద్వేషాన్ని చిమ్మితే కృష్ణబిలం
ప్రేమను పంచితే నీహారిక

**పునర్జీవనం**

పువ్వు ఫలంగా మారటం
పండు గింజగా రాలటం
విత్తు మొక్కై మొలకెత్తటం

# మహిళ - ఆత్మవిశ్వాసానికి ప్రతీక

- బి. నాగశేషు, హిందూపురం. ఫోన్ : 9985509053

రంగాలేవైనా భంగపడింది స్త్రీయే. వ్యవస్థలేవైనా అవస్థలు అతివలకే. రాజుల కాలమయినా, రాజకీయ కాలమయినా రాక్షస ప్రవృత్తి మారలేదు. భారతదేశ చరిత్ర ఆరంభంలో అంటే సింధూనాగరికత కాలంలో స్త్రీ దేవతలు (అమ్మతల్లిగా) పూజింపబడ్డారు. వేదకాలంలో అలా గౌరవింపబడిన స్త్రీ తదనంతర కాలంలో అనేక సామాజిక దురాచారాలను ఎదుర్కొన్నది. నాటి హింసలో సతీసహగమనం, బాల్యవివాహం, పునర్వివాహం, పరదాపద్ధతి, దేవదాసి పద్ధతి రూపంలో ఉంటే, అవి నేడు అత్యాచారాలు, ఈవ్‌టీజింగ్, వరకట్నం, యాసిడ్‌దాడులు, భ్రూణహత్యలు, ఆడపిల్లలను అమ్మేయటం వంటి రూపాల్లో ఉంది. స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలకు కుల పంచాయితీలతో వెలకట్టడం. (రాజస్థాన్‌లో ఖాఫ్ పంచాయితీలు) ఇలా విద్య నుండి మొదలై వివాహం వరకు విరామం లేకుండా బాధల బందిఖానాలో బందీలౌతున్నారు.

తరాలు మారినా తారతమ్యాలు మారలేదు. ఇలా ఎన్ని ఇబ్బందులెదురైనా మబ్బు వెనక వెన్నెలలాగా, ఆ వెలుగు వెలికి రాకుంటే ఉండలేకపోయింది. అబలా కవిత్వం ఆడవారి కవిత్వం అని భావించి స్త్రీ ప్రజ్ఞా విశేషాల పట్ల వింత అభిప్రాయాలకు వంత పాడినవారు ఎందరో మచ్చుకు ఆదికవిగా భావించే నన్నయగారు కూడా "మగువలెరుక గలరే" (కద్రువ వినతల గాథ) ప్రబంధపరమేశ్వరుడు వనితలకు పరిజ్ఞానంబు లేదు (ధర్మవ్యాధో పాఖ్యానము) అని వంత పాడారు. కవి సార్వభౌముడు తథ్యామిథ్యాలిలిక్తిములకు కలదే (శృంగార నైషధం) అని తేల్చేశాడు.

వికటకవి రామలింగడు "ఉవిదలకు బుద్ధి పెడతలనుండుగాదె" అని తీర్మానించేశాడు. వాటన్నింటినీ అధిగమించి అబలలుకాదు ఆత్మవిశ్వాసానికి ప్రతీకలు అని సమాజానికి చాటిచెప్పారు. పురుషుడిలో అణిగి వున్న ధైర్యాన్ని బయటకు తీసి ప్రోత్సహించి విజయాలకు చేరువచేసే చైతన్యదీప్తి.

ఖడ్గతిక్కన యుద్ధ రంగం నుండి వెనుదిరిగి వచ్చినప్పుడు చానమ్మ అతనికి ఆడవారితో సమానంగా పసుపుముద్ద కలిపి నులకమంచం అడ్డుపెట్టి స్నానానికి పిలిచి భర్త పౌరుషాన్ని పెల్లుబికేలా చేసింది.




వగరకు వెన్నిచ్చినచో
నగరెనిను మగతనంపు నాయకులెందున్
ముగురాడవారమైతిమి
పగపేటికి జలకమాడ వచ్చినచోటన్

భార్య చేసిన పరాభవానికి బాధపడుతున్న ఖడ్గతిక్కనకు తల్లి భోజన సమయంలో విరిగిన పాలు వడ్డించింది. ఇలా ఇద్దరూ దెప్పిపొడిచినందుకు మానాభియైన మహాయోధుడు మరల రణరంగానికి వెళ్లి విజయుడై ప్రాణాలను అర్పించాడు. అంతటి ఆత్మ విశ్వాసాన్ని ప్రేరణను అందించింది చానమ్మ. శివాజి వీరుడవడానికి తన తల్లే ప్రేరణ కాబట్టి సృష్టిలో సగభాగమైన స్త్రీని తక్కువగా భేద భావాల దృష్టితో చూడరాదు. చలంగారన్నట్లు స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం కావాలి. ఆమెకు మెదడు ఉంది. దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకు హృదయం వుంది దానికి అనుభవం ఇవ్వాలి అన్నమాటలు అక్షర సత్యాలు.

జీవరాశులన్నింటిలో మానవుడే విచక్షణ జ్ఞానం కలిగిన జీవి. మనిషి అనాగరికత దశ నుండి నాగరికత దశకు చేరడానికి చాలా సంవత్సరాలు పట్టింది. ఎంత నాగరికత సాధించినా అనాగరిక ప్రవృత్తిని కలిగి ఉండడం మానవజాతి ఉనికిని ప్రశ్నించే అంశం. ఆదిమవాసులు తదనంతర కాలంలో లైంగిక అవసరాలను సమాజం ఆమోదించే విధంగా చట్టబద్ధంగా తీర్చుకు నేందుకుగాను వివాహవ్యవస్థను ఏర్పరచుకున్నాడు.

దీని ఫలితంగా కుటుంబ వ్యవస్థ, బంధువ్యవస్థ, సామాజిక కట్టుబాట్లు, సంస్కృతి, వీటి ఆధారంగా మానవుని ప్రవర్తన నియమింపబడింది. కాని పాశ్చాత్యీకరణ ప్రభావం వల్ల జీవన విధానంలో వచ్చిన మార్పులవల్ల ఉమ్మడి కుటుంబవ్యవస్థలు విచ్ఛిన్నం కావడం. ధనవ్యామోహ ప్రపంచంలో పిల్లలపట్ల తల్లిదండ్రులు తీసుకుంటున్న శ్రద్ధ చాలా తక్కువ. ఏదడిగితే అది కొనిస్తే

## తెలుగు వెలుగు

- టి. రాము, సర్వవరం. ఫోన్ : 8125408996

కాంతిలోని కరుణ మనస్సులోని మమత
వేదనలోని ఆవేదన, ఆవేదనలోని ఆవేశం
ఆవేశంలోని ఆశయం
ఆశయం కోసం తపన
తపనకోసం సంకల్పం....
"భాషే భవిష్యత్‌గా వెలిగే నేల
భాషలోని భావం.
పదాలలోని పరమార్థం....
అర్థంలోని ఆనందం ...
ఆనందంలో పారవశ్యం
పలికినా ! పాడినా ! తెలుగు పదాలే
వెలుగు పదాలు ఆ వెలుగే మన తెలుగు.




మా కర్తవ్యాన్ని నూరుశాతం నెరవేరుస్తున్నామని భ్రమ పడుతున్నారు. బాధ్యతలు, ప్రేమానురాగాలు, సమాజంలో ఎలా జీవించాలో నేర్పడం లేదు. ఢిల్లీలో జరిగిన అత్యాచారానికి పాల్పడిన వారిలో ఇంటిని వదిలి బజార్లలో జులాయిగా జీవితాల్ని గడిపేవాళ్ళే. దీన్ని బట్టి చూస్తే నేరస్తులైనా మంచివారైనా తయార యేది మొదట ఇంట్లోనే. తరువాతి దశ పాఠశాల. ఈ రెండు వ్యవస్థలు కొంతవరకు వాటి ప్రాధాన్యాన్ని కోల్పోయాయనే విషయన్ని అంగీకరించకపోయినా అంగీకరించక ప్పదు. మంచేదో చెడేదో తల్లిదండ్రులు మాట్లాడుకోవట్లేదు. సాంకేతికత సాధించిన క్రమంలోనే ఆలోచిస్తూనే వున్నారు. తప్పితే సమాజంలో ఎలా బతకాలో తెలపడం లేదు. చదువు యొక్క ప్రాథమిక లక్ష్యం ఏమిటి అనే విషయాన్ని మరచి ప్రవర్తిస్తున్నారు.

మహిళల రక్షణకు భారత న్యాయశాస్త్రంలో 40కి పైగా చట్టాలు ఉన్నప్పటికీ దాడులు మాత్రం ఆగలేదు. 1848లో రష్యాలో మహిళా పోరాటం ఆరంభమయ్యింది. 1912లో చైనాలో, ఇలా పోరాటాల ద్వారానే స్త్రీ తన హక్కుల్ని పొందగలుగుతుంది. మహిళల హక్కుల్ని తొక్కిపెట్టి కాలం చెల్లిన చట్టాలు రాజ్యాంగంలో అనేకం ఉన్నాయని జాతీయ మహిళా సంఘం కూడా చెప్పింది. అత్యాచారం కేసుల్లో నేరం రుజువై శిక్షలు పడుతున్నవి. 24% మాత్రమే అంటే అర్థం చేసుకోవచ్చు భారతదేశంలో చట్టాలు ఏవిధంగా పనిచేస్తున్నాయో అని. వ్యభిచారంలో భారతదేశం రెండవది. అంతరిక్ష యాత్రికుల్లో పర్వతారోహకుల్లో, దేశాధినేతల్లో శాస్త్రవేత్తల్లో, కళాకారుల్లో, యుద్ధరంగాల్లో కార్పోరేట్ రంగాల్లో అన్నింట్లోనూ స్త్రీ ప్రాతినిధ్యం వహిస్తుంది. కానీ వీటినే మహిళల ప్రాతినిధ్యానికి ప్రతీకలుగా పరిగణించలేము. స్త్రీలు తనకు పరిచయం లేని కొత్త ఉద్యోగ రంగాలలోకి కూడా వలస వెళుతున్నారు. కొత్త సవాళ్ళు పాత సమస్యలు రెండూ ఎదుర్కొంటున్నారు. కానీ ఇంకా మహిళా ప్రాతినిధ్యం విస్తరించాలి చైతన్యాన్ని వ్యాప్తింపజేయాలి. మహిళలకు భాగస్వామ్యం కల్పించినప్పుడే సమాజాభ్యున్నతి అని గాంధీగారు నాతో ప్రబోధించారు. మహిళల జీవన ప్రమాణాలే దేశాభ్యున్నతి నిర్ధారణకు గీటురాయని నెహ్రూ గారన్నారు. దేశజనాభాలో దాదాపు సగంగా ఉన్న స్త్రీ మూర్తుల్ని సమర్థ మానవ వనరులుగా తీర్చిదిద్దకుండానే సమానత్వం సాధికరతలంటూ చట్ట సభల్లో మూడోవంతు రిజర్వేషన్‌లని పంచాయితీలలో యాభైశాతమని ఇలా శాతాలతోనే మూత మూయిస్తున్నారు. వారి లోకాన్ని గౌరవిస్తేనే దేవతలు హర్షిస్తారనే ఆర్యోక్తిని మనం మరచిపోయాం. తారతమ్యాలు చూడకుండా మసలుకుంటే మానవజాతి మనుగడ కొనసాగుతుంది. ●

## ● రెక్కలు ●

- తోకల రాజేశం. ఫోన్ : 9676761415

మట్టిలో మొలకెత్తి
మట్టిని నమ్మి
మట్టిని తిని
మట్టిలో కలవటం
మట్టి పరిమళం
రైతు జీవితం

సంతోషమే
కౌగిలించదు
బాధలూ
వెక్కిరిస్తాయి
తలమీది ముళ్ల కిరీటం -
జీవితం!

ఇరువైపుల
గుండెల్ని
కలిపి కుట్టేది
ఉత్తరం

ఆత్మీయత -
విశ్వభాష !

కట్టెను
కాల్చి
బూడిద చేస్తుంది
అగ్ని
అహం -
అగ్ని లాంటిదే !

నన్ను భయపెట్టిన
నానీడ
వెనక్కి తిరిగితే
భయపడసాగింది
మననీడల్లాంటివే -
సమస్యలు.

నీకు నువ్వే
శత్రువు

నీకు నువ్వే
మిత్రుడు

వైరుధ్యాల కూడలి -
జీవితం

నా గుండె
కొమ్మమీద
ఎందరో
ఆత్మీయులు
వసంతం వీడని చెట్టు -
స్నేహం !

### నానీలు

చెట్టుదీ
ఒక తిరుగుబాటే
కొట్టేసినా
చిగురేస్తుంది చూడు

చెట్టులా
బతకమంటే
మనిషీ !
పుట్టలా విషం చిమ్ముతున్నావేం?

గోందులు
అడవి మనుషులా?
మనిషితనం ఇంకిపోని
నదులురా !

భూమితల్లిని
ముద్దాడాను
నా ఒంటినిండా
పరిమళాల జల్లులు

నేలతల్లీ !
నీకు వందనం
నిద్రపోతున్న మొక్కను
మేల్కొలిపినందుకు

# వెలిగే కొవ్వొత్తి

- చిలమకూరి లాజెరస్, సదుం. ఫోన్ : 9490487196

త్యాగి, తన బాల్యం నుండి భయభక్తులతో మెలిగిన మంచి మనిషి. తండ్రి ఉద్యోగి. తల్లి ఇల్లు, పిల్లలు తదితర ఇంటిపనులతో మునిగిపోయెడిది.

త్యాగి - పెద్దకుమారుడు. తన తరువాత ఇరువురు తమ్ముండ్లు - ఇరువురు చెల్లెండ్రు. తండ్రి శ్రద్ధ వలన ఆంధ్ర - ఆంగ్ల భాషలందు తరగతికి తగినంత కన్న మిన్నగానే స్థాయిని పొందినవాడు. లెక్కలు మాత్రము సరిగా చేయలేక పబ్లిక్ పరీక్షల్లో పట్టుతప్పిపోయాడు.

తిరిగి ఒక లెక్కలు మాస్టారు వద్ద అవసరాన్ని బట్టి, తిరిగి పరీక్షకై, లెక్కలు నేర్చి - పరీక్షరాసి పాస్ అయినాడు.

ఇంటర్, పాస్ అయినాడు బి.యస్.సి.లో కుంటుపడవలసిన"వలలో" పడిపోయాడు - మేనమామకూతురు "మత్తులో" చిత్తుగా ఓడిపోయాడు. తన "అంతం" తానే తేల్చుకోతలచాడు - గాని "దేవుడు వేరుగా తలచాడు" బ్రతికి బయటపడ్డాడు.

తండ్రి, తన్యయుని వయసును బట్టి - గీతాన్ని బట్టి వేగిరంగ పెండ్లి చేసినాడు. ఆ పెండ్లితో త్యాగి జీవితం అతలాకుతలం. చదువు సంస్కారం లేని పెంకి పెండ్లామ్. త్యాగి గతాన్ని ముందే యెరిగిన, వనితామణి. ఆ బలహీనంతో భర్తను తన చెప్పు చేతులందు నిలుపగల మగువ ఆమె.

ఏదో ఒక ఉద్యోగంలో సేరిపోయాడు. పెండ్లి తదనంతరం - వేగంగా ఇద్దరు కొడుకులు - ఒక కూతురు. ఆయనకు, తన సీతతో పాటు "తోడు"గా నిచ్చాడు దేవుడు.

పిల్లలు "ముగ్గురూ ముగ్గురే" డిగ్రీలో పెద్దవాడు, చివరి సంతానం, కూతూరు - "చాలాకాలం" చదివినారు - చివరికి కొడుకు పాస్, అనిపించు కున్నాడు. కూతురు "నేనెందుకు చదవాలంటుంది".

పెద్దకుమారునికి పెండ్లి జరిగింది. రెండు సంవత్సరాలలో రెండుసార్లు "వియోగసంయోగాలు" ఈలోగా ఒక కూతురు. ప్రస్తుతానికి "వియోగమే వారి యోగం".

కూతురుకు, పెండ్లి జరిగింది. అది అంతే - వియోగ, సంయోగ సమ్మే ళనం - నాలుగేండ్లు నిండినవి. కుమారుడు - కూతురు ఆమెకు తోడు - "భర్తకు తోడు అతని తల్లితండ్రి",

ఇప్పుడు త్యాగికి తన సతి, పుత్రిక ఆమె పిల్లలు పెద్దకొడుకు, మరియు చిన్నకొడుకు తగినంత బరువు ఇంతవరకు స్వంత ఇల్లులేదు - పదవీ విరమణ పొంది కూడా రెండేండ్లు నిండినవి.

పదవిలేని పెద్ద కుమారుడు, భర్తలేని కూతురు, ఆమె పిల్లలో మరియు పదవి కొరకు వేటాడే చిన్న కుమారుడు ఆయన ఆస్తి, చరాస్తి.

తాను మరో సంపాదనలో పడి అంతో ఇంతో సంపాదించాలను ఆశ - ఆశయం - ఆసక్తి ఆయనకు లేదు - భార్యాపిల్లలు బాధ్యతగా మెలిగే గుణవంతు లుగారు. ఏమంత పెద్దవయసు? 57 సంవత్సరాలు - మరోసారి ప్రయత్నించాలని, "తనదారి తాను చూసుకో"వాలని ఒకనాడు ఒక రైలు స్టేషన్‌లో "ఆలోచనలో పడ్డాడు"

కథకుని కంట పడ్డాడు, విషయం తెలిపాడు. ఏంటి ఆయన కథ? ఆ ప్రయత్నాలు - అవే "ఆత్మహత్య" ప్రయత్నాలు. బాల్యం నుండి ప్రయత్నించు వాడు ఏనాటికి ఆనాడు ఏదో ఒక రీతిగా బతికి బయటపడిపోయెడి వాడు.

నేడు కథకుడు కడు వృద్ధుడు ఏకాకి "ఉన్నఊరు - ఉన్నవారు" ఎవ్వరూ లేని వాడు - అయినా తన కథనం - కథల - జీవితయెతల కలగలుపులతో పదిమందికి "మందు"గా తన గతాన్ని, వర్తమానాన్ని సూచిస్తూ - నేటికి అరడజన్ మందికి ఆయువు పెంచినాడు. తానూ తన ఆయువును పెంచు కుంటూ సామాజిక స్పృహతో సాహసయాత్రగా తన జీవితాన్ని గడుపుతూ, అనేకులకు దారి సూచించువాడు - కథకుడు. ●

## ఉత్తరం ఆత్మఘోష

- తటవర్తి రాజేష్, ఫోన్ : 8985069916

నమస్కారం... నా పేరు ఉత్తరం. ఈ పదాన్ని మీరు ఎప్పుడో విని ఉంటారు. ఒకప్పుడు నా కోసం ఎదురుచూడని కనులు లేవు. నన్ను చదవని పెదవి లేదు. "పోస్ట్" అని నా కబురు వినగానే, పరవశించి, పరుగులెత్తుకు వచ్చి, నన్ను అందుకునే ఆప్తులు ఉన్న ఏకైక విశ్వబంధువుని నేను. కానీ ఇదంతా ఒకప్పుడు.

నన్ను ప్రపంచానికి పరిచయం చేసిన నా తల్లి, తపాలాశాఖ ఒకప్పుడు సామాన్య ప్రజలకి ఎంతో చేరువగా, ఆరోప్రాణంగా ఉండేది. నేడు నేను లేక అది జనాదరణ కరువైన అనాధగా మారింది. బ్యాంక్ ఎ.టి.యం కార్డులు, ఓటు గుర్తింపుకార్డులు, పరీక్షా ప్రవేశపత్రాలు వంటి వాటికి మాత్రమే పరిమితం అయ్యింది.

సమాచార సారథిగా, బంధ, అనుబంధాల నడుమ వారధిగా, మానవ సంబంధాల ప్రధాన కూడలిగా, గొంతు దిగని విషాద ఘోషలకు, ఆప్యాయ తానురాగాలకు ఆనందాశ్చర్యాలకు ఒక నిలయంగా ఉండే నన్ను తలుచుకోని హృదయం నాడు ఉండేది కాదు. వారానికి ఒకసారి నా కబురు లేకపోయినా, నే కానరాకపోయినా ఆ కుటుంబంలో వారికి బెంగ, భయం, బాధ... కానీ, ఈ కంప్యూటర్ కాలంలో ఆ పదాలకి అర్థాలు గూగుల్‌లో వెతికినా దొరకవు.

నా గతకాల వైభవాన్ని నాశనం చేస్తూ, కొన్ని శత్రువులు జనం నుంచి నన్ను దూరం చేశాయి. నేను ఎక్కడ ఉన్నానో నాకే తెలియని పరిస్థితిని కల్పించాయి. వాటివలన నేడు నేను కనిపించినా, నవ్వే ప్రజలున్నారు. ఇంకా నన్ను వాడుతున్నారా అని ఆశ్చర్యంగా చూస్తున్నారు. నన్ను ఉప యోగిస్తున్న వారిని అనాగరికులుగా లెక్కిస్తున్నారు. నాకోసం ఎదురుచూసే వారిని పిచ్చి వారిగా చిత్రిస్తున్నారు.

అందుకే...

నన్ను మర్చిపోయి, మారిపోయిన ఈ సమాజంలో "మరుగున పడి ఉండటమే మేలు" అనిపించింది. నే కనిపించిన చోట అవమానం జరుగు తుందేమో! అని అనుమానం వచ్చి, నన్ను అభిమానించే వాళ్ళ కోసం అయినా నేను అనాధని అవ్వక తప్పదు అనిపించింది.

కాబట్టి నేస్తమా...

కాలంతో పరిగెడుతూ కనుమరుగైన నేను

కాయలు కాచేలా ఎదురుచూసే నీ కనులకు ఇక కానరాను.

# యోగం - జీవన విధానం

- డా॥ ఎమ్.ఎన్ కృష్ణవేణి, విశాఖపట్టణం. ఫోన్ : 9440179914

"సహితస్య భావః సాహిత్యమ్", "హితేన సహితం సాహిత్యం" అని సాహిత్యానికి నిర్వచనాలు. హితంతో కూడినది, హితాన్ని చేకూర్చేది అయిన సాహిత్యం సమాజాన్ని ప్రభావితం చేస్తుంది. అందుకు కాలానుగుణంగా రూపాంతరం చెందుతూ ఉన్న సాహిత్య ప్రక్రియలే నిదర్శనం. ఏ సాహిత్య ప్రక్రియ అయినా అంతిమ లక్ష్యం సమాజ శ్రేయస్సే అనేది నిర్వివాద అంశం. అందుకే "విశ్వశ్రేయః కావ్యం" అనే నానుడి ఉంది. నాడు ప్రాచీన కవులంతా రాజుల మెప్పుల కొరకు రచన చేసినా, నేడు మానవజాతి కనువిప్పు కొరకు రచన చేసినా అన్ని సాహిత్య ప్రక్రియలలోను అంతఃస్సూత్రంగా ఉన్నది సమాజ శ్రేయస్సే. కవి సమాజాన్ని పరిశీలించి మానవాళి ఎదుర్కుంటున్న సమస్యలకు పరిష్కారాలను తన రచనల ద్వారా సందర్భాలను సృష్టించి తెలిపిన సందర్భాలు ఉన్నాయి. నాటి నుండి నేటివరకు కవులంతా తమ శక్తి కొలది సమకాలీన సమాజాన్ని మరమ్మత్తు చేయడానికి సాహిత్యాన్ని ఆయుధంగా ఉపయోగించా రనేది అక్షర సత్యం.

అయితే నేటి సమాజాన్ని పరిశీలిస్తే నాడు కావ్యాలలో చెప్పిన సామాజిక విలువలు నేడు కనబడటం లేదు. అసలు మానవులమేనా అనే సందేహం కలిగే రీతిగా నేటి సమాజ పరిస్థితి ఉంది. ఉదయాన్నే లేచి ఏ వార్తాపత్రిక, ఏ న్యూస్ ఛానల్ చూడాలన్నా భయమే, క్రొత్తగా ఏ అత్యాచారాలు, హింసలు, హత్యలు, దోపిడీలు, దగాలు, మోసాలు, ఆత్మహత్యలు, స్కాములు గురించి ఎక్కడ వినవలసి వస్తుందోనని. ఇవన్నీ మన సమాజాన్ని పట్టి పీడిస్తున్నాయి. పాశ్చాత్య నాగరికతా ప్రభావంతో పెడదారిన బట్టిన యువత విపరీత ధోరణులు, రెచ్చగొట్టే వేషధారణలు, ఆహారపుటలవాట్లలో వచ్చిన విపరీత పోకడలు, అశ్లీలపు దృశ్యాలు, నేతల అనైతిక ప్రవర్తనలు, పర్యావరణ కాలుష్యం, ఆహారపు కల్తీ, టెక్నాలజీ అభివృద్ధి చెందడంతో పెరిగిన మానసిక ఒత్తిడులు, సమాజాన్ని ఎటువైపుకి తీసుకు వెళ్తున్నాయో తెలియడం లేదు. వీటన్నింటికి ప్రధాన కారణం సరైన జీవన విధానం లేకపోవడమే.

"జీవానాం మనుజ శ్రేష్ఠః" అని జీవులలోన్నింటిలోకి మానవుని శ్రేష్ఠునిగా తెలుపుతారు. పై విషయాలను చూస్తే ఆ మాట నిజమా అని సందేహం కలుగుతుంది. సకల జీవరాశుల నుండి మానవుని వేరు చేసి చూపేది బుద్ధి. అట్టి బుద్ధిని లేదా జ్ఞానాన్ని ఇచ్చేది విద్య ఒక్కటే అని అంటారు. అందుకే

**"చదువనివా దజ్ఞుండగు**
**జదివిన సదసద్వివేక చతురత గలుగున్**
**జదువగ వలయును జనులకు**
**జదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ"**

అని విద్య యొక్క అవసరాన్ని చెప్పాడు పోతన.

అలాగే భర్తృహరి సుభాషితాలలో **"రూప యౌవన సంపన్నాః విశాలకుల సంభవాః విద్యాహీన న శోభంతే నిర్గంధా ఇవ కింశుకాః"** అంటాడు. వీటి సారాంశం చదువులేనివాడు అజ్ఞాని అని, చదవం వల్ల ఏది మంచి, ఏది చెడు అనే వివేకం కలుగుతుందని, విద్యలేని వానికి కులం, రూపం, ధనం, యవ్వనం అన్నీ ఉన్నా వాసనలేని మోదుగ పుష్పంలా అని వృధా అని చెబుతూ అర్థం. మరి ఆ వివేకం మనకు నేటి చదువులు ఇస్తున్నాయా? ఆలోచించాల్సిన విషయం. సరైన విద్యాభ్యాసం వల్ల కలిగే ఉపయోగాలు ఏమంటే

**"విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతామ్**
**పాత్రత్వాద్ధనమాప్నోతి ధనాద్ధర్మం తతస్సుఖమ్ "** (హితోపదేశం)

అని విద్య వినయాన్ని ఇస్తుందని, వినయం వలన పాత్రతను (యోగ్యత), యోగ్యత వలన ధనము, దానివలన ధర్మమును ఆచరించి, ధర్మాచరణ వలన సుఖాన్ని పొందుతారని అర్థం. ప్రతి జీవి కోరుకునేది ఆనందం. దాన్నే సుఖం అని సామాన్యార్థంలో అనుకుందాం. అది లభించాలంటే విద్యవల్ల కలిగే ప్రయోజనాలలో ప్రధానంగా తెలిసికోవలసింది ధర్మాచరణ అని తెలుస్తుంది. ఈ ధర్మాచరణే మానవుని అన్ని జీవరాశులలోకి శ్రేష్టుడిని చేసింది.

**"ఆహార నిద్రా భయ మైధునాని,**
**సామాన్యమే తత్పశుభిర్నరాణామ్,**
**ధర్మోఃతేషాం అధికో విశేషః,**
**ధరేణ హీనాః పశుభిః సమానాః"** (హితోపదేశం)

తిండి, నిద్ర, భయం, సంతానం పొందటం, అనే విషయాలు నాల్గు మానవులకు, పశువులకు సమానమే. కానీ మానవులకు ధర్మము అనే విశేష గుణం ఉంటుందని, అట్టి విశిష్టమైన ధర్మాన్ని ఆచరించని వాడు పశువుతో సమానం అంటారు. అయితే ఏమిటి ఈ ధర్మాలు అని పరిశీలిస్తే భారతీయ సంస్కృతికి జీవన విధానానికి చతుర్విధ పురుషార్థాలు ప్రాతిపదికలుగా చెపుతారు. అవే **"ధర్మార్థ కామ మోక్షాలు"**. ఈ నాల్గు కొన్ని మానవ మనుగడ కొరకు సుఖ శాంతులతో నిర్వహించేవి కాగా, మరణానంతరం ఆత్మకు సంబంధించినవి కొన్ని.

**ధర్మము :**

ధర్మమంటే దానమనే సామాన్య అర్థం. అయితే విస్తృతార్థం విధి, నిర్వహణ. ఏమిటయ్యా ఆ విధి నిర్వహణ అంటే ప్రతి మానవుడు నాలుగు రకాల ఋణాలు కల్గి ఉంటాడని, దేవ, ఋషి, పితృ, భూత ఋణము అని, వీటిని తప్పక తీర్చుకోవటం ధర్మమని చెపుతారు. బుద్ధిని ప్రసాదించినందుకు దైవానికి, జన్మకు కారకులైనందుకు తల్లిదండ్రులకు, మానవ ధర్మాలను నిర్దేశించిన మార్గాలను ఏర్పరచినందుకు ఋషులకు, తాను జీవించటానికి కావలసిన సమస్తాన్ని అందిస్తున్న భూత వర్గానికి., అలాగే గురువు, పెద్దలు, తోటి మానవుల పట్ల అనుసరించవలసిన ధర్మాలు. ఈ ధర్మాలను బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్యాలలో దశలను అనుసరించి పాటించాలని తెలుపుతారు. అందుకే "స్వధర్మో నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అంటాడు గీతాచార్యుడు. మనిషిగా తన ధర్మాన్ని తాను నిర్వర్తిస్తే శ్రేయస్సుని ఇస్తుందని, లేదంటే భయాన్ని కలిగిస్తుందని అంటే వినాశనాన్ని సృష్టిస్తుందని భావం. ఎవరి ధర్మాన్ని వారు నిర్వర్తించకపోవడమే నేడు మనం ఎదుర్కుంటున్న పరిస్థితులకు కారణం.

**అర్థము :**

అంటే ధనము. "ధనమూలమిదం జగత్, సర్వేజనాః కాంచన మాశ్రయంతి" అనే నానుడులు అందరికీ తెలిసినవే. అయితే ఈ ధనార్జన ధర్మ మార్గంలోనే చేయాలని అలా చేయకపోతే ఎలాంటి ఫలితాలను పొందాలో కూడా చెప్పటం కనిపిస్తుంది.

**కామము :**

ఇది లైంగిక వ్యవహారమని సామాన్యార్థం. కోరికయని విశేషార్థము. కోరికలకు కొలమానం లేదు. మంచి, చెడు పనులు చేయడం అనేది కూడా కోరికల ప్రభావమే. ఇది మనసు నుండి పుడుతుంది. అందుకే **"మన యేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః"** అంటారు. అన్ని బంధాలకు, వాటి నుండి విముక్తికి కూడా మనసే కారణం. అందుకే యుక్తాయుక్త వివేచనతో సత్కార్యాలనే చేస్తూ ఉండాలని అంటారు.

**మోక్షము :**

ఇది అందరికీ అంగీకారమైన విషయం కాదు. ఇది అంగీకరించే విషయమా కాదా అనేది ప్రక్కన పెడితే జ్ఞానులు చెప్పేది ఏమంటే మొదటి మూడు పాటిస్తే నాల్గవది అదే సిద్ధిస్తుందని. ఈ నాల్గు పురుషార్థాలను ఆచరిస్తూ ధర్మ బద్ధంగా జీవించడం గూర్చి తెలియజేయబడేదే విద్యగా మనం పరిగణించవచ్చు.

## • నేటి భారతం •

- వడ్ల నారాయణ, పాల్వంచ. ఫోన్ : 9912261400

కం॥ కలియుగ రథ చక్రమిలను
కలికాలపు కులమతాల కంపున మునిగెన్
కలియుగ దైవము కదలక
కలికాలముఁ నిల్చిపోయె కదనపు భీతిన్

కం॥ అణుబాంబుల జగమియ్యది
మన యాటము బాంబుల యుగమై మహిఁనిలచెన్
మిణుగురు పురుగులు తిమిరముఁ
వణకించు విధముఁ వసుధయె వణికెను యువతా!

కం॥ పేరాశ పేక మేడై
ఆరని చిచ్చుగ పెరుగుచు అవనిన్ ముంచెన్
పేరాశ ఉప్పెనలలో
పేరుకుపోయెను కద! నిరుపేదలు యువతా!!

కం॥ రణతంత్రము హద్దు చెరిగి
గణతంత్రపు గద్దెనెక్కి కర్కశ చరితన్
గణతంత్రపు పరిపాలన
గణతంత్రమ్ముగను మార్చె రాజ్యముఁ యువతా!!

పై విషయ సారాంశంగా తెలియవచ్చేది ఏమంటే మానవ జన్మ ఉత్తమ మైందని, దానిని చతుర్విధ పురుషార్థాలు పాటించడం ద్వారా ధర్మాన్ని నిర్వర్తిం చాలని, ఆ ధర్మ నిర్వహణకు ఉపకరించేదే విద్య అని.

భారతీయ వాఙ్మయం ప్రకారం విద్య రెండు రకాలు. ఒకటి భౌతికం, రెండు పారలౌకికం. ఒకటి భౌతికంగా ఉన్నతుని చేస్తే, ఇంకోటి ఆధ్యాత్మికంగా ఉన్నతుని చేస్తుంది. అయితే లోపం ఎక్కడ జరిగింది. నేటి సామాజిక పరిస్థితు లకు కారణం ఏంటి అంటే విద్యను రెంటిని కలిపి అభ్యసిస్తేనే సంపూర్ణ జ్ఞానాన్ని ఇస్తుంది. నేడు అనుసరిస్తున్న భౌతిక విద్యలు మానవ అవసరాలను తీర్చేవే గాని మానవ వ్యక్తిత్వాన్ని పెంచే విధమైన నీతిబోధక, నీతిదాయకమైన జ్ఞానాన్ని ఇచ్చేవి కావు. విద్యవల్ల రావాల్సిన వినయం, అర్హత, ధనము, ధర్మము దాని వలన సుఖము అనేవి రావటం మాట అటుంచి, అహంకారం, తోటి మానవుని పట్ల, సంఘం పట్ల, వృత్తి పట్ల, జీవరాశుల పట్ల, నిర్వర్తించాల్సిన ధర్మాలు అన్నీ నశించే విధంగా ఉంది. ఈ ధర్మాలన్నీ పాటిస్తేనే మనిషి రక్షించబడతాడని **"ధర్మో రక్షతి రక్షితః"** అని అన్నారు ఆర్యులు. పరలోక చింతనకు సంబంధించిన విషయాన్ని ఆచరించకపోయినా పర్వాలేదు. ఇహలోక మనుగడకు అవసరమైన ధర్మాలను ఆచరించటమే నేటి విద్యా విధానంగా ఉండాలి.

ఇక ఆధ్యాత్మిక విద్యను ఆచరిస్తున్న వారైనా ఆరోగ్యకరమైన ఆచరణ చేస్తున్నారా అంటే అది కూడా తీవ్రమైన మత మౌఢ్యానికి, కుల వివక్షతకు, లింగ వర్గీకరణకు ప్రతినిధిగానే నాడు, నేడు కూడా సాగుతోంది. భక్తి భావన మానవ శ్రేయస్సును, ప్రేమ తత్త్వాన్ని పెంచాల్సింది పోయి వర్గ వైషమ్యాలకు దారి తీసే స్థితికి చేరింది. కొన్ని వర్గాల సంకుచిత మనస్తత్త్వ కారణంగా పనికి మాలిన మూఢాచారాలు, కట్టుబాట్లు ఏర్పడి భక్తి అనే భావనకు విశ్వమానవ శ్రేయస్సు అనే మహత్తర ఫలితం దూరం అయిపోయింది. భక్తి అనే పదం 'భజ్' అనే ధాతువు నుండి వచ్చింది. **"భజసేవాయామ్"** అని వ్యుత్పత్తి. భక్తి అనగా పాణిని సంప్రదాయంలో 'సేవ' అని అర్థం. వేదాలలో కూడా భక్తి అన్న శబ్దా నికి 'సేవ' అన్న అర్థమే ప్రధానంగా కనబడుతుంది. **'మహాన్ తె విష్ణో సుమతిమ్ భజామహే '** (ఋగ్వేదం 1-156), **'యస్త విశ్వ ఉపాసతే'** (యజుర్వేదం 25-13) (ఉపాసతే - సేవ). పేదలను సేవించుకోవడంలో భక్తి సాధనంగా ఉన్నదని పండితులు చెపుతారు. **"పూజ్యేషు అనురాగో భక్తిః"** పూజ్యులైన పెద్దల పట్ల గల ఆదరణీయ భావమే భక్తి. భజధాతువుకు సేవ అనే అర్థం అయినపుడు ఆ సేవ మాతృసేవా, పితృసేవా, ఆచార్యసేవా, ఏ సేవ భక్తి అనుకోవాలి అనుకుంటే ఈ మూడూ కూడా భక్తిలో చేరినవే. **"సా త్వస్మి పరమ ప్రేమరూపా"** "నారద భక్తి సూత్రాలు 1-2) భగవంతుని యందలి పరమప్రేమే భక్తి అని నారదుడు నిర్వచించాడు. **"నిజమైన భక్తి ప్రేమ యొక్క సారమే"** '(వివేకానంద - సందేశ తరంగిణి). భౌతిక సంబంధమైనది కాక ఉన్నతమైన భావనలతో కూడిన పరమ ప్రేమే భక్తి. భక్తి ప్రేమలో జనించి, ప్రేమలో వికాసం పొంది, ప్రేమయందు లయం పొందేటువంటి ఉత్కృష్ట లక్షణం కలిగిన శాశ్వత మోక్షమార్గము. అటువంటి భక్తి లభించిన మానవుడు అందరినీ ప్రేమిస్తాడు. అంతటా ఆ భగవంతుని దర్శిస్తాడు. మానవ సేవయే మాధవసేవ అని కదా చెపుతారు. అట్టి పరమార్థానికి దూరం అయిన భావన వ్యర్థ రూపం దాల్చుతుంది.

అయితే సాహిత్యం కానివ్వండి, సమాజం కానివ్వండి ఒకదానితో ఒకటి ప్రభావితం అవుతాయనటానికి నిదర్శనం నాడు ఎలా ఉండాలో చెప్పిన సాహిత్యం, నేడు మానవాళి ఎలా ఉండకూడదో, ఎలాంటి పరిస్థితులను ఎదుర్కుంటున్నామో, తెలియచెప్తోంది. విద్య అంటే పుక్కిటి పురాణం కాదు. మనం ఏం చేస్తున్నాం అనేది తరచి చూసుకుని అందులోని సద్గుణాలను అలవరుచుకోవాలంటే మూలాలోకి వెళ్ళి విలువలను వెతుక్కోవాల్సిందే. సమాజంలో ఎలా మెలగాలి, సభల్లో ఏ విధంగా ఉండాలి, సంసారం ఎలా నిర్వర్తించాలి, సామాజిక విలువలు ఎలా పాటించాలి, సద్గుణాలను ఏ విధంగా సంపాదించాలి, సామరస్యంగా జీవించటం ఎలా, ఇత్యాది అంశాలన్నీ కూడా సాహిత్య ప్రక్రియ ఏదైనా లక్ష్యం ఒక్కటే అనే రీతిలో పాత్రల ద్వారా చెప్పినా, "అపకారికి ఉపకారము", "ఉప్పు కప్పురంబు ఒక్క పోలికనుండు", "దయలేని పుత్రుండు", "అల్పుడెపుడు పల్కు ఆడంబరముగాను", "అనగ ననగ రాగమతిశయిల్లుచునుండు" "కనకపు సింహాసనమున శునకమును కూర్చుండబెట్టిన" వంటి పద్య రత్నాలతో చెప్పినా సంస్కారాలను పెంచుకోవాల్సిన విధానాన్ని తెలిపారు కవులు. విద్యంటే పాండిత్య ప్రదర్శన కాదు, మనిషిని మనిషిలా చూడటం నేర్చుకోవటం అని.

"జనులం బీలిచి పిప్పి జేసెదు దురాచారంబులన్ గాల మ
ట్టని విద్యాబలమేల విద్యయన మౌఢ్యవ్యాఘ్రింకింపైన భో

## ● రాక్షసునికి జేజేలు ●

- బి. నాగేశ్వరరావు, కాకినాడ.

చుట్టాలు, బంధువులు
ఎవరూ లేరనుకున్నాను,
డబ్బూ, దర్పం దరిజేర్చుకున్నాయి !!
లాఠీలు, లూఠీల్లో
చేతులు ముంచాను !
నాయకత్వం నన్నంటుకుంది !!
కబుర్లమ్మాను,
కాసులు రాలాయి,
టాటాలు, బిర్లాలు చుట్టాలయ్యారు !!
సిగ్గూ లజ్జా
గోతిలో పాతాను !
తలపై ఖద్దరు టోపీ మొలిచింది !!
కులాన్ని, మతాన్ని
మండించి వదిలా
ఢిల్లీ కుర్చీలు మర్యాద చేశాయి !!
సంతలో
సంతకాలు పంచాను !
సంచులు పంచలోకొచ్చాయి !!
పదవి, పైసా,
మెడకు బిగుసుకున్నాయి !
నాలో మనిషి మరణించి రాక్షసుడు బ్రతికాడు !!
జనం నాకు జేజేలు పలికారు.




జనమో మోసపు వ్రాత కోతలకు రక్షా బంధమా యెందుకీ
మనుజత్వంబు నొసంగలేని చదువుల్ మైరేయపుం మైకముల్"

అని మనిషిగా మార్చలేని చదువులెందుకు అంటాడు జాషువా.

"మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు"

"మగువలకు మగవారికొక్కటె,
బ్రతుకు సుఖముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును.

'మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయిరప్పల కన్న
కనిష్టంగాను చూస్తా వేల బేలా ?

అని సూటిగా ప్రశ్నిస్తాడు గురజాడ. లోకంలో మంచి చెడు అనేవి రెండే కులాలు, మగ ఆడ అనే భేదం లేదు. ప్రేమను పంచితే ప్రేమను పొందవచ్చు, మనుషులు చేసిన రాళ్ళకు మొక్కటం కన్నా నీ తోటి మనిషిని సమానంగా చూడాలంటాడు.

**"సంస్కారం లేని విద్య మానవత్వం లేని విజ్ఞానం, కృషి లేని సంపద, నైతికత లేని దైవప్రార్థన, సిద్ధాంతాలే లేని రాజకీయాలు, అనుభవం కాని ఆనంద సప్త పాతకాలని, పూజ్య బాపూజీ ప్రవచించారు.**

కనుక ఉత్తమ సంస్కారాన్ని, జీవన విధానాన్ని అలవరుచుకోటానికి మార్గం.

**ఎఱుకగలవారి చరితలు**
**గఱచుచు సజ్జనుల గోష్టి కదల ధర్మం**
**బెఱుగుచు నెఱిగిన దానిని**
**మఱవక కనుష్ఠించునది సమంజస బుద్ధిన్"** (ఆదిపర్వం, 3-203)

అంటాడు నన్నయ. జ్ఞానం కలవారి చరిత్రలను అనుసరిస్తూ సజ్జనులు చెప్పే విషయాలను శ్రద్ధగా విని, తెలుసుకుని, తెలిసిన దానిని మరచిపోకుండా వినయంతో కూడిన బుద్ధితో ఆచరించాలి అంటాడు. ఇలా ఆచరించడం వల్ల ఏమిటి లాభం అనిపించవచ్చు. దానికి జవాబు మనకు

**"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే"** (3-21)

అంటే గొప్పవాడు ఏ పనులు చేస్తాడో, దేనిని ప్రమాణంగా తీసుకుంటాడో దానిని మిగిలిన వాళ్ళు చేస్తారు, ప్రమాణంగా తీసుకుంటారు అని గీతాచార్యుడు చెప్పిన మాటల్లో కనిపిస్తుంది. అందుకు మనకు అనేక నిదర్శనాలు ఉన్నాయి. అనేకమంది మహానుభావులను మనం కాలానికి అతీతంగా గౌరవిస్తున్నాం, పూజిస్తున్నాం. అయితే అది కాదు చేయవల్సింది. వారి మార్గాలను అనుసరించటం, ఆచరించటం, అందుకు ముందు ఉండవలసింది యువతే. ●

## తెలుగు గౌరవం

- ఆచార్య నరేంద్ర, హైదరాబాద్. ఫోన్ : 9247757957

తెలుగు వెలుగుల కన్నీ
చిమ్మ చీకటులేనా?
తెలుగు ప్రాభవం
అంతరించుట తగునా?
నా తెలుగు తల్లి చనుబాలతో
పెరిగి పెద్దనైతిని !
నా తల్లి ఋణం తీర్చుటకై
నేనేమి చేయకుంటిని !
తెలుగుతల్లి ఒడిలోన
మాధుర్యాన్నంతా జుర్రుకుంటి !
ఆమధురమైన భాషలోని
సౌకుమార్యాన్ని ఎవరికీ
లేకపోతే
తెలుగువాడనే నేను!
కన్నతల్లినే గౌరవించనివాడు
తెలుగుతల్లి నేల గౌరవించు !
తెలుగును గౌరవించని వారిని
తెలుగు చెర్నాకోలతో స్పృహ తెప్పిస్తా!
అపుడేకదా నేనూ తెలుగు వాడనని
మురిసిపోతా గర్వంగా !

## మాతృభాషామృతం

- డా॥ పూసల రజనీగంగాధర్, హైదరాబాద్. ఫోన్ : 9290680605

సీ॥ నన్నయ భట్టుచే నడక నేర్చెను భళా !
భారతంబున పసిబాల తెలుగు
తిక్కన కలమున తీయతేనియలూరు
తేట తెనుగుధార పాటవంబు
ఎఱ్ఱన కవివరుండేర్పరించిన యట్టి
సుందరంబైన ప్రబంధ గరిమ
పోతన ఘంటాన పూవువై పూసిన
భాగవత తెలుగు పద్యతోట
తే॥ సీసమల్లిన శ్రీనాథ చేవ తెలుగు
అష్టదిగ్గజ కవిరాజులమర తెలుగు
జానపదులంత మెచ్చిన జాణ తెలుగు
వయసుకన్నియ మనయాడ పడుచు తెలుగు

# మన తెలుగు - వెలుగు

- ఎమ్. ఎల్. ఆర్. రాజేశ్వరి, రాజమండ్రి. ఫోన్ : 9603626267.

తెలుగుభాష చెరకు రసం కంటే తీయనైనది. తేనె కంటే మధురమని కవులచే కీర్తింపబడినది. అటువంటి తెలుగు భాషను మాట్లాడే ప్రజలుగా, తెలుగు బిడ్డలుగా మనం ఈ దేశంలో పుట్టినందుకు గర్విద్దాం. ఈ తెలుగుభాష నిన్నటి మొన్నటిది కాదు. ఇంత కమ్మనైన మన తెలుగుభాష పదవ శతాబ్దానికి ముందే వాడుకలో ఉండేది. ఎన్ని విధాలుగా చూసినా, మన భాష ఎంతో ప్రాచీనతను సంతరించుకుంది. తెలుగుభాష ఎంత కమ్మనైనది. సరళమయినది. అందుచే 'దేశ భాషలందు తెలుగులెస్స' అనే మాటను పదేపదే మనం వింటూంటాం. ఇది శ్రీకృష్ణదేవరాయలచే పలుకబడింది. అయితే నన్నయ కాలం నుండే ప్రాథమికంగా లిపి రూపంలో ఈ భాషకు సంబంధించి గ్రంథాలు వెలువడ్డాయి. అప్పటినుండే తెనుగుకి విశేష ప్రాచుర్యం లభించింది. గ్రాంథిక వ్యవహార భాషగా తెలుగు ఎంతగానో అభివృద్ధి చెందింది. ప్రాచీన సాహిత్యం మీద పరిశోధనలు జరిపిన చరిత్రకారులు, భాషావేత్తలు తెలుగు భాష ద్రావిడ జాతికి చెందిన భాషగా గుర్తించారు.

ఆంధ్ర మహాభారత రచనకు ప్రత్యక్షకారకుడు రాజరాజనరేంద్రుడు. అతని కోరిక మేరకు ఆదికవిగా పేరొందిన నన్నయ భారత రచనకు పూనుకున్నాడు. సంస్కృత మహాభారతాన్ని మక్కికి మక్కీ అనువాదం కాకుండా అందులోని పరమార్థాన్ని తెలుగువారికి అర్థమయ్యేలా అందించాడు. ఈ విధి నిర్వహణలో తిక్కన, ఎర్రన కూడా పాలుపంచుకున్నారు. తెలుగు సాహిత్యంలో కవిత్రయం తర్వాత అంతటి ఖ్యాతిని పొందినవాడు, కవి సార్వభౌమ బిరుదాంకితుడైన శ్రీనాథుడు. స్వతంత్ర కావ్యానునాద పద్ధతిని ప్రవేశపెట్టి సాహిత్యాన్ని ఒక కొత్త మలుపు తిప్పాడు. ఒక తెలుగులో రామాయణాన్ని గద్య పద్యాత్మకమైన కావ్యంగా రూపుదిద్దిన కవయిత్రులలో మొల్ల మొదటిది. ఆమె రాసిన రామాయణం మొల్ల రామాయణంలాగా ప్రసిద్ధి చెందింది. అన్నమయ్య పామరులు సైతం సులభంగా గ్రహించేటువంటి తెలుగుభాషను పదకవితల్లో ప్రయోగించాడు. ఈవిధంగా 16వ శ॥లో శ్రీకృష్ణదేవరాయలు ఎంతోమంది కవుల్ని, పండితుల్ని, విద్వాంసుల్ని తెలుగుభాషాభివృద్ధికి ప్రోత్సహించాడు. యక్షగానాలు, జానపద గేయ వాఙ్మయం ఇలా గ్రామీణంలో ప్రజాబాహుళ్యానికి అందుబాటులో వచ్చేవిధంగా మాటల రూపంలో భాషాభివృద్ధి జరిగింది.

ఇక ఆధునిక కాలానికి వస్తే ఆధునిక కవితకు ఆద్యుడు మన గురజాడ. ఆయన రాసిన ముత్యాల సరాలు (గేయాలు). గురజాడ కథ దిద్దుబాటు మొదటి కథ. అలాగే వ్యవహారిక భాషలో మొదటి నాటకం కన్యాశుల్కం. ఈ నాటకానికి నూరేళ్ళు. గేయాలే కాక నాటకాలు, నాటికలు, కథలను అచ్చమైన తెలుగులోనే అందించారు. వీరేకాక చిలకమర్తి, రాయప్రోలు, గడియారం వెంకటశేషశాస్త్రి, వీరేశలింగం, ఆత్రేయ, శ్రీశ్రీ, జాషువా ఒక్కరా, ఇద్దరా ఎంతోమంది మహానుభావులచే ఈ తెలుగుభాష రకరకాల ప్రక్రియల రూపంలో తీర్చిదిద్దబడింది. తెలుగు పరిపుష్టమయింది. చిరకీర్తిని పొందింది. చిరాయువు నొందింది.

ఏ జాతికైనా మాతృభాష ప్రధానమైనదేగాదు; నిసర్గమనోజ్ఞమైన తమ భావ వ్యక్తీకరణకు అత్యంతముపకరించే భాష మాతృభాష. తల్లిభాష. తల్లి ఒడిలో, తల్లి లాలనలో, జోలలో, లాలిలో బిడ్డ భాషను నేర్చుకుంటుంది.

## • నడవండీ - నడిపించండీ ! •

- ఆర్.కొండా నాయక్, ఎస్ఎస్పి అగ్రహారం. ఫోన్ : 9492081153

ఓ... రచయితా !
శరవేగంగా సాగిపోతున్న కాలం వెంట నీ రచనలను
అతివేగంగా ప్రయాణింప చెయ్యి !
కలాలను పదునైనా కత్తులుగా మలచుకొని
వాడిగా వేడిగా చేసుకొని స్వార్థపరుల సంబరాల్లో
చిక్కుకున్న జనవాహినిని విముక్తులను గావించుటకై పూనుకొను

అమాయకపు మేథాలు కమ్మిన బ్రతుకుల్లో
చైతన్యమనే మెరుపు రేకలను రేకెత్తించటం కోసం
పరిమళిస్తున్న ప్రపంచంలో పరితపిస్తున్న
జనాన్ని మేల్కొలుపుతూ ముందుకు నడిపించు

తల్లిపాల తీయదనాన్ని తెలుగుభాష గొప్పతనాన్ని
ఆశల ఒడిలో విహరిస్తున్న బాల్యాన్ని, మాతృమూర్తి రేపటి తరాన్ని
పీడిస్తున్న విష సంస్కృతిని నాశనం చేయడానికి
అణుతేజంతో నిండిన నీ శరాన్ని సంధించు.

## • తెలుగు భారతి నీకు జయము •

- మిక్కిలినేని హరీశ్, నూజివీడు. ఫోన్ : 9885071311

పల్లవి

తెలుగుతల్లీ నాకు వందనం - తెలుగుభారతి నీకు చందనం
సకల కళల కల్పవల్లికి - సకల జనులు ప్రణమిల్లిరి .....

చరణం

పల్లె పదమె పరిమళించి - రాచనగరులో భరితమాయెను
వికసమాయెను అఖిలమందు - విజయమాయెను వాదమందు
పదకవుల పదనిసలు - భువన విజయపు వన్నె చిన్నెలు
నాటి వీరుని విజయగీతికా - నేడు విశ్వమంతా వెలుగు దీపికా

గోదావరి గలగలలు - కృష్ణవేణి కులుకు హొయలు
ఒద్దియైన పాడిపంటలు - వరములిచ్చెను వనరులెన్నో
అమరావతి, ఓరుగల్లు - అపురూప శిల్ప కళలు
సాటిలేని శిఖర శ్రేణులు - తేజరిల్లెను తెలుగుజాతి

వెన్నుచూపక రొమ్ము విరచిన - ధీరులు మగధీరులు
నుదుట సింధూరం దిద్దిన - వనితలు వీర వనితలు
అమరజీవుని ఆత్మత్యాగం - అంతరించెను ఆంధ్రరాష్ట్రం
వివిధ భాషలు సంగమించిన - భారతీ నీకు జయము
తెలుగు భారతీ నీకు జయము.


అమ్మ లాలి పాట - మన తెలుగు పూల తోట

ప్రతి జీవికి మొదటి గురువు తల్లే. "మాతా స్యాతె ప్రథమో గురు: నాస్తి మాతృ నమోగురు:" అన్నారు. ముల్లోకాలలో తల్లిని మించిన గురువు మరి ఎవ్వరూ లేరు. అందుకే ప్రథమంగా మాతృవందనం చేయమన్నారు. తల్లి గర్భంలో ఉన్నప్పుడే లోల బిడ్డ ఆమె భాషను అలవాటు చేసుకుంటాడు. తెలుగుభాష తల్లి పాలతో సమానం. తల్లి బిడ్డకు ఉగ్గుపాలతోనే తన మాతృ భాషను నేర్పిస్తుంది. అలాంటి మాతృభాషాభిమానం ప్రతివ్యక్తికీ ఉండి తీరవలసిందే. పొరుగు రాష్ట్రాల వారు వారి వారి మాతృభాషను ఎంతో ప్రేమిస్తారు, గౌరవిస్తారు. కానీ మనం ఎంతో గర్వించదగ్గ తెలుగు భాషను మనం ఎందుకు గౌరవించలేకపోతున్నాం ?

మాతృభాషను చక్కగా నేర్చుకుంటే మరెన్ని ఇతర భాషలనైనా సులభంగా నేర్వవచ్చు. నైపుణ్యాన్ని సాధించవచ్చు. శాస్త్ర సాంకేతిక రంగాలలో ఆధునిక కాలంలో ఎన్నో విజయాలు సాధించవచ్చు. అందేకాకుండా మన రాష్ట్ర ప్రాథమిక దశ నుంచే మాతృభాష తెలుగు భాషలోనే విద్య నేర్పడం, పరిపాలనలో, చట్ట సభల్లో, న్యాయస్థానాల్లో తెలుగుభాషా వినియోగం పరిపూర్ణంగా చేయడం అవసరం.

ముఖ్యంగా ప్రజలను ప్రసార సాధనాలు టి.వి., రేడియో, కంప్యూటర్ వంటి వగైరా యాంత్రిక సాధనాలు ఆకర్షిస్తున్నాయి. ముఖ్యంగా టి.వి. యాంకర్లు తెలుగు వచ్చి కూడా రానట్లు ఆంగ్లంలో మాట్లాడతారు. ఇంగ్లీషు మొదలైన ఎన్నో ఇతర భాషలు నేర్చుకోవచ్చు. వద్దనడం లేదు. అయితే మాతృభాష తెలుగును మరువవద్దంటున్నాము. విద్యాబోధనలో, పరిపాలనలో జనజీవనంలో ప్రసార సాధనాల్లో తెలుగుకు ప్రాముఖ్యముండాలి. ప్రథమ భాష గానే గుర్తించాలి. అందుకు ప్రభుత్వం ప్రజలు సమాయత్తమై ప్రోత్స హించాలి. తెలుగు భాషకు ఈనాడు ఏర్పడ్డ ప్రమాదాన్ని తొలగించి, తెలుగు భాషకు సమున్నత స్థానం సాధించవలసిన బాధ్యత. తెలుగువారందరూ అందుకు ప్రయత్నించాలి. తల్లిని ఏవిధంగా గౌరవిస్తామో తల్లి భాషను అదేవిధంగా గౌరవించాలన్నే విషయాన్ని అందరూ తెలుసుకోవాలి. అలాగే ఉపన్యాసాలలో, చర్చా గోష్ఠులలో తెలుగువాళ్ళందరూ తెలుగులోనే ప్రసంగిస్తే, మన తెలుగుభాషా ప్రభావం వెల్లడవుతుంది. కాబట్టి ప్రజలు మాత్రమే కాదు. ప్రభుత్వంలోని అధి కారులు, మంత్రులు, రాజకీయనాయకులు తెలుగులోనే మాట్లాడి తెలుగుభాష కోసం పాటుపడాలి. అప్పుడే మన తెలుగుభాషను గౌరవించిన వాళ్ళౌతాం. అప్పుడే మన తెలుగు వెలుగులు దశదిశలా విరజిమ్మగలవు.

**"తెలుగదేల యన్న దేశంబు తెలుగేను**
**తెలుగువల్లభుండ, దెలుగొకండ,**
**యెల్లనృపుల గొలువ నెఱుగవే బాసాడి,**
**దేశభాషలందు తెలుగు లెస్స!"**

## • జయహో .. తెలుగువాడ .. •

- సయ్యద్ ఖాదర్ భాష, పొదిలి, ప్రకాశంజిల్లా. ఫోన్ : 9492121663

జయహో ఓ తెలుగువాడా ... !
జయము నీకు తెలుగు భాష
శతాబ్దాల చరిత్ర నీది
ఐక్యమవ్వు బేధాలు వీడి
తెలుగు పదానికి వేలయేళ్ళు
తెలుగు పథానికి వెయ్యేళ్ళు
ఐతరేయంలో తొలి వెలుగు
దేశవిశాల్లో నిండు క్రాంతి వెలుగు తెలుగు

పురాణయుగంలో ఆంధ్రపదం
జనవాచకంలో తెలింగపదం
ద్రావిడోత్తర ప్రాంతాలకు తెనుగుపదం
ఓరుగంటి విద్యానాథుని త్రిలింగపదం
పోర్చుగీసు వారినోట జెంటూపదం
ఆధునిక కాలపు అచ్చ తెలుగుపదం
జయహో ఓ తెలుగువాడా .... !
జయము నీకు తెలుగు భాష !

## • ఆలోచించండి •

- వడుగు గోపాలరావు, వరంగల్లు. ఫోన్ : 9951122307

తెలుగుభాషావికాస వత్సరమిది
తెలుగు తల్లీ నీకు పాదాభివందనం

ఆంగ్లభాషపైన మోజు పెరుగుతుండె
తెలుగు పలుకువారు కరువాయె నేడు
అమ్మనాన్న యన్న అర్థమవక పోయె
మమ్మిడాడి అంటు ముద్దుగా పలికె !

రంగురంగుల తోటి ఆంగ్లవత్సర స్వాగతం
తెలుగువత్సరానికి స్వాగతాలు కరువాయె
పట్టుపావడాలు బదులు జీన్స్ టీ షర్టులాయె
ఆడమగకు తేడ తెలియని ఫ్యాషన్లాయె !

తెలుగు బడులలోన చిన్నారులు కరువాయె
ఆంగ్ల చదువుపైన మోజు పెరుగుచుండె
ప్రభుత కూడ మార్చుతుంది సర్కారు బడులను
ఆంగ్ల మాధ్యమ ప్రభుత పాఠశాలలుగ !

# ఓ చక్రవర్తి మాతృభాషాభిమానం

- డా॥ వి. రవిశంకర్, కర్నూలు. ఫోన్ : 9440225207

"మాతృవత్తాడిత వత్సో మాతరమేవానురోదతే" అన్నది చాణుక్యనీతి. అమ్మకొట్టిందని ఏడ్చే పసివాడు "అమ్మా" అనేకదా ఏడుస్తాడంటాడు చాణుక్యుడు. కొట్టినా, తిట్టినా అమ్మ అమ్మేనని, అమ్మతో సమానమైనది సృష్టిలోమరేదీ లేదని విశ్వసించిన జాతిమనది.

ఔరంగజేబు తన వద్దకు వచ్చే ముఖ్యమైన లేఖలకు చక్కగా ఉండే తన దస్తూరితో స్వయంగా సమాధానమిచ్చేవాడట. ఔరంగజేబుకు చిన్నప్పుడు చదువుచెప్పిన 'ముల్లాసాలె' అనే గురువు రాజదర్బారులో తనకేదైనా మంచి ఉద్యోగం ఇప్పించమని విన్నపం పంపితే, దానికి ఔరంగజేబు ఇచ్చిన సమాధానం నాటికి, నేటికీ, ఏనాటికీ విద్యావ్యవస్థకు సరిగ్గా సరిపోయేదే. ఇంతకు ముందే అనుకున్నట్లు విద్యాసంబంధిత విషయాల్లో భాగస్వాములయ్యే ప్రతి ఒక్కరూ ఆలోచించతగిందే. ఆ లేఖ ఇలా ప్రారంభమవుతుంది.

"మీరు నాకు అనావస్యకమైనట్టి అరబ్బీ భాష నేర్పుటయందు బెక్కు సంవత్సరములు నిరర్థకముగ గడిపి కోమలమైన నా బుద్ధిని, తీక్షణమైనట్టి నా స్మరణశక్తిని వ్యర్థపుచ్చితిరి. జీవితము నందెన్నడును ఉపయోగపడని భాష రాజపుత్రులకు నేర్పుటకు పది పన్నెండు వత్సరములు వెచ్చించుటయు, ఆ భాష యందు నన్ను వైయాకరణిగను, ధర్మశాస్త్రజ్ఞునిగను చేయ యత్నించుటయు నెంత హాస్యాస్పదములు. ఉపయోగమైన విద్యలును, జ్ఞానమును బలాకులకు వారి వారి బుద్ధిననుసరించి చిన్ననాడు నేర్పుటయందు కాలము గడుపుటకు మాఱుగా మా గురువుల వారగు మీరు మా బాల్యమును వ్యర్థపుచ్చితిరి గదా?" అని వాపోతాడు.

నిజమే. ఎవరు ఎన్ని భాషలు నేర్చినా, ఎంత పాండిత్యం సంపాదించినా ఆలోచనలకు బీజం మాతృభాషలోనే ఉంటుందన్నది పరిశోధనల్లో వెల్లడైన సత్యం. అలాంటి మాతృభాషలో పిల్లలకి కనీసం ఆలోచించే స్వేచ్ఛను గాని, అవకాశాన్ని గానీ ఇవ్వకుండా, సరిగ్గా మాటలు కూడా రాకముందు నుండే పరాయి భాషల్లో చదువులు కొనసాగించడం దుర్మార్గమే కదా. ఆంధ్రదేశంలో పిల్లలు ఎందుకు పుడుతున్నారంటే అమెరికాకు పోవడానికే అన్నట్లుగా తయారయ్యాయి మన చదువులు.




అన్నప్రాసనని ఆవకాయతో కాకపోయినా, అక్షరాభ్యాసాన్ని మాత్రం ఎ, బి, సి, డి లతో చేయించేద్దామన్నంత ఆదుర్దా ఈ నాటి తల్లిదండ్రులది. ఇదే విద్యావ్యాపారులకి మహత్తరమైన అవకాశాన్ని కల్పిస్తోంది. అంతేకానీ, పసివాళ్ళకు కావలసిందేంటి ? దాన్ని వాళ్ళకు అర్థమయ్యేలా అందించే విధానం ఏంటన్న విషయాల మీద ఏ మాత్రం శ్రద్ధ కనిపించదు. సృజనాత్మకంగా కొన సాగాల్సిన బాల్యాన్ని అందుకు ఏమాత్రం అవకాశం లేకుండా కేవలం బట్టీ పట్టించడంతోనో, అక్షరాలను పదేపదే దిద్దించడంతోనో గడిపేస్తూ, దాన్నే చదువుల పరమావధిగా భావించడం ఎంతమాత్రం క్షమార్హంకాదు. దీనివల్ల పసిమనసులపై అనవసర భారం పడటం తప్ప ప్రయోజనం లేదు. అనవసరమైన విషయాలకు ప్రాధాన్యతనిస్తూ, సాంస్కృతిక, చారిత్రక, భౌగోళిక పరిజ్ఞానాన్ని ఎంతమాత్రం కల్పించని విద్యావిధానాన్ని కూడా ఔరంగజేబు తన లేఖలో ప్రశ్నించాడు.

"అయ్యో! భూగోళ జ్ఞానమా ఏమియునూ లేదు. పోర్చుగలు, హాలండు, ఇంగ్లండు మొదలగు దేశములు కొన్ని కలవనియు, అవి ఆయా స్థలములందు కలవనియు, నాకు నేర్పితిరా? ఆ దేశములు ద్వీపములా, ద్వీపకల్పములా, సమభూమియందున్నవా, లేక ఎత్తు స్థలములందున్నవా యన్న సంగతులు నాకు తెలియవలదా ? చీనా, పారసీకము, పెగు, తర్తారి మొదలైన దేశముల రాజులు హిందూదేశపు బాదుషహా యొక్క పేరు విని గజగజ వణికెదరని నా ఎదుట మీరు చేసిన ముఖస్తుతి వలననే దేశ దేశ చరిత్రములన్నియు నాకు దెలిసిన వనుకొంటిరా ? ఈ జగత్తుమీదున్న వేరు వేరు రాజ్యములెవ్వి ? అందలి

## ● మొక్కలు కావమ్మా ●

- మేడగాని శేషగిరిరావు, ఖమ్మం. ఫోన్ : 9573824946

అవి మొక్కలు కావమ్మా .. ఆ... ఆ
పుడమి తల్లి దేహానికి మొలచిన రెక్కలు ఓయమ్మా
ఆ నింగి నుండి నీటి చుక్కను పిలిచే చేతులు మాయమ్మా
గొప్ప శక్తులు ఓయమ్మా ... ॥ అవి మొక్కలు ॥

ఆదిమయుగమున అలసటగున్న మనిషిని అక్కున చేర్చుకున్నవి
బానిస యుగమున శత్రువుపైన విసిరినట్టి విల్లుంబులైనవి
భూస్వామ్య యుగమున రైతు బిడ్డ నాదుకునే సాధనంబులైనవి
కార్మిక యుగమున దోపిడిపైన ఎత్తినట్టి చంద్రకలైనవి॥ అవి మొక్కలు ॥

ఆకలిగున్న ప్రాణికోటికి అన్నంపెట్టె కల్పతరువులు
తనలో పుట్టిన పండ్ల రసముతో దప్పిక తీర్చే దానమూర్తులు
నీడనిచ్చును గూడునిచ్చును ఆయువిచ్చు ప్రాణ వాయువిచ్చును
నవరసమగు మన సంగీతమునకు వరుసగూర్చి వాయిద్యములైనవి !

భావితరాలకు మొక్కలు పెంచే బాధ్యత మనకు నేర్పించాలి
మొక్కకు మనకు ఉన్న చక్కటి బంధము లెట్లో వివరించాలి
చెట్టు లేక పుట్టగతులే లేవనే సంగతి వారికి తెలియ జెప్పాలి !
మనిషికి ఒక మొక్క నాటమని మానవాళిని తట్టిలేపాలి !!

ఆచార విచారములు, రాజ్యవ్యవహారములు, మతములు నెట్టివి? ఆయా రాజ్యములను గల సంపత్తులను, విపత్తులను, ఆయా దేశము సంపద్విపత్తులలో, ఆ దేశస్థుల యొక్క ఏ యే గుణావగుణముల వలన ఎట్టి యెట్టి మార్పులు గలగినదియు, ఎట్టి మహత్కారణములచే గొప్ప రాజ్యములు తలక్రిందగునదియు అను మహద్విషయములు చరిత్రాధ్యయనము లేకయే మాకెట్టుల తెలియగలవు ? ఈ విషయములు మాకు నేర్పితిరా ? రాజపుత్రులు పైని వర్ణింపబడినట్టి యత్యంతావశ్యకములగు వివిధ విషయములను నేర్చుకొని జ్ఞాన సంపన్నులై తమ బుద్ధిని వికసింప జేయవలయును కావున రాజపుత్రుల యొక్క జ్ఞానార్జన కాలమగు బాల్యదశయందలి యొక్కొక్క క్షణము మిక్కిలి విలువ గలదియని యెఱింగి నా బాల్యదశను మీఱు చక్కగ వినియోగ పఱచితిరా? మీరు నాకు లేనిపోనట్టియు, బుద్ధిని భ్రమింపజేయునట్టియు, లౌకిక వ్యవహారమునకు నిరుపయోగకరమైనట్టియు పరభాషా జ్ఞానము గఱపుటయందే కృతకృత్యుల మైతిమని తలంపలేదా?"

రాజ్య రక్షణభారాన్ని మోయాల్సిన రాకుమారుడు క్షత్రియోచితమైన యుద్ధవిద్యల్ని నేర్చుకోవాలి. దాంతోపాటు వివిధ ప్రాంతాల భౌగోళిక పరిస్థితులు, సంస్కృతికి సంబంధించిన విషయాలమీద అవగాహన కలిగి ఉండాలి. ఆయా రాజ్యాల బలాలు, బలహీనతలు తెలుసుకోవాలి. ఏ రాజ్యం ఎందువల్ల ఎలాంటి ఉత్థాన పతనాలను ఎదుర్కొందో తెలియచెప్పాలి. విలువైన కాలాన్ని సద్వినియోగం చేసుకొనే విధంగా విద్యావ్యవస్థ ఉండాలి కానీ, చదువు నేర్పడం, నేర్చుకోవడం ఏదో ఒక ప్రహసనంగా సాగితే ప్రయోజనం లేదని హెచ్చరించాడు. పైగా ఆయా విషయాలను తనకు నేర్పడానికి గురువుగారు ఎంచుకున్న విధానం కూడా లోపభూయిష్టంగా ఉందని నిందించాడు.

"మొదట పరకీయ భాషనొకదానిని నేర్పి దానిమూలముగా శాస్త్రములు, ధర్మవివేచనము, న్యాయనీతి మొదలైన యావశ్యకములైన విద్యల నేర్పుట సులభమని తలంచితిరా ? ఈ యావశ్యకములగు విద్యలన్నియు మీరు నాకు నా మాతృభాషలోనే నేర్పియుండకూడదా?" అని ప్రశ్నించాడు.

ఔరంగజేబు సంధించిన ఈ ప్రశ్న ఈనాటికీ మన మాతృభాషల విషయంలో భేతాళ ప్రశ్నగానే మిగిలిపోయింది. సమాధానం అందరికీ తెలుసు. కానీ దాన్ని ఒప్పుకోవడానికి మాత్రం ఏవేవో కారణాలు అడ్డం వస్తాయి. ప్రతి నాగరిక జాతి తనదైన భాషలోనే మాట్లాడుకుంటుందన్న మహనీయుల మాటలు మనకెందుకు రుచించట్లేదు. మనది నాగరిక జాతి కాదన్న నమ్మకమే దీనికి కారణమేమో. మాట్లాడుకోడానికిగానీ, చదువుకోడానికి కానీ, దైనందిన వ్యవహారాలు నడపడానికి కానీ ప్రాథమికంగా ఉపయోగపడేది మాతృభాషే. ఆ తర్వాతే తక్కిన భాషలేవైనా. ఈ విషయాన్ని త్రికరణశుద్ధిగా నమ్మి ఆచరిస్తున్న చైనా, జపాన్ లాంటి దేశాలు ప్రగతిపథంలో దూసుకుపోతుంటే, మనం మాత్రం పరాయిభాషా వ్యామోహంలో కొట్టుమిట్టాడుతున్నాం.

'నేను ఔరంగజేబునకు తత్త్వజ్ఞాన శాస్త్రమును నేర్పెదను' అని మీరు నా తండ్రియగు శహజహాను బాదుషహా గారితో నొకప్పుడనియుంటిరి. మీరనేక సంవత్సరములకు బ్రహ్మ, ఆకాసము, ఖటపటములు మొదలైన నీరస శబ్దములచే నేదోయొక విషయము నాకు బోధింపయత్నించినట్టు నాకు జ్ఞాపకమున్నది. ఆ విషయమును గ్రహింపవలయునని నేను పెక్కు పర్యాయములు యత్నించితిని కాని యందువలన నా జ్ఞానభాండరమునకును, రాజ్య కర్తృత్వమునకును ఏమి లాభము కలిగినది ? మీరు తేప తేప యుచ్చరించుచున్నందున నీరసములును, పలుకుటకు కఠినములును అగు ఖటపటాది పదములు నాకు జ్ఞాపకమున్నవి కాని వానితో సంబంధించిన, విషయచర్చ మాత్రము నేను ఎప్పటిదప్పుడు మరచిపోవుచుంటునని మీరెఱుగరా? నేడు ఆ విషయచర్చ జ్ఞాపకమున్నను దానివలన నాకు ప్రయోజనమేమి? ఇట్లు మీరు కోమలమైనట్టి నా బుద్ధిని, చురుకుదనమును వ్యర్థము చేసితిరిగాదె? నిజముగా నిరుపయోగములైనను మీరు ఆవశ్యకములని తలచిన ఈ విషయములు మీరు నాకు నేర్పినందున మీకు మాత్రమొక లాభము కలిగినది. మూఢులును, అజ్ఞానులును అగు మావంటివారికి మీరు సర్వజ్ఞులనియు, సర్వశాస్త్ర పారంగతులనియు,

## • దిగులుపడ్డ దిష్టిబొమ్మలు •

- గాలిపెల్లి చక్రయ్య, చిన్నగూడూరు. ఫోన్ : 9989391425

దిష్టిబొమ్మలు దిగులు చెందాయి
దీనంగా రోదిస్తూ ఉన్నాయి
దొరల పేర్లపై దర్జాగా
రోడ్లపై నిలబడదామనుకొని...
ఎలా ఉండాలంటే అలా తయారై
తీరుగా ముస్తాబయినాయి
అల్లరి చేయకుండా ....
ఎవరు ఎత్తుకుంటే వారి అక్కున చేరాయి
నినాదాల హోరుతో
కార్యకర్తల కోలాహలాన్ని చూసి
పుట్టినరోజు పండుగంటే
ఇలాగే చేస్తారేమోనని మురిసిపోయినాయి !
భ్రూణహత్యల ప్రబుద్ధులు వీరేనని తెలియక
ఎలా ఎగురవేస్తే అలా ఎగిరాయి
పాడెపై పడవేస్తే పడుకొంటూ
(దొరల) దర్జాపేర్లపై యున్న తనకు
దొర మర్యాదలనుకుంది
నలుగురు పాడెను ఎత్తగానే
పల్లకీ ఊరేగింపనుకుంది
కూడలిలలో కూలేసిన కార్యకర్తలను చూసి
గావుకేక వేయాలనుకుంది
నడిబజారులో పరుండబెట్టి
కిరోసిన్‌తో స్నానం చేయిస్తే
కంపు భరించలేక బావురుమని రోదించింది
కొరివి నిప్పు తగిలించగానే
భగ్గుమన్న అగ్నికీలకు
దహనమౌతు రోదిస్తూ
దీనంగా వేడుకుంది
భ్రూణహత్య వేడుకలా
పుట్టగానే చంపేసే
మనుష్యుల చూసి, ఈసడించి
బ్రతికేవారిని చంపే
బద్మాషులు మనుష్యులంటు
బొమ్మల చంపొద్దంటు దీనంగా వేడుకుంది
జంతువులను, పక్షులను
చేలలోన పారతోలు
దిష్టిబొమ్మ కామందును
మనుష్యులు బొమ్మలలో ఆనందించాలంటూ
కాస్తంత బ్రతికించు
బువ్వొద్దు నాకంటు
బ్రతికించగ వేడుకుంది
చంపొద్దని దిష్టిబొమ్మ.

అత్యంత పూజ్యగురువర్యులనియు నిరర్థక గౌరవభావమును కొంతకాలము వఱకు బుట్టింపగలిగితిరి. అందువలన పెక్కు దినముల వఱకు మీ మాటను మేము మన్నించుట తటస్థించెను. రాజులను వ్యర్థముగా స్తుతించుట, సత్యమును తలక్రిందు చేయుట. నక్క వినయములు నటించుట యను గుణములు మాత్రము మీయందు చక్కగ వసించుచున్నవి".

భాషతోపాటుగా, విద్యార్థి స్థాయికి అనుగుణమైన పాఠ్యాంశాలను ఎంపిక చేయడం కూడా ముఖ్యమే. ఒకస్థాయి విద్యార్థులకు ఒకే విధమైన పాఠ్యప్రణాళిక (కామన్‌కోర్ సిలబస్) ఉండాలన్న ఉద్దేశ్యంతో ఏర్పాటైన పాఠ్య ప్రణాళికా సంఘాల సభ్యులు తమ పాండిత్యాన్ని ప్రదర్శించడానికి పుస్తకాలను వేదికగా చేసుకుంటే ప్రయోజనం లేదు. పాఠ్యాంశాలను నిర్ణయించడంలో వ్యక్తిగత అభిప్రాయాలు, ప్రాంతీయాభిమానాలకు చోటు ఉండకూడదు. "అర్థము కానిది వ్యర్థము" అనే స్థాయికి విద్యార్థి చేరితే విద్యాభ్యాస కాలమంతా వృధా అయినట్టే కదా. ఈ విషయాలన్నీ ఓ సామాన్య విద్యార్థి అంతరంగంలో మెదిలినా అవి ఎప్పటికీ బయటికి రాకపోవచ్చు కానీ, ఓ చక్రవర్తికి స్వీయానుభవంలో ఎదురవడంతో ఆయన తన గురువుకు ఘాటుగానే సమాధానమిచ్చాడు.

"మిమ్ముల నేను నా రాజసభయందు, ఒక సరదారునిగ నియమింపవలయునని మీరు కోరితిరి కదా. మీ యొక్క ఏ గుణమును జూసి నేను మీకా పదవినొసగవలయును ? మీరు నాకు రాజకీయ, సైనిక, వ్యావహారిక విద్యలలో నేవిద్య నేర్పితిరని మిమ్ముల నేను గౌరవింతును ? నన్ను నావశ్యకములైన విద్యలలో పారంగతుని చేసియుండిన యెడల సికిందరు (అలెగ్జాండరు) బాదుషహాకు పరమపూజ్య గురువర్యుడగు మహావిద్వాంశుడైన అరిస్టాటిల్ ఎడలగల బూజ్యభావమునే చూపియుందును. అట్టి యుపయోగకరములగు శిక్షగాని, లాభకరములగు విద్యలుగాని నేను మీవలన బడయలేదు. కావున మీ విషయమై గౌరవముగాని, పూజ్యభావముగాని నాకు లేదు. మీరు వచ్చిన త్రోవనే వెళ్ళుడు. మీ పల్లెటూరిలోనే దేవుని స్మరణ చేసికొనుచు కాలము గడుపుడు. మీరు నా రాజసభలో ప్రవేశింపకూడదనియు, మీరెవరో యిచ్చటి వారెవరికిని తెలియకూడదనియు నా అభిప్రాయము".

ఔరంగజేబు గురువుగారి కోర్కెను మన్నించకపోవడం సమంజసమా, కాదా అనే ప్రశ్నకు ఎవరికి తోచిన సమాధానాన్ని వాళ్ళు చెప్పుకోవచ్చు. కానీ బాల్యం నుండే అర్థంకాని చదువుల్ని, అర్థంకాని భాషలో బోధిస్తూ దాన్నే చదువుల పరమావధిగా భ్రమించడం సరికాదన్న సత్యాన్ని గమనించాల్సిన అవసరం లేదనగలమా. ఈ విధమైన వాతావరణంలో పెరిగిన ఏ విద్యార్థైనా భవిష్యత్తులో ఇలాంటి ప్రశ్నలు వేస్తే మనదగ్గర జవాబుందా? ఔరంగజేబు చక్రవర్తి కాబట్టి గురువుకు రాజస్థానంలో స్థానాన్ని నిరాకరించాడు. కానీ సాధారణ విద్యార్థి మనోఫలకంపై తనదైన ఆత్మీయతా ముద్ర వేయలేకపోతే ఇక ఆ విద్యావ్యవస్థ సాధించే ప్రయోజనం ఏముంటుంది ?

చదువుల పరమార్థం ఎప్పుడైతే సంస్కారానికి బదులు సంపాదనగా మారిపోయిందో, మార్కెట్ అవసరాలకు అనుగుణంగా విద్యావ్యవస్థ తయారయిందో అప్పుడే జాతీయతా వైభవం అడుగంటడం మొదలయింది. గ్లోబలైజేషన్ యుగంలో ప్రాంతీయ భాషలను కాపాడుకోకపోతే స్థానిక సాహిత్యంతో పాటు, సంస్కృతి కూడా కనుమరుగయ్యే రోజు ఎంతో దూరంలో లేదని యునెస్కో హెచ్చరిస్తోంది.

అలాకాకుండా ఉండాలంటే అమ్మ ప్రేమ ఎంత సహజమో అమ్మభాష కూడా అంతే సహజమన్న సత్యాన్ని త్రికరణశుద్ధిగా నమ్మి ఆచరణలో పెట్టాలి. మాతృభాషకు విద్యావ్యవస్థలో సముచిత స్థానం కల్పించాలి. అలాకాకుండా చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్నట్లు చేజేతులా మాతృభాషలను నాశనం చేసుకొని, తర్వాత భాషా పరిరక్షణ ఉద్యమాలు చేయాల్సి రావడం స్వయంకృతాపరాధమే కదా!

తెలివికి సంస్కృతమో, మరి
కలిమికి ఆంగ్లేయమో యికం దురకంబో
విలువయిడినేర్చి నీయా
తెలుగెవ్వరి పాలు చేసి తిరిగెద వాంధ్రా ?

అన్న శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి ప్రశ్నకు సమాధానం కావాలిప్పుడు. దేశభాషలందు తెలుగు ఎప్పటికీ లెస్సగా నిలిచి ఉండేందుకు ప్రతి ఒక్కరూ కంకణబద్ధులు కావాలి. భావి తరాలకు గుబాళించే తెలుగు సౌరభాలను ఆస్వాదించే అవకాశాన్ని కల్పించాలి. ఆంధ్రత్వం ఆంధ్రభాష ఎన్నో జన్మల పుణ్యఫలంగా భావించే రోజులు రావాలని ఆశిస్తూ...

!! జై తెలుగు తల్లి !!

## నవ్య సమాజం

- చిలువూరు రవికుమార్, బెంగుళూరు.

ఎందుకో ఎరుగరు
దేనికో తెలియదు
ఆనందం అందానికి
సౌకర్యం పొందాలని
ఊరుకాని ఊరున
సుదూరాలకు పయనం
ఉన్న ఊరు లేదు
కన్నవాళ్ళు కరువు
డాలరు స్వప్నం
కళ్లముందు కదలాడగ
కానరానంది కనికరం
దాగుండదు ధనదాహం
అభివృద్ధి మాటున
అగాధాలెన్నో ...
అవాంతరాలెన్నో .....
అంతరాలు పెంచకుండా
అభివృద్ధిని పంచుకుందాం
అందరం ....
నవ్య సమాజానికి నాంది పలుకుతూ !!

# అది... '2004 ఆగష్టు!!'

నల్లబాటి రాఘవేంద్రరావు, రామచంద్రాపురం

ఆ రోజు,

ఆగష్టు 10, మంగళవారం.... 2004... ఆ ఇంట్లో టి.వి. వార్తలు వినిపిస్తున్నాయి.

"కోల్‌కతాలోని ఆనంద్ అపార్ట్‌మెంటులో ఇప్పటికి పధ్నాలుగు సంవత్సరాల క్రితం పదమూడు సంవత్సరాల హేతల్‌పరేఖ్ అనే పాఠశాల బాలికను మానభంగం చేసి.... దారుణంగా హత్యచేసిన ధనంజయ్ ఛటర్జికి ఎట్టకేలకు ఈ నెల పధ్నాలుగు శనివారం తెల్లవారుఝామున నాలుగు ముప్పై నిముషములకు అతని పుట్టినరోజునే ఉరిశిక్ష ఖరారయ్యింది!"

ఉరిశిక్షకు సంబంధించిన వార్తలన్నీ విని టి.వి. ఆఫ్ చేసింది రుక్మిణి. 'ఏవండోయ్, శ్రీకృష్ణమూర్తి మహాప్రభో నిద్రలేస్తారా. ధనంజయ్‌కి ఉరిశిక్ష ఆగస్టు పధ్నాలుగున తప్పదట!".

"రుక్కూ, నిద్రపోతూనే వార్తలు వింటున్నాగా. మళ్ళీ చెప్పాలా నువ్వు. 1994లో అతనికి సుప్రీంకోర్టు ఉరిశిక్షను ఖరారు చేసినదగ్గర్నుండి ఈ 2004 వరకు ఇదే వింటున్నాం. ఎన్నో పిటిషన్లూ ఎన్నోసార్లు ఉరి వాయిదా... ఈ సారి కూడా ఉరిశిక్ష అమలు కాదు. చూస్తూ ఉండు నాలుగు రోజులేగా.'

'ఏవండీ... మొన్న ధనుంజయ్ సోదరుడు ఉరి రద్దు చేయాలంటూ పిటిషన్ పెట్టాడట. వాదోపవాదాల్లో అది నిలబడలేదట. ఆగస్టు 12 గురువారం ప్రజాప్రయోజన వ్యాజ్యం వేస్తారట. 13న విచారణ చేస్తారటండీ!".

'చెప్పానా, ఇలా చాలా పిటిషన్లు పెడుతున్నారు... పెడతారు. మహాత్ముడిని చంపిన వాడికీ, దేశప్రధానులను బలితీసుకున్న వారికీ, తొమ్మిదిమంది బాలికలను చెన్నైలో దారుణంగా హతమార్చిన ఆటో శంకర్‌కు... ఉరిశిక్ష అన్నారు. అందులో కొందరికి అమలైనాయి. కొందరికి కాలేదు. అలా పెద్ద పెద్ద నేరాలు చేసినవారికే అడపాదడపా అమలైనాయి. దేశం మొత్తం మీద గడిచిన ఏభై ఏళ్ళలో కొన్నివేల ఉరిశిక్షలు ఖరారయ్యాయి. అందులో కేవలం 'ఏభై' మందికే అమలయ్యాయి. అర్థమైందా??

ఇక... ఇప్పుడు కేవలం ఒక అమ్మాయిని రేప్ చేసి, చంపేసిన వాడికి ఉరే! అలా అయితే దేశం అల్లకల్లోలం అయిపోదూ! దేశంలో ప్రతిరోజూ ఇలా చాలా చోట్ల జరుగుతున్నాయి. అంటే ఈ లెక్కల్లో విరామం లేకుండా వరుసగా ఉరితీస్తూనే ఉండాలి... సో.. ఈ టి.వి. వార్త జరగదు. నువ్వు ఆ టి.వి. కట్టేయ్... నేను కాసేపు పడుకోవాలి'.

"ఆ ధనంజయ్ హృదయం కరుడు కట్టిన ఒక మృగం. మీకు ఆ ధనంజయ్ చేసిన నేరం ఎంత చిన్నదిగా కనిపిస్తుందండీ. ఆడదాని జీవితం మీ దృష్టిలో తమలపాకులో వక్క పగలకొట్టి తినటం అంత సులువుగా అనిపిస్తోందా? వేరుశనక్కాయలు నేలకేసి కొట్టి ఆ గుళ్ళు నోట్లో వేసుకున్నంత ఈజీగా అనిపిస్తోందా?? తప్పదు... ఆ ధనంజయ్‌కి ఉరిశిక్ష ఖరారయితేనే గాని మీలాంటి వాళ్ళ మనసులు మారవు."

'నిన్నటి పేపరు వార్త చూసావా! కోల్‌కతాలోని అపర్ణాసేన్, మహాశ్వేతాదేవి లాంటి మహామహులు ఈ ఉరిశిక్షలను వ్యతిరేకిస్తున్నారట! ఇంకా చాలామంది ప్రముఖులు మొత్తానికి ఉరిశిక్షలనే రద్దుచేయమని... రాష్ట్రపతికి వినతి పత్రాలు సమర్పిస్తున్నారట! ఎలా చూసినా ఈ ఉరిశిక్ష అమలు కాదోయ్ చూస్తూ ఉండు'.

'చూద్దాం. నాలుగు రోజులేగా పైకి లేచి కాఫీ తాగండి.'

'సరే... అలాగే... ఈ రోజు టేస్ట్ చాలా బాగుందే!'

## నిజం

- కె.ఎల్. కామేశ్వరరావు, హైదరాబాద్.
ఫోన్ : 9441583506

అద్దం నిజం చెబుతుంది అన్నది
నిజంగా అబద్ధం
కుడిని ఎడమగాను, ఎడమను కుడిగాను చూపించేది
నిజమెందుకౌతుంది?
నిజం నీ అంతరాత్మ అన్నది
నిజంగా నిజం.

హాబీ

బలహీనతకు అందమైన పేరు
హాబీ.
హాబీ ఒక ముళ్ళ గులాబి

కులగోత్రాలు

కులగోత్రాలు, మలమూత్రాలు ఒకలాంటివే
అలాంటివి విసర్జిస్తేనే ఆరోగ్యం
ఒకటి దేహానికి, మరొకటి దేశానికి

## అమ్మ ఘనము

- రాఘవ మాష్టారు, బెంగుళూరు. ఫోన్ : 09741407099

ఉగ్గుపాల నుండి ఉయ్యాలజోలల నుండి
ఊసునేర్పినట్టి కమ్మనైన అమ్మభాషను
ఆవకాయ పప్పు కలగలిపిన రుచుల
రచ్చబండల కబురులాడు రీతుల
పంచె కోక పరికిణీల పలుకరించు మురిపాల
కట్టుబొట్టులతోడ నాకట్టు సాటిలేని మేటిభాషను

సంస్కృతంబులోని తీయని మాటలను
అరవమందు అందమైన నుడులను
కన్నడంబులోని కస్తూరి గంధంబును
కలగలిపి విరిసిన దక్షిణాపథమేలెడు దక్షభాషను

రక్షించుకొనెడి తరుణమాసన్నమాయె
తల్లి ఋణము తీర్చుకొనెడి సమయమాయె
మన తల్లిని మనభాషను రక్షించుకొనగ
మనతనము అమ్మఘనము నిరూపించగ

రండహో ! తెలుగు బిడ్డలార
కదలిరండహో ! వెలుగుదొడ్డలార.

'కనిపెట్టేసారా... ఈ కాఫీ నేనే చేసాను. మన ఇంటి పనులు, వంట పనులు చేయడానికి మీరు వెంకాయమ్మను పెట్టారుగా. ఈ రోజు నుండి ఆవిడ రాదట.'

'మరి నీ నడుం నొప్పితో... ఇక నుండి ఈ పనులన్నీ ఎలా చేసుకోగలవు?.'

'ఏం కంగారులేదు. దానికో పిల్లుందిగా. దాన్ని ఈరోజు నుండే పంపుతుందట.'

'అంత పిల్లుందా...?'

'ఆ... పెళ్ళీడు కొచ్చిందే. డబ్బులేక పెళ్ళి చేయలేకపోతోంది.'

అంతలో...

బైట తలుపు కొట్టిన చప్పుడు కావటంతో రుక్మిణి వెళ్ళి తలుపు తీసింది.

లోపలకొస్తున్న వెంకాయమ్మ కూతురు పద్దెనిమిదేళ్ళ మణెమ్మ! సన్నజాజి తీగెలా నడుచుకొస్తున్నట్లు శ్రీ కృష్ణమూర్తికి అనిపించి... ఆ సీన్ చూసి 'జీడిపాకం' తింటున్నవాడిలా 'లాలాజలం' నమిలాడు!

మణెమ్మకు పనులు పురమాయించి... కాస్సేపటికి భర్త దగ్గరకొచ్చింది రుక్మిణి.

'ఏమండోయ్, శ్రీకృష్ణమూర్తి మహాప్రభో... ఆ అమ్మాయి వచ్చిందిగా... ఏం టిఫిన్ తింటారు... చెప్పండి చేయిస్తాను.'

'ఇప్పుడు తిన్నది చాలు'.

'ఇప్పుడేం తిన్నారు... కాఫీ తాగారు అంతేగా. ఏమిటో ఏదో టెన్షన్‌లో ఉన్నట్టున్నారు... 'ఉరి'... ధనంజయ్‌కి!.' లోపలికి వెళ్ళిపోయింది రుక్మిణి.

కాసేపు పేపరు చదువుతున్నట్టు నటిస్తూ... శ్రీకృష్ణమూర్తి... కిచెన్‌వైపే చూస్తుండిపోయాడు... నేలవారుగా... ఆమె!... చాలా అందగత్తె! అబ్బా ఆ అవయవపొందిక... అబ్బా! ఒకసారి చూస్తేనే మనసు, నరాలు జివ్వున లాగుతూ... అలాగే ఉండిపోతాయి ఎన్నాళ్ళయినా! ఇక ఆమెతో కాపురం చేసేవాడిది ఎంత అదృష్టమో!! నిజంగా ఆమె పద్మినీ జాతి స్త్రీయే! ఆ కళ్ళు... ఆ నడుం... ఆ వక్షద్వయసంపద... ఆ నాభి ప్రదేశం...! వ్వా... పనిమనిషైతేనే పరువాలు వెదజల్లుతున్న బంతిపువులా ఉంది. చాలు ఈ జన్మకు ఆమెనలా చూస్తుండిపోయే వరం దేవుడిస్తే చాలు!!

"శ్రీకృష్ణభగవాన్ పేపరు తిరగబడింది... ఎలా చదువుతున్నారో ఏమిటో..."

మళ్ళీ లోపల్నుండో వచ్చి అంది రుక్మిణి.

శ్రీకృష్ణమూర్తి తన లోకంలోకి వచ్చాడు.

........ ..... ....... .........




ఆగస్టు 12 గురువారం... 2004... మధ్యాహ్నం...

'ఈ రోజు ధనంజయ్ తరపున ప్రజాప్రయోజన వ్యాజ్యం పశ్చిమబెంగాల్ హైకోర్టులో దాఖలైందటండీ!'

'రేపు దాన్ని పరిశీలించి ఉరిశిక్షను తాత్కాలికంగా ఆపేయవచ్చు రుక్మిణీ.'

'అదంతా మీ కల.'

'ఇలా ఎన్నిసార్లు జరగలేదు రుక్కూ... చెప్తే నువ్వర్థం చేసుకోవే. ఆఖరి సెకనులో తలారి 'ఉరిలివర్' నొక్కే సందర్భంలో కోర్టు గుమస్తా పరుగు పరుగున వచ్చి ఇచ్చిన 'కేన్సిల్ ఆర్డర్'తో ఎన్నో ఉరిశిక్షలు ఆగిపోయాయి. ఇది అంతే!'.

వాళ్ళు మాట్లాడుకుంటుండగా పనిలోకి కొంచెం ఆలస్యంగా వచ్చిన మణెమ్మ పరుగులాంటి నడకతో లోపలికొచ్చి కిచెన్‌లో కెళ్ళి కాఫీ కాచి తెచ్చి ఇచ్చింది.

ఓరగా చూస్తూ అందుకున్నాడు శ్రీకృష్ణమూర్తి.

'నీ పేరేంటి?...'

'మనెమ్మండి...'

'మణి... చాలా అందమైన పేరు.'

'మొన్న నేను ఆ అమ్మాయి పేరు మణెమ్మ అని చెప్పానుగా... మళ్ళీ ఎందుకడగుతున్నారు. నువ్వెళ్ళి వంటపని చూసుకోవే.'

"ఉరి... వేస్తాం, వేస్తాం అంటూ ఇలా నేరస్థుడిని సంవత్సరాల తరబడి భయపెట్టడం... 'ఏం జరుగుతోందో' అన్న టెన్షన్‌లో ప్రజల్ని పడెయ్యటం...'.

'ఆగండి. మీరు పొరబడుతున్నారు. చట్టం దృష్టిలో దోషి... నిజంగా నిర్దోషి అయితే అది నిరూపించుకోవడానికి అవకాశం కోసం సంవత్సరాల తరబడి సమయమిస్తున్నారని అనుకోవచ్చుగా.'

## • దేశభక్తి గేయం •

- చలసాని రాజబాబు. ఫోన్ : 9296908650

పల్లవి

నిన్ను మరువలేము, నిన్నెపుడు మరువలేము॥ నిన్ను ॥

మరపురాని భాష, మధురమైన భాష మన తెలుగు భాష
కమనీయభాష, కమ్మని భాష మన తెలుగుభాష
వెన్నెల కురిపించే భాష, వెన్నముద్ద కరిగించే భాష మన తెలుగుభాష
మనసులు హరియించె భాష, మన కీర్తినలుదిశలా
మ్రోగించే భాష మన తెలుగుభాష
నిన్ను మరువలేము, నిన్నెపుడు మరువలేము॥ నిన్ను ॥

అమృతపానములొలికె పాట, ఆనందము అలరించే పాట
మన తెలుగుపాట
మధువులనే గ్రోలినట్టి పాట, మధురమైన భావముతో అలరించే పాట,
మన తెలుగుపాట
కొండలను పిండి చేసె పాట, బండలను కరిగించే పాట,
మన తెలుగుపాట
మన బాధలను మరిపించే పాట, మన దేశగౌరవం,
దేశ విదేశాలలో కీర్తించే పాట మన తెలుగు పాట
నిన్ను మరువలేము, నిన్నెపుడు మరువలేము.

'అసలు 1990లో మానభంగం చేసినవాడు ఈ 2004 వరకూ బ్రతికే శాడు. ఏదోవిధంగా... ఎక్కడో ఓ చోట! 1991లోనే దిగువ కోర్టు విధించిన ఉరిశిక్ష అమలు జరుగుంటే... ధనంజయ్ చచ్చిపోయి... అంటే ఈ 2004కి 13 సంవత్సరాలు అయ్యుండేదన్నమాట. చాలామందికి ఉరిశిక్షలు వేసి యావజ్జీవ కారాగార శిక్షగా మార్చేస్తున్నారు! ఆ శిక్షను కూడా క్షమాభిక్ష పేరున పదేళ్ళని... ఏడేళ్ళని... కుదించి నేరస్థుడిని వదిలేస్తున్నారు! చట్టంలో ఎన్నో లోపాలు. అందుకనే ఈ ఉరిశిక్షలంటే కూడా ఏం భయంలేకుండా పోయిందోయ్! రుక్కూ... ఇప్పుడూ అంతే. ధనంజయ్ కొన్నేళ్ళకే బైటకొచ్చేసి... ఏ రాజకీయ నాయకుడిగానో... ఏ సినీ నటుడుగానో ఎదిగిపోతాడు చూడు.. మనం కూడా అతని మెడలో దండలు వేయడానికి వెళ్ళనూవచ్చు. ఆ రోజు వస్తుంది. మళ్ళీ చెప్తున్నాను. ఈ ఉరిశిక్ష అమలుకాదు.. కాదు... కాదు!.

'ఆయాసపడకండి... ఎల్లుండి ఉరి అమలయ్యాక తీరిగ్గా మాట్లాడు కుందాం. మీరు ఉదయం స్నానం చెయ్యలేదు కదా... బాత్రూంలో మణెమ్మ వేడి నీళ్ళు పెడ్తుందీ... వెళ్ళి ... స్నానం చేసి భోజనానికి రండి.'

స్నానానికి బాత్రూంలోకి వెళ్ళిన శ్రీకృష్ణమూర్తి దగ్గరకు బకెట్టుతో వేడినీళ్ళు తెచ్చిపెట్టబోయింది మణెమ్మ.

'ఇలా ఇయ్యి' అంటూ ఆమె చేతి వేళ్ళను నొక్కుతూ బకెట్ అందుకున్నాడు శ్రీకృష్ణమూర్తి. మణెమ్మ పెదాలే కాదు.. శ్రీకృష్ణమూర్తి పెదాలు కూడా బెదిరినట్లు కదలాడాయి. ఒక్క క్షణం!

మణెమ్మ భారంగా ఊపిరితీసి వదులుతూ... నేల చూపులతో లోపలికి వెళ్ళిపోయింది కంగారుపడి. శ్రీకృష్ణమూర్తి పాకం కారే తాపేశ్వరం కాజా తిన్నవాడిలా తన పెదాలు నాలికతో జుర్రుకున్నాడు.

...... ......... ......... .......

ఆగష్టు 13, శుక్రవారం...

'నిద్ర ఎలాపడుతుంది మీకు. ధనంజయ్‌కి రేపు తెల్లవారు 4-30 నిముషాలకే ఉరిశిక్ష అమలు ఖాయమైపోయిందండీ! ధనంజయ్ పెట్టుకున్న పిటిషన్లనీ... 'ఏకపక్షంగా రాష్ట్రపతి తిరస్కరించటం సబబు కాదు...' అని ధనంజయ్ తరపున న్యాయవాది వాదించినా పని జరగలేదట! ఉరిని యావజ్జీవ కారాగార శిక్షగా తగ్గించమని వాదించీ అలసిపోయాడట!... ఇక ఉరితీతకు లైన్లన్నీ పూర్తిగా తెరుచుకున్నాయండీ! ధనంజయ్ ప్రయత్నాలకు దారులన్నీ పూర్తిగా మూసుకుపోయాయి. మీకు వినబడుతుందా... మిమ్మల్నే శ్రీకృష్ణమూర్తి మహాశయా, ఆ ముసుగు తీసి పైకి లేవండి... ఒక ఆడదాన్ని బలవంతంగా అనుభవించి, హత్య చేసెయ్యటం... ఆవకాయ ముక్క నమిలినంత సులవైపోతే ఎలా?? ఈ రోజుల్లో రోజుకొక్క ఉరిశిక్ష పడితీరాలండీ... తప్పదు.

'రావే మణెమ్మా... ఇంత ఆలస్యమైందే... సరే.. లోపలకెళ్ళి త్వరగా టిఫిన్ చేసి వంట ఏర్పాట్లు చూడు... అదేమిటండీ... ఇంతవరకు దుప్పటి ముసుగుపెట్టి మాట్లాడకుండా ఏదో లోకంలో ఉన్న మీరు సడెన్‌గా పైకి లేచి కూర్చున్నారు... ఏం జరిగింది మీకు??'

'రుక్కూ ఈ ప్రపంచం గురించి నీకేం తెలుసు? ఒక్క నిమిషం కాదు - ఒక్క సెకను చాలు... ఇక్కడ నిద్రలోంచి పైబడి లేచి కూర్చోవాలన్నా... అక్కడ ఉరిశిక్ష రద్దు కావాలన్నా...'

'సరే, మరో రోజు గడపకపోతుందా... ఇప్పుడే ఫోన్ వచ్చిందండీ మా నాన్నగారికి సీరియస్‌గా ఉందట...'

'అయ్యో పాపం, ఊళ్ళోనే కదా... త్వరగా వెళ్ళి చూడరాదూ...'

'నేను అదే అనుకుంటున్నాను. వంట అయ్యాక వెళ్తాను. ఆఫీసు నుండి మధ్యాహ్నం వచ్చి భోజనం చేసేయండి. సాయంత్రం మీరు వచ్చేసరికి మణెమ్మ వచ్చి అన్నీ వండిపెట్టి వెళ్తుంది. దానికి నేనన్ని చెప్పి వెళ్తాను. నేను ఎలాగైనా రాత్రికి వచ్చేస్తా. రాకపోయిన రేపు ఉదయమైనా వచ్చేస్తాను.' అంటూ కంగారుగా వంటింట్లోకి వెళ్ళిపోయింది రుక్మిణి.

........ ............ ........... ........

సాయంత్రం ఆరుగంటలు కావస్తుంది...

'ధనంజయ్ ప్రజాప్రయోజన వ్యాజ్యం కూడా వీగిపోయింది. అతనికి 'ఉరి' రేపు తెల్లవారుఝామున ఖరారైపోయింది. ఏర్పాట్లన్నీ చకచకా 'ఆలీపూర్ సెంట్రల్‌జైలు'లో జరిగిపోతున్నాయి.

## తెలుగు

- గజానన్ తామన్, మంథని. ఫోన్ : 9440211285

నాదు భాగ్యమేమి చెప్ప పలుకు నాది తెలుగు
నాదు జన్మధన్యమవగ వీనులందు తెలుగు
జాతి ధర్మమేదియైన కూర్చుజనుల తెలుగు
చక్కదిద్ది బ్రతుకు మధువులాన జేయు తెలుగు

నా తనువున అణువణువున నెలవైనది తెలుగే !
నాదు హృదయ పీఠిపైన కొలువైనది తెలుగే !
నాదు శ్వాసహాసాలను శాసించును తెలుగే !
నా తలపుల కదలి నన్ను కదలించును తెలుగే !

మా ఇంటను చిరుపాపగ జన్మమెత్తు తెలుగు
మా గేహపు ముంగిలిలో నడక నేర్చు తెలుగు
మా చిన్నారులను గూడి ఆడిపాడు తెలుగు
మాతోనే మనుచు మమ్ము మనజేయును తెలుగు

## మాతృభాష

- డా॥ కాసర్ల రంగారావు, ఫోన్ : 9493122306

స్వాతంత్ర్య పిపాస మాతృభాషా వాత్సల్యం
ఆధునిక పరిశోధనలన్నీ మాతృభాష ఉపయోగితకై మొగ్గడం
మాతృభాష విరివిగా వినియోగం, ఆత్మన్యూనతకు విఘాతం
మాండలికాలన్నీ భాషకు సొగసైన ఆభరణాలుగా అలంకరణం.
ఆత్మ గౌరవ పురస్కారం తూర్పిటాలియన్ భాషకే సొంతం
కంప్యూటర్ ద్వారా తెలుగుకు పునర్వైభవం
ప్రపంచ తెలుగు మహాసభల సంరంభం
తెలుగు "వాడి" తెలుగు "నాడి" భవిష్యత్ జీవనాడిగా పరిణామం
పరిపాలనంతా తెలుగులోనే సాగడం
ప్రజల కొరకు ప్రజల వలన ప్రజలకై మాతృభాషా ప్రజ్వలనం.

టి.వి.లో ఏవో వార్తలు వస్తున్నా శ్రీకృష్ణమూర్తి చెవి కర్ణభేరిని ఆ వార్తలు చేరటం లేదు. అతనిప్పుడు... శుభ్రంగా స్నానం చేసి కొత్త లుంగీ – బనీనుతో బాడీ స్ప్రే ఘుమఘుమలతో పదును తేరిన చురకత్తిలా తయారై కూర్చున్నాడు!

మణెమ్మ అందమైన చీరతో, తలలో మల్లెపూవులతో అందంగా తయారై వచ్చి తలుపుకొట్టే సమయం ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్నాడు.. శ్రీకృష్ణమూర్తి!

ఆమె వచ్చి తలుపుకొట్టగానే తలుపు తీసి... ఆమె లోపలకు రాగానే తీయనైన తేనెలాంటి ఆమె పరువం జుర్రెయ్యాలి! అనేదే అతని ఆలోచనిప్పుడు.

ఏమిటో... ఈ ప్రపంచంలో చాలామంది ఆడవాళ్ళు ఉన్నా ఒక్కో ఆడదాన్ని చూడగానే అదో సరికొత్త అనుభూతి! పరిసరాలను మరచి, కన్నార్పకుండా, సిగ్గుపడకుండా ఆమె అలా వెళ్ళేవైపే చూస్తూ ఉండిపోవాలనిపిస్తుంది.! తనను ఏ బస్సో వచ్చి గుద్దేస్తుంది అన్న భయం కూడా ఉండదు. ఓ పదిరోజుల వరకు ఆ రూపం చెదిరిపోదు – చెరిగిపోదు! బాత్రూంలో, భోజనం దగ్గర, పడుకున్నప్పుడు అదే రూపం వెంటాడుతుంది. అలాంటి అందమైన ఆడదే... మణెమ్మ... మణి... మణి... నిజంగా 'మణే.!'

సమయం ఆరు గంటలయినట్లు గంటలు కొట్టింది అజంతా వాల్ క్లాక్.

శ్రీకృష్ణమూర్తి గుండె దడ పెరిగింది. తన శరీరంలో ప్రతీభాగం తనకు తెలియనట్లుగానే కదలాడుతున్నట్లు... ఊగుతున్నట్లు... కంపించుతున్నట్లు... ప్రకంపించుతున్నట్లు.. అదో ఇది!!.

బైట తలుపు కొట్టిన శబ్దం!!

గబగబా వెళ్ళి వీధి తలుపు తీశాడు శ్రీకృష్ణమూర్తి. ఎదురుగా అందమైన నీలిరంగు చీరతో, తలలో మల్లెల సువాసనతో మణెమ్మ బెదురు చూపులు చూస్తూ... సిగ్గుపడుతూ లోపల కొచ్చేసింది. ఆమె కిచెన్‌లోకి వెళ్ళగానే శ్రీకృష్ణమూర్తి వీధి తలుపు గడియపెట్టేసాడు !

......... ........... ............ ........

ఆ మర్నాడు...... 2004 ఆగస్టు, 14, శనివారం.... ఉదయం ఆరు గంటలు. నిద్రలేచి టి.వి. ఆన్ చేసాడు రిమోట్‌తో శ్రీకృష్ణమూర్తి... మంచంమీద నుండే. వార్తలు మొదలయ్యాయి... చదువుతున్న అతని కంఠం గంభీరంగా ఉంది.

""ఈరోజు ధనంజయ్ జీవితానికి ఆఖరి క్షణాలు ముగిసిపోయాయి! ఆలీపూర్ సెంట్రల్ జైల్లోని తన గదిలోనే స్నానం చేసిన ధనంజయ్... కొత్త చొక్కా పైజామా వేసుకున్నాడు. తర్వాత అతనికి ఇష్టమైన మిఠాయిలు, పెరుగన్నం తిన్నాడు! చేతులు వెనక్కు కట్టేసినా ఎవరి సహాయం లేకుండా ఉరికంబం చేరుకున్నాడు. తలారి నటామల్లిక్ ధనంజయ్ ముఖానికి నల్లని వస్త్రం కప్పి ఉరితాడు బిగించాడు! తన చేతిలో ఉన్న ఎర్రని రుమాలుని మెజిస్ట్రేట్ గాలిలోకి ఊపి, కింద పడేసిన వెంటనే ఉరికి సంకేతంగా భావించి సరిగ్గా తెల్లవారుఝాముున 4–30 నిమిషాలకు తలారి లివర్ లాగాడు! దాంతో ధనంజయ్ శరీరం ఉరికంబానికి నిలువుగా వేలాడపడింది. గిజగిజా తన్నుకులాడుతూ ధనంజయ్ క్రిందకు జారిపోయాడు.

ఇప్పటికి రమారమి పద్నాలుగేళ్ళ క్రితం అతని చేతుల్లో అత్యాచారానికి గురై, హత్య గావింపబడినపుడు హేతల్‌పరేఖ్ అనే ఆ పాఠశాల బాలిక ఇలాగే గిలగిల లాడుతూ ప్రాణాలు వదిలివుంటుందని... అక్కడ చేరిన అందరూ మనసులో అనుకుంటున్నట్టుగా ఉంది వాతావరణం.

ధనంజయ్ మరణించాడని డాక్టర్ ధృవీకరించేంతవరకు ప్రాసిక్యూషన్ ఆదేశం ప్రకారం అరగంటసేపు అతని మెడకు ఉరితాడు అలాగే ఉంచారు.

'ఉరితీయడమైనది... మరణించేంత వరకు శరీరాన్ని వేలాడతీయబడడమైనది...' అని జైలు సూపరింటెండెంట్ రాసి సంతకం చేశాడు. జైళ్ళ జె.జి.పి... బైట ఎదురుచూస్తున్న విలేఖరులకు, వివిధ మీడియా ప్రతినిధులకు చట్ట నిబంధనల ప్రకారమే అంతా జరిగిందని వివరించాడు.

చివరికి కుటుంబ సభ్యులు మృతదేహాన్ని తీసుకోడానికి తిరస్కరించడంతో పోస్టుమార్టం అనంతరం... హిందూ సత్కారసమితికి అంత్యక్రియలు జరిపేందుకు అప్పచెప్పారు. ధనంజయ్ స్వగ్రామం నుంచి ఒక్కరు కూడా ఉరితీతను




## మినీ కవితలు

- జిసనారా, హైదరాబాద్. ఫోన్ : 9247412077

పుట్టింట్లో చెరుకుగడ!
పడకటింట్లో చెరుకురసం !
అత్తింట్లో మాత్రం వంట చెరకు !

క్షణం ... క్షణం .... ముత్యాలసరం !
కాలగమనం !
నడుమ ... నడుమ ... మృత్యువు నల్లపూస,
కనం .... మనం !

పులి .. మనిషిని చంపితే...
ఆహారం !
మనిషి ... పులిని వధిస్తే
సంహారం !

నీకంటే .... చలనం లేని
విత్తనం .. నయం !
మట్టిలో పాతేస్తే ... మొక్కయి
వెలుగుచూస్తుంది ! . మరి నువ్వో?

చూసేందుకు రాలేదు. పద్నాలుగేళ్ళ క్రితం చేసిన మహాపాపం యమపాశంగా వెంటాడుతూ ఆఖరుకి ధనంజయ్ మెడకు చుట్టుకుని బిగుసుకుపోయింది! అతను అందరూ ఉండి అనాథ ప్రేత సంస్కారం పొందాడు. అతని చేతిలో అత్యాచారానికి గురై హత్యగావింపబడిన అమ్మాయి హేతల్‌పరేఖ్ ఆమె ఇరుగుపొరుగు ఈ ఉరితీత పట్ల చాలా సంతోషం వ్యక్తం చేశారు.

ఉరితీసిన నాటాముల్లిక్ ధనంజయ్ లాంటి మదమెక్కిన కాముకులకు ఈ శిక్ష ఏమాత్రం సరిపోదని... ఆకలిగొన్న పులి బోనులోకి ధనంజయ్ లాంటి వాళ్ళను తోసి చంపాలని ఇలాంటి అకృత్యాలకి అదే సరైన న్యాయమని... వ్యాఖ్యానించాడు... కసిగా.

తప్పు చేసిన ప్రతి ఒక్కరూ ఇదేవిధంగా చట్టపరిధిలో శిక్షింపబడకపోయినా ఆ భగవంతుని శిక్షనుండీ ఎప్పటికీ తప్పించుకోలేరనేది మన అమూల్య గ్రంథాల సారాంశం!

ఆ విషయం గ్రహించి ప్రతి ఒక్కరూ.... పరాయి స్త్రీల పట్ల కాముకత్వం ప్రదర్శించక... సత్ప్రవర్తనులు కాగలరని... మా ఆకాంక్ష.'

ఈ వార్తలు మళ్ళీ మధ్యాహ్నం ఒంటిగంటకు వినగలరు... నమస్కారం... మీ 'శ్రీ టి.వి.' ""

వార్తలు విని... ఊహించని ఉరిశిక్ష అమలైపోయినందుకు... నరాలన్నీ శక్తి కోల్పోయినట్లయిన శ్రీకృష్ణమూర్తి స్పృహ తప్పినట్లు అలాగే ఆలోచిస్తూ... ఉండిపోయాడు! టి.వి. 'ఆఫ్' చెయ్యాలన్న విషయం కూడా తెలియటం లేదిప్పుడతనికి!

పదిగంటలు కావచ్చేసరికి రుక్మిణి పుట్టింటి నుండి వచ్చింది. నీరసంగా మంచం మీద పడి ఉన్న భర్తను చూసి ఆశ్చర్యపోయింది! రిమోట్‌తో టి.వి. 'ఆఫ్' చేసింది.

'వార్తలైపోయాయి కదా? ఏదో చెత్త ప్రోగ్రాం వస్తుంది. కట్టకుండా ఏం చేస్తున్నారు. ఆఫీసుకెళ్ళలేదా??' ప్రశ్నించింది.

'టి.వి. కట్టలేదా?.... ఆఫీసు టైం.... దాటిపోయిందా? నా కేమి తెలియటం లేదు. నీరసంగా తలలో అదేదో లాగుంది. కాసేపు పడుకోనియ్ రుక్కూ...'

'ఆ అమ్మాయేది? టిఫిన్ చెయ్యలేదా? ఏమిటండి ఏమైందసలు? తర్వాత పడుకుందురుగాని... ముందు పైకి లేవండి. మణెమ్మ నిన్న సాయంత్రం వంట చేసి వెళ్ళిందా? లేదా? చెప్పండీ...'

'ఆ వచ్చింది. అందమైన నీలిరంగు చీరతో.. తలలో మల్లెల సువాసనతో నిన్న సాయంత్రం ఆరుగంటలకు వచ్చింది.'

'మరి – ఈ రోజు రాలేదా?'

'మామూలుగా ఎనిమిది గంటలకు వచ్చింది. టీ కాసిస్తానంది... నేనే వెళ్ళిపొమ్మన్నాను.'

'అదేమిటి?'

"ధనంజయ్‌ని ఉరితీసేసారు కదా... అందుకని.."

'ఏమిటండీ, పిచ్చిగా... దానికీ దీనికీ సంబంధం ఏమిటి ?'

'ఉంది రుక్కూ... సంబంధం ఉంది. నువ్వు నన్ను క్షమించలేకపోయినా పర్వాలేదు. నిన్న సాయంత్రం ఏం జరిగిందో చెప్పేస్తాను – నా మనసు తేలిక పడుతుంది. మణెమ్మను నిన్న శారీరకంగా నేను చాలా బాధపెట్టాను రుక్కూ...'

'అమ్మో, అమ్మో... ఏం జరిగిందసలు? ఆ అమ్మాయిని ఏం చేసేసారు మీరు?'

'యవ్వనంలో ఉన్న ఒక ఆడదాన్ని పరాయి మగవాడు శారీరకంగా హింసలు పెట్టకూడదు, కానీ, దానికి విరుద్ధంగా మణెమ్మ పట్ల నేను వ్యవహరించాను.'

'ఏం చేశారు దాన్ని? ఇంకా వివరంగా చెప్పండి...'

'మణి... అందాన్ని చూస్తూ ఉండలేకపోయాను. వంటిట్లోకి వెళ్ళి వెనకనుండి ఒడిసి పట్టుకున్నాను. హడలిపోయి కేకలేస్తూ చూసింది. బెడ్‌రూంలోకి బలవంతంగా లాక్కొచ్చి చీరకొంగు లాగేసాను. సిగ్గుపడి మంచం చుట్టూ పరుగెట్టింది. మళ్ళీ ఆ అమ్మాయిని అందిపుచ్చుకొని గట్టిగా ముద్దు పెట్టుకోడానికి ప్రయత్నించాను... మళ్ళీ ప్రయత్నించాను... మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాను.. నా ప్రయత్నాలన్నీ విడిపించుకొని పరుగున వెళ్ళి తలుపు

## నానీలు

- ములుగు లక్ష్మీమైథిలి, వేదాయపాలెం. ఫోన్ : 9441685293

ఎక్కడిది
ఈ ప్రేమపరిమళం ?
మానవత్వ సుమం
విరిసిందేమో !

కాగితం
ఎంత ఓర్పుగలది
కఠిన పదాల గాయాలైనా
భరిస్తోంది

నింగిలో
కానరాని మేఘం
రైతుగుండెలో కమ్ముకొని
కంటినీరై వర్షిస్తోంది

చెత్తకుండీలోన
పసిపాపలు
మగవాడి
నయవంచనకు గుర్తులు

అవినీతి చేపలు
జనసంద్రం నిండా
వలవిసిరే
నేర్పుగలవారేరి?

## జాతి వెలుగు - తెలుగు

- ఎస్.ఎం. సుభాని, గుంటూరు. ఫోన్ : 9490776184

అ .. అమ్మ
ఆ .. ఆవు అంటూ
బిడ్డలంతా ఎదగాలి
తల్లి తనువు ఊగాలి
అక్షరాల మాలలల్లి
తెలుగుతల్లి
కంఠానలంకరించాలి
మమకారం అలంకారమై
తెలుగుతరం వికసించాలి
లలిత లలిత పదాలతో
కమ్మని కవితై ఒదగాలి
పచ్చని ప్రకృతిలో
చక్కని సంస్కృతిలో
పల్లెతల్లి ఒడిలో
జానపదమై సాగాలి
విశ్వమంతా విస్తరించి
విజయపతాకం ఎగరాలి!
మనమంతా ఒక్కటై
అమ్మభాషను
ఆదరించాలి
జాతి గౌరవం
జగమంతా చాటాలి
జాతి వెలుగై తెలుగు
ప్రతిచోట ప్రసరించాలి.

గడియ తీసుకుని వీధిలోకి గబగబా వెళ్ళిపోయింది. అంతకన్నా నా వల్ల ఏ తప్పు పనీ, ఏ పొరపాటు పనీ జరగలేదు! నా ప్రవర్తన కొంచెం హద్దు దాటింది. నా వల్ల ఆ అమ్మాయి నిన్న నరకం అనుభవించింది.'

'ఛీ.. మీరు మనిషి కాదు...'

'కంగారు పడకు రుక్కూ... రాజ్యాంగంలో పరిపాలనా విభాగాలు, కోర్టులు, మీడియా.... సక్రమమైన రూల్సుతోనే పనిచేయాలనుకుంటాయి.! కాని, వాట్లని సక్రమంగా పనిచెయనివ్వడు... మనిషి! పైగా వాట్లని ఇరవై నాలుగు గంటలూ ఆడిపోసుకుంటాడు! నిజానికి అవేవి మారనక్కరలేదు! మనిషే మారాలి... మనిషి బుద్ధే మారాలి... మనిషి మనస్తత్వమే మారాలి!! అదే ఈ రోజు ఉదయం "ఉరితీత" వార్త విన్నాక నాలో జరిగింది!!

నేనొక్కసారన్నాను... రోజూ ఎక్కడో ఓ చోట ఆడపిల్లలను మానభంగం చేసి, చంపేస్తున్నారు... వాళ్ళందరినీ ఉరివేసుకుంటూ పోతే తలారి ఉద్యోగాలకు జనం కొట్టుకు చచ్చేరోజు వస్తుందీ' అని... నిజం... అలాంటి రోజు రావాలి. ఆడపిల్ల శీలంతో ఆడుకొని హత్యచేసే ప్రతి రోగ్‌ని, స్కౌండ్రల్‌ని, స్టుపిడ్‌ని... రోజుకొక్కడిని ఉరితియ్యాలి. చివరికి నన్ను కూడా! అప్పుడు కానీ ఈ దేశం బాగుపడదు!

కామంతో నేను మరో ధనంజయ్‌ని కాకూడదనే ఈ ఉదయం మళ్ళీ వచ్చిన మణెమ్మకు.. ఆ అమ్మాయికిచ్చే జీతం కాకుండా మరో ఐదొందలు ఎక్కువిచ్చి వెళ్ళిపొమ్మన్నాను. ఏడుస్తూ వెళ్ళిపోయింది.

నాలో చచ్చిపడి ఉన్న మానవత్వం ఉరితీత అమలైందన్న వార్త వినగానే ఒక్కసారిగా మేల్కొంది. భయంతో కాదు... బాధ్యతతో!! నిజం... మణి ఇప్పుడు నా "కన్నబిడ్డ"లా నా గుండెల్లో స్థిరపడిపోయినది...' గట్టిగా ఏడ్చేస్తూ భార్య చేతులు పట్టుకుని చెప్పాడు శ్రీకృష్ణమూర్తి.

'తప్పుచేసిన వ్యక్తి పశ్చాత్తాపంతో తనకు తాను శిక్షింపబడటం గొప్ప విషయమే! కానీ, మగవాళ్ళను నమ్మడానికి వీల్లేదు! అసలు... మీ బుద్ధి మళ్ళీ వంకర కాదన్న గ్యారంటీ ఏమిటి? సరే నడవండి. వాళ్ళింటికెళ్ళి మణెమ్మ ఏం చేస్తుందో చూసొద్దాం'.

భార్యతో వీధిలోకి వచ్చాడు శ్రీకృష్ణమూర్తి. కళ్ళల్లోంచి ఉబికి వస్తున్న



కన్నీటి ప్రవాహాన్ని ఆపుకుంటూ!

ఎదురుగా కళ్ళు తుడుచుకుంటూ మణెమ్మ... వాళ్ళింట్లోకే వస్తుంది... అందరూ ఇంటిలోపలకొచ్చారు.

'నన్ను పని మానిపించకండి.. అయ్యగారికి సెప్పండి... అమ్మగారూ... మేం బతకలేకపోతున్నామమ్మా...' అంటూ ఏడుస్తూ ఆ ఉదయమే శ్రీకృష్ణమూర్తి తనకు ఇచ్చి పంపిన ఆ డబ్బంతా రుక్మిణి చేతిలో పెట్టి కిచెన్‌లో కెళ్ళి తన పనిలో మునిగిపోయింది.

'ఏమండీ... మణెమ్మను ఈ ఊర్లోనే ఉన్న మా అమ్మగారింటికి పనిచేయడానికి పంపించేద్దామనుకుంటున్నాను. మీ వల్ల ఓ ఆడదాని జీవితం పాడవ్వకూడదనేదే... నా ఆలోచన.'

'తప్పు చేశాను... ఒప్పుకొన్నాను... మారిపోయాను.. అది... నిరూపించుకునే అవకాశం నువ్విస్తే చాలు! త్వరలోనే మణికి మంచి అబ్బాయిని చూసి పెళ్ళి చేస్తాను. ఆ తర్వాత కన్నతండ్రిలా ఆమె బాధ్యతలన్నీ స్వీకరిస్తాను.'

భర్త మాటలు విన్న రుక్మిణి కొంగుతో తడిబారిన తన కళ్ళను వత్తుకుంటూ, పూర్తిగా గుటకవేసి, అతనివైపు అపనమ్మకంగా చూస్తూనే తనూ కిచెన్‌లోకి వెళ్ళిపోయింది.

శ్రీకృష్ణమూర్తి ఉరిశిక్షపడిన మృతశరీరంలా సిగ్గుతో నిలబడిపోయాడు!!

అది... '2004 ఆగష్టు'!!! ●

## అవినీతిపై నానీలు

- వి.ఎస్.వి. ప్రసాద్, తణుకు. ఫోన్ : 8106320576

అధికార శకంలో
నోట్ల లెక్కింపులు,
అంతకాలంలో
జైలు ఊచల లెక్కలు

అపరాధ రక్షణ
హస్తాలు ఎగరేస్తే,
స్కాముల పక్షులు
ఎగిరిపోయాయి.

అవినీతి దుర్గంధం
అడ్డులేని వ్యాప్తితో
రోగసమాజాన్ని
సృష్టిస్తోంది.

ప్రస్తుత
అవినీతిశక్తి,
మరణానంతరం
నిజాయితీ మూర్తి.

స్విస్ బ్యాంకుల్లో
నల్లలక్ష్మి మూలుగు,
స్వదేశపేదకు
శూన్యమైన వెలుగు



# యువతకు స్ఫూర్తి - వివేకానందుని సూక్తి

రేపాక రఘునందన్, తిరువూరు

నేడు స్వామి వివేకానంద పేరు ఇంతకు క్రితం కన్నా సర్వత్రా అత్యంత వేగంగా, శక్తివంతంగా వ్యాపించటం మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం. ఆయన నేడు విశ్వచింతనా స్రవంతిలో ఒక కార్యాచరణాత్మక మార్పును కల్పించిన వ్యక్తిగా, ఆధునిక ప్రపంచం శ్లాఘిస్తోంది. నూతన వేదాంత ఆవిష్కర్తగా, యోగాచార్యులుగా భారత వినీలకాశాన వేగుచుక్కగా, అంతర్జాతీయంగా భారతదేశ ఔన్నత్యాన్ని, హిందూ మత ఘనతను చాటిచెప్పారు వివేకానందుడు.

లోకంలో అరాచకం తలెత్తి, అధర్మం పోటెత్తి, ఆ సమాజ ఉనికి కనుమరుగయ్యే సమయంలో ఆ దైన్యస్థితి నుండి మనల్ని ఉద్ధరించటానికి ఒక మహా చైతన్యశక్తి ఇలలో ఉద్భవిస్తుందన్న నిజం గీతాచార్యుని ద్వారా మనకు విదితమే. భారతదేశానికి ఆవశ్యకతమైన సంస్కరణలు ఏ మార్గంలో జరగాలో ఆయన ఉపదేశాలు స్పష్టంగా చెప్పాయి.

"ఉన్నదంతా బలవంతంగా తీసి పారవేయడమో, మన సంస్కృతిలోని అంశాలనన్నింటిని నిష్పక్షపాతంగా తూలనాడటం వల్లనో కాదు మన సంస్కరణలు తీసుకురావల్సింది. దానికి బదులు అపరిమితమైన ప్రేమను నాటాలి. ఎనలేని సహనం పాటించాలి"

"విద్యను వ్యాపింపచేయాలి. సహజంగా అభివృద్ధికి కారణమవుతుంది. ఈ అభివృద్ధి బాహ్యంగా ఉత్తేజితమైనది కాక, లోపలి నుండే ఉద్భవించినదై ఉంటుంది. మనం అందించే విద్య కూడా ఈ దృక్పథంతో కూడిన విద్యగా ఉండాలి" అని ఉపదేశించే వారు వివేకానందుడు. కర్మసిద్ధాంతం పేరుతో స్వార్థపూరితంగా ప్రవర్తించే వారికి ఆయన కల్గించిన జాగృతి అసాధారణం. కళ్ళు మూసుకుని పాశ్చాత్య సంస్కృతికీ, ఆచార వ్యవహారాల అట్టహాసాలకూ, పై పై మెరుగులకూ బానిసలు కాకండి అంటూ మాతృదేశం గురించి అధ్యయనం చేయండంటూ జాతికి ఉద్బోధ కల్గిస్తారు వివేకానందుడు.

వ్యవసాయాన్ని శాస్త్రీయరీత్యా కొనసాగిస్తే దేశానికి అనంతమైన లాభాలు ఒనగూరుతాయని భావించేవారు వివేకానందుడు. వ్యవసాయాన్ని వృత్తిగా ఎంచుకోమని ఎవర్నైనా అడిగితే విద్యావంతున్ని, నేను వ్యవసాయం చేయడమా? ఇప్పటికీ దేశమంతా రైతులతో నిండిపోయింది అంటాడు. కాని అది నిజం కాదు. రామాయణం చదవండి. జనకుడు ఒక చేత్తో నాగలి పుచ్చుకుని పొలం దున్నుతూ, మరో చేత్తో వేదాధ్యయనం చేసినట్లు అందులో ప్రస్తావించారు. మన ప్రాచీన మహర్షులు కర్షకులుగా కూడా విరాజిల్లారు అని ఉపదేశిస్తారు ఆయన.

మన భారతజాతి బానిసత్వంలో నలిగిపోవడానికి మన కష్టాలకు ఆంగ్లేయులే కారణమని అనేకమంది దేశ నాయకులు భావించారు. కాని వివేకానందుడు ఈ సమస్యకు మూలకారణం భారతదేశంలో పాదుకున్న 'నిరక్షరాస్యతే' అంటారు. అవిద్య ఎక్కడ తాండవిస్తుందో, అక్కడ దారిద్ర్యం వీరవిహారం చేస్తుంది. దరిద్రంతో బాధపడేవారు తమ ఆకలిని తప్ప ఏ విషయం పట్లా సదవగాహన కలిగి ఉండలేరు. అవగాహనా రాహిత్యమే అన్ని సమస్యలకు మూల కారణమని, అందుకే విద్యావంతలందరూ నిరక్షరాస్యుల్ని విద్యావంతులుగా చేయాలని పిలుపునిస్తారు వివేకానందుడు.

ధారణశక్తిని పెంపొందించుకోవటానికి కావాల్సిన విషయాలను ఎంతో హృద్యంగా ఉపదేశించారు ఆయన. దేహంలో పనిచేసే శక్తులను నియంత్రించటం ద్వారా మానసిక శక్తిని ఇనుమడింపచేసుకోవచ్చని తద్వారా వాటిని మానసిక శక్తిగా, ఆధ్యాత్మిక శక్తిగా మార్చుకోవాలని, అర్థంలేని ఇంద్రియ సుఖాలలో దైహిక శక్తులను వృధాచేస్తే ప్రమాదమని, ఇది మనస్సులోని ధారణాశక్తి సామర్థ్యాన్ని (Rententive Faculty) నశింపచేస్తుంది. ఈ లోకంలో సత్యమొక్కటే శాశ్వతమని నమ్మి దాని నాచరించి మార్గదర్శకుడిగా నిలిచిన మహోన్నత వ్యక్తి వివేకానందుడు. అంధకారం ఆవరించినప్పుడు సత్యాన్ని ఉద్ఘాటించు "అందుకు ప్రతికూలమైనదల్లా అంతరించపోవాల్సిందే ఎందుకంటే ఇదంతా స్వప్నమే కనుక. కష్టాలు కొండంతగా కనిపించినా పరిస్థితులన్నీ భయంకరాలుగా, నిరాశాజనకాలుగా ఉన్నప్పటికీ అవన్నీ మాయే. దానికి భయపడవద్దు - అది తొలగిపోతుంది. దానిని అణచిపెట్టు. అది అదృశ్యమవుతుంది. దాన్ని తొక్కివెయ్యి. అది ఛస్తుంది. భయపడకు" అంటూ ఆశావహ వాతావరణాన్ని మనుషులకు ఆవహింపచేస్తారు స్వామీజీ.

దేశభక్తి భావన ఉపదేశాలు వింటుంటే నరనరాన్న దేశాభిమానం ఉరకలేస్తుంది. 'జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపీ గరీయసీ' భావం నిలువెల్లా పులకింపచేస్తుంది. ఒక సందర్భంలో వివేకానందుడిట్లా అంటారు. "వందలాది విదేశీదాడులను, భిన్నభిన్నమైన ఆచార సాంప్రదాయాల సమ్మేళనం వలన కలిగిన వందలాది విప్లవాలను భరించి నిలిచిన భారతభూమి ఇదే. చెక్కుచెదరని శౌర్యంతోను, వినాశమెరుగని చైతన్య ప్రభలతోను, లోకంలోని ఏ శైల రాజ్యాన్నైనా మించగల్గిన సుస్థిరత్వంతోను నిలిచింది ఈ పవిత్రదేశమే.

పేదలను, పామరులను బహిష్కరించటం వల్లనే భారతదేశం పతనమైనదని, దేశప్రగతి కోసం చేయబోయే ఏ కార్యమైనా వారిని ఉద్ధరించటంతోనే ప్రారంభించాలనే ప్రగాఢ ఆకాంక్ష వివేకానందుడిది. అది మనస్సులో వుంచుకునే పనులకు రూపకల్పన చేయటమే కాక "పేదల పురోభివృద్ధికై డబ్బు సేకరించాలని విదేశాలకు వెళుతున్నాను. అందుకు అవసరమైన డబ్బు వారి నుండే స్వీకరిస్తాను. యుగాల పర్యంతం మహోన్నత నాగరికతను సంతరించుకుని సజీవమై విలసిల్లుతున్న పవిత్రదేశం నుండి పసికందు అయిన ఐరోపా నాగరికత వ్యాపించిన కొత్తదేశానికి వెళుతున్నాను.

## మినీ కవితలు

-బొబ్బిలి జోసెఫ్, సత్తుపల్లి. ఫోన్ : 9989261991

**కట్నం మహిమ**
చదివాడు పెద్ద చదువులు
చేస్తున్నాడు గొప్ప ఉద్యోగం
చేసుకున్నాడు పెళ్ళి
అనాకారి అమ్మాయిని

**పైరవీ 2 కారు**
సరిగ్గా బడికి పోలేదు
సరిగ్గా పాఠాలు చెప్పలేదు
ఎన్నకైనాడు ఉత్తమోపాధ్యాయుడుగా

**తాజావార్త**
అవినీతి
అభ్యర్థికి
పదవి
ప్రమోషన్

భారతీయ నాగరికతను ఆ దేశానికి అందిస్తాను. భారతదేశానికి ఆ దేశపు ఆర్థిక సహాయాన్ని తెస్తాను. ఈ శరీరం రాలిపోయేటంత దాకా ఎముకలు చెల్లా చెదరయ్యే దాకా, నరాలన్నీ చిట్లిపోయే దాకా శ్రమిస్తాను. భారతీయ పేద ప్రజానీకం కోసం అక్కడ నిధులు సేకరించి మాతృదేశానికి తిరిగివస్తాను. ఆ తరువాత పేదల జీవితార్థం సంస్థలు నెలకొల్పి వాటిలో అవిశ్రాంతంగా శ్రమిస్తాను" అనటమే కాక ఆచరించి చూపిన ఆత్మబంధువు వివేకానందుడు.

"మూఢవిశ్వాసాల భారం మీ తలను అణగద్రొక్కుతుంది. మీ సంకుచిత దృక్పథం నుండి బయటికి వచ్చి దృష్టిని విస్తృతం చేయండి. దేశాలు పురోగమించటం చూడండి. మనిషిని మీరు ప్రేమిస్తున్నారా? మీ దేశాన్ని ప్రేమిస్తున్నారా? అయితే రండి. ఉన్నత, ఉత్కృష్ట విషయాల కోసం మనం పాటుపడదాం. వెనక్కి తిరిగి చూడకండి. అది మాత్రం వద్దు. మన ప్రేమకు పాత్రులయినవారు, అత్యంత ఆప్తులు విలపించడం చూసినా వెనక్కి వెళ్ళకండి, చూడకండి, ముందుకు వెళ్ళండి" అంటూ భారతీయ యువత యొక్క దిశానిర్దేశాన్ని శాసించి తన సోదరతత్వ కాంక్షని వ్యక్తం చేశారు.

స్త్రీలకు విద్య అవసరమని భారతదేశంలో మొదటగా ప్రకటించిన కంఠస్వరం వివేకానంద. మనదేశంలోని స్త్రీలను విద్యావంతుల్ని చేయడానికి యదార్థమైన ప్రయత్నాలేమీ జరుగుతున్నట్లు లేదు. పురుషులు తమ పురుషాహంకారాన్ని మరింత అభివృద్ధి పరుచుకోవడానికి విద్యావంతులవుతున్నారు. ఇళ్ళలో వారికి చాకిరీ చేయడానికి తమ జీవిత సర్వస్వం ధారపోస్తూ తమ సుఖదుఃఖాలలో సమంగా పాలుపంచుకుంటున్న స్త్రీలను విద్యావంతుల్ని చేయటానికి బదులు స్త్రీకి స్వేచ్ఛ ఇస్తే ఆమె అభివృద్ధి పథంలో పయనించి పురుషునికంటే అధికురాలు అవుతుందేమోనన్న భయం వల్ల పురుషులు ఆమెను అణగదొక్కే ప్రయత్నం చేస్తుంటే... ఇంకా స్త్రీ సమానత్వం ఎలా సాధిస్తాం. అబలల పట్ల జరుగుతున్న అసమాన ధోరణుల్ని నిరసించిన వ్యక్తిగా గోచరిస్తారు వివేకానంద.

స్వామీజీ భారతదేశంలో చేసిన ప్రసంగాలలోనే కాదు. అన్ని ప్రసంగాలలోనూ ఆయన జీవిత పర్యంతమూ విస్తరించిన ఒక భావన 'మనిషి'. మతమూ, ఆధ్యాత్మికతా, విజ్ఞానమూ, రాజకీయమూ ఇవన్నీ మనిషికి ప్రయోజనకారులుగా మాత్రమే విలసిల్లాలి. మనిషి పురోభివృద్ధికి సహకరించని దేనినీ ఆయన ఆమోదించలేదు. కనుక 'సేవ'ను తారకమంత్రంగా ప్రయోగించారాయన.

సోమరితనంతో నిద్రమత్తులో మునిగివున్న నా దేశస్థులను జాగృతం గావించి వారికాళ్ళమీదే నిలబడేలా చేసి, వారిని నిజమైన మనుషులుగా రూపొందించి, కర్మయోగాగ్నిని వారిలో రగిలించటానికి సంతోషంగా 1000 సార్లు నరకానికి వెళ్ళటానికి సంసిద్ధుణ్ణి. స్వకీయముక్తి గురించి లెక్కచేయక పరులకు ఎవడు సహాయం చేస్తాడో, సేవలందిస్తాడో అతడి సేవకున్ని నేను. నా మాతృదేశానికి నేను చేయవలసిన సేవ ఇంకా పూర్తి కాలేదు. లోకానికి అందించవలసిన సందేశం ఇంకా పూర్తిగా వ్యాపించలేదు. ప్రజలు జాగృతం కావాలి. వారికి కడుపు నిండా తిండి లభించాలి. ఆ తరువాత వారు తమ స్వాతంత్ర్యాన్ని తామే వెతుక్కుంటారు".

పిల్లలను ఏ కారణంగానైనా శిక్షించటం ఆయనకు సుతరామూ నచ్చదు. పిల్లలతో ప్రాంగణంలో ఆడుకోవడమంటే స్వామీజీకి మహాఇష్టం. వారి చేతులు పుచ్చుకుని వృత్తాకారంగా పరిగెత్తి ఆడడంలో ఉత్సుకత చూపేవారు ఆటల సమయంలో వారి జీవన సరళిని ఆయన సూక్ష్మంగా గమనిస్తూ ఆటలు, చదువులాంటి విషయాల గురించి ప్రశ్నించి తెలుసుకునేవారు. పిల్లవాడు భయపడే విధంగా నేను ఏదీ చేయను అనే వారాయన.

భారతదేశ జాగృతి గురించి స్వామీజీ ఇలా ప్రస్తావించారు. "శ్రామికవర్గం వారు భవిష్యత్తులో జాగృతి చెందుతారు. జాగృతి చెందిన భారతదేశం ప్రపంచ పురోగతిలో ఒక కీలకపాత్ర వహిస్తుంది. భారతీయులు తమను తాము మరిచిపోయి, తాము బానిసలం, ఎవరైనా అన్యులు తమను పరిపాలిస్తేనే జీవించగలమనే అజ్ఞాన జాడ్యంలో మునిగి ఉన్నారు. వారిని మేల్కొల్పడం స్వామీజీ ప్రథమ కర్తవ్యం. అలా భారతీయులను మేల్కొల్పడానికి వివేకానందుడు అందించిన మహా మంత్రమే "లేవండి, మేల్కొనండి, గమ్యం చేరేవరకు ఆగకండి" అంటారాయన. ●

## చిన్నీలు

- పల్లంటి వెంకట రామకుమారరావు, విశాఖపట్నం. ఫోన్ : 9441344503

| | | |
|---|---|---|
| చిన్నీలు | బాల్యము | జీవితం |
| మూడేసి | ఆనందం | కష్టాలు |
| మూడులు | మధురం | సుఖాలు |
| కవిత | సమానం | ధైర్యము |
| మమత | కొడుకు | సగము |
| సమత | కూతురు | విజయం |
| దైవము | సహజం | దాంపత్యం |
| మానవ | లాభాలు | మొగుడు |
| రూపము | నష్టాలు | పెళ్ళాము |

## ఆత్మీయస్పర్శ కలిగిద్దాం

- సంపటం దుర్గాప్రసాదరావు, ఖమ్మం. ఫోన్ : 9247873162

పోటీపడే నైపుణ్యం వారి సొత్తు
ఈదే చేప, ఎగిరే పక్షి వారికి స్ఫూర్తి
ఆశావహ దృక్పథం వారి నైజం
భావాలను వ్యక్తపరచలేకపోవడం కాదు వైకల్యం
మా భావాలను అర్థం చేసుకోలేకపోవడం మీ వైకల్యం – వైఫల్యం
అని సూటిగా ప్రశ్నించే వారి ప్రశ్నకు సమాధానం ఉందా మన దగ్గర ???
ఉహూ... లేదు.
ఎందుకంటే...
సకలాంగులమై అన్నింటా చతికిలబడే మనకు
విజయాలతో అన్నింటా దూసుకెళ్ళే వారి మనో నిబ్బరాన్ని చూసినప్పుడు
ఆత్మవిశ్వాసం సాకారమైనట్లు తోచడం లేదూ?
సృష్టికర్తను వె... వ్వె... వ్వె అని వెక్కిరిస్తున్నట్లు లేదూ??
మా వైకల్యాన్ని ఎత్తి చూపి మా వైపు జాలిగా చూడకండి.
అనే వారి చూపుల్లో ఎంతటి గంభీరత – ఎంత ధీరోదాత్తత ???
అందుకే... వారి వద్దకు మనమే వెళదాం... ఆత్మీయ స్పర్శ కలిగిద్దాం
వికలాంగుల సేవ విశ్వమానవ సేవగా భావిద్దాం.
సకలాంగులతో కలుపుదాం... వారి జీవన ప్రగతికి చేయూతనిద్దాం
మన మానవజన్మకు సార్థకతను చేకూర్చుకుందాం.

# కాళ్ళ గజ్జలు

- పుల్లా రామాంజి. ఫోన్ : 9491851349

ఎట్లోగట్లా ఉదయం నుండి సాయంత్రం దాకా కాలం గడిచిపోయింది. ఇంటికెళ్ళుదామని బడిగేటు ముందు బిక్కు బిక్కుమంటూ అమ్మానాన్నల కోసం భుజాన పుస్తకాల సంచి తగిలించుకొని చాలాసేపు ఎదురుచూస్తుంటే ఎవ్వరూ కనిపించలేదు, అటువైపు రాలేదు, "ఇక్కడికి మీ అమ్మా నాన్నలెవ్వరు రారు' నిన్ను ఇంటికి పిల్చుకొని పోరు, నీ గదికి వెళ్ళమని" బడి కాపలాదారుడు చెప్తే తెలిసింది. నన్ను పట్నంలో వున్న ప్రైవేటుబడిలో చేర్పించారని, హాస్టల్‌లో వుంచారని. అప్పుడు నా గుండె బద్ధలై నా కాళ్ళు ఒణుకుతున్నాయి. గల్లు గల్లు... గల్లు... గల్లు

నా కిష్టమైనవేమి తిన్పించరు అడిగినవేమి ఇవ్వరు. గోముచేస్తే బుజ్జ గించరు. ఆకలి కాలేదని పరుగులు దీస్తే చంకను ఎత్తుకొని అమ్మలా, నాన్న మ్మలా చంద్రుని చూపిస్తూ గోరుముద్దలు తిన్పించరు. చేసింది పళ్ళెంలో పెడ్తారు, ఇష్టమున్నా లేకున్నా పెట్టింది తినాల్సిందే, నిద్ర రాకపోతే నా కోసం మేల్కొనే వారెవ్వరు.? కథలు చెప్పమంటే చెప్పే వారెవ్వరు.? హృదికి హత్తుకొని జోకొడ్తూ నిద్రపుచ్చేవారెవ్వరు...? దోమలు కొరికినా, చలివేసినా రగ్గు (దుప్పటి) కప్పు కొన్నది పక్కకు తొలగిపోయినా, మరలా కప్పేవారెవ్వరూ..? అమ్మ గుర్తొచ్చి రాత్రంతా జాగరణ చేసినా, ఆయా లొచ్చి లేపిన సమయానికి ఖచ్చితంగా నిద్రలేవాల్సిందే. తయారు కమ్మన్న సమయానికి తయారుకావాల్సిందే. దొడ్లొ బర్రెలకు పై కడిగినట్లు వరుసబెట్టి ఆయాలు స్నానాలు చేయించి తయారు చేయిస్తుంటే వెన్నులో భయమేస్తుంటే నా కాళ్ళగజ్జలు గుండెదడలా గల్లు... గల్లు... గల్లు...

బాధలతోటి కన్నీటితోటి కాలం కష్టంగా జరిగిపోతోంది. పదిహేను రోజులు ముగిశాయి. బడి ద్వారం ముందు నిల్చుని నా రాక కోసం ఎదురు చూస్తూ అమ్మనాన్నలు ఎక్కి ఎక్కి ఏడుస్తుంటే వాళ్ళపై అసహ్యమేసి కోపమేసింది.

"కావాలని చేసింది చాలక, మీరొచ్చి కపటకన్నీరు కారుస్తారా?" అని లోలోపల అనుకొన్నా కానీ... ఇన్నిరోజులు అమ్మనాన్నలకు దూరమై వారి ప్రేమకు ముఖం వాచి వాళ్ళ ఒడిలో వాలిపోయాను. ఇన్ని రోజులు చనిపోయి మరలా పుట్టినట్లైంది, వాళ్ళని చూడగానే నా కాళ్ళగజ్జలు ఆనందంతో గల్ - గల్ - గల్ - గల్.

సొంత ఊరిని చేరగానే పరాయిదేశం వెళ్ళి వచ్చిన సంతోషం, జేజమ్మ నన్ను చూడగానే చేతులు చాచి ఒళ్ళోకి తీసుకోవాలనే తాపత్రయం నేనేమో మౌనంగా తలవంచుకొని జేజమ్మ ఎదుటే బొమ్మలా నిలబడిపోయాను, నా కాళ్ళ గజ్జలు మౌనం.

జేజినాయన తోటకు పనిమీద వెళ్ళినవాడు నేనొచ్చానన్న వార్త తెలుసుకొని పరుగు పరుగునా ఇంటికొచ్చి "నా చిట్టి తల్లి, నా బంగారు ఏది?" అంటూ ఆత్రుతగా ఆనందంగా వచ్చినవాడు నా మౌనం చూసి, అలగిన బుంగమూతిని చూసి తట్టుకోలేక జలజలా కన్నీరు కార్చారు, నీవు లేక ఇల్లంతా బోసిపోయింది. ఊర్లో జనంలేని స్మశానంలా మన ఇల్లు మారిపోయింది, నిన్ను చూడలేక మేము ఉండలేమంటూ ఇద్దరూ పసిపిల్లలా నాతో ఏడ్వడం మొదలుపెట్టారు అప్పుడు నా కాళ్ళగజ్జలు మౌనం...

అంతలోనే నాన్న కల్గజేసుకుంటూ "పిల్లలు చదువుకోకపోతే చదువులెలా వస్తాయి, వాళ్ళు పెద్ద పెద్ద ఉద్యోగాలకు ఎలా పోతారు" అని నాన్న అంటుంటే, "నిజమే కదా" అని అమ్మ వంతపాడుతోంది. నేనిక వెళ్ళనంటూ భోరున ఏడ్వడం మొదలుపెట్టాను. నన్ను సముదాయించడానికి సర్వప్రయత్నాలు ఆరంభమయ్యాయి.

## "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి"

- యనమాల సుందర్, విజ్ఞానపురం. ఫోన్ : 9032319507

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని
వాళ్ళూ, వీళ్ళూ చెబుతుంటే ...
నిజమే కాబోలు ... అని ...
అమాయకంగా ... నమ్మి .. యిక
ఏ భయం లేదనుకుంటూ ....
బయటికొచ్చింది - "అమానత్ నిర్భయ"
కానీ ... !
భయానికే భయం గొలిపే రీతిలో
రాక్షసి మూకలు రక్కసి కోరలు చాచి
మాటువేసి, కాటువేయ బోతున్నాయని
కలనైనా ఊహించలేకపోయింది ....
"నా దేశం నాణ్యమైన సుగుణాల గని" - అని
మేఘాల్లో మురిసిపోతూ ఉంటే ....
ఆ ... మేఘాల్లో నుంచి వచ్చిన ఉరుములా
విరుచుకుపడ్డాయి ... మానవ మృగాలు
నిశీథిలో ....
ఎన్ని చేతులడ్డం పెట్టి కాచినా -
యిక నిలువలేనంటూ ...
ఆరిపోయింది .... ఆ 'నిర్భయ' జ్యోతి !
తను కాలిపోతూ ... ఆరిపోతూ ...
రగిలించింది ... వేల వేల జ్యోతుల్ని
ఆ రగిలించిన స్ఫూర్తితో ....
నశించిపోతున్న నైతిక విలువల్ని
నిలబెట్టాలని -
పాడైపోయిన ప్రాచీన పునాదుల్ని
పునర్నిర్మిద్దామని -
ప్రతినబూని సాగుతోంది - నేటి నవ యువత ..
మరో మదర్ థెరిస్సా
మరో జీసస్, మరో బుద్ధుడు
తిరిగి జన్మించనంత వరకూ ...
జీవితాలు మోడుబారుతూనే .. ఉంటాయి
ఆకుల్లా ... నేల రాలుతూనే ... ఉంటాయి
అందుకే .. అంటున్నాన్నేను
న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి ...!
న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి ... !!




జేజమ్మ జేజినాన్నా మీరైనా చెప్పండి. నాన్న అత్తయ్య ఎక్కడికి వెళ్ళకుండా మీ దగ్గరే వుండి మన ఊర్లోనే చదువుకోలేదా? వాళ్ళందరూ ఉద్యోగాలు చేయటం లేదా? వాళ్ళు కాళ్ళమీద నిలబడటం లేదా?

"ఆ రోజులు వేరు. ఇప్పుడు ఖచ్చితంగా ఇంగ్లీషు చదువులే చదవాలి. ఇంగ్లీషు చదువులు చదివితేనే డాక్టర్లు, ఇంజనీర్స్, కలెక్టర్స్ ఉద్యోగాలు వస్తాయి. అంతేకాదు నీ కోసం మూడు లక్షల రూపాయలు హాస్టల్ వాళ్ళక ముందు కట్టాం. దయ వుంచి బడికిపోయి చక్కగా చదువుకోయే తల్లి" అంటూ అమ్మా నాన్నలు బుజ్జగించడం మొదలుపెట్టారు. నేను ఎంతగా ఏడ్చి గీపెట్టినా, నిద్ర హారాలు మానినా, పోనని మోరాయించినా దీక్షలు చేసినా, కాళ్ళా వేళ్ళా పడి దీనంగా అడుక్కున్నా, కొంతసేపటికి ఓదార్చుతారు. లేకపోతే నాలుగు తన్ని మరలా అక్కడే హాస్టల్‌లో వదిలేసి వస్తారు. ఇలా చేస్తుంది మీ కోసమే కదా అంటారు, అన్నయ్య అందుకే చదువుకోవడానికి ఊరెళ్ళినప్పుడల్లా ఎందుకు ఏడుస్తాడో ఇప్పుడు అర్థమైంది, నాకు ఇప్పుడూ కూడా నా కాళ్ళగజ్జలు ఇంకా మౌనం. అమ్మానాన్నలకు నాపై ప్రేమతో రాలేదు. నన్ను చేర్పించిన విద్యాసంస్థ కొత్తగా చేరిన విద్యార్థులు ఇంటిబెంగ తొలగించడానికి రమ్మని పిలిపించమంటే నన్ను ఇంటికి పిల్చుకొని వచ్చారు. ఇవన్నీ పక్కింటి వాళ్ళతో అమ్మ అంటుంటే విన్నాను.

సెలవులు దొరికాయని పదిరోజులపాటు పంజరం నుండి విముక్తి పొందిన చిలుకల్లా స్వేచ్ఛగా, హాయిగా స్నేహితులతో కలసి ఆడుకోవడం మొదలుపెట్టాను. తొక్కుడు బిల్లా, డివండార్, ఉప్పాట, ముక్కులుగిచ్చె ఆట, బొమ్మలపెళ్ళి, గవ్వలాట, బారాకట్టా, పామాట, తాడాట, ఉప్పరపెట్లు, అచ్చణ్ణ గాయలు, గాజపప్పలాట, కుంట్యాట, దాగుడుమూతలాట, ఈరాముట్టి, కోలన్నాట, వాకిలికింద చేతులు, వానావానావల్లప్ప ఇలా ఎన్నో ఆటలు ఆడుతూ ఆకలిమరచి ఆనందంగా ఆడుకుంటుంటే పొద్దే తెలియదు. హద్దులే లేవు. ఇవన్ని మా పట్నం బడిలో ఆడుకోవడానికి ఆట స్థలమెక్కడిది, సమయ మెక్కడిది, పట్నం బడిలో ఆటలు లేక నా శరీరం సచ్చుబడిపోయింది. అందుకే నా కాళ్ళ గజ్జలు మోగడమే లేదు. జడ్జిగారు బెయిలు ఇచ్చిన సమయం ముగిసిన తర్వాత మళ్ళీ జైలుకెళ్ళే ఖైదీలాగా ఏ తప్పు చేయని మా పసితనం బడి జైల్లోకి పోయి అక్కడ మగ్గిపోతుంటే మమ్మల్ని పట్టించుకొనే నాథుడెవ్వరు.? మేము స్వేచ్ఛలేక బాధపడుతుంటే మా కన్నీరు తుడిచేవారు ఎవ్వరు? హాస్టల్స్ వద్దని ఇంటి దగ్గరే చదివించమని చెప్పే దేవుళ్ళు ఎవ్వరు..? నా కాళ్ళగజ్జలు ఇప్పుడే మని మోగుతాయి..?

మమ్మేదో తలపై భారం మోస్తున్నట్లుగా మమ్మల్ని హాస్టల్‌లో వదలగానే ఆ భారాన్ని దించుకున్నంతగా నిట్టూర్పు వదిలి చేతులు దుల్పుకుంటున్నారు తల్లిదండ్రులు.

అప్పుడప్పుడు తల్లిదండ్రుల ఉపాధ్యాయుల సమావేశానికొచ్చి 'నీకు మొదటి ర్యాంకు రాలేదేమిటే..? అన్న ప్రశ్నలతో గుచ్చి గుచ్చి అడుగుతారు, మా చిన్ని ముఖాలు చిన్నబోయేలా తిడుతారు. పక్క పిల్లల్ని సాటువా పెట్టి ఆ అమ్మాయిలా నీకూ ర్యాంకు రాకపోతే ఏమి జరుగుతుందో తెలుసుగా అంటూ బెదరిస్తారు, నీకు మొదటిర్యాంకు ఖచ్చితంగా రావాల్సిందే అంటూ ఆదేశించి పోతారు. మా వయసు మా మనసులను అర్థం చేసుకోరు. వాళ్ళ కలల్ని మాపై రుద్ది నెరవేర్చుకోవాలని ప్రతి తల్లిదండ్రి ఇలాగే ఆలోచిస్తున్నారు.

మా బాల్యం చదువుల ఖార్ఖానాలో బందీయై బానిసలాగా బ్రతుకునీడ్వాల్సి వస్తుంది. ఫ్యాక్టరీలలో, గనులలో, పొలంలో పనిచేసే కార్మికులు ఎవ్వరైనా వారికిచ్చిన సమయం పనిచేసి మిగతా సమయంలో కుటుంబ సభ్యులతో సంతోషంగా వుంటారు. మిగిలిన సమయంలో విశ్రాంతి తీసుకొంటారు. మాకు సమయమంటూ ఏదియూ లేదు. నిరంతరం చదువుతూనే ఉండాలి. చదివిన దాన్ని రాస్తూనే ఉండాలి. మరయంత్రంలా దిక్కు దివానంలేని జీవితం. తక్కువ మార్కులు వస్తే ఉపాధ్యాయులు అటు ఇటు చూడకుండా కుళ్ళబొడుస్తారు.

ఒళ్ళుహూనమై ఆహారం సరిగా తీసుకోక అనారోగ్యం పాలైతే అడిగే నాధుడెవ్వరు...? మేమెంత సంతోషంగా వున్నామన్నది కాదు.

మా జీవితమంటే ర్యాంకుల కొలబద్దా. మా ఆనందం కంటే మేము

## • మినీ కవితలు •

- డా॥ బండారు జ్యోతి కృపాచారి, తెనాలి. ఫోన్ : 9848211664

నీలో జ్ఞాన "దీపాన్ని" వెలిగించు
నీ జీవితం వెలుగుమయం
ఎందరికో మార్గనిర్దేశక మౌతుంది.
యౌవనం అందమైన "కల"
మేలుకొని చూసేసరికి కరిగిపోతుంది
ముసలితనం భరించలేని "వల"
తప్పనిది తప్పించుకోలేనిది.
ఆడదానికి స్వేచ్ఛ ఇచ్చిచూడు
అభిమానంతో ప్రాణం ఇస్తుంది
కట్టడి చేయాలని చూశావా
అవమానంతో అంతు చూస్తుంది.
ఆకలిని ఆరగిస్తూ
కన్నీళ్ళలో కడుపు నింపుకునే నిర్భాగ్యులు
దూరంగా విసిరేసిన దుమ్ము రేణువులు
చుక్కాని లేని నావబతుకులు.
ప్రేమ రాహిత్యానికి గుండె శిల అయితే
అదే ప్రేమ తడికి కరిగి నీరవుతుంది
ఓజోన్ పొరకు మాస్క్ వేద్దాం
రాబోవు తరానికి మంచి గొడుగవుతుంది




తెచ్చుకొనే ర్యాంకులే ముఖ్యం, ఆనందం లేని ఈ జీవితాన నా కాళ్ళకు గజ్జెలెందుకని తీసి సంచిలో దాచిపెట్టాను.

మా జేజినాన్న చిన్నప్పుడు చెప్పిన విషయాలు గుర్తొస్తాయి. చదవడం వచ్చిన తర్వాత మహనీయుల చరిత్రల పుస్తకాలు చదవమన్న విషయం పదే పదే గుర్తుకొచ్చినా ఆ పుస్తకాలేవి అందుబాటులో ఉండవు. ఇచట వార్తల పత్రికలు దొరకవు అడిగినా ఇవ్వరు. ముందు ర్యాంకులు తెచ్చుకొమ్మని గుడ్లురిమి చూస్తారు.

నిజంగా పిల్లలపై విద్యపై వున్నది ప్రేమ కాదు. మా పిల్లలను గొప్ప విద్యాసంస్థల్లో చేర్పించామని గొప్పలు చెప్పుకోడానికి చేర్పిస్తున్నారు. గ్రామాలలో ఒకరిమించి ఒకరు పోటీ పడుతున్నారు.

ఆ పిల్లలకు చదువు వచ్చేది, దేవుడికి ఎరుక. తల్లిదండ్రులు మాత్రం గొప్పలకుపోయి అప్పులపాలౌతూ అభాసుపాలౌతున్నారు. ప్రపంచ చరిత్రలను రాస్తున్నది చరిత్రలను సృష్టిస్తున్నది, ప్రజలకు మార్గదర్శి అవుతున్నది. ప్రజలకు అన్ని సేవా రంగాలలో వుండి సేవలు చేస్తున్నది ప్రభుత్వబడుల్లో చదువుకున్నవారు కాదా..?

తల్లిదండ్రులు పరభాష మోజులోపడి తల్లిభాషను వదలి ఆంగ్లం చదివితేనే గొప్పవారు అన్నట్లు భ్రమలో బ్రతుకుతున్నారు. గాంధీ, రవీంద్రనాథ్ ఠాగూర్, సి.వి.రామన్, అబ్దుల్‌కలామ్ లాంటి ఎందరో మేధావులు మాతృభాషలో చదువుకుంటే ఆలోచనలు శక్తులు, ఎంచుకున్న మార్గం, సాధించవలసిన గమ్యం సులువు అవుతుందని నిరూపించారు. అయినా మమ్మీడాడీలకు ఇంకా కనువిప్పు కల్గటం లేదు.

బట్టీ చదువుల్లోపడి వ్యక్తిత్వం, నైతిక విలువలు, బ్రతకాల్సిన తీరు ఏమిటో తెలియదు. చిన్న సమస్య వచ్చినా బెదిరిపోయి, భయపడి ఇంక జీవితమే లేనట్లు ఆత్మహత్యలు చేసుకొంటున్న విద్యార్థులు కోకొల్లలు, పత్రికల నిండా ఇవే.

కళలు, ఆటలవైపు ఆలోచన కలలో కూడా రానివ్వరు. అటుగా పయనిస్తే ర్యాంకులు తగ్గిపోతాయని బ్రతుకు నాశనం అవుతుందనే భయం, భయం ప్రతి తల్లిదండ్రికి.

మేమెంచుకున్న లక్ష్యాలకు విలువే ఉండదు. మా ఆలోచనలకు గుర్తింపు ఇవ్వరు. పెన్ను నుండి అన్నింటిని వారి ఇష్టానుసారం కొనిస్తారు. వారికి నచ్చిందే చేర్పించి చదివిస్తారు.

లక్షలకు లక్షలు ఫీజులు ప్రైవేటుబడులు వసూలు చేసినా ఆ బడులు ఎలా ఉన్నాయో ఎలా నడుపుతున్నారో ఓసారి చూడరు. చదువంటే అంగట్లో అమ్మే సరుకైపోయింది. ఇష్టానురాజ్యమై పేద ప్రజలకు దూరమయింది. విద్యార్థులు పరీక్షల్లో ర్యాంకులు సాధించినా జీవితంలో ఉత్తీర్ణత కాలేక తప్పిపోతున్నారు. హాస్టల్లో చదివిన విద్యార్థులు తల్లిదండ్రుల పట్ల ప్రేమలు తరిగి ముసలివారైన తర్వాత వృద్ధాశ్రమాల్లో వదిలేస్తున్నారు.

తల్లిదండ్రులు పిల్లలకు నేర్పిన పాఠం పిల్లలు బట్టీపట్టి తూ.చ తప్పకుండా మరలా అప్పగిస్తున్నారు. ఈ తప్పెవ్వరిది తల్లిదండ్రులది కాదా...

మా బాల్యకథలు వ్యథలు ఎన్నని చెప్పుకోము ఎవ్వరికని చెప్పుకోము.

హాస్టల్ సిబ్బందికి చెప్పకుండ, అమ్మానాన్నలకు తెలియకుండా ఈ చదువులు చదవలేక ఇంటికి ప్రయాణమై అన్నీ సర్దుకొని ఊరికి వస్తుంటే మార్గమధ్యంలో బస్సు చెడిపోతే, కిటికీ ప్రక్కన పొలంలోకి చూస్తుంటే పచ్చనిపైర్లు, పిల్లగాలి, ఎగిరే పక్షులు గంతులేసే లేగదూడలు, ఋతువుల క్రమంలో పండిన పండ్లు ఆ ప్రకృతి రమణీయత ఎంత సుందరం.

చెదిరిన జుట్టుతో లేగదూడలతో పాటు సీతాకోకచిలుకలు పట్టుకొంటూ గుట్టల్లో తిరుగుతూ, కాలువల్లో ఈదుతూ స్వేచ్ఛాపక్షియై ప్రకృతిలోనే పాఠాలు నేర్చుకొంటూ జీవితం మహారాణిలా అనుభవిస్తున్న ఆ పాపను పిలిచి నా సంచిలో నున్న నా కాళ్ళ గజ్జెలు ఆ పాపకిచ్చాను.

నా సంచిలో ఇన్నేళ్ళు మౌనంగా రోదిస్తున్న నా కాళ్ళగజ్జెలు ఆ పాప కాళ్ళకు చేరగానే నదిలో పారే నీటిలా పురివిప్పి ఆడే నెమలిలా, నిండుగా ఎండి ఊగుతున్న తుమ్మకాయలులాగా, సూర్యోదయాన పిట్టల కిలకిలా రావాలుగా, ఆ గజ్జలు మోగుతుంటే నా కళ్ళవెంట కన్నీరు పారి నేలకు రాలిపోయింది. స్వేచ్ఛలేని జీవితం, ఆటలకు అవకాశంలేని బ్రతుకులో నా కాళ్ళకు గజ్జెలెందుకని.. ?

## అల్లరి మూకల పంజా

- కె. సీత.

ఆవేశంతో, ఆక్రందనతో, ఆక్రోశంతో,
హృద్భావనతో, ఉద్వేగంతో, అవివేకంతో
ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏ అలజడైనా
గుర్తొచ్చేది పల్లెవెలుగు (బస్సు) నేనే నా మిత్రమా?
సమ్మెలు - ఉద్యమాలు - ఘోరావులు
ఉగ్రవాదం - నక్సలిజం - ఫ్యాక్షనిజం
తనకు చిర్రెత్తినా - సర్కారుపై గుర్రెత్తినా
చితికిపోయేది - ఛిద్రమయ్యేది నేనే నా మిత్రమా?

నా రూపం కష్టజీవి రక్తపు బొట్టు
బిక్షగాని ఆకలికేక - సర్కారు పన్ను
రైతు చెమట చుక్క - కార్మికుని కల
నా దారి - నా ఆశ - నా వృద్ధి, నా ప్రగతి మీది
ఉద్వేగంతో విద్వేషంతో అజ్ఞానాంధులై
నన్ను తగలబెట్టి - మీరు తగలబడుతున్నారు మిత్రమా

నన్ను ధ్వంసం చేసే ముందు ఒక్కసారి ఆలోచించు
పల్లె వెలుగు - ప్రగతి వెలుగు - మీ సారథి
నీ ముందడుగు కోసం నన్ను రక్షించండి
అల్లరిమూకల పంజా నుండి రక్షించండి
మిత్రమా ఓ మిత్రమా !

# ఆధ్యాత్మికత - సామాజిక ఆవశ్యకత

- కొమాండూరి రాజ్యలక్ష్మి, విజయవాడ. ఫోన్ : 9293120015

శాంతి, సహనం మనిషికి అందాన్నిచ్చే ఆభరణాలు. వాటిని విస్మరించ రాదు. 'మౌనేన కలహం నాస్తి' అనే సూక్తిని అనుసరించి ఒకరు కోపముగా ఉన్నప్పుడు, మరొకరు శాంతముగా ఉంటే కాలమే అంతా చల్లబరుస్తుంది. అలాంటి శక్తి ఈ సమాజంలో ఉండాలంటే ఈనాటి యువతీ యువకులు, ఆధ్యాత్మిక మార్గం అనుసరించి, సమాజశ్రేయస్సుకు దోహదపడవలసిన అవసరం ఎంతైనా ఉంది.

సకల చరాచర జీవరాశిలో మానవజన్మ ఉత్కృష్టమైనది. ఎన్నో జన్మల పుణ్యంగా లభించిన మానవజన్మను సార్థకం చేసుకోవాలంటే, ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథములు, సిద్ధాంతాలు ఆచరణలోకి తేవాలి. ఎవరు దానిని అనుసరించినా, ఏ మార్గంలో ప్రయాణించినా సరియైన గమ్యమునకు మానవుడు చేరుకుం టాడు... అన్నీ తానే చేసుకుంటున్నానని భావిస్తూ, అంతటా నేను, నాది అన్న అహంకారాన్ని ప్రదర్శిస్తూ ఉండేవారు మనకు నిత్యము ఎదురవుతూనే ఉంటారు. ఐశ్వర్యం, డాంబికం, ఆర్భాటం, ఇతరుల పొగడ్తలతో మనసును రంజింపచేసుకునే వారు అన్నిచోట్ల మనకు దర్శనమిస్తుంటారు. 'నేనైతే' అంటు తనే ఎంతగొప్పవాడినన్న అహంభావముతో నిండిపోతున్న సమాజంలో, గురువు 'ఆచార్యదేవోభవ' అనే సూక్తి ప్రకారం భగవంతుడే గురువుగా, ఆచార్యుడుగా, జన్మించి మానవాళికి, హితోపదేశము చేస్తూ ఉంటాడు.

ఈనాటికి సమాజానికి "భగవద్గీత" ముఖ్యమైనది. దీనిని నిత్యము పారాయణ చేయువారు సత్ఫలితములను పొందుటయే కాకుండా, "కామము క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యములు" అనే గుణములకు లోనుకాకుండా, జీవితాన్ని సుఖమయము చేసుకోవచ్చు.

ఇప్పుడున్న సమాజంలో కర్మానుభవం వింతగా ఉన్నది. దొంగతనం చేయటం నేరం. దొంగశిక్ష అనుభవిస్తాడో లేదో కాని; అది పోగొట్టుకున్న వాడు మాత్రం ఏడుస్తూనే ఉంటాడు. ఒకరు దేశద్రోహంతో బాంబులు పెడితే, ఎందరో అమాయకులు మరణిస్తారు. ఇదంతా గమనిస్తే, ఒకరి కర్మకు మరొకరు బలి అవుతున్నట్లుగా తెలియడం లేదా? వాల్మీకి మహర్షి, ఇటువంటి అనుమానాలను శ్రీమద్రామాయణంలో చక్కని రూపకల్పన చేసి యుద్ధకాండలో చూపించినారు. సేతునిర్మాణం జరిగినది. వానరులంతా లంకలో దగ్గరలోవున్న త్రికూట పర్వతం మీద కూర్చుని వున్నారు. లంకానగరం స్వర్ణమయంగా అక్కడికి దర్శనమిస్తోంది, ఇదంతా చూసి శ్రీరాముడు, సుగ్రీవునితో 'ఏకో హి కురుతే పాపం కాలపాశ వశం గతః' ఒకరు పాపం చేస్తే పాపం అతని వంశమంతటిని నశింపజేస్తుంది.

రావణుడు సీతామాతను అపహరించాడు. ఇది అన్యాయమని చెప్పిన విభీషణుడిని వెళ్ళగొట్టాడు. మంచి మాటలు చెప్పిన (అంగదుడు) రాయబారిని తిరస్కరించాడు. తన వారంతా నెత్తీ, నోరు కొట్టుకుని చెప్పినా వినక జగన్మాత సీతమ్మకు క్షోభ కలిగించాడు. ఫలితం వంశనాశనం. పాపం చేసింది రావణుడు. ఫలితం అనుభవించి ప్రాణములను కోల్పోయినది సోదరులు, కొడుకులు, మిత్రులు, బంధువులు, సైన్యము. చివరకు తన ప్రాణమును పోగొట్టుకొనినాడు. మంచియైనా, చెడుయైనా దాని ఫలితం అందరూ సమానంగా పంచుకోవాల్సిందే. ఎవరి వాటా వారిదే. అన్ని ధర్మశాస్త్రాలు కర్మానుభవాన్ని గురించి నిర్మొహమాటంగా చెబుతున్నాయి. కాబట్టి ఈనాటి సమాజం మంచి కర్మలను సద్బుద్ధితో ఆచరించటానికి తోడ్పాటునందించాల్సిన అవసరము ఎంతైనా ఉన్నది. అదేవిధంగా చెడు కర్మలను ఐకమత్యంగా వ్యతిరేకించాలి. ఈ కార్యక్రమములు ఎవ్వరు చేసినా మనము కూడా మనవంతు శ్రమించాలి. దీనికి ఆధ్యాత్మికత ఉపకరిస్తుంది.

భారతీయ సనాతన ధర్మము అనుభవైకవేద్యమైన ఈ జీవనవిధానము తరతరాల వారసత్వ సంపదగా మనకు లభించిన మహానిధి. వేద, ఉపనిషత్, పురాణములు మనము అన్వయించుకోవలసిన తీరును చక్కగా చాటుతున్నవి. ఆచార్య, అతిథి సేవలు చేయడం మనము చేసుకున్న పూర్వజన్మ సుకృతం. సదాచారుడైన గృహస్థుడు, అతిథిగా వచ్చినవారు తమను ఉజ్జీవింపచేయు వారా? కాదా? అని చూడక సత్కారము చేయడం ధర్మం అని చేస్తూ వుంటాడు. ఆచార్యులైనా, గురువులైనా మన ఇంటికి వచ్చినప్పుడు విధేయతతో వుండాలి. అల్లసాని పెద్దన మనుచరిత్రలో 'ఆశ్రయం కోరివచ్చిన అతిథి పెరటి కల్పవృక్షం' అని వర్ణించారు. ఆశ్రయము ఇవ్వటం ద్వారా మనకు శుభములు కలుగు తాయని చెబుతున్నారు. రాకపోకలు, ఇచ్చిపుచ్చుకోవటాల వలన మనుష్యుల మధ్య అనుబంధాలు, ప్రేమలు మరింత బలపడతాయి. ఈ బంధం, బంధు త్వాలు నిలవాలంటే పెద్దలు అనుసరించిన ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణించాలి.

ఆధ్యాత్మికత అనేది మానవత్వములోని అంతర్భాగమే. నావాళ్ళు చాలా మంది వున్నారు అనే స్థితి మనిషికి ఎంతో ధైర్యాన్ని, శక్తిని ఇస్తుంది. మనస్సులోని భావాలు, ఆలోచనలు, కష్టసుఖాలు ఇతరులతో పంచుకోవడం వలన మానసిక బాధపోయి ఆరోగ్యము కూడా కుదుటపడుతుంది అని శాస్త్రవేత్తలు చెబుతు న్నారు. ముఖ్యముగా తన భావాలను ఇతరులకు వ్యక్తము చేయు యోగ్యత ఒక్క మనిషికి తప్ప మిగతా ఏ ఇతర జీవికి లేదు. దీనివల్లనే మనిషి సమాజంపై, ప్రకృతిపై కొంత ఆధిపత్యాన్ని సాధించగలుగుతున్నాడు. తిండి, నిద్ర, కనుట, తిరుగుట చేసే జీవిని 'బ్రతికి' ఉన్న జీవిగా భావిస్తారు. అయితే నేనెవరు?

## భద్రాచల గేయం

- గాదె తులసిదాస్, భద్రాచలం. ఫోన్ : 9032319507

భద్రాచల ప్రాంతమా బాధ్యత కూర్చెడి వరమా
గోదావరి వీరజనుల గిరిజన సంస్కృతి వినుమా ॥ భ ॥

తంత్రిమాట జవదాటక తనువును సాగించడమే
విద్య యొక్క ఘనతయని వినిపించెడి పుణ్యస్థలమా ॥ భ ॥

పోడుకొట్టి బీడుదున్ని పాటుపడే గిరిజనులు
పండినంత పంటవరకే పాయసమని భావించెడి ॥ భ ॥

గిరిజనాభివృద్ధియే గణనమందు నిలుపుకొని
సాగించెడి సంస్థ ఉన్న సాధకులకు నిలయమా ॥ భ ॥

అభివృద్ధిని పొందడమే అందరి కోరిక వినుమా
అజ్ఞానము తొలగజేయు అక్షర లక్ష్యమే సుమా ॥ భ ॥

అని ఆలోచన చేసి సమాధానము అన్వేషిస్తూ బ్రతికితే దానిని ఉజ్జీవించుట అనవచ్చు. ఇటువంటి వారు మాత్రమే ఆధ్యాత్మిక మార్గంలోకి వెళ్ళగలరు. ఇది ఒక్క మనుష్య జన్మకే సాధ్యము.

ప్రకృతి వైపరీత్యాలను ఎలా తట్టుకోవాలి, ఎలా తమకు అనుకూలంగా మలచుకోవాలి అనే విషయాలు మనుష్యుల కన్నా పశుపక్ష్యాదులకే బాగా తెలుసు. శరీరాన్ని ఎలా స్వాధీనంలో ఉంచుకోవాలో, ఇతర జీవులతో ఎంత వరకు కలిసి ఉండాలో, క్రమశిక్షణ నేర్పకుండగానే శరీరంతో పాటే అల వడవలసిన గుణమని, చీమ నుండి ప్రారంభించి, పశుపక్ష్యాదులకు, అన్నింటి కంటే మనుష్యులకు బాగా తెలుసు.

ఒక సైంటిస్టు ఒక నదీతీరాన చేరి, అక్కడ పడవ నడిపేవాడు కనిపిస్తే పడవ ఎక్కి, పడవను నదిలో నడపమన్నాడు. పడవవాడు నడుపుతున్నాడు. సైంటిస్టు పడవ నడిపేవాడిని ఒక ప్రశ్న వేశాడు. ఏమోయ్ చిన్న ఇసుక రేణువు నీళ్ళలో వేస్తే ఎందుకు మునిగిపోదు అని సైంటిస్టు అడిగాడు. తెలియదు. అన్నాడు పడవ నడిపేవాడు. అయితే నీ జీవితం వ్యర్థం. నీవు ఎందుకు పనికిరావు అన్నాడు సైంటిస్టు. కొంతసేపటికి పడవ నది మధ్యలో రాళ్ళ ప్రాంతములో వచ్చింది. గాలి పెరిగింది. అలలు లేస్తున్నాయి. పెద్ద పెద్ద కొండరాళ్ళు వుండడం వల్ల పడవ అదుపు తప్పి పగిలిపోయేటట్లుంది.

అప్పుడా పడవ నడిపేవాడు సైంటిస్టుని అయ్యా! మీకు ఈదటం వచ్చునా? అని అడిగాడు. ఎందుకు అన్నాడు సైంటిస్టు. పడవ మునిగిపోతుంది. మనం నీళ్ళలో ఈదితే తప్ప బ్రతకలేం. ఇప్పుడు ఈ నీళ్ళలో ఒడ్డుదాకా పడవ చేరదు. క్రింద రాళ్ళమయం. నదిలో ప్రమాదకరమైన జంతువులు ఉండవచ్చు. అందువలన మనం ఈదుకుంటూ ఒడ్డుకు పోవలసిందే అన్నాడు. సైంటిస్టుకు తలమీద పిడుగు పడ్డట్లయింది. అమ్మో, నాకు ఈత రాదు, ఇప్పుడు ఎలా అన్నాడు. అప్పుడు పడవవాడు సైంటిస్టుతో అయ్యా ఇంతవరకు మీరు అడిగినవి నాకు తెలియదు, నాకు చదువు రాదు, మీరు అడిగిన వాటి గురించి నాకు తెలియకపోయినా ప్రమాదం లేదు. కాని ప్రస్తుతం నీళ్ళల్లో ఈదడం మాత్రం తెలియవలసిన విషయం. మీకు వచ్చిన విద్య మిమ్మల్ని రక్షించదు. ఈతజ్ఞానమే కావాలి అని చెప్పి, పడవనడిపేవాడు ప్రమాదం నుంచి తప్పించుకున్నాడు. సైంటిస్టు అన్ని చదువులు చదివినా పడవ నదిలో పగిలిపోవటం వల్ల మరణించాడు. దీనిని బట్టి మనం నేర్చుకోవాల్సింది ఒక్కటే. మానవుడికి భగ వంతుడు ప్రసాదించిన శరీరమనే నౌకతో ఈ సంసారమనే ప్రపంచసాగరాన్ని సులభంగా దాటటానికి ఆధ్యాత్మిక మార్గం సులభం అవుతుంది.

గాంధీ మహాత్ముడు, స్వామి వివేకానందుడు సైతం భగవద్గీత యొక్క ఔన్నత్యం గురించి ఈ విధంగా వివరించారు.

**గాంధీ మహాత్మ** : సంకటములు సంప్రాప్తించినప్పుడు, సంశయము నన్నావ రించినప్పుడు నేను భగవద్గీతను చదువుదును. అందులోని ఏదో ఒక శ్లోకము నన్ను ఊరడించును. తత్ఫలితంగా విపత్కర పరిస్థితియందు కూడా నా ముఖముపై చిరునవ్వు తాండవించుచుండును. నేను ఒడుదుడుకులతో ఉన్నప్పుడు, నేను సంకటములను ఎదుర్కొనవలసిన పరిస్థితి వచ్చినప్పుడు అవి యెవ్వియూ నా మనంబున లేక, అశాంతి కలగకుండుట, గీతా ప్రభోదము యొక్క సత్ఫలితమే.

**స్వామి వివేకానంద** : గీతలో ఏ ఒక్క శ్లోకము చదివినా, గీత మొత్తము చదివినంత ఫలితము మానవుడు పొందగలడు. గీతయొక్క సందేశమంతయు ఒక్క శ్లోకములోనే ఇమిడియున్నది.

*"క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్వయ్యుపపద్యతే*
*క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప."*

అర్జునా! అధైర్యము పొందకుము. పిరికితనము నీకు తగదు. నీచమగు నీ హృదయ దౌర్బల్యము వీడి, కర్తవ్యమునకు పూనుకొనుము.

ఈ విధముగా మేధావులైన దేశ నాయకులు సైతము, ఆధ్యాత్మిక మార్గ మును అనుసరించి కీర్తి ప్రతిష్టలు పొందిరి. కనుక ఆధ్యాత్మిక మార్గంలోనే ఈనాటి సమాజశ్రేయస్సు ముడిపడి ఉన్నది.

సర్వేజనాః సుఖినోభవంతు.

## గిడుగు అడుగు లేవి ?

- సాదనాల వేంకటస్వామి నాయుడు, ఖమ్మం. ఫోన్ : 9440358162

రాజస్థానాల్లో రాజసమై రంజిల్లిన మన భాష
గిడుగు అడుగులలో వ్యావహారికమై నర్తించిన మన భాష
భాషాభిమానం లేని వ్యక్తుల చేతుల్లో పడి
చితికిపోతోందేమిటి ?
చిత్తశుద్ధి లేని కొందరి అత్యాశాపరుల వలలో చిక్కి
విలవిలలాడిపోతోందేమిటి?
విద్యావ్యాపారుల మార్కుల మూర్ఖత్వంలో పడి
కొట్టుకుపోతోందేమిటి ?
స్వార్థం పతాకస్థాయికి చేరి
అమ్మనేకాదు, అమ్మభాషనూ వదిలి
మనసు విదేశాలకు ఎగిరిపోతోందేమిటి ?
విద్యావేత్తల విమాన చక్రాల్లో పడి
నలిగిపోతోందేమిటి ?
నా జీవభాషా!
నువ్వు సమష్టి సంపదవు కదా!
నిన్ను నమ్మితే సంపదే దూరమౌతుందన్న
దురభిప్రాయమేమిటి?
నువ్వొక జాతిని నిర్మించావు కదా!
ఆ జాతే నీ ఉసురు తీస్తోందేమిటి ?
నీ తీయని పలుకు పలికితే
ఎదుటివాడి దగ్గర స్థాయి తగ్గిపోతుందనే
ఆత్మన్యూనతని ఎలా వదిలించాలి ?
ధనార్జనా వ్యామోహం తప్ప
జనభాషా వ్యామోహం లేని జనులనేమనాలి?
తన తల్లిని కాదని, పొరుగింటి తల్లిని ప్రేమించే
సంతతి నేమని పొగడాలి ?
నా అమ్మతనమా!
కమ్మని జీవజలమా!
నిన్ను మృత్యుంజయురాలిని చేయగలమా ?
నా మాతృభాషా!
నవ్వు కాకూడదు మృతభాష!
ప్రజల నాల్కలపై అమందానంద
అమృతభాషై, అజరామరమై వెలుగొందాలి!
తరతరాలకు తరగని నిధివై నిలవాలి!

## నాలో నేను

- నాదమునుల రామారావు, కరీంనగర్. 9502308629

నాకు తెలియకుండా
నన్ను అడగకుండా
నాతో చెప్పకుండా
నా ప్రమేయం లేకుండా
కాలం వెళ్ళిపోతున్నది వెనకకు చూడకుండా
కాలం కరిగిపోతున్నది తిరిగి రాకుండా
జీవితం పారిపోతున్నది ఎప్పటికీ తిరిగి రానని
నాకు ఏమి కావాలి. నేనేమి చేయాలి. నేనేమి సాధించాలి
నన్ను నేను చాలాసార్లు
ప్రశ్నించుకున్నాను, విమర్శించుకున్నాను.
సరియైన సమాధానం లేదు.
గతం వెక్కిరిస్తున్నది
వర్తమానం రాజీపడమంటున్నది
భవిష్యత్తు తనకే మనుగడ లేదంటున్నది
మనసు నాదే అయినా
అది ఎక్కడ ఉన్నదో ఎలా ఉన్నదో అసలు ఉన్నదో లేదో
నేను చెప్పేది అది వినడం లేదు
అది చెప్పేది నేను ఆచరించడం లేదు
మానవత్వం మనిషికి భయపడి ఆత్మహత్య చేసుకున్నది
మనిషై పుట్టినందుకు సిగ్గుపడుతున్నాను
కాకినై పుట్టినా ఐకమత్యంతో జీవించేవాడిని
కుక్కనై పుట్టినా అణువణువునా విశ్వాసం నిండి యుండేది
ఏ మృగాన్నైనా పుట్టినా సజాతి నాశనం చేయకుండే వాడిని
ఏ రాయినై పుట్టినా నాకు స్పందించే హృదయం ఉండేది
నీతి నియమాలు అహింసా నైతిక విలువలు
మాటల వరకే పరిమితమైనాయి, ఆచరణకు అందనంత దూరంలో ఉన్నాయి
మనసు బ్యాలెన్స్ తప్పితే జీవితానికి ఏక్సిడెంట్ తప్పదు
కళ్ళెం చేతిలో ఉన్నా బ్రతుకు బండి పడుతుంది గోతిలో
ఉపన్యాసాలు ఎన్ని దంచినా. కవితలు ఎన్ని వ్రాసినా
తాను ఆచరించనప్పుడు వినేవారికి లోకువ
వినే చెవులే వాటిని వెనక్కు పంపుతాయి
మెదడుకు సోకకుండా – మలినం కాకుండా



## ముద్దాయి ప్రకటన

- వల్లభాపురం జనార్ధన, మహబూబ్‌నగర్. 9440163687

నేను ఇప్పుడు ముద్దాయిని
తెలుగు భాషాన్యాయస్థానంలో
తెలుగు భాషను హత్యచేస్తున్న వాణ్ణి
బతుకులో భాగంగా ప్రవహించే తెలుగు విద్యుత్ప్రవాహానికి
షార్ట్ సర్క్యూట్ కల్పిస్తున్న ఎలక్ట్రీషియన్ను.
అవును నేను ఇప్పుడు ముద్దాయిని.
సోదరులకు అన్యాయం చేస్తూ
అన్యాయం మాటేలేదని రోడ్డెక్కి కదంతొక్కుతున్నవాణ్ణి
మెజారిటీ అంకుశంతో ఏనుగును అదుపు చేస్తున్న వాణ్ణి
ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేస్తున్నవాణ్ణి
భాషాప్రయుక్త రాష్ట్రానికి వక్రభాష్యం చెప్తున్నవాణ్ణి
అమ్మమ్మ, నాయనమ్మలు 'ఉంగా ఉంగా' అంటూ నూరిపోసిన
మాటలకు జీవిత బహిష్కారం విధించాను
అడ్డాలనాడు అమ్మనేర్పిన మాటలు
గడ్డాలనాడు మాట్లాడటం ఆటవికమనిపించి
వదిలేసినవాణ్ణి.
నాచన సోమన – పాల్కురికి సోమన – వేమనల
అచ్చమైన తెలుగును నిఘంటువుల్లో దాచినవాణ్ణి.
నిర్లిప్తతతో మెలుగుతున్నవాణ్ణి
తెలుగు మాట్లాడని తెలుగువాణ్ణి
తెలుగు మాటల చిలుకను ఆంగ్ల పంజరంలోకి నెట్టినవాణ్ణి
వేషం మార్చినంత తేలికగా భాషను మార్చేసినవాణ్ణి
తెలుగుతో ఉన్న తరతరాల మానసిక అనుబంధాన్ని
అవలీలగా చంపుతున్న ఆధునికానంతర నాగరిక మానవుణ్ణి
తల్లిని మరచాను
తల్లి మాటను మరచాను
అయితే మాటలోని రాగమూ
మాటకు రూపమిచ్చే భావమూ తెలుగే
భావానికి ప్రాణం తెలుగే అన్న నిజాన్ని
ఆలస్యంగా తెలుసుకున్నాను.
నేరం చేసిన – చేస్తున్న ముద్దాయిని
కొడుకు తప్పును క్షమించే తల్లి ఒడిలా
నాకు ఒక్క అవకాశమియ్యండి
తెలుగుభాషను ప్రేమిస్తాను
తెలుగు తేజాన్ని వెలిగిస్తాను.



## కాలం ఒక్కటే! రూపాలు అనేకం!!

- పి.వి.రమణకుమార్, గుంటూరు.

దృశ్యాలు ఎరిగినవే
చూపుల్లోనే తేడా ......
సూర్యుడు ... చంద్రుడు.... నక్షత్రాలు
అనుభూతులు పాతవే
మనసుల్లోనే తేడా .....
దుఃఖాలు .. సంతోషాలు... అనిశ్చితాలు
జననానికి ముందు .... మరణానికి ముందు
శబ్దాలు .... నిశ్శబ్దాలు
యుద్ధానికి ముందు ..... విరామానికి ముందు
వ్యూహాలు ... ప్రతివ్యూహాలు
క్రీస్తు పూర్వానికి ముందు .... క్రీస్తుఆత్మార్పణకి ముందు
జీవకణాలు ... జీవి ఆవిర్భావాలు
అన్నిటా ... అంతటా .... కాలం కనుసన్నలలో
ప్రతిఘటించాల్సిందే
క్షణాలను కూడా లక్షణంగా తెచ్చే
మహా ఇంద్రజాలం కాలం.
ఎన్ని యుగాలను చూసిందో ... !
ఎంతమంది యుగపురుషులను శాసించిందో !
కాలం మారిందా? మనుషులు మారారా?
సమయాన్ని సెకనుకు ఇంతని ఖరీదు కట్టే 'నెట్' ఇంట్లో
కార్పొరేట్ కొలువులకు గబ్బిలాలై వ్రేలాడే జీవితాలు
టైమ్ ఈజ్ మనీ అంటున్నాయి... మనీ ఈజ్ మెనీ అంటున్నాయి
స్పర్శల జాడలు .... జ్ఞాపకాల నీడలు కోల్పోయి
కొందరు కాలం కలిసిరాక శవాలుగా
కాలం తీరి పిశాచాలుగా మారుతున్నారు
కాలం చెట్లలో పూలు పూయిస్తుంది
శిథిలాల్లో సాలెగూళ్లు నేయిస్తుంది!
గుహల్లో మానవుడు మహల్లోకి వచ్చినా
ప్రకృతి విలయతాండవానికి బలికావలసిందే!
కేదారుల పుణ్యమంతా కాలగర్భంలో కలసిపోవలసిందే!
కాలాన్ని వ్యాఖ్యానిస్తుంటే కాలం చాలదు
కాలాన్ని మరచిపోతే జీవితం గెలవదు.



## మా మంచి పుత్రికలు

- లంక పూర్ణయ్యశాస్త్రి, విజయవాడ. 9849684461

బిడ్డ పుట్టింది అన్నది నర్సు అంతలో ఆ బిడ్డ తండ్రి
ఆడబిడ్డ – మగబిడ్డా అన్నాడు ఆ నర్సుతో
ఆడబిడ్డండీ అన్నది ఆ నర్సు అంతలో తండ్రి
వామ్మో! వాయ్యో! ఇప్పటికి ఏడుగురు
ఆడ సంతానం ఇదైనా మగ బిడ్డడు కాకూడదు నాకు అన్నాడు
ఏనాడు శాపమో! ఏనాడు పాపమో! ఆ తండ్రి
మా అత్తగారి చాలే వచ్చింది మాకు
అది అట్లావుంచు మా ఆఖరి
బిడ్డకు ఝాన్సీ అని పేరు
పెద్దదానికి పల్నాటి నాగమ్మ అని పేరు
రెండవది సీతక్క అన్నీ కష్టాలే గదా!
ఇక మూడవది సమైక్య ఆంధ్ర
అంతా సమైక్యమే అంటుంది.
ఇక నాల్గవది నాలిముచ్చు
అంతా జై తెలంగాణ అంటూ అరుపులు కేకలు గోలలు
ఛీ ఛీ పాడు ఆడబిడ్డ
ఇక ఐదవది కాళీ పేరుకు తగ్గట్టు
తందానా! తాన తందానా అంటూ
నాట్యడ్యాన్సులు పోకిరి చేష్టలు
ఇక ఆరవది అలివేలు ఆవిడ
"క్షా" క్షవరం అంటూ తిరుపతి
వెంకటయ్య పెళ్ళాం
ఇక ఏడవ నెంబరు
వీరనారీమణి కత్తి, ఖడ్గం డాలు
శౌర్య శిరోమణి. అందరికీ వీరమాత
అదుగోనండి డాక్టరుగారు
పిలుస్తున్నారు ఇక నే వెళ్ళొస్తా
జై, జై, అందరికి జై
భావిపౌరులకు భారతమాత
ముద్దుబిడ్డలకు జై !!



## మానవుడిగా మిగిలిపో!

- ఎం.పి. రమేశ్‌బాబు, గద్వాల. 9441626339

వృక్షరాజమ్ముల కుత్తుకలు కత్తిరించి
నేలకూల్చినపుడు
వన్యప్రాణుల ఆవాసాలను కనుమరుగు చేసినపుడు
వన సోయగాల మాలికలను నులిపేసినపుడు
ధరణీమాత గుండెల్లో గునపాలు గ్రుచ్చీగ్రుచ్చి
గనుల ఘన భాగాలు తెగనమ్ముకున్నప్పుడు
వ్యర్థ పదార్థాలతో అవనిని కప్పివేసినపుడు
విషవాయువులతో వినువీధుల క్రమ్మివేసినపుడు
ఇష్టారాజ్యంగా భూగర్భ రాశుల తోడివేసినపుడు
అంగ అర్థ బలాలతో జలాశయాల నారగించినపుడు
నదీ తీరాల నాక్రమించి కొండల పిండిచేసి
గగన హర్మ్యాల నిర్మించి జయగర్వంతో విర్రవీగినపుడు
నేలతల్లి వేదన, అడవితల్లి ఆవేదన
పశు పక్ష్యాదుల ఆక్రందన
ఆలకించిన దెపుడు ...?
అవినీతి అంతరంగాన్ని తాకినదెప్పుడు ...?
'అవినీతి' అంతరంగాన్ని కడిగేసినప్పుడు !!
హంగు, ఆర్భాటం, సౌకర్యం, విలాసాలకోసం
సకల జీవరాశిని వినాశ వలయంలోకి నెట్టేశావు
ఇపుడు – శాపనార్థాలు పెడుతున్నావు
ఇకనైనా మేలుకో !
బ్రతుకు విధం మార్చుకో !
మానవుడిగా మిగిలిపో !

## మనసు లేదు

- మైలాపురం రామచంద్రప్రసాద్, చెన్నై. 919500193595

భూగర్భ జలాలే కాదు
కన్నీటి జలాలు కూడా అడుగంటుతున్నాయి

కరువు కాటకాలే కాదు
స్పందించే హృదయాలు కరువవుతున్నాయి

మనిషిలో దేవుడిని కాదు
మనిషిలో మనిషినే చూడటం లేదు

ఆరోగ్య మార్గాలు వదలి
అనారోగ్య మార్గాల వెంట పడుతున్నాం

ప్రేమ ఆప్యాయతలను ద్వేషించి
ద్వేషం అసూయలను ప్రేమిస్తున్నాం

పాతాళములో దిగటానికి పరుగెందుకు
ఊబిలో మునగడానికి మునకెందుకు

మనసుతో ఆలోచించకుండా ?
మనస్సాక్షి మాట వినకుండా ??





# స్మితశ్రీ సాహిత్యంలో తెలుగు వెలుగులు

- బేతపూడి సుబ్బారావు, పరిశోధక విద్యార్థి, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, ఫోన్ : 9491443086

తెలుగు తల్లిని తన మనసుతో, కలంతో తెలుగుభాష పరిమళ సువాసనలు వెదజల్లే మాలికలు ధరింపజేసిన కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి ఏకైక అల్లుడైన స్మితశ్రీ శ్రీ చింతపల్లి నాగేశ్వరరావుగారు తన మామగారి ప్రేరణతో సంకల్పబలంతో తాను వృత్తిరీత్యా గణితశాస్త్రోపాధ్యాయుడైనప్పటికీ తన మనసులో మెదిలిన అగణిత భావాల సమాహారమే తెలుగుతల్లి మెడలో వజ్రాల మణిహారం.

తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తూ తెలుగుకవితా సౌగంధికాలను దిగ్దిగంతాలకు వెదజల్లిన మహాకవులు, పండితులు ఎందరో ఉన్నారు. తెలుగు భాషా సౌందర్యాలను, తెలుగు పలుకుబడి, నుడికారాల్లోని మాధుర్యాలను చవిచూపించి తమ ప్రతిభావ్యుత్పత్తి, అభ్యాసాలతో ఆంధ్రభారతి గళసీమలో కంఠాభరణాలై నిల్చిన కవివరేణ్యులు ఎందరో ఉన్నారు. తెలుగుభాషకే స్వంతమై, తెలుగు భాషకు ఎనలేని ఔన్నత్యాన్ని, గౌరవాన్ని సంపాదించి పెట్టిన పద్యాన్ని తమ చక్కని పదాలతో, అందమైన భావాలతో కమనీయమైన కల్పనలతో రసస్ఫూర్తిని కలిగించి తెలుగుభాషాభిమానులకు రుచికరమైన పాకాలు అందించిన కవిపుంగవులు ఎందరో ఉన్నారు. అటువంటి కవులలో ఆధునిక కాలంలో జాషువా, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి వంటివారు ప్రాతః స్మరణీయులు.

ప్రస్తుతకాలంలో కూడా అలాంటివారి స్ఫూర్తితో తమతమ వృత్తులు వేరైనా, ఆంధ్రభాషాస్ఫూర్తితో చక్కని పద్యాలనందించిన సమర్థులైన కవిపుంగవులు ఎందరో ఉన్నారు. వారిలో కరుణశ్రీ జామాతయై ఆయన కవితా స్ఫూర్తితో ఎన్నోరచనలు చేసినవారు 'స్మితశ్రీ' లేఖినీ నామాంతరుడైన చింతపల్లి నాగేశ్వరరావుగారు వృత్తిరీత్యా గణితశాస్త్రోపాధ్యాయుడైనా, ప్రవృత్తి రీత్యా చక్కనికవిగా, తన కవిత్వాన్ని అనేక సాహితీ ప్రక్రియల ద్వారా వెలువరించారు. ఆయన పరమేశ్వరోదాహరణ ఒక ఉదాహరణకావ్యం. సిద్ధేశ్వరీశతకం, గర్తపురి నృసింహశతకాలు, భక్తిరసస్ఫోరకాలు, కన్నబిడ్డ మొదలైన కథలు విపులలో ప్రచురింపబడ్డాయి. ఈయన నాదసిద్ధి అనే సామాజిక నవల కూడా రచించారు. ఆధునిక కాలంలో 'నది' పత్రిక ద్వారా వెలుగులోనికి వచ్చిన పది ప్రబంధాల్లో తృతీయ స్థానంలో నిల్చింది. ఆయన రచించిన "నర్మదాపురుకుత్సీయ' మనే ప్రబంధం 'నాటకాంతంహి సాహిత్య' మన్నట్లు మహాభారతంలోని అరణ్యపర్వంలో భీముడు, సౌగంధికాన్ని సాధించిన ఘట్టాన్ని 'సౌగంధికం' అనే అయిదంకాల పద్యనాటకం కూడా రచించారు.

తెలుగుదనము వంటి తీయందనము లేదు. తెలుగుకవులవంటి ఘనులు లేరన్నది యథార్థం. ఈ భావాన్నే స్మితశ్రీగారు

ఉ. తేనెలు జిల్కుచున్ సొగసుదిద్దెడు చక్కని శబ్దరీతులన్
వీనుల విందొనర్చు సుకవీశ్వరువాక్కుల నిల్చునిన్ను మా
మానసమందు మామధుర మంజుల భావన నిల్ప, భక్తిమై
గానము సేతుమమ్మ కుతుకంబున నీ మహనీయ గాథలన్

అని తన ఆంధ్రసవిత్ర అనే ఖండికలో పేర్కొన్నారు. తెలుగుభాష కలకాలం నిలవాలనీ తెలుగుప్రజలు ఏ విధమైన ఖేదభావాలు లేకుండా కలసిమెలసి ఉండాలనీ, ఆకాంక్షిస్తూ ఆయన

కం॥ మంజుల సుఖమయ శోభా
రంజితమై ప్రసన్న రాగారుణమై
రంజిల్లుత యీరాష్ట్రము
భంజనములు లేక నవ్యభాగ్యోదయమై

అని తెలియజేశారు. తెలుగుభాష అజంతభాష, అందమైన భాష. "ఆంధ్రత్వమాంధ్రభాషాచ నాల్పస్య తపసఃఫలమ్" అని తమిళకవి అప్పయ్య దీక్షితులు వారి నోటివెంట వచ్చిన పలుకులవల్ల ఆంధ్రులుగా జన్మించటం, ఆంధ్రభాషను మాట్లాడగలగడం ఆంధ్రుల జన్మజన్మల పుణ్యఫలమని తెలుస్తున్నది. తెలుగుపద్యంలోని యతిప్రాసలు తెలుగుభాషకు సహజమైన అలంకారాలు. అంతేగాక మనం నిత్యం వాడే సామెతల్లోకూడా "కోటి విద్యలు కూటికొరకే" వంటివి తెలుగు భాషాసౌందర్యాన్ని నిరూపిస్తున్నాయి. స్మితశ్రీ గారు ఈ విషయాన్నే తన పద్యములో ఇలా తెలియజేస్తారు.

సుమధుర సౌమ్యభావనలు సూక్తి సుధామయ భావజాలమున్
సముచితరీతిగా యతులు చక్కని ప్రాసలు పద్యమందునన్
అమరిన రంగవల్లికల కందముగూర్చెడి గొబ్బిముద్దలై
ప్రమదమునందజేయుటయె భాగ్యము ఆంధ్రులకెల్లవేళలన్

అంతటి భాగ్యశాలులు తెలుగుబిడ్డలు. అటువంటి బిడ్డలు ఇప్పటికీ పరభాషా వ్యామోహానికి విదేశ సంస్కృతులకు ఆకర్షితులై తెలుగుభాషను నిర్లక్ష్యం చేస్తున్నారు.

ప్రాథమికస్థాయిలోనే విద్యాభ్యాసంలోనే భాషతగిన పునాదులు ఏర్పడటం లేదు. దంత్యతాలవ్యాలు సరిగా ఉచ్చరించలేకపోతున్నారు. శ, ష, స పదాల తేడాలు తెలియటం లేదు.

## నేలతల్లి - మముగన్న తల్లి

-షేక్ అబ్బాస్ అలీ, జగ్గయ్యపేట, ఫోన్ : 9030161413

అమ్మా నేలతల్లి మముగన్న కల్పవల్లి
అమ్మా నీ ఋణం ఏ తీరుగ తీర్చనమ్మా కల్పవల్లీ ॥అమ్మా॥

నాటిన విత్తనానికి విత్తం అందించిన జననీ
మోడుబారిన మానును చిగురించిన భామినీ
జీవనాధారమై జగతిని కరుణించిన మధువనీ
జీవన - మరణాల కాలాన్ని కొలిచిన ఆమనీ ॥అమ్మా॥

అమ్మా అను పదమందు అనురాగం దాగింది
మాతృమూర్తి ఎదయందు మమకారం ఎదిగింది
ఉగ్గుపాల నిగ్గులో ప్రేమానురాగం పంచింది
మనీషిగా మార్చిన మందిరంగా బతుకున నిలిచింది ॥అమ్మా॥

స్మితశ్రీగారు తెలుగుదనం క్రమంగా నశించటాన్ని చూచి

తే॥ కాలవాహిని నేడేమొ గతులు తప్పి
నాటి కర్తవ్య దీక్షయెమాటుమణిగె
ఆంధ్ర పౌరుష మీనాడు అంతరించె
వెలుగునో లేదో ఇకనైన తెలుగుకీర్తి

అంతేగాక తెలుగుభాషా సౌందర్యాన్ని తెలుగు సొంపులను, తాను మహాకవుల పూర్వకావ్యాల్లో ఎలా దర్శించింది ఇలా తెలియజేసారు.

ఉ॥ గంటము సాగినట్లు, చిరుగాలులు మెల్లగ వీచుచున్నట్లు, జే
గంటలు మ్రోగినేట్లు, సురకాంతలు చక్కగ నాడినట్లు, ఆ
నదీమతల్లి మెలమెల్లగ పృథ్వికి జారినట్లుగన్;
గంటిమి తెల్గు సొంపులను కావ్యలందు సకాంక్షమీరగన్

అంటారు. అంతేగాక తెలుగు భాషా సౌందర్యం త్యాగయ్య కర్నాటక సంగీత కీర్తనలలోను, నవరసాలొలికించు శ్రీకృష్ణదేవరాయల కాలం నాటి ప్రబంధాల్లోను, దేవాలయాల్లో అందమైన శిల్పాల్లోను, కూచిపూడి నాట్యము లోను, కాంతు లీనుతున్నవంటారు స్మితశ్రీ ఒక సీసపద్యంలో ...

సీ॥ కర్ణాట సంగీత కమనీయ కృతులల్లు
ఘనుడు త్యాగయ్య సద్గానహేల
రాయలు పోషింప రసము చిప్పిలజేయు
కవి పండితుల దివ్యకావ్యహేల
దేవళంబులయందు దివ్యమై భాసించు
చిత్తంబులను దోచు శిల్పహేల
కూచిపూడిన బుట్టి గురుతీరంబుగ వెల్గు
అతున్నతంబైన నృత్యహేల
అన్ని ఆభరణములుగ గొన్న తల్లి
సర్వకళలకు సౌభాగ్యపర్వమౌచు
నాడు సౌవర్ణ కాంతులు నెలవుగాగ
వెలుగు సౌభాగ్యలక్ష్మి మా తెలుగుతల్లి !

తెలుగు భాష అనేక విధాలుగా పరిపుష్టినొందింది. తెలుగులో ఆశు కవిత్వాలు, అష్టావధానాలు, శతావధానాలు, సహస్రావధానాలు చేయగల సమర్థులుండటం ఎంతో విశేషం. భువనవిజయం, కవన విజయం మొదలైన సాహితీ రూపకాల తెలుగు భాషకు ఎన్నెన్నో వన్నెలు చేకూర్చాయి. జానపదాలు, హరికథలు, యక్షగానాలు తెలుగుభాషకు మాగాణి భూములై పుష్టిని చేకూర్చాయి. ఆ విషయాన్నే స్మితశ్రీగారు ఇలా అంటారు.

సీ॥ ఆశుకవిత్వమొక అలవోకగ సాగి
క్రమస్రవంతులై ఖ్యాతిగాంచె
ఘన కవీంద్ర స్ఫూర్తికైత రూపముదాల్చి
బహుకావ్య సంద్రమై పర్వులెత్తె
అష్టావధానాదులు సహస్రమ్ములై
పర్జన్యమై జేసి గర్జనమ్ము
భువన విజయంమాది, నవనవోన్మేషమౌ
రూపక రసవృష్టి రూపుదాల్చె
జానపదములు గేయముల్ శ్రావ్యమైన
యక్షగానముల్ నటనముల్, హరికథలును
పుష్టినొనగూర్చు మాగాణి భూముతోచు
పరమ సాహితీ క్షేత్రమున పంటలయ్యె ।

సి.పి. బ్రౌన్ వంటి విదేశాలవారు సైతం మన భాషయందు ఎంతో మక్కువతో తెలుగు భాషాభివృద్ధికి సేవ చేశారు. విదేశాల నుండి వచ్చి నృత్యం, సంగీతం మొదలైన కళలను శ్రద్ధగా అధ్యయనం చేశారు. తెలుగు సంస్కృతిని ఎంతో గౌరవించారు. ఆధ్యాత్మికసౌరభాలను సైతం ఆఘ్రాణిస్తున్నారు.

సీ॥ నాటిరాయల స్ఫూర్తి నేటి నేతలు బొంది
తెలుగు వెలుగు నింపి చెలగు గాత !
తెలుగుభాషను నేర్చి ధీటైన ప్రజ్ఞతో
ఆధునిక కవులెల్ల అలరుగాత !
సురచిత కావ్యాల శోభలు తనురార
ఉత్తమంబుగ భాషయొప్పుగాత !
ఏదేశమందైన ఏ ప్రాంతమందైన
తెలుగుబిడ్డ తాను గెలుచుగాత !

తే. అన్ని రంగాలలో నిండైన అభ్యుదయము
నందుకొనుచు పేరొంది ఆంధ్రులెల్ల
తెలుగు తేజమ్ము దశదిశల్ వెలుగునట్లు
తెలుగుతల్లి ఋణంబును దీర్చుగాత !

## • యువతా మేలుకో •

- వడ్డాది లక్ష్మీ సుభద్ర, విజయవాడ. ఫోన్ : 0866-2541543

1. కష్టములకు కుంగకు
నష్టములకు బెదరకు
ముందుకు సాగుతుండు

2. నీ శక్తి నీకు తెలీదు
శంకరుడు నరేంద్రుడు
యవ్వనంలో
లక్ష్యం సాధించె

3. బాబుజీ ఆశించ
లేదు సుఖాన్ని,
అందుకే స్వాతంత్ర్యం
అనుభవిస్తున్నాము.

4. ముమ్ముందుకు నడు
నీ వెనుకే జనం
స్వార్థం వీడు
శాంతిని వ్యాపించు

5. ఈర్ష్యా ద్వేషం
నిండిన భారతం
కాలుష్య రహితం
చేయి ప్రక్షాళనం

6. కుంగుతుంది ధరణి
ఆగడాలు ఎక్కువై
రాముడు కృష్ణుడువై
కదలిరా.

7. రాణి రుద్రమవై
ఝాన్సీ రాణివై
కరాటె రాణివై
యువతి కదలిరా.

8. కీచకుల దునుమాడు
సబలవని నిరూపించు
బుద్ధ క్రీస్తు తెరెసా కరుణ
చావ్లా ధైర్యం పొందు

9. భావి భారత
భాగ్య విధాతలు
రామరాజ్య
నిర్ణేతలు మీరే.

# నేటి యువత

- శ్రీమతి తొడుపునూరి సరోజ, సికింద్రాబాద్, ఫోన్ : ?

అది ఓ చిన్న తాలూకా ప్రజ్ఞాపూర్. అయినా చాలా ఆఫీసులు, మంచి బడులు, కాలేజీలు అక్కడక్కడా ఉన్నాయి. అందుకే ఆ ఊరు పట్నం, పల్లెగాని కాదు. అందుకే అక్కడివాళ్ళందరూ అంటారు అది ఓ మంచి ఊరని. ఆ ఊర్లో ఏ సమస్య ఎదురైనా, గొడవలైనా, ఏ కొత్త విషయం జరిగినా ఆ ఊరికి ఏ కొత్తవాళ్ళు వచ్చినా పటేలు, పట్వారీలే చూసుకొంటూ వాళ్ళ సమస్యలను చూసుకోవాలి. ఏ విషయమైనా నచ్చచెప్పే భారం వారిదే. ఆ ఊరు ఎంతో సుభిక్షంగా ఉండడమేగాక ఆ ఊరివాళ్ళందరు ఎంతో సంతోషంగా, ఆనందంగా ఉంటారెప్పుడు. ఎవరికే కష్టం వచ్చినా ఏ ఇంట్లో ఏ శుభకార్య మైనా ఊరివాళ్ళందరు తమ ఇంట్లో జరిగే కార్యంలా పేదా, గొప్ప భేదం లేక అందరు తలా ఓ చేయేసి ఆ కార్యాన్ని గట్టెక్కిస్తారు. ఆ విధంగా ఆ ఊరులో ఎవరికే ఆపద వచ్చినా ఆ ఊరి ప్రజలంతా ఒకే కుటుంబంలా ముందుకొస్తారు. చూసేవాళ్ళకు ఎంతోమందికి ఆనందం, సంతోషం కలిగినా మరికొంతమంది ఈర్ష్యా, అసూయలతో రగిలిపోసాగారు. కారణం వాళ్ళలా కలిసి మెలసి ఉండటం వీరికి నచ్చలేదు.

* * *

చాలా రోజుల తర్వాత ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటూ ఊరి మధ్యలో నున్న రచ్చబండ మీద కూర్చున్నారు. కొంతమంది కిందకూర్చుని వాళ్ళ మాటలను శ్రద్ధగా వింటున్నారు. ఇంతలో ఎవరో వస్తున్నట్లుగా చప్పుళ్ళు శబ్దాలు విని అక్కడ ఉన్నవాళ్ళందరు మాటలు ఆపి ఆ శబ్దాలు వచ్చిన దిశ వైపు చూడసాగారు ఎంతో కుతూహలంగా.

వచ్చిన వాళ్ళందరు వాళ్ళ డప్పులను ఆపి వీరి దగ్గరికొచ్చి వినయంగా నమస్కరించి ఇలా చెప్పారు. మేము చెప్పే విషయాలు శ్రద్ధగా ఆలకించండి బాబూ! అలనాడు ఎంతో కష్టపడి వాళ్ళ ప్రాణాలను ఫణంగా పెట్టి ఎంతో కష్టపడి మనదేశానికి దాస్య విముక్తిని కలిగించారు. వాళ్ళకి వాళ్ళ కుటుంబాలతో సుఖంగా ఉండాలని అన్పించదా! వాళ్ళ జీవితాలన్ని బందీలుగా జైల్లో గడిపి జీవితాలని చాలించారే. అలాంటి మహానాయకులను ఈనాటి నాయకులు మరిచారేమో మరి. ఇప్పుడొచ్చే నాయకులందరు ప్రజల కష్ట సుఖాలు తెలుసుకోకపోగా, ముందున్నవాళ్ళు ఇంత సంపాదించారు, నేను అంతకన్నా ఎక్కువ సంపాదించాలిగదా! ఇవే వాళ్ళ ఆలోచనలు తప్ప తనవంతుగా దేశానికి ఎంతో కొంతమేలు చేద్దామన్న ఆలోచనే రాదు. ఇవన్నీ మీకు తెలియని కావు. ఇంకా ఇంకా ఎన్నో విషయాలు తెలుసుకోవాలనుకుంటే సాయంత్రం ఊరవతలనున్న మైదానంలో సాయంత్రం నాలుగు గంటలకు మీటింగ్ ఉన్నది. అక్కడ ఎంతోమంది తలలుపండిన వాళ్ళు వాళ్ళవాళ్ళ అనుభవాలు, అప్పటి నాయకులకు, ఇప్పుడున్న నాయకులకు ఉన్న తేడాలను తెలుపుతారు. వచ్చి వినండి.. అంటూ అందరూ వెళ్ళిపోయారు. రచ్చబండ దగ్గర కూర్చున్న వాళ్ళందరు ఔరా! ఇలాగున్నారా మన నాయకులు, అదేంటో తప్పకుండా వినాలని అందరూ నిర్ణయించుకొని ఊరంతా వాళ్ళు చెప్పిన స్థలానికి వెళ్ళారు వాళ్ళు చెప్పిన టైం అవడంతో.

* * *

అక్కడ సభలో చాలామంది మాట్లాడారు. మరికొంతమంది ఎంతో ఉద్వేగంగా కూడా మాట్లాడారు. అవన్నీ అక్షరసత్యాలే. కొంతమంది యువకులు లేచి దేశాన్ని బాగుచేయాలంటే నేటి యువతే ముందుకు రావాలి. అంతేతప్ప పాతవాళ్ళకిది సాధ్యంకాదు అంటే మరికొందరు నేటి యువతే రేపటి భావిభారత పౌరులు, వాళ్ళే కాగలరు దేశానికి వెన్నెముకలు. వాళ్ళే దేశానికి కట్టగలరు ఆనకట్ట. శ్రీశ్రీగారు రాసినట్టుగా నేను సైతం ... అంటూ ముందుకెళ్ళాలి. వెయ్యిలో ఒక్కరు కాకుండా, నీవెనక వెయ్యిమంది ఉన్నారంటూ ముందుకెళ్ళాలి. ఒకనాటి ఎడారిని సస్యశ్యామలం చేయించు. ఎన్ని కష్టాలు పడ్డా, ప్రాణం పోయినా, నీవెనుక తొమ్మిదివందల తొంభైతొమ్మిదిమంది ఉన్నా రనుకో, వాళ్ళే నీ ఆశయాన్ని పూర్తిచేయగలరని తెలుసుకో. ముందుకు దూసుకెళ్ళు. పత్రికా విలేకరులు, జర్నలిస్టులు, ఇంకా చాలా మంది నీ వెంటే ఉంటారని తెలుసుకో.. ఈనాటి నాయకుల వల్ల మనకు జరిగిందేమీ లేదు. పైగా కరవు కాటకాలతో, ప్రతివస్తువుకు రెక్కలొచ్చి ఆకాశానికంటుతుంటే మామూలుగా బ్రతికేవాళ్ళు, పేదవాళ్ళు ఎలా బ్రతకగలరు? ఒకప్పుడు ఇందిరా గాంధీ అన్నట్లుగా "గరీభీ హటావో" అంటే ఈనాటి నాయకులు ఇష్టారాజ్యంగా పాలిస్తూ సామాన్య మానవులను ఇంకా పాతాళానికి తొక్కేస్తున్నారు. ఇవన్నీ నిజం కాదంటారా? మీరే చెప్పండి. అందుకే మేముంటాము. నేటి యువత ముందుకొస్తే దేశం బాగుపడుతుంది. కాదంటారా? మీరు ఆలోచించండి బాగా! అంటూ తమ ప్రసంగాలను ముగించారు. ఇదే నేటి యువత మీకిచ్చే సందేశం అంటూ అందరూ వెళ్ళిపోయారు. పటేలు, పట్వారి, ఊరి ప్రజలందరు ఔరా! అని ముక్కుమీద వేలేసుకుంటూ ఎంత బాగా చెప్పారు? మనకసలేం తెలియదని అనుకొన్నారు కొందరు. దేశం బాగుపడాలంటే మనమంతా, దేశమంతా యువతను ముందుకు తీసుకురావాలి అని ఆ క్షణమే ఆ ఊరివాళ్ళంతా తీర్మానించుకున్నారు. ●



# విజయవాడతో నా అనుబంధం

- డా॥ బోయినపల్లి వెంకట రామారావు, కరీంనగర్

నా బాల్యంలో మాతల్లిదండ్రులు తిరుపతిలో నా కేశ ఖండనం (పుట్టు వెంట్రుకలు తీయడం) మరియ్యు చెవులు కుట్టించటం నిమిత్తం ప్రయాణం చేస్తూ ఒక రాత్రి విజయవాడలోగల రామగోపాల్ సత్రములో గడిపితిమి. అది నా విజయవాడ యొక్క ప్రథమ సందర్శన అయియుంటుంది. తర్వాత నేను యువకునిగా యున్నప్పుడు అనేకసార్లు వెళ్లటం జరిగింది. నా 21వ ఏట పటమట (విజయవాడ)లోగల ప్రకృతి చికిత్సా కేంద్రం ఆరోగ్య సదనములో చికిత్స నిమిత్తము ఒక నెల దినములు శ్రీ సీతారామావధూత గారి వద్ద గడిపితిని. తరువాత 30-40 మందిని ప్రకృతి చికిత్సకు ప్రోత్సహించి చికిత్స నిమిత్తం పంపాను. పటమటలో అప్పుడొక గ్రంథాలయం నిర్వహింప బడుచున్నట్టు జ్ఞాపకం. అక్కడి భాష నాకు నచ్చినందున అదే తరహాలో అనుకరిస్తూ మాట్లాడేవాడిని. 1939లో మా స్వగ్రామం తోటపల్లిలో ఆంధ్ర విద్యాభివర్ధనీ గ్రంథాలయమును స్థాపించి తరువాత అచ్చటి ఆంధ్రదేశ గ్రంథాలయానికి సభ్యులుగా చేరాము. పాడిపంటలు పత్రికను మాకు వారు పంపుచుండెడివారు. శ్రీ పాతూరి నాగభూషణంగారు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారి షష్టిపూర్తి ఉత్సవం (జన్మదినము) స్వగ్రామములో జరుపుమని వ్రాశారు. తర్వాత వరంగల్ జిల్లా (అప్పుడు నల్లగొండజిల్లా) లోగల జనగామలో జరిగిన గ్రంథాలయ మహోత్సవ సభలో పాల్గొని కార్యవర్గ సభ్యుడుగ ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘానికి ఎన్నుకోబడితిని. శ్రీ పాతూరి నాగభూషణం గారి కరీంనగర్ జిల్లా పర్యటన జరిపించి 5, 6 గ్రామాలలో వసంతోత్సవాలను జరిపించితిమి. అప్పటినుండి విజయవాడ నా అభిమాన స్థలంగా ఏర్పడెను. గ్రంథాలయ సంఘ కార్యాలయముతో సంబంధము లేర్పడెను. తర్వాత నాస్తిక కేంద్రం గోరాగారి కుటుంబ సభ్యులతో ముఖ్యంగా లవణంగారితో మైత్రి ఏర్పడి సర్వోదయ ఉద్యమంవల్ల మా తత్సంబంధాలు దృఢతరమాయెను. గ్రంథాలయ పితామహ (భీష్మ) శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య గారితో గురుశిష్య సంబంధమేర్పడినది. కరీంనగరంలో జిల్లా గ్రంథాలయశాఖ ఏర్పాటు చేయుట జరిగినది. గాంధీ పర్వతము వద్ద గల గాంధీ స్తూపము. వెంకట సూర్యనారాయణగారి శిష్యులతో గాంధేయ కార్యకర్తల కుటుంబములతో దృఢ సంబంధాలేర్పడినవి. అక్కడి కంఠ్ల డాక్టర్ సిటీ కాంగ్రెస్ నాయకులు టి.వి. చలపతిరావు, ప్రకృతి ట్రస్ట్ నిర్వాహకులు పుచ్చా సీతారామయ్య, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, ఆచార్య ఎన్.జి. రంగా మహామహులతో పరిచయ సంబంధా లేర్పడినవి. తరువాత నేను నిర్వహించిన సారస్వత జ్యోతి అను త్రైమాస పత్రికలో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు వ్యాసాలు వ్రాశారు. గ్రంథాలయ జైత్రయాత్ర పేరుతో కళాప్రపూర్ణ పాతూరి నాగభూషణం, పద్మశ్రీ శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య, శ్రీ కొమ్మా సీతారామయ్య, శ్రీ కూడాలు నారాయణరావు, ఆకుల లక్ష్మీనారాయణలు జైత్రయాత్ర చేస్తూ కరీంనగరం వచ్చి సభలు జరిపిరి. జిల్లాలో గ్రంథాలయ ఉద్యమం పురోగమించెను. నిజాంతో నేను పోరాటం జరుపుతున్నప్పుడు విజయవాడకు వచ్చి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, ఆచార్య ఎన్.జి. రంగాల కార్యక్రమాలలో పాల్గొని సలహాలు పొందెడివారము. శ్రీ కె.ఎల్.రావుగారితో పరిచయం జరిగినది. శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య, శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణగారలం కలసి భద్రాచలయాత్ర చేస్తిమి. విశాలాంధ్ర ఉద్యమ సందర్భంగా ప్రకాశచంద్ర శతపదిగారితో , ఆంధ్రకేసరి ప్రకాశంగారితో కలిసి కార్యక్రమాలలో పాల్గొంటిమి. ఆంధ్రకేసరి, శ్రీ భండారు చంద్రమౌళీశ్వర రావుగారితో కలసి వరంగల్ పర్యటించి విశాలాంధ్ర సభ జరుపుచుండగా శ్రీ చందాకాంతయ్యగారున్న విద్యాభివర్ధనం స్కూల్ విద్యార్థులు మాకు నల్ల జెండాలతో నిరసన తెలిపిరి. డా॥ శ్రీమతి కెముద్రాజు అచ్చమాంబ నిర్వహించిన దక్షిణ రైల్వే జోన్ కావాలని నిర్వహించిన ఉద్యమకమిటికి నేనొక సభ్యునిగా యుండి పెక్కు ప్రదర్శనలు జరిపితిమి. క్రమంగా గుంటూరులో నదింవెల్లి నరసింహారావుగారితో, గుంటూరు ఉన్నవ లక్ష్మీనారాయణగారితో పరిచయ సంబంధాలేర్పడెను. శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారు స్థాపించిన గ్రంథాలయ సేవక మహా సంఘానికి కార్యాధ్యక్షునిగా వారి అనంతరం అధ్యక్షుడుగా ఎన్నికైతిని. బందరులో యునెస్కో సుబ్బారావుగారితో మహీధర రాంమోహన్‌రావుగారితో టేకుమళ్ళ రామచందర్ రావుగారితో పరిచయ సంబంధాలేర్పడినవి. ముఖ్యంగా గుడివాడలో స్థాపించి నిర్వహింపబడిన భారతీ సమితిచేత నేననేక సన్మానములు పొందుటేకాకుండా వేద పారాయణము మంగళవాయిద్యముల మధ్య వేణుగోపాలస్వామి ఆలయంలో నాకు జరిగిన కనకాభిషేకం, గ్రంథాలయోద్యమ విభూషణ (రాజమండ్రిలో) సాహితీ సేవా పరాయణ బిరుదు ప్రదానములు నాకు గావించిరి. భారతీసమితి మరియు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సేవా మహా సంఘం వార్షికోత్సవాలకు నేను అధ్యక్షత వహించాను. కీ॥శే॥ మోదూరి శ్రీరామ కవి, మోగంట మల్లికార్జునరావు, పోసాడి శేషగిరిరావు, మల్లవరం రామలింగేశ్వరశర్మగారలు చూపిన ఆత్మీయతను మరువజాలను. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘములో కొన్నాళ్ళు సహాయ కార్యదర్శి బాధ్యత నిర్వహించి చాలా కాలము నుండి దానికి వరసగ ఉపాధ్యక్షుడిగా యుండియున్నాను. గ్రంథాలయ సర్వస్వం అను మాసపత్రికను కొంతకాలం సంపాదక మండలి సభ్యుడిగా ఉన్నాను. ఇకపోతే ఆచంట లక్ష్మీపతియను ఆయుర్వేద బోర్డు అధ్యక్షుడితో సంబంధమేర్పడినది. ఉప్పులూరి మల్లికార్జునశర్మవల్ల మద్యనిషేధ సభ్యునిగ శ్రీ నరహరిశెట్టి శ్రీహరి అడ్వకేట్‌తో వారి కుటుంబంతో సంబంధాలు కలవు. ఆనాటి జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మన్ శ్రీకలపాల సూర్యప్రకాశరావుతో, శ్రీమతి చెన్నుపాటి విద్యగారు

## మన యువత

- మద్ది పుల్లారావు, నందిగామ. ఫోన్ : 9502687153

"పరిచయం లేకుండానే ఇంటర్నెట్‌లో
యువతీ, యువకుల ఛాటింగ్
పరిచయాలు ప్రేమలై ఆ తరువాత ఛీటింగ్"

"మితిమీరిన టెక్నాలజీతో అవాంఛిత చిత్ర వీక్షణాలు
యువతను పెడదారి పెట్టించే అవలక్షణాలు"
"ప్రారంభమయ్యింది డేటింగ్ కల్చర్
సంస్కృతీ పునాదుల కిది పెద్ద పంక్చర్"

అధ్యక్షులుగ ఉన్న ఆంధ్రప్రదేశ్ హరిజన సేవక సంఘమునకు నేను నాటినుండి కార్యవర్గ సభ్యుడను. ఇచ్చట జరిగిన సమావేశానెన్నింటికో హాజరైనాను. కృష్ణాజిల్లా సంఘానికి ఆజీవన సభ్యున్ని. ప్రపంచ తెలుగుసభలు జరుగుచుండుట ముదావహం. ఇదివరకు జరిగిన కృష్ణాజిల్లా సంఘ కార్యక్రమాలెన్నింటిలోనో పాల్గొంటిని. ఒకసారి అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారి సాహితీ అవార్డు, 20 వేల రూపాయల నగదు, ప్రశంసా పత్రం కూడా ప్రదానం గావింపబడింది. శ్రీ జి.వి.పూర్ణచందు ప్రభృతుల ప్రేమకు పాత్రుడనగుట నా అదృష్టంగా భావిస్తున్నాను. అలాగే విజయవాడ పాలఫ్యాక్టరీ వద్దగల శ్రీ సయ్యద్ అప్పల నాయుడు కళాశాల నిర్వాహకులు శ్రీ రాంపిళ్ల జయప్రకాశ్ గారితో విడదీయరాని సంబంధం కలదు. వారు అఖిలభారత స్వాతంత్ర్య సమర యోధుల వారసుల సంఘం కార్యదర్శిగా చేయటానికి కరీంనగరం మరియు హైదరాబాద్ కార్యక్రమాలలో పాల్గొంటారు. ఇంకా విజయవాడతో నాకుగల సంబంధం గూర్చి వ్రాయాలంటే ఒక ఉద్గ్రంథ మవుతుంది. నేను ఎప్పుడు విజయవాడ వచ్చినా శ్రీ రాంపిళ్ల జయప్రకాశ్ ఇంటిలోనే మకాం. భోజన వసతులు వారే ఏర్పాటు చేస్తారు. ●

# భారతీయత - మానవీయత - మన యువత

- దాసరి అప్పారావు చౌదరి, హైదరాబాద్.

ఆధ్యాత్మికంగా ఒకప్పుడు మనదేశం ప్రపంచ ప్రసిద్ధి పొందింది. ఈనాడు అధోగతికి చేరింది. ప్రసిద్ధి చెందడానికి కారకాలేమిటి? అధోగతికి చేరిందని ఎలా చెప్పగలము? ఎవరైనా చెప్పగలరా? ఈ నాటికి మనదేశంలో, గొప్ప గొప్ప స్వామీజీలు ఉన్నారు. వారి బోధలు ఎంతో గొప్పవే; కాని వారి బోధనల వలన కొందరే ప్రభావితమవుతున్నారు. ఆసారాన్ని సమాజం అనుభవించలేక పోతున్నది. ప్రజలు నిస్తేజంగా జీవిస్తున్నారు. ఎవరిలోనూ చైతన్యం కనిపించడం లేదు.

పత్రికలవారు, ప్రజాప్రతినిధుల అకృత్యాలను విడవకుండా బయట పెడుతున్నా ప్రజలు వారినే ఆదరిస్తున్నారు.

రాజకీయాలలో ఉండదగనివాళ్ళు, ప్రొఫెసర్లు, కుళ్ళు రాయజకీయాలతో ప్రజలకు విషాన్ని నూరిపోస్తున్నారు. గన్నేరుకాయలు తినిపిస్తున్నారు. మంచితనాన్ని, భారత సంస్కృతిని నాశనం చేస్తున్నారు. విద్యార్థులలో, ప్రజలలో మాత్సర్యాన్ని నింపుతున్నారు. పౌర హక్కులను కాలరాస్తున్నారు. రజాకార్లు, నైజాం నవాబులూ గొప్పవారని చెప్పేవారి బాటలో నడిచే ప్రజలకు ఏమి జరగాలో అది తప్పక జరుగుతుంది.

ఈ ప్రొఫెసర్లకు, నాయకులకు, మనిషి అంటే ఏమిటో తెలుసా? దేశమంటే ఏమిటో తెలుసా? సమాజం ఎలా ఏర్పడిందో తెలుసా? ఈ మూడు ప్రశ్నలలో ఒక్కొదానికి జవాబు చెప్పలేరు. అసలు అభివృద్ధి అనే పదానికి అర్థాన్ని ప్రజలు మరచిపోయారు. తెలిస్తే ప్రజలు వీరి బాటలో నడవరు.

మానవలోకం - మానవలోకం - మానవలోకం !
ఇది మాయాలోకం కానేకాదు - మానవలోకం !!
ఇదంతా మంచిని మాత్రం పాడుచేసే మానవలోకం.
మాయ మాటలు చెబుతూ మోసంచేసే మానవలోకం.
దౌర్జన్యం రాజ్యం చేస్తుండే నేతలుండే లోకం ....!!
కడుపుకు కూడు దినడం చేతకాని సిగ్గులేని లోకం
ఇంతగడ్డేస్తుంటే తింటుంటారు ఎంత కాలమైనా
ప్రజలంటే పట్టనివాడంటేనే ప్రజలకు ఎంతోఇష్టం !!
అదేమో రాక్షసరాజ్యం అంటేనే ప్రజలకు ఇష్టం
రెచ్చగొట్టే మాటలు వింటుంటేనే ఒళ్ళు తెలియదేమో?
తమ నోట్లో తామే మట్టిగొట్టుకుని చప్పరించులోకం !!

కొన్ని వందల ఏళ్ళుగా పరాయి పాలనలో మగ్గిన భారతదేశ ప్రజలు హిందూధర్మాన్ని, సంస్కృతిని మరచిపోయి పసిపిల్లల్లాగ ప్రవర్తిస్తున్నారు. ఏది మంచి? ఏది చెడు అనే విజ్ఞతను మరచి, సభ్యత, విచక్షణలను పాటించడాన్ని మరచిపోయారు. దేనివలన ప్రజలు ఇలా తయారయ్యారని, ప్రభుత్వం పట్టించుకోలేదు. ప్రజలను గాలికి వదలి, వేలు - లక్షల కోట్లను కూడబెడుతూ, ప్రజాప్రతినిధులే ప్రభుత్వం లేదనేలా ప్రవర్తిస్తున్నారు.

ప్రపంచమంతా ఇదే విధంగా ఉన్నాగాని, మనదేశ పరిస్థితి మాత్రం దారుణంగా ఉన్నది. మానవతస్థాయి ఉండాల్సిన స్థాయిలో ఉండవలసిన విధంగా లేనందువల్లనే మనదేశ పరిస్థితి దిగజారిందని చెప్పవచ్చును. మానవత ఎంతో గొప్పది. ప్రజలు ఏనాడూ దానికి దూరం కాకూడదు. అసలు మానవత దూరం కావడానికిగల కారణాలను ఎవరైనా చెప్పగలరా? ఒక సంగతిని మాత్రం నేను చెప్పగలను. ప్రభుత్వం తన విధులను విస్మరించి ప్రవర్తిస్తున్నందువలన ప్రజలలో మానవత లోపిస్తుంది.

ప్రపంచానికి ఆదర్శప్రాయమైనది ఏది ? అంటే భారత సంస్కృతి అని మాత్రమే చెప్పాలి. ఈనాడు భారత సంస్కృతి, మన సమాజంలో ఉన్నదిగాని, అది చెప్పుకోదగినదా?

భారతీయులందరూ మానవతతో వ్యవహరించేవారే. సరైన శిక్షణ లేనివారు కామ, క్రోధ, లోభ, మద, మోహ, మాత్సర్యాలతో విచక్షణలేకుండా ప్రవర్తిస్తుంటారు. ప్రపంచదేశాలన్నింటిలోనూ మొదటగా మానవత్వాన్ని ప్రదర్శించినవారు భారతీయులే. తనను ఎడతెరిపిలేకుండా ఎన్ని బాధలు పెట్టినా మానవత్వాన్ని చూపించేవాడు భారతీయుడే. మానవత్వాన్ని చూపేవాళ్ళు దుష్టుల ఎడ కఠినంగా వ్యవహరించాలి. దేవతలు - రాక్షసులను ఎప్పుడూ, ఎక్కడా ఆదరించలేదు. దేవతలు - రాక్షసులు ఒక తండ్రి బిడ్డలే. మంచి పని చేసినవాళ్ళకే మంచిపేరు రావాలి. అప్పుడే మానవతకు విలువ ఉంటుంది. ప్రతి భారతీయుడూ, తాను భారతీయుడనని గర్వంగా చెప్పుకోవాలి. ●

## మాలతీ పరిమళమ్ !

- మునగంటి వేంకట రామాచార్యులు. ఫోన్ : 9295753960

మాలతీలత వాడివన్నె తరిగిందా?
సుమాలు చివికి శిథిలమయ్యాయా?
జీవన సిరుల నందించే శ్రావణమే
నీకు శిశిర శరాఘాతమైనదా?
ఆంధ్రప్రభ వారపత్రిక! ప్రమదావన శీర్షిక !
అర్థశతాబ్దికిపైగా అసంఖ్యాక పాఠక,
ప్రశ్నల పరంపరకు తరుణోపాయవేదిక !
వారి అంతరంగాలకు హంసతూలికాడోలిక!
ఒక సూర్యుడు వెలుగు నిచ్చినట్లుగా,
ఒక చంద్రుడు వెన్నెల నిచ్చినట్లుగా,
ఒక "మాలతి" పాఠకులకు దిక్సూచిక,
ఒక దిశా నిర్దేశిక ! ఒకానొక నిఘంటువు !
అండపిండాల నుంచి బ్రహ్మాండాల వరకు
పరమాణువుల నుంచి పాలపుంతల వరకు
ఎంతటి సమగ్రత ! మరెంతటి వైవిధ్యం !
సుమాలు వాడినేలవాలినా, లతలు అంతరించినా
ఆ భావ పరిమళ వీచికల అనుస్పర్శలు అజరామరం!
అనంత దిగంతాల వరకు అవి పరివ్యాపితం !!

# మహిళా మేలుకో

- వి.ఎస్. పారిజాతం, హైదరాబాద్, ఫోన్ : 9394428362

మహిళల పట్ల జరుగుతున్న హింసాత్మక దౌర్జన్యాన్ని అరికట్టే రోజులు ఎప్పుడొస్తాయో తెలియకున్నది. సభల్లో మైకు చేతికందితే చాలు, ఎన్నో వాగ్దానాలు చేస్తుంటారు రాజకీయ నాయకులు. అది ఆచరణలోకి వచ్చేది కాదు. రోడ్డుపైన ప్రయాణించే మహిళ ఎలాంటి కష్టాలు పడకుండా, తన ఇంటికి క్షేమంగా చేరుకుంటుంది అనే నమ్మకం లేకుండాపోతుంది ఈ రోజులలో.

పురాణకాలంలో సత్యభామ, రాజులకాలంలో రాణీరుద్రమదేవి, ఝాన్సీ లక్ష్మీబాయి, రాణీ కర్ణావతి, కిట్టూరు చెన్నమ్మ, పలనాడు నాయకురాలు నాగమ్మలకేసి కన్నెత్తి చూసిన పురుషుడు ఎవరూ లేరనుకుంటా. ధైర్యం సాహసం కలిగిన తల్లులు, జిజియాబాయి, మాంచాల, కుంతి మొదలైన వారు తమ పుత్రులను బాల్యం నుంచే నీతి నిజాయితీ, ఆడవారిపట్ల గౌరవం మర్యాదలు మొదలైనవి. ఉగ్గుపాలతో రంగరించిపోశారు. జాతిపిత తల్లి పుత్‌లీబాయి కొడుకు విదేశాలకు వెళ్ళేముందు "మద్యమాంసాలు ముట్టనని" ప్రమాణం చేయించుకుని పంపింది. అందుకనే చెడు సావాసాలు చేయకుండ, అబద్ధాలు ఆడకుండ ఆయన భారతదేశంలో ప్రతి ఒక్కరూ ఒంటినిండా బట్టలు కట్టుకుంటేనే తాను కూడా నిండుగా వస్త్రాలు ధరిస్తానని శపథం చేసుకుని, చలి ఎండబాధలకోర్చి సగం బట్టలే ధరించాడు. "ఆడవాళ్ళు అర్ధరాత్రి స్వతంత్రంగా బయటి నుంచి ఇంటికి చేరితే ఆ రోజు నుంచి స్వతంత్రం వచ్చినట్లు" అని పలికారు. కానీ అలాంటి స్వాతంత్ర్యం నేటికీ రాలేదు.

"మొన్న నిర్భయ, అటుమొన్న శ్రీలక్ష్మీ ...ప్రణీత ... స్వప్నిక ... మాయావతి...!" ఇలా చెప్పుకుంటూ పోతే ఎంతోమంది విద్యార్థినులు ... గృహిణులు, పసిపిల్లలు..!! దుర్మార్గులు చేసే వికృత చేష్టలకు బలిఔతున్నారు. ఎన్ని చట్టాలు చేసినా... ఎంతమంది పోలీసులు శ్రమించినా, బూడిదలో పోసిన పన్నీరవుతున్నది. ఐదేళ్ళ పసిపిల్లలు ఎవ్వరిని కవ్వించారని అసభ్యమైన దుస్తులు ధరించారని ... వారి బంగారంలాంటి భవిష్యత్తు భగ్నమయ్యింది? నలిపి పువ్వుల్లా చేసి, చివరకు నిర్దయగా హత్యలు కావిస్తున్నారు.

కేవలం ఆడవారు .. వీళ్లు ఏమీ చేయలేరు ... అనే తెగింపుతోనే ఇలాంటి నేరాలకు పాల్పడుతున్నారు మృగాళ్లు. ముఖ్యంగా ఇలా తెగింపుకు కారణం ఒళ్ళుతెలియని మద్యంతాగే అలవాటు. అది తలకెక్కితే విచక్షణా జ్ఞానం నశిస్తుంది. బర్త్‌డేలు అంటూ న్యూ ఇయర్ సెలబ్రేషన్స్ ...అంటూ ప్రతిచోటా తాగితందనాలాడుతూ, అర్ధరాత్రుళ్లు హంగామా చేస్తుంటారు. కొందరు అమ్మాయిలు సహితం మేమూ మగాళ్లతో సమానం, ఎందులో తీసిపోము.... ! అనుకుంటూ బాయ్‌ఫ్రెండ్స్‌తో ఎంజాయ్ చేస్తుంటారు. అసలు ఇలాంటి వారివల్లనే, ఎవరి జోలికి పోకుండా, చదువే తమ సర్వస్వం అని నమ్మేవాళ్లను ఇలాంటి ఊబిలోకి లాగుతుంటారు. ఎప్పుడన్నా ఇతరుల కంట్లో పడితే తప్పించుకోవటానికి ఎవరో ఒకరు కావాలికదా ?

నేటి అమ్మాయిలు ర్యాంకులు సంపాదించి ఎంతో ఎదిగి, మగవారికి తీసిపోని మనోధైర్యంతో రాజకీయాలలో రాణిస్తున్నారు. ఈనాడు ఇందిరా గాంధీ మొదలుకొని సుష్మాస్వరాజ్, ప్రతిభా పాటిల్, మాయావతి, మమతా బెనర్జీ, అంబికా సోనీ, జయలలిత మొదలైన ధీరవనితలు రాజ్యాలేలుతున్నారు. రోదసిలోకి వెళ్ళిన సునీతా విలియమ్స్, చంద్రమండల యాత్రలు చేసిన వాళ్ళు, పర్వతారోహకులు, ఆటల్లో రాణించిన వాళ్ళు, ధీరత్వం తెగువ కలిగిన మహిళలే. కండక్టర్లు, ఆటోడ్రైవర్లు, పెట్రోల్ బంకుల్లో ఉద్యోగాలు, మోటార్ మెకానిక్‌లు, డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, జడ్జీలు, లెక్చరర్లు, ఉపాధ్యాయినులు రాళ్లు మొదలగు మహిళలు వాళ్ల వృత్తి ధర్మం ద్వారానే పేరు, ప్రతిష్టలు సంపాదించారు.

కానీ మగవాడు అనే అహంకారంతో కామాంధులుగా మారి, విచక్షణ లేకుండా ఆడవాళ్ళపట్ల అకృత్యాలకు పాల్పడుతున్నారు. ఆస్తులకోసం కూడా చిన్న పసిపిల్లలను చూడకుండా ఐదేళ్ల పిల్లలను సైతం వదలిపెట్టటం లేదు. తమ ప్రేమను కాదన్నారని ఆసిడ్ దాడులకు దిగే మృగాలకు, వావి వరుసలు చూడకుండా విద్యార్థినులపై దాడికి దిగే కామాంధులకు, ఏ ఉరిశిక్షా సరైంది? ఏ జైలు గోడలు వీళ్ల అకృత్యాలను ఆపలేవు. జైలు నుంచి ఏ బెయిలో సంపాదించి పాత పగలు మర్చిపోకుండా వారి జీవితాల్ని చిదిమేస్తున్నారు.

ప్రభుత్వమే స్పందించి ఇలాటి వాళ్లకు సరైన శిక్ష విధించటం తగిన శిక్ష. ఇంటరాగేషన్ చేసి నేరస్థులను పట్టుకుని మేము ఎందుకు బతికాము భగవంతుడా ... అంటూ ప్రతిక్షణం, చేసిన తప్పులను గుర్తు చేసుకుంటూ కుమిలి కుమిలి, జైల్లోనే జీవితాంతం శిక్షననుభవించేలా చేయాలి.

నిర్భయ కేసులో ఆ అమ్మాయి తన ఫ్రెండ్‌తో ఏ గవర్నమెంట్ బస్సునో ఎక్కి ఉంటే నిర్భయంగా ఇల్లు చేరగలిగేది లేదా ఏ ఆటోలోనో వెళ్ళినా, ఇంత ఉపద్రవం ఎదురయ్యేదికాదు. కాలేజీ విద్యార్థినుల నుంచి ఉద్యోగస్తులయిన మహిళలు బయటికి వేళ్తే ఏ ఐదారుగురో వెళ్లాలి. కరాటే లాంటి విద్యలు నేర్చుకుని ఉండాలి. బ్యాగ్‌లో ఏ కారం పొడి స్ప్రేచేయగలగే బాటిల్‌గాని, ఏ పెప్పెర్ పౌడర్ బాటిల్‌గాని, లేదా ఏ వంటసోడానో బాటిల్‌లో పోసి ఉంచుకుంటే ఆపదలో అలాంటి రాక్షసుల కళ్ళల్లో పడేలా చేసి తప్పించు కునే అవకాశం ఉంటుంది.

మనం భయపడితే అదో అలుసుగా భావిస్తారు. ఎదురుతిరిగి అందర్నీ పోగుచేస్తే వాళ్ళే భయపడి తోకముడుస్తారు. కాలేజీ పిల్లలు కూడా ఇలాంటి ట్రిక్కులు పాటిస్తే మంచిది. లేదా ఏ డ్రామా పిస్టల్‌లో ఉంచుకొని ఆపదలో వాడొచ్చు. ఆ బులెట్ గ్యాస్‌వి అయి ఉంటే మరీ మంచిది. ఇలా అపాయం రాకుండా ధైర్యంగా తమని తాము రక్షించుకోవాలి. ●



# విలువైన విలువలు

- టి.వి. సుబ్రహ్మణ్యేశ్వరరావు, మురమళ్ళ, ఫోన్ : 9908893669

"ఏ సమయంలో ఏ మనిషి జీవితం ఎలా మారుతుందో ఏ మనిషికీ తెలియకపోవడమే మనిషి తన జీవితంలో పొందే గొప్ప అనుభవం. ఇప్పుడు ఆ అనుభవం మనం పొందగలిగినందుకు సంతోషించాలో, ఇంతటి దుర్భర దుస్థితి పొందినందుకు దుఃఖించాలో తెలియడం లేదు లలితా!" శ్యాంప్రసాద్ చిన్న అద్దెగదిలో పాత కుర్చీలో కూర్చుంటూ భార్యతో అన్నాడు.

లలిత కుర్చీ ప్రక్కగా వచ్చి నిలబడి భర్త భుజంపై చేయివేసి "మీరు అధైర్యపడకండి, మీలాంటి మంచివ్యక్తికి ఆ భగవంతుడు పరీక్షపెడతాడు గాని, అన్యాయం చేయడు. ఈ భూమ్మీద కొద్దో, గొప్పో ఉన్న మంచి మనుషులను కాపాడుకోలేకపోతే, దేవుడి మనుగడకే ముప్పేర్పడుతుంది" అంటూ భర్తకు ధైర్యం చెప్పింది.

అక్కడక్కడా నాపరాళ్ళు దిగబడిపోయి, ఆ రాళ్ళు సగం వరకూ మట్టితో కప్పబడిపోయిన ఆ గదిలో ఓ మూలగా కూర్చుని చదువుకొంటున్న పిల్లలిద్దర్నీ చూసి శ్యాంప్రసాద్ మనసు రంపపుకోతకు గురవుతున్నట్లు బాధపడ్డాడు. "నేనేమి తప్పు చేసానని నాకీ శిక్ష?" మనసులో అనుకొన్నాడు. ఆ పాత కుర్చీలో విశ్రాంతిగా తల వెనక్కి వాల్చాడు. కనురెప్పలు వాల్చాడు. గతం అతని కళ్ళముందు సుడులు తిరిగింది.

* * *

"ప్రసాద్‌గారూ, మనం నష్టపరిహారాలు ఇలా ఇచ్చుకొంటూపోతే మన వ్యాపారం మూతేసుకోవలసిందే! పదేళ్ళు కష్టపడి వ్యాపారాన్ని అభివృద్ధి చేసింది మూతేసుకోవడానికా?" సురేంద్రనాథ్, శ్యాంప్రసాద్ మీద అరిచినట్లుగా అన్నాడు.

"మనమేమీ మూతేసుకోనక్కర్లేదు. మనం పాటించే నైతిక విలువలే మనల్ని మరింత అభివృద్ధివైపు నడిపిస్తాయి. మీరేమీ కంగారుపడిపోకండి. మనం ఇచ్చిన ఐదులక్షలవల్ల వాళ్ళ కుటుంబం నిలబడుతుంది. మీకు ప్రత్యక్షంగా కనిపించేది – ఈ సంవత్సరం మనకొచ్చే లాభంలో తలకో లక్షన్నర తగ్గడం. కాని, పరోక్షంగా మనకు లాభించేది మీరిప్పుడే చూడలేరు" శ్యాంప్రసాద్ తన వ్యాపార భాగస్వామిలిద్దరివైపు చూస్తూ అన్నాడు.

"ఏం గిరిధర్‌గారూ, మీరేమీ మాట్లాడరేంటి? లక్షో, లక్షన్నరో ఇస్తే, వాళ్ళు నోర్మూసుకొని వెళ్ళిపోయేవారు. ఏకంగా ఈయన ఐదులక్షలు ఇచ్చేసారు. మన కళ్ళు మూతల డ్రైవర్‌కి ఉద్యోగంలోకి తీసేసేటప్పుడు వాడికి కావలసింది ఇస్తే సరిపోయేదానికి, అది వాడికి ఇచ్చేసి వాడి భార్యను పిలిపించి రెండు నెలల జీతం అదనంగా ఇచ్చారీయన. మీకేమైనా తెలుస్తోందా?" మూడో భాగస్వామి అయిన గిరిధర్‌ని సురేంద్రనాథ్ ప్రశ్నించాడు.

"ప్రసాద్‌గారూ, మన బస్సుకిందపడినవాడికి కాలే కదా పోయింది. ఐదు లక్షలు ఇవ్వాలంటారా? ఎక్కువలో ఎక్కువ రెండు లక్షలు. అంతకు మించి అవసరమంటారా? సురేంద్రగారు అడిగేదాంట్లో పాయింట్ ఉంది కదా! మీరు దీనికి సమాధానం చెప్పవలసి ఉంది" శ్యాం ప్రసాద్ వైపు చూస్తూ గిరిధర్ అన్నాడు.

"కాలు ఇరగొట్టుకొన్న వ్యక్తి ఏ పని చేయగలడు? కుటుంబాన్ని ఎలా పోషించగలడు? అతని పిల్లలు పదొవ తరగతి వరకైనా చదువుకోగలగాలి కదా? వాళ్ళ తండ్రి కాలు మన బస్సు బలిగొన్నందుకు వాళ్ళు బాలకార్మికులుగా మారాలా? అంత చిన్న వయసులోనే కుటుంబ బాధ్యతలు మోయాలా? తప్పు మన డ్రైవర్ చేస్తే శిక్ష ఆ పసివాళ్ళకా? ఇక మన డ్రైవర్ విషయానికి వస్తే, మందునీళ్ళకు కక్కుర్తిపడి అతను తప్పుచేస్తే అతనికి వేరేచోట ఉద్యోగం దొరికే వరకూ అతని భార్యాపిల్లలు పస్తుండాలా? ఇవన్నీ మన వ్యాపారానికి సంబంధించిన నైతిక బాధ్యతలు. బాధ్యతలు మరచిపోయిన వ్యక్తి జీవితం ఏ స్థితికి చేరుతుందో, నైతిక బాధ్యతలు విడిచిపెట్టి చేసే వ్యాపారం కూడా అదే స్థితికి చేరుతుంది. ఈ విషయం మీరు కూడా తెలుసుకొంటే మంచిది" శ్యాం ప్రసాద్ భాగస్వామిలిద్దర్నీ ఉద్దేశించి అన్నాడు.

మనిషి చేసే దుర్మార్గపు పనులకు ఏదొక రూపంలో శిక్ష అనుభవించక తప్పదు. ఒక్కోసారి అతడు చేసిన మంచి పనులకు కూడా అతనికి శిక్ష పడుతుంది. మొదటిది దేవుడు వేసే శిక్ష. రెండోది దుష్టజనులు పన్నే కుట్ర. దేని ప్రభావం ఎంతో జగమెరిగిన సత్యం.

"వాడు పాటించే నైతిక విలువలు వాడ్ని ఎలా కాపాడతాయో చూద్దాం. ఏదో విధంగా ఖాళీ స్టాంపు కాగితాల మీద వాని సంతకాలు తీసుకొని, వాడ్ని రోడ్డుపాలు చేయాలి. లేకపోతే, మన మాట వినకుండా ఇష్టమొచ్చినట్లు నష్ట పరిహారాలు ఇచ్చేస్తాడా? వాడి సంగతి తేల్చేస్తాను" గిరిధర్‌తో సురేంద్రనాథ్ అన్నాడు.

తన మాట వినలేదన్న కోపంలో గిరిధర్ కూడా సురేంద్రనాథ్ మాటలకు "సరే" అన్నాడు గాని, మనసులో ఒక మూల 'శ్యాం ప్రసాద్‌కు అన్యాయం చేస్తున్నాం' అన్న బాధ కదలాడింది. కాని, సురేంద్రనాథ్ రెచ్చగొట్టే మాటలకు గిరిధర్ లొంగిపోయాడు.

ఏమైతేనేమి, శ్యాంప్రసాద్ ఎంతో ప్రేమగా కట్టించుకొన్న ఇంటిని కూడా కోల్పోయాడు. పాలరాతితో కేంద్రీయ శీతలీకరణంతో కట్టించుకొన్న ఇంద్ర భవనం అది. ఇంద్రభవనం కూడా శ్యాంప్రసాద్ ఇల్లంత సౌకర్యంగా ఉండదేమో!

ఆ ఇంట్లో శ్యాంప్రసాద్ పిల్లలు ఆడుతూ, పాడుతూ తిరుగుతూ, చదువుకొనే సమయం అయినప్పుడు వారి కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడ్డ గదిలోకి వెళ్ళి చదువుకోవడం శ్యాంప్రసాద్‌కి గుర్తుకొచ్చింది. వెంటనే ప్రస్తుతం ఉంటున్న ఇరుకు మురికి గదిలో ఆ పిల్లల దుస్థితి గుర్తుకొచ్చింది. శ్యాంప్రసాద్ ఉలిక్కిపడి లేచాడు.

* * *

ఎదురుగా పిల్లలు కనిపించలేదు. నలువైపులా చూశాడు. కట్టెల పొయ్యి దగ్గర భార్య, పిల్లలు కనిపించారు. పిల్లలు ఏదో నల్లటి పదార్థం తాగుతున్నారు.

"పక్కింటావిడ చోడుపిండి ఇచ్చింది. ఈ సమయంలో పిల్లలకు జావ కాసి ఇస్తే మంచిదని చెప్పింది. చోడుజావ ఇది" భర్త సంశయాన్ని నివృత్తి చేస్తూ లలిత అంది.

"పిల్లలు ఎంత అదృష్టవంతులు! ఈ పరిస్థితి రాకపోతే పిల్లలు చోడిజావ రుచి తెలుసుకోగలిగేవారా? డబ్బు అనుబంధాల్ని, అనుభూతుల్నే దూరం చేస్తుందనుకొనేవాణ్ణి. కాని, కొన్ని రుచుల్ని, కొన్ని పోషక విలువల్ని కూడా దూరంచేస్తుందని ఇప్పుడే తెలిసొచ్చింది" అనుకొన్నాడు శ్యాంప్రసాద్.

తెల్లటి దుస్తులతో, తెల్లటోపి ధరించిన వ్యక్తి శ్యాంప్రసాద్ నివసిస్తున్న ఇంటిముందుకొచ్చి నించున్నాడు. అతడు గిరిధర్ కారు డ్రైవరని శ్యాంప్రసాద్ గుర్తించాడు.

"అయ్యా! మీరొకసారి ఈ ప్రక్కకు వస్తారా?" డ్రైవర్ శ్యాంప్రసాద్‌ని కోరాడు.

"ఇంకా ఏమైనా సంతకాలు పెట్టించుకోవడం మరచిపోయారా మీ అయ్యగారు?" ఆ మాత్రం వ్యంగ్యంగా మాట్లాడకుండా శ్యాంప్రసాద్ ఉండ లేకపోయాడు.

"అదేం కాదయ్యా! మీకు మేలు చేయాలనే నన్ను పంపారు" ఎంతో వినయంగా డ్రైవర్ చెప్పాడు.

శ్యాంప్రసాద్ బయటకు వచ్చాడు.

"ఎవరూ చూడకుండా మీకీ పెట్టె ఇమ్మన్నారయ్యా!" అదే వినయంతో చెప్పాడు.

అది డబ్బు పెట్టెలా ఉంది. శ్యాంప్రసాద్ చుట్టూ చూశాడు. దూరంగా గిరిధర్ కారు కనిపించింది. పెట్టెతీసుకొని కారువైపు శ్యాంప్రసాద్ నడవసాగాడు.

"ఐదు లక్షలని చెప్పమన్నారయ్యా!"

"నాకు లెఖ్ఖపెట్టడం వచ్చులేవయ్యా"

శ్యాంప్రసాద్ కారు దగ్గరకు రాగానే గిరిధర్ కారుదిగి తలదించుకొన్నాడు.

"తలెత్తుకొనే పనిచేసిన సమయంలో తలదించుకొన్నారేంటి?" శ్యాంప్రసాద్ గిరిధర్‌ను చూస్తూ అన్నాడు. ఆ వాక్యంలో "నువ్వు ఇంతకు ముందు చేసింది తలదించుకొనే పనే" అనే అర్థం ధ్వనించింది.

"ఆ సమయంలో, సురేంద్రనాథ్ చెప్పినదానికి ఎలా తలాడించానో నాకే అర్థం కావడం లేదు. నాక్కూడా మీమీద కోపం ఉండడంతో అలా చేసుంటానని అనిపిస్తోంది. ఇప్పుడు నాది మీకేం సహాయం చేయలేని పరిస్థితి. చేసినట్లు తెలిస్తే అతను నన్ను కూడా వదలడు అన్నాడు. అందుకే రహస్యంగా ఇది" గిరిధర్ చెప్పటం పూర్తిచేశాడు.

"ఇప్పటి వరకూ మీ ఇద్దరి గురించీ బెంగపడ్డాను. ఇప్పుడు సగం బెంగ తగ్గింది" శ్యాంప్రసాద్ అన్నాడు.

"అదేంటండి? నాకేమీ అర్థం కాలేదండి ప్రసాద్‌గారూ" గిరిధర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"మీలో ఎంతో కొంత నైతిక విలువల స్పృహ ఉందికాబట్టి మీరు మరీ పతనం కారు. ఇప్పుడు నా బెంగంతా సురేంద్రనాథ్‌గారి గురించే. ఎంతటి దీనావస్థకి నెట్టివేయబడతారో అని భయంవేస్తోంది" శ్యాంప్రసాద్ అంటుంటే గిరిధరూ, అతని డ్రైవరూ ఆశ్చర్యంగా చూసారు.

కారు నడుపుతున్న డ్రైవర్‌తో గిరిధర్ "ఏంటీయన, మా ఇద్దరిమీద ఈయనకి కోపం లేదా?! మమ్మల్ని చూసి జాలిపడుతున్నాడా?! విచిత్రమైన మనిషా? గొప్పమనిషా? అన్నాడు.

"ఆయన గొప్పతనం గురించి మీకు తెలియనిది కాదు. అంత మంచి మనిషిని బాధపెట్టి పొరపాటు చేసారయ్యా! మీ తండ్రి లాంటివాణ్ణి కాబట్టి ధైర్యంచేసి చెప్పాను. తప్పైతే క్షమించండయ్యా" అన్నాడు డ్రైవర్.

"సర్లే, పోనీ" అన్నాడు గిరిధర్ డ్రైవర్‌తో చర్చించడం తన గౌరవానికి భంగం అని గుర్తుచేసుకొంటూ.

శ్యాంప్రసాద్ రెండు ఆటోలతో మరల వ్యాపారం మొదలుపెట్టాడు. ఎంత నష్టం వచ్చే పరిస్థితుల్లోనైనా, ఎంత ఇబ్బందికర సందర్భాల్లోనైనా తాను నమ్మిన నైతిక విలువలను విడువలేదు. ధక్కా, ముక్కా తింటూ, కిందా, మీదా పడుతూ వ్యాపారాన్ని అభివృద్ధివైపు నడిపిస్తూనే ఉన్నాడు. నష్టాల్ని, కష్టాల్ని తన నైతిక ప్రవర్తనకు దేవుడు పెట్టే పరీక్షగా భావిస్తూ ఉత్తీర్ణుడవుతూ ఉండేవాడు.

కాలం తన పని తాను చేసుకొంటూ పోతోంది. రోజులు, నెలలు, సంవత్సరాలు ఏవీ ఆగవు, దొర్లిపోతూనే ఉన్నాయి.

శ్యాంప్రసాద్ తాను ఇష్టపడి కట్టుకొన్న ఇంటిని ఎక్కువ డబ్బిచ్చి తిరిగి కొనుక్కొన్నాడు. తిరగడానికి బెంజికారు కొనుక్కొన్నాడు. ప్రైవేటు బస్సుల వ్యాపారం, లారీల కిరాయి వ్యాపారం దినదిన ప్రవర్ధమానంగా సాగుతున్నాయి. ఆటోలు త్రిప్పడం లేదు. మొదట కొన్న రెండు ఆటోలు అతని ప్రహరిలో ఓ ప్రక్కన ఉన్నాయి. జీవంలేని వాటిపై కూడా అతని ప్రేమ ప్రసరిస్తూనే ఉంటుంది. అయితే, మనుషుల తర్వాతే మిగతావాటి స్థానం.

సురేంద్రనాథ్‌తో విడిపోయిన తర్వాత గిరిధర్ అనుభవంలేక దివాలా తీసినా, నిలదొక్కుకొని, ఓ పాత సిటీ బస్సు నడుపుకొంటూ అన్నవస్త్రాలకు లోటు లేకుండా జీవిస్తున్నాడు. శ్యాంప్రసాద్‌కు విషయం తెలిసిన తర్వాత అతని సహాయంతో మోటారు వాహనాల విడిభాగాల కొట్టు పెట్టుకొని, ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చుకొన్నాడు.

శ్యాంప్రసాద్ సహాయం చేద్దామన్నా అందుకోలేని స్థితికి సురేంద్రనాథ్ పతనమయ్యాడు. భికారై రోడ్డుమీద పడి తిరుగుతున్నాడు. ఆ విషయం గిరిధర్ ద్వారా శ్యాంప్రసాద్ తెలుసుకొని, అతన్ని ఓ సురక్షితమైన చోటుకి చేర్చి ఆకలి దప్పిల బాధ తీరే ఏర్పాటుచేశాడు.

కొన్నాళ్ళకు సురేంద్రనాథ్ కోలుకున్నాడు. జరిగింది గిరిధర్ చెప్పాడు. సురేంద్రనాథ్ ప్రవహిస్తున్న కన్నీటిని తుడుచుకొని "ధనం, బలం, బలగం, మేధస్సు ఇవన్నీ అశాశ్వతమైనవి. కొన్ని నెలలుగా నేను బతికి ఉన్న విషయం నాకే తెలీదు. అంతగా క్షీణించిన నా మేధస్సు శ్యాంప్రసాద్ చేయించిన వైద్యంతో కోలుకొంది. విలువలేని వాటికి విలువిచ్చి విలువైన వాటిని కోల్పోయాను. శ్యాంప్రసాద్ ఎపుడూ విడిచిపెట్టని ఆ విలువైన విలువలే అతన్ని కాపాడాయి" సురేంద్రనాథ్ మనసులోని ఆర్ద్రత అతని గొంతులో తెలుస్తోంది.

సురేంద్రనాథ్ ఆస్తి పోయిన తర్వాత కొడుకు తండ్రితో పోట్లాడి వెళ్ళిపోయాడు. చివరకి భార్యకూడా భర్త స్నేహితుడుగా పరిచయం అయిన వ్యక్తితో వెళ్ళిపోయింది. ఇవన్నీ పాతస్నేహితుల ఇద్దరి మెదడుల్లో మెదులుతున్న సమయంలో, సురేంద్రనాథ్ కోసం శ్యాంప్రసాద్ పంపిన కొత్త దుస్తులను అక్కడి పనివాడు లోపలకు తీసుకొచ్చి, "శ్యాంప్రసాద్‌గారు పంపారు" అని చెప్పాడు.

"సురేంద్రనాథ్‌కి ప్రతీకారం అంటే ఏమిటో అర్థమైంది, నైతిక విలువలు ముఖ్యమైనవి" అన్నాడు గిరిధర్. ●

## తెలుగు వెలుగు

- డా॥ కాటూరి ప్రభుదాసు, విజయవాడ. ఫోన్ : 9494056703

కం. సృష్టిజేసితి నిష్టతో
భ్రష్టుజేసే సాతాను దృష్టిపడెన్,
సృష్టికి భిన్నమై పుట్టినాడు
దివిని భువిని రెండుగా జేసినాడు
అమ్మ ఇక్కడ
అవని అన్నిటిపైన అధికారి అతడు

కం॥ కృష్ణమ్మా, గంగమ్మ కావేరి పెన్నానదుల సాక్షి
ప్రారంభమైనాయి ప్రపంచ తెలుగు రచయిత
మహాసభలు దివ్యమంగళ శుభప్రదమైన
ఆనవాళ్ళు ఎల్లలు లేని కవీశ్వరుల సత్కీర్తి గానాలు.

# తిక్క కుదిరింది

- కె. రామయ్య, సదుం, ఫోన్ : 9704025771

ఉదయం ఏడు గంటలవుతోంది. కాంట్రాక్టరు రమణారావు ఉప్పరపల్లెకు వచ్చాడు. పల్లెలో ఎదురుపడిన సుబ్రహ్మణ్యం రాజప్పలను చూసి

"ఏందిరా ఇంకా ఇక్కడే ఉన్నారు. ఆరు గంటలకు పనికి రమ్మని చెబితే ఇంకా తూగుతూనే ఉన్నారా" అని అరిచాడు.

"వస్తున్నామయ్య, చంటిబిడ్డకు ఒంట్లో నలతగా ఉంటే ఆకు పసరు వేయించినా, అందుకే ఆలస్యమయ్యింది" సుబ్రమణ్యం వినయంగా చెప్పాడు.

"మావాణ్ని పట్నంలో బడిలో చేర్పించాలని అనుకొని సర్దుకొంటున్నా, అంతలోనే ఆలస్యమయింది!' రాజప్ప తెలిపాడు.

"ఒరేయ్ బడి, గుడి అని పిల్లోల్ని చెరచమాకు. ఇప్పుడు చదువుకున్నోళ్లే పనిలేక చస్తుంటే మీవాడు చదివి ఎవరిని ఉద్ధరించాలి. మన ఊళ్లో చదువుమాట ఎత్తితే పోలేరమ్మ శాపం పెడుతుంది. వెళ్లి వాణ్ని కూడా పనిలోకి తీసుకు రాపో ... వెల్లు, వెళ్లరా" అని రమణారావు అనడంతో

"అవునురా పోలేరమ్మకు కోపమొస్తుంది పదరా" అని ఇద్దరూ బండకొట్టే పనికి వెళ్లారు.

ఉప్పరపల్లె గ్రామం మారుమూల అటవీ సరిహద్దులో ఉంది. ఇక్కడికి వెళ్లాలంటే మండల కేంద్రం భీమునిపట్నం నుంచి బలిజపల్లె వరకు బస్సులో వెళ్లాలి. అక్కడి నుంచి సుమారు 6 కి.మీ. రాళ్లు, రప్పల మధ్య నడచుకొంటూ వెళ్లాల్సిందే. గ్రామానికి దగ్గర్లోనే బండ ఉండటంతో గ్రామస్తులు బండపై రాళ్లు, కంకరకొట్టి జీవితం వెళ్లదీస్తున్నారు. అధికారులెవరూ ఆవైపు కన్నెత్తి చూడకపోవడంతో రమణారావులాంటి కాంట్రాక్టర్లు చిన్న, పెద్ద అని లేకుండా అందరినీ పనిలో పెట్టుకొని ఇష్టమొచ్చినంత కూలి ఇస్తూ అతను మాత్రం బాగా సంపాదించుకొంటున్నాడు. ప్రజలకు మాత్రం తిప్పలు తప్పడం లేదు.

సాయంత్రం ఆరుగంటలైంది. బండమీద పనులు చేస్తూనే ఉన్నారు. సుబ్రమణ్యం వచ్చి "అయ్యా పొద్దున వచ్చిన, ఇంటిదగ్గర బిడ్డకెట్టుందో చూసొస్తా" అని రమణారావుతో మొరపెట్టుకున్నాడు.

"రేయ్ నీ బిడ్డకు ఏమీ కాదుగానీ అవతల బండలకోసం లారీ వచ్చే వేళయింది పనిచూడు" రమణారావు గద్దించాడు.

రమణారావు బండదిగి సారా బట్టీ వద్దకు వచ్చాడు. అక్కడ ఉన్న వారితో చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే వారు సారాక్యాన్‌తో బండపైకి వచ్చారు.

సాయంత్రం ఆరుగంటలు దాటిపోయింది. పెద్దా, చిన్నా ఇంకా రాళ్లు కొడు తూనే ఉన్నారు. లారీ మాత్రం రాలేదు. రమణరావు వచ్చాడు. వస్తూనే "రేయ్ లారీ వచ్చేంత వరకు రాళ్లు కొట్టాల్సిందే, రండి, రండి" అని పిలిచాడు. అందరూ రావడంతో క్యాన్‌నుంచి సారాను ఒంపి అందరికీ అందించారు. పిల్లలు సందట్లో సడేమియా అని పారిపోయారు. తాగినవారికి తాగినంత మహదేవ! అని సారాతాపించి మళ్లీ పనిలోకి పంపాడు.

రాత్రి తొమ్మిదైనా ఇళ్లకు భర్తలు రాలేదు. ఆ తర్వాత సుబ్రమణ్యం, రాజప్పలు తూలుతూ వచ్చారు. రాజప్ప తన భార్యచేతిలో 20 రూపాయలు పెట్టాడు.

"ఏందయ్యా పొద్దస్తమానం కష్టపడితే సచ్చినోడు సారాపోసి 20 రూపాయలు చేతిలో పెడితే మన సంసారం ఎట్లా గడుస్తుందో చెప్పయ్యా" అని రాజప్ప భార్య సుమతి నిలదీసింది.

"మన బిడ్డకు ఒంట్లో బాగాలేకుంటే, నీవేమో తాగి ఇంటికొస్తే వాడి ఆరోగ్యం ఎట్లా బాగవుతుంది చెప్పు" అని సుబ్రమణ్యం భార్య లలిత ఏడుస్తూ వాపోయింది.

మన బతుకులు ఇంతేనా, మనకు దారిచూపే వారేలేరా? అని లలిత వాళ్ల అత్త రాజమ్మ మూలుగుతోంది.

* * *

"అలా కొన్నాళ్లు గడిచాయి..."

ఒకరోజు ఆ పంచాయితీకి రామచంద్ర అనే పంచాయితీ కార్యదర్శి బదిలీపైవచ్చారు. కొత్తగా ఉందే ఈపల్లె అంటూ అక్కడికి వెళ్లాడు. ఉదయం నుంచి రాత్రి వరకు గ్రామంలోనే ఉండి అన్నీ గమనించాడు. తన తండ్రి రంగారావు ప్రభుత్వ ఉద్యోగంలో ఉండి చనిపోతే తనకు ఈ ఉద్యోగం ఇచ్చారు. రంగారావు చనిపోతూ "నీకు చేతనైతే ఎవరికైనా సాయం చెయ్యి, అంతేకాని చెడుమాత్రం చెయ్యకు" అన్న మాటలు రామచంద్రచెవుల్లో మారుమ్రోగాయి.

ఈగ్రామస్తులకు మేలు చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. రాత్రి గ్రామంలోని సుబ్రమణ్యం ఇంటివద్దకు వెళ్లాడు. ఎవరో కొత్తగా ఉన్నాడే అని లలిత మనసులో అనుకొంటూ

"ఎవరు కావాలి బాబు మీకు" అని అడిగింది.

"మీ ఊర్లో కాలనీ ఇళ్లు ఎవరూ కట్టుకోలేదామ్మా" అని అడిగాడు.

"ఏం మీరు కట్టిస్తారా?" అని ఇంట్లోనుంచి సుబ్రమణ్యం వెలుపలికి వచ్చాడు.

"నేను చెప్పినట్లు వింటే ఇళ్లు కట్టిస్తా"

ఈ మాటవినడంతో చుట్టుప్రక్కల ఉన్నవాళ్లు అక్కడికి చేరుకొన్నారు.

"ఇంతకూ మీరెవరు?" గుంపులోంచి ఎవరో అడిగారు.

"నేను పంచాయితి కార్యదర్శిని, మీ బాగోగులు చూసుకోవడానికి వచ్చాను".

"ఇంతవరకు మాఊరికి ఏ ఆఫీసరురాలేదు, నువ్వొచ్చావు, నమ్మాల్సిందే" అని శీనప్ప అక్కడికి వచ్చాడు.

"చెప్పండిబాబు ఏం చెయ్యమంటారు" అని వస్తూనే అడిగాడు.

"మీ పిల్లలకు బడికి పంపాలి, సారామానివేయాలి, పొదుపు అలవాటు చేసుకోవాలి" రామచంద్ర చకచకా చెప్పాడు.

"పగలంతా పనిచేయించుకొని ఆసచ్చినోడు సారాపోయించి 20 రూపాయ లిస్తున్నాడు, మెమెట్లా పొదుపు చేసేది సామి?" అని లలిత వాపోయింది.

"అంతేనా, నేను చెప్పినట్లు చెయ్యండి. రోజుకు రెండొందలు వచ్చేలా చేస్తా".

"నిజంగానా సామీ? అట్టేచేస్తాం. సెప్పు" రాజప్ప అన్నాడు. అందరిని కూర్చోమని చెప్పి "రేపటి నుంచి పిల్లల్ని బడికి పంపించాలి, సారా తాగరాదు" అని రామచంద్ర అంటుండగా ...

"పిల్లలు బడికిపోతే పోలేరమ్మ చంపేస్తుందని రమణరావు చెప్పాడు సామి"

"అటువంటిదేమీలేదు, నేను ఇక్కడే ఉంటాను. బడికి పంపండి. ఏదైనా జరిగితే బడికి పంపవద్దులే"

"అట్టాగే స్వామి, మరిమాకు కూలి కరెక్టుగా ఇస్తారా".

"ఇస్తాము, రేపటి నుంచి కాంట్రాక్టరు వద్దకు వెళ్లకండి, సరేనా" అని రామచంద్ర చెప్పడంతో అందరూ ఇళ్లకు వెళ్లిపోయారు. ఆరాత్రి అతను అక్కడే గ్రామంలో నిద్రపోవడంతో గ్రామస్తులు అతన్ని నమ్మారు.

ఉదయం 7 గంటలకే కంట్రాక్టరు రమణరావు వచ్చి అందరిని పనిలోకి పిలిచాడు. "ఉదయం 9 గంటలకు వస్తాం వెళ్ళు" అని ప్రజలు తిరగబడటంతో

"ఏందిరా కొత్తగా ఉంది" అని దబాయించబోయాడు.

"అవును, ఉదయం 9 నుంచి సాయంత్రం 5 గంటల వరకే పనిచేస్తారు. కూలి రోజుకు రెండొందలు ఇవ్వాలి. లేదంటే పనిలోకి రారు" అని కార్యదర్శి రామచంద్ర చెప్పడంతో రమణరావు బిక్కచచ్చిపోయాడు. అక్కడినుంచి విసవిసా వెళ్లి పోయాడు.

రామచంద్ర మండల పరిషత్ కార్యాలయానికి వచ్చి అక్కడ అధికారులతో మాట్లాడి ఆ గ్రామానికి రోడ్డు నిర్మించేపనిని మంజూరుచేయించాడు.

మరుసటిరోజు ఉదయమే మండల అభివృద్ధి అధికారిని పిలుచుకొని వెళ్లి పని మొదలుపెట్టించాడు. సాయంత్రానికి కూలిగా రెండొందలు చొప్పున అందించాడు. ఒక్కసారిగా అంత డబ్బు చూసేసరికి వారికి సంతోషమై పోయింది.

ఆ మరుసటి రోజు సుబ్రమణ్యం ఇంటివద్ద ఆ ఊర్లో పిల్లలకోసం విద్యా వాలంటీరుతో బడి ప్రారంభించారు. పిల్లలంతా బడికిపోవడంతో పాటు ఆ రాత్రి ఎవరికీ ఏమీ జరగకపోవడంతో గ్రామస్తులు పిల్లలను పాఠశాలకు పంపే అలవాటు చేసుకొన్నారు.

బండపైకి పెద్దలు, పిల్లలు పనిలోకి రాకపోవడంతో కాంట్రాక్టరు రమణా రావుకు ఏమీతోచలేదు. వీరిని నమ్మి రోజూ డబ్బులు సంపాదించు కొంటుంటే ఇప్పుడు నిండామోసం జరుగుతోందే అని మదనపడిపోసాగాడు.

నేరుగా రామచంద్రవద్దకు వెళ్లాడు.

"సార్ మీరు చెప్పినట్లే కూలి రోజుకు రెండొందలు ఇస్తాను, సారా పొయ్యను. పనిలోకి మనుషుల్ని పంపించండి" అని వేడుకున్నాడు.

"రోడ్డుపనిపూర్తయ్యాక వస్తారు వెళ్లు" అని రామచంద్ర చెప్పడంతో వెళ్లి పోయాడు.

రోడ్డు నిర్మాణం పూర్తయి రహదారి బాగుపడటంతో గ్రామస్తులు సంతోషించారు. కాంట్రాక్టరు రమణరావు ఇప్పుడు రోజుకూలి సక్రమంగా ఇస్తున్నాడు. గ్రామంలో సారాకంపు లేదు. పిల్లలు పాఠశాలకు వెళుతున్నారు. ప్రభుత్వం కాలనీ ఇళ్లు మంజూరు చేసింది.

"కాంట్రాక్టరు రమణారావుకు తిక్కకుదిరిందని" గ్రామస్తులు చెపుతుంటే రామచంద్ర అక్కడి నుండి బయలుదేరాడు. ●

## ఋతువులతో పాటు ముందుకు సాగిపోతూ ...

- పొత్తూరి సుబ్బారావు, హైదరాబాద్. ఫోన్ : 9490751681

వసంతాగమనాన్ని ఆహ్వానించే చెట్టు
తన కొమ్మలపై కూర్చొని
రాగాలాపన చేసే కోకిల గీతాలకు
పరవశించి నాట్యమాడుతుంది

పచ్చదనాన్ని కోల్పోయిన మనిషి
వసంతమొచ్చిందన్న ఆతురతతో
కోకిల కూతలను సెల్‌ఫోన్
రింగ్‌టోన్‌లో విని
అల్పసంతోషి అవుతాడు

చెట్టు గ్రీష్మతాపాన్నంతా
తాను ఆస్వాదించి
తాను వడగాడ్పులలో
గడగడలాడినా
భూమాతను చల్లబరచి
సేదతీరిస్తుంది.

వర్షానికి హర్షించిన చెట్లు
తనపై పడిన జల్లులతో
ఆకులపై పేరుకున్న మట్టిని కడిగి
కాలుష్యానికి కాలంచెల్లేలా చేస్తుంది

శరదృతువు అందించిన
పండువెన్నెలను పట్టుకొన్న చెట్టు
వన్నెచిన్నెలతో కనువిందు కలిగిస్తుంది

హేమంతపు శీతలాన్ని స్వీకరించి
చెట్లు తన పత్రాలపై రాలిన
మంచు బిందువులతో
ద్విగుణీకృతమైన సహజ సౌందర్యాన్ని
రెమ్మలకూ కొమ్మలకూ పంచి
తనపై వాలిన పక్షులకూ
ఆశ్రయాన్ని కల్పిస్తుంది

శిశిరంలో రాల్చిన ఆకుల స్థానంలో
కొత్త చిగుళ్ళు తొడిగి
సరికొత్త అందాలతో
చెట్టు కనువిందు చేస్తుంది

మనిషి కాలాన్ని
తన అవసరాల కనుగుణంగా
మార్చే ప్రయత్నంలో
ప్రకృతి వైపరీత్యాలకు
స్వాగతం పలుకుతున్నాడు!

మనిషి గొడ్డలివేటు పడనంతవరకూ
చెట్టు ఋతువులతో పాటు
ముందుకు సాగిపోతూ
కాలానుగుణంగా మసులుకుంటూనే ఉంటుంది

## ఇది తెలుగు

- అజ్మీరు వీరభద్రయ్య, మక్కపేట.
ఫోన్ : 9290879849

సీ॥ పగవారికుత్తుకలే తెగగోసి చెండాడు
పలనాటి కరవాలపటిమ తెలుగు;
ఖడ్గతిక్కన వీరకాటమరాజుల
పుల్లరికదనంపు పోరు తెలుగు;
కొదమసింగమ్మయ్యి కదనాన దూకిన
కాకతిరుద్రమ్మగాధ తెలుగు;
వీరబొబ్బిలికోట పిడికిలెత్తిన తాండ్ర
పాపయ్య వేడి నిశ్వాస తెలుగు
తే॥ శాతవాహనరాజుల సమరకేళి
విష్ణుకుండిన క్షాత్రవ వీరకథలు
చోళ సామ్రాజ్యవైభవ స్ఫూర్తిగాంచి
చాటిచెప్పరా కొంగ్రొత్త చరిత తెలుగు !

## తేడా !

- మోపిదేవి రాధాకృష్ణ. 9849349516

ఎక్కుపెట్టిన
బాణానికి కనిపిస్తుంది
లక్ష్యం !

దిక్కులేనివాడికి
తెలుస్తుంది
మెక్కినవాడి
నిర్లక్ష్యం !!

# సశేషం

- టి.సురేష్ బాబు, డోన్ ఫోన్ : 9490210765

తెల్లవారుఝామున ... నాలుగు గంటలవుతోంది ...

రైల్వే స్టేషనులోంచి ... కూ... అంటూ రైలుకూత చెవులు చిల్లులు పడేలా విన్పించింది.

"దీనెమ్మ! యియ్యాల తొందరగా వచ్చి సచ్చింది" అనుకుంటూ టీ క్యాన్ ఒక చేత, ప్లాస్టిక్ కప్పులు మరొకచేత పట్టుకొని ఇంటిలోంచి బయటకు పరుగు దీశాడు కాశీం.

"కొంచెం పొద్దున్నే లేవమంటే లేవదు. టీ కాచి ఇచ్చేసరికి యీటయం అయ్యింది. రైలు దొరుకుతుందో, లేదో?" మనసులో తల్లిపై చిరాకుపడుతూ ఆలోచనలు పరిపరి విధాలా పోతుంటే వడివడిగా అడుగులు వేస్తూ ప్లాట్‌ఫాం చేరాడు.

ప్లాట్‌ఫాం నిర్మానుష్యంగా వుంది. అమరావతి ఎక్స్‌ప్రెస్ అప్పటికే సగం స్టేషను దాటింది.

పరిగెత్తాడు ... కనీసం చివరి పెట్టెనయినా అందుకోవాలన్న ఆరాటం నిలువెల్లా శరీరాన్ని దహించివేస్తోంది. అతిప్రయత్నంమీద డోరు హాండిల్‌ను అందుకున్నాడు. తలుపు వేసి వుంది. తోశాడు. తెరచుకోలేదు. లోపల ఎవరో గడియపెట్టారు. చేయి జారింది. పట్టుదప్పి క్రిందబడబోయాడు. ఎవరిదో చేయి వెనుకనుండి తన చొక్కాను పట్టుకొని గట్టిగా ఆపింది.

త్రుళ్ళి క్రిందపడబోయిన వాడల్లా నిలద్రొక్కుకొని చూశాడు. సుధాకర్ ... తనలాగే కాఫీ, టీలు ట్రయిన్‌లో అమ్ముకునేవాడు. క్యాన్ పట్టుకొని వున్నాడు.

"నీక్కూడా రైలు తప్పిపోయిందా?" ఆయాసపడుతూనే అడిగాడు కాశీం.

"తప్పిపోతే తప్పిపోయింది. అలా ఉరుక్కుంటూ ఎక్కకపోతేనేం?" ఖర్మగాలి ఛస్తే ....?" కోపంగా అడిగాడు సుధాకర్.

"చచ్చినా బాగుండేది ... యిలా బ్రతకడం కంటే..." నిరాశగా నిట్టూరుస్తూ చిన్నగా గొణిగాడు కాశీం, చేతిలోని క్యాన్‌ను క్రిందపెడుతూ...

"ఛ... ఛ... పొద్దున్నే ఏం మాటలురా యివి. వూర్కో" సముదాయించాడు సుధాకర్. అంతలో మషాలా వడలబుట్ట పట్టుకొని బాషా వచ్చాడు.

ముగ్గురూ .... ప్లాట్‌ఫాంపైగల సిమెంట్ చప్టాపై కూర్చున్నారు.

"ఛీ .. ఛీ... యింగ యాపారం అయినట్టే" నుదుటిని కొట్టుకుంటూ చిరాగ్గా భాష అన్నాడు.

"పోనీలే మామా? జరిగిందానికి ఏం చేస్తాం" అన్నాడు సుధాకర్.

"ఆఁ నీకేంరా! ఎన్నయినా సెప్తావు.... ఎట్టాగయినా సెప్తావు... పెళ్లామా పిల్లలా? ఈ వడలు అమ్మడయితేగాని ఇంట్లోవాళ్ల చేతివేళ్ళు నోట్లోకి వెళ్ళవు" బాధగా అన్నాడు బాష.

"సర్లే మామా! నిన్ను కదిలిస్తే చాలు తగులుకుంటావు. ఆఁ... యింగ యిక్కరుండి సేసేదేముంది. మళ్ళ బండి ఆరుగంటలకే గదా! యింటికెళ్లి కాసేపు పడుకొని వస్తా" అంటూ వెళ్లిపోయాడు సుధాకర్.

"రోజూ తెల్లారుతోంది గాని మన బ్రతుకులు తెల్లారడం లేదు" అంటూ తలపట్టుకు కూర్చున్నాడు బాష.

ప్లాట్‌ఫాంపైగల చెట్లపై పక్షులరొద అధికమయ్యింది. రైలు శబ్దానికి నిదుర లేచిన పక్షులు రెక్కలు టపటపలాడిస్తూ ... నిశ్శబ్ద వాతావరణాన్ని ఛిద్రం చేస్తున్నాయి. కాశీంకి ఇంటికి వెళ్ళాలనిపించలేదు. అక్కడే కూలబడిపోయాడు.

గతమంతా గుండెను కెలికేస్తుంటే ... వర్తమానపు కడగండ్లు మెదడు నిండా సుడులు తిరుగుతూ శరీరాన్ని కంపింపజేస్తుంటే... భవిష్యత్తు అగోచరమై మనసు విలవిల్లాడింది.

పదో తరగతి ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయ్యాడు... అయితేనేం ....? తాగి తాగి చావద్దురా ... అంటే వినకుండా నాన్న తాగి తాగి చచ్చాడు. తన చదువును మధ్యలో విరిచేశాడు. తన బంగారు కలల్ని చెరిపేశాడు. ఒక్కసారిగా యింటి బరువు బాధ్యతలన్నీ నెత్తిమీద పడ్డాయి.

ముసలితనం ... దానికితోడు అనారోగ్యంతో బాధపడే నాన్నమ్మ, ఆరు నెలల పసికందుతో అమ్మ, ఎలిమెంటరీ స్కూల్లో రెండో తరగతి చదివే చెల్లి వీరినందరినీ పోషించాలి. ఉన్నదా రెండెకరాల మెట్ట. అదీ రాళ్లమయం. వర్షాలు సక్రమంగా పడితేనే పండే పొలం. దానికితోడు తనకు సేద్యం అలవాటు కాలేదు. ఇక వీలయ్యిందీ... తనకు చేతనయ్యిందీ... తండ్రి నుండి తనకు వారసత్వంగా వచ్చిందీ.... ఇదిగో .. యిలా రైలుబండిలో టీ, కాఫీలు అమ్మడమే ... దాన్నే పట్టాడు. మనసులోని తన కోరికల్ని అణచివేసి బలవంతంగా బ్రతుకు బండిని లాక్కొని వస్తున్నాడు. ఈ మధ్యనే అమ్మకూడా యిక తప్పదని బయటకు వెళ్ళి ఇళ్ళల్లో పనిచేయడం మొదలుపెట్టింది.

గత రెండు రోజులుగా చంటిగాడికి జ్వరం. డాక్టరుకు చూపిస్తే మందులు రాసిచ్చాడు. కాని డబ్బులు? మందుల అంగడివాడు యిప్పటిదాకా తీసుకున్న వాటికి డబ్బులివ్వందే యిప్పుడు యివ్వనంటాడు. నిజమేకదా! వారిదీ

## • హైలెస్స తెలుగు •

- జనపరెడ్డి వెంకటరమణ, కామరాజుపేట.

__పల్లవి__

లెస్స... లెస్సలే. తెలుగు భాషపై .. లెస్సలే.
ఆనాడు, ఈనాడు కాదులే. ఏనాటికీ హైలెస్స. హాయిలే.

__చరణం :1__

మకరంద మధురానుభూతులే అచ్చతెలుగులో ఆలపిస్తె పాటలే.
అక్షరాలు రతనాల మెరుపులే. అణువణువునా ఆహ్లాదపు పిలుపులే.
అజంతము అనంతము సిరులు లొలికే అమృత కలశాల ధారలే
అప్సరసల్లా అందాలొలుకించులే మురిపించులే అంతర్జాలపు అవసరం నేడులే
॥ లెస్స ॥

__చరణం : 2__

వేదాల సారాలు నిధులులే. తెలుగు భాషకంటె ఏవి మనకు వెలుగులే ?
వీణలు పలికించె రాగాలులే. పద్యాలకు సుమాల మాలలే.
జానపదులు జ్ఞానాల సుధలులే. ఆస్వాదిస్తే నిలిచెదు హరివిల్లులే.
ఆనాటి చరితంతా శిలలులే. ఈనాటికి చెరగని సాక్ష్యాలులే. ॥ లెస్స ॥

వ్యాపారమే .....

ఎంత వ్యాపారమయితే మాత్రం! జాలి, దయ అక్కర్లేదా? ఇవతల చిన్న పిల్లాడి ప్రాణం కదా! కాళ్ళా వేళ్ళా పడి బ్రతిమాలాడు. లాభం లేకపోయింది. పాపం వాడికేం తెలుసు యివన్నీ.. మూలుగుతూ పడుకొన్నాడు. వళ్ళంతా నిప్పులా కాలిపోతోంది. అమ్మ కన్నులనిండా నీళ్ళు నింపుకోవడం తప్ప ఏం చేస్తుంది?

రేపు ఎలాగయినా నాలుగు రూపాయలు ఎక్కువగా సంపాదించి మందులు కొనాలని ... కిరాణా అంగడికి వెళ్ళి కావలసిన టీ పొడి, పాలపొడి, పంచదార తెచ్చుకున్నాడు. అప్పుగా యివ్వడానికి ముందు కిరాణాషాపు సాయిబు కూడా ససేమిరా అన్నాడు.

"అదేంటి బాబా! నువ్వే యివ్వనంటే యిక నేను ఎక్కడికి వెళ్ళాలి? అయినా అందరిదీ యిదే దారి కదా! రాత్రి నీవద్ద సరుకులు తీసుకోవడం ... పగలంతా అమ్ముకొని బాకీ కట్టడం" అన్నాడు తను.

"ఆc .. ఆc ... అందరూ యిలాగే చేస్తారు. కానీ.... నీమీద నమ్మకం లేదురా! మీనాన్నలాగా నీవు తాగి తిరుగుతావని నా భయం... ఇక నా బాకీ ఎలా తీరుస్తావు?" అంటూ దీర్ఘంతీశారు సాయిబు.

"లేదు బాబా! యింట్లో చంటిగాడికి బాగా జ్వరంగా వుంది. మందులు కొనాలి. తప్పక బాకీ తీరుస్తాను.. యివ్వు బాబా ప్లీజ్" ఏడ్చాడు తను.

"సరేలేరా ! యిదిగో తీసుకో" అంటూ సరుకులు యిచ్చాడు సాయిబు. గంపెడాశతో పొద్దున యిలా వస్తే అమరావతి బండి తప్పిపాయె. ఛ .. ఛ... దానిలో అయితే కప్పు అయిదు రూపాయలన్నా సరే కొంటారు. కాసిన్ని పైసలు మిగిలేవి. త్వరగా అమ్ముకొని తిరిగి ప్యాసింజరు బండికి వచ్చేవాడిని. ఏం చేస్తాం? అంతా రాత. ఆలోచిస్తూ మగతగా కనులు మూసుకున్నాడు కాశీం.

* * *

హుబ్లీ-గుంటూరు ప్యాసింజరు కూతవేసి పెండెకల్లు స్టేషను నుండి నిండు గర్భిణిలా భారంగా కదిలింది.

ఇంకా ప్లాట్‌ఫాంపైనుండి జనం పరుగులాంటి నడకతో రైళ్ళోకి ఎక్కుతున్నారు. మరికొందరు 'ఫ్రీ ట్రావెలర్స్' అటూ యిటూ చూస్తూ టీ.సీ.లు ఏ పెట్టెను ఎక్కారో గమనిస్తూ ఎక్కుతున్నారు.

"ఆc చాయ్ .. చాయ్ .. గరం చాయ్ .. టూరూపీస్" అంటూ అరుస్తూ ఓ పెట్టెలోకి ఎక్కాడు కాశీం.

పెట్టెంతా నిండుగా వుంది. మనసుకు తృప్తిగా అన్పించింది. ఫర్లేదు ఓ పది మంది త్రాగినా సరిపోతుంది అనుకున్నాడు.

"చాయ్ .. గరం చాయ్" అరుస్తున్నాడు.

"ఆc .. ఆc .. అరిచింది చాలు తియ్యరా బీటు" గట్టిగా విన్పించి తలపైకెత్తి చూశాడు.

ఎదురుగా ఆర్పీయఫ్ కానిస్టేబుల్.

"అదేసర్ .. ఈ రోజు యింకా బోణీ కాలేదు" తడబడుతూ అన్నాడు కాశీం.

"ఏందిరో .. మాటలు నేర్చావే... తియ్యరా పది" అంటూ పైజేబులో పెట్టుకొన్న చిల్లరడబ్బులు తీసుకున్నాడు బలవంతంగా!

ఏమీ చేయలేని నిస్సహాయత.

ఎలాగూ ప్రతిరోజూ బీటురూపంలో పదిరూపాయలు సమర్పించుకోవాల్సిందే... కానీ ఈరోజు పొద్దున్నే తగలడ్డాడు.

"వేయరా చాయ్!" ఆర్డరు వేశాడు.

తప్పనట్లు టీపోసి కప్పు అందించాడు. ఫ్యామిలీతో ఎక్కడికో వెళుతున్నాడల్లే వుంది. "మీరూ త్రాగండి .. మనవాడే టీ బాగా చేస్తాడు" అంటూ మరో ముగ్గురికి యిప్పించాడు.. పైసలు మాత్రం హుళక్కి.

కనుల్లో నీరు తిరుగుతుంటే మౌనంగా ముందుకి కదిలాడు.

"ఆc .. చాయ్.. చాయ్" అరవబోయాడు. నోరు పెగల్లేదు.

అదృష్టం బాగుంది. అదేపెట్టెలో మరో పదిహేను మంది దాకా టీ త్రాగారు. ముప్ఫయి రూపాయలు గలగల రాలాయి. మనసు కాస్త తెరిపిన పడ్డట్లయ్యింది. తర్వాతి స్టేషనులో దిగి మరో పెట్టె ఎక్కాడు.

మళ్ళీ దురదృష్టం తరుముకుంటూ వచ్చి, వచ్చిన రూపాయల్లోంచి మరో పది రూపాలయకు రెక్కలొచ్చి టీ.సి. జేబులోకి వెళ్ళిపోయాయి.

తర్వాతి స్టేషనులో క్రాసింగ్. డోనువైపు నుండి గుంటూరు - యశ్వంతపూర్ ప్యాసింజర్ వస్తోంది. త్వరగా కంపార్ట్‌మెంట్స్ తిరిగి ఆ రైలు ఎక్కాడు.

ఆ ప్యాసింజర్‌లో అప్పటికే డోను నుండి వచ్చిన క్యాంటీన్ కుర్రాళ్ళు రైలంతా దర్జాగా తిరిగి అమ్ముకున్నారు. వారిది లైసెన్సుగల వ్యాపారం. ఎలాంటి భయం లేకుండా అమ్ముకుంటారు. కాని తమది అలాకాదు. అటు గుంతకల్ వెళ్ళరాదు. ఇటు డోను వెళ్ళరాదు. వెళ్ళినా అమ్మరాదు. ఇలా చిన్న చిన్న స్టేషన్లలో అమ్మాలి. ఒకవేళ అక్కడ అమ్మినట్లు తెలిస్తే యిక పోలీసులు ... కేసులు ... అందుకే మామూళ్ళతో కాలం నెట్టుకొస్తున్నారు ఎందరో ...

## నా శ్వాస - నా ధ్యాస

- డా. బి. మాధురి, ఖమ్మం. ఫోన్ : 9440358162

పుడమి పరిమళం నా తెలుగు
పారిజాత సుమదళం నా తెలుగు
మలయమారుతం నా తెలుగు
శిలల సింగారం నా తెలుగు

రాయంచ బాట నా తెలుగు
నెమలి ఆట నా తెలుగు
కోకిల పాట నా తెలుగు
చిలుక మాట నా తెలుగు

కర్షక హర్షం నా తెలుగు
కార్మిక ఘర్మం నా తెలుగు
శ్రామిక గళం నా తెలుగు
శోధక కలం నా తెలుగు

గగనాన హరివిల్లు నా తెలుగు
భువిలోన విరిజల్లు నా తెలుగు
కన్నెల కన్నుల కాంతులు నా తెలుగు
వెన్నెల వన్నెల వింతలు నా తెలుగు !!!



"ఇక యీ పెట్టెలో ఎవరు కొంటారు?" అనుకుంటూ పెట్టెనంతా కలయ జూశాడు కాశీం. అదే పెట్టెలోనికి సుధాకర్ కూడా ఎక్కాడు.

"ఏరా ఎంత వచ్చింది?" అడిగాడు సుధాకర్.

"చెప్పుకుంటే సిగ్గుపోతుందిలే .... వచ్చింది యిరవై .. పోయింది నలభై అన్నట్లుంది నా పరిస్థితి" అన్నాడు బాధగా కాశీం.

"ఏమయ్యిందిరా..." సాలోచనగా అన్నాడు సుధాకర్.

"యింకా ఏం కావాలి? ఆర్పీయఫ్, టీ.సీ.లు... యిరవై లాగారు. పైగా ఫ్రీ టీల నష్టం..." అంటూ నిట్టూర్చాడు కాశీం.

"కానీరా! ఏం చేస్తాం! మనటైం బాగా లేనప్పుడు యింతే" అంటూ ఓ సీట్లో కూలబడ్డాడు సుధాకర్. ప్రక్కనే కాశీం కూర్చున్నాడు.

"ఇదిగో చేయిపట్టు" అంటూ గుట్కాపాకెట్ తీశాడు సుధాకర్.

"వద్దురా" అన్నాడు కాశీం.

ఎందుకన్నట్లు చూశాడు సుధాకర్.

"బాగావున్న ఆరోగ్యం చెడగొట్టుకోవడం ఎందుకురా?" అన్నాడు కాశీం.

"ఆఁ .... అదేమరి! మేము చదువుకోలేదు మరి ... యివి తింటే ఆరోగ్యాలు సెడిపోతాయని నీకొక్కడికే తెలుసు ... పట్టరా! ఒక్కపూట తింటే ఏం కాదులే అయినా ఎప్పుడో ఏదో అవుతుందని యీపాటి ఆనందం కూడా మిస్సయితే వేస్టురా" అంటూ బలవంతంగా కాశీం చేతిలో పోశాడు సుధాకర్. దానిని వేళ్ళతో బాగా నలిపి నోటితో పైపొట్టును వూది ... మిగిలిన దానిని ముద్దగా చేసి క్రింది పెదవికి లోపలివైపున పెట్టుకొన్నాడు. దానిని మెత్తగా మెల్లగా చప్పిరిస్తూ .. కనులు మూసుకొన్నాడు కాశీం....

* * *

"అబ్బా! ఈ రోజు నీజేబు డబ్బులతో గలగలలాడుతోంది కదరా!" కాశీం జేబును తడుముతూ అన్నాడు కిశోర్. తనలాగే రైల్లో స్వీట్లు అమ్ముకొని బ్రతుకును కొనసాగిస్తున్నాడు. అలా వ్యాపారం చేసేవారంతా ఎక్కడెక్కడి నుంచో వలసవచ్చి అక్కడ స్థిరపడిపోయారు.

"ఏదోలేరా! ఫరవాలేదు. అన్ని ఖర్చులు తీసేస్తే వందదాకా మిగలవచ్చు. త్వరగా యింటికి వెళ్ళాలి" అంటూ బండి దిగాడు కాశీం. అది మధ్యాహ్నం హైదరాబాద్ వెళ్ళే బండి. కాని దాని తర్వాత యిక సాయంత్రం దాకా బండి లేదు. ఉదయం నుండి ఏమీ తినలేదు. ముందు త్వరగా యింటికి వెళ్ళి తమ్ముడికి మందులు కొనాలి.

"అబ్బా ! వెళ్దువుగాని లేదా! ఏద ఓ పట్టుపడదాం" పిలిచాడు కిశోర్ చేయి పట్టుకొని ఆపి.

"ఈరోజు నేను రానురా" అన్నాడు కాశీం.

"భలేవాడివిరా! మనం రోజంతా యిక్కడే వుండిపోతామా ఏంటి? ఉదయం నుండి పెట్టెలన్నీ ఎక్కి దిగి, తిరిగి తిరిగి, అరచి అరచి ఎంతగా బేజారెత్తి పోయామో తెలియదా? కనీసం యింటికి వెళ్ళే ముందయినా యీ మాత్రం ఎంజాయ్ చేయకపోతే యిక యీ బ్రతుకెందుకురా?" అంటూ బలవంతంగా లాక్కెళ్లాడు కిశోర్.

"రాను" అని చెప్పలేక మెల్లగా అడుగులు అటువైపు వేశాడు కాశీం. అక్కడ అంతా గుంపులు గుంపులుగా ఓ యిరవై మందిదాకా వున్నారు. మధ్య మధ్యలో యీలలు, కేకలు, పాటలు, నవ్వులు .. యిలా అన్నీ కలగలసి విన్పిస్తున్నాయి.

అక్కడ ఓ పెద్దచెట్టుక్రింద నేలపై చిన్నచిన్న గుంతలు చేసి వాటిల్లో చిన్నచిన్న రాళ్ళు వేస్తూ ఆనందంగా ఆడుకుంటున్నారు. అదో రకమైన గ్రామీణ జూదం. చిన్న చిన్న రాళ్ళతో పేరుకి కాలక్షేపం కోసం ఆడే ఆట... కాని యిందులో డబ్బు ప్రధాన పాత్ర పోషిస్తుంది. రైలుబండిలో అమ్ముకొని డబ్బులు సంపాదించుకొనే రకరకాల వ్యాపారులు అక్కడ చేరి తమ కష్టఫలాన్ని పందెంగా పెట్టి చేతులు ఖాళీ చేసుకునే వేదిక అది.

కిశోర్ బలవంతం మీద కూర్చున్నాడు కాశీం. మనసులో ఓ మూల తనక్కూడా యిష్టమే... ఏదో అదృష్టం బాగుంటే ఎలాంటి కష్టం లేకుండా సులభంగా సంపాదించవచ్చుగదా! అని ఆశ. ఆట మొదలయ్యింది. పందెం వెనుక పందెం... అన్నీ ఓడిపోతున్నాడు... ఓడుతున్న కొద్దీ... కసి పెరిగిపోతుంది. ఇంకా డబ్బులు పెడుతున్నాడు. కడుపులో ఆకలి మంట...

## • తెలుగు వెలుగు •

- శనగపల్లి సుబ్బారావు, ఒంగోలు. ఫోన్ : 7842134905

సీ॥ పాలమీగడ కన్న పంచదారల కన్న
జుంటితేనియకన్న జున్ను కన్న
పాలబుగ్గలకన్న పసిడి నిగ్గుల కన్న
వెన్నముద్దలకన్న వన్నె మిన్న
కదళీ ఫలముకన్న కమలాఫలములకన్న
పండుమామిడి కన్న పనసకన్న
నారికేళముకన్న నారింజరుచి కన్న
తీయందనము నేను తెలిపెదన్న

గీ॥ తెలుగు పద్యము గనుమన్న వెలుగులెన్నొ
పాదపాదమునందున బరగునన్న
భావసంపద మనకున్న భాగ్యమెన్న
కలము కదపుచు కవనాన గదలుమన్న.

గుండెల్లో ఆక్రోశం... మనసులో అలజడి... ఆరోజు సంపాదించినదంతా పెట్టాడు. ఫలితం జేబు ఖాళీగా వెక్కిరించింది.

కనుల నిండా నీళ్ళు చిప్పిల్లాయి.

"ఏందిరా? దీనికే యిలా ఏడుస్తున్నావ్! ఇదిగో యిదేసుకో" అంటూ ఎవరో యింకో మాటకు అవకాశం యివ్వకుండా పాలిథీన్ పాకెట్‌ను చించి దానిలోని సారాను కాశీం నోటిలో పోశారు. గొంతును మెల్లగా తడుపుతూ లోపలికి జారింది సారా!

క్రమంగా శరీరం పట్టు తప్పింది. మత్తుగా లేచాడు. ఇంటికి దారితీశాడు... అడుగులు మెల్లగా పడుతున్నాయి.

దూరంగా... యింటి బయట.... తనకోసమే ఎదురుచూస్తున్న అమ్మ చిరిగిన దుస్తుల్లో తనకేమైనా తెచ్చి వుంటాడని అమ్మ ప్రక్కనే నిలబడి ఆశగా చూస్తున్న చెల్లి కన్పించారు.

ఇంటి దగ్గరకు రాగానే "అన్నా" అంటూ పరిగెత్తుకొని వచ్చింది చెల్లి. కసురుకొని మంచంపై బోర్లా పడిపోయాడు.

"ఏందిరా! నీవు కూడా తాగడం అలవాటు చేసుకున్నావా? తాగి తాగి మీ అయ్య చచ్చి యిలా అందరినీ గాలికి వదిలాడు. ఇక నీవు కూడా తయార య్యావా?" కోపంగా అడిగింది తల్లి.

బదులు పలుకలేదు. పలుకడానికి ఏముంది కనుక. జీవితమంతా కడగండ్లమయం... వెక్కిరిస్తున్న పేదరికం... వేధిస్తున్న అప్పులు... ఆందోళన కలిగించే అవసరాలు.. తరుముకొస్తున్న దురదృష్టం... వ్యసనాలు... అసూయ... అవమానం... హేళనలు... అన్నీ... వెరసి నిర్లక్ష్య వైఖరి... కసి... మొండితనం కలబోసిన భావన...

తను అడిగిన దానికి జవాబు చెప్పకపోయేసరికి ఆవేశంతో కాశీం రెండు భుజాలు పట్టుకొని వూపుతూ...

"ఏందిరా? పలకవు... అన్నీ అయిపోగొట్టుకొని వచ్చావా?" అడిగింది అమ్మ.

"ఛూ... నీ... యిది యిల్లు కాదు... నా డబ్బులు... నా యిష్టం..." అంటూ మత్తుగా తూలుతూ పడిపోయాడు కాశీం.

తల్లి కన్నుల్లో నీళ్ళు తిరిగాయి... పెదాలు కంపించాయి... శరీరమంతా వణికింది.

"యా అల్లా! వీళ్ళు ఎప్పటికి మారుతారయ్యా! పగలంతా పనిచేసి పనిచేసి సంపాదించినదంతా వాళ్ళకు వీళ్ళకు దోచిపెట్టి.... పనికిమాలిన జూదాలు ఆడి సంపాదించినదంతా తగలేసి ఇలా త్రాగి, గుట్కాలు నమిలి చస్తున్నారు. యింట్లో వాళ్ళను రోజూ చంపుతున్నారు. మా బ్రతుకులింతేనా? యింకా ఎన్నాళ్ళిలా...? దీనికి ముగింపులేదా?" తల్లి తల బాదుకుంటూ, ఏడ్చి ఏడ్చి శూన్యంలోకి చస్తూ వుండిపోయింది.

అమాయకంగా... అయోమయంగా... అమ్మను అన్నను మార్చిమార్చి చూస్తున్నాయి చిన్నారి చెల్లి కన్నులు... ●

## ● ముళ్ళకంచె ●

- రాపోలు పరమేశ్వరరావు, కొత్తరెడ్డిపాలెం. ఫోన్ : 9951416618

మార్మిక కళా ప్రదర్శనల
నాగస్వర గానాలకు
పడగలాడిస్తున్న
అధికార దాహ బధిరాంధులు !!

గాలివాటుకు దొర్లుతున్న
ఎండుటాకులు -
వాన నీటికి కొట్టుకుపోతున్న
గడ్డి పరకలు -

## ● తెలుగు శంఖారావం ●

- సేనాపతి పాపారావు నాయుడు, హీరమండలం. ఫోన్ : 9441569849

కం॥ "ఆహారము" బలమిచ్చును
ఆ 'హారము' నందమొసగి హాయిని గూర్చున్
ఆహా'రమింపు' భాషలు
ఆహాయనిపించు తెలుగుననితర భాషన్

కం॥ పద్యాల తోరణంబులు
పద్యాలతో 'రణము' జేయు ప్రౌఢత జూపున్
పద్యాలతాను ధారణ
పద్యంబులు హృద్యమౌచుపసిడగు తెలుగున్

కం॥ "కవితల" పోటీలందున
కవి'తలపో'టీలుగాడు కవితల తెలుగున్
కవి "తలపంట"లు పండగ
కవితల తెల్లువెల్లు కావ్యములల్లెన్

కం॥ యువతే భవితకు మూలము
యువతే కవులుగ వెలసి యుత్సాహముతో
యువతే సుద్యమ రీతిని
నవతను జూపించి తెలుగు నడుపును ప్రగతిన్

ఆవె. పాడు'కోకిల' కిల పాటలన్నియు వచ్చు
పాడుకో'కిలకిల' పాటలన్నీ
'పాడుకోకిల' పరభాషల పాటలు
పాడు "తెలుగు"పాట పరవశించి.

తే.గీ. తెలుగు సాహితి సంస్కృతి తిరుగులేక
భావినందించు బహురీతి పండితాళి
పూర్వవైభవమందించు పుడమి జనులు
యువత చేయూత నందించు కవిత ధార

కం. శ్రీమండలి బుద్ధ ప్రసాద్
తామంతయు గుత్తికొండ తగురీతుండన్
'ధీ' మాలక్ష్మీ ప్రసాద్ యు
ప్రేమించును పూర్ణచందు ప్రేక్షక కవులన్

# అతివలు - ఆత్మాభిమానం

- కోకా విమలకుమారి, విజయవాడ. ఫోన్ : 9885676531

అతివలకు ఆత్మాభిమానం అవసరమా! అవసరమైతే అది ఆడవాళ్ళలో పరిమితంగా ఉంటే మంచిదా? లేక పూర్తిస్థాయిలో ఉండాలా! అనే అంశం గురించి తెలుసుకుందాం!

నేటి సమాజంలో స్త్రీ సామాన్య యువతిగా, గృహిణిగా, విద్యార్థినిగా, ఉద్యోగినిగాను అన్ని రంగాలలో పాల్గనడం జరుగుతున్నది. ఒక వ్యక్తి తనను తాను తెలుసుకొని ఓ పటిష్టమైన ఆలోచనలతో స్థిరమైన నిర్ణయం తీసుకొనడంలో ఎదుటివారిపై ఆధారపడక మనస్సును ఆధీనంలో ఉంచుకొని స్వశక్తిపై ఆధారపడటాన్ని "ఆత్మాభిమానం" అంటారు. ఆత్మాభిమానంతో హాయిగా జీవితాన్ని గడపగలిగిన అతివ అదృష్టవంతురాలనే చెప్పవచ్చును.

అతివకు ఆత్మాభిమానం అతి ముఖ్యమైన ఆభరణం. కాని అది పరిమితంగా ఉంటేనే అతివకు అందం ఆనందం - పరిమితంగా ఉన్నంతవరకు ఎటువంటి హాని కలుగదు. శృతిమించిన ఆత్మాభిమానం అనర్థాలకు దారి తీస్తుంది. ఆత్మాభిమానాన్ని సంపూర్ణంగా కాపాడుకోగలిగిన యువతులు చాలా అరుదుగా ఉంటారు.

ఆత్మాభిమానం అనేది తల్లిదండ్రుల్ని బట్టి, వారు పుట్టి పెరిగిన వాతావరణం, సంచరించే పరిసరాలను బట్టి పలురకాలుగా చోటు చేసుకొంటుంది. గృహిణిగా అతివలో ఆత్మాభిమానాన్ని చూస్తే, సంసారమనే నౌకకు భార్యాభర్తలిద్దరూ రెండు చక్రాలు వంటివారు. ఇద్దరి అభిప్రాయాలు కలిస్తేనే ఆ సంసారం సాఫీగా సాగుతుంది. పురుషుని వలే స్త్రీకి కొన్ని నిర్దుష్టమైన అభిప్రాయాలుంటాయి. అది అమలు జరగాలంటే పరస్పరావగాహన, భర్త సహకారం ఎంతైనా అవసరం. ఆవిడ అభిప్రాయాలతో భర్త ఏకీభవించి సహకరిస్తేనే ఆ ఇల్లాలి ఆత్మాభిమానం దెబ్బతినకుండా ఉంటుంది. అంతేగాక ఆ సంసారం ఆనందదాయకమవుతుంది కూడా.

భార్యామణి ప్రతిపాదించిన పని సక్రమమైనదే అయినా, "ఆడదాని మాట నేనెందుకు వినాలి? నేను చెప్పిందే వేదం, నా మాటే ఆవిడ వినాలి" అంటూ ఆ ఇల్లాలు తలపెట్టిన ప్రతి మంచి పనిని అర్థం చేసుకొనక త్రోసిపుచ్చడం జరుగుతుంది. అలాంటి పరిస్థితిలో ఆ ఇల్లాలి ఆత్మాభిమానం ఎలా కాపాడుకోగలదు ? ఆ సంసారం సక్రమంగా సాగాలంటే ఆత్మాభిమానాన్ని చంపుకొని భర్త అడుగుజాడల్లోనే నడువవలసి ఉంటుంది.

ఆత్మస్థైర్యం, ఆత్మాభిమానం లేని కొంతమంది ఆడపడుచులు ప్రతి విషయానికి ఎదుటివారిపై ఆధారపడ్తూ ఉంటారు. అలాంటివారిలో వ్యక్తిత్వంగాని ఆత్మాభిమానంగాని లేకపోవడమే గాక కొన్ని సందర్భాలలో కష్టనష్టాలను ఎదుర్కొనవలసి వస్తుంది.

విద్యార్థినులను చూస్తే నేడధిక శాతం స్త్రీలు విద్యనభ్యసిస్తున్నారు. కాని నేటి విద్యార్థినులలో ఆత్మాభిమానం కంటే ఆవేశం, తొందరబాటు అధికంగా కన్పిస్తున్నాయి. డిగ్రీ చదువులకొచ్చే సరికి తామేదో పెద్దవారై పోయినట్లు తమకో స్వంత వ్యక్తిత్వం వచ్చేసినట్లుగా తలపోస్తూ స్వంత నిర్ణయాలు తీసికొనడం ప్రారంభిస్తారు. తమ ఇంటి పరిస్థితిని అర్థం చేసికొన్న తల్లిదండ్రులు డిగ్రీతో చదువుకు స్వస్తి పలికి పెండ్లి చేసుకోమని కోరగా, నేను పై చదువులు చదువుతానని నా ఫ్రెండ్సు అందరికి చెప్పా మా మాట విని పెళ్ళి చేసుకొంటే నా స్నేహితులముందు నా ఆత్మాభిమానం దెబ్బతింటుందని వాదిస్తుంది. దీనిని మూర్ఖత్వం అంటారుగాని ఆత్మాభిమానం అనరు. ఆత్మాభిమానం ఉన్న విద్యార్థిని అయితే తన ఇంటి పరిస్థితిని పూర్తిగా అర్థం చేసుకొని అత్యాసకు పోకుండా తన అభిప్రాయాలను పరమితమైన పరిధిలో ఉంచుకోవాలి.

మరో యువతి తాను ప్రేమించిన వ్యక్తినే పెళ్ళాడతానంటూ, అలా జరగని పక్షంలో నా ఆత్మాభిమానం దెబ్బతింటుందంటూ తల్లిదండ్రులతో వాదించి పంతం నెగ్గించుకొంటుంది. తీరా పెళ్ళయ్యాక భర్తతో ఏకీభవించలేక ప్రతీ విష యానికి విభేదిస్తూ మీ మాటకు దాసోహమంటే నా ఆత్మాభిమానం ఏం కాను! అని వాదించి తన దాంపత్య జీవితాన్ని విషాదభరితం చేసికొని భర్తకు దూర మవుతుంది. కొంత కష్టాలను అనుభవించిన అనంతరం గాని ఆత్మాభిమానానికి అర్థం తెలుసుకోలేదు. కనుక ఆత్మాభిమానానికి అర్థం కాలేదు. పరమార్థం తెలుసుకొని మసలుకొంటేనే దానిని నిలుపుకోగల అవకాశం లభిస్తుంది.

ఇరుగుపొరుగువారితో మాట్లాడితేనే సహించలేని భర్తలు కొంతమంది ఉంటే, భార్య పరాయివాడితో మాట్లాడితేనే సహించలేక ఆమెపై ఆంక్షలు విధించి, వేధించే భర్తలు మరికొంతమంది. అలాంటి ఉద్యోగిని ఆత్మాభిమానం ఉన్నప్ప టికి సుఖజీవనం గడపాలంటే అతగాడి ఎదుట దానిని చంపుకొని కాలం గడపవలసిందే.

చరిత్ర పుటలు తిరగేస్తే ఆనాటి అతివల్లో అసలైన ఆత్మాభిమానం, వ్యక్తిత్వం కనపడుతుంది. రసపుత్ర వనితలు ధైర్యసాహసానికీ, ఆత్మాభిమానానికి ప్రతీక లుగా కనబడతారు. రాణి పద్మిని అందానికి ఆకర్షితుడై మేవాడను ముట్టడించిన అల్లాఉద్దీన్ ఖిల్జీకి అందకుండా అతడ్ని ఎదిరించి తన ప్రాణాన్నే త్యాగం చేసింది. తనపై అన్యాయంగా యుద్ధానికి తలపడిన బ్రిటీష్‌వారిని ఎదిరించి నిలిచింది ఝాన్సీ లక్ష్మీబాయి. తనపై దండెత్తి వచ్చిన శత్రురాజులతో ఎదురుపోరాడి తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొన్నది రాణి రుద్రమదేవి.

ఆలోచించి చూడగా ఆత్మాభిమానం వలన లాభం కంటే నష్టమే ఎక్కువగా చోటు చేసుకొంటున్నది. పూర్తిగా ఆత్మాభిమానం లేకపోయినప్పటికి కొన్ని సందర్భాలలో విపరీతమైన కష్టనష్టాల నెదుర్కొనవలసి వస్తుంది. ఉదాహరణకు ఆత్మాభిమానం లేని స్త్రీకి మోహమాటం, అభిమానం అధికంగా ఉంటాయి. దీనివలన వంచనలకు తలొగ్గడం జరుగు తుంది. కొన్ని సందర్భాలలో తన మాన ప్రాణాలను సహితం అర్పించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

కనుక అతివలలో ఆత్మాభిమానం పరిమితంగా ఉండి దానికి జతగా ఎదుటివారిని తన వాక్చాతుర్యంతో ఉత్తేజపరచగలిగిన లౌక్యం చోటు చేసుకొంటే అతివలు ప్రతి విషయానికి ఒకరిపై ఆధారపడక, పటిష్టమైన నిర్ణయాలతో నూటికి యాభైశాతం స్థిరత్వం పొందగలరని ఆశిద్దాం! ●

- డా. కాళిశెట్టి సంధ్య, నూజివీడు, ఫోన్ : 9396628878

# మాలతీ చందూర్ నవలల్లో స్త్రీవాద భావజాలం

తెలుగు సాహిత్య చరిత్రలో ప్రాచీనకాలం నుంచి ఎందరో రచయితలు, రచయిత్రులు తమదైన శైలిలో సమాజాన్ని ప్రభావితం చేశారు, చేస్తున్నారు కూడా. ముఖ్యంగా రచయిత్రుల గురించి చెప్పాల్సివస్తే ఇరవయ్యవ శతాబ్దంలో ఆధునిక భావాలతో రచనలు చేస్తూ సమాజాభివృద్ధికి తోడ్పడినవారు కొందరే కనిపిస్తున్నారు. వారిలో ప్రముఖంగా చెప్పుకోదగ్గ రచయిత్రి శ్రీమతి మాలతీ చందూర్. సామాజిక సమస్యలను ఇతివృత్తంగా గ్రహించి నవల, కథ, వ్యాసం, అనువాదం వంటి విభిన్న ప్రక్రియల్లో రచనలు చేసి ఆయా సమస్యల్ని అధి గమించేలా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసిందామె.

నవలా రచనలోనూ, ప్రతికా రచనలోనూ మాలతీచందూర్ విశిష్ట స్థానాన్ని సంపాదించుకుంది. ముప్పైకి పైగా నవలలు, అనేక చిన్న కథలు, విభిన్న పత్రికల్లో ప్రమదావనం, పాతకెరటాలు, నన్ను అడగండి వంటి అనేక శీర్షికలు నిర్వహించడం, అనేక వ్యాసాలు, అనువాద రచనలు ఎన్నో ఆమె కలం నుంచి జాలువారాయి.

తన రచనల ద్వారా ఎందరికో మార్గదర్శకంగా నిలిచిన మాలతీ చందూర్ ఏ కళాశాలకూ హాజరు కాలేదు. స్వయంకృషితో ఆమె జ్ఞానాన్ని సంపాదించు కుంది. పుస్తకాలే ఆమె గురువులు. మేనమామ భర్త అయిన శ్రీ చందూరి నాగేశ్వరరావు గారి సహకారం; శ్రీశ్రీ, విశ్వనాథ, దేవులపల్లి, చలం, నండూరి, కోవల్లి లక్ష్మీ నరసింహం వంటి సాహితీ ప్రముఖుల పరిచయాలతో ఆమెలో సాహితీ జిజ్ఞాస పెరిగి రచనలపై దృష్టి సారించింది. స్వయంగా ఆంగ్లభాషపై పట్టు సాధించి విశ్వవిఖ్యాతి గాంచిన రచయితలను, వారి రచనలను తెలుగు వారికి పరిచయం చేసింది, చేస్తూంది కూడా.

మాలతి సహజంగానే స్త్రీ పక్షపాతి. ఆమె రచనలకు కేంద్రబిందువు స్త్రీ. మరీ ముఖ్యంగా మధ్యతరగతి స్త్రీల జీవితంలోని విభిన్న కోణాలు ఆమె రచనల్లో కనిపిస్తాయి.

చదువు విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుతుంది. స్త్రీ చదువుకుంటే ఆ కుటుంబం వృద్ధిలోకి వస్తుంది. అందుకే ఆధునిక భావాలతో 'ఆడవాళ్ళు చదువుకోవాలి, వారికి స్వంత వ్యక్తిత్వముండాలి అని ఆరాటపడే మాలతి రచనల్లో ఒకటి, రెండు నవలలు మినహా మిగిలిన నవలల్లోని ప్రధాన పాత్రలన్నీ విద్యార్థిగానో, లేక అంతో ఇంతో చదువుకున్న గృహిణిగానో, ఉద్యోగం చేస్తూనో మనకు కనిపిస్తాయి. సమాజంలో విభిన్న వృత్తులు స్వీకరించిన స్త్రీ పాత్రల్ని, ఆ వృత్తు ల్లోని సాధక బాధకాల్ని, ఆయా పాత్రలు వాటిని అధిగమించిన విధానాన్ని చక్కగా విశ్లేషించిందామె. నీతి నిజాయితీలతో తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తూ అంకితభావంతో పనిచేయడం ఆయా పాత్రల స్వభావాలుగా కనిపిస్తాయి. కుటుంబంలోనూ, సమాజంలోనూ తాము నిలదొక్కుకోవడమే కాదు కుటుం బానికి అండగా ఉండడం, తోటి స్త్రీలకు సైతం మానవత్వంతో సహకారాన్నం దించడం ఆయా పాత్రల ప్రత్యేకతగా కనిపిస్తుంది.

మాలతీచందూర్ తొలి రచనల్లో కొన్ని స్త్రీ పాత్రలు ఆత్మహత్య చేసుకోవడం కనిపిస్తుంది. కానీ తర్వాతి కాలంలో దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌తో పరిచయం వల్ల ఆమె ఆ ఆలోచనకు స్వస్తి చెప్పి, చావు సమస్యకు పరిష్కారం కాదని గ్రహించి, సమస్యలతో పోరాడి విజయం సాధించే అనేక స్త్రీ పాత్రల్ని సృష్టిం చింది. అలా వెలువడ్డ పాత్రలు సమాజంలో ఎందరికో ఆదర్శంగా నిలిచి వారి వారి వ్యక్తిత్వాభివృద్ధికి తద్వారా సమాజాభివృద్ధికి తోడ్పడ్డాయి.

మాలతీ చందూర్ స్త్రీ పక్షపాతే అయినా, తన రచనల్లో నాయికల అందానికి అంతగా ప్రాధాన్యమివ్వలేదు. ఆయా పాత్రలన్నీ సాదాసీదా జీవనాన్ని గడిపే మన ఇరుగుపొరుగు స్త్రీల వలే కనిపిస్తాయి. అక్షరజ్ఞానం లేకున్నా తన మాట చాతుర్యంతో అందర్నీ బంధుమిత్రులుగా చేసుకునే కనకదుర్గ (భూమిపుత్రి), ప్రాణం కన్నా గొప్పదైన శీలాన్ని పోగొట్టుకుని తండ్రి వల్ల నిలదొక్కుకోగలిగిన సుమిత్ర (సద్యోగం), లక్ష్మి (జయ-లక్ష్మి), క్యాన్సర్‌తో బాధపడే సంధ్య (శిశిర వసంతం), వ్యక్తురాలైనా అద్దంలో ముఖం కూడా చూసుకోని బ్రాహ్మణ బాలవితంతువు సూరీడు (శతాబ్ది సూరీడు) మొదలగు పాత్రల్ని నాయికలుగా చిత్రించడం సామాన్య విషయం కాదు. పైగా విజిలెన్సు హోమ్ గురించి, ఆ హోమ్‌లోని స్త్రీల జీవితాల గురించి అంత నిశితంగా రాసిన రచయిత్రి మరొకరు లేరనే చెప్పాలి. అందుకే ఆమె స్త్రీ పక్షపాతి అని ఖచ్చితంగా చెప్పవచ్చు.

**3. మాలతీ చందూర్ నవలలు - స్త్రీ వాద భావజాలం - విలక్షణత** : స్త్రీల అభ్యున్నతిని కాంక్షించే మాలతీ చందూర్ స్త్రీల స్థితిగతుల్ని, కుటుంబం లోనూ, సమాజంలోనూ స్త్రీలు నిర్వహిస్తున్న పాత్రను తన రచనల్లో వ్యక్తీక రించింది. సమాజంలో ఎన్ని రకాల స్త్రీల మనస్తత్వాలు ఉన్నాయో అవన్నీ ఆమె రచనల్లో కనిపిస్తాయి. తాను స్త్రీ వాదినని ఎప్పుడూ, ఎక్కడా చెప్పని అసలు సిసలు స్త్రీ వాది మాలతీచందూర్. ఆమె దృష్టిలో స్త్రీ అభ్యుదయం అంటే 'స్త్రీ తను ఇష్టపడిన పనులు చెయ్యగల మానసిక స్వేచ్ఛను కలిగి ఉండడం, కుటుంబ వ్యవస్థను అతిక్రమించక పోవడం'. అందువల్ల ఆమెను సంప్రదాయబద్ధ స్త్రీవాదిగా చెప్పవచ్చు.

మాలతిపై ప్రముఖ రచయిత చలం ప్రభావం ఎక్కువ. స్త్రీలపై వివిధ రూపాల్లో జరిగే హింసను తన రచనల్లో చిత్రీకరించాడు చలం. అతని శిష్యురాలైన మాలతీ చందూర్ రచనల్లో కూడా స్త్రీ వాద భావజాలం కనిపిస్తుంది. అయితే వీరిద్దరి ఆలోచనా సరళులు వేరు. చలం స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ కావాలనీ, ఆమె జీవితంలో పురుష ప్రమేయం ఉండకూడదని శాసించాడు. కానీ మాలతీ చందూర్ పద్ధతి వేరు. పురుషద్వేషం లేని స్త్రీ వాదమామెది. పురుషస్వామ్య వ్యవస్థలోని లోపాలను వ్యక్తీకరించడం, వాటిని మార్చడానికి స్త్రీ పాత్రలు ప్రయత్నించడం వంటివి ఆమె నవలల్లో స్పష్టంగా దర్శనమిస్తాయి.

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన ఐదు సంవత్సరాల తర్వాత ప్రారంభమైన మాలతీ చందూర్ రచనా వ్యాసంగంలో స్త్రీకి అధిక ప్రాధాన్యత ఉంది. నాడు సంఘంలో స్త్రీ సంక్షేమం కోసం అనేక సంఘ

సంస్కరణోద్యమాలు ప్రారంభ మయ్యాయి. స్త్రీ స్వేచ్ఛ పొందే ప్రయత్నం ఒకవైపు, దాన్ని ప్రతిఘటించడం మరో వైపు ఉధృతంగా జరిగాయి. ఫలితంగా ఆమె నవలల్లో స్త్రీ ప్రముఖ పాత్ర వహించింది. చంపకం - చెదపురుగులూ, లావణ్య, రేణుకాదేవి ఆత్మకథ, శతాబ్ది సూరీడు వంటి కొన్ని నవలల పేర్లు కూడా ఆయా నవలల్లోని ప్రధాన పాత్రల ఆధారంగా పెట్టినవే.

మాలతీ చందూర్ కుటుంబ జీవితానికి అధిక ప్రాధాన్యమిచ్చింది. స్త్రీల విచ్చలవిడి స్వేచ్ఛను అంగీకరించదామె. ఆమె నవలల్లోని స్త్రీ పాత్రలు కుటుంబ పరిధికి లోబడి జీవించేవిగానూ, సంఘంలో తమకంటూ గౌరవప్రదమైన స్థానాన్ని సంపాదించుకోవడమూ కనిపిస్తుంది. అలానే తరతరాలుగా సంప్ర దాయం పేరుతో వస్తున్న కుటుంబవ్యవస్థే స్త్రీల అభివృద్ధికి అవరోధంగా నిలవడం, ఆ పరిధి నుంచి బయటపడలేక కొన్ని పాత్రలు ఆత్మహత్య చేసుకోవడం, మరికొన్ని పాత్రలు ధైర్యంగా ఎదిరించి నిలబడడం కనిపిస్తుంది.

మాలతీచందూర్ తొలి నవలలు **చంపకం - చెదపురుగులూ, రేణుకాదేవి ఆత్మకథ, ఏదిగమ్యం ? ఏదిమార్గం ?** చంపకం - చెదపురుగులూ నవలలో చంపకం, రేణుకాదేవి ఆత్మకథలో రేణుకాదేవి, ఏదిగమ్యం? - ఏదిమార్గం? నవలలో మేరీ కథనాయికలు. రచయిత్రిగా చంపకం, సినీ తారగా రేణుకాదేవి, డాక్టర్‌గా మేరీ సంపాదనపరులు, సమాజంలో పేరు ప్రతిష్టలు కలవారు. కానీ వీరి సంపాదన పైనే ఆధారపడి, ఆ సంపాదనను తమ స్వంతం చేసుకోవాలన్న దురుద్దేశ్యంతో ఉన్న భర్త, పుట్టింటివారు, అత్తింటివారి చేతిలో కుటుంబ హింసకు గురై మానసిక ప్రశాంతతను కోల్పోయి చివరికి ఆత్మహత్య చేసుకుంటారు.

కుటుంబంలో స్త్రీ స్థానం విశిష్టమైంది. కుటుంబ బాంధవ్యాల్లో స్త్రీ చూపే నిబద్ధత పురుషుడు చూపకపోవచ్చు. స్త్రీ కుటుంబం కోసం పరితపిస్తుంది. తన జీవితాన్నే పణంగా పెడుతుంది. కానీ అదే కుటుంబం పురుషాధిపత్యాన్ని ప్రోత్సాహిస్తూ స్త్రీ ఆలోచనలకు, నిర్ణయాలకు విలువలేకుండా చేసింది. స్త్రీ ఆర్థిక స్థిరత్వాన్ని పొందిన ఆధునిక కాలంలో కూడా కుటుంబంలోను, సమాజంలోనూ జరిగే హింస అతి సహజంగానే కనిపిస్తుంది.

**క్షణికం** నవలలో రాజ్యలక్ష్మిది ప్రధానపాత్ర. పెళ్ళై అత్తవారింటికి వచ్చిన ఆమెను అనుమానంతో బయటకు గెంటేస్తుంది అత్త. నిరక్షరాస్యత, భర్త నిస్సహాయత, లోకం తీరు తెలియక పోవడం వల్ల కుటుంబ హింసకు గురై ఆత్మహత్య చేసుకుంటుందామె.

వివాహ సంబంధాల్లోనే కాదు, వివాహేతర సంబంధాల్లో కూడా పురుషుల కన్నా స్త్రీలే ఎక్కువ ఇబ్బందుల్ని ఎదుర్కొంటారు. ఇటువంటి సంబంధాల్ని కొనసాగించే స్త్రీలకు కుటుంబంలోను, సమాజంలోనూ ఎటువంటి గుర్తింపు, విలువ ఉండవు. పైగా అనునిత్యం అనుమానాలు పడుతూ జీవితాన్ని సాగించాలి. మాలతీ చందూర్ నవలల్లో వివాహేతర సంబంధాల ప్రస్తావన కనిపిస్తుంది. ఆ సంబంధాల్లోని స్త్రీ, పురుషుల మానసిక పరిస్థితుల్ని, స్త్రీ సమాజంలో ఎదుర్కొనే సమస్యల్ని, అవమానాల్ని **కలల వెలుగు, ఏమిటీ జీవితాలు ?, ఎన్ని మెట్లెక్కినా..., రెక్కలు-చుక్కలు, ఆలోచించు** నవలల్లో విశ్లేషించి పాఠకుల్ని ఆలోచింపచేయడమే మాలతీ చందూర్ సాహిత్య ప్రయోజనం.

తెలిసీ తెలియని వయసులో వివిధ ఆకర్షణలకు లోనై ఇంట్లోంచి పారి పోయి మగవారి మోసానికి గురై తిరిగి ఇళ్లకు చేరుకున్న యువతుల పట్ల తల్లిదండ్రులు సహనాన్ని కలిగి ఉండడం అవసరం. కుటుంబ సభ్యుల ఆదరణ వల్ల, వారి ఆప్యాయతానురాగాల వల్ల వాళ్లు తిరిగి మామూలు మనుషులై సమాజంలో నిలదొక్కుకోవడం సాధ్యమౌతుంది. సద్యోగం నవలలోని సుమిత్ర, జయ-లక్ష్మి నవలలోని లక్ష్మిపాత్రల ద్వారా తల్లిదండ్రుల బాధ్యతను స్పష్టం చేసింది మాలతి. ప్రేమ వివాహాలు చేసుకున్న జంటల్ని పరువు హత్యల పేరుతో అమానుషంగా చంపేవారికే కాదు అ రికీ ఆదర్శంగా ఉండేలా ఆ పాత్రల్ని తీర్చిదిద్దిందామె.

విజిలెన్సు హోమ్ గురించి, అందలి స్త్రీల యదార్థ జీవిత గాథల్ని గురించి వ్యక్తీకరించిన నవలలు జయలక్ష్మి, కృష్ణవేణి. అనాథలు, వ్యభిచారులు, నేరాలు చేసినవారు ఉండే విజిలెన్సు హోమ్ గురించి, ఆ హోమ్‌కి సూపర్నెంట్‌గా ఉంటూ అక్కడి వారిని మంచి మార్గంలో పయనించేలా ప్రోత్సహించే కృష్ణవేణి గురించి ఈ నవలల్లో రచించింది మాలతీచందూర్.

వంద సంవత్సరాల కాలంలో బ్రాహ్మణ కుటుంబాల్లో, ముఖ్యంగా బ్రాహ్మణ స్త్రీల జీవితంలో వస్తున్న మార్పుకు నిదర్శనం శతాబ్ది సూరీడు. ఈ నవలలో బాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యం, ఆడపిల్లల పట్ల నిరాదరణ ఇవన్నీ స్పష్టంగా కనిపిస్తాయి. క్రమంగా వారి జీవితంలో మార్పుతో పాటు అభివృద్ధి వైపు పయనించడం కనిపిస్తుంది.

**ముగింపు :** విషయ పరిజ్ఞానం, నిశిత పరిశీలన, వ్యక్తిగతంగానూ, సమాజ పరంగానూ అభివృద్ధి జరగాలనే ఆకాంక్ష, సమస్యల్ని అధిగమించేలా ప్రోత్సహించే చైతన్యం గల రచయిత్రి శ్రీమతి మాలతీ చందూర్. తన రచనల ద్వారా స్త్రీల అభివృద్ధికి తోడ్పడిన మాలతీ చందూర్ పురుష పాత్రని కూడా సమతూకంతో నిర్వహించింది. స్త్రీ పురుష సమానత్వంతో పాటు మానవత్వం, మంచితనం, సన్మార్గాల నేపథ్యంలో ఒకరికొకరు సమాన భాగస్వాములు కావాలని, పరస్పర అవగాహన కలిగి భవిష్యత్తు దిశగా ముందుకు సాగాలనే సందేశం మాలతి రచనల్లో కనిపిస్తుంది. ఆమె రచనలు వాస్తవికతకు అద్దం పడుతూ పాఠకులను సంస్కరణాత్మకంగాను, అభ్యుదయ ధోరణిలోను ఆలోచింపచేస్తాయి. అందుకే తెలుగు పాఠకలోకానికి మాలతి మంచి మార్గదర్శి, స్నేహితురాలు కూడా.

## మన యువత

- డా॥ రాజనంపల్లి సీతారామారావు. ఫోన్ : 9866853346

**పల్లవి**

యువతనడత నున్నది దేశపు ఘనత
యువత చేతనున్నది దేశపు భవిత

**చరణం**

పదునైన కత్తియే పలుగయువత
పటిష్టమైన శక్తియే తెలుపగ యువత !
కార్యసాధనకు తగిన తరుణం యువత
త్యాగనిరతికి తరగని తరుణం యువత
స్వార్థమెఱుగని సేవకు అర్థమె యువత
అవినీతిని అడ్డుటకు ఆయుధమే యువత
కష్టములను సాధించే సాధనమే యువత
అలుపుసొలుపులన్నవి యెఱుగదు యువత

# అనుభవం

- యం. మృదుల, నూజివీడు. ఫోన్ : 9490151501

గంటసేపట్నుంచి నా వెయింటింగ్‌కి స్వస్తి చెప్తూ బస్సు వచ్చింది. బస్సులో ఇలా ఎక్కానో లేదో మంచి జోరు వాన ప్రారంభమైంది. బయట చూస్తుంటే దృశ్యం ఎంత బాగుంది. సరిగ్గా నెలరోజుల క్రితం ఇంట్లో ఉన్న నేను నాకు గుర్తొచ్చాను. కిటికీ దగ్గర కూర్చున్న నాకు పంటచేలు, వాటి వెనుక దట్టంగా కనిపిస్తున్న మామిడి తోటలు, కనిపించీ కనిపించనట్లుండే పంటకాలువ, దాన్ని ఆనుకొని ఉండే చిన్న కొండ, ఆ పైన ఆకాశం అందులోను వర్షం పడుతున్నప్పుడు చిన్న చిన్న నీటి తుంపరలు ముఖాన్ని తాకుతూ ఉంటే అలా చూస్తూ ఆదమరచి ఉన్న నేను బామ్మ వచ్చి "ఏమిటే చూస్తున్నావ్?" అనడంతో ఈ లోకంలోకి వచ్చాను. ఆ ముఖం చూస్తుంటే చంద్రుని మించిన ప్రశాంతత, ఆ బట్టల్లో మల్లెపూవును మించిన స్వచ్ఛత, ముగ్గుబుట్టలా ఉన్న ఆ జుట్టును చూస్తుంటే అనుభవాలు దొంతరలా పెట్టినట్లు ఉంది. ఏం లేదు బామ్మా అంటూ, ఇది ఎప్పుడూ ఇలాగే ఉంటే భలే ఉంటుంది కదా!" అని మనసులో భావాన్ని చెప్పగానే బామ్మ ఫ్లాష్‌బాక్‌లోకి వెళ్ళిపోయింది.

ఇప్పుడు నువ్వు చూస్తున్నదంతా ఇలాగే ఉండాలనుకోవడం అసాధ్యమే తల్లీ. మీ నాన్న చిన్నప్పుడు, ఇదంతా ఎలా ఉండేదో తెలుసా! ఈ చుట్టుప్రక్కల ఇళ్ళేవీ ఉండేవికాదు. ఆ కొండ దగ్గర్నుండి ఇక్కడివరకు అన్నీ ముళ్ళపొదలే. మధ్యలో ఇదొక భూత్ బంగళాలా ఉండేది. ఎవరైనా ఇంటికి రావాలంటే భయపడేవారు. ఎప్పుడు ఏ పురుగూపుట్రా వస్తాయోనని భయం. అలాంటిది ఈ మధ్య వీటిని కొనుక్కోవడం వల్ల మెల్లగా ఓ రూపు పొంది, ఇప్పుడు చూడడానికి ఇంత అందంగా కనిపిస్తుంది. అలాగని తర్వాత కూడా ఇలాగే ఉంటుందనుకోవడానికి వీల్లేదు. చూడు మనపక్కన ఇళ్ళు ఎలా వచ్చాయో, త్వరలో వెనుకాల కూడా వస్తాయంట. ఇంక నీకు ఇక్కడ నిల్చుని చూస్తే బిల్డింగులే కనిపిస్తాయి అని బామ్మ చెప్పగానే ఆ ఆశల మీద నీళ్ళు చిమ్మేసినట్లు అనిపించింది. కాని బామ్మ చెప్పిన సత్యం మాత్రం బోధపడింది.

ఇంతలో వర్షం మెల్లగా తెరిపిచ్చింది. హమ్మయ్య! సగం దూరం వచ్చేశాను. ఇంటికి వెళ్ళడానికి ఇంకొక రెండు గంటలు పడుతుందేమో. బస్ ఆగింది. చాలామంది ఎక్కారు. ఒక కొత్త జంట కూడా ఎక్కింది. కాని ఇద్దరు ఎడమొహం పెడమొహంగా కూర్చున్నారు. అంతే ఇంకేముంది, మావయ్య క్రితంసారి ఇంటికొచ్చిన సంగతి తళుక్కున మెరిసింది.

రాములూ ఇలారా! అంటూ బామ్మ పిలిచేసరికి నాన్నతో మాట్లాడుతున్న రాములు మావయ్య వెంటనే వచ్చాడు. ఇప్పుడ చెప్పు, "ఏమిటి చాలా కంగారుగా కనపడుతున్నావ్?" అని అడిగీ అడగ్గానే చెప్పడం మొదలుపెట్టాడు. ఏముందత్తా! మా చిన్నదానితో ఎప్పుడూ తంటాలే అదీ, దాని మొగుడూ ఎప్పుడూ దెబ్బలాడుకుంటూనే ఉంటున్నారు. ఇద్దరికీ ఒక్క క్షణం పడదు అన్నాడు. సరే అయితే దాన్ని నా దగ్గరికి పంపించు అని బామ్మ చెప్పడంతో మావయ్య ఉదయాన్నే వదిన్ని పంపించాడు.

వచ్చీ రావడంతోనే అమ్మమ్మా అంటూ బామ్మని కౌగిలించేసుకుంది. స్వతహాగా మంచిదే అయినా ఆవిడ నోటి దూకుడుకి పాపం పెళ్ళైన దగ్గర్నుండి గొడవలే. అలాగని విడిపోరు గాని అస్తమానం ఇలా గొడవపడుతుంటే చూసేవాళ్ళకి చిరాగ్గా ఉంటుంది "ఇంతకీ మీ ఆయన ఏమంటున్నాడే?" బామ్మ అడగడంతోనే మెలికలు తిరగడం మొదలెట్టింది. అంటే గొడవ ప్రభావం తగ్గినట్లే అనుకుంటా. ఏముందే అమ్మమ్మా, అంటూ తన శైలిలో, గొడవ గురించి చెప్పడం ప్రారంభించింది. ఆయన నా కోసం మా ఇంటికి వచ్చాడు. మా అమ్మేమో చక్కగా పులస చేప తెప్పించి వండిపెట్టింది. అసలు గొడవంతా పడుకునే దగ్గరే వచ్చిందనుకో. మా అమ్మ ఇచ్చిన దుప్పటి చిన్నగా ఉందట. అది మిడ్డీలా ఉంది అంటూ ఏడిపించడం మొదలెట్టాడు. నా సంగతి నీకు తెలియంది ఏముంది! ఇంక షరామామూలే... అంటూ ముగించింది.

"ఓసినీ! అదా సంగతి నీకూ మీ ఆయనకీ ఇద్దరికీ తెలివి లేదే. ఇంత చిన్న దుప్పటి విషయంలోనే సర్దుకుపోలేని మీ జంట రేపు పిల్లలు పుట్టాక, వాళ్ళు ఎదిగేటప్పుడు పెరిగే ఖర్చులు, కష్టాలు ఎలా తెలుసుకుంటారే. అసలు పెద్ద దుప్పటిలో ఏముందే, చిన్న దుప్పటి అయితే 'ఎవరికి వారే యమునా తీరే'లా కాకుండా మీ ఆయన పక్కనే పడుకుని చక్కగా కబుర్లు చెప్తూ..." అంటూ ఉండగానే ఛీ పో అమ్మమ్మా అంటూ పరిగెత్తింది.

పిల్లలు అనగానే నాకెప్పుడూ ఓ సంఘటన మనసులో మెదలుతుంది. మా పెద్దక్కేమో దానికి పుట్టిన చంటిదాన్ని వేసుకొని నులకమంచం మీద పడుకోను అంటుంది. బామ్మేమో పడుకోవే అంటూ దాని వెనుక ఉన్న ఆంతర్యం చెప్పడం మొదలెట్టింది. "పరుపు మీద పడుకుంటే నీకు హాయిగా ఉంటుందేమో కానీ, పిల్ల కిందికి దొర్లిపోతుంది. పరుపు తడిసిపోయి పాడైపోతుంది. నువ్వు ఆదమరచి పడుకుంటే మధ్య మధ్యలో లేచి పిల్లని ఎవరు చూస్తారు? ఎవరు పాలు ఇస్తారు? అదే దీనిమీద పడుకున్నావనుకో పిల్ల తడిపేసినా కిందికి పోతుంది. నువ్వు కాళ్ళు ముడుచుకొని పడుకుంటావు కాబట్టి పిల్లకి కావల్సినంత వెచ్చదనం అంది హాయిగా పడుకుంటుంది. అంతేగానీ నువ్వీ నులక మంచం మీద పడుకుంటే నాకేం ఉపయోగమే తల్లీ!" అంటుంటే దాని వెనుక ఎంతోకాలం నుండి పదిలపరచిన అనుభవాల ముడతలు ఆ మోహం మీద సుస్పష్టంగా కనిపిస్తున్నాయి.



అబ్బ! ఆ మాటల్లో ఎంతటి ఘటైన కమ్మదనం. విషయాన్ని చెప్తూనే నువ్వు పాటించకపోతే నష్టపోతావ్ సుమా అని హెచ్చరిస్తూ, తరువాత నీ ఇష్టం అని స్వేచ్ఛనిస్తూ మాట్లాడడం తనకే చెల్లిందేమో. "కమ్యూనికేషన్ స్కిల్స్ కోసం బోలెడంత మంది దగ్గర ట్రైనింగ్ తీసుకోనవసరం లేదేమో, ఇలా మన పెద్ద వాళ్ళని గమనిస్తే సరిపోతుందేమో" అనిపించేంత గొప్పతనం బామ్మలోనే ఇమిడి ఉంది.

ఇలా ఆలోచనలు కొనసాగుతూనే ఇంటికి చేరేసరికి కాళ్ళు వణకడం ప్రారంభించాయి. ఇప్పుడు కూడా నాకు ఏడుపు రావట్లేదు. కంట్లోంచి ఒక్క చుక్క రావట్లేదు. బహుశా నా మనసింకా నీ అనురాగపు మత్తులో పడి నీవు లేవనే నిజాన్ని నమ్మలేకపోతుందేమో. కాని బాగా తినమ్మా, బాగా చదువుకోమ్మా అని నాకు ఎవరు చెప్తారు బామ్మా? నాకు అర్థంకాని విషయాలు ఎవరు చెప్తారు బామ్మా? ఏవిధంగా ఆలోచించాలో ఎలా తెలుస్తుంది బామా? చెప్పు బామ్మా... ఒక అత్తగార్ని సరిగ్గా పట్టించుకోని ఒకావిడ తన కోడలు తనని చూడట్లేదని వాపోతుంది. ఆవిడకు నీ శైలిలో సరైన సమాధానం చెప్పు బామ్మా... రెండు నిమిషాల క్రితమే నీ దగ్గర ఏడ్చి ఇప్పుడు మామూలుగా మాట్లాడు కుంటున్న ఆవిడలాంటి వాళ్ళని ఎలా అర్థం చేసుకోవాలో నాకు చెప్పు బామ్మా.... ఊర్లో అందరికీ తల్లో నాలుకలా ఉంటూ, మంచి వైపే మాట్లాడే నీ నోటిని కూడా మూగబోయేలా చేసిన పైవాడికి కూడా జ్ఞానం వచ్చేలా నీ అనుభవాల్ని రంగరించి చెప్పు బామ్మా... ●

## స్వాగత గీతం

- దామరాజు విశాలాక్షి, విశాఖపట్నం. ఫోన్ : 9441472784

పల్లవి
అందాల ఆంధ్రమా వందనాలు హరిచందనాలు
ఆత్మీయతతో ఇచ్చు స్వాగతాలు, సుస్వాగతాలు ॥ అందాల ॥

చరణం : 1
త్రిలింగముల నడుమ తీరుగా వెలిశావు
ఘనమైన నదులతో గలగలా పారావు
పాడిపంటలతోడ పచ్చగా నిలిచావు ॥ అందాల ॥

చరణం : 2
శాతవాహనులచే శాసనముల నిలిచి
శాలివాహనుల సంస్కృతులలో వెలసి
చాళుక్య రాజులచే చక్కగా కొలువబడి
కాకతీయుల కళాపోషణలో పెరిగిన ॥ అందాల ॥

చరణం : 3
నన్నయ్య చేతిలో నాందిగా తెరకెక్కి
తిక్కన చేతిలో తీరులెన్నో నేర్చి
ఎర్రాప్రగడ వలనెంతో ఘనతొంది
శ్రీనాధ, పోతనల శోభిల్ల జేసిన ॥ అందాల ॥

చరణం : 4
త్యాగయ్య, క్షేత్రయ్య అన్నమయ్యల గళము
సిద్ధేంద్రుని నటన కూచిపూడి పదము
జక్కన్న, రామప్ప మలచినట్టి విధము
ఆంధ్రజాతి సంస్కృతుల సాక్షిగా ॥ అందాల ॥

చరణం : 5
ప్రబంధ కవులు పలు కావ్యాలు కొలువ
ఆధునిక కవులెంతో ఆదరముగా నిలువ
ప్రాచీనము నుండి ప్రస్తుతము వరకును
అందాలు చిందుతూ అలరారు మాతల్లి ॥ అందాల ॥

చరణం : 6
పద్యాలు గద్యాలు కీర్తనలు గీతాలు
పదాలు, పాటలు, హరికథలు, గేయాలు
పండిత పామరులు స్తుతించు ప్రక్రియలు
కలబోసి అందింప కనులపండువసేయు ॥ అందాల ॥

చరణం : 7
ఘనులగు రాజులు మంత్రులు వీరులు
వీరనారీమణులు ఉత్తమపుటిల్లాంద్రు
త్యాగధనులును మహాదేశభక్తులును
నడయాడగా జూసి మురసిన మాతల్లి ॥ అందాల ॥

చరణం : 8
అజంతములతోడ అలరారి ఉదయించి
హలంతములతోడ అందముగ రాణించి
మందారమకరందమాధుర్యముల దేలు
మధురమధురమైన మా భాషగా నిలుచు ॥ అందాల ॥

చరణం : 9
పాశ్చాత్యులు నిన్ను పలువిధముల పొగడ
ఇతర రాష్ట్రాల పండితులిష్టముగ కీర్తింప
కర్ణాటక విభుడు నీ ఘనకీర్తి చాటగా
దేశభాషలందు దీప్తిచెందిన తల్లి ॥ అందాల ॥

చరణం : 10
తమిళభారతి తెలుగు సుందరంబని జెప్ప
అప్పయ్యదీక్షితులు తపఃఫలమని మెచ్చ
ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టనుచు గొలిచిన
సి.పి.బ్రౌనుచేత సేవలందిన తల్లి ॥ అందాల ॥

చరణం : 11
తెలుగదేలయన్న దేశంబు తెలుగని
ముప్పేటల గొలుసులల్లికే మనమని
భాషలోయాసలు భాసిల్లు మణులని
ఆంధ్రజాతిచరిత అద్భుతమని జెప్పు ॥ అందాల ॥

కథానిక

# నాన్నా! బడికి పంపవూ...?

- సి.హెచ్. నాగార్జున శర్మ, తిరుపతి. ఫోన్ : 8978504127

క్రిష్ణప్పని ప్రతిరోజూ గొర్రెలని మేపుకు రమ్మని పంపుతుంటాడు తండ్రి నారాయణప్ప. అలా పంపుతున్నపుడల్లా క్రిష్ణప్ప తండ్రితో "అయ్యా! నానూ పక్కింటి రవి, కిషోర్‌లకు మల్లె బళ్ళో కెల్లి సదూకుంటాను" అని ఒకటే ఏడుపు.

"మనకాడ అన్ని డబ్బుల్లేవు. రవి వాల్ల నాన్నోరేమో ఏదో ఆఫీసులో గుమస్తాగిరి సేసి సంపాదిస్తున్నాడు. కిషోరు అళ్ళమ్మా, నాన్నలిద్దరూ ఉద్యోగస్తులే. ఎంతైనా ఆల్లు డబ్బున్న మారాజులు. కాబట్టి ఆల్లు ఆళ్ళపిల్లల్ని బల్లోకి పంపుతున్నారు. మనది రెక్కాడితే గానీ డొక్కాడని పరిస్థితి. అయినా మనలాంటోల్లకి సదువురాదు. పైగా నువ్వు సదువుకోడానికి బల్లోకెలితే నువ్విప్పుడు సేస్తున్న పన్లన్నీ ఎవరు సేస్తారు సెప్పు? ఈసారెప్పుడైనా నా ముందు ఇసుకూలు మాటెత్తావనుకో మక్కెలిరగదంతా ఏమనుకున్నావో. నోరు మూసుకుని గొర్రెలని తోలుకెళ్ళహో..." అని గదమాయించి పంపించాడు.

తండ్రి మాటలు విన్న క్రిష్ణప్ప మారు మాట్లాడకుండా గొర్రెలని చేలున్న వైపుకి తోలుకెళ్ళిపోయాడు.

* * *

క్రిష్ణప్ప గొర్రెలని మేపుకు రావడానికెళ్ళే దోవలో ఎలిమెంటరీ స్కూలొకటున్నది. ఆ స్కూల్లో సదువుకుంటున్న తన ఈడువాల్లని చూసి "అదు రుట్టం అంటే ఆల్లది. ఎంచక్కా బళ్ళోకెల్లి సదువుకుంటున్నారు. నానూ వున్నాను ఈ గొర్రెల్ని మేపుకుంటూ చిరిగిపోయిన సొక్కా, నిక్కరు ఏసుకుని అయ్యసెప్పిన పన్లన్నీ సేస్తూ రోజులు గడిపేస్తున్నాను. ఏది ఏమైనా సరే నేను బల్లోకెల్లి సదువుకునే ఆలోసెనొకటి సెయ్యాలి" అని క్రిష్ణప్ప గొర్రెలని మేపుకు రావడానికెళ్ళాడు.

పడమటి దిక్కున సూర్యుడస్తమించడానికి సన్నద్ధమవుతుండగా క్రిష్ణప్ప గొర్రెల్ని ఇంటికి తోలుకెళ్ళిపోయాడు.

* * *

కిషోర్ నాన్న కృష్ణమూర్తి. ఓ ప్రైవేటు కంపెనీలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. ఆయన భార్య సుమతి, స్కూలు టీచరుగా పనిచేస్తున్నది.

సుమతి వంటింట్లోంచి "కిషోర్! స్కూలుకు టైమవుతున్నది. త్వరగా తయారయి టిఫిన్ తిని స్కూలు కెదుదువుగానీ రా" అని పిలిచింది.

"అమ్మా! ఇవాళ నాకు కడుపులో నెప్పి పుడుతున్నదమ్మా. స్కూలుకి రేపెడుతాను" అని అన్నాడు.

ఈ మాటలు పక్కింటి నారాయణప్ప చెవిన పడ్డాయి. "అన్నీ వుండి అల్లుడి నోట్లో శని" అంటే ఇదేనేమో. డబ్బు దస్కం అన్నీ వుండి వాళ్ళబ్బాయి ఏదో వంక పెట్టి స్కూలు కెళ్ళకుండా తప్పించుకుంటున్నాను. మరి నా కొడుకేమో ఇసుకూలు కెడతాను... ఇసుకూలు కెడతాను... అని ఒకటే గోల. అడ్ని ఇసుకూల్లో సేర్పించాలంటే డబ్బుల్లేకపోయె" అని కాస్తంత మదనపడ్డాడు నారాయణప్ప.

* * *

మరునాడుదయం క్రిష్ణప్ప యథాప్రకారం గొర్రెల్ని తోలుకుని పోయి, వాటిని చేలల్లో వదిలేసి స్కూలు ఆవరణంలో కూర్చుని స్కూలు టీచరు బ్లాక్ బోర్డుమీద వ్రాసిన అక్షరాలను ఇసుకలో వ్రాస్తూ అభ్యసిస్తున్నాడు.

ఒకరోజు శంకరం మాస్టారు ఇసుకలో అభ్యసిస్తున్న క్రిష్ణప్పను చూసి "అబ్బాయ్! నువ్వు స్కూలుకు రావడం లేదా?' అని అడిగాడు.

"లేదండీ మాస్టారు. మా నాన్న నన్ను బడికి పంపించడం లేదు".

"ఏ? ఎందుకని?"

"స్కూలు ఫీజు కట్టడానికి, పుస్తకాలు కొనివ్వడానికి మా అయ్యదగ్గర డబ్బుల్లేవుట. నాకేమో ఎంచక్కా స్కూల్లో చేరి సదువుకోవాలనుంది అని మా అయ్యను ఎన్నోమార్లు అడిగాను నన్ను ఇసుకూల్లో సేరిపించమని. ఎప్పుడడిగినా

## ప్రతిక్షణం - ధనం

- సింహాద్రి శ్రీనివాస్ రావు, జయపురం, ఒడిశా. ఫోన్ : 9861084340

మతం అభిమతం సమ్మతం
మతం వ్యక్తిగతం మానవత్వం మహోన్నతం
పుట్టుక ఒక ఆరాటం
బ్రతుకు ఒక పోరాటం
చావు నిత్యసత్యం
అయినా ఈ మధ్యలో ఎందుకా భేషజం
మతం వ్యక్తికి ఆత్మావలోకనం
ప్రపంచానికి లోకానికి ఆలంబనం
మతం సృష్టించరాదు మారణహోమం
మతం సృష్టికి మణిమకుటం
గుడి, చర్చి, మసీదు
కోట్లాది రూపాయల ఖరీదు
నిలువ నీడలేని గరీబు
నాది గొప్ప నీది గొప్ప
చివరికి ఏది గొప్ప
చంద్రమండల యాత్రలు
అణ్వస్త్ర పరీక్షలు
ఇవేమి చేయలేవు గరీబును నవాబును
మానవుణ్ణి భూమిపై మనిషిగా
నిలబెట్టేదే ... నిజమైన మతం
అదే నా "అభిమతం"
అది కావాలి మనందరి సమ్మతం
ఇదే ఏనాటికి శాశ్వతం
రోగాల్ని మాన్పలేని డాక్టర్‌వి
న్యాయాన్ని ఇవ్వలేని లాయర్‌వి
మాయ మాటలు చెప్పే మంత్రివి
ప్రజాధనాన్ని దోచే కాంట్రాక్టర్‌వి
చివరకు భూమిపై మానలేని జీవివి...
మానవత్వం మరచిన మనీ ..షి ..వి
ఓ మనిషి ! ఇదా నీ ప్రగతి?
నీ ప్రతిచర్యా ధనం
ప్రతిక్షణం ధనం
కోడికూస్తే ధనం ....
సూర్యుడు అస్తమిస్తే ధనం ..
అది మీకు ఇంధనం ....

తన దగ్గర డబ్బులేవని సెబుతుండె. అందుకని నేనే బాగా ఆలోచించి ఈ నిర్ణ యానికొచ్చాను. ఇసుకూల్లో చేరకపోతేపోయాం కనీసం ఇట్టాగైనా సదువు కుందామని గొర్రెలని చేలల్లో వొగ్గేసి నానిక్కడ కలాసోని మీరు బోర్డు మీద వ్రాసినవి ఇసుకలో వ్రాసుకుని నేర్చుకుంటున్నాను మాష్టారు" అని అన్నాడు.

"చదువుమీద నీకు కనబరుస్తున్న శ్రద్ధాసక్తులను చూస్తుంటే నాకు చాలా ఆనందంగా ఉన్నదబ్బాయ్. మీ ఇల్లెక్కడో చెప్పు, మీ నాన్నతో నేను మాట్లాడి నిన్ను స్కూల్లో చేర్పించేటట్లు చూస్తాను. నీ స్కూలు ఫీజు నేను కడతాను", అని చెప్పగానే "అలాగే మాష్టారు. ఈడ్నే వుండండి, గొర్రెలను తోలుకొస్తాను. ఇప్పుడే నాతో బాటూ మీరుకూడా మా యింటికొచ్చి మా నాన్నతో మాట్లాడి ఎలాగైనా నన్ను ఇసుకూల్లో సేరిపించేటట్లు సూడండి" అని పరుగెత్తుకుంటూ పోయి గొర్రెలను తోలుకొచ్చాడు.

శంకరం మాష్టారు క్రిష్ణప్పని అనుసరించాడు. మరోపావుగంటలో క్రిష్ణప్ప ఇల్లు చేరుకుని ఇంట్లో వున్న స్టూలుని తీసుకొచ్చి ఇంటి గుమ్మం ముందు వేసి మాష్టార్ని కూర్చోమన్నాడు. శంకరం మాష్టారు స్కూలు మీద కూర్చుంటూ "అబ్బాయ్! మీ నాన్నని ఇలా పిలుచుకురా" అని అన్నాడు.

"నాన్నా! మిమ్మల్ని శంకరం మాష్టారు పిలుస్తున్నారు రండి".

నారాయణప్ప ఇంట్లోంచి బయటికొచ్చి స్టూలు మీద కూర్చుని వున్న శంకరం మాష్టార్ని చూసి "నమస్కారం సార్!" అని చేతులు జోడించి "ఊరకరారు మహానుభావులు. ఏంటిలా వచ్చారు?" అని అడిగాడు కాస్తంత నవ్వుని ముఖానికి పులుముకొని.

"ఏం లేదయ్యా! మీ అబ్బాయిని స్కూల్లో చేర్పించమని చెప్పడానికి వచ్చాను" అని అన్నాడు.

"అడ్ని సదివించడానికి మాకాడ డబ్బుల్లేవు మాష్టారూ! ఆడేమో ఇసుకూలు కెడతానని పెతిరోజూ ఒకటే గోల. మాకు రోజు గడవడానికే కష్టంగా ఉంది మాష్టారూ! ఇక అడ్నేమి సదివిస్తాము సెప్పండి?" అని అన్నాడు.

"విద్యలేనివాడు వింతపశువు' అన్న చందాన చదువులేని కారణంగానే బతుకులు ఇలా ఏడుస్తున్నాయి. కనీసం మీ పిల్లాడికైనా విద్యాబుద్ధులు నేర్పించి వాడి భవిష్యత్తైనా బాగుండేటట్లు చూడండి. చదువుకునే వయసులో పిల్లల్ని పని చెయ్యడానికి పంపుతున్నారు. మీలాంటివారివల్లే దేశంలో బాల కార్మికుల సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతున్నది. దాని సంఖ్యను తగ్గించడానికి ప్రభుత్వం వారు అక్షరాస్యతను పెంపొందించే కార్యక్రమంలో భాగంగా వయో జన విద్య, అక్షర తపస్మాన్ లాంటి పథకాలను ప్రవేశపెట్టారు. ఈ సందర్భంగా మీకు నేను చెప్పాలనుకుంటున్నదేమిటంటే మీ అబ్బాయిని మరో బాలకార్మికు డుగా చెయ్యద్దు. అంతేకాకుండా మీ అబ్బాయికి చదువుమీద శ్రద్ధాసక్తులు మెండు. అందుకు మీ అబ్బాయి చేసిన ప్రయత్నాన్ని ఈ సందర్భంగా మీకు చెప్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అదేంటంటే స్కూల్లో పిల్లలకు బోర్డు మీద వ్రాసిన వాటిని మీ అబ్బాయి ఇసుకలో వ్రాసి నేర్చుకుంటుండగా చూశాను. కాబట్టి మీ అబ్బాయికి చదువుకోవాలనే తపన వున్నప్పుడు దానికి మీరు అడ్డుచెప్పడం బాగాలేదు. అసలు చదువుకోవాలనే జిజ్ఞాస పిల్లల్లో కలగడం అన్నది చాలా అరుదు. మీ పక్కింటి కిషోర్ చదువులో బాగా వెనుకబడి ఉన్నారు. వాళ్ళ నాన్నవాడికి ఫస్ట్ర్యాంక్ రావడానికి చెయ్యని ప్రయత్నమంటూ లేదు. కానీ ఏం ప్రయోజనం? తండ్రి చేసిన ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరే అయ్యాయి. తండ్రి ఆశయాలకు ప్రతికూలంగా కిశోర్ స్కూలుకు ఎగ్గొట్టడం, ఇచ్చిన హోం వర్క్ చెయ్యకపోవడం, వాళ్ళ నాన్న పోరుపడలేక స్కూలు కెళ్ళామంటే వెళ్ళామని అనిపించుకుంటున్నాడు. మరి మీ అబ్బాయి చదువంటే ఇష్టపడుతున్నాడు. కాబట్టి మీ అబ్బాయికి స్కూలు ఫీజు, పుస్తకాలు, యూనీఫాం నేను కొనిస్తాను. రేపే మీ అబ్బాయిని స్కూల్లో చేర్పించడానికి తీసుకురండి" అని శంకరం మాష్టారు ఇంటిముఖం పట్టాడు.

* * *

## కాలం వెనక్కిపోతే

- యడవల్లి శైలజ, ఖమ్మం. ఫోన్ : 9394171299

పరికిణీ కట్టుకొని పొన్నాయిపూలు
ఏరుకొని బూరలూదిన రోజులు గుర్తుకొస్తున్నై
అమ్మప్రేమతో కలిపిపెట్టిన మీగడ పెరుగన్నం
జున్నుపాలు గుర్తుకొస్తున్నై
నాన్న పొలానికి పోయి వచ్చేటప్పుడు
తెచ్చిన నూజీడీలు గుర్తుకొస్తున్నై
జ్వరమొస్తే నాయనమ్మ తీసిన కుండిదిష్టి గుర్తుకొస్తోంది
బతుకమ్మ పండక్కి ఇళ్ళన్ని తిరిగి పూలు పోగేసి
బతుకమ్మపేర్చి ఆడిన పాటలు గుర్తుకొస్తున్నై
దోస్తులతో కలిసి ఏరిన రేగుపళ్ళు, పరికిపళ్ళు,
ఈతపళ్ళు, వగరు మామిడికాయలు, సీమసింతకాయలు
పండిన వేపకాయల్లో ఉప్పు, కారం అద్దుకొని తిన్న రోజులు
గుర్తుకొస్తున్నై
పుస్తకంలో దాచిన నెమలీకలు గుర్తుకొస్తున్నై
వానలో వదిలిన కాగితం పడవలు గుర్తుకొస్తున్నై
ఉగాది పండక్కి ఉగాది పచ్చడి, బెల్లం పానకం
ఇంటి ఇంటికి పంచిన రోజులు గుర్తుకొస్తున్నై
రచ్చబండ దగ్గర విన్న హరికథలు, బుర్రకథలు, నాటికలు
రంగులరాట్నాలు గుర్తుకొస్తున్నై
చలికాలంలో వేసిన చలిమంటలు గుర్తుకొస్తున్నై
ఎండాకాలంలో వేపకాయలు ఏరుకొని పావలాకు అమ్మి
పుల్లఐసు కొని జుర్రుకుంటూ తిని ఎర్రబడ్డ నాలికని
చూసుకున్న రోజులన్ని గుర్తుకొస్తున్నై
ఈత ఆకులు, తాటాకులు, కొబ్బరి ఆకులు, చీర బొమ్మలు చేసి,
వాచీలు, ఉంగరాలు చేసి ఆడిన బొమ్మల పెళ్ళిళ్ళు
గుర్తుకొస్తున్నై
వెన్నెల్లో చేసిన భోజనాలు గుర్తుకొస్తున్నై
నాయనమ్మ కథలు వింటూ నిద్దరపోయిన రోజులు గుర్తుకొస్తున్నై
కాలం వెనక్కిపోతే బాగుండు ఎంచక్కా ఆ రోజుల్లో
లాగా ఒత్తిడిలేని ఆప్యాయతగల జీవితాన్ని గడిపేయొచ్చు.

శంకరం మాష్టారు చెప్పిన మాటలకు నారాయణప్ప సంతోషపడి కొడుకును ఇసుకూలుకు పంపడానికి ఒప్పుకున్నాడు. దాంతో క్రిష్ణప్ప సంతోషానికి అవధులు లేవు. ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్ళందరికీ తను రేపటి నుండ స్కూలు కెడుతున్న విషయం చెప్పి ఆనందభరితుడయ్యాడు.

* * *

మరునాడుదయం క్రిష్ణప్ప శుభ్రంగా స్నానం చేసి తయారయ్యాడు ఇసుకూలు కెళ్ళడానికి, నారాయణప్ప కూడా తయారయి పిల్లవాణ్ణి వెంట బెట్టుకుని స్కూలుకు బయలుదేరి వెళ్ళాడు.

స్కూల్లో శంకరం మాష్టారు వారిని సాదరంగా ఆహ్వానించి పిల్లవాడికి కట్టాల్సిన స్కూలు ఫీజుకట్టి చదువుకోడానికి కావాల్సిన పుస్తకాలు అతడికిచ్చి "క్రిష్ణప్పా! నువ్వెళ్ళి కిషోర్ పక్కన కూర్చో. బాగా చదువుకుని ప్రతిక్లాసులోనూ మచి మార్కులు సంపాదించాలి. సరేనా" అని అన్నాడు.

"అలాగే మాష్టారూ" అని క్రిష్ణప్ప వెళ్ళి క్లాసులో కూర్చున్నాడు.

శంకరం మాష్టారు నారాయణప్పనుద్దేశించి "నారాయణప్పా! ఇక మీరు ఇంటికి వెళ్ళొచ్చు. మీ అబ్బాయి చదువుకు సంబంధించి ప్రతి మూడునెలల కొకసారి ప్రోగ్రెస్ రిపోర్టు పంపుతాము. అందులో మీ అబ్బాయి ఏఏ సబ్జెక్టుల్లో ఎన్నెన్ని మార్కులు సంపాదించింది, స్కూలుకు సరిగా హాజరవుతున్నాడా లేదా" అన్న విషయాలు మీకు తెలుస్తాయి.

స్కూల్లో జరిగిన పాఠాలు క్రిష్ణప్ప గడగడా చదువుతుంటే నారాయణప్ప, సూరమ్మలు పరమానందభరితులయ్యారు.

క్రిష్ణప్ప స్కూల్లో చేరిన తర్వాత కిషోర్ కూడా స్కూలు అదివరకటిలా ఎగ్గొట్టకుండా వెడుతున్నాడు. అందుక్కారణం కిషోర్‌కు హోంవర్క్ చెయ్యడంలో క్రిష్ణప్ప సాయపడటమే.

ఒకరోజు స్కూలు వాళ్ళు ప్రోగెస్ రిపోర్టు క్రిష్ణప్ప చేతికిచ్చి "మీ నాన్న దగ్గర ఏలిముద్దర వేయించుకురా" అని చెప్పారు శంకరం మాష్టారు.

క్రిష్ణప్ప ఇంటికెళ్ళగానే తండ్రితో "నాన్నా! ఇదిగో నా ప్రోగ్రెస్ రిపోర్టు. స్కూల్లో అందరికంటే ఫస్ట్ మార్కులు నావే. శంకరం మాష్టారు ఇందులో నీ వేలిముద్ర వేయించుకురమ్మన్నారు" అని అన్నాడు.

నారాయణప్ప కొడుకు ప్రోగ్రెస్ రిపోర్టు చేతికందుకుని "ఇందులో ఏమి రాసుందో నాకేటి తెలుస్తది. నాకు సదువా సట్టుబండలా! అదేదో నువ్వే సదివి నాకు ఇవరంగా సెప్పు. ఇంటాను" అని అన్నాడు.

క్రిష్ణప్ప ప్రోగ్రెస్ రిపోర్టు తన చేతికి తీసుకుని ఏ ఏ సబ్జెక్టులలో ఎన్నెన్ని మార్కులొచ్చింది ఇవరంగా సెబుతూ స్కూలు కంతటికి తనవే ఫస్ట్ మార్కు"లని విజయగర్వంతో చెప్పాడు.

ఆ మాటలు విన్న నారాయణప్ప సంతోషం పట్టలేక కొడుకుని అక్కున చేర్చుకుని "ఆరోజు శంకరం మాష్టారు నిన్ను ఇసుకూల్లో సేరిపిచ్చమంటే మాకెందుకండీ సదువులు కూలి పన్లు సేసుకునేటోల్లమ్, మాలాటోల్లకి ఆ సదువు లబ్బవు అన్న ఆలోచనతో నిన్ను ఇసుకూల్లో సేరిపించకూడదని అనుకున్నాను. అంతేగానీ నీకింత తెలివితేటలున్నాయని నేనా రోజు తెలుసు కోలేకపోయాను. నీ బంగారం లాంటి భవిష్యత్తుని అనవసరంగా పాడుసేస్తుంటిని గదా!" అని బాధగా అన్నాడు నారాయణప్ప కొడుకుతో.

* * *

పక్కింటి క్రిష్ణమూర్తి తన కొడుకు కిషోర్ ప్రోగ్రెస్ రిపోర్టు చూసి తరువాత క్రిష్ణప్పా! నీ ప్రోగ్రెస్ రిపోర్టును చూపించు" అని అడిగాడు.

క్రిష్ణప్పా ప్రోగ్రెస్ రిపోర్టును క్రిష్ణమూర్తి చూసి ఫస్టుమార్కులు సంపాదించినందుకు క్రిష్ణప్పను పొగడి తన భార్య సుమతికి చూపించాడు. కుర్రాడంటే ఇలా వుండాలి. అన్ని సబ్జెక్టుల్లోనూ ఫస్ట్ మార్కులే వచ్చాయి. మనవాడూ వున్నాడు దేనికీ ముప్పూటలా తినమంటే తింటాడు. వాడు స్కూల్లో అందరికంటే ఫస్టుమార్కులు రావాలని ఎన్న ప్రయత్నాలు చేశాను. స్కూల్లో టీచర్లు చెప్పడమే కాకుండా ఇంటిదగ్గర నాకు పరిచయమున్న టీచర్ల దగ్గర ట్యూషన్లు చెప్పించాను. కానీ ఏం లాభం. అంతా బూడిదలో పోసిన పన్నీరే అయింది" అని క్రిష్ణమూర్తి కాస్తంత బాధపడి అంతలోనే తేరుకుని క్రిష్ణప్పను దగ్గరకు తీసుకుని "వెల్‌డన్ మై బాయ్! వెల్‌డన్. నువ్విలాగే ప్రతి క్లాసులోనూ ఫస్ట్ మార్కులు తెచ్చుకోవాలి సరేనా" అని అన్నాడు.

"అలాగే"నని క్రిష్ణప్ప ఇంటికెళ్ళి తండ్రితో పక్కింటి క్రిష్ణమూర్తి తనని ఏమన్నాడో చెప్పాడు. ఇంతలో శంకరం మాష్టారొచ్చారు నారాయణప్ప ఇంటికి.

శంకరం మాష్టారు వీధి గుమ్మంలోంచే "చూశావా నారాయణప్పా! మీ అబ్బాయి ప్రోగ్రెస్ రిపోర్టు. అన్ని సబ్జెక్టుల్లోనూ ఫస్టుమార్కులే. మీ అబ్బాయికి ఈ సంవత్సరం నుంచే మెరిట్ స్కాలర్‌షిప్ ఇచ్చేటట్లుగా మా స్కూలు తరఫున మీ అబ్బాయి పేరు నమోదు చేసి పంపించాం. వీలైనంత త్వరలో శాంక్షన్ కూడా చేస్తామని గవర్నమెంటు ఉత్తర్వులు కూడా జారీ చేసింది. కాబట్టి ఇకమీదట మీ అబ్బాయికి స్కూలు ఫీజు చెల్లించాల్సిన అవసరం లేదు. ఎందుకంటే వెనుకబడిన తరగతి కిందకి మీ తెగను కూడా చేర్చారుట. పుస్తకాలు కూడా గవర్నమెంటు వారే ఇస్తారు. ఇక మీ అబ్బాయి క్రిష్ణప్పను చదువు మాన్పించకుండా చదివించొచ్చు సరేనా, ఇక నే వెళ్ళొస్తా. ఈ విషయం నీకు చెప్పిపోదామని వచ్చాను" అని శంకరం మాష్టారు వెళ్ళిపోయారు.

* * *

కాలచక్రంలో పది సంవత్సరాలు గడచిపోయాయి. గడచిన పది సంవత్సరాలలో నారాయణప్ప జీవన విధానంలో ఎలాంటి మార్పు లేదు. కానీ పక్కింటి కిషోర్ వాళ్ళ తల్లిదండ్రులకు ఉద్యోగరీత్యా మరో ఊరికి బదిలీ అవడంతో వారక్కడి నుంచి వెళ్ళిపోయారు.

క్రిష్ణప్ప ఇంజనీరింగ్ కోర్సు పూర్తయింది.

ఇంజనీరింగ్ కోర్సులో క్రిష్ణప్ప స్టేట్ ఫస్ట్ వచ్చాడు. దాంతో క్రిష్ణప్ప ప్రతిభా పాఠవాలను ప్రభుత్వం వారు గుర్తించి అతనికి గోల్డ్ మెడల్ మరియు మెరిట్ స్కాలర్‌షిప్ అప్పటి రాష్ట్రపతి చేతుల మీదుగా బహూకరించారు. ఆ వేడుకకు క్రిష్ణప్ప తనతోపాటుగా తల్లిదండ్రులను కూడా తీసుకెళ్ళాడు హైదరాబాద్‌కు. ఆ వేడుకను కనులవిందుగా చూసిన తర్వాత కొడుకు తండ్రితో "నాన్నా! నన్నూ బడికి పంపవూ!!" అని తన చిన్ననాటి అనుభవాన్ని తలపింపజేయడంతో "ఆరి భడవా! నీకింకా గాపకం వుందిరా ఆయిసయం" అని కొడుకు చెవి నులిమాడు ప్రేమతో ●

కథానిక

# మరో అనార్కలి ప్రేమ కథ

- పొట్లూరు సుబ్రహ్మణ్యం, నెల్లూరు.

ఆ రోజు రాజారావు బెంగుళూరు వచ్చి, అక్కడే కంప్యూటర్ ఇంజనీరుగా పనిచేస్తున్న మేనల్లుడు కమలాకర్ రూములో దిగాడు. అతను వచ్చింది మొదట అతని వ్యాపార నిమిత్తం, రెండవది మేనల్లుడ్ని పెళ్ళికి ఒప్పించడం. పగలు అతను వ్యాపార పనులు చూసుకుంటూనే, రాత్రుళ్లు మేనల్లుడ్ని పెళ్ళి గురించి హెచ్చరిస్తున్నాడు.

"మావయ్యా ప్రేమ అనేది అసత్యం. ఈ పెళ్లిళ్లు అనేవి స్వార్థంతో జరిగేవి. నాకు పెళ్లిమీద ధ్యాసలేదు. బ్రహ్మచారిగానే జీవించడం నాకిష్టం. ఇక ఆ విషయంలో నా మీద ఒత్తిడి తేకు" బ్రతిమాలుతున్నట్లుగా అన్నాడు ఒకరోజు.

రాజారావు ఇంకేమనగలడు. తిరిగి హైదరాబాదుకు వెళ్లినప్పుడు, జరిగిందంతా అక్కకు, బావకు చెప్పి, వాడి బుద్ధిమారదు. వాడిని పెళ్ళికి ఒప్పించగల శక్తి నాలో లేదు' అని ఒప్పుకోవడమే అనుకున్నాడు.

ఆరోజు ఆదివారం. ఆ రాత్రి పది గంటల ట్రెయినుకు రాజారావు హైదరాబాద్ వెళ్ళడానికి టికెట్ రిజర్వు చేసుకుని ఉన్నాడు.

ఆ ఉదయం కమలాకర్‌తో పిచ్చాపాటి మాట్లాడుతూ పేపరు చూస్తున్న రాజారావు ఒకచోట ఆగిపోయాడు. అక్కడ నృత్య ప్రదర్శనకు సంబంధించిన ఒక ప్రకటన ఉంది. ఆ సాయంత్రం ఆరుగంటలకు భాషా అనే ప్రముఖ నాట్యకారుడు 'వెన్నెల' పేరుతో నాట్యం. ఇది ప్రకటన సారాంశం.

హైదరాబాదు వాస్తవ్యుడైన భాషా నాట్యం రాజారావు అనేకసార్లు చూసి ఉన్నాడు. అద్భుతంగా ఉంటుంది. ఇతను నెలంతా బిజీగా ఉంటాడు. ఇతని నాట్యం ఢిల్లీ, కలకత్తా, బెంగుళూరు, బొంబాయి, చెన్నై ఇంకా అనేక చోట్ల ప్రదర్శింపబడుతుంటుంది.

అందుకే కమలాకర్‌కు ఆ ప్రకటన చూపించిన రాజారావు సాయంత్రం నాట్యం చూద్దామన్నాడు.

"ఛీ... ఛీ... మగవాడు ఆడవేషంలో నాట్యం చేయడమా. నేను రాను" అన్నాడు కమలాకర్.

రాజారావు చాలాసేపు బ్రతిమాలిన మీదట, రావడానికి ఒప్పుకున్నాడు కమలాకర్. ఆ సాయంత్రం భాషా నాట్య ప్రదర్శన రెండుగంటలసేపు అద్భుతంగా సాగింది. స్త్రీ వేషంలో భాషా నాట్యానికి మురిసిపోయాడు కమలాకర్. 'వహ్వా', 'వహ్వా' అంటూ ఒకటే అభినందనలు.

ప్రోగ్రాం అయిన తరువాత అంతా లేచారు. "వెన్నెల నాట్యం అద్భుతంగా ఉంది మావయ్యా" సంతోషంగా అన్నాడు కమలాకర్.

"వెన్నెల కాదు. భాషా. నువ్వు చూసింది భాషా నాట్యం. బుర్రా సుబ్రహ్మణ్య శాస్త్రి గారు ఆడవేషం వేస్తే ప్రేమలేఖలు వచ్చాయట" అన్నాడు రాజారావు.

"నీకు భాషా అయితే నాకు మాత్రం వెన్నెలే మావయ్యా" అన్నాడు కమలాకర్.

ఇద్దరూ థియేటర్ బయటికొచ్చారు. "ఒకసారి గ్రీన్ రూములోకి వెళ్ళి పలుకరిద్దాం" అన్నాడు కమలాకర్.

## నేను సైతం సమిధనై...

- విరియాల సురేఖ

వెన్నెల బువ్వలు నాకొద్దంటా
వెన్నెలనే నే తాగి జీవిస్తా
పుడమి తల్లిని అమ్మా అంటా
అంబరాన్ని నే నాన్నను కొంటా
హద్దులేని ప్రేమని అందుకొంటా
ఆకులపై అక్షరాలు దిద్దుతా
జ్ఞానపదుల ఆటలు ఆడుతా
పూబాలలే నా నేస్తాలంటా
అడవి పూలతో పడవలు చేస్తా
గడ్డిపూల గొడుగులో బడికిపోతా
తాటాకులతో చెప్పులు చేస్తా
సంద్రాలయినా దాటుకుపోతా
కొండలు గుట్టలు ఎక్కుతూ పోతా
అభ్యుదయానికి అంకురమవుతా
అక్షర ఉద్యమంలో నే సమిధనౌతా
వీధిలో విసిరేసినా
నా జన్మము ఘనమని నిరూపిస్తా

## పసితనంపై విద్యాభారం

- యేటూరి మురళీకృష్ణ కుమార్, విజయవాడ. ఫోన్ : 8374151566

అమ్మ ఒడిలో ఒదిగి కూర్చుంటూ
అమ్మమాటలు వింటూ, గోరుముద్దలు తింటూ
బువ్వ వద్దంటూ, మారాము చేస్తుంటే
కమ్మని పాటలు పాడుతుంటే
ఊకొడుతూ ఉయ్యాలలో నిద్రిస్తుంటే
ఉలికిపాటుతో నిద్రలేస్తూ
చిన్ని చిన్ని కళ్ళతో అమ్మని అన్వేషిస్తూ
చకచకా ఇల్లంతా పాకేస్తూ
అమ్మను చూస్తూనే బోసినవ్వులు చిందిస్తూ
చిట్టి చిట్టి చేతులతో
టపటపమని చప్పట్లు చరుస్తూ
గట్టిగట్టిగా కేరింతలు కొట్టేస్తూ
అమ్మచెయ్యందుకుంటూ తప్పటడుగులులేస్తూ
బుల్లిబుల్లి పాదాలతో
గబగబా ఇల్లంతా నడిచేస్తూ
ముద్దుముద్దు మాటలతో, చిలిపి చేష్టలతో
పకపకానవ్వుతూ, అందరిని నవ్విస్తూ
బాల్య మాధుర్యాన్ని గ్రోలే చిన్నారిని
చదువుపేరుతో తల్లిదండ్రులు
బాల్యాన్ని మొగ్గలో తుంచేస్తూ
చదువనే కారాగారంలోకి (నెట్టేస్తూ)
మృదువైన చేతికి కలం అందిస్తూ
పేజీలకు పేజీలు అక్షరాలు దిద్దిస్తుంటే
చిలుక పలుకులు పలికే నోటితో
పెద్దపెద్ద పాఠాలు వల్లెవేయిస్తుంటే
బండెడు పుస్తకాల సంచిని
లేలేత భుజాలతో మోయిస్తుంటే
స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను హరిస్తుంటే
ఆటబొమ్మలా ఆటాడిస్తుంటే
చిన్నారుల చదువును కష్టంగా భావిస్తూ
చదువనే కర్మాగారంలో మరమనుషులుగా జీవిస్తూ
చదువుల బండిని భారంగా లాగుతున్నారు

"అదంత తేలికనుకున్నావా. పెద్దపెద్ద వాళ్లకే అతను ఇంటర్వ్యూ ఇవ్వడు. మనకిస్తాడనుకున్నావా అందరికీ కనిపిస్తే తాను సాధారణ స్థాయికి దిగజారిపోతానని అతని అనుమానం".

"అలాగా" అన్నాడు కమలాకర్ నిరాశగా.

భాషా నాట్య సందర్శనంతో స్త్రీ విషయంలో అతనికి చిన్న అలజడి కలిగింది. ఆ చిన్న అలజడే అతనిలో స్త్రీ పట్ల మోజు కలిగిస్తుందని, ఆ మోజే కమలాకర్‌ని పెళ్లికి ఒప్పిస్తుందని రాజారావు నమ్మకం.

ఆ రాత్రే అక్కడనుంచి బయలుదేరి వచ్చేశాడు రాజారావు.

రెండు నెలల తరువాత రాజారావుకో ఉత్తరం వచ్చింది. అది కమలాకర్ దగ్గరనుంచి ఆశ్చర్యంగా కవరు విప్పి చూసాడు. అది పది పేజీల ఉత్తరం. రెండులైన్ల పోస్టుకార్డులే కరువైన ఈ రోజుల్లో ఇంత పెద్ద ఉత్తరం. ఉత్తరం ఆసాంతం చదివాడు. చదవడం పూర్తయిన తరువాత నవ్వూ, కోపమూ రెండూ వచ్చాయి.

ఉత్తరం సారాంశమేమిటంటే తాను ఈ రెండు నెలల కాలమూ సెలవుబెట్టి వెన్నెల ఎక్కడ నాట్యం చేస్తూంటే అక్కడికి వెళ్ళి చూసి వచ్చేవాడట. ఢిల్లీ, బాంబే, గోవా, కలకత్తా, భువనేశ్వర్, చెన్నై, త్రివేండ్రం మొత్తం తిరిగాడట. తన మనసులో వెన్నెల రూపం ముద్రించుకుపోయిందట. వెన్నలను గాఢంగా ప్రేమిస్తున్నాడట. ఆమెను పెళ్ళి చేసుకుంటాడట. తన ప్రేమకు పెళ్లి చేస తనకు సహకరించమంటూ కోరాడు.

వెంటనే కమలాకర్ మొబైల్‌కు ఫోను చేసాడు రాజారావు. "ఇది జరిగేపని కాదు. నువ్వు పెళ్లి చేసుకుంటానంటే అమ్మాయిలు సిద్ధంగా ఉన్నారు. మంచి సంబంధం చూడమంటావా" అన్నాడు రాజారావు.

"లేదు. వెన్నెల తప్ప నాకీలోకంలో ఎవరూ లేరు. వెన్నెలను చేసుకోని నా జన్మ వ్యర్థం" అవతలి నుండి ఏడుపు.

రాజారావుకి చాలా బాధనిపించింది. వీడి మానసిక అధోగతికి తానే కారణం. భాషా నాట్యానికి వీడిని తీసుకెళ్లకుంటే ఈ ఘోరం జరిగేది కాదు. అయినా ఎంతమంది భాషానాట్యం చూడడంలేదు. ఎవరయినా ఇలా ప్రేమలో పడుతున్నారా?

"అలాగే. వెంటనే హైదరాబాదుకు రా. ఇక్కడ అన్ని విషయాలు మాట్లాడుకుందాం" కంగారు అణుచుకుంటూ అన్నాడు రాజారావు.

భాషా మ్యూజికల్ ట్రూపులో రాజారావుకు రంతుల్లా అనే ఒకతనితో పరిచయముంది. అతను తబలా వాయిస్తాడు. అతని ద్వారా కమలాకర్‌ని భాషా ఇంటికి తీసుకువెళ్లి, భాషాతో ముఖాముఖీ మాట్లాడించి, కమలాకర్ వాస్తవాన్ని తెలుసుకునేట్లు చేయడం అన్నది అతని ఆలోచన. పదిరోజుల తరువాత వచ్చాడు కమలాకర్.

జీబురుగా పెరిగిన గడ్డం, మీసాల్లోంచి చిరునవ్వు. పిచ్చివాడిలా ఉన్నాడు.

"ఏమిట్రా ఈ ఖర్మ నీకు" అన్నాడు ప్రక్కకు పిలిచి రహస్యంగా.

"అంతా వెన్నెల కోసమే"

ఇక ఆలస్యం చేయకుండా భాషాను నిజరూపంలో కమలాకర్‌కు చూపించి వాడికి వెన్నెల మీదున్న భ్రమను తొలగించాలి అనుకున్నాడు రాజారావు. కాని భాషా ఎవరికీ ఇంటర్వ్యూ ఇవ్వడే?

మరుసటి రోజు రంతుల్లాను కలుసుకుని జరిగిందంతా చెప్పాడు. ఎలాగయినా భాషా ఇంటర్వ్యూ సంపాదించి కమలాకర్‌ని మనిషిని చెయ్యమని ప్రాధేయపడ్డాడు.

"కుదరదు. భాషా ఎవరికీ కనబడడు" అన్నాడు రంతుల్లా.

"మానవత్వంతో ఆలోచించు రంతుల్లా భాయ్. ఇవి చేతులు కాదు. కాళ్లనుకో" అంటూ రంతుల్లా రెండు చేతులూ పట్టుకున్నాడు రాజారావు.

"ప్రయత్నిస్తాను భాయ్" అంటూ వెళ్ళిపోయాడు రంతుల్లా.

మరుసటిరోజు చెప్పిన టైముకి కమలాకర్‌తో రంతుల్లా ఇంటికి వెళ్ళాడు రాజారావు.

"కష్టం మీద ఇంటర్వ్యూ సంపాదించాను భాయ్. రేపు ఉదయం ఎనిమిది గంటలకు పోదాం. నాకు డ్యూటీ కూడాలేదు. ఈ అబ్బాయి ఇలా కాదు. శుభ్రంగా రావాలి" రాజారావుతో అని, "అర్థమయిందా రోమియో భాయ్" అన్నాడు కమలాకర్‌నుద్దేశించి నవ్వుతూ.

ఎలాగయితేనేం భాషా ఇంటర్వ్యూ దొరికింది. కమలాకర్ ఇక మనుషుల్లో పడుతాడనుకున్న రాజారావుకి మనసులోనుంచి ఏదో బాధ తీసివేసినట్లయింది. వెంటనే అతన్ని దగ్గరలోని సెలూన్‌కి తీసుకువెళ్ళి శుభ్రంగా క్రాపు చేయించాడు. నున్నగా గడ్డం గీయించాడు. ఇంటికి తీసుకెళ్లి, మంచి సూటు ధరింపజేశాడు.

కమలాకర్ రూపం పూర్తిగా మారిపోయింది. ఇప్పుడు అందంగా, మబ్బులు తొలగిన చంద్రుడిలా ఉన్నాడు. ఇక జీవితమంతా ఇలాగే ఉండాలని కోరుకున్నారంతా.

మరుసటిరోజు ఇద్దరూ రంతుల్లా ఇంటికి వెళ్లి, అతడ్ని కారులో ఎక్కించుకుని భాషా హవేలికి వెళ్లారు. అయిదెకరాల స్థలంలో నిర్మించబడ్డ నాలుగంతస్తుల భవనమది.

## • యువత కర్తవ్యం •

- కాకాని భాస్కరరాజు, ఖమ్మం.

తే.గీ. తెలుగులో పద్యకవితను తీర్చిదిద్ది
మరల వెనుకటి దశనిల దరల జేసి
గ్రాంధికంబగు భాషను గౌరవించి
మనదు సంస్కృతి నిలుపుడు మాన్యులార!

తే.గీ. పద్యకవితలవలె మన వచన కవిత
లన్నియును నాదరమ్మును నందజూచి
అన్ని సాహిత్య ప్రక్రియలవని మీద
నిల్వగా పాటుబడుడయ్య నిరత మీరు.

తే.గీ. సంస్కృతములోను నన్నిభాషలను గల్గు
మంచి కావ్యములన్నియు నంచితముగ
తెలుగులోనికి తర్జుమా గలుగవలయు
అటులె మన తెల్గు గ్రంథాలనన్యమైన
భాషలందున ప్రకటింపబడుట మేలు.

రాజమందిరంలా చుట్టూ పదిహేను అడుగులు ఎత్తయిన ప్రహరీగోడ, సింహద్వారం దగ్గర వెడల్పయిన ఇనుపగేటు. ముందు సీట్లో కూర్చున్న రంతుల్లా సైగ చేయడంతో గూర్ఖా గేటు తెరిచాడు. చక్కని సిమెంటు రోడ్డు. దానికి అటూ ఇటూ ఎత్తయిన కొబ్బరిచెట్లు. ఆవరణలో అంతా రకరకాల ఫలవృక్షాలు. భాషా ప్రకృతి ప్రేమికుడని అర్థమవుతోంది.

రంతుల్లా వీరివెంట ఉండడంతో ఎవరూ మాట్లాడలేదు. కాని అడుగడుగునా హవేళీలో ఎదురయిన నౌఖర్ల చేతుల్లో ఉన్న సింహాల్లాంటి కుక్కలు మాత్రం వీళ్లవైపు గుర్రుగా చూస్తూ అరుస్తున్నాయి. భవనం బయట మెట్లనుంచి రెండవ అంతస్తుకు వెళ్లగనే ఆగిపోయాడు రంతుల్లా. అక్కడ భాషా ఆఫీసు ఉంది. అక్కడ నుండి ఎవరితోనో మాట్లాడాడు రంతుల్లా.

ఇంతలో అక్కడికి ఓ యాభై ఏళ్ళ స్త్రీ వచ్చింది. ఆమె భాషా తల్లి అని చెప్పాడు రంతుల్లా. మనిషి కాస్త లావుగా ఉన్నా, హుందాగా ఉంది. భాషా ఇంటర్వ్యూ ఇస్తున్నాడని తెలిసి వీళ్లని ఎగాదిగా చూసింది. వీళ్ల నమస్కారాలకు తిరిగి నమస్కారం కూడా చేయకుండా వెళ్ళిపోయింది.

అయిదు నిముషాల తరువాత వీళ్లని మూడవ అంతస్తుకు తీసుకువెళ్లాడు రంతుల్లా. ఓ పెద్దగదిని చూపించి, 'ఇది భాషా పర్సనలు రూము' అని లోపలికి తీసుకువెళ్లాడు. విశాలమైన ఆగది ఎంతో అందంగా కళాత్మకంగా ఉంది.

"భాషా డాన్సు ప్రాక్టీసు చేస్తున్నాడు. ఓ ఇరవై నిముషాల్లో వస్తాడు" గోడకున్న గడియారం వైపు చూస్తూ చెప్పాడు రంతుల్లా.

"భాషా డాన్సు చూడండి" అంటూ కిటికీ ఓరగా తెరచి వెనుకగా ఉన్న లోపలి గది చూపించాడు రంతుల్లా.

లోపల భాషా చిన్న నిక్కరు వేసుకుని ఉన్నాడు. ఒంటిమీద మరే ఆచ్ఛాదనా లేక తెల్లగా, తీగలా ఉన్నాడు. లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. అతను తబలా దరువులకు తగ్గట్లు నాట్యం చేస్తున్నాడు. శరీరం మీద చిరుచెమటలు ముత్యాల బిందువుల్లా ఉన్నాయి. ఒళ్లంతా రబ్బరుతో చేసినట్లు ఎటువంటితే అటు వంగిపోతుంది. కాళ్లు భూమ్మీద నటరాజు నాట్యం చేసినట్లుగా ఉంది.

ఓ ఇరవై నిముషాలకు నాట్యం ఆగిపోయింది. నౌఖరు అందించిన టవలుతో ఒళ్లు తుడుచుకున్నాడు భాషా. తరువాత లుంగీ కట్టుకున్నాడు.

రంతుల్లా సున్నితంగా కిటికీ తలుపులు మూసి, "మీరు ఏమి తెలియనట్లు సోఫాలో కూర్చోండి. మర్యాదగా ఉంటుంది. భాషా వస్తున్నాడు" అన్నాడు.

వీళ్లు అలా కూర్చున్నారో లేదో లోపల తలుపులు తీసుకుని గదిలోకి అడుగుపెట్టాడు భాషా. వాద్యకారులు వేరే తలుపులు గుండా బయటకు వెళ్లిపోయారు. రాజారావు తనతోబాటు కమలాకర్‌ని లేపి భాషాకి నమస్కారం పెట్టాడు. రంతుల్లా వంగి వంగి దణ్ణాలు పెట్టాడు.

భాషా వీళ్లకెదురుగా సోఫాలో వెనక్కు ఆనుకుని కూర్చొని రిలాక్సింగ్‌గా కాళ్లు టీపాయ్ మీద పెట్టుకున్నాడు. రాజారావు, కమలాకర్ తిరిగి యధాస్థానంలో కూర్చున్నారు. చేయి ఇటు చాచగానే నౌకరు ఓ ఖరీదైన సిగరెట్ అందించాడు. భాషా నోటిలో పెట్టుకోగానే దాన్ని లైటర్‌తో అంటించాడు. చేతులు నలుపుకుంటూ వీళ్లని వినయంగా పరిచయం చేసాడు రంతుల్లా.

"మీకు అభ్యంతరమయినా నేను సిగరెట్ తాగక తప్పదు" అంటూ గట్టిగా సిగరెట్ పీల్చాడు భాషా.

నాట్యం చేసేటప్పుడు ప్లేబాక్ గాయని మధురమైన గొంతు స్థానంలో ఇప్పుడు భాషా గొంతు గంభీరంగా పురుషత్వం నిండి ఉంది. నగ్నంగా ఉన్న అతని ఛాతిమీద చెమటబిందువులు ఇంకా ఉన్నాయి. ఛాతీ నున్నగా షేవ్ చేసినట్లు తెలుస్తూ ఉంది. మేకప్‌లో అది తెలియదు.

"మీ అభిమానానికి కృతజ్ఞతలండీ. మాకు ఈ వృత్తిలో ఎన్నో టెన్షన్లుంటాయి. ఈ సిగరెట్ చూశారూ. ఈ ఒక్కదాని ఖరీదు అయిదువందలు. విదేశాల్లో తయారయింది. నేను రోజుకు ఒక్కసారి మాత్రమే సిగరెట్ త్రాగుతాను. అదీ అమ్మకు తెలియకుండా. దీనివల్ల నరాలకు ఒత్తిడి తగ్గుతుంది తప్ప ఆరోగ్యానికి ఏ హానీ జరగదు. మీలాంటి అభిమానుల కోసమే మేము అన్ని కోరికలు చంపుకుని మీకు ఆనందాన్ని కలిగిస్తున్నాం" స్వచ్ఛమైన తెలుగులో అంటూ నౌఖరు చేతిలోని యాష్‌ట్రేలో సిగరెట్ పీక నొక్కి కళ్లు మూసుకున్నాడు భాషా.

'ఇక వెళ్దాం' అన్నట్లు రంతుల్లా సైగ చేశాడు. ఇక భాషా మాట్లాడడని అర్థం చేసుకున్న రాజారావు, కమలాకర్‌వైపు చూశాడు. కమలాకర్ ఎంతో ఆనందంగా ఉన్నాడు. "నిజంగా వాడి మనసులోంచి అసహజమైన ప్రేమ భావనను తీసివేసాను. ఇక ఏ యువతితోనయినా సహజమైన ప్రేమ భావనలో పడతాడు" అనుకున్నాడు రాజారావు.

ఇంటికి వచ్చిన తరువాత అక్కకు, బావకు విషయమంతా విశదీకరించాడు. ఆరోజు అక్కడే భోంచేసి సాయంత్రం వరకు కమలాకర్‌తో గడిపాడు. కమలాకర్ ఎంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉన్నాడు.

రాజారావు అందరి దగ్గరా సెలవు తీసుకుని మలక్‌పేట నుంచి తనుంటున్న సికింద్రాబాద్ కొచ్చేశాడు. కమలాకర్ ప్రక్కరోజే బెంగుళూరికి వెళ్లిపోయాడు.

## గుడి-శ!

- యం. ప్రీతమ్ మహేష్, సికింద్రాబాద్

నేనొక పూరి గుడిశని  
పూర్ తాటాకుల గుడిశని  
తలవాల్చి వినయంగా ఒదిగి వున్న  
పేదగుడిశని. కానీ –

ఒక చిన్న అగ్గిపుల్ల గీసి మంటపెట్టారు నాకు.  
వెయ్యి నాలుకలతో ఎగిసిపడ్డాను.  
నా రూపం – ఎర్రని జ్వాలలుగా మారిపోయింది.

నేను ఎరుపును కాను.  
మంటని అసలే కాను.  
పూర్ పూరి గుడిశని  
వీళ్ళే తగలబెట్టారు.  
అందుకే నే  
జ్వాలనయ్యాను యువరానర్.

నెల తర్వాత రాజారావు వ్యాపారరీత్యా ఢిల్లీలో ఉన్నాడు. తిరుగు ప్రయాణానికి రైల్లో ఫస్టుక్లాసు రిజర్వేషను ఉంది. రాత్రికి బయలుదేరుతాడనగా మధ్యాహ్నం రెండు గంటలు ప్రాంతంలో బావ దగ్గరనుంచి ఫోను.

"కమలాకర్ ఈ రోజు ఉదయాన్నే వచ్చాడురా. 'నా కోసం వెతకవద్దు. నేను మళ్లీ ఇంట్లోకంటూ వస్తే వెన్నెలతోనే' అని ఒక నోట్ వ్రాసి పెట్టి ఎటో వెళ్లిపోయాడురా. సెల్‌కు ఫోను చేస్తే స్విచ్‌డ్‌ఆఫ్ అని వస్తోంది" చెబుతూ, చెబుతూ ఫోన్లోనే ఏడ్చేశాడు.

రాజారావు మనసు మూగబోయింది. 'ఏమిటీ విధివైపరీత్యం. పిచ్చి తగ్గిందనుకుంటే తలకు రోకలి చుట్టమంటున్నాడు. కొంపదీసి వీడు 'సైకో'గా మారిపోలేదు కదా తనలో తను అనుకున్నాడు రాజారావు.

రైలు రిజర్వేషను కాన్సిలు చేసుకుని, సాయంత్రం ఆరుగంటల ఫ్లైటుకు ఎమర్జెన్సీ కోటాలో బుక్ చేసుకుని హైదరాబాద్ ఎయిర్‌పోర్టులో రాత్రి ఎనిమిదికల్లా దిగాడు.

టాక్సీలో వెంటనే మలక్‌పేటకు వెళ్ళాడు. అతని భార్యాపిల్లలు అప్పటికే అక్కడ చేరి ఉన్నారు. రాజారావు అక్క శోకదేవతలా మంచంమీద ఒక ప్రక్కకు తిరిగి పడుకుని పైట చెంగు ముఖం కనపడకుండా కప్పుకుని ఏడుస్తూ ఉంది. బావ, కమలాకర్‌ని వెతకడానికి వెళ్లాడని తెలిసింది.

రాజారావు అక్కను ఓదార్చి, కమలాకర్‌ని వెతకడానికి తనూ కారులో బయలుదేరాడు. భాషా ఇంటి సమీపంలోనూ, చుట్టుప్రక్కలా వెతికాడు. భాషా ఇల్లు విద్యుద్దీపాలతో వెలిగిపోతూ ఉంది. నిశ్శబ్దంగా ఉన్నట్లు కనిపిస్తున్న ఆ భవనంలో భాషా ఒక మారుమూల గదిలో ఎక్కడో నాట్యం ప్రాక్టీస్ చేస్తూ ఉండవచ్చు.

రాజారావు రాత్రి పదకొండు గంటలవరకూ సిటీ అంతా తిరిగి, కమలాకర్ ఆచూకీ తెలియక వచ్చాడు. అప్పటికే అతని బావ కూడా వచ్చి ఉన్నాడు. 'కమలాకర్ తిరిగే అన్నిచోట్లూ వెతికాను. ఎక్కడా లేడు. అతని స్నేహితుల్నీ అడిగాను. వాళ్ళకీ తెలియదట' చెప్పాడు అతని బావ.

రాజారావు అక్క భోరున ఏడ్చింది. పెద్దవాళ్లందరికీ ఆ రాత్రి జాగరణే అయ్యింది. చిన్ననాటి కమలాకర్ ముద్దుముచ్చట్లు చెప్పుకుని బాధపడుతున్నారు.

వేకువజామున మూడు గంటల సమయంలో రాజారావు సెల్ మోగింది. అది కమలాకర్ దగ్గరనుంచి. సోఫాలో తూగుతున్న రాజారావుకు మత్తు ఎగిరిపోయింది.

"కమలాకర్ ఫోను చేశాడు" అని అరిచాడు. అందరూ ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చారు.

"మావయ్యా. సాధించాను. వెన్నెల నాతోనే ఉంది. మీరు వెంటనే రావాలి" అంటూ తాము ఎక్కడ ఉన్నదీ చిరునామా విడమరచి చెప్పాడు.

రాజారావు చెప్పిన విషయం వినగానే అందరూ కారులోకి దూకారు. 'సైకో'లు, అంటే మానసిక స్థితి తప్పిపోయినవాళ్లు తాము అనుకొన్నది సాధించడానికి హత్యలు చేయడానికైనా వెనుకాడరట. కొంపదీసి కమలాకర్ దుర్భేద్యమైన భాషా ఇంట్లో ప్రవేశించి, రానంటే అతని తల పగులగొట్టి, కొన ఊపిరితో ఉన్న భాషాని భుజం మీద వేసుకుని ఇలా హాస్పిటల్‌లో పడవేయలేదు కదా' అనుకున్నాడు రాజారావు. అతని అక్కా, బావా కూడా ఇలాంటిదే ఏదో ప్రమాదం జరుగుతుందని భావిస్తున్నారు.

రాజారావు నడుపుతున్న కారు, మెయిన్‌రోడ్డులోంచి చీలి, నిర్మానుష్యమైన సన్నని వీధుల్లో పరుగెత్తి, అనేక మలుపులు తిరిగి ఒక చిన్న డిస్పెన్సరీ ముందు ఆగింది. లోపల లైట్లు వెలుగుతున్నాయి.

వాకిట్లోనే ఎదురొచ్చాడు కమలాకర్. ఒళ్లంతా బురద కొట్టుకుని ఉంది. ముఖంమీద చిన్న చిన్న గాయాలకు ఏదో పొడరు అద్ది ఉంది. తల చెదిరి ఉంది. మనిషి ఆందోళనగా ఉన్నాడు.

అందర్నీ చూడగానే ఉద్వేగంగా, "వెన్నెలను చూద్దురుగాని. లోపలికి రండి" అంటూ ముందుకు నడిచాడు.

ఎటువంటి ఘోరమయిన దృశ్యం చూడవలసివస్తుందో అనుకుంటూ భయంభయంగా అందరూ కమలాకర్ వెంట లోపలికి నడిచారు.

## యువత - నడత

- ఎ.వి.కె. సుజాత, గుంటూరు. ఫోన్ : 9490449521

ఓ యువతా !
మీ నడత నవ కవితలా
సమత మమతల కలబోతలా
మానవతా పరిమళంలా
విరితోటలా బ్రతుకుబాటసాగాలి
నవ్వుల పువ్వులు విరజిమ్ముతూ
సిరిమువ్వల సవ్వడిలా
రివ్వున ఎగిరే గువ్వలా
రవ్వలా వెలుగులు రువ్వుతూ
చిరుగాలుల సరాగంలా
సెలయేటి గలగలలా సాగాలి
ఓ యువతా ! మీ జీవితం ధర్మగ్రంథంలా
సత్య సుగంధంలా
నిత్యప్రేమ ప్రబంధంలా
అనురాగ అనుబంధంలా
సేవాకదంబంలా
జీవన సాఫల్యం పొందాలి
ఓ యువతా! మీరు సంగీత ఝురులై ప్రవహించాలి
సాహితీ విరులై పరిమళించాలి
సంస్కృతీ విరులై పరిమళించాలి
ఆధ్యాత్మికత, నైతికత రంగరింపుగా
ఆదరణ ఆత్మీయత పల్లవింపుగా
ఆహ్లాదం ఆనందం ఆరగింపుగా
విజ్ఞానం వినోదం మేళవింపుగా
సౌభ్రాతృత్వం గుబాళింపుగా
నిండైన వ్యక్తిత్వానికి నిగారింపుగా
ఉన్నతమైన ఆశలు ఆశయాలు
ఉదాత్తమైన ఆదర్శాలు ఆకాంక్షలతో
ఉత్తమ జీవన భవనానికి పునాది వేసుకోవాలి.

లోపలి గదిలో తెల్లని బెడ్‌మీద బంగారు తీగలాంటి ఓ పాతికేళ్ళ స్త్రీ పడి ఉంది. బారెడు పొడవున్న నల్లని తల వెంట్రుకలు, తెల్లని దిండునంతా పరుచుకుని ఉన్నాయి. భువనమోహనంగా ఉంది.

భాషా! వెన్నెల! భాషా ఆడవేషం వేస్తే వెన్నెలే. మరి తీసిస్తే! పొట్టి క్రాపుతో ఉండే భాషా. అయితే బారెడు పొడవు సహజమైన జుట్టుతో ఎలా ప్రత్యక్షమయ్యాడు. మాయా! మంత్రమా!! కనికట్టా!!!

కళ్లు తెరచి ఇంతమందిని చూసిన వెన్నెల ఆనందభాష్పాలు రాల్చింది. లేవబోయిన ఆమెను ఆపిన రాజారావు అక్క, వెన్నెల తలను తన ఒడిలో పెట్టుకుని పరవశించిపోతూ కూర్చుంది.

"ఎంత బాగున్నావమ్మా. మావాడు నిజంగానే అదృష్టవంతుడు" అప్పటి వరకు పడ్డ ఆవేదనంతా మరచిపోయి అంది.

"అసలేం జరిగిందిరా. మాకేం అర్థం కావడం లేదు" అన్నాడు రాజారావు తలపట్టుకుంటూ.

"వెన్నెలా! నీ కథను నువ్వే చెప్పు" ఆప్యాయంగా అన్నాడు కమలాకర్.

మేమందరం వెన్నెలవైపే చూస్తూంటే ఆమె లేత పెదవులు కదిలాయి.

"దీన్నో కథలా వినండి. జగదాంబ ఆంధ్రప్రదేశంలో గొప్ప పేరొందిన నాట్యకత్తె. ఆమె సొంతూరు నెల్లూరు. ఒకసారి హైదరాబాదులో జరిగిన నాట్య ప్రదర్శనలో ఆమె నాట్యానికి మురిసిన ఖలీల్ అనే నవాబు పెళ్లి చేసుకుంటానని ముందుకు వచ్చాడు. అప్పటికే అరకొర ఆదాయంతో ఆర్థిక ఇబ్బందులతో సతమవుతున్న జగదాంబ తన తల్లిదండ్రుల్ని ఒప్పించి, నవాబుతో వివాహానికి అంగీకరించింది. కాని ఒక కండిషన్ పెట్టింది. అదేమిటంటే అతనికి అంతకుముందే ఉన్న అయిదుగురు బీగంలకు, వారి సంతతికి ఆస్తులు సెటిల్ చేసి, జీవితాంతం తన ఒక్కదాంతో ఉండాలనేది. దానికి నవాబు అంగీకరించి, నగరంలో తనకున్న అపారమైన ఆస్తుల్ని విడగొట్టి, వాళ్ల తృప్తిమేరకు ఆస్తుల్ని పంచిచ్చాడు. జగదంబ పేరిట ఒక పెద్ద హవేలీని రిజిష్టరు చేసి, కొంత సంపదను ఇచ్చాడు. ఆమెకు ముంతాజ్ అని పేరుపెట్టి ఆమెను పెళ్లి చేసుకున్నాడు.

పెళ్ళయిన తరువాత ఆమెను నాట్యాలకు పంపేవాడు కాదు వృద్ధుడయిన నవాబు. ఆమె యౌవ్వనంలో ఉంది. అదీగాక బేగంలు బురఖా పాటించాలి. ఆమె తన నాట్యపిపాస తీరక పోయినా నవాబు కోరిక మేరకు నడుచుకొనేది. నవాబుకు ఆరోగ్యం బాగలేక ఆరునెలలపాటు బొంబాయిలో ఉండవలసి వచ్చింది. అప్పటికే గర్భవతి అయిన ముంతాజ్ అక్కడే కవల పిల్లలను ప్రసవించింది. వాళ్లలో మొదట మగబిడ్డ, తరువాత ఆడబిడ్డ పుట్టింది. ఇద్దరిమధ్యా పది నిముషాలు తేడా. ఆ మగబిడ్డే భాషా, ఆడబిడ్డను నేను. నాకు ఆషా అని పేరు పెట్టారు. మేము పుట్టిన పదిహేను రోజులకు మా తండ్రిగారైన నవాబు కన్నుమూసాడు.

తనను వెన్నంటి ఉండే నమ్మకస్తులయిన తన హవేలీ పనివాళ్లతో మా నాన్న అంత్యక్రియలు బొంబాయిలోనే చేసి హైదరాబాదు తిరిగి వచ్చింది. ఇంటికి వచ్చిన తరువాత తన కిష్టమయిన హిందూ పేరు 'వెన్నెల' అని నాకు పెట్టింది. ఉన్న సంపదంతా నాన్న ఆరోగ్యానికి ఖర్చుయిపోగా, విశాలమైన హవేలీ మాత్రమే మిగిలిపోయింది. అప్పుడు మెదిలింది ఆమె బుర్రలో ఒక విచిత్రమైన ఆలోచన. తన ఆంతరంగికులనందరినీ పిలిచి తన మనసులోని ఉపాయం చెప్పింది. తనకు ఒకే మగబిడ్డని, ఆ బిడ్డనే గొప్ప నాట్యకారుడుగా తర్ఫీదు ఇస్తుందని ప్రచారం చేయించింది. హవేలీలోని ఆంతరంగిక పనివాళ్లు ప్రాణమయినా ఇస్తారు గాని, హవేలీలో రహస్యాలు అనుకొన్నవి ఎట్టి పరిస్థితుల్లోనూ బయట చెప్పరు. అన్న భాషాకు, నాకూ రోజు తనే స్వయంగా నాట్యం నేర్పించసాగింది. ఇలా పదహారేళ్లు గడిచిపోయాయి. నేను నాట్యంలో అన్న కంటే బాగా ఆరితేరాను.

ఈ పదహారేళ్లూ కుటుంబపోషణకు హవేలీ ముందున్న విశాలమైన మైదానంలో కూరగాయలు పెంచి, కూలీలచేత వ్యవసాయం చేయించేది. వాళ్లచేతనే వాటిని మార్కెట్‌కు వేయించి ఆ డబ్బుతోనే పొదుపుగా సంసారం చేసుకుంటూ తనను నమ్ముకొన్న వాళ్లను కూడా పోషించేది.

ఒకరోజు నన్ను, అన్న భాషాను కూర్చోబెట్టి, దివానం అప్పుల్లో కూరుకుపోయిందని, అశేషంగా డబ్బు సంపాదిస్తే తప్ప ఈ ఊబిలోంచి బయటపడలేమని మా ఇద్దరికీ నూరిపోసింది. తరువాత తన ప్లాను చెప్పింది. మగవాడు ఆడవేషంలో నాట్యం చేస్తే ప్రజల్లో మంచి డిమాండు ఉంటుందని, డబ్బుకు డబ్బూ, పేరుకు పేరూ వస్తాయని చెప్పింది. 'అందుకే నిన్ను రహస్యంగా పెంచుతున్నాను. నువ్వు నాట్యం అద్భుతంగా చేస్తావు. సహజంగానే నువ్వు స్త్రీవి కాబట్టి నీ నాట్యం బాగా రాణిస్తుంది. నువ్వు నాట్యం చెయ్యి. అది భాషా చేసినట్లుగా నేను ప్రచారం చేయిస్తాను. ఇద్దరూ కవలపిల్లలు కాబట్టి తేడా తెలియదు. నాట్యం అయిన తరువాత స్త్రీ వేషంలో నాట్యం చేసిన పురుషుడుగా

## చేయాల్సిన పని

- పనసకర్ల ప్రకాష్ (నాని)

పట్టుతప్పిన శరీరం
పటపటలాడుతుంది
విరిగిపోవడానికి సిద్ధంగా ఉన్న
ముక్కాలిపీటలా
ఒళ్ళంతా ఒకటే నీటి ప్రవాహం
ఇన్నాళ్ళూ ఈదిన రక్తపు బేరుని కడిగేస్తూ...
ముడతలు పడ్డ శరీరం
ఊయలలూగుతోంది
జ్ఞాపకాల మడతలలోకి
ఒదిగిపోవడానికి
ఇప్పుడు కాళ్ళు, చేతులు
సహకరించడం లేదు గానీ...
ఒకప్పుడది నా కాళ్ళకు అడ్డంపడ్డ పిల్లలే.
చూపు తగ్గిన కళ్ళజోడు
పెద్దరికం మాసిన కండువా
జీర్ణమైన వస్త్రాలు
వృద్ధాప్యం నిజంగా పేద తరగతి మనిషే
ఇప్పుడిక లోకాన్ని కొత్తగా చదవాల్సిందేమీ లేదు
మిగిలిందల్లా
నెరలు తీసిన నుదుటిరేఖల్లో మిగిలిన
ఆ నాలుగు గింజలను ఏరుకోవడమే !

భాషా మేకప్ లేకుండా స్టేజిమీద కనిపిస్తాడు. నువ్వు అనేదానివి ప్రజల దృష్టిలో లేనట్లే. ఏమంటావు?' అంది. అమ్మ మాట కాదనగలనా 'సరే'నన్నాను.

'మగవాడైన భాషా, 'వెన్నెల' అనే ఆడవేషంలో నాట్యం' అంటూ భారీ ఎత్తున ప్రచారం చేయించి ఒకరోజు నాచేత అరంగ్రేటం చేయించింది. తెరలు గట్టిన ఆరుగురు పట్టే స్కార్పియో వాహనం క్రింద అంతస్తులో కేటాయించిన పెద్ద హాల్లోకి వచ్చింది. అందులో భరతనాట్యం దుస్తుల్లో ఉన్న నేను, తెల్లపంచె, తెల్ల చొక్కాతో ఉన్న భాషా, అమ్మ, మరో ఇద్దరు స్త్రీలు బురఖాలతో వాహనం ఎక్కి, కర్టెన్‌లు సర్దుకోగానే, హవేలి డ్రైవర్ వాహనం కదిలించాడు. వేరే దాంట్లో గాయకులు, తబలిస్టు, హార్మోనిస్టులు అంతకుముందే వెళ్లారు.

వాహనంలోనుంచి బయటకు వచ్చిన నేను భాషా పేరుతో అరంగ్రేటం చేసాను. నాట్యమయిన తరువాత లోపలికి వచ్చి రహస్యంగా వాహనంలోకి వెళ్లాను. నేను వెళ్లిన పదిహేను నిముషాలకు వాహనంలో లైట్ మేకప్‌తో ఉన్న భాషా స్టేజి మీదికి వెళ్లి తానే వెన్నెలగా పరిచయం చేసుకున్నాడు. జనం హర్షధ్వానాలు చేశారు.

రోజులు గడుస్తున్నాయి. ఇలా ఎనిమిదేళ్లు గడిచాయి. అపారమైన కీర్తి అన్న భాషాకు, అశేషమైన డబ్బు అమ్మకు అందింది. నేను ప్రజలందరినీ చూడగలను. గాని నన్ను ప్రజలెవరూ చూడలేరు. బయటి నుంచి ప్రోగ్రాంలు ఫిక్స్ చేసుకునేవాళ్లు. బయట మెట్లమీద నుంచి పోయి భాషాతోగాని, మా తల్లితోగాని మాట్లాడాల్సిందే. ఆమె బయట ఘోషా పాటించేది కాని, ఇంట్లో మాత్రం ఘోషా పాటించేది కాదు.

రెండో అంతస్తులో అమ్మ, మూడో అంతస్తులో అన్న భాషా ఉండేవారు. నా నివాసం నాలుగవ అంతస్తు. నాకు బయట ప్రపంచం కనిపించేది కాదు. రంగుటద్దాల్లోంచి మాత్రమే లోకాన్ని చూస్తూ భయంకరమైన ఘోషాలో ఉండేదాన్ని.

గతమూడు నెలలుగా ఒక ప్రేక్షకుడు క్రమం తప్పకుండా, ఎక్కడ ప్రదర్శన ఇచ్చినా ఖచ్చితంగా హాజరై ముందు వరుసలో కూర్చుని నా నాట్యాన్ని కళ్లతో ఆరాధించడం గమనించాను. అతను నన్ను కలవడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ముందు, వెనుక వాహనాల్లో వస్తున్న భాషా బాడీగార్డులు అతన్ని చితక కొట్టేవాళ్ళు.

ఉన్నట్లుండి అతను శుభ్రంగా గడ్డం గీసుకుని సూటు, బూటు వేసుకుని రావటం మొదలుపెట్టాడు. ఎంతో హుందాగా ప్రవర్తించేవాడు. కాని ఆ కళ్లు మాత్రం నన్ను ఆరాధించడం మాత్రం మానలేదు. నన్ను, నా వాహనాన్ని ఫాలో కావడం మాత్రం మానలేదు. అది నాకు తెలుసు. ఒకరోజు నేను ఆడిటోరియం నుంచి వస్తూ కిటికీ అద్దం ప్రక్కకు జరిపి తెరసందులోంచి ఎవరూ చూడకుండా నా సెల్‌ఫోను అతనిముందు పడేట్లు వదిలాను. అది అమ్మ తనను గాని, భాషాను కాని పిలవడానికి ఇచ్చిన ఫోను. ఓ పదినిముషాల తరువాత నా సెల్ ఎక్కడో పడిపోయినట్లు చెప్పాను. కంగారుపడ్డ అమ్మ వాహనాన్ని వెనక్కు తిప్పమంది. చూసుకుంటూ తిరిగి ఆడిటోరియం దగ్గరకు వెళ్ళాము. అతను లేడు గాని, ఆడిటోరియం ఆవరణలో మేము బయలుదేరిన చోట సెల్‌ఫోను పడి ఉంది.

నేను ఊహించినట్లుగా ఆ అర్థరాత్రి ఫోను మోగింది.

తన పేరు కమలాకర్ అని. గతంలో భాషా రౌడీలచేత తన్నులు తిన్న ప్రేమపిచ్చివాడ్ని తానేనని, తాను వెన్నెలను ఎంత గాఢంగా ప్రేమించేది విశదీకరించాడు. భారతదేశంలోని నా ప్రేక్షకులలో నన్ను స్త్రీగా గుర్తించిన ఏకైక వ్యక్తి కమలాకర్. పరవశించిపోయిన నేను, కమలాకర్ ఫోను నంబరు వేరొకచోట వ్రాసుకుని, నా సెల్‌ఫోనులో తొలగించాను. నేను ఒంటరిగా ఉన్నప్పుడు మిస్డ్‌కాల్ ఇవ్వడం. కమలాకర్ గంటలతరబడి మాట్లాడడం మామూలయిపోయింది. తరువాత అతని నంబరు సెల్‌ఫోనులో తొలగించేదాన్ని.

నేను అమ్మతో కమలాకర్‌ని చేసుకుంటానని చెబితే ఇప్పటివరకు నామీద లేని నిఘా ఇకనుంచి మొదలవుతుంది. ఇక శాశ్వతంగా నాలుగు గోడల మధ్య ఉండిపోవలిసిందే. కమలాకర్‌ని కలవడం అసంభవం.

కొన్ని రోజుల తరువాత ఆ రాత్రి నాతో మాట్లాడిన కమలాకర్‌తో నా నిర్ణయం చెప్పాను. దానికి ఎగిరి గంతేశాడు కమలాకర్. అతని సూచనల ప్రకారం, అర్థరాత్రి వెనుకవైపు నాలుగవ అంతస్తు నుంచి రెండవ అంతస్తుకు చీరలు జాయింటు చేసి వాటి ద్వారా రెండవ అంతస్తువరకు జారి, అక్కడకు వ్యాపించి ఉన్న పెద్ద చెట్టు కొమ్మల ద్వారా ఇటువైపు పదిహేను అడుగులు ఉన్న ప్రహరీమీదకు ఎక్కాను. అక్కడ నుండి మరో రెండు చీరలు చెట్టుకు కట్టి ప్రహరీ గోడ అవతలకు జారాను. గోడ అవతల చిక్కగా పెరిగిన ముళ్లచెట్లు, ప్రక్కనే మురుగుకాలువ. ముళ్లచెట్లు ఒళ్లంతా గీచుకొంటుండగా పైన్నుంచి జారాను. ముళ్ళచెట్ల మధ్య నా కోసం ఎదురుచూస్తున్న కమలాకర్ నన్ను పట్టుకొని మురుగుకాలువ దాటించి, రోడ్డు ప్రక్కన చెట్ల మధ్య దాచిన బైక్‌లో నన్నిక్కడకు తీసుకువచ్చాడు. ఇదీ జరిగింది"

"ఎంత కష్టపడ్డావమ్మా" అంది కాబోయే కోడలి చెక్కిలి నిమురుతూ రాజారావు అక్క పరమేశ్వరి.

"నేనింకెక్కడికీ వెళ్ళను అత్తయ్యా. మీ మధ్య మీతోనే జీవిస్తాను" ఏడుస్తూ అంది వెన్నెల.

"అలాగే మాతోనే ఉందువుగాని. నిన్ను మేమెప్పటికీ వదలం" హామీ ఇచ్చింది పరమేశ్వరి.

"ఒరే కమలాకర్. భాషాను అంతతేలిగ్గా తీసేయకు. అతను గుండెలు తీసిన బంటు. ఉదయం వెన్నెల లేదని తెలిసి రౌడీలతో మనమీద దాడి చెయ్యొచ్చు" అన్నాడు రాజారావు భయంభయంగా.

కమలాకర్ తల్లిదండ్రులు భయంతో వణికిపోయారు.

ఈ భయాలను లెక్క చేయనట్లు ప్రశాంతంగా నవ్వాడు కమలాకర్. "అలా ఎన్నటికీ జరగదు. అదే గనుక జరిగితే వెన్నెల ఎవరో బయట పడుతుంది. అతను ఇంతకాలం సంపాదించుకున్న పేరు ప్రతిష్ఠలు మట్టిలో కలిసిపోతాయి. భాషా ఇంతకాలం చేసిన మోసాన్ని ప్రజలు సహించరు.

## అమ్మప్రేమ

- డి. గాయత్రి.

అక్షరానికి అందని ఆప్యాయత
మాటల్లో వర్ణించలేని మమత
వ్యక్తపరచలేని అనురాగం
విడదీయలేని అనుబంధం
అమ్మప్రేమలో .....

అతని అంతు చూస్తారు. కాబట్టి సంపాదించిన దానికి తృప్తిపడి, భాషా ఏవో అనారోగ్య కారణాలు చెప్పి, నాట్య ప్రదర్శనలు మానుకొన్నట్లు ప్రకటన ఇవ్వబోతాడు. మార్గంలేదు".

కమలాకర్ విశ్లేషణకు అందరి మనసులూ కుదుటపడ్డాయి.

కమలాకర్ రాజారావును కౌగిలించుకొని, అతని భుజంమీద తలపెట్టి, "ప్రేమ సత్యం మావయ్యా. ప్రేమ శాశ్వతం. అంతేకాదు ప్రేమ అపురూపం కూడా. నా నిజమైన ప్రేమతో వెన్నెలను సాధించుకున్నాను" అంటూ ఏడవసాగాడు. అతని కళ్లలోంచి కారిన వెచ్చని కన్నీరు రాజారావు భుజాన్ని తడుపుతోంది. ●

## ● భాష పుట్టుక ●

తుమ్మెదా తుమ్మెదా
తూర్పుకొండల తుమ్మెదా...
తెలుగుతేనె – పదం పాడు తుమ్మెదా
ఆ పదం – భాష పుట్టుగ జూడు తుమ్మెదా
॥తుమ్మెదా॥
1. గుమ్మి–నీరు బుడబుడలు
గుండు సున్న అన్నారు
అర్థ సందమామ దెచ్చి
సున్నాకి – కవిపేరు
అందమైన 'అ.ఆ.'లూ...
అందమైన అ.ఆ.లు. ఆవిరిగ్గా.
చెక్కేరే.. తుమ్మెదా ॥తుమ్మెదా॥
2. సాగేసిన – కొడవలినీ
'స' జేసి – నారురా
ఈత – గొట్టె – నూపిని
ఈ 'రా'సి నారురా
వంకలు తిరిగిన పామునీ...
వంకలు తిరిగిన – పాముని
లంకెలెట్టిన ఇ.ఈ.లు తుమ్మెదా
॥తుమ్మెదా॥
3. నాగలి పిడి ఆకారం
కాకేత్తం జేసేరు
దాక చూసి "దోకె" చూసి
ద – ధా–లు – రాసేరు
దీపం వత్తిని ఏసీ...
దీపం–వత్తిని ఏసి. వత్తూ "ధ"
అన్నారే – తుమ్మెదా ॥తుమ్మెదా॥
4. ఈకల్నీ – తోకల్నీ
ఇసర్గాల – కొమ్ములెట్టి
అం అః – కం కః
మాట మహిమ లెట్టేరు
అచ్చు గుద్ది అక్షరాలూ...
అచ్చు గుద్ది. అక్షరాలు పుస్తకాలు
కుట్టేరే – తుమ్మెదా ॥తుమ్మెదా॥
5. గుర్రం – డెక్కల శబ్దం
గుణింతాన్ని జేసేరు
లేడి కొమ్ము – పిలకల్నీ
కింద – మీద – దోపేరు
తాటాకుల – గ్రంథాలూ...
తాటాకుల గ్రంథాలు తాతయ్యలు
రాసేరే తుమ్మెదా ॥తుమ్మెదా॥
6. తాటాకుల – గ్రంథాల
ఆకుల అనుబంధాలు
బతుకు బంధముగజేసి
భావాలు పెనవేసి
రాగి రేకు మీద పదం
రాగి రేకు మీద పదం.
అన్న – మయ్య అల్లేడే – తుమ్మెదా
॥తుమ్మెదా॥

### వందనాల - తల్లి

వందనమే తెలుగు తల్లి
నీ కొందనమే
భళె భళె తల్లివి
బంగారమ్మవి.
ఊరు–పండుగల
పోలేరమ్మవి.
పేరేదైనా అందరి అమ్మవి– ॥వందన॥
నీ ఊరు పండుగలు ఏవి
నీ అక్కల పాటుల ఏవి
నీ చెక్కభజనలు ఏవి
నీ భాగోతాలు ఏవి
నీ భాగవతాలు ఏవి
కానకుండ జేసి – నీ జానపదుల 'కళ'లు
ఇంటిలో – పెట్టేరే
ఇంగ్లీషు – దొరల కళలు
కళ్లు దెరిచి – కాపాడవె తల్లి
పల్లెటూరు – మా పాటలు మళ్ళీ – ॥వందన॥
2. నీ సోడి – సక్కులు ఏవి
నీ కందుల – బూరెలు ఏవి
నీ దిబ్బ – కుడుములు ఏవి
నీ పప్పుల – పప్పులు ఏవి
నీ ఊదల – జావ
సావల – గెంజి
ఊడగొట్టినారే –
నీ ఉలవకట్టు బువ్వ
ఉడకబెట్టినారే
హోటేలు, పిండి కవ్వ –
పోరు జేసి – అందివ్వవె తల్లే
మా "అవ్వలు" వండిన –
ఊదల– బువ్వా ॥వందన॥
3. నీ లేగ దూడలు ఏవి
నీ ఆల – పొదుగులు ఏవి
నీ కవ్వం – కుండలు ఏవి
నీ సల్ది – మూటలు ఏవి
నీ పాలు – బెల్లం – పరమాణ్ణాలు
తిరగ దోసినారే
నీ అమృతాల కుండ
తినమని – బెట్టేరే
'టీ టిఫి. నీలా బోందా –
శివమై 'టిఫి'నీ – సిదగ గొట్టలే.
నీ సల్లకుండ – చద్దన్న మెట్టలే –
॥వందన॥
4. నీ – గాను గాటలు ఏవి
నీ – ఈల – పాటలు ఏవి
నీ – కొమ్మ కోతులు ఏవి
నీ చెమ్మ చెక్కలు ఏవి
నీ తాతల–తండ్రుల
సెగ్రాటాటలు –
మూలబెట్టినారే
నీ తెడ్డూ – బిల్లాట
ముందలెట్టినారే.
ఆ – మూడు కొయ్యలాట
మన జాతి ఆటలు – జేతర జేసి
అందరికీ – ఆరోగ్యమియ్యవే–
॥వందన॥

- వంగపండు

### మరువకురో

మరకురో – తెలుగుతల్లినీ
విడువకురో మాతృభూమినీ
1. పదవి వచ్చునని ఫలితమిచ్చునని
బతుకు ఆశపడి – మోసపోకురా
పదవి – చదువు ఉద్యోగం
మన భాషకు తెచ్చెను – పెనురోగం
ఆ భాషే – మన తెలుగమ్మరా
నీ కిచ్చెను. మనిసిగ – జన్మరా
॥మరువ॥
2. మిల్లు పనులని పిల్లల నంపితె
ఇల్లు – నాటితో – ఇరిగి – పోవునురా
నలుగురు కలిసి – నాట్లు నాటితే
కుటుంబమంతా కూడు దినునురా
ఆ కుటుంబమే మన తల్లిరా
నీ – కూడు – కుడిపె- జాబిల్లిరా –
॥మరువ॥
3. కాగితాలపై – కలం రాతలు
కడుపు నింపవు – కలిపి వంచవు
సదును భూమిపై సాగితే నాగలి
పక్షికి కూడ తీరును ఆకలి –
ఆ ఆకలి తీర్చే కొమ్మ రా
మన సంపదల – తెలుగమ్మరా –
॥మరువ॥
4. పొట్ట గడవదని పట్టణాలలో
రేయి పగలు – రాల్లెత్తే కన్నా
ఏత మెత్తి పెను తోటను పెంచితే
ఏటకు కోటి – ఫలాలిచ్చును రా
ఆ ఫలమే. పలుకుల – తల్లి రా
ఆ తల్లే – తనువుల – జల్లు రా.
॥మరువ॥
5. నమ్ముకురా – పై దొమ్మరి సదువులు
నమ్మితె – మూదును – సావు బతుకులు
నమ్ముకుంటె – నీ – తెలుగుతల్లిరా
కష్టం తీర్చే – కల్పవల్లి రా
ఆ తల్లే గుడిలో – బొమ్మరా
మనమెక్కడున్న – మనసమ్మరా
॥మరువ॥

# అంతు చూసే కథ

- మోహిత

కొన్ని కథలుంటాయ్. అవి నేరుగా మనసును తాకుతాయ్. కొన్ని గుండెల్ని మెత్తగా కోస్తాయ్. కొన్ని గుండె కవాటాల్ని దబదబా బాదుతాయ్. కొన్ని ఎక్కిళ్ళు ఎక్కిళ్ళు పెట్టి ఏడ్చేలా చేస్తాయ్. కొన్ని డొక్కలు నొప్పెట్టేలా నవ్వేలా చేస్తాయ్. కొన్ని కనుకొలుకుల్లోంచి రెండు నీటి చుక్కలు జారేలా చేస్తాయ్. కొన్ని అరుస్తాయ్, కొన్ని కరుస్తాయ్. కొన్ని చదివాక భయపెడతాయ్, కొన్ని చదవక ముందే భయపెడతాయ్. కొన్ని మన కళ్ళ ముందుకొచ్చి జాలిగా నిలబడతాయ్. కొన్ని ఆశా దీపాలై కోటిసూర్య ప్రకాశంతో దారి చూపుతాయ్. కొన్ని ఆకాశపు అంచుల్లోకి తీసుకెళ్తాయ్. కొన్ని స్వర్గానికి ఎత్తి పాతాళానికి కుదేస్తాయ్. కొన్ని కుదుపుతాయ్, కొన్ని అదుపు నేర్పుతాయ్. కొన్ని పరీక్షిస్తాయ్. కొన్ని నిరీక్షణ నేర్పుతాయ్. కొన్ని ఆలోచింపచేస్తాయ్. కొన్ని సన్నగా నవ్విస్తాయ్, కొన్ని చిన్నగా నొప్పిస్తాయ్. కొన్ని మధురోహల్లోకి లాక్కెళతాయ్, కొన్ని విషాదాల కొలిమిలో కాలుస్తాయ్. కొన్ని అచ్చంగా మనవే అనిపిస్తాయ్. కొన్ని పగవాడి క్కూడా జరక్కూడదనిపిస్తాయ్. కొన్ని సంవత్సరాల తరబడి వెంటాడతాయ్. కొన్ని పేజి తిప్పగానే చల్లారిపోతాయ్. కొన్ని బొమ్మలతో ఊరిస్తాయ్, ఇంకొన్ని భావాలలో దొర్లిస్తాయ్. కొన్ని విసుగెత్తిస్తాయ్. మరికొన్ని కోపం తెప్పిస్తాయ్. కొన్ని పాత్రల్ని 'పసిడిబొమ్మ'లు చేసి మన ఎదురుగా నుంచోబెడతాయి. కొన్ని మృదువుగా అదృశ్య హస్తాలతో మనసును హత్తుకుంటూ ఉంటాయ్. కొన్ని కబంధ కౌగిలిలో నలిపేస్తాయి. కొన్ని అస్సలు ముందుకు సాగవు. కొన్ని మనసుకన్నా వేగంగా పరిగెత్తిస్తాయ్. కొన్ని 'చందమామ'లో పుడితే కొన్ని 'స్వాతి' నక్షత్రంలో పుడతాయ్. కొన్ని అన్వేషింపజేస్తాయ్. కొన్ని అన్వయింపజేస్తాయ్.

కొన్ని మలయమారుతం ఉయ్యాల ఊపినట్లుంటాయ్. కొన్ని 'బోన్సాయ్ బతుకుల'ని జోలపాడి నిద్ర పుచ్చుతాయ్. కొన్ని వీపుమీద ఒక్కటి చరచి నిద్ర లేపుతాయ్. కొన్ని చెవిలో బాకాలూదతాయ్. కొన్ని నెత్తిమీద నాలుగు మొద తాయ్. కొన్ని తుఫాన్ హోరుతో ఉక్కిరి బిక్కిరి చేస్తాయ్. కొన్ని చదివే దాకా వెంటాడతాయ్. మొదట్లో ఆదరించి చివరికి దిక్కుతోచని స్థితిలో నిస్సహాయుల్ని చేసి వదిలేస్తాయ్. కొన్ని వేలుపట్టి ఆజన్మాంతం నడిపిస్తాయ్. కొన్ని మోహాకర్షణలో ముంచేస్తాయ్. కొన్ని తత్వాన్ని బోధిస్తాయ్.

మనలానే కథలకెన్ని రూపాలో! పొట్టివి - పొడుగువి, పెద్దవి-చిన్నవి, పాతవి-కొత్తవి, స్వదేశీ-విదేశీ, అందమైన-అనాకారివి, లోతైనవి-బొంకేవి, నిజాయితీగలవి - దంబాలవి... ఇంకా... ఇంకా... మనుషులేగా కథలంటే!

కొన్ని కథలు పొంకం కలిగినవి, కొన్ని సుంకం కలిగినవి. కొన్ని అమ్మనివి, కొన్ని కమ్మనివి. కొన్ని పడక్కుర్చీలో కూర్చొనే చదువుకుంటున్నా 'అంపశయ్య' మీదున్న బాధ కలిగిస్తాయ్... కొన్ని 'నీలి' కథలు, కొన్ని 'ఎరుపు' కథలు. కొన్ని 'గాలివాన'లా హోరెత్తిస్తాయ్. కొన్ని 'అర్థం లేని టెలిగ్రాముల్లా' వచ్చి పడుతుంటాయ్. కొన్ని 'మంత్రనగరి సరిహద్దులు' దాటాలా వద్దా అని గుమ్మం బయటనుంచొని ఆలోచిస్తుంటాయ్. కొన్ని 'సగం తెరిచిన తలుపు' దగ్గరే ఆగిపోతాయ్. కొన్ని కథలు కొత్త ప్రాణం పోస్తాయ్. కొన్ని పంచప్రాణాలు తీస్తాయ్. కొన్ని కథలు వ్యక్తిని వ్యవస్థనూ తూర్పారబడతాయ్. మరికొన్ని రెక్కలు విస్తరించి దిక్కులు ధిక్కరించి గగనసీమనుంచి విశ్వాంతరాల్లోకి దూసుకుపోతాయ్.

కొన్ని 'చీకటిపడ్డాక' 'నల్లజెర్లరోడ్డు' మీద 'మల్లిపూలు' జల్లిపోతాయ్. కొన్ని అర్ధరాత్రి స్వాతంత్ర్యం ఇచ్చిపోతాయ్. కొన్ని ఎండిన నేలమీద కళ్ళాపి చల్లినట్టు మెదడుని చల్లబరుస్తాయ్. కొన్ని 'అత్తగారి కొత్తావకాయ'లా నాలుక చిర్రెత్తిస్తాయ్. కొన్ని కథలు చదివాక మనం వాటితో ఐక్యమైపోయి 'మిథునం'గా మారిపోతాం. ఇంకొన్నిటిని చదివాక ఇహపరాలన్నీ వదిలేసి, ఆత్మను కూడా వదిలేసి ఒంటరులైపోతాం. కొన్ని కథలు పోట్లాడతాయ్. కొన్ని కూర్చోబెట్టి అర్థవంతంగా విషయమేంటో వివరిస్తాయ్. కొన్ని గడ్డం పట్టుకు బతిమాలతాయ్. కొన్ని పన్నీటి జల్లులు కురిపించి పోతే కొన్ని కన్నీటి వరదలో కొట్టుకుపోతాయ్.

మనుషులంతా చివరికి చేరేది మరుభూమికేనన్నట్లు, నదులన్నీ, చివరికి సముద్రాన్నే చేరినట్లు కథలన్నీ కంచికే చేరతాయి. కానీ అన్నీ చదివిస్తాయ్. ఈ 'అసమర్థుని జీవయాత్ర'లో 'చివరికి మిగిలేది' కంచిలో కథలు, బతుకు సంచిలో కథలు!

## ప్రశ్నార్థకం

- కొత్తపల్లి మణీత్రినాథ రాజులు, మొగల్లు. ఫోన్ : 9949389296

| | |
|---|---|
| ఉదయిద్దాంలే అని ... సూర్యుడు | చెద పురుగులు |
| కురుద్దాంలే అని .... వర్షం | నేటి సమాజంలో |
| విరుద్దాంలే అని ... కుసుమం | పోటీపడి |
| వీద్దాంలే అని ... వాయువు | ఐదేళ్ళకోసారి కన్పిస్తాయి |
| నడుద్దాలే అని .... కాలం | జాతిని మొత్తం తినేస్తాయి |
| బద్ధకిస్తే ....? | ఇస్త్రీ బట్టల్లో |
| మనుష్యుల మనుగడేదీ ? ! | ఏ.సి. కార్లలో తిరుగుతున్నాయి |

**మార్పు**

రైతుకు
కష్టమొచ్చింది
నేతలు పరుగెడ్తున్నారు
దండుకునేందుకు



కథానిక

# మిణుగురు

- మాచర్ల అమృతసాయి, నూజివీడు. ఫోన్ : 9490800366

"మే ఐ కమిన్ సర్?" తలుపు తీసి వినమ్రంగా అడిగాను. అవసరం ఉంటే ఎక్కడ లేని వినమ్రత వస్తుంది కదా మనకు. లోపలి నుంచి ఎ.సి. గాలి వచ్చి మొహానికి చల్లగా తగిలింది.

"కమిన్" ఫైల్స్‌లోకి తీవ్రంగా చూస్తూ సమాధానం చెప్పాడు, నాపై అధికారి.

లోపలికి వెళ్లాను... గది అంతా ఒక రకమైన సువాసనతో నిండి ఉంది... తలుపు మూసుకొని పోవటంతో బయట శబ్దాలు లోపలికి రావటం ఆగిపోయాయి. కుర్చీ ఉంది కాని కూర్చొనే ధైర్యం చేయలేదు. కామ్‌గా అతని వైపే చేస్తూ నిలుచున్నాను.

"ఏం కావాలి?" కళ్లలోకి సూటిగా చూస్తూ అడిగాడు.

"సార్... ఈరోజు సాయంత్రం మా చెల్లి పెళ్లిచూపులు ఉన్నాయి సార్... అందుకని..."

"ఊ... అందుకని... చెప్పు..." ఈసారి స్వరంలో కొంచెం విసుగు కనిపించింది.

"ఒక గంట ముందు ఇంటికి వెళ్తాను సార్..." అంటూ నసిగాను.

"మన కంపెనీ ఒప్పందం తెలుసుకదా...!! దానికి ఒప్పుకుంటే గంటే ఖర్మ... రెండు గంటలముందైనా వెళ్ళిపో..."

"అలాగేసార్... థాంక్యూసార్". తలుపు తీసి నా కాబిన్ దగ్గరకు వచ్చా.

"చాలా సంతోషంగా అనిపించింది నాకు. ఒక్కగానొక్క చెల్లికి పెళ్లిచూపులు జరుగుతుంటే పెర్మిషన్ ఇవ్వడేమో అనుకున్నాను. ఒప్పందం ప్రకారం గంట పెర్మిషన్ పెడితే, మరుసటి రోజు ఆఫీసులో రెండు గంటలు పనిచేయాలి. తను ఇచ్చిన డబ్బుకి తగినంత పని చేయించుకోవాలి అని నిర్ణయించుకొని పెట్టిన ఒప్పందం అది. అయినా చెల్లి పెళ్లి చూపుల కోస రెండు గంటలు ఎక్కువ పని చేయడం పెద్ద కష్టం ఏమీ కాదు" ఆలోచిస్తూ ఫైల్స్ సర్ది రోడ్‌మీదకు వచ్చాను.

అత్తారింటికి వెళ్తూ ఏడ్చి ఏడ్చి అలసిపోయిన అమ్మాయి ముఖంలా ఉన్నాడు సూర్యుడు... రోడ్డు మీద జనాలు ఎవరి దారిన వారు పోతున్నారు. మెల్లగా నడుస్తూ బస్టాపు చేరుకొన్నాను. చుట్టూ చూస్తుండగా నా దృష్టి ఒకతని మీద పడింది. 20-25 ఏళ్ల మధ్య వయసుంటుంది తనకు. తీవ్రంగా ఏదో ఆలోచిస్తున్నాడు కాని కళ్లలో నిరాశ కొట్టొచ్చినట్లు కనపడుతుంది. బహుశా ఎవరో ఏదో అని వుంటారు. చిన్న మాటకు గూడా తీవ్రంగా బాధపడటం మన యువత లక్షణం కదా..!!!

ఇంతలో హారన్ వేసుకుంటూ బస్ వచ్చింది. పెద్దగా రద్దీ లేదు. బస్ ఎక్కి కిటికీ దగ్గర సీటు చూసుకుని కూచున్నాను. కిటికీలోంచి చూస్తే అతను అక్కడ లేడు.

"సార్.. కొంచెం కాలు పక్కకు తీయండి సార్..." ఎవరో పిలవడంతో ఇటువైపు చూశాను. ఆశ్చర్యం....! ఇందాక బస్టాపులో చూసిన అతనే తనతో మాట్లాడుతున్నాడు.

కాలు తీసి కొద్దిగా ప్రక్కకు జరిగాను. కనీసం థ్యాంక్స్ కూడా చెప్పకుండా వచ్చి పక్కన కూచున్నాడు. మళ్లీ ఏదో ఆలోచనల్లోకి వెళ్లిపోయాడు.

మాట్లాడడానికి అవకాశం లేకపోవటంతో సీటుకు చేరబడి చిన్నగా కునుకు తీశాను.

* * *

"నీ డబ్బులు నాకు అక్కర్లేదయ్యా... నా చిల్లర నాకు ఇవ్వు చాలు." కండక్టర్ అరుపుతో మెలకువ వచ్చింది నాకు. నా పక్కన ఉన్న వాడితో వాదిస్తున్నాడు.

"నా దగ్గర చిల్లర లేదు. అందుకే మిమ్మల్ని ఇవ్వమంటున్నాను" విసురుగా ఉంది సమాధానం.

"చిల్లర లేకుండా ఎందుకు వస్తారయ్యా...??" వాదన ముదురుతోంది.

ఇంతలో నేను కలుగజేసుకొని కండక్టర్‌కి చిల్లర ఇచ్చి పంపించేశాను. సమాధానంగా అతను చూసిన చూపుని అర్థం చేసుకోలేకపోయాను.

"ఎక్కడికి వెళ్తున్నావు?" సంభాషణ మొదలెట్టాను.

"............."

"పోనీ ఎందుకలా వున్నావో చెప్పు..?" కొంచెం ప్రేమగా అడిగాను.

ఇంతవరకూ ఎవరూ అలా అడగలేదేమో కృతజ్ఞతగా నావైపు చూసి చెప్పటం ప్రారంభించాడు.

"నా పేరు కుమార్. ఇక్కడే ఒక చిన్న కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాను. నెలకు 10వేలు జీతం వస్తుంది. నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. వాళ్ల నాన్న మాట్లాడటానికి పిలిస్తే ఇవ్వాళ వాళ్లింటికి వెళ్లాను."

* * *

"ఎవరు బాబూ నువ్వు..?" దురుసుగా ఇంట్లోకి వెళ్తున్న నాకు సూటిగా వచ్చింది ప్రశ్న.

## • నాలాగా ఎందరో •

- కొణతాల పద్మ

సమకాలీన సమస్యలపై
సమరశంఖం పూరించి
సామాన్యుల సమస్యలను
బడుగుజీవుల గుండె చప్పుళ్ళను
భరతజాతికి తెలియజేయాలని

కలంపట్టి,
కదం తొక్కి
కవనరంగంలోకి దూకి
కవయిత్రిగా నిలవాలనుకున్నాను

కాని,

సమస్యల సుడిగుండంలో పడి
తేలలేక
మునగలేక
చావలేక
బ్రతకలేక

బయటికొచ్చే దారి లేక
ఆలోచించే వ్యవధిలేక
బ్రతుకే వెతగా గడుపుతున్నా
నాలాగా ఎందరో?
నా కోరిక తీరెదెన్నడో ?

"అదీ... నన్ను రమ్మన్నారంటా... నేను... మీ అమ్మాయి..." మాటలు రావట్లేదు నాకు.

"ఓహ్... నువ్వా?... రా కూర్చో..." అని నవ్వుతూ పిలిచాడు అతను. అతని నవ్వులో కూడా ఒక పెద్దరికం ఉంది. "ఏం చేస్తుంటావు?"

"ఇక్కడే వరున్‌బజాజ్‌లో టెక్నీషియన్‌గా చేస్తున్నాను". భయంగా సమాధానం ఇచ్చాను.

"ఏం చదువుకున్నావు?"

"ఐటిఐ చేశానండీ..."

"నీకొచ్చే 10 వేలు నీకే చాలవు కదయ్యా...! ఇంకెలా మా కూతుర్ని పోషిస్తావు?" అందరి తండ్రులలాగే అడిగాడు అతను.

మధ్యతరగతి బ్రతుకుకి 10వేలు సరిపోతాయి అని అనుకుంటున్న నేను ఆ ప్రశ్నకు సమాధానం వెతకలేదు. వెతికినా దొరకదని తెలుసు.

"సరేనయ్యా నా కూతురి కోసం ఒక పని చేస్తే నీ గురించి ఆలోచిస్తా"

ఎంతో ఆనందం కలిగింది నాకు. కుతూహలంతో కుర్చీలోంచి ముందుకు వచ్చి వినటం ప్రారంభించాను.

"నువ్వు అన్ని రకాలుగా బాగున్నావయ్యా కాని డబ్బుతోనే వచ్చింది చిక్కు. ఒక పని చెయ్యి. ఎక్కువ జీతం వచ్చే ఉద్యోగం ఏదైనా సంపాదించు" చెప్పుకుంటూ పోతున్నాడు.

నా ఉత్సాహం మొత్తం నీరుగారిపోయింది. "డబ్బు గురించి ఆలోచిస్తాడు ఈ పెద్దమనిషి. తన కూతురు నాతో సంతోషంగా ఉన్నప్పుడు డబ్బెందుకు?" ఆలోచిస్తూ సమాధానం కోసం వెతుకుతున్నాను.

"పెద్ద ఉద్యోగానికి కావాల్సింది చదువూ, క్వాలిఫికేషన్‌లు కాదు. క్రమశిక్షణ, కష్టపడేతత్వం. క్రమశిక్షణ ఉందని తెలుస్తుంది కానీ కష్టపడేతత్వం తెలియాలంటే మాత్రం నువ్వు డబ్బు సంపాదించాల్సిందే... డబ్బు ఉంటే చాలా సుఖాలు మనదగ్గరికి వస్తాయి, ఒక్క సంతోషం తప్ప. నీతో ఉన్నప్పుడు నా కూతురు సంతోషంగా ఉంటుంది కాబట్టి, మిగిలిన సుఖాలకు కావాల్సిన డబ్బు నువ్వు ఎంత తొందరగా సంపాదిస్తే అంత తొందరగా పెళ్ళి చేస్తాను" కటువుగా చెప్పాడు.

"డబ్బు మనిషిని ఎంత మెటీరియలిస్టిక్‌గా మారుస్తుంది" అని నాలో నేనే నవ్వుకున్నాను.

"కానీ ఒక కండిషన్" అంటూ మళ్లీ మొదలెట్టాడు ఆ పెద్దమనిషి. "ఇప్పుడే కొత్త ఉద్యోగానికి ప్రయత్నాలు ప్రారంభించాలి కాని ఇప్పుడు చేస్తున్న ఉద్యోగం మానేయాలి. ఎందుకంటే ఏమీ లేనప్పుడు మనకు ఏది దొరికితే అది తీసుకుంటాం. ఏదైనా ఉంటే ఇది ఉంది కదా అని మిగిలినవి వదిలేస్తాం. అది నీలో నేను చూడకూడదు" ముగించాడు ఆయన.

నాకు తల తిరిగినట్లయింది. కొద్దిసేపు ఆలోచించి నా నిర్ణయం చెప్పాను... "చూడండి సార్... నేను, మీ కూతురూ ఇద్దరం ప్రేమించుకున్నాం. ఇప్పుడు పెళ్ళి చేసుకోకపోతే నేను ఎంత బాధపడతానో, మీ కూతురు కూడా అంతే బాధపడుతుంది. మీరు మీ అనుభవంతో పెట్టిన కండిషన్లు ఒప్పుకుని, ఉన్న ఉద్యోగం వదులుకున్న తర్వాత నాకు పెద్ద ఉద్యోగం రాకపోతే...? ఇటు మీ కూతురూ దక్కదు, అటు ఉద్యోగం పోతుంది. అప్పుడు నా పరిస్థితి ఏంటి? అందుకే చెప్తున్నాను వినండి. మీరు పెట్టిన కండిషను చెత్తదే కాకుండా తెలివితక్కువది కూడా...!! మీ కండిషన్ మీరు మార్చుకుంటే కబురు చేయండి" అని విసురుగా వచ్చేశాను.

"తర్వాత ఏం చేయాలో ఆలోచిస్తుంటే ఈ కండక్టరు ఇలా విసిగిస్తున్నాడు." అని చెప్పడం ముగించాడు అతను.

* * *

అతను చెప్పింది శ్రద్ధగా విని, "మీ ఇంట్లో ఎంతమంది డబ్బు సంపాదిస్తారు?"

"ఇద్దరు... నేను, మా నాన్న" అని చెప్పి, తన స్టాపు రావటంతో దిగిపోవటానికి సిద్ధమయ్యాడు అతను.

క్రిందకి దిగుతూ తనలో తాను అనుకున్నాడు "మనం పోటీలో ఉన్నప్పుడు ఒక్కసారి ముందుకు వెళ్తే వెనక్కి రాలేము" ఈ విషయం తెలిసీ ముందుకెళ్ళిన వాడిని ధైర్యవంతుడు అంటారు. ముందుకెళ్తే గెలుస్తామో లేదో తెలియనప్పుడు ఇక్కడే ఉండిపోవడం బెటర్ అని ఆగిపోయినవాడిని పిరికివాడు అంటారు... ఏంటో పిచ్చి లోకం...!!!"

ఆ వాక్యం నాకు కూడా వినపడి అతన్ని చూశాను. నిరాశగా కిందకు చూస్తూ వెళ్ళిపోతున్నాడు... అతన్ని అలా చూస్తే మనసులో ఏదో మూల కొంచెం జాలి వేసింది.

* * *

ఇంటికి వచ్చాను. ఇల్లంతా రంగురంగుల పూలతో అలంకరించి ఉంది. పిల్లల అరుపులతో ఇంకా గోలగోలగా తయారయింది. అందరూ సంతోషంగా నవ్వుతూ మాట్లాడుకుంటున్నారు. ఏంటో వీళ్లంతా...! పెళ్ళి చేసేంతవరకూ ఏదో గొప్ప పని చేస్తున్నట్లు ఆనందపడతారు... చేశాక కూతురు వెళ్ళిపోతుందని ఏడుస్తారు.

"పెళ్లికొడుకు బాగున్నాడు కదూ...!!!" అత్తయ్య నువ్వుతూ అమ్మతో అంటోంది.

నాకూ ఆసక్తి పెరిగి అటువైపు చూశాను. నిజంగా కుర్రాడు బాగున్నాడు. అందరి మధ్యలో కుదురుగా కూర్చున్నా, ప్రత్యేకంగా కనబడుతున్నాడు.

"నమస్కారమండి..." నన్ను చూసి మర్యాదగా పలకరించాడు.

సమాధానంగా చిరునవ్వు నవ్వి అతనికి దగ్గరగా వెళ్ళి కూచున్నాను.

## మా ఇంటి గేదె ...

- తెల్లమేకల శ్రీనివాసరావు. ఫోన్ : 9030637270

ఇదిగో మాఇంటి గేదె
గడ్డికోసం వినిపిస్తుంది తన గాథ
కుడితికోసం కురిపిస్తుంది కన్నీటి వరద
తాకితే దాని ఒళ్ళంతా బురద
పాలు ఇవ్వాలంటే దానికి కొంచెం బాధ
పొలం తోలుకెళ్తే ఉంటుంది సరదా
వేరే గేదెలను చూస్తే దాని కొమ్ములకు కొంచెం దురద
బేరానికి పెడితే కురిపిస్తుంది కాసుల వరద ...!
అందుకే దాన్ని అమ్మాలంటే మాకెందుకో చిన్న బాధ.

"ఎలా ఉంది షాపు...? ఆర్థికమాంద్యం దెబ్బ నీకు ఏమైనా తగిలిందా?" అడిగాను నేను.

"ఒకరి దగ్గర కొని, వేరేవాళ్ల దగ్గర అమ్మేవాళ్లం. మాకు పెద్దగా దాని ప్రభావం ఉండదండి. అయినా మనిషికి ముఖ్యంగా కావల్సినవి కూడు, గుడ్డ, గూడు. ఈ మూడింటిలో మనల్ని ప్రత్యేకంగా కనబడేటట్లు చేసేది గుడ్డ. కాబట్టి మనుషులు ప్రత్యేకంగా కనబడాలి అని అనుకుంటున్నంత సేపూ మా షాపులకు పెద్ద నష్టం రాదండీ" నవ్వుతూ సమాధానం చెప్పాడు.

"అయినా బిజినెస్ అంటే కొంచెం రిస్క్ కదా?" పెద్దరికాన్ని జోడించి ప్రశ్న అడిగాను. వింటూనే అతని ముఖకవళికలు మారటం గమనించాను.. కాని వాటిని అర్థం చేసుకోవటంలో విఫలమయ్యాను.

"మీరు చెప్పిన మాట నిజమేనండి. కానీ ఒక్కసారి ఆలోచిస్తే, మన తల్లిదండ్రులు మనకు బిడ్డ పుడితే పెంచగలమా? అనుకుంటే మనం పుట్టేవాళ్లం కాదు కదండీ. ఒకరకంగా వాళ్లు రిస్క్ తీసుకొనే మనల్ని కన్నారండి అంటే మనిషి జీవితమే రిస్క్‌తో మొదలైంది. అప్పటినుండి స్కూల్ ఫీజు కట్టలేమేమోనని, ఆలోచించకుండా మంచి స్కూల్లో చేర్పించే నాన్న, కొడితే దెబ్బ తగులుతుందని ఆలోచించకుండా కొట్టి బుద్ధి చెప్పే టీచరు, అయినవాళ్లకు దూరం అవుతానని ఆలోచించకుండా, జీవితాంతం మనతో గడపడానికి వచ్చే భార్య... వీళ్ళందరూ రిస్క్ తీసుకోబట్టే మన జీవితం సంతోషంగా ఉందండీ... అంతెందుకండీ! ఆర్.టి.సి. బస్సులు త్వరగా వెళ్లవని ప్రైవేటు వాహనాల్లో వెళ్తాం మనం. అందులో రిస్క్ లేదా? ఇన్ని విషయాల్లో మనకు తెలియకుండానే రిస్క్ తీసుకొనే మనం ఒక్క ఉద్యోగం దగ్గరికి వచ్చేసరకి మాత్రం ఎలాంటి రిస్క్ ఉండకూడదనుకుంటాం కాని నేను అందరిలా ఆలోచించను. అందుకే బిజినెస్ కొంచెం రిస్క్ అయినా చేస్తున్నాను." చెప్పండి ముగించి నీళ్లు తాగుతున్నాడు. ఊహించని ఆ సమాధానంతో నాకు ఊపిరి ఆడలేదు.. అతన్ని చూస్తుంటే పెద్ద బిజినెస్ మాన్‌ని చూస్తున్నట్లు అనిపించింది. ఒక్కక్షణంలో ఎంతో ఉన్నతంగా కనిపించాడు అతను.

ఇంతలో మా చెల్లిని తీసుకొచ్చి అందరిముందు కూర్చోబెట్టారు. బెరుగ్గా తలదించుకొని కూచుంది తను.

కొద్దిసేపు మాట్లాడుకున్నాక "ఇక వెళ్తామండీ బావగారూ...!! ఇంటికి వెళ్లేసరికి చీకటి అయిపోతుంది" నాన్నతో కాబోయే మావయ్య అంటున్నారు.

నాన్న నవ్వుతూ వాళ్లను సాగనంపటానికి గేటుదాకా వెళ్ళారు. వాళ్ళతో నేను కూడా వెళ్ళాను.

కారు ఎక్కబోయేముందు కాబోయే బావ నా దగ్గరకు వచ్చి "మనం పోటీలో ఉన్నప్పుడు ఒకసారి ముందుకు వెళ్తే వెనక్కి రాలేము. ఈ విషయం తెలిసీ తెలివైనవాడు ముందుకు వెళ్తాడు. తెలివితక్కువవాడు ఇదే సాకుగా చెప్పి అక్కడే ఉండిపోతాడు. తమని తాము సమర్థించుకోవటానికి ప్రతి ఒక్కడూ ఒక సమాధానంతో సిద్ధంగా ఉంటాడు... ఏంటో పిచ్చి జనం...!!" అంటూ నవ్వాడు.

నేనూ నవ్వుతుండగా మళ్లీ "తెలివైన వాళ్లందరూ బిజినెస్ మ్యాన్‌లు అవలేరండీ... కొంతమందికే సాధ్యపడుతుంది అది. నేను తెలివైనవాణ్ణి మరియు బిజినెస్‌మ్యాన్‌ని" చెప్పి షేక్‌హ్యాండ్ ఇచ్చి కారులో కూచొని "పోనీ" అన్నాడు.

అతన్ని చూసి కొంచెం ఈర్ష్య కలిగింది నాకు. ఇలాంటివాణ్ణి నా చెల్లికి ఇచ్చి చేస్తున్నందుకు గర్వం కూడా కలిగింది. కానీ ఎక్కడో ఏదో మూల చిన్న అసంతృప్తి.

* * *

రాత్రి 11 అయింది. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టట్లేదు. బస్టాపులో వ్యక్తి, కాబోయే బావగారు చెప్పిన మాటలు పదేపదే గుర్తొస్తున్నాయి. ఇద్దరూ జీవితాన్ని వేర్వేరు వేర్వేరు కోణాల్లో చూసినా, ఒకే రకం బాధతో బాధపడుతున్నారు అనిపిస్తుంది. కాని అదేమిటో ఎంత ఆలోచించినా తట్టట్లేదు.

లేచి అలా డాబా మీదకు వెళ్లాను. చల్లనిగాలి వీస్తోంది. ఇవ్వాళ పౌర్ణమి అనుకుంటా! చంద్రుడు గుండ్రంగా ఉన్నాడు. చూస్తుంటే మీ భూమికి వెన్నెల ఇవ్వగలిగేది నేనొక్కడినే అని గర్వపడుతున్నాడేమో అనిపిస్తుంది. ఇంతలో చందమామకి పోటీ నేను ఉన్నానంటూ ఒక మిణుగురు పురుగు ఎగురుతూ మధ్యలో వచ్చింది. "మొత్తం చీకటితో పోలిస్తే ఎంత చిన్నది ఈ పురుగు... అయినప్పటికీ ఇది అలా జీవితాంతం వెలుగుతూ చీకటితో పోరాడుతూనే ఉంటుంది." ఆలోచిస్తుండగా మనసులో ఏదో మెరుపు మెరిసినట్లయింది.

"జీవితం అంటే చావుతో పోరాటం... దాని లక్ష్యం గెలుపే అయినా... సాధించడం చాలా కష్టం... యుద్ధంలో ఒకడిని చంపి యుద్ధం మొత్తం గెలిచాననే తెలివితక్కువతనం కాబోయే బావలో చూస్తుంటే... అసలు యుద్ధమే చేయలేని పిరికితనం బస్టాపులో కలిసిన కుమార్‌లో కనపడుతుంది... ఏది ఏమైనా ఈ ప్రయత్నంలో వీళ్లు చావుతో మానేసి బ్రతుకుతో పోరాడుతున్నారు... కాదు పోరాడేలా చేస్తుంది ఈ సమాజం... వీళ్ళకంటే ఆ మిణుగురే బెటర్ కదా!" ఆలోచిస్తూ బెడ్‌రూంలోకి వచ్చాను.

"ఓ భగవంతుడా!! జీవితాన్ని ఎలా అర్థమయ్యేలా చేస్తావయ్యా ఈ సమాజానికి?" అనుకుంటూ నిద్రపోవటానికి ప్రయత్నించాను. ఆశ్చర్యంగా నిద్రపట్టేసింది...!!

## శుభాశంసనము

- ఒంటెద్దు రామలింగారెడ్డి. ఫోన్ : 9652744104

తే॥ దూరదేశాలలోనుండి భారమనక
తెలుగుభాషాభివృద్ధికి దీక్షబూని
బహుకృతంబుల దీర్చు ప్రపంచ తెలుగు
రచయితల సంఘమునకు నీరాజనంబు

తే॥ విశ్వరచయిత సంఘపవిత్ర కార్య
ములకు పూర్తిగ సహకారములనొసంగ
కృష్ణజిల్లారచయితల కీర్తి తెలుగు
దేశభాషలందు దేదీప్యమగును

తే॥ విశ్వకృష్ణాజిలాసుకవీంద్రులంత
ఒక్కటైతెల్గు భాష సముద్ధరింప
వలచుటాంధ్రంబునకు మహర్దశయనదగు
చిత్తశుద్ధిని చాటింపచిరయశస్సు

తే॥ వేలయేండ్లుగ వివిధ రూపాలతోడ
ప్రజ్వరిల్లిన తెల్గుభారతికి నేడు
గ్రహణసమయంబు మీవంటి ఘనులవలన
తిరిగి శోభించవలె పూర్వదీప్తితోడ

# కపోతం నుండి కంప్యూటర్ దాకా...

- పి.యమ్.ఎస్.ప్రసాద్, పామర్రు. ఫోన్ : 9848653300

మానవుడి మస్తిష్కం నుండి వెలువడే ప్రతి ఊహకు సంబంధించిన సమాచారం ఒకప్పుడు క్షణాల్లో పుకారు రూపంలో వేల మైళ్ళు షికారు చేసేవని చెప్పుకునే వారు. కానీ ప్రస్తుతం సమాచారం క్షణిక వ్యవస్థకు మారి పోయింది. వాస్తవ రూపమే సాక్ష్యాధారాలతో లక్షల మైళ్ళ దూరం లిప్తకాలంలో అందుతున్నాయి. ఆనాటి కపోతం (పావురం) టపా నుండి నేటి కంప్యూటర్ యుగం వరకు సమాచార వ్యవస్థలో పరిణామ క్రమంలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. జెట్ విమానంకన్నా వేగంగా ప్రస్తుతం చాట్ వచ్చేసింది. ఒక్కసారి సమాచార వ్యవస్థలో మార్పులు పరిశీలిస్తే ఆధునికత స్పష్టంగా గోచరిస్తున్నాయి.

రాచరిక వ్యవస్థలో పావురం కాళ్ళకు సమాచారాన్ని కాగిత రూపంలో కట్టి చేరవేసేవారు. అంతేగాక అల్లూరి సీతారామరాజు కాలంలో బాణాల ద్వారా మిరపకాయ టపాని వినియోగించారు. అటుపిమ్మట నైజాం ప్రభుత్వ కాలంలో పోస్టు కార్డు ఉద్భవించింది. కాలక్రమేణా అదే పోస్టల్ వ్యవస్థలో 1854లో టెలిగ్రామ్ అనే నూతన వ్యవస్థ ఏర్పడింది. సుమారు 160 ఏళ్ళపాటు టెలిగ్రామ్ వ్యవస్థ దేశవిదేశాల మధ్య అంతర్రాష్ట్రాల మధ్య ఉన్న ప్రజలకు సమాచారాన్ని అందించటంలో కీలకపాత్ర వహించింది. మారిన కాలం ప్రకారం ఆధునికతలో 2013 జూలై 15న తంతి సమాచారం మూగపోయి, ఫ్యాక్స్ జన్మించింది. టెలిఫోన్ ట్రంక్ కాల్ బుకింగ్ వ్యవస్థతో జన్మించగా, ఎస్‌టిడి, ఐఎస్‌టిడితో రూపాంతరం చెందింది. మొబైల్ ఫోన్, వాకీటాకీలు కొంత కాలం సమాచారాన్ని అందించాయి. అటుపిమ్మట పేజర్ పరికరం ప్రజల మధ్య సమాచారాన్ని అందించింది.

ఇక సెల్‌ఫోన్ ఉద్భవించి, ప్రస్తుతం మానవుని యొక్క అంగాలలో ఒక అంగంగా మారిపోయింది. ఎస్ఎమ్ఎస్ సమాచారానికి జన్మనిచ్చింది.

ఆధునిక రంగాన పుట్టిన కంప్యూటర్‌లలో ఈ-మెయిల్ అవతారం దాల్చింది. క్షణాల్లో సమాచారం అందించటంలో నెట్-చాట్ మొదలైంది. విప్లవాత్మకమైన మార్పులతో ఇంటర్నెట్ పురుడు పోసుకొంది.

గత ఏడాది అక్టోబర్ నాటికి మన దేశంలో ఇంటర్నెట్ వినియోగిస్తున్న వారి సంఖ్య 200 మిలియన్లకు చేరుకుందని గణాంకాలు చెబుతున్నాయి. దేశ జనాభాలో ఇంటర్నెట్ వినియోగిస్తున్న వారి సంఖ్య 16 శాతం మాత్రమేనని అంటున్నా, ఈ సంఖ్య తక్కువేమీ కాదు. ఆస్ట్రేలియా జనాభాకు పదింతల సంఖ్యలో భారత్‌లో అంతర్జాలాన్ని వినియోగిస్తున్నారు. ఈ ఏడాది జూన్ నాటికి మన దేశంలో ఇంటర్నెట్ వినియోగదారుల సంఖ్య 243 మిలియన్లకు చేరుకుంటుందని 'ఇంటర్నెట్ అండ్ మొబైల్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా' (ఐఎఎంఐఎ) తాజా నివేదికలో పేర్కొంది. ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా ఇంటర్నెట్ వినియోగాన్ని చూస్తే 300 మిలియన్ల మందితో చైనా ప్రథమ స్థానంలో నిలిచింది. 207 మిలియన్ల వినియోగదారులతో అమెరికా రెండో స్థానంలో ఉంది. మూడో స్థానంలో ఉన్న జపాన్‌ను వెనక్కి నెట్టేసి ఇటీవలే ఆ స్థానంలో భారత్ చేరింది. సమీప భవిష్యత్‌లో మన దేశంలో ఇంటర్నెట్ వినియోగం మరింతగా విస్తరిస్తుందని ఐఎఎంఐఎ ఉపాధ్యక్షుడు నీలోత్పల్ చక్రవర్తి అంటున్నారు. దేశ వ్యాప్తంగా ఇ-మెయిల్, సామాజిక వెబ్‌సైట్ల వినియోగం అనూహ్యంగా పెరుగుతోంది. గత ఏడాది ఒక్క జూలై మాసంలోనే 'గూగుల్' వీక్షకుల సంఖ్య 1,209 మిలియన్లుగా ఓ అధ్యయనంలో తేలింది. ఆ సంఖ్య ఇంచుమించు దేశ జనాభాతో సమానం. ఇక అదే నెలలో మైక్రోసాఫ్ట్‌ను 878 మిలియన్ల మంది, ఫేస్‌బుక్‌ను 797 మిలియన్ల మంది, యాహూను 725 మిలియన్ల మంది, వికీపీడియాను 492 మిలియన్ల మంది వీక్షకులు సందర్శించారు. గత ఏడాది జూన్ అంతానికి 'ఫేస్‌బుక్'లో 82 మిలియన్ల మంది వినియోగదారులున్నారు. అమెరికా, కెనడా తర్వాత భారత్‌లోనే ఫేస్‌బుక్ వినియోగం అధికంగా ఉంది. కొన్ని కారణాల రిత్యా చైనాలో ఫేస్ బుక్‌ను నిషేధించారు. మన దేశంలో మొబైల్ ఫోన్ల ద్వారా ఇంటర్నెట్‌ను వాడుతున్న వారి సంఖ్య ఎక్కువగా ఉంటోంది. మొబైల్స్ ద్వారా 110 మిలియన్ల మంది అంతర్జాలాన్ని వాడుతుండగా, ఇందులో 25 మిలియన్ల మంది గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారే. కంప్యూటర్ల ద్వారా ఇంటర్నెట్‌ను వినియోగించడంలో గ్రామ ప్రాంతాల వారు ఇప్పటికీ సమస్యలు ఎదుర్కొంటున్నారు. అందుకే 70 శాతం మంది గ్రామీణ వినియోగదారులు అంతర్జాలం కోసం మొబైల్ ఫోన్లను ఆశ్రయిస్తున్నారు.

దేశం మొత్తం మీద 42 శాతం వినియోగదారులు స్థానిక భాషల్లో 'నెట్'ను వాడుకుంటున్నారు. పల్లె ప్రాంతాలవారికి ఇప్పటికీ ఆంగ్లభాష అవరోధంగానే ఉంది. కళాశాల విద్యార్థులే అధిక సంఖ్యలో 'నెట్'పై ఆధారపడుతున్నారు. సాంకేతిక వనరుల సౌలభ్యత కోణంలో చూస్తే భారత్‌లో ఇంటర్నెట్ వినియోగం ఇంత భారీ స్థాయిలో ఉండడం నిజంగా విశేషమేనని నిపుణులు అంటున్నారు.

ఈవిధంగా ప్రస్తుతం సమాచార వ్యవస్థలో పరిణామక్రమంలో రోజు రోజుకూ మార్పు చేసుకొని, సోషల్ మీడియా నెట్‌వర్క్ క్రింద ఫేస్‌బుక్ ద్వారా ముఖాముఖి సమాచార విషయం ఎదుగుదలకు నాంది పలికింది. అంతేకాక 3జి అనే కొత్త సమాచార వ్యవస్థ సెల్‌ఫోన్ స్క్రీన్‌పై సమాచారం ఇచ్చే వ్యక్తుల యొక్క ప్రతిబింబాలు పూర్తిగా దర్పణంపడుతూ రంగ ప్రవేశం చేసాయి. ఈ మార్పులు చేర్పులు ఇటు అభివృద్ధి, అటు వినాశనానికి ఉపయోగపడుతున్నాయనేది నిర్వివాదాంశం. ●



# యువసింగం - మనస్సు మా'నవత్వం'

- గొల్లంగి సూర్యప్రకాశ్‌రావు, నూజివీడు.

"ఏం ఉక్కపోస్తుందిరా బాబోయ్, ఈ ఎండలొకటి చంపేస్తున్నాయి అక్కా!"

"అవునే చెల్లి, ఆ సూర్యభగవానుడు జీవరాశిపై పగపట్టాడేమో గానీ నిప్పులవర్షం కురిపిస్తున్నాడు. ఈ ఎండదెబ్బకి (సూర్యతాపానికి) చెలమలు, వాగులూ, వంకలూ, చెరువులు, జలాశయాల నీటిమట్టం అడుగంటిపోయి, భూమి పగుళ్ళు ఏర్పడి త్రాగడానికి గ్రుక్కెడు నీళ్ళు కూడా దొరకడం లేదు. అంతెందుకు (మన వేర్ల క్రింద) మన భూగర్భంలో కూడా నీరు నిల్వ ఉండటం లేదే. ఋతుపవనాలు కూడా ఎప్పుడు వస్తున్నాయో, ఎప్పుడు వెళ్తున్నాయో తెలయడం లేదు."

"ఇది సరేగాని అక్కా, మన పూర్వికుల గురించి మొన్న చెబుతాను అన్నావు కదా, దాని గురించి ముందు చెప్పవే".

"మన పూర్వీకులు మనలా దినదిన గండంలా కాకుండా, రాజుల్లా బ్రతికేవారే. మహానుభావులు సంతోషంగా కళ్ళుమూసి ప్రశాంతమైన చావుని పొందారు".

"అక్కా ఎందుకు, అలా అంటున్నావు?"

"అవునే, పూర్వం ఋతుపవనాలు సకాలంలో వచ్చేవి. అప్పటి ప్రజలు కూడా కాలానికి అనుగుణంగా నడుచుకునేవారు. ఇప్పటిలా "విజ్ఞానం, అభివృద్ధి, అనే పేరుతో తమను తాము చంపుకునేవారు కాదు". వేసవిలో పోడు వ్యవసాయం చేసేవారు. అది కూడా ఎలాగో తెలుసా? చెట్లను వేర్లతో సహా పెకిలించకుండా కాండాన్ని మాత్రమే నరికి, చదును చేసి జీడి, మామిడి, కొర్ర, సజ్జ వంటి పంటలు పండించేవారు. సాధారణ పంటలకు విత్తనాలను సిద్ధం చేసుకొని వర్షాకాలం రాగానే దుక్కు దున్న, వడ్లుపోసి చివరకు ఫలాన్ని దక్కించుకునేవారు. చూస్తున్నావుగా నేటి ప్రజలు "అన్నం ఉడికినంత వరకూ ఓపికగా ఎదురు చూడలేక పోతున్నారు".

అప్పటి ప్రజలు కూడా మనజాతి నుండి వచ్చే ఫలాలు, కాయగూరలు, వనమూలికలు, కట్టెలు, జిగురు, లక్క, పూలు, తేనె వంటి ఎన్నో విలువైన సంపదల్ని పొందేవారు. ఇంకా చెప్పాలంటే మన తాతముత్తాతల్ని దేవుళ్ళుగా కొలిచేవారు".

"అవునా అక్కా!"

"అవునే. రావి, వేప, తులసి ఇంకా ఎన్నో జాతుల వాటిని ఇలవేల్పులుగా కొలిచేవారు. నీరుపోసి, ప్రదక్షణలు చేసి దండం పెట్టేవారు. తులసి ఆకులను పానకంలో కలిపి గౌరవసూచికంగా ఇచ్చేవారు. ఇప్పుడు చూస్తున్నావుగా పరిస్థితులు తారుమారయ్యాయి. వీళ్లైతే మన హృదయాల్ని రంపాలతో కోస్తున్నారు. వేర్లతో సహా పెకలించి (ఖార్ఖానాలకు) పరిశ్రమలకు తరలిస్తున్నారు. ఆ శునకానందం శృతిమించితే కాళ్ళూ, చేతులు విరిగి బాధపడుతున్నారు. ఏంటో "ఈ మానవజాతి వెర్రి ఆనందాలు ఎవరికీ అర్థంకావు, అర్థం చేసుకోవడానికి వీలుకావు".

అదేంటో అవి మనకు ఎంతగా ఉపయోగపడినా ఎప్పుడూ మనం వాటిపై ప్రతీకారం తీర్చుకోవడానికి సిద్ధంగా ఉంటాము. ఏదో ఒకరోజు వాళ్ళకూ తెలిసొస్తుంది."

"ఏదో ఒకరోజు కాదు అక్కా! మొన్న మొన్ననే అడవుల వివరాలు తెలుసుకునేందుకు వచ్చిన అధికారులు మాట్లాడుకుంటూ ఉంటే విన్నాను.

ఉత్తరాఖండ్‌లో గంగమ్మతల్లి పోటెత్తి కొన్ని వేలకుపైగా జనం చనిపోయారట. అందులో కొంతమంది నదిలో కొట్టుకుపోయి, కొండచరియలు విరిగిపడి, భవనాలు – ఇల్లు పేకమేడల్లా కూలి, మరికొంతమంది సరైన ఆహార పానీయాలు దొరక్క చలికి వణుకుతూ, ఇంకొంతమంది గుండె ధైర్యం

## • నానీలు •

- పాతూరి అన్నపూర్ణ

1. నదిలో
పడవ ప్రయాణ
మళ్ళీ జన్మంటూ వుంటే
అలనై పుట్టాలనుంది.

2. నోట్లమీద
గాంధీబొమ్మ
లంచం ఇచ్చినప్పుడల్లా
కన్నీళ్ళ తడి తగుల్తోంది.

3. దళితవాదం
స్త్రీ వాదం
వాదాలేవైనా
గాయాల చెట్టుకు పుట్టినవే

4. పెన్నసీరు
ఇంత తియ్యగా వుందేం?
తిక్కన
భారతాన్ని ఒంపుకుంది మరి

5. అతను ముందు
ఆమె వెనుక
ప్రక్కనే నడవడానికి
పాదాల ప్రయత్నం

6. వాడు పూలతో పాటు
సువాసనలు అమ్ముతాడు
వెల మాత్రం
పువ్వులకే

7. అక్షర దీపాలు
వెలుగుతూనే ఉంటాయి
ప్రమిదల్లో
కవిత్వం ఉందిగా!

8. నిద్రలో కూడా
అక్షరాల కలలే
నిజమైన కవికి
ఇంకేం కావాలి?

9. అనాధలతో
కాసేపు గడిపాను
చాలా రోజులకు
కళ్ళు చెమ్మగిల్లాయి.

10. నేనొక అద్భుతం
నేనొక ఆనందం
నేనొక ఆవేశం
అవును! నేను స్త్రీని!!

11. పద్మం
బురదలో పుట్టింది సరే
బురద విలువను కూడా
పెంచింది

12. తెలుగుపాట
చిన్న బోయింది
వేటూరి కలాన్ని
కాలం మింగేశాక

13. అమ్మా నాన్న లేరని
బాధపడకు
అప్పుడప్పుడు
వృద్ధాశ్రమాలకు వెళ్ళు.

14. పుస్తకం చదివాక
అక్షరాలు వెంటాడాయి
రచయిత
సఫలమైనట్లే

లేక, పిల్లా-జెల్లా, పెద్దా-చిన్నా, ముసలి-ముతకా అన్నతేడా లేక చాలామంది చనిపోయారట. ఇంకా చెప్పాలంటే భూమాత ఒడిలో ఉన్న ప్రకృతి చేసిన విలయతాండవం, శివతాండవాన్ని తలపించిందట. ఎక్కడ చూసిన ఆర్తనాదాలు, మృత్యుఘోషలు. ఆదుకునేవారు కరువయ్యారు. తమను తాము రక్షించుకోలేక తమ బంధువుల పార్థివ దేహాల్ని తరలించలేక అక్కడ ప్రజలు పడిన ఇక్కట్లు వర్ణనాతీతంగా ఉన్నాయట.

అందులోనూ అక్కడి బాధితుల్ని తరలించడంలో భాష, ప్రాంతం వంటి వివక్షత నెలకొందట. ఉత్తర భారతీయుల్ని ముందుగా రక్షించి, తర్వాతే వేరే రాష్ట్రాల వారిని రక్షించారట. మన తెలుగోడి గోడు పట్టించుకునే నాథుడే లేక తెలుగువాళ్ళు కళ్ళు కాయలు కాసేలా ఎదురుచూపులు చూసి చివరకు ఫలితం లేక ఎట్టకేలకు ఎ.పి.భవన్ చేరుకొని ప్రత్యేక రైళ్ళ ద్వారా మన రాష్ట్రంలో అడుగుపెట్టాక గాని సంతోషంగా ఊపిరి పీల్చుకోలేకపోయారట. అక్కడ మానవత్వం నశించి ధనార్జనే లక్ష్యంగా చేసుకొని చిన్న బిస్కెట్ ప్యాకెట్ నూరు రూపాయలు వాటర్ బాటిల్ రెండువందల రూపాయలు, భోజనం ఐదు వందల రూపాయలు లెక్కన అమ్మి, దళార్లు సొమ్ము చేసుకొని లాభపడ్డారట. నూటికో, కోటికో ఒకరు చొప్పున, కొంతమంది మాత్రమే మానవత్వం ఇంకా బ్రతికేఉందని నిరూపించారట."

"చెల్లీ.... మరి మనవాళ్ళు బ్యానర్లు కట్టి, ఓట్లువేసి, గెలిపించిన రాజకీయ నాయకులు ఏం చేశారు?"

"రాజకీయ నాయకుల గురించి చెప్పమంటావా అక్కా! వారి గురించి అయితే ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. ఎందుకంటే ఎన్నికలు ఐదు సంవత్సరాలకు ఒకసారి వస్తాయి. అప్పుడు మళ్ళీ వచ్చి ఓట్లకోసం అమ్మా, అయ్యా అంటూ కాళ్ళపైన పడి ప్రాధేయపడతారు. ఇక ఈ విషయం అంటావా; వాళ్ళు చోద్యం చూడటానికి వెళ్ళినట్లుగా వెళ్ళి మొసలి కన్నీరు కార్చి జరిగిందేదో జరిగిపోయిందనుకుంటూ ఆస్తి నష్టం, జననష్టం లెక్కలు వేసుకొని వెనక్కి వచ్చారట. రాజకీయ నాయకులైతే మాత్రం దేవుళ్ళా ఏంటీ, "వాళ్ళు మనుషులు కదా!" వాళ్ళు పంచిపెట్టిన ధనం, ఇతరత్రా తిరిగి సంపాదించుకొని వాళ్ళ తరాల వారికి కొన్ని రాళ్ళు వెనుకవేసుకోవాలా వద్దా? నేటి మన రాజకీయాలు చూశావుగా పూర్తిగా భ్రష్టు పట్టిపోయాయి. నీతిమాలిన రాజకీయాలకు పట్టలేదు విదురనీతి, ఈ కుటిల రాజకీయ నాయకుల కళ్ళు కమ్మేసింది అవినీతి. "నోటిభాషకు లెక్కలేదు, నోట్ల కట్టలకు తప్పు". పేదరికాన్ని తరిమికొడతామంటూ ప్రజలకు ఆశపెట్టి, వేల కోట్ల ప్రజాధనాన్ని విడుదల చేసి పథకాలు ఆరంభించి అందులో అవినీతి మేతతో బలిసిపోవటం నేతలు, అధికారుల మధ్యే పోటాపోటీ".

"చెల్లీ, అధికారులు అంటే గుర్తొచ్చింది. మొన్ననే ఒక ప్రభుత్వం అధికారి కాకినాడలో ఇల్లు కట్టాడట. అది ఎలాగో తెలుసా?"

"గాల్లోనా ఏంటి అక్కా!"

"గాల్లో కాదే అంతకంటే గొప్పగా".

"అదేంటో తొందరగా చెప్పు అక్కా!"

"చెబుతాను విను. తాను పనిచేసిన విభాగంలో అటవీశాఖ అధికారులు కలపని, సిమెంట్ కంపెనీవారు సిమెంట్ని, గృహ నిర్మాణశాఖ వారు భూమిని, ఇలా ఇల్లు కట్టడానికి కావాల్సినవన్నీ సమకూరాయట. ఇల్లు కట్టడానికి ఎంత ఖర్చు అయ్యిందో తెలుసా?

అక్షరాల ఐదు కోట్ల రూపాయలు".

"ఐదు కోట్ల రూపాయలా? అక్కా ఒక అధికారి తన జీవితంలో ఐదు కోట్ల రూపాయలు సంపాదించడం అసంభవం కదా?"

"అదేనే ఈ టెక్నాలజీ యుగపు నీతి."

చెల్లి : అంటే "చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష" అన్నమాట.

"అవునే, చెల్లీ! నా అంటే గుర్తొచ్చింది. ఐదు ఏళ్ళక్రితం ఆ కొండకు అవతల ప్రక్కన చందన, మామిడి అనే రెండు పెద్ద వృక్షాలు ఉండేవి. వాటిపైన ఒక యువ కపోత జంట నివాసముండేది. వారందరూ ఎంతో స్నేహంగా ఉండేవారు. ఆ కపోత జంట ఉదయం నిద్రలేచిన తర్వాత ఆహార సంపాదనకై వెళ్ళిపోయి తిరిగి రాత్రికి గూటికి చేరుకునేది. ఐతే కొన్ని రోజుల తర్వాత ఆ నలుగురితో స్నేహం చేయడానికి ఒక నక్క అటుగా వచ్చి, నేను కూడా మీతో స్నేహం చేయవచ్చా అని అడిగింది. వారు కూడా నక్క ఎలాంటిదో తెలుసుకోకుండా తమతో ఉండేందుకు అవకాశమిచ్చారు. వారి సఖ్యతను చూసి నక్క ఓర్వలేకపోయి, చందనకు చాడీలు చెప్పేది.

## • మసకబారుతున్నది •

- జి. లెనిన్ శ్రీనివాస్, ఖమ్మం. ఫోన్ : 9959852154

పల్లవి
మసకబారుతున్నది మనదేశ చరిత్ర
మట్టిలో కలిసి పోతున్నది మన ఘనత
స్వాతంత్ర్య మొచ్చినాక నరనరాన స్వార్థంతో
హద్దు అదుపులేని అవినీతి చీడపీడైంది ॥ మసక ॥

చరణం 1
స్వేచ్ఛకై మనవాళ్ళు శృంఖలాలు తెంచ
సామ్రాజ్యవాదులను తరిమేయ చూశారు
కోరుకున్నదానికి కొరివి పెట్టినారు కదా
గొర్రెలు తినేవాళ్ళు పోయి బర్రెలు తినేవాళ్ళొస్తే ॥ మసక ॥

చరణం 2
పక్షపాతంతో తడిసి ముద్దవుతు వున్నారు
కోట్ల ప్రజాధనాన్ని కొల్లగొడుతు వున్నారు
చేసినట్టి బాసలు గాలికొదిలేస్తు వున్నారు
కుంభకోణాల ఊబిలో ఊపిరాడకున్నారు ॥ మసక ॥

చరణం 3
ప్రజాసేవలను మరిచి సంపదను స్వాహా చేస్తూ
గనులు, భూములు, నిధి నిక్షేపాలను దోచేస్తూ
ఉన్నోళ్ళ చేతలు నిప్పుకోడి చేష్టలు
రాబందువై జాతి జనుల పీక్కుతింటుంటే ॥ మసక ॥

చరణం 4
సంక్షేమ పథకాలు సంక్షోభంలోకెళ్ళ
దోపిడిదారులతో చెలిమి చేస్తున్నారు
స్వదేశీ వస్తువులకు ఉరితాళ్ళు పేనుతున్నారు
బడుగు జీవులందర్ని బలిపీఠమెక్కిస్తుంటే ॥ మసక ॥

మొదట్లో చందన నమ్మకపోయినా, తర్వాతర్వాత మామిడి తనపై చూపిస్తున్న ప్రేమాభిమానం బూటకమని తలచి మామిడిపై అసహ్యం పెంచుకొని వాగ్వాదానికి దిగింది. మామిడి తాను తప్పు చేయలేదనిపించినా, తనలోనేమైనా లోపముందేమోనని వెనక్కి తగ్గింది. చివరికి చందన మామిడినుండి విడిపోయి నక్కతో స్నేహంలో మునిగితేలుతూ ఉంది. పావురాలు యథాతథంగా తమ రోజువారీ పనులు పూర్తి చేసుకొని వచ్చేవి. తమ మిత్రుడు మామిడి ఎందుకు దుఃఖంగా ఉన్నాడో తెలుసుకోవాలనుకున్నాయి. ఒకరోజు తమ ఇద్దరి స్నేహితుల మధ్య గొడవ జరిగిందని, దీనంతటికి కారణం నక్కేనని తెలుసుకున్నాయి. ఎలాగైనా నక్కకు బుద్ధి చెప్పాలని నిర్ణయించుకుని దానికోసం ఒక పథకాన్ని రచించాయి. పథకం ప్రకారం సింహంగారి సహాయం తీసుకుని, అవి నక్కవైపుగా వచ్చి "మిత్రమా! నీకు రాజుగారి నుండి కబురొచ్చింది. నిన్ను సత్కరించాలని నిర్ణయించుకున్నారట. వెంటనే రమ్మన్నారు" అని చెప్పాయి. ఆ జిత్తులమారి నక్క తనలో తాను పొంగిపోతూ సింహం దగ్గరకు వెళ్ళి నమస్కారం పెట్టి, రాజా తమరినుండి నాకు కబురొచ్చింది. దానికి కారణం తెలుసుకోవచ్చా అని అడిగింది.

సింహం : "నేటికాలంలో చందనం చెట్లు కనుమరుగైపోతున్నాయి కదా. నాకొకసారి చూడాలని ఉంది. నువ్వే దాన్ని దగ్గరుండి తీసుకురా, అలా వచ్చిన ట్లైతే నీకు బహుమానం ఇస్తాను" అని చెప్పింది.

నక్క : "చందనం చెట్లంటే సరేసరి. మరి కట్టెలు కొట్టేవాడు ఎక్కడ దొరుకుతాడు అని ఆలోచించుకుంటూ దగ్గర్లో ఉన్న గ్రామానికి వెళ్ళి కట్టెలు కొట్టేవాడ్ని తీసుకువచ్చింది. అదిగో రాజుగారు తీసుకురమ్మన్న చందనం చెట్లలో ఒకటి దాన్ని నరకండి అంటూ చెప్పింది.

చందన : "ఓ మిత్రమా! నీకిది తగునా?" అని ప్రశ్నించగా.

"నిన్ను తీసుకువస్తే, రాజుగారు నాకు మంచి బహుమతి ఇస్తారని చెప్పారు. "నీతో స్నేహం చేస్తే నాకేం వస్తుంది. నిలవడానికి నిలువ నీడ కూడా నీ చెంత ఉండదు". అందుకే రాజుగారి ఆజ్ఞ ప్రకారం నిన్ను రికిస్తున్నా అని బదులిచ్చి నరికివేయమంది. పొదల చాటున దాగి ఉన్న సింహాన్ని చూసి అప్పటికే ఆ కట్టెలు కొట్టేవాడు పరుగు లంకించుకున్నాడు. పథకం ప్రకారం సింహం అదను చూసి నక్కపై దాడి చేయబోతుండగా పరిస్థితి అర్థమైన నక్క అక్కడి నుండి పారిపోయింది. సహాయం చేసినందుకు పావురాలు సింహానికి కృతజ్ఞతలు తెలిపి సెలవు తీసుకున్నాయి. దుష్టులతో స్నేహం చేయడం వలన వచ్చే అనర్థాలు తన ప్రాణం మీదికి వచ్చినంత వరకు గాని చందనకు అర్థం కాలేదు. తన తప్పు తాను తెలుసుకని మామిడితో, "మిత్రమా! నన్ను క్షమించు, చెప్పుడు మాటలు విని నేను తప్పు చేశాను" అని అంటుండగా మామిడి "లేదు మిత్రమా నువ్వు తప్పు చేయలేదు. ఆ నక్క ఆడిన ఆటలో పావువైపోయావు. ఎన్ని జన్మలకైనా మనమిద్దరం మంచి స్నేహితులం నీకు నాకు మధ్య క్షమాపణలు దూరం పెంచకూడదు" అని చిరునవ్వుతో చెప్పింది.

అది గమనిస్తున్న పావురాలు ఆనందంలో మునిగిపోయి, చుంబనానికి ఉపక్రమించాయి. అంతలో ఆడ పావురం చుట్టూ చూడసాగింది. ఎందుకు అలా చుట్టూ తిరిగి చూస్తున్నావు అని మగపావురం అడిగితే దానికి ఆడపావురం

"డియర్ నీకు తెలియదా, ఈ మధ్య డిస్కవరీ ఛానల్ వారు రహస్యంగా చెట్టుకొమ్మలపైన కెమెరాలను ఉంచుతున్నారు" అని చెప్పింది".

"చూశావా అక్కా! మన దేశపరిస్థితి ఎలా దిగజారిందో..."

"ఏమైంది చెల్లి?"

"అభివృద్ధి అభివృద్ధి అంటూ పరిగెడుతున్నామంటున్నారే... ఇదేనా మన అభివృద్ధి రహస్యంగా. శృంగారం జరుపుకునే వారిని చిత్రించి సి.డి.ల రూపంలో మార్కెట్‌లోకి విడుదల చేసి యువతరాన్ని పెడదారి పట్టిస్తున్నారు. ఆ మహానుభావుడు జె.యల్.బయార్డ్ కనిపెట్టిన దూరదర్శినిని సక్రమంగా ఉపయోగించకుండా దుర్వినియోగం చేసి అశ్లీల చిత్రాలను చూడటానికి వినియోగిస్తున్నారు. ఒకప్పుడు గ్రామస్తులంతా రచ్చబండల వద్ద సమావేశమయ్యి అప్పటి పరిస్థితుల గురించి లేదంటే పురాణాల గురించి మాట్లాడుకునేవారు, చూస్తున్నావుగా ఇప్పుడు ఒకే ఇంటివారు సీరియల్స్ అని, క్రికెట్ అని మరియు వేరే ప్రోగ్రాంలను చూడటానికి రిమోట్ కోసం కొట్టుకొని, రిమోట్ ఇవ్వలేదని ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అలాగే అంతర్జాలాన్ని అభివృద్ధి కొరకు ఉపయోగించకుండా దుర్వినియోగం చేస్తున్నారు.

అదీకాక వాటిని చూసి వావివరసలు మరచి కీచకులుగా మారుతున్నారు. "మన భారతంలో చూసినా 18 పర్వాలు ఉండేవేమో గాని నేటి ఈ భారతంలో అరాచక పర్వాలకు అంతులేదు అక్కా!" ఆ దూరదర్శిని కనిపెట్టిన మహానుభావుడే బ్రతికి ఉంటే నేటి తరపు సమాజం చేసే వికృతి చేష్టలను చూసి భరించలేకపోయేవాడేమో.

చూస్తున్నావుగా అక్కా ఆ వెళ్తున్న మనిషి చేతిలో ఇంకో అభివృద్ధి సూచిక, ఆహారం నిద్ర లేకపోయినా ఉండగలడేమో గాని తన వెంట ఆ మాట్లాడే పరికరం లేకుండా ఉండలేనంత స్థాయికి ఎదిగింది మన అభివృద్ధి. చుట్టం చూపుకి వచ్చిన వారు పాశ్చాతులు. కానీ వాళ్ళ సంస్కృతికి పట్టం గట్టిన నేటితరం వారికి తల్లిపాలు చేదయ్యాయి.

అలా జవాబివ్వగానే మగపావురం చిన్నగా నవ్వి ఊరుకుంది.

రెండు రోజుల తర్వాత కొంతమంది మనుషులు అక్కడికి వచ్చి చెట్లను లెక్కబెట్టి, భూ విస్తీర్ణాన్ని కొలవసాగారు. అలా లెక్కిస్తూ యజమానితో ఇలా చెప్పారు. "సార్ మనం ఇక్కడ పరిశ్రమను నిర్మించడానికి అన్ని రకాల

## తెలుగు పూదోటలో...

- వైరాగ్యం ప్రభాకర్, ఫోన్ : 9014559059

ధర్మాధర్మ నిర్దేశక వాక్కులు మన మనుస్మృతులు
జీవాత్మ పరమాత్మ సంబంధ బాంధవ్యాల ఉపనిషత్తులు
నిర్విఘ్న యజ్ఞయాగాది క్రతువుల సారథులు మన వేదాలు
అష్టాదశ వర్ణనల యుక్తము అలంకార సంయుక్తములు ప్రబంధములు
పద్యగద్య సమమేళవింపుల కలయికలు చంపూకావ్యములు
అష్టవిధ ప్రక్రియల కాలవాలమై నిలిచిన అష్టావధానములు
పండిత పామరులకు సులభగ్రాహ్యమై మనో రంజితమగు ద్విపదలు
నైతిక విలువలకు పట్టంకట్టిన సమాజ నిర్దేశక శతకములు
కర్మ, జ్ఞాన, యోగ సారాంశ తత్వగీతం గీతోపదేశము
మహనీయుల వర్ణనాయుత రమణీయ ప్రదేశాల యాత్రా రచనలు
కవుల కథా కథన పటిమల సద్విమర్శనా పూరిత పేటికలు పీఠికలు
భావితరాలకు మార్గదర్శకాలు, యువతకు ఆచరణీయాలు ఆత్మకథలు.

సదుపాయాలు ఉన్నాయి. ప్రక్కనే సెలయేరు ఉంది. సరుకులు రవాణా చేయడానికి రైలు మార్గం వేయవచ్చు. కానీ చుట్టుప్రక్కలు నివసించే ప్రజలు, జంతువులు అనేక ఇబ్బందులను ఎదుర్కొనవలసి వస్తుంది". "అదంతా నాకు అనవసరం. నా పరిశ్రమను ఇక్కడ నిర్మించడానికి నాకు సర్వహక్కులూ ఉన్నాయి. ఎవరు ఏమైతే నాకేం, మీకు జీతాలు సరిగా ఇస్తున్నాను కదా, ముందు చెట్లను నరికించండి" అంటూ ఆదేశించాడు.

రెండు రోజుల తర్వాత కొంతమంది కూలీలు, 3 ప్రొక్లైనర్లతో వచ్చి చెట్లను వేర్లతో సహా పెకిలించడానికి పూనుకున్నారు. ముందుగా మామిడి దగ్గరకు వెళ్ళి నరకబోయారు.

అప్పుడు మామిడి వారితో,

"అయ్యా! మమ్మల్ని ఎందుకు చంపాలనుకుంటున్నారు. మా వృక్షజాతి మొత్తం మీకు ఎంతగానో ఉపయోగపడుతున్నాము కదా" అని అన్నది.

"మా యజమానిగారు ఇక్కడ పరిశ్రమను నిర్మించాలని నిర్ణయించుకున్నారు. అందుకు మీరు అడ్డుగా ఉన్నారు. కనుక మిమ్మల్ని తొలగించాలని చెప్పారు".

"అయ్యా! నన్ను చంపితే చంపారు గానీ దయచేసి మా మిత్రుల్ని చంపొద్దు. ఇది మీ మానవజాతిలో తప్పు చేసే వారిని ఉరితీసే ముందు కోరుకొనే చివరి అభ్యర్థన అనుకోండి" అని వినమ్రంగా ప్రాధేయపడింది.

అది అంతా గమనిస్తున్న కపోతాలు క్రిందికి దిగి యజమాని దగ్గరకు వెళ్ళి "దయచేసి వారిని చంపొద్దని చెప్పండి" అంటూ కాళ్ళూ చేతులూ పట్టుకొని ప్రార్థించాయి.

అయినా యజమాని హృదయం కరగలేదు.

పావురాలు చివరకు ఇలా అన్నాయి. "కావాలంటే మీకు వజ్రాల గుహల్ని చూపిస్తాం అవి అమ్మితే మీకు కావాల్సినంత డబ్బు వస్తుంది. దాంతో మీరు జీవితంలో హాయిగా గడపవచ్చు. ఇంకా కావాలంటే మమ్మల్ని చంపి మీ పెరట్లో పాతిపెడితే మీకు కావాల్సినంత బంగారం లభిస్తుంది" అని చెప్పాయి.

అంతలో తమ మిత్రులైన మామిడి, చందన కలుగజేసుకొని యజమానితో "అయ్యా! మేము, మీకు అన్ని విధాలుగా ఉపయోగపడగలము. మమ్మల్ని వేర్లతో సహా నరికివేయండి. కానీ దయచేసి వారిని మాత్రం విడిచిపెట్టండి" అని ప్రాధేయపడ్డాయి.

చివరకు ఆ యజమాని యువ కపోతాల ఒప్పందం వైపు మొగ్గుచూపి అవి చూపించిన వజ్రాల్ని సొంతం చేసుకొని, వాటిని చంపి తన పెరట్లో పాతిపెట్టాడు. అది విన్న మామిడి, చందనలు శోకసంద్రంలో మునిగిపోయాయి.

అది జరిగిన పదిరోజుల తర్వాత యథావిధిగా కూలీలు వచ్చి చెట్లను నరకబోయారు. చెట్లన్నీ కలిసి యజమానిని ప్రశ్నించగా,

అది ఒకప్పటి మాట అంటూ, కూలీలుకు ఆజ్ఞలు జారీ చేశాడు. ఒక్క క్షణం అంటూ పావురాల మిత్రుల్ని మాత్రం కాండం వరకు నరకండి అని చెప్పాడు. దానిని మామిడి చందన ముక్తకంఠంతో "అయ్యా! మా మిత్రుల్ని కోల్పోయి మేము జీవచ్ఛవాల్లా పడి ఉన్నాం. మమ్మల్ని సగానికి నరికి మరింత దిగజార్చకండి. మమ్మల్ని పూర్తిగా నరికి ఈ నరక కూపం నుండి విముక్తి కల్గించి మా మిత్రుల వద్దకు పంపించండి" అని వేడుకున్నాయి.

యజమాని సంతోషంగా దాన్ని నరికివేయండి అంటూ హుకుం జారీ చేశాడు".

"చూశావా అక్కా! ఈ మానవుడు ఎంతటి దురాశాపరుడో! తన స్వార్థం కోసం సమస్తాన్ని నాశనం చేస్తున్నాడు."

"ఆగవే చెబుతాను, ఆ ఫ్యాక్టరీ కట్టిన 5 సం.ల తర్వాత భారీగా వర్షాలు పడి, వరదలు వచ్చి ఆ కర్మాగారం, ఆ యజమాని, అందులో పనిచేసే కార్మికులు, అధికారులు అందరూ నామరూపాలు లేకుండా కొట్టుకుపోయారు. చూశావా ఎంతటి దుస్థితి పట్టిందో.

ఆ యజమాని వంటి వారు ఎందరో అభివృద్ధి, స్వార్థం అనే పేరుతో మన పూర్వతరాల్ని నరుక్కుంటూ వచ్చారు. చివరకు ఇదిగో చెట్టుకొకరు, పుట్టకొకరు అన్నట్లుగా ముంబైలో ఒకరు, హైదరాబాద్లో ఒకరుగా ఎక్కడెక్కడో ఉన్నాం".

"ఇంతకీ అధికారుల లెక్కల ప్రకారం అడవుల విస్తీర్ణం ఎంత ఉంది అంటావు."

"30% ఉండాల్సింది 23% ఉందట".

"అయితే త్వరలో మనం కూడా అంతరించిపోతున్నాం అన్నమాట. అవును అక్కా! మనల్ని నాశనం చేసి అభివృద్ధి, టెక్నాలజీ అంటూ కాలంతో సమానంగా పురుగులు పెడుతున్నాం అని సంబరపడుతున్నారే గానీ, "తాము ఎక్కిన కొమ్మను తామే నరుక్కుంటున్నారు" అన్న సంగతి వారికి తెలియదు". అభివృద్ధి, టెక్నాలజీ అంటున్నారు కదా, గిజిగాడు అల్లిన గూడుని ఎందుకు అల్లలేకపోతున్నారు. చీమలు పెట్టిన పుట్టలోకి నీరు ప్రవేశించలేదు కదా! దానికి కారణం తెలుసుకోలేకపోతున్నారే. ఇదేనా టెక్నాలజీ". అభివృద్ధి, అభివృద్ధి అంటూ సమస్తాన్నీ నాశనం చేసుకుంటూ ముందుకుపోతే "చివరికి కాల్చడానికి కట్టె, పాతడానికి మట్టి లేకుండా పోతుంది".

"పట్టాల్సిందే, వారికి ఈ గతి పట్టాల్సిందే, నాశనమయిపోతారు చచ్చినోళ్ళు."

"ఏయ్, అలా మాట్లాడకు, మనం అనుభవిస్తున్నామని వారుకూడా ఆ బాధని అనుభవించాలా ఏంటీ?"

## వ్యంజకాలు

- సిద్ధాంతపు ప్రభాకరాచార్యులు, ఫోన్ : 9491357842

1. గాంధీ కన్న కలలు కల్లలై
భావి భారతం జోగుతున్నది
ఎక్కడ చూసినా ఈ దేశంలో
మద్యం ఏరులై పారుతున్నది.

2. అమ్మకోసం సభలో ఉపన్యసించి
సభికులందరి కళ్ళలో నీళ్ళు తెప్పించాడు
తన తల్లిని అనాథాశ్రమంలో చేర్పించి
ఆమె కళ్ళలో నీరు మిగిల్చాడు ఆ ఘనుడు

3. లక్ష్యసాధనలో లక్షన్నర మొక్కలు
నాటాడు ఆ అటవీ అధికారి
తన ఇంటి చుట్టూ ఉన్న ఖాళీ స్థలాన్ని
సిమెంటు చేయించాడు అందంగా ఉండాలని

4. పచ్చని చెట్లు ప్రగతికి మెట్లు
హోర్డింగుల్లో దాగిన అక్షరాలు
నగరాల్లో ఆకాశాన్ని తాకే హర్మ్యాలు
కాలుష్యాభివృద్ధికి చిహ్నాలు

5. బిడ్డల భవిష్యత్తుకై భార్యాభర్తలిద్దరూ
నగరంలో ఉద్యోగం చేస్తున్నారు
డేకేర్లో బిడ్డల నొదిలి
ప్రేమాభిమానాలకు దూరం చేసుకున్నారు.

# అమర కవితా దుర్గం శ్రీశ్రీ

- అద్దేపల్లి వేణు, నూజివీడు. ఫోన్ : 9247797525

తెలుగుభాషకు శ్రీకారం 'శ్రీ', మన పేరుకు గౌరవార్థకం 'శ్రీ' కవుల్లో కలమై, కర్షకుల్లో హలమై, కార్మికుల్లో చక్రమై, కళల్లో రాజై, నేటికైనా, ఏనాటికైనా ప్రజలలో ప్రణమిల్లుతుంటాడు 'శ్రీ శ్రీ'.

ఈ అంధకార కవితా ప్రపంచంలోకి నేనున్నానంటూ పొడుచుకుంటూ వచ్చిన విప్లవ సూర్యుడు 'శ్రీ శ్రీ' తన కవితా కిరణాల ప్రభావంతో ప్రజల్ని వేడెక్కించి విప్లవాల దిశగా మనల్ని నడిపిస్తున్నాడు 'శ్రీ శ్రీ'

ఆయన మెదడులో విప్లవాగ్ని కణాలున్నాయి. అందుకేనేమో అక్షరాల్లోంచి అగ్గి రవ్వలు పుట్టించాడు. మాటల్ని తూటాల్లాగా పేల్చాడు, కొలిమి నిప్పుల్లాగా ప్రజల్ని రువ్వాడు. అన్యాయాల్ని ఎదురించే ఆయుధాలై నిలబడమన్నాడు.

సమాజంలో తరతరాల నుంచి నరనరాల్లో నిలవుండిపోయి పేరుకు పోయిన మురికితనాన్ని, మూఢాచారాల్ని 'శ్రీ శ్రీ' తన కవితా పదాలతో సుడిగాలులు సృష్టించి, అక్షరాలతో జడివానలు కురిపించి ఒక పెనుతుఫాను హోరై వినిపించాడు.

అమాయకుల శ్రమను దోచుకుని, అన్యాయాలు, అక్రమాలు సాగిపోతున్న నదీ ప్రవాహానికి ఒక ఆనకట్టై ఎదురు నిలిచిన దుర్గం 'శ్రీ శ్రీ' కాలుదువ్వి కవితా సృష్టికే పరిశోధనా కేంద్రం నేనని, ఆయన వేసిన రంకె ప్రపంచమంతా ప్రతిధ్వనించింది. తెలుగు సాహిత్యానికి ఆయనొక తేనెపట్టు, అభ్యుదయ కవిత్వానికి ఆయుపట్టు. ఆధునిక కవిత్వానికి తొలిమెట్టు.

ఆయన కవిత్వం ఒక వెలుగుల మేడ, చిరకాలం మనకు తోడుండే నీడ. ఈ భూలోక స్వర్గానికి ఆయనే ఒక అడుగుజాడ, అదే ఆయన శైలిలో తేడా. అందుకే గర్వించాలి తెలుగోడా. ●

## ఉత్తరం వ్రాయవూ !

- డా॥ జ్యోశ్యుల కృష్ణబాబు, పెద్దాపురం. ఫోన్ : 986645430

నేస్తం !
ఎన్నాళ్ళయింది నీ ఉత్తరం అందుకొని
అది అక్షరమక్షరం
ఆప్యాయతను మోసుకొచ్చేది !
స్నేహసుమగంధాన్ని
హృదయమంతా నింపేది !
శృతిచేసిన వీణలా
ప్రతి అక్షరం మనసును మీటేది !
అప్పుడే రంగులద్దిన
తడిత్రైల వర్ణచిత్రంలా తోచేది !
అది చదువుతుంటే
సెలయేరు పెదవి విప్పినంత
ఆహ్లాదంగా ఉండేది !
అది వస్తూనే
భావాల బరువుతో
హృదయాన్ని గిలిగింతలు పెట్టేది !
అక్షరాల వెంబడి కళ్ళు,
కళ్ళవెంబడి మనస్సు పరుగులు పెడుతూ
నీ మనసును తెలుసుకోవడంలో
నిమగ్నమయ్యేవి !
కూర్చుని ప్రశాంతంగా చదువుకొన్నా
నడుస్తూ ఆదరాబాదరా చదివినా
ఉద్యోగం చేసి అలసిసొలసి వచ్చి
సేదతీరుతూ చదువుకొంటున్నా
వా...హ్ ... ఎంత హాయినిచ్చేది నీ ఉత్తరం !
నీ ఉత్తరం రావడం మానేసాక
మనసంతా దిగులుతో
చీకటితో నిండిపోయింది
నువ్వు దూరమైపోయావేమోనన్న వేదన
హృదయాన్ని కలచివేస్తోంది.
మిత్రమా! ఫోనులన్నీ మూసేసి
నా హృదయ గవాక్షం నుండి
వేదనాశకలాలన్నీ ఎగిరిపోయేలా
ఒక అందమైన
ఆహ్లాదకరమైన
ఉత్తరం వ్రాయవూ !

(అంతరించిపోతున్న లేఖాసాహిత్యాన్ని పునరుద్ధరించాలని కోరుతూ)

## మాతృభాషా గౌరవం

- చంద్రమౌళి నాగమహాలక్ష్మి.

కనిపింపదేనేడు – ఆంధ్రభాషా గౌరవమ్ము
వినిపింపదే నేడు – మాతృభాషా సౌందర్యమ్ము
చెలగదే నేడు - ఆంధ్రభాషా సభలో పానుగంటి భాషోద్యమ్ము
నిప్పచ్చరంబయ్యెనే నేడు - తెలుగు భాషా సాహితీ లక్ష్మి
చెక్కుచెదరని – యేనాడూ మొక్కవోని
ఆంధ్రభాషా పౌరుష మిప్పుడధ్వానమయ్యె
మరచిపోక ఒక మాటు తెరతీసి చూచి
దిద్దుకోవమ్మా ! మాతృభాషా సాహితీ !
"దిద్దుకోవమ్మా మాతృభాషా సాహితీ"

## తెలుగువాడా

- జంపన మధు, విజయవాడ.

అలంకరణ బాహ్యాసౌందర్యాన్నిచ్చినా ....
ఆత్మీయులు అనురాగాన్ని పంచినా ....
సంస్కృతి కట్టుబాట్లు నేర్పినా ...
సమాజంలో .. తెలుగుభాష విలువలు పెంచినప్పుడే
మన తల్లిని మనం గౌరవించినట్లవుతుంది ...
యువకులారా ... ఎదగండి ... కాని,
తెలుగుతల్లిని మరువకండి !!

## అమ్మను మరిచావా కన్నా

- అమరజ్యోతి, అనకాపల్లి

అమ్మా ... అమ్మా ..
అని పాతికేళ్ళుగా
నా కొంగు పట్టుకు
తిరిగిన నా 'కన్నా'
వృద్ధాప్యంలో నా నీడను కూడా
సహించలేక పోతున్నావా
నాన్నా ......

# పండితుడి ఆత్మహత్య

- యస్. గోవిందరాజు, విశాఖపట్టణం. ఫోన్ : 9440369647

ఆరోజు భళ్లున కాకుండా మామూలుగానే తెల్లారింది. 'హంచ్ బ్యాక్ ఆఫ్ నాట్రడ్యామ్' సినిమాలోలా నరకలోకపు ధర్మగంట భయంకరంగా శబ్దం చేస్తూ మోగింది. సభాభవన సింహద్వారం బద్ధకంగా ఆవులిస్తూ తెరుచుకుంది. కాసేపటికి సభాసదులందరూ కొలువు తీరియుండగా 'యమగోల' సత్యనారాయణను తలపించే యమధర్మరాజు గదాధారియై రాజఠీవితో సభా ప్రాంగణంలోకి ప్రవేశించాడు. అయితే ఆశ్చర్యకరంగా ఎప్పటిలాగా వందిమాగధుల జయజయధ్వానాలు వినిపించడం లేదు. స్వాగత వచనాల ఊసే అసలు లేదు. అందరూ కేవలం లేచి నిలబడి విచార వదనాలతో తలొంచుకుని ఉన్నారు. యమధర్మరాజు ఏదో కీడును శంకించాడు. సింహాసనాన్ని అధిష్టించడానికి మెట్లెక్కుతూ ఆఖరి మెట్టుపై కాలు మోపుతుండగా అల్లు రామలింగయ్య ఆహార్యాన్ని పోలిన చిత్రగుప్తుడు... "ఆగండి యమరాజా! ఈరోజు మీరు చివరిమెట్టు ఎక్కి ధర్మపీఠం అధిష్టించడానికి వీలులేదు" అని అన్నాడు.

"ఎందుకు? నా రాజ్యంలో నా సింహాసనంపై నేను కూచోవడానికి అభ్యంతరమేమిటి?" అని నొసలు చిట్లిస్తూ గంభీరంగా ప్రశ్నించాడు యముడు.

"ధర్మ ప్రభువులు క్షమించాలి. నేడు మీరు సింహాసనాన్ని అధిష్టించాలంటే ఒక షరతును పూర్తి చేయాలి".

"ఏమిటా షరతు? అది నేను పూర్తి చేయాలా? చిత్రముగా నున్నదే చిత్రగుప్తా?"

"చిత్తం మహాప్రభూ! ఈ రోజు మన లోకానికి ఎన్నో పాపాలు మూటగట్టుకున్న ఒక తెలుగు పండితుణ్ని మన భటులు విచారణ నిమిత్తం తీసుకొచ్చారు"

"అయితే ఏమిటట? దానికి, నా సింహాసనానికి 'లింకు' ఏమిటి?"

"ఆ తెలుగు పండితుడు ఆత్మహత్య చేసుకున్నాడు మహాప్రభు. ఆ పాపం చేయడానికి ముందు ఒక వీలునామా రాసి మరీ గట్టిగా చేతిలో పట్టుకుని చనిపోయాడు".

"ఆహా! పండితుడు... ఆత్మహత్య... వీలునామా... ఈ సంఘటన మాకు మిక్కిలి వినోదాన్ని, అంతకు మిక్కిలి ఆసక్తిని గొలుపుతున్నదే."

"వినోదమో! విచారమో! నాకు తెలియదు. ధర్మప్రభువులు మీరే చెప్పాలి"

"నర్లేవయ్యా! నేనేదో నరదాకు అంటుంటే, నీవు సీరియస్‌గా తీసుకున్నట్టున్నావ్. ఇంతకీ వీలునామాలో ఆ పండితుడు ఏమి రాశాడట. మీకేమైనా అంతుచిక్కిందా?"

"చిత్తం ప్రభూ. ఆ వీలునామాలో ఇలా రాశాడు : ఎవరైతే 10 వాక్యాలు ఏకబిగిన, గుక్క తిప్పుకోకుండా ఒక్క ఆంగ్లపదం లేకుండా మాట్లాడగలరో వారే నన్ను శిక్షించడానికి అర్హులు అని స్పష్టంగా శుద్ధ తెలుగులో రాసి మరీ ఇక్కడకు పట్టుకొచ్చాడు."

"డ్యామిట్! ఇదేంటి చిత్రగుప్తా. శుభోదయాన్నే ఇలాంటి పంచాయతీ. నేను ఇంతకీ భారీకాయాన్ని వేసుకుని ఈ చివరి మెట్టుపై అట్లే ఎక్కువసేపు నిల్చోవడం నా వల్ల కాదు. అసలే ఈ వేళ ఉదయపు ఫలహారం పెసరట్టు కావడంతో కాస్త ఎక్కువ తిన్నాను. పోనీ, ఈ చివరి మెట్టుపైనే ఆసీనుడవుతాను ఈ రోజుకు. మీకేమైనా అభ్యంతరమా?"

"క్షమించాలి మహారాజా! అందుకు వీల్లేదు. మరీ అంత ఇబ్బందిగా ఉంటే చివరి మెట్టుమీద కాకుండా ఆ కింది మెట్టుమీద మాత్రమే కూచోవడానికి సాధ్యపడుతుంది."

"ఆల్రైట్! తప్పదు కదా మరి. ఇంతకీ ఆ పండితుడెవరు? ఎందుకు ఆత్మహత్య చేసుకొన్నారు? ఇవేవీ విశదపరచలేదు మాకు".

"ఆ విషయానికే వస్తున్నాను మహాప్రభూ! ఈ పండితుడు చాలా చండశాసనుడు. ఉపాధ్యాయుడిగా పనిచేసిన పాఠశాలలోని పసిపిల్లలను చాలా హింసించేవాడు".

"అయితే ఇంకేం?! మన నరకలోకపు జాగిలాలకు ఈ పాపాత్ముణ్ని ఆహారంగా వేద్దాం. పీడ విరుగడవుద్ది. నాకూ ఇబ్బందీ తప్పుతుంది."

## • తెలుగుభాష తియ్యనిది •

- మూడగాని మధు, నూజివీడు. ఫోన్ : 94900098464

పల్లవి : తెలుగుభాష తియ్యనిది
తల్లిదండ్రుల వరము అది
శ్రమజీవుల స్వేదంతో
శిఖరమైన శక్తి అది... ఆ... హా

సాకీ! భావం పంచే భాష అది
బంధం వేసే భాగ్యమిది
అరుణారుణ కిరణములా
మేలిమి బంగారమది ॥తె॥

చ॥ నోటరాలే పదములను
అక్షరములలో అమర్చినది
గతకాలపు చరిత్రను
భవితముందు ఉంచినది ॥తె॥

చ॥ త అంటే తల్లి అని
త అంటే తండ్రి అని
తల్లితండ్రులు నేర్పినదే
బతుకు దెరువే తెలుగు అని ॥తె॥

చ॥ కోకిలమ్మ కుహు కుహులకు
బాణీలు కట్టింది
తడిపొడి పసిపలుకులకు
క్రమపొందిక నేర్పింది ॥తె॥

"సొంతం ఆలకించండి మహాప్రభూ. అయినా మీరు ధర్మాసనం మీద కూచున్న పిమ్మట కదా తీర్పు చెప్పే అధికారం ఉంటుంది."

"అబ్బా. సింహాసనాన్ని పదేపదే గుర్తుచేసి చికాకు తెప్పించకయ్యా ప్లీజ్. అభియోగాల చిట్టాను చదివి వినిపించు."

"చిత్తం. ఒకసారి ఓ పదతరగతి కుర్రాడు 'బాధ' అనే పదంలో పొల్లును 'ద' అక్షరానికి బదులు 'బా'కు ఇచ్చాడట! అంతే ఆగ్రహోదగ్రుడై ఆ అబ్బాయిని చితకబాదేశాడు. మరోసారి ఒక అమ్మాయి ప్రార్థనలో వందేమాతరం గీతం ఆలపిస్తూ 'సస్యశ్యామలాం' అని అనడానికి బదులు పొరపాటున 'సస్యసామాలాం' అని ఉచ్చరించిందట. ఈ పండితుడు ఆవేశాన్ని ఆపుకోలేక అందరిముందు చెడామడా తిట్టేశాడట. పాపం అవమాన భారం భరించలేక ఆ అమ్మాయి చదువు మానుకుంది. ఇలా చెప్పుకుంటూ పోతే ఆ పండితుడు చేసిన 'నేరాలు-ఘోరాలు' అన్నీ ఇన్నీ కావు ధర్మరాజా."

"ఇట్సాల్రైట్. ఈ నేరాలు చాలు కదా ఇతనికి కఠినశిక్ష విధించడానికి. మన నరకలోక రాజ్యాంగ శిక్షా స్మృతిలో ఈ నేరాలకు ఖరారు చేసిన శిక్ష ఏమిటో మాకు తెలియపరచండి. తీర్పును ప్రకటిస్తా."

"మరోసారి క్షమాపణలు వేడుకుంటున్నాను... తీర్పును ప్రకటించడానికి... మీకు...?"

"సర్లే ఆపవయ్యా. అలవాటులో పొరపాటుగా అన్నాను. దాన్నే జలగలా పట్టుకుని ప్రతీసారి పదేపదే గుర్తు చెయ్యక్కర్లా. కింకర్తవ్యం ఏంటో చెప్పు చాలు."

"చిత్తం, చిత్తం. మన శిక్షాస్మృతిని, రాజ్యాంగాన్ని ఆపోశన పట్టిన న్యాయపాలకులను, కార్యనిర్వాహక ప్రముఖులను, శాంతిభద్రతల అధిపతులను సంప్రదించి ఈ తరహా నేరాలకు శిక్ష ఏమిటో తెలుసుకోవలసి ఉంది. మహాప్రభూ."

"అయితే ఇక ఆలస్యమెందుకు? వెంటనే వారిని సభాస్థలికి రప్పించండి."

"ఇప్పుడే చరవాణి ద్వారా సమాచారం పంపి క్షణాల్లో వారిని ఇక్కడ ప్రవేశపెట్టెద"

"ఆహా! ఏమిటి చిత్రగుప్తా. తెలుగు పండితుని కేసు విచారిస్తూ ఆ ప్రభావంలో పడి సెల్‌ఫోనుకు బదులు చరవాణి అని అనువాదం చేశారు. ఇంత మౌఢ్యం పనికిరాదయ్యా." అని యముడు అంటుండగానే... శిరస్త్రాణాలు, కవచకుండలాలు, రాజముద్రికలు గల దుస్తులు ధరించిన అయిదుగురు యమధర్మరాజుకు వంగి వంగి ప్రణామాలు చేస్తూ సభలోనికేతెంచారు. వారినుద్దేశించి చిత్రగుప్తుడు కేసు పూర్వాపరాలను, అభియోగాలను, వీలునామా వివరాలను తెలియజేసి వారి అభిప్రాయమేమిటో చెప్పమని అడిగాడు. అయితే వచ్చినవారిలో ఏ ఒక్కరూ ప్రతిస్పందించలేదు. చేతులు కట్టుకుని మౌనంగా నిలబడ్డారు. వీరి మౌనముద్రను చూసి భరించలేని యముడు కోపంతో...

"మీకేమైందేమిటి? ఉలుకు పలుకు లేకుండా బెల్లం కొట్టిన రాయిలా అలా నిల్చున్నారు. ఇందుకేనా మిమ్మల్ని పోషిస్తున్నది?" అని అన్నాడు. ఇంతలో చిత్రగుప్తుడు ఏదో గుర్తుకువచ్చిన వాడిలా...

"మహారాజా పొరపాటైంది. వీరు మన యమలోకపు అధికార భాషలో అది కూడా రాతపూర్వకంగా మాత్రమే ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే తర్ఫీదును మాత్రమే పొందియున్నారు. తెలుగుభాష గురించి వీరికి ఒక్కముక్క కూడా తెలిసే అవకాశమే లేదు. నేను మరిచిపోయాను."

"అలాంటప్పుడు వీరిని సంప్రదించడం అనవసరం. వీరిని తక్షణమే పంపించివేయండి. మా విలువైన సమయం వృథా అవుతోంది." అని పలికి ఈ చిక్కుముడిని ఎలా విప్పాలో తెలియక ఆలోచనలో పడ్డాడు యముడు. అంతలోనే ఏదో ఐడియా తట్టినట్లుగా...

"చిత్రగుప్తా. మన నరకలోకపు శాసనాల ప్రకారం ఈ పండితుణ్ని శిక్షించడానికి మనకేమీ పాలుపోకపోతే, ఇతడు భూలోకంలోకి ఏ దేశం నుండి వచ్చాడో తెలుసుకుని ఆ దేశ చట్టాల ప్రకారమే శిక్ష వేద్దాం. సింపుల్. కేసు పరిష్కారమైపోతుంది. నాకీ బాధా తొలగుతుంది".

"దొడ్డ ప్రభువులు భేషుగ్గా సెలవిచ్చారు. అందుకే మీరు మహారాజుల య్యారు. మేము మీ భృతులమయ్యాం. ఈ జన్మకు మాకు అలాంటి యోగం సంభవిస్తోందో లేదో" అని చింతిస్తూ...

"యమరాజా. ఈ పండితుల వారిది ఆంధ్రదేశం. ఈ దేశం నుండి వచ్చిన వారి కేసులే ప్రతీసారీ మనకు తలనొప్పిగా తయారవుతుంటాయి. వీరు చాలా తెలివైన వారు సుమా. వేలికేస్తే కాలికేస్తారు. కాలికేస్తే మెడకేస్తారు. వీరితో చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి."

"యముండ! మేమేమైనా తెలివితక్కువ దద్దమ్మలమా? ఎవరినైనా తలదన్నే తెలివితేటలు మా సొంతం. మీ హద్దుల్లో మీరుండడం మంచిది. అధిక ప్రసంగాలు చేయకుండా."

"చిత్తం. చిత్తం. ధర్మప్రభువులు మన్నించాలి."

"సరే. ఇంతకీ ఆ దేశపు రాజు ఎవరు? ఈ పండితుడు తన గోడును ఆ రాజు వద్దే మొరపెట్టుకుని ఉండవచ్చు కదా. ఆత్మహత్య. వీలునామా అంటూ మాకు తలనొప్పి కలుగజేయకుండా. ఈ విధంగా లేని సమస్యలను సృష్టించడం ఎందుకంటా?" అంటూ యముడు విసుగు ప్రదర్శించాడు.

"ఆ రాజే అంత సమర్థుడయ్యుంటే ఈ పండితునికి ఈ గతి పట్టి ఉండేది కాదు ప్రభూ. ఆ దేశ ప్రజల దరిద్రమేమంటే ఆ రాజు తన మాతృభాష

## పిలుపు

- దేవినేని జగన్మోహనరావు, ఫోన్ : 9247870818

తెలుగు తేజము దిశల నిండగ
తెలుగువానలు దెసల గురియగ
తెలుగువాణీ తేజరిల్లగ
తరలిరావోయ్ తమ్ముడా!
తరలిరావోయ్ తమ్ముడా!

వెదలిరావోయ్ తమ్ముడా!
వెదలిరావోయ్ తమ్ముడా!

అణిగిమణిగిన ఖనిజ సంపద
వెలికిదీయగ కొలికి జేర్చగ
కదము తొక్కుతు పదము పాడుతు
కదలిరావోయ్ తమ్ముడా!
కదలిరావోయ్ తమ్ముడా!!

తెలుగుశక్తీ దీప్తి జెందగ
తెలుగు ఖ్యాతీ వ్యాప్తి గాంచగ
తెలుగు కళలు వెలుగులీనగ

తెలుగును కూడా లోకల్ పంచ్‌తో ఇంగ్లీష్ ఉచ్చారణలో మాట్లాడుతాడు. ఆయన ఏం మాట్లాడతాడో మానవమాత్రుడెవరికైనా అర్థమైతే ఒట్టు".

"భేష్. నేను సెలవీయలేదా? ఈ భూలోకపు రాజుల కంటే మేము సమర్థులమని. శ్రేష్ఠులమని. యముండా!" అంటూ మీసాలు మెలిపెడుతూ అట్టహాసం చేస్తూ...

"భలా. సరే ఆ రాజు సంగతి పక్కన పెడదాం. ఆ దేశ ప్రజలకైనా బుద్ధి ఉండక్కర్లా. వారైనా ఈ పండితుని ఆత్మహత్యను ఎందుకు ఆపలేకపోయారు?"

"లేదు ప్రభూ. వారు కూడా మన పండితుణ్ని నిత్యం అవమానాల పాల్జేశారట. మాకు నీ అవసరం లేదు పొమ్మన్నారట. ఛీత్కరించారుట".

"ఓహ్... అలా జరిగిందా? మాకెంతో విచారం కలుగుతున్నది. మరి ఈ పండితుని ఆత్మహత్య తర్వాతైనా ప్రజలకు బుద్ధి రాలేదా? పాలకులు నిద్రలేచారా?"

"ప్రజల సంగతేమో కానీ, పాలకులు మాత్రం చాలా తెలివిగా పండితుని ఆత్మహత్యను సెంటిమెంట్ చేశారు. సంతాప సభలను ఆర్భాటంగా నిర్వహించారు. పండితుని జయంతులు, వర్ధంతులు, తద్దినాలను ఘనంగా నిర్వహించాలని తీర్మానాల మీద తీర్మానాలు ఆమోదించారు. పండితుని ఆత్మశాంతికి ఎన్ని కోట్లు కేటాయించడానికైనా వెనుకాడమని ప్రకటించారు."

"ఆహా... మంచిదే. ఈ పండితుని ఆత్మహత్య... కాదు కాదు, ఆ ఆత్మత్యాగమైనా ఆ పాలకులకు కనువిప్పు కలిగించిందన్నమాట."

"ధర్మ ప్రభువులు. అది ఉన్న మాట కాదు. అక్కడే మీరు పప్పులో కాలేస్తున్నారు. పాలకులు కోట్లు ఎందుకు మంజూరు చేస్తారో ఈ లోక పాలకునిగా మీకు తెలియనిది కాదు. మీరు అల్ప సంతోషులని మరోసారి నిరూపించుకున్నారు."

"ష్... రాజ్యాధికార రహస్యాల గురించి బహిరంగంగా మాట్లాడడం భావ్యం కాదు. ఆ దేశం సంగతి మనకెందుకు? మన ఘనులకే తీరిక లేదాయె." అంటూ యముడు స్వగతంలో ఆ దేశం గురించి మాట్లాడితే మన పొట్ట పగిలి కాళ్ల మీద పడేటట్టుంది. జాగ్రత్తగా ఉండాలి సుమా అని అనుకున్నాడు.

"సరే. చిత్రగుప్తా. ఇంతకీ పండితుని కేసును ఏం చేద్దాం. భూలోకంలో లాగా వాయిదా వేసి పెండింగులో పెట్టేందుకు మనకు వీలులేకపోయె. ఏదో ఒక ఉపాయం ఆలోచించవయ్యా. అసలే కడుపులో జఠరరసం అప్పుడే అలజడి సృష్టించడం సృష్టిస్తోంది. నాకసలే ఎసిడిటీ సమస్య."

"చిత్తం. యమధర్మరాజా. బాగా ఆలోచించిన మీదట ఒకే ఒక తరుణోపాయం అగుపిస్తోంది. ఈ పండితుడిది ఆత్మహత్య కాదు. మీరు సెలవిచ్చినట్లుగా ఇతనిది ఆత్మత్యాగం. వీర మరణం. నాకు తెలిసినంత వరకు వీరులను శిక్షించడం కాక సత్కరించాలి. అంతేగాక పండితుని వీలునామాలో శిక్షించడానికి షరతుంది. సత్కరించడానికి లేదు కదా. చూశారా నా తర్కం ఎంత అద్భుతంగా ఉందో. కాబట్టి ధర్మప్రభువులు అనుమతిస్తే మాటలో మాటగా మీ తీర్పుకు ఒక సలహా అందిస్తాను."

"భళిరా. చిత్రగుప్తా. మీ మాటను ఎప్పుడైనా కాదన్నామా? ప్రొసీడ్. వెంటనే చెప్పండి. టెన్షన్ భరించలేకుండా ఉన్నా."

"ఈ పండితుణ్ని మన ఆస్థానంలో నియమించుకుని తెలుగు సాహిత్య మధురిమలను ఆస్వాదించడానికి మీతోపాటు ఈ సేవకునికి కూడా ఒక అవకాశం లభిస్తుందని ఆశగా ఉంది మహారాజా!".

"భేష్. లెస్స పలికితివి చిత్రగుప్తా!" అని అన్నాడో లేదో మరుక్షణం భానుడు నడినెత్తి మీదకు వచ్చినట్టుగా సూచిస్తూ ధర్మగంట మోగింది. ఒక సంక్లిష్ట సమస్యను పరిష్కరించిన సంతోషవదనాలతో యముడు, చిత్రగుప్తుడు మధ్యాహ్న భోజన నిమిత్తం సభాప్రాంగణం నుండి నిష్క్రమిస్తుండగా సభాసదులందరూ...

"యమపురి అధినాయకా! మహారాజా. మార్తాండాతేజా. యమధర్మరాజా. జయహో జయహో..." అంటూ ప్రశంసా వాక్యాలు పలికారు.

అదే రోజు చల్లటి సాయంకాలం వేళ సభ తిరిగి సమావేశమైయుండగా తెలుగు పండితుడు పట్టు పీతాంబరాలు ధరించి వేమన శతకంలోని ఆటవెలది అందాలను, గురజాడ ముత్యాల సరాలలోని మాత్రాఛందస్సు చందన పరిమళాలను, శ్రీశ్రీ మహాప్రస్థానంలోని ప్రచండ శబ్ద హోరును రాగయుక్తంగా ఆలపిస్తుండగా సింహాసనాన్ని అధిష్ఠించిన యమధర్మరాజుతో పాటు సభికులందరూ తన్మయత్వంతో కళ్లు మూసుకుని రసాస్వాదనలో తేలియాడుతున్న అద్భుత దృశ్యం ఆవిష్కృతమైంది.

అయితే మహాప్రస్థానంలోని 'అవతారం' కవితాఖండికను వింటున్నప్పుడు మాత్రం యముడు ఒకింత కలవరపాటుకు గురికావడం ఒక కొసమెరుపు. ●

## ● హనుమాన్ నానీలు ●

- మెరుగుమాల హనుమాన్ రాజు, ఫోన్ : 9866085279

మోడువారిన
మానవత్వం
మళ్ళీ ఈ జగాన
చిగురించేనా
స్వార్థం
అనకొండలా మింగేస్తుంది
ఈ మనిషిని
మన సమాజాన్ని

వందేమాతరం
నినాదమైంది నేడు
ఈ తరంగుర్చి
ఆలోచించేవాడెవడు
మంచితనమే
ఓ పిచ్చితనం
పిచ్చితనం అనడమే
పిచ్చితనం

ఎంత మింగినా
నిండునా కడుపు
కాంతులను చెరుస్తున్నా
కాంచదే లోకం
మానం చెరిస్తే
మంచోడు
మందిని ముంచితే గొప్పోడు
వీరికి అంతమెపుడు

శాంతికి విఘాతం
పరదేశం కాదు
పరులు కూడా
నావారనే భావలోపమే!
ప్రేమకర్థం
కుంచించుకుపోతుంది
సరిచేసేలోగా
చిరునామా గల్లంతు

# గురు శిష్య సంబంధం

- ఖండవు మన్మథరావు, విజయవాడ. ఫోన్ : 9440943937

"గురువు లేని విద్య గుడ్డి విద్య", "చెప్పే వాడు లేక చెడిపోయాడు" ఈ మాటలు సామన్యంగా అందరం వినే వుంటాం. వీటిని కాస్త విపులీకరిస్తే గురువు లేని విద్య జీవితంలో శిష్యునికి వెలుగు ప్రసాదించదు. వెలుగు అంటే జ్ఞానం, బుద్ధి, ఉత్తమ మార్గం అని గ్రహించాలి. ఆ వెలుగును ప్రసాదించే గురువు స్వచ్ఛంగా కనిపించే సూర్యచంద్రుల్లా ఉండాలి. మనకు కనిపించే సూర్యునికి, చంద్రునికి మబ్బులు అడ్డంగా ఉంటే, తేజోవంతమైన కాంతి కాస్త మసకబారుతుంది. ఇక్కడ సూర్యచంద్రులు గురువులు, కాంతి జ్ఞానం. మబ్బులు గురువుల్లో ఉండే సహజ జ్ఞానాన్ని కప్పిపుచ్చే అవహేళనాది గుణాలు. అంటే ఆశ, కోరిక, అసూయ, అహంకారం ఇటువంటివి. గురువు పారదర్శకంగా నిర్మలంగా, స్వచ్ఛంగా ఉండి అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న తన జాతిని లేదా అందులో కొందరు వ్యక్తుల్ని, జాగృత పరచిన వానిని గురువుగా పరిగణించాలి. గురువు ప్రశంసా పొగడ్తలకు, బహుమానాలు లేదా కానుకలకు లొంగడు.

"అగ్గిపెట్టుందా గురు", "కాస్త జరగండి గురువు గారూ" ఇటువంటి మాటల్లో ఉండే గురు, గురువు అనే వాటికి అర్థాలు అందరికీ తెలిసినవే. వాటిని గూర్చి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అయితే ఇక శిష్యుడెలా ఉండాలీ? అంటే!

గురువు మాటను పవిత్రంగా, పరమావధిగా భావించేవాడు. జ్ఞాన సంబంధమైన సమస్త విషయాలు తెలిసిన వ్యక్తి దగ్గర అనేకులు శిష్యులుగా చేరుతారు. కాని అతని చెంత ఆశించిన జ్ఞానఫలం అందరికీ లభ్యం కాకపోవచ్చు. ఇంకా కొంతమందికి మాత్రమే వారి ఓపిక, సహనము, తెలివి, నిజాయితీ, నిష్ఠ మొదలగు విషయాలను అనుసరించి అది సాధ్యమవుతుంది.

రామలక్ష్మణులకు విద్య నేర్పిన విశ్వామిత్రుడు సామాన్య గురువు కాదు. విశ్వామిత్రుడు అపారబల సంపన్నులైన రాక్షసుల్ని సంహరించడానికి నేర్పిన విలువిద్యాదులు మాత్రమే కాదు. మానవజాతి మనుగడ సాగించినంత కాలం రామలక్ష్మణుల గుణగణాల్ని కొనియాడుతూనే ఉంటాము. వారికి ఆ గుణగణాలు చేకూరడానికి కావలసిన సాధనాసామాగ్రి పొందుపరచిన గురువు విశ్వామిత్రుడని మరచిపోకూడదు. సీతా ఊర్మిళలను వివాహం చేసుకొమ్మని రామలక్ష్మణులకు ఆదేశించింది వారి గురుదేవుడే కదా!

గురువు శిష్యుని ప్రవర్తన, విద్యాసముపార్జన మొదలగు విషయాలను మాత్రమే గమనించడు. నిత్యం వేసే అడుగునీ నిరంతరం గ్రహిస్తాడు.

విద్య విలువ శిష్యుడు సంపూర్ణంగా గ్రహించగలడన్నప్పుడే గురువు దాన్ని ప్రసాదిస్తాడు. బలసంపదతోనో, అధికార స్వరంతోనో ఇంక ఏ రకంగానైనా విద్యలు ఎవరి దగ్గరైన గ్రహించారంటే అవి వారి వినాశనానికి మాత్రమే కారణమౌతాయి తప్ప వారి పేరు ప్రఖ్యాతులు ఇనుమడింపజేసేవి కావు.

రాక్షసుల గురువు శుక్రాచార్యుని చెంత మృతసంజీవిని విద్య నేర్చుకున్న శిష్యుడు కచుడు సామాన్యుడా? దేవతల గురువగు బృహస్పతి ముద్దుల కుమారుడు కదా! సహనం, ఓపిక కచునకు వెన్నతో సహా పెట్టిన తండ్రి బుద్ధికి మారుపేరు. సుగుణాల సంపద రూపమే కచుడు.

నిరంతరం వికృత చేష్టలతో కూడిన రాక్షసుల మధ్య ఉండడం వల్లనో, వారికి విద్యను నేర్పడం వల్లనో, అమోఘ మేధాశక్తి కలిగిన ఆచార్య శుక్రునకు సురాపానం సేవించడం ఒక అలవాటుగా మారింది. దాన్ని గ్రహించిన రాక్షస కుమారులు కచుడ్ని కాల్చి, ఆ బూడిదను సురాపానంలో కలిపి, వారు గురువుగా భావించే శుక్రునిచే త్రాగించారు. తరువాత గురువు గ్రహించాడు. పొట్టలోనున్న కచుడ్ని బ్రతికించి మృత సంజీవినీ విద్యను నేర్పి, పొట్ట చీల్చుకుని బయటకు

## ఆకాంక్ష

- మాదిరాజు శివలక్ష్మి. ఫోన్ : 939537958

ఉరకలు వేసే వయసు ...
పరుగులు తీసే మనసు ....
ఎగసిపడే హృదయం ......
నూతనత్వానికి బాటలు వేయాలని
కొత్తదనాన్ని సాధించాలని ...
ఎక్కడికో ! ఎందుకో ! నీ పయనం !

ర్యాంకుల పోరాటంలో ఓ విజేత!
జీవితపు మధురిమలను మరువకు !
ఎండా - గాలి - నీరు - నిప్పు - ఎంత అవసరమో
జీవితంలో బంధాలు - అనుబంధాలు అంత ముఖ్యం

ప్రేమ, ఆప్యాయతలు కలిగి
కుటుంబ సభ్యులతో మమేకమవుతూ ....
సమాజపు విలువలను కాపాడుతూ....
నీ వ్యక్తిత్వాన్ని ఇనుమడింప చేసుకో !
హృదయమనే బంగారు కోవెలలో
పవిత్రత, నమ్రతలకు పట్టంకట్టు !
అన్ని భాషలూ నేర్చుకో !
మాతృభాషను మరువకు !
తెలుగు భాషా మాధుర్యాన్ని
భావితరాలకు అందించు !
జీవిత పయనంలో నీ నాలుకపై
తెలుగు పదాలను పలికించు -
అదే తెలుగుతల్లికి
నీవందించే మహామణిహారం !



వచ్చాక సంక్రమించిన "మృతసంజీవినీ" విద్యతో తనని బ్రతికించమని శుక్రాచార్యుడు కచునితో చెప్పాడు. గురువు గీచిన గీతను తూచా తప్పని శిష్యుడు, సమస్త ధర్మ పద్ధతులు తెలిసిన కచుడు శుక్రాచార్యుల వారు ఆదేశించినట్టుగానే చేశాడు. గురువు యొక్క అభీష్టానుసారంగా తన విద్యా సముపార్జన పొంది సంతృప్తైన మనస్సుతో గురు దీవెనలు పొంది కచుడు తన దేవలోకానికి వెళ్ళాడు. వేలాది మంది రాకుమారులు, లేదా కుచేల కుమారులు శిష్యులుగా ఉన్నా గురువు అందరికీ విద్యను ఒకే విధంగా బోధిస్తాడు. అందులో ఉత్తములెవరో కూడా గ్రహిస్తాడు.

గురువు చెంత మోసం పొరపాటున కూడా చేయరాదు. ఎప్పుడో ఒకప్పుడు బయటపడక తప్పదు. అప్పుడు అంతవరకు పొందిన స్వర్గతుల్యమైన ఆనందము కూడా నరకం కంటే హీనాతిహీనంగా ఆ జీవితంలోనే కాక అనంతర కాలాల్లో కూడా పొందినట్లుగా ఎన్నో ఉదాహరణలు మన కావ్యాల్లో కనిపిస్తాయి.

ప్రాపంచిక కోరికలు శిష్యుడు గురువుకు చెప్పుకోవడం తప్పు కాదు. తీర్చమని ప్రార్థించడం దోషం కాదు. వేగంగా నెరవేరాలని భావించడం, పరితపించడం సహనాన్ని కోల్పోవడమే తప్పుకు కారణం. కోరికల్లో ఏ కోరిక తీర్చాలో, ఎప్పుడు ఎన్ని తీర్చాలో గురువు నిర్ణయిస్తాడు. అయితే కోరికలు నెరవేరాలనే ఉద్దేశ్యంతో మాత్రం గురువును సేవించవద్దు.

నాకు ధనం, పదవి, భోగాలు, కీర్తి, అధికారం, బంధువులు, సంతానం కావాలి అనేవి ప్రాపంచిక కోరికలు. దేవుడితో స్వయంగా ప్రత్యక్షంగా మాట్లాడి, ఎన్నో లోకాలు చూడాలి, బ్రహ్మజ్ఞానం పొందాలి అనేవి ఆధ్యాత్మిక కోరికలు. ప్రాపంచిక కోరికలు అనుభవిస్తూ ఆధ్యాత్మిక కోరికలకు శ్రీకారం చుట్టి, నెమ్మదిగా ప్రాపంచిక కోరికలు విడిచిపెట్టినవాడు ధన్యుడు.

అనేక ఆశలతో గురువు చెంత విద్యార్థిగా చేరినవాడు, ఆ ఆశ, ఆ ఆశయాలు నెరవేరే విద్యనభ్యసించి గురువు దగ్గర ప్రశాంతంగా శెలవు తీసుకుంటే ఆ విద్యార్థి ఉత్తముడు. తన మనస్సులో నున్న కోరిక నెరవేరిన వెంటనే, గతంలో గురువు పెట్టిన ఇబ్బందులు లేదా బాధలు జ్ఞాపకం చేసుకుని గురువును నిందించి లేదా "ఎలా మోసం చేశానో చూశావా?" అన్నట్లుగా మాట్లాడి వెళ్ళిపోవాలనుకుంటే అది గురువు దగ్గర జరిగే పనికాదు. గురు ఆగ్రహానికి అతడు గురికాక తప్పదు. నెరవేరిందనుకున్న కోరిక నెరవేరదు సరికదా! అసలుకే మోసం ఏర్పడి తనలో సహజంగా ఉండే ఏ కొద్దిమంచి గుణాలు లేకుండా జీవిత గమనంలో అతఃపాతాళానికి చేరుకుంటాడు.

గురు అనుగ్రహం గొప్పది. గురువు ఆగ్రహం అంతకంటే శక్తివంతమైంది. గురు ఆగ్రహానికి కారకుడు శిష్యుడేనని గ్రహించాలి.

కాలం మారింది, మారుతున్నది, ఇంకా మారబోతున్నది. పాతకాలం నాటి మాటల్లా పై మాటలు కొందరకు కనిపిస్తాయి, అనిపిస్తాయి. కానీ గురువు మారలేదు. శిష్యుడు అంతకంటే మారలేదు. ఇద్దరూ ఉన్నారు. కాలానుగుణంగా పాఠ్య గ్రంథాల్లో మార్పులు రావడం సహజం. సారవత్సంస్కారం కలిగిన గురువులు, గురువే దేవునిగా భావించే శిష్యులూ ఈనాటికి ఉన్నారు. ఇద్దరూ పావనలౌతున్నారు. అది ఏ ఒక్కరిలో లోపించినా, కనిపించని కాలానికి లోకాలకు చేరుకుంటున్నారనే విషయం సమాజంతో సంబంధాలున్న ప్రతివారికి తెలుసు.

తల్లిదండ్రులతో సమానమైన స్థానం మన పూర్వీకులచే గురువుకు ఇవ్వబడినప్పటికీ, కొన్నిసార్లు వారికంటే ఉన్నతంగా గురువు నిలుస్తాడు. జన్మను మాత్రం ప్రసాదించే వాళ్ళు తల్లిదండ్రులైతే ఆ వ్యక్తిని ఒక అమోఘమైన శక్తిగా తీర్చిదిద్దేది గురువు. శిలని కళానైపుణ్యంతో శిల్పంగా మార్చేవాడు శిల్పి. ఆ శిల్పాన్ని దివ్యశక్తిగా మార్చేవారిని ఏమంటామో కాస్త మీరు ఆలోచించండి.

శిలలన్నీ శిల్పాలు కావు, శిల్పాలన్నీ పూజ్యనీయం కావు.

శిలనుండి శిల్పంగా, దివ్యశక్తిగా ఎదిగినది శిష్యుడు.

శిలను శిల్పంగా, దివ్యశక్తిగా తీర్చిదిద్దనది గురువు.

అట్టి గురువుకు నిరంతరం నమస్సులు, వాని శిష్యునకు శుభాశీస్సులు. ●

## నేను నువ్వైనట్టు

- సంచి కనకదుర్గా ప్రసాదరావు, నూజివీడు. ఫోన్ : 9866218299

అవి...
వెచ్చదనపు చెలిమితో చలికాచుకున్న రోజులు
స్నేహమాధుర్యాన్ని పంచుకుంటూ
మమతానురాగాలు పెంచుకుంటూ పెనవేసుకుంటూ
తహతహలాడిన రోజులు...
గంటలకొద్ది క్షణాలను మూటకట్టుకున్న రోజులు...

జ్ఞాపకాల గుండెల్లో గూడుకట్టుకుని
గుబుళ్ళపొదలవుతున్నాయి
నిశ్శబ్దపు నీడలై వెంటాడుతున్నాయి
గడిచిన తలపులై
నిన్నమొన్నటి పిలుపులై
అనునిత్యం పలకరించే అద్దంలా...
ఓ తియ్యని పరిమళమవుతుంది !

అప్పుడు నిన్ను కలవని క్షణం
నాకు జీవితం లేదనుకున్నా !
ప్రాణానికి ప్రాణం నువ్వే అనుకున్నా !!
ఎన్నెన్ని కోట్ల క్షణాలైనాయి
మనల్ని దూరం చేసిన అడుగుల గుర్తులై మిగిలాయి

ఏదో ఏదో జ్ఞాపకం...
మానని గాయమైనట్లు,
ఒకే ఆలింగనమై హత్తుకున్నట్లు,
చెరిగిపోని ఆప్యాయతానురాగాల్ని
బతుకు పుస్తకంలో చదువుకున్నట్లు...!

నీ చూపు ఎంత మత్తుగా ఉండేదీ...
నీ చిరునవ్వు ఎంత హాయిగా ఉండేదీ....
అంతరంగం విప్పారని నేత్రమయ్యేది!
విరిసిన ముద్ద మందారం అయ్యేది!!
కంటిభాషై పలుకరించేది...
కనురెప్పల ఊసై పలవరించేది...
నీచేతి చల్లదనమై చిలకరించేది.
నుదుట సోకిన చినుకై సేదతీర్చేది
వెనుక నువ్వొస్తున్నట్లు నేను నువ్వైనట్టు
నువ్వు నేను మనమైనట్టు!!!

# శిథిలమవుతున్న "తెలుగు"

- తరిగోపుల అలేఖ్య

భాషను మనం తల్లి ముఖతః నేర్చుకుంటాం కనుకనే దానిని మనం మాతృభాష అంటాం. అది ఏ భాష అయినా కావచ్చు. తల్లి తన బిడ్డలను ఏవిధంగానైతే నీతిమంతులుగా, విద్యావంతులుగా తీర్చిదిద్ది వారిలో సంపూర్ణ మూర్తిమత్వాన్ని పెంపొందిస్తుందో అలానే మన మాతృభాష అయిన తెలుగుభాషను అభ్యసించిన పూర్వీకులు అన్నిరంగాల్లోనూ ఉన్నతస్థానాన్ని పొందారు. అందుకు విద్యావిధానం మాతృభాషలోనే జరగడం ప్రధాన కారణం. సంప్రదాయ విద్యలను గౌరవించడం, తెలుగువారు తెలుగుభాష పట్ల అపార మైన గౌరవం కలిగిఉండడం మొదలైన వాటివలన మన తెలుగుభాష ప్రాచీన భాషల హోదాలో చేరగలిగింది.

నేటి యువతరం విదేశీభాషను ఆర్జించే మత్తులో మాతృభాషను నేర్చుకో వడం మర్చిపోయారు. కనుకనే తల్లిదండ్రులను, పెద్దలను, గురువులను గౌర వించే సంప్రదాయానికి కూడా తిలోదకాలు వదిలేస్తున్నారు. అంటే మనం భాషను చులకన చేస్తున్నాం. కనుకనే మన జీవితం కూడా నైతిక విలువలులేక శూన్యంగా సాగుతుంది.

**వాడుకభాషగా తెలుగు :** ప్రజలు తమ జీవితావసరాలకు ఉపయోగించే భాషే వాడుక. భాష లేదా వ్యవహారిక భాష. వ్యవహారిక భాషను "జీవద్భాష" అని కూడా అంటారు. అయితే మన వ్యవహారభాష తెలుగు కనుకనే ఆనాటి నుంచి నేటివరకు వెలువడుతున్న సాహిత్యమంతా తెలుగులోనే వెలువడుతున్నవి.

అయితే, ఆ రోజుల్లో పాఠకప్రియులు ఎక్కువ కాబట్టి రచనలు కూడా ఎక్కువగా వెలువడేవి. తద్వారా భాషాజ్ఞానం పెంపొందింపబడుతుంది. మన వాడక భాష తెలుగు కాబట్టి రచనలు వార్తా పత్రికలు, కథలు తెలుగులో వెలువడటం వలన తెలుగుభాష పట్ల ఒక ప్రత్యేకాభిమానం కలగటంతో పాటు పిల్లల్లో సంపూర్ణ మూర్తిమత్వం పెంపొందింపబడుతుంది.

పద్యాలను వల్లెవేయించడం, నీతిచంద్రిక కథలు చెప్పడం, చిన్నచిన్న గేయాలు పాడించడం, ఇంట్లో వ్యవహారాలను నడపడానికి మాతృభాషయైన తెలుగునే ఎక్కువగా ఉపయోగించేవారు. కనుకనే ఆనాటి ప్రజల్లో తెలుగుభాష సజీవత్వాన్ని పొందింది. ఉద్యోగరీత్యా ఇతర భాషలను నేర్చినప్పటికీ తమ భాష లోని మాధుర్యాన్నీ, గొప్పతనాన్ని ఆనాటి ప్రజలు మరువకపోవడం గమనార్హం.

మారుతున్న పరిస్థితుల దృష్ట్యా మనిషి మారాలి. కాని తన అస్థిత్వాన్ని కోల్పోకూడదు. కాని మనం ఆంగ్లభాష మత్తులో మన వాడుకభాషయైన తెలుగును శిథిలావస్థకు చేర్చుతున్నాం. కనుకనే ఈనాటి యువతరానికి నీతిపద్యాలు తెలీవు. నైతిక విలువలు తెలీవు. మాతృభాషకు దూరమైన మనిషి జీవితం పశుప్రాయమవుతుందనటలో ఎటువంటి అతిశయోక్తి లేదు.

మన వాడుకభాషయైన తెలుగు - అచ్చ తెలుగుగా ప్రయోగింపబడక ఇంగ్లీషు - హిందీ - ఉర్దూ పదాల కలయికతో ప్రయోగించబడటం వలన తెలుగు సామాన్య ప్రజానీకానికి దూరంగా మసలుతుంది. అంతేగాక మాతృభాష పట్ల ప్రత్యేకాభిమానం, పట్టుకలవారు ఆ భాష మాట్లాడటంలో తనదైన ఒక శైలిని ఏర్పరచుకొని తదనుగుణంగా సంభాషిస్తారు. అదేవారిని అందరిలో ప్రత్యేకంగా నిలబెడుతుంది. అంతేగాక ఇతర భాషల సాహిత్యాన్ని నేర్చుకోవ డంలో కూడా ఈ శైలి విధానాన్నే అనుసరిస్తారు. అందుకు ఉదాహరణే ఈనాటి ప్రసిద్ధ కవులు, రచయితలు. వీరు తమ వాడుకభాష, మాతృభాషయైన తెలుగును నేర్చుకుంటూ ఆదరిస్తున్నారు. కనుకనే ఈనాటికి సమాజంపై తమదైన ముద్రను వేయగలుగుతున్నారు. కనుకనే వాడుకభాషగా మన మాతృభాషను మాట్లాడుదాం. తెలుగుభాష పూర్వవైభవాన్ని కాపాడుదాం.

**తల్లిదండ్రుల బాధ్యత :**

1. పిల్లలకు చిన్నతనం నుంచి తెలుగుభాష గొప్పతనాన్ని తెలియజేసే అనేక కథలను, మహనీయుల జీవిత చరిత్రలను తెలియజేయాలి.

2. ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత దశలలోని విద్యార్థులకు వాళ్ళ ప్రతిభను పరిధిని అనుసరించి తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు భాషాబలం, భావనాపటిమ పెంపొందేవిధంగా వాళ్ళలో పఠనాసక్తిని పెంపొందించాలి.

3. తెలుగుభాషయైన మాతృభాషను అభ్యసించడం వలన మనం సంపూర్ణ మూర్తిమత్వం గల వ్యక్తిగా తీర్చిదిద్దబడతామని నైతిక విలువలు గల వ్యక్తిగా మలచబడతామని వారికి వివరించాలి.

4. రైమ్స్‌తో ABCD లతో కూడిన విద్యాబోధన కాక అ, ఆలతో చిట్టి చిలకమ్మలతో కూడిన విద్యా వాతావరణాన్ని ఏర్పాటు చేయాలి.

## ● "మానవ మనుగడ" ●

- దోసపాటి నాగేశ్వరరావు, జగ్గయ్యపేట ఫోన్ : 9963316332

ఆధునికత మత్తులో తన దేహానికి
తానే తూట్లు పొడుచుకుంటున్న మనిషి
నిద్రలేచింది మొదలు పక్కమీద వాలేదాకా
పచ్చనోటు మోజు తప్ప పచ్చదనం గురించి పట్టనోడు
అలంకరణ వ్యామోహంలోపడి
భుజాలపై ప్లాస్టిక్కు భూతాన్ని మోస్తూ,
ప్రాణవాయువందక ఆక్సీజన్ మాస్కులకై పరుగులెత్తేవాడు
ప్రకృతి కొండలు కరిగి ప్లాస్టిక్ గుట్టలు మొలుస్తున్నా
చుక్క నీరు లేక భూమాత గర్భం విచ్ఛిన్నమై పోయినా!
ఋతువులు లయ తప్పి నాట్యమాడుతున్నా!
కాంక్రీటు కారడవుల్లో 'తన' సుఖం కోసమే అన్నట్లు
బ్రతుకుతున్నోడు.
ప్రకృతి అంటే పైకి లేచే మేడలే, అని కులికే మనిషి
ఒక్క పచ్చని మొక్కైనా నాటాలన్న జ్ఞాన స్పర్శను కోల్పోయి
తనకు తానే మరణ శాసనం రాసుకుంటూ
బ్రతుకు చివరిలో
కట్టెకు కట్టె కరువవుతుందన్న నిజాన్ని మరిస్తే!
మనిషి మనుగడ ప్రశ్నార్థకమే !

5. చిన్నప్పటి నుంచే తెలుగుభాష పట్ల వారికి శ్రద్ధాసక్తులు కలుగజేయాలి. అంటే పద్యాలు చెప్పడం, వల్లె వేయించడం వంటి క్రియలను తల్లిదండ్రులే ఆచరించాలి.

6. సంస్కృతి సంప్రదాయాల గొప్పతనాన్ని తెలియజేస్తూ వాటిని మనం ఆచరించి చూపించాలి. తద్వారా వారు వాటి గొప్పతనంతో పాటు భాషను నేర్చుకునే అవకాశం కూడా కలుగుతుంది.

7. తెలుగువారమైన మనం ఆంగ్లభాషను ఎందుకు నేర్చుకోవాల్సి వచ్చిందో అవగాహన చేసుకొని అందుకోసం మాత్రమే ఆ భాషను ఉపయోగించి మిగిలిన కార్యకలాపాలకు, సంభాషణలకు మన మాతృభాషను మాత్రమే ఉపయోగించినట్లయితే పిల్లలు కూడా మాతృభాషను నేర్చుకోవటానికి ఎంతో ఆసక్తిని కలిగి ఉంటారు.

8. పిల్లలను కొన్ని సందర్భాలలో పెద్దలైన అనగా అమ్మమ్మ, నానమ్మ, తాతయ్యల దగ్గర ఉంచాలి. తద్వారా వాళ్ళు భాషను మాట్లాడే తీరును మెరుగు పరుచుకుంటారు. భాషతో పాటు మానవ సంబంధాలూ బలపడతాయి.

9. ఇప్పటికే తెలుగు భాషను చదవడం, రాయడం ఎక్కువమంది మరిచిపోయారు. ఇది ఇలాగే కొనసాగితే తెలుగుభాషలోని అమూల్య కావ్యసంపద మన ముందు తరాలకు అందించలేము. ఎందుకంటే వారికి 'తెలుగు' అనే ఒక భాష ఉందని కూడా వారికి తెలియదు కాబట్టి. పిల్లలు తల్లి ముఖతః నేర్చుకొనే భాషే మాతృభాష కనుక తెలుగుభాష పూర్వవైభవాన్ని సంపాదించాలంటే తల్లిదండ్రుల పాత్ర తప్పనిసరి. కనుక మీ పిల్లలకు తెలుగు నేర్పటంలో మీ వంతు బాధ్యతను నేరవేర్చుతారని ఆశిస్తున్నాం.

10. మనిషి మనుగడ సాగించాలంటే- మాతృభాషతో పాటు విదేశీభాషలు, ఇతర భాషలు అవసరమే కాని, మన కన్నతల్లిలాగా ఇంకెవ్వరూ మన ఆలనా పాలనా గురించి ఆలోచించరన్న వాస్తవాన్ని కూడా మనం గ్రహించాలి. ఇది అర్థమయితే మాతృభాషా గొప్పతనం అర్థమవుతుంది.

పై అంశాలను పరిశీలించినట్లయితే భాష నేర్చుకోవడంలో తల్లిదండ్రుల పాత్ర ఎంతటిదో మనకు అర్థమవుతుంది. కనుక భాషా పరిరక్షణలో వారి బాధ్యతను గుర్తిస్తారని ఆశిద్దాం.

**ప్రభుత్వం బాధ్యత :**

1. భాష విషయంలో ప్రభుత్వం నిర్మాణాత్మకమైన నిర్ణయాలతో పాటు, ఒక్కొక్కసారి కఠిన నిర్ణయాలు కూడా తీసుకోవాలి.

2. ప్రైవేట్ స్కూళ్ళ ఆధిపత్యాన్ని తగ్గించి, ప్రభుత్వ స్కూళ్ళను పునరుద్ధరించాలి.

3. మన మాతృభాష అయిన తెలుగును ప్రథమభాషగా అభ్యసించే విధంగా నిర్ణయాలు చేపట్టాలి.

4. పాఠ్య ప్రణాళికలో తెలుగుభాషలేని పాఠశాలలను నిషేధించాలి.

5. ప్రభుత్వ కార్యకలాపాలను మాతృభాషలోనే నిర్వహించాలి.

6. తెలుగును అధికారభాషగా అమలు చేయాలి. అధికార భాషా సంఘం యొక్క తీరుతెన్నులను సమీక్షించాలి. ఎందుకంటే అధికార భాషా సంఘం అధ్యక్షులు మారుతున్న కొద్దీ మన తెలుగుభాషా స్థాయి దిగజారిపోతుంది తప్ప అభివృద్ధి కావటం లేదు.

7. తెలుగుభాషా స్థాయి క్షీణించే దశలో దాని పునరుద్ధరణ కోసం ప్రభుత్వం తీసుకున్న రెండవచర్య ప్రపంచ తెలుగు మహాసభలు ఏర్పాటు చేయటం అయితే ఈ మహాసభల వలన ఎవరికీ లాభం కలిగిందో అటు ప్రభుత్వానికి ఇటు ప్రజలకు బాగా తెలుసు. కాబట్టి అలాంటి పొరపాట్లు జరగకుండా కేవలం నిర్మాణాత్మకమైన దృష్టితోనే తెలుగుభాషా అభివృద్ధికి పాటుపడాలి.

8. తెలుగుభాషను అభ్యసించే వారికి కూడా ఉద్యోగ అవకాశాలను ఎక్కువగా కల్పించాలి. ఎందుకంటే సైన్స్, ఆంగ్లభాషవల్ల ఎన్ని ప్రయోజనాలున్నాయో, అంతకంటే ఎక్కువ ప్రయోజనాలు మన భాష వలన ఉన్నాయని ప్రభుత్వం అర్థం చేసుకోవాలి.

"ఉయ్యాలలూగించు ఒయ్యారి సీసాలు
తెలుగుటూయెల కవ్వితెగని త్రాళ్ళు
ఆచారములు తెల్పు ఆటవెలది జాలు
తెలుగుటావులొసంగు తేటపాలు
తేనెసోనలు చిమ్ము తేటగీతి పదాలు
తెలుగుమబ్బులు చిమ్ము తీపిజడులు
అందాలు చిందుంచు కందార్థాల విందు
తెలుగుపాపల పల్కు తేనెలందు
పద్యమన్నది వేయేండ్ల పసిడిపంట
పద్యమన్నది తెలుగింటి పాడిపంట
తెలుగు పద్యమ్మె పాడుము తెలుగుబాల
తెలుగు తేజమ్ము వెలయంగ దిశల మ్రోల

ఈ పద్యం ద్వారా తెలుగుభాష గొప్పతనం భాషలోని మాధుర్యం తేటతెల్లమవుతుంది. కాబట్టి భగవద్గీతలో చెప్పినట్లుగా

'యద్యదాచరతి శ్రేష్ఠ తత్తదేవో తరో జనాః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే' అన్న గీతాసూక్తిని అనుసరించి తెలుగుభాషను నేర్పించడానికి ఉపాధ్యాయులుగా మనం ఆదర్శప్రాయంగా ఉందాం. తెలుగు భాషాభివృద్ధికి తెలుగువాడిగా కృషి చేద్దాం. అమ్మలాంటి తెలుగుభాషను మృతభాషల్లో చేరకుండా కాపాడుకుందాం. ●



# అనాలోచనలో - యువత

- యం. అంజయ్య, విజయవాడ. ఫోన్ : 9247897840

అవినాష్ సున్నితమైన మనస్సు కలవాడు. ప్రతిరోజూ చిన్న చిన్న విషయాన్ని తనకున్న పరిజ్ఞానంతో తీవ్రంగా ఆలోచిస్తాడు. చిన్న వస్తువు పోయినా దొరికేవరకూ తెగ ఆలోచించి మనసు పాడు చేసుకుంటాడు. దొరకకపోతే ఏడుస్తాడు కూడా. తల్లిదండ్రులు ఎంత నచ్చజెప్పచూసినా వినేరకం కాదు. ఓరకంగా మానసికరోగిలా ప్రవర్తిస్తాడు. అవినాష్ ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతున్నాడు. కాలేజి దూరం కావడం వల్ల వారు పల్లెటూరి నుండి పట్నంకు బస మార్చినారు. తమ ఏకైక కొడుకును బాగా చదివించి మంచి ప్రయోజకు డిగా మార్చాలని తల్లిదండ్రులు భావించి పట్నంకు వచ్చి చిన్న పోర్షన్ అద్దెకు తీసుకొని ఉంటున్నారు. కాలేజికి దగ్గరలోనే ఇల్లు ఉండటం వల్ల అవినాష్ ప్రతిరోజు సైకిల్‌పై వెళ్ళి వస్తున్నాడు. కాలేజీ ముగియగానే ఇంటికి వచ్చి వున్న వర్కును శ్రద్ధగా పూర్తి చేసుకుంటాడు.

అవినాష్ ఎందుకో కొన్నిరోజుల తరువాత చదువుపట్ల శ్రద్ధ తక్కువగా చూపడాన్ని తల్లి గమనించింది. తండ్రి ఉద్యోగరీత్యా కువైట్ వెళ్లడం జరిగింది. వెళ్ళిన నాన్న పదేపదే గుర్తుకు రావడం, సొంత ఊరు విడిచి పట్నం రావడం, పాత స్నేహితులు గుర్తుకురావడం వంటి కారణాలు అయుండవచ్చునని తల్లి భావించింది. కాలేజీలో మొదటి యూనిట్ పరీక్షలు జరిగాయి. అతనికి మార్కులు సరిగ్గా రాలేదు. మాస్టార్లు మార్కులు చెబుతూ భవిష్యత్తులో ఇలా జరగరాదని హెచ్చరించారు. మాస్టార్లు తరగతిలో తోటి అబ్బాయిలు, అమ్మా యిల ముందు అనడం, వారు నవ్వడంతో అవినాష్ మనస్సు ఎందుకో చివుక్కు మంది. ఒకరిద్దరు తనతో సన్నిహితంగా ఉండేవారు. నీవు చదువులో ఎందుకు వెనకబడిపోతున్నావని ప్రశ్నించడం కూడా అవినాష్‌ని సూదులతో గుచ్చినట్లని పించింది. ఒకరోజు లెక్కల్లో తక్కువగా మార్కులు రావడం వల్ల నిలబెట్టి తీవ్రంగా మాస్టారు మందలించారు. ఆరోజు ఇంటికి వెళ్ళిన అవినాష్ అమ్మతో మాట్లాడలేదు. సరిగ్గా అన్నం కూడా తినడం లేదు. మర్నాడు కాలేజికి కూడా వెళ్ళలేదు. తల్లి ఎంతగా బ్రతిమలాడినా, నచ్చజెప్పినా వినలేదు. భోజనం కూడా చేయలేదు. కాలేజీలో తనకు జరిగిన అవమానం తలచుకొని మనస్సులో కలిగే సంఘర్షణతో సతమతమవుతున్నాడు.

దీనికి "మరణం" ఒక్కటే పరిష్కారమనుకున్నాడు. మరునాడు కాలేజికి వెళితే తనను అందరూ చిన్న చూపు చూస్తారని తనకు తాను తీవ్రంగా ఆలోచించడం మొదలుపెట్టాడు.

అతి కష్టంగా తల్లి ఒత్తిడి చేయడం వల్ల కాలేజీకి వెళ్ళాడు. సాయంత్రం యథావిధిగా కాలేజి నుండి ఇంటికి బయలుదేరాడు. రకరకాల ఆలోచనలతో సంద్రంగా మారిన అవినాష్ హృదయం ఇంటికి వెళ్ళటానికి మనస్కరించలేదు. దాదాపు ఇంటిదగ్గరగా వచ్చిన అవినాష్ తన సైకిల్‌ను మరొక మార్గం వైపు తిప్పినాడు. తను ఏ వైపు ఎక్కడికి వెళుతున్నాడో అన్న ఆలోచన లేకుండా రెండు కిలోమీటర్ల దూరం వరకు వచ్చాడు. అక్కడ ఉన్న గుట్టపై ఎక్కి కూర్చొని ఆలో చించడం మొదలుపెట్టాడు. ఏమి చేయాలో ఎక్కడికి వెళ్ళాలో ఆలోచన లేదు.

అక్కడ కూర్చొని తల్లిదండ్రులను గుర్తుచేసుకొని బాగా ఏడ్చాడు. కన్నీటి ధారలైన కళ్ళు ఎర్రగా మారి తనలోని ఆవేశానికి మరింత ఆజ్యం పోసినట్లు అనిపించింది. బ్యాగ్ నుంచి తెల్లకాగితం తీసి తన భావాలన్నింటిని ప్రోగుచేస్తూ రాశాడు. రాసిన కాగితాన్ని తన సంచిలో పెట్టేసి అటుఇటు చూసి ఎవ్వరూ చూడటం లేదని గ్రహించి గుట్టపై నుంచి దూకేశాడు. తనవారికి ఫోన్ చేసి తన వారికి ఫోన్ చేసి తన చావు విషయం తెలియజేయవల్సిందిగా ఫోన్ నెంబరు కూడా వ్రాశాడు. ఉదయం గుట్ట దగ్గర అవినాష్ "శవం" పడి వుండటంతో అక్కడికి పనికి వెళ్ళిన కూలీలు పోలీసులకు సమాచారం అందిం చారు. తల్లి కొడుకు 'మరణవార్త' వినగానే ఒక్కసారిగా కుప్పకూలిపోయింది. ఆమె మానసిక స్థితి చూసి తండ్రి నిలువెల్లా చలించిపోయాడు. కొడుకు 'మరణం' ఆ కుటుంబానికి తీరని శోకాన్ని మనోవేదనని మిగిల్చింది.

అవినాష్ మరణం ద్వారా చదువుపట్ల విద్యార్థినీ, విద్యార్థులను మంద లించే తీరు కఠినంగా ఉండరాదని, కౌన్సిలింగ్ చేసేదిగా ఉండాలని, వ్యక్తిగతంగా ప్రతి విద్యార్థి మనస్తత్వాన్ని అంచనా వేయవలసిన బాధ్యత తల్లి దండ్రులకి, ఉపాధ్యాయునికి, సమాజానికి ఉంటుందని తెలుస్తుంది. సున్నిత, భిన్న మనస్కులను పసిగట్టి వారి పట్ల ప్రేమాప్యాయతలు కనబరిస్తే యువత అనాలోచనలతో 'ఆత్మహత్య'లకు ముందుకు వెళ్ళరని మానసిక నిపుణులు, విద్యావేత్తలు అంటున్నారు.

"నేటియువత రేపటి భారతానికి వెలుగురేఖలు" వంటివారు. అలాంటి యువత ఆత్మహత్యలకు పాల్పడటం చాలా బాధాకరమైన విషయం. ఇప్పటి మన సమాజంలో ప్రతిరోజు ఎక్కడో ఒకచోట ఇలాంటి దుర్ఘటనలు జరుగుతూనే ఉన్నాయి. ఇది చాలా విచారకరమైన విషయం.

నేటి యువత స్వామి వివేకానందుని బోధనలను స్ఫూర్తిగా తీసుకొని ముందుకు సాగాలి. "బలమే జీవనం బలహీనతే మరణం" అని గ్రహించాలి. ప్రతి విషయంలోనూ తీవ్రమైన నిర్ణయాలకు, పనులకు పాల్పడకుండా భవిష్యత్తు ప్రణాళికలు వేసుకుంటూ వాటిని సాధించడానికి ప్రయత్నం చేయాలి. తద్వారా దేశానికి, వారి కుటుంబానికి ఎంతగానో మేలు చేసినవారు అవుతారు.

"సంస్థలలో పనిచేయవలసినవారు
శ్మశానాలకు శవాలై చేరుతున్నారు
తల్లిదండ్రులకు ఆనందం పంచవలసినవారు
దుఃఖాన్ని మిగిల్చి బూడిద అవుతున్నారు"

"ఆత్మహత్య"కు పాల్పడేముందు "ఆత్మ పరిశీలన" చేసుకొని అందరికి "ఆప్యాయత" పంచేలా ఆలోచించాలి యువత.

"ఓ యువత! ఉంది నీ చేతిలో మనదేశ భవిత.
ఇది కావాలి నీకొక చరిత విడువు ఆ శూన్యత".

"విద్యార్థులే ప్రగతికి మూలం కావాలి వారి ఆలోచనలు ఒక సమాహారం".

"సర్వేజనా సుఖినోభవంతు"

# "సమానంధనం" - పోతనతత్వం

- డా॥ కొమాండూరి కృష్ణ, విజయవాడ. ఫోన్ : 9246434485

పదిహేను పదహారు శతాబ్దాల మధ్యలో మనదేశం విదేశీయుల దండ యాత్రలకు లోనైంది. అప్పుడు కాశ్మీరం నుండి కన్యాకుమారి దాకా నూత నోత్తేజంతో సాంస్కృతిక ఆధ్యాత్మికరంగాలే ప్రధానంగా ఉద్యమాలు ప్రారంభ మయ్యాయి. అన్ని భారతీయ భాషలలో భక్తి సంప్రదాయ ప్రభావం కనిపించినా ముఖ్యంగా "భాగవత భక్తి" ప్రభావం ప్రస్ఫుటంగా కనిపించి ప్రత్యేకతను సంతరించుకుంది.

మహావటవృక్షం వలె వ్యాపించిన భాగవత సంప్రదాయంలో మూలస్తంభా లుగా నిలిచిన మహామహులెందరో!. రామదాసు, తులసీదాసు, కబీరుదాసు, మీరదాసు, సూరదాసు, త్యాగయ్య, క్షేత్రయ్య.... ఇలా ఎందరో! వారిలో అగ్రేసరుడు పోతన. ఇహభోగాలకు దాసుడు గాక సమతత్వం, సమైక్యతల భావనాబలాన్ని ప్రజలకందించిన విశాలాంధ్రుడు.

ఆదాన, ప్రధాన, పఠన లేఖన, శ్రవణ, ధారణ ధ్యానాదులు తెలుగులో ఇంతగా ఆదరణీయమైనాయంటే అది పోతన పుణ్యఫలమే అనడంలో అతిశయోక్తి లేదు. ఇతర భాగవతాలెన్ని వెలసినా పోతన భాగవతానికున్న బలం, ప్రచారం విశ్వజనీనత సాహిత్యంలో మరే గ్రంథానికీ లేకపోవడానికి కారణం ఆయన విశదీకరించిన సమానత్వ, సమైక్యతా భావనలే. అంతేకాదు పోతన తన అనుభవంలో ఎదుర్కొన్న కష్టాలకి సమాధానమైన సామ్యవాదాన్ని 'కృష్ణ'కథలో దర్శింపచేసాడు.

కుర్చీ జారిపోతోందంటే కడుపుమంట, అక్కసు, ఉక్రోషం వగైరాలు మానవ సమాజ మానసిక దురవస్థలు, వెక్కసపు మాటలు, వెక్కిరింత చేష్టలు... ఇవన్నీ భీష్మ ద్రోణాది కురు వృద్ధుల నుండి ప్రజా జీవనంలో పలు దశాబ్దాలుగా (యుగాలుగా) నరనరాల్లో ప్రవహిస్తూ వస్తున్నా అవేవీ పట్టని, యోగభ్రష్ఠ మన పోతన. "నిరాశ్రయాః నభోభంతే పండితాః వనితాః లతాః అని లోక వ్యవహారం. సుప్రసిద్ధం కూడా. అందునా పండితులకు పరాశ్రయం జీవనాధారం కాక తప్పదు. పండితులు సహజ సంపన్నులైతే తప్ప పాండిత్యాన్ని జీవిత సాధనంగా చేసుకొని బతకడం కష్టం. వారి ఆశ్రయంలో వున్నప్పుడు సత్కార, ఛీత్కారాలను సమానంగా భరించాల్సి వుంటుంది. (శ్రీనాథుడు) "ఇష్టాయ పూర్ణాయచ కర్మహేథాన్ దారాన్ అపల్యాయ తపోద్ధమాయుః" అనే సూక్తి వుండనే ఉంది. నానా కష్టాలు పడి బాధలను దిగమింగుకున్న బాణభట్టు వంటి వారు మనకు కనిపిస్తూనే ఉన్నారు. అందుకే వారందరూ బయటకు చెప్పకపోయినా చివరి దశలో 'రాజులు', ధనవంతులు... మొ॥గు పెత్తందారీ శక్తులను తీవ్రంగా నిరసించి సమానత్వ సమైక్యతా భావనా బలాన్నే ప్రోత్సహించారు.

పోతన ధనము అధికారము అనేవి అనర్థదాయకాలని నమ్మినవాడు. "యౌవనం, ధనసంపత్తేః ప్రభుత్వ మవివేకితః. ఏకైకమప్యనర్థాయ కిమప్యత్ర చతుష్టయం". అనే ఈ నాలుగు హానికరమని భావించి ఆ భావననే భాగవతంలో కృష్ణుని పాత్ర ద్వారా చెప్పించారు. అలాగే వామనమూర్తిచే "కారే రాజులు రాజ్యముల్ గల్గవే. సర్వోన్నతిం బొందరే...." వారేరి సిరిమూటం గట్టుకొని పోవం జాలిరే... అంటూ ధన కేంద్రీకరణను, ఆ అధిపతులనూ తీవ్రంగా నిరసిస్తూ సంపద అందరికీ చెందాలని చిన్ని కృష్ణుని చిలిపిచేష్టల (కృష్ణలీలలు) ద్వారా "రోలుపీటలు నొక్కపోవిడి ఎక్కి..." తెలిపాడు. ఆ భావనలను పెద్దలు చిన్న వయసునుండే పిల్లలకు నేర్పాలని యశోద పాత్ర ద్వారా తెలియచేశాడు. గోపికలు "ఓయమ్మ నీ కుమారుడు మా ఇండ్లను..." అని ప్రశ్నిస్తే అందుకు యశోద "యస్మా" అస్త్రాన్ని ప్రయోగించక గోపికలతోనే కలిసి ఉండటం అనేది. ఆ విషయాన్ని పోతన వివరించిన తీరును గమనిస్తే పోతన సమానత్వ భావాలను ప్రజలకందించటానికి ఎంత తాపత్రయపడ్డాడో పండితులకే కాదు అతి పామరుడికి సైతం అర్థమవుతుంది.

"గర్వేశ్వరత్వం, అభినవయౌవనత్వం, అప్రతిమరూపత్వం, అమానుష శక్తిత్వం చేతి మహతీయం ఖలు అనర్థ పరంపరా సర్వ వినయానాం. ఏకైక

మప్యేషామాయతినం కిమతి సమవాయః" అన్న శుకనాసోపదేశంలోని నిర్వేదాన్ని నవవిధ భక్తితత్వాల ద్వారా, ఆ భక్తుల ద్వారా మరీ ముఖ్యంగా ప్రహ్లాదుని పాత్రద్వారా మనకు ప్రదర్శింపచేశాడు.

"రాజుల్ మత్తులు, వారి సేవ నరకప్రాయమ్ము..." అనే నిర్ణయానికి రాకముందే (అనుభవించి) బాల్యం నుండి అనగా బాల్య రచనా వ్యవస్థలోనే భోగాలను త్యజించాడు. ఆ భావనలనే ప్రహ్లాదుని నోటిద్వారా చెప్పించాడు. అంతేకాదు అసలు పోతన తన భాగవతాన్ని యథాతథంగా గాక స్వతంత్ర కావ్యంగా రచన చేయడానికి కారణం తన సమానత్వ సామ్య భావనలను ప్రజల నరనరాల్లోకి పంపించాలనే.

స్వతంత్ర్యం సంపాదించుకున్న తరువాతే ధనికుల దుర్మార్గాలనీ, యాచకుల నీచానుసంధానాన్ని నిరసించి అట్టి (అధికార) యాచకులను ఆంధ్రులందరిచే 'ఛీ' అనిపించగలిగాడు. "ఇమ్మనుజేశ్వరాథములకు...." అనే పద్యంలో ఇది స్పష్టం. కాటుక కంటినీరు మొ॥న పద్యాలు పోతన నిరాడంబరత్వానికీ, రాజద్వేషానికీ, మానవులలోని అసమానతల నిరసనకూ ఉదాహరణలు. "బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్.... కూళల కిచ్చి అప్పుడుప్రకూడు భుజించుటకంటే సత్కవుల్ హాలికులైన నేమి గహనాంతర సీమల కందమూల కౌద్దాలికులైన నేమి నిజదారసుతోదర పోషణార్థమై... ఇది కేవలం వ్యక్తిత్వానికి ప్రతీక మాత్రమే కాదు ఇతరులు కూడా స్వయంకృషిపై జీవించాలనే పోతన ఆశకు నిదర్శనం.

సుఖంగా బ్రతకడానికి ప్రకృతి యిచ్చిన సౌకర్యాలు చాలా ఉండగా, దీనులై తన ఆత్మగౌరవాన్ని చెడగొట్టుకొని బ్రతకడం కష్టమని పోతన భావించే "కమనీయ భూమి భాగములు లేకున్నవే పడియుండుటకు దూది పలుకులేక.... ధనమదాంధుల కొలువేల తాసులకు..." అని ప్రబోధించాడు. పరమాత్మ (శక్తి) "ఇందుగలడందులేడను సందేహము వలదు... ఎందెందు వెదికి జూచిన అందందే గలడ"ని నిరూపించాడు. ఈ పద్యాలన్నీ భక్తి భావంతో చెబుతూనే రాచరిక భావాలను నిరసిస్తూ సమానత్వ ప్రతిపాదికలకు ప్రతినిధ్యులుగా నిలిపాడు. బలి చక్రవర్తి మాటలలో "రాజులు గర్వించడం వ్యర్థము" అని తెలిపి వామనులైనా (సామాన్యులు) "బ్రహ్మాంత సంవర్ధులవుతార"ని తెలుపుతూ స్థూలపరమాత్మ తత్వాన్ని పాఠకులముందుంచాడు పోతన.

మన జాతిని, సంస్కృతినీ, వరవంశ భావాలను మనమే రక్షించుకోవాలంటాడు పోతన. ఇతరులకు అవకాశమిచ్చి ఆహ్వానిస్తే కలిగే అనర్థాలను రాక్షస (కథ) పాత్ర ద్వారా స్పష్టం చేస్తూ మన చెంత వున్న రాక్షస స్వరూపాలను గుర్తుకు తెచ్చేట్లు చేస్తారు పోతన. అలాంటి దుష్టశక్తుల నుండి ఎలా బయటపడాలో, ఆ మార్గాలను బాల్యం నుండే ఎలా పెంపొందించాలో దశమస్కంధంలోని బృందావనంలోని గోపాలకుల ద్వారా దర్శింపచేశారు.

గోవులను అడవిలో విడిచిన తర్వాత గోపాలకులు నేర్చుకొనే అనేక విద్యలు, కలిసి మెలిసి చేసే పనులను గమనిస్తే ఇది స్పష్టం. "కప్రలమై జలరాశి గట్టుదమా... మునులమై తపములు మొనయుదమా!... అప్సరోజనులమై యాడుదమా... అమర దైత్యవరులమై 'యబ్ధి'ద్రత్తమా... (కష్టించి అమృత (ఫలితాన్ని) తత్వాన్ని పొందుదామా!) "ఒకానొకని చల్ది కావడి... నకడొకడది దెచ్చియిచ్చు. (మన అన్నపూర్ణను తీసుకొని పోదామన్నా మరొక మహాత్ముడు మనదాన్ని మనకి ఇప్పిస్తాడు) ఇలా కలసిమెలసి సమైక్యతతో, సంఘీభావంతో సమస్యలను ఎదుర్కొనే శక్తిని పెంచుకొని వుంటే మన రాజ్యాన్నీ, భోజ్యాన్నీ మనకి మహాత్ములు సాధించి పెడతారనే మహత్తర సందేశాన్ని మనకందించారు పోతన. ఆయన భావనాబలమే పోదిగా యువత ముందుకు సాగుతుందని ఆశిద్దాం.

## యుగద్రష్ట వేమన

- కె. గౌరినాయుడు.

భూస్వామ్య వ్యవస్థ బహుకస్మిలంగా
ఉన్న దుర్భర సమయంలో పరపీడన ప్రారంభమై
తలలు కోసి నెత్తురు తాగుతున్న సమయంలో
బలాఢ్యుడు బలహీనుడ్ని ముక్కలు చేసి
ఉప్పులో నంజుకుతింటున్న సమయంలో
మనతల్లి, మన చెల్లి, మన ఇల్లాలు - స్త్రీని కట్టు
బానిస చేసి

ఇనుపపెట్టెలో దాచేస్తున్న సమయంలో
ఇలాంటి దురాంతాలను చూసి
పరిమార్చే దృష్టితో అవతరించిన మహనీయుడు
ఆయనే మన వేమన యోగి !

ఆయన నడుస్తుంటే పాపభూయిష్ట భూమి
సిగ్గుతో తలవంచుకునేది

నిలబడిన చెట్లు గజగజవణుకుతూ నమస్కరించ బోయి
చెంపలు చెడామడా వాయించుకున్నాయి
ఆ పిలపిల ధ్వనులకు పరిసరాలు విస్తుపోయి చూశాయి
అదిగో అతడే మన వేమన
పీడిత జన బంధువు
అసత్యాల ప్రథమ శత్రువు

వస్తున్నాడిటకై మోర్చండి
పూలు అందుకొని ఆయన తలపై జల్లండి
అని తోటలు, అడవులు, పొలాలు పెద్ద పెట్టున
హెచ్చరికలు వినిపించాయి
ఆయనే మన వేమన యోగి !

మనకోసం అవతరించిన మన వేమన
ఈ అవతార పురుషుడ్ని చూసి

తలలు చెంగులతో మూసుకొని
ఎవరా మహనీయుడు, ఎవరా అవతారపురుషుడు
చేతిలో ఏం ఆయుధం ఉంది
వాక్శుద్ధితప్ప, సంకల్ప సిద్ధితప్ప?
ఆ మహనీయుడే వేమన యోగి.

గత స్మశాన వాటికలు పరీక్షించి చూశాడు
భావితరాల పురిటిగదులు పరిశీలించాడు
ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండు అన్నాడు
అని ఊరుకోలేదు
కంటికి కనిపించే ఆ రెండు పదార్థాలు రుచి చూస్తే జాడవేరే
ఉప్పు ఉప్పు, కర్పూరం కర్పూరమే
ఆ మహనీయుడు వేమన కర్పూరంలా వెలిగాడు
ఆయన దర్శనం సర్వంకష దర్శనీయం
ఆయన వాక్కు సర్వలోక హర్షనీయం

# వివేకం

- కె.వి.ఎస్.ఎన్. హనుమచ్ఛాస్త్రి. ఫోన్ : 9849041689

మేమొక మొక్కని మా పెరట్లో నాటాము. ఉదయం లేచినప్పుడు దానికేసి చూసి మొదట్లో నీరుపోసి, మీసం దువ్వుకునేవాణ్ణి. దానిపేరు "వివేకం". అది పెరిగి పెద్దవుతున్న కొద్ది నాకు ఉత్సాహం. మా పెరట్లోకి రావటానికి ముందు అరవాయన పెరట్లో ఉండేది. సరిహద్దు గోడలు లేని పాతకాలంలో మా పెరట్లోకి దాన్ని తెచ్చుకోవటాన్ని అరవాయనతో పెద్ద రాద్ధాంతం చేయాల్సి వచ్చింది. గొడవలు పడాల్సి వచ్చింది. మొత్తానికి దీక్షతో దక్షతతో తెచ్చు కొచ్చాము. కౌమారప్రాయంలో ఉండగా పెద్ద గాలి దుమారం. దాని కొమ్మలలో రెండు కొమ్మలు ఊగిస లాడాయి. ఉత్తరాది పెద్దావిడ కాయకల్ప చికిత్స చేసి వివేకాన్ని నిల్పింది. ఆ దుమారానికి మా ఊళ్ళో పెద్దతలకాయలు ఎగిరి పోయాయి. అయినా మా చెట్టు వివేకం నిలిచింది.

ఆ తదుపరి విస్తరించింది. మావాళ్ళందరికో మంచి నీడనిచ్చింది. ఈ మధ్యకాలంలో దానిపై కొన్ని కాకులు వాలి గోలచేయడం మొదలెట్టాయి. కాకుల పెంపకంలో పెరిగిన కోకిలలు కూడా వాటితో తమ విలువైన తీయని గొంతు కలిపాయి. కొమ్మ మళ్ళీ వూగుతోంది. వివేకాన్ని భ్రష్టత్వం పట్టించేలా కనిపిస్తోంది. ఏ కొమ్మపైనున్నా కాకి కాకే కదా కాకుండా పోతుందా? ఏ కొమ్మకా కొమ్మ నరుక్కుపోతే వివేకం నశించకుండా ఉంటుందా? కాండం అండలేకుండా కొమ్మలు చిగురించగలవా? జగన్నాటక సూత్రధారి ఏదో ఒకటి చేయకపోతాడా అని ఎదురుచూశాం. ఆయన షట్ సూత్ర ప్రణాళిక పాటిస్తే చెట్టు చిరకాలం విరబూస్తుందన్నాడు. ఆ చెట్టు కొమ్మల్ని, చెట్టును చిరకాలం కాపాడమని మన మోహన పరమేశ్వరుడ్ని వేడుకొంటున్న తెలుగువాణ్ణి.

# జనకవి వేమన

- డా॥ జాటూరు షరీఫ్, అనంతపురము. ఫోన్ : 9441111053

కాలరేఖల మనసు మడమల్లో నిత్యం గుబాళించే పద్యపారిజాతం వేమన 'ప్రజాకవి' లాంటి అరుదైన బిరుదు కేవలం వేమనకే సొంతం. నీతిశతక సాహిత్యానికి తోరణం కట్టిన తొలికవి వేమన. సుకవులు జీవింతురు ప్రజల నాలుకలపై అన్న సూక్తిని అక్షరాల నిజంచేసిన కవి వేమన. వేమన పలుకులు, పద్యాలు, కాలసీమను జయించిన సార్వజనీన సత్యాలు !

అన్ని కాల సమాజాలకు వర్తించే ప్రాసంగిక నికషలు ! పద్యాలకు పరవళ్ళు తొక్కించి, తెలుగు సాహిత్యానికి వన్నెలు దిద్దిన మరుపురాని మరువలేని కవి పుంగవుడు వేమన. నీతి పద్యాలకు చెరగని చిరునామాగా నిలిచి ప్రజల మనసు మైదానంలో నిత్యం నడయాడే సత్కవి వేమన.

పదునైన పద్యాస్త్రాలతో ప్రజలను కదిలించిన చైతన్యపు కెరటం వేమన. తెలుగు సాహితీ శిఖరంపై నిత్యం రెపరెపలాడే ప్రబోధ పద్యబావుటా వేమన.

తెలుగు పద్యానికి సామాజిక పరిమళం అద్దిన తొలి సామాజిక విప్లవకవి వేమన. నాటి సామాజిక సమగ్ర చిత్రాన్ని అక్షరాలతో ఆవిష్కరించిన అక్షరశిల్పి వేమన.

లోకరీతుల్ని, నీతుల్ని, సూక్తులను, సూత్రాలను, పండితులకు, పామరు లకు అర్థమయ్యే రీతిగా సరళంగా, సూటిగా పద్యాలు అల్లిన జనకవి వేమన. సామాజిక రుగ్మతలను, మూఢాచారాలను, సంకుచితాలను ఎండగట్టి అక్షర కొరడా ఝుళిపించిన తొలి ప్రగతిశీలకవి వేమన. భావిపద్య పథానికి ఆలోకితం చేసే వెలుగురేఖ వేమన.

## నానీలు

- బొమ్మరాత యల్లయ్య. ఫోన్ : 9502051996

తెలుగు భాష
సజీవం
చదువురాని
పల్లెల్లో -

నిలువెల్ల
వికసించా
వాలింది
సీతాకోక -

ఇద్దరం
పోరాడాం
మిగిలినవి
తుపాకులే -

పిడికిలితో
పసికందు

పుడుతూనే
పోరాటం -

చల్లాడు
చంద్రుడు
వెన్నెల
కళ్ళాపి -

చరాస్థి
బోలెడు
స్థిరాస్థి
ఆరడుగులు -

తూరుపు
తలుపులు
తెరిచాయి

కాకులు -
ఉన్నోడు
లేనోడు
కల్సుకున్నారు

మట్టిలో -
పెట్టింది
చిచ్చు
స్నేహంలో
ప్రేమ -

బతికించిన
భాష
బతికించమని
ఘోష -

## వలస జీవులు

- ఆత్మకూరు రామకృష్ణ, విజయవాడ.

కరువు కమ్మిన గ్రామం
మండని పొయ్యికి దొరకని బత్తెం
మండే గుండెలకు ఆకలి భారం
తట్టాబుట్టా సర్దుకొని
కట్టుబట్టలతో వలసొచ్చిన వారికి
కటిక నేలే శరణ్యం ..
నేటికి ఈనేల .....
రేపటికి యాడో ... ! అంటూ
పిలవకనే పిలిచినట్లు
పట్టణానికి వలసొచ్చి, వాలిన అతిథులు
జానెడు జాగా దొరికితే
జీవన యోగ్యంగా మలచుకొనే
కళానైపుణ్యం, నేర్పిన విశ్వకర్మ ఎవరోగాని
వీరి కరువు కష్టాలను తీర్చి
పల్లెదారి చూపే నాథుడే లేడా .... !?

# భాషాకృతిలో ఒదగాల్సిన కథాక్రమం

- వడలి రాధాకృష్ణ, చీరాల. ఫోన్ : 9985336444

"ఇటాలియన్ ఆఫ్ ద ఈస్ట్" అని ప్రస్తుతింపబడిన అనంతమైన చారిత్రక నేపథ్యం కల్గిన అమృత తుల్యమైన భాషగా గణతికెక్కిన భాష మన తెలుగుభాష.

ఎన్నో కాలాలను, మరెన్నో కాలప్రభులను, చారిత్రక అనివార్యతలను రికార్డు చేసి వాటికి కొంతరసస్ఫూర్తిని, అరుదైన అంతరాకృతిని ఆపాదించి పెట్టగల్గిన ఈ అమ్మభాష కాలక్రమాన మెరుపుల మాటు మరకలతో కాంతి విహీనం కావడం ఎంతో బాధాకారం. చెప్పాలంటే తెలుగు చదవడం, మాట్లాడటం అనేవి ప్రస్తుతకాలవాసులకు నామోషిగా తయారుకావడం చాలా దురదృష్టకరం.

చిద్విలాసమై నిరంతరంగా మెరవాల్సిన తెలుగుమూలాలను, తెలుగులోని ఇతిహాసాలను, తెలుగు అనురక్తులను చిదిమేసి విసిరేయబూనడం ఎన్నటికీ క్షమింపరాని విషయం. చెప్పాలంటే ఎంతో ఘోరమైన తెలుగు ఉచ్ఛారణలు మన తెలుగునాట, తెలుగుబిడ్డలనోట వినే దౌర్భాగ్యం దాపురించడం ఎంతో బాధాకరంగా పరిణమిస్తుంది.

ఈనాటి టెలివిజన్ కార్యక్రమాలలో, యాంకర్లు ఉపయోగిస్తున్న భాష చూస్తున్నవారికి అదే ప్రామాణికమై భాషగా పరిణమిస్తోంది. అదే సిసలైన తెలుగు అన్న తప్పుడు సంకేతాలను అందజేస్తోంది కూడాను.

చెప్పుకోవాలంటే మన పొరుగు రాష్ట్రమయిన తమిళనాడుతో సహా కొన్ని రాష్ట్రాలలో ఉన్న భాషా ప్రేమ, భాషపట్ల ఔదార్యం, సంస్కృతి సాంప్రదాయాల పట్ల అనురక్తి చాలావరకు తెలుగువాడిలో కొరవడుతోంది. దానితో భాష తాలూకు వాడి... మధురిమ... మాధుర్యం లుప్తమయిపోతున్నాయి.

మన భాష పట్ల వర్తమాన సమాజంలో వేళ్ళూనుకుంటున్న నిర్లక్ష్యధోరణులు క్రమంగా కథాసాహిత్యాన్ని కూడా ఆవహించేసరికి సుసంపన్నమయిన ప్రక్రియకు విరుద్ధపోకడలు వచ్చి చేరిపోవడం మనం గమనిస్తూనే ఉన్నాము.

ఈ నైజాలను ఆనాడు తెలుగుకు, తెలుగుకథకు, తెలుగుభాషా వైభవానికి, తెలుగు కథాశిల్పానికి ప్రాణంపోసి నిత్య సంజీవనిగా రూపుదిద్దిన మహనీయులు శ్రీ గురజాడ అప్పారావు గారు, శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారు, శ్రీమల్లాది రామకృష్ణశాస్త్రి గారు, తర్వాత కాలాలలో శ్రీ మధురాంతకం రాజారాం గారితో సహా అనేకమంది లబ్దప్రతిష్ఠులు. ఇప్పటి తెలుగు ప్రామాణికాలకు, తెలుగు కథకు పట్టిన దుర్గతిని చూస్తే తప్పకుండా కంట తడిపెట్టకుండా ఉండేవారు కాదేమో అన్పిస్తుంది మనకు.

అప్పట్లో మన తెలుగు కథా ప్రక్రియ మంచిగా మనగలిగి అనేకానేక తీరులలో వస్తూ విస్తృతిని ఆపాదించుకోగలిగింది. కానీ తరువాతి క్రమంలో కొన్ని అపసవ్యతలకు లోనయిందని చెప్పకతప్పదు.

ముఖ్యంగా కథలో భాష వాడకం మీద పలురకాల వాదనలు... వివిధ రీతులతోటి అభిప్రాయాలు తెరమీదకు వచ్చి విషయాన్ని ప్రశ్నార్థకం చేయబూనుతున్నాయి.

చెప్పాలంటే వీటి తాలూకు మూలభూమికలుగా భావించాల్సిన ప్రాంతీయ తత్వాలు, ఉద్యమాలు భాష గావించి నొక్కి చెప్పడం దీనికి ఒక కారణంగా చెప్పుకోవాల్సి ఉంటుంది. ప్రాంతీయ చైతన్యాలు అనేకానేకాలుగా పరిపుష్టం చెంది మాండలికాలు అనేక విధాలుగా విస్తారం చెంది అనురక్తులను ఆపాదించుకోవడంతో భాష తాలూకు అంతర్లీనమైన రాజసంలోని, ఆర్తి, అనురక్తులు ప్రక్కదారులు పడుతున్నాయి.

ఇవి భాషాభిమానులు, విజ్ఞులు, కథాసాహిత్యం పట్ల ఆరాధనాభావనతో అడుగులిడుతున్న అక్షరకారులు దృఢంగా ఆలోచించి ఈ సమస్య పరిష్కారానికి ఒకదిశను, దృక్పథాన్ని సూచించుకోవాల్సిన స మయమిప్పుడు ఆసన్నమైనది.

ఈ క్రతువులో భాగంగా ఉద్యమస్థాయిలో భాషా పునరుజ్జీవనానికి కథక చైతన్యాన్ని ఒక ఉద్యమస్థాయిలో పూలలో దారాలుగా నిలవడం, అందరినీ భాగస్వాముల్ని చేయడం, తద్వారా ఏకతాటిపైకి తీసుకొచ్చి, భాషా ప్రభను తేజోమయం చేయడం అనేవి ప్రస్తుత పరమార్థం కూడాను.

ఏ భాషలోను లేని పద్య సంస్కృతి తెలుగుభాష కున్నది. అనేకానేక సాహిత్య ప్రక్రియలలో తెలుగు కథారచనకు పెద్ద స్థానమే ఉంది. కానీ కథకు

## పిచ్చివాడు

- ఎస్.బ్రహ్మానందరెడ్డి.

పిచ్చివాడొకడు వెళుతుంటాడు మా ఇంటిముందు నుంచి  
టపటప .. టపటమపని ఖాళీ సీసా మీద కర్రముక్కతో శబ్దం చేస్తూ  
మధ్యమధ్యలో అర్థంకాని మాటలు, అర్థంలేని చేష్టలు, వెర్రి కేకలు  
గుబురుగా పెరిగి ఉండలు చుట్టుకున్న తైల సంస్కారంలేని జుట్టు  
ఎముకల మీద చర్మంతో కప్పినట్టుండే బలహీనమైన శరీరం  
ఊరికి అవతల పొలాలకు స్మశానానికి మధ్య వాడి నివాసం  
వాడి శరీరమంతా నగ్నంగా, మనసంతా ఉద్విగ్నంగా ....

పాడుబడ్డ బావిలో దూకి ఆత్మహత్య చేసుకోబోతున్న  
నూనూగు మీసాల నవ యువకుడిని చూసి ఫక్కున నవ్వి ఇలా చెప్పాడు.

నేను బట్టలు వేసుకోబోయినప్పుడల్లా నష్టాలు భరించలేక  
అదే పత్తిచేలో ప్రాణం తీసుకున్న మిత్రుడి ఆవేదనా భరితమైన చూపు గుర్తొచ్చేది .....  
నేను భోజనం చేయబోయినప్పుడల్లా ఆ మెతుకుల్లో అప్పులు తీర్చలేక  
వరిపొలంలో విలవిలలాడుతూ బలైన బంధువులు కనిపించేవాళ్ళు ...  
స్నాన సంధ్యలకు వెళ్ళినప్పుడల్లా జీవితంలో ఓడిపోయి ఇదే నదిలో ఓ సంధ్యా సమయాన  
అశువులు బాసిన ఆత్మీయుల ఆక్రందనలు వినిపించేవి ....  
ఇవేవీ నేను ఎందుకు చేయలేదో తెలియని జనం నన్ను పిచ్చోడన్నారు ....  
వెఱ్ఱివాడా! పిచ్చివాళ్ళంటే మతిస్థిమితంలేని వాళ్ళు కాదు  
మానసిక స్థైర్యంలేనివాళ్ళే నిజమైన పిచ్చోళ్ళని తెలుసుకో .....  
అందుకే ఆ పిచ్చివాళ్ళ సమాజాన్ని విడిచి ఇక్కడ ఉంటున్నాను అన్నాడు వాడు .....

ఏదో అవ్యక్త నిశ్చలత్వం అతని కళ్ళలో నాక్కనిపించింది ..  
ఎవరికి పిచ్చి? ఎవరు పిచ్చివాళ్ళు? అని నాకనిపించింది ....

సంబంధించిన కొన్ని పూర్వాపరమైన మరికొన్ని వాస్తవిక దృక్కోణాలను సమగ్రంగా విశ్లేషించినప్పుడు ముందస్తుగా అప్పట్లో కథ అన్నా, కథాక్రమం అన్నా ఓ కలగా అన్పించేది. కథ అంటే కలల ప్రపంచంగా పరిభ్రమించేది.

వ్యవహారికంగా చూస్తే "ఏమిట్రా కథలు చెబుతున్నావా!" అనేవారు కథను విస్మరిస్తూ ఎగతాళిగాను మాట్లాడేవారు.

కానీ Far from Reality...,

ఒకానొకప్పుడు కలగా కన్పించిన కథ క్రమంగా ఒక Reality గా...

ఒక Practicality గా రూపాంతరం చెంది ఆవర్తనం చెందసాగింది.

## జీవన కవచం

- వై.హెచ్.కె. మోహన్‌రావు, పిడుగురాళ్ళ, ఫోన్ : 9440154114

నాకెందుకో
చెట్టును గుర్తు చేసుకున్న ప్రతిసారీ
నిటారుగా నిల్చుని
అలల తలలతో దోసిళ్ళకై ఎదురు చూస్తున్న
నది దర్శనమిస్తుంది.
సహస్ర బాహువులతో
సాయం చేయడానికి సిద్ధంగా వున్న
దానకర్ణుడు కనిపిస్తాడు
చల్లని పాలరాతితో నిర్మించిన
తాజ్‌మహల్ జ్ఞప్తికి వస్తుంది
బాల్యమంతా హాయిగా డోలలూగిన
అమ్మవొడి మళ్ళీ మళ్ళీ కళ్ళ ముందు నిలుస్తుంది
దాని ఆకులను తాకినపుడు
నేను నిలువెల్లా పత్రహరితమై పోతాను
లోకమంతా దాని కొమ్మపై కూర్చొని
ప్రాణవాయువును ఆస్వాదిస్తున్నట్లు పులకించి పోతాను
చెట్టు ప్రకృతి నిర్మిత మహా విడిది
తపించకుండానే లభించిన
చరరాశుల పాలిటి
ఆదిశేషుడు విప్పిన అద్వితీయ ఛత్రం
చెట్టంటే పరిసరాలకు గట్టుకాదు
చెట్టంటే మానవజీవన రక్షిత కవచం
చెట్టు నీ నల్లని పరుగులకు ఆటంకం కాదు
చెట్టు పరుగుల అలసట తీర్చే పచ్చని శయనం
అదృశ్యమైన అమ్మలంతా కలిసి
సృష్టించుకున్నదే చెట్టు
చెట్టును శవదహనానికి వినియోగించే
కట్టెగా దర్శిస్తున్న
వారందరినీ హెచ్చరిస్తున్నా ..!
భవిష్యత్ శ్మశానం కాకముందే
చెట్టుకు దండం పెట్టండని.

"What is Happening!" అనేది ఈ వేళ ఒక ఉపదేశమయింది. ఇప్పుడు అనేకానేక వాటిని దిద్దుకొని సరిచేసుకోవడానికి అవకాశము ఏర్పడింది.

ఈ కథాక్రమ అనుక్రమణలను అవగతం చేసుకుంటే భాష తాలూకు విస్తృతిగా పరిఢవిల్లిన ఇతిహాసం వేరు... చరిత్ర వేరు... ప్రబంధం వేరు... కథ వేరు.

ఈ రోజు వర్తమానంలోకి కథాక్రమం ప్రవేశించింది. ఈ వర్తమానంలో అనేకాలైన కలల నైజాలు... కల్పనల అభినవేశాలను అధిగమించి సమాజంలోని బాగు.... సమాజంలోని లోటుపాటుకు కథ Instrument గా నిలవడం ఇక్కడ విశేషంగా చెప్పుకోవాల్సి ఉంది.

ఎంతో గంభీరమైన విషయ సాంద్రతతోటి జీవితాలను, భావనలను నిర్వచించి, విశ్లేషించి ఒక భావ సారూప్యమైన పరిష్కారాన్ని సూచిస్తూనే సంక్షిప్తంగా, పదునుగా, హృద్యంగా పాఠక జన హృదయాల్లోకి చొచ్చుకుపోయే విధంగా చిరంజీవిని చేయగల్గిన అపారమైన ప్రాణశక్తి వారసత్వ సంపద కథా కథనానికి ఉంది అనడం ఏ మాత్రం అతిశయోక్తి కాదు.

తెలుగుకథకు ఒక అద్భుతమైన శైలి, శిల్పం, వాక్యరచనా సరళి ఉన్నాయి. కానీ మనది కాని సంస్కృతి, మనదికాని అభిరుచి మనకు సమ్మతం కాని విపరీత వినాశకర పెడధోరణులు టెలివిజన్ ఛానల్స్ వలన విస్తృతమవుతూ వ్యాప్తి చెందుతూ తెలుగును, తెలుగు ప్రక్రియలను ఈనాడు ఒక దురదృష్టకరమైన పరిస్థితిలోకి నెట్టేస్తూ ఉండటం విచారకరం.

ఎల్లలు దాటి తెలుగుభాషను, తెలుగు సంస్కృతిని, తెలుగు మధురిమలను అవపోసన పడుతున్న పరిస్థితులు మనకళ్ళముందు సాక్షాత్కరిస్తూ ఉన్న తరుణంలో మనం మాత్రం మన సంస్కృతిని, తెలుగుభాషాభ్యున్నతిని ఓమూలకు గిరాటు వేస్తున్నాము.

గతంలో ప్రముఖ కథకుడు మరోరాష్ట్రవాసి అయిన శారదలాంటి ఎంతోమంది ఉదారులు మనభాషలోని అలవికాని మహతీమయ మాధుర్యాన్ని చవిచూసి తెలుగును నేర్చుకొని కథా ప్రక్రియకు, సాహిత్యానికి ప్రాణప్రతిష్ఠ చేసి ఉంటే మనం మాత్రం మన భాషను ఎంతో హీనంగా పరిగణిస్తూ ఉండటం ఎంతో వేదనను మిగిలిస్తోంది.

ఈ దుస్థితి నుండి తప్పించి మన భాషను పునరుజ్జీవింప జేయతలబెట్టడం ఎల్లవేళలా అనివార్యము, చారిత్రక అవసరము కూడాను.



# 'జాషువా ముంతాజమహలు మురిపాలు'

- ఆచార్య గోగినేని యోగ ప్రభావతీ దేవి, తెలుగుశాఖ, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

తెలుగు సాహిత్యానికి వెయ్యేళ్ళ పద్య వారసత్వం ఉంది. తెలుగువారికి పద్య రచన వెన్నతో పెట్టిన విద్య. తెలుగు పద్యానికి అద్భుతమైన లయగతులు, చేతన ఉన్నా వెయ్యేళ్ళుగా వెయ్యి విధాలుగా ఆ సౌందర్యాన్ని ఉద్దీపింపజేశారు మన కవులు. నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, సూరన ఇంకా అనేకమంది కవీశ్వరులు తెలుగు పద్యానికి అనేకానేక సోయగాలు చేకూర్చారు. ఈ శతాబ్దిలోనూ అటువంటి మహాకవులున్నారు. అట్టి తెలుగు సాహిత్యాంబరాన జాషువా పదహారు కళల పరిపూర్ణ చంద్రుడు. ఆయన పద్యం పండువెన్నెల.

పద్యరచనా శైలిలో జాషువా సాధించిన సరళత అమోఘమయినది. ఆయన వ్రాసిన వందలకొద్ది పద్యాలలో తెలుగుభాష ఆయన ఆదేశానుసారం నడిచింది. ఆయన ముద్ర తెలుగు పద్యంపై ఎంతగా పడిందంటే పద్యం చదవ గానే పండితులు కానివారు సైతం 'ఇది జాషువా గారి కవిత' అని భావిస్తారు.

తెలుగుజాతి మసిపాతలో దాచుకున్న మాణిక్యం జాషువా. అదృష్టవశాత్తు ఆ పాత పేలికల్లోంచి బయటపడి ఆ మాణిక్యం ఆధునిక తెలుగు సరస్వతి మకుట మాణిక్యమయింది. ఈ మధురకవి మనసు మధురం, నిర్మలం. తన దేశాన్ని, తన జాతిని, తన సాహిత్యాన్ని ఎంతో ప్రేమించి కొందరి కుసంస్కారాలనూ క్షమించివేశారు. జాషువా పద్యాలు చదువుతుంటే ఆ రమ్యతకు, సౌందర్యానికి ముగ్ధులైన పాఠకులు ఇతడొక శాపగ్రస్త గంధర్వుడని భావిస్తారు. ఆయన పద్యాలలోని సొగసులను, శ్రావ్యతను మెచ్చిన మాన్యులు, కవిశేఖరులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి "జాషువా! నీ కవిత్వమ్ము భేషు భేషు" అని ప్రశంసించారు. జాషువా కవికి స్వయంగా గండపెండేరం అలంకరించారా మహానుభావుడు. ఇది చాలు. ఇక గజారోహణమూ, బిరుదులూ, సత్కారాలు లెక్కలోనికి రావు.

జాషువా రచనల్లో కరుణరసప్లావితాలైనా 'ముంతాజ మహలు' కావ్యం ఒక విశిష్టతను సంపాదించుకొంది. చారిత్రకేతి వృత్తాన్ని గైకొని కమనీయకల్ప నతో జాషువా రచించిన ముంతాజమహలు కరుణ రస కావ్యంగా పలువురు పండితుల ప్రశంసలనందినది. షాజహాను ముంతాజుల అన్యోన్యానురాగం అమరం. **'ఏకోరసః కరుణ ఏవ'** అన్న ఆ భాణకానికి ఆనవాలు ముంతాజమహలు.

తాజమహల్ భారతీయ శిల్పఖండాల్లో అత్యద్భుతమైనది. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ఈ కట్టడం పేరు విన్నంతమాత్రానే ఈ సుందరమందిరం యొక్క తెల్లని ఆకృతి కన్నుల ముందర నిలుస్తుంది. ఎంతో ప్రాచీనమైన కట్టడాలను సైతం మరపింపజేసే పాలరాతి మహలు ఈ తాజమహలు అత్యంత అపురూపమైనది.

కవి చక్రవర్తి జాషువా తాజమహలును చూసి ఎరుగని ఈ విషయాన్ని ముంతాజమహలు భూమికలో వివరించారు. "తాజమహలు సౌందర్యాకర్ణనమున బొడమిన యావేశమే నన్నీ కావ్యరచనకు బురికొల్పినది. కవితా జగత్తున నా యూహ కొదవిన దృశ్యమే యిందు వర్ణితము."

మయూర సింహాసనాన్ని అధిష్ఠించి ప్రజారంజకంగా పరిపాలించిన మొగ లాయీ నవాబులలో ప్రఖ్యాతుడైన షాజహాన్ పాదుషాకు త్రిభువన సుందరియైన ముంతాజమహలు బహిఃప్రాణమగు వలపుటిల్లాలు. రసిక హృదయుడైన పాదుషా హృదయం కళలకు పుట్టినిల్లు. కళాపోషకుడైన ఈ నవాబు కుల విద్వేషాలు ఎరుగక, మతభేదాలను పాటింపక పరిపాలన చేస్తూ తండ్రికి తగిన తనయుడిగా ప్రఖ్యాతి పొందాడు. భారతీయ శిల్ప సముద్ధరణ చేయడమే గాక పారశీ, అరబ్బీ భాషా కవి పోషణలోనూ రసజ్ఞుడిగా విఖ్యాతి పొందాడు. ఇంటను పురాతన రత్న సింహాసనాన్ని ఆవలకు నెట్టి అనంత రత్న శోభలు వెలుగొందు మయూర సింహాసనాన్ని నిర్మింపజేసి దానిపై కొలువు తీరుస్తూ ఉండేవాడు. మొగలాయీ చక్రవర్తులలో కెల్ల అత్యంత రసజ్ఞుడు, కళాపిపాసి షాజహాన్ పాదుషా నిర్మల చరితుడు కూడ.

'గుడిగడి సేవింపడు పా
ల్పడఁడు మజాసేయు మత్తు వస్తువులకున
య్యొడయడు పరికింపడు పెర
పండితుకల నెఱపు నేకపత్నీ వ్రతమున్'

మక్కా మసీదునకు అధికధనం అర్పించి నిత్యం ఖురానులో చెప్పిన ప్రకారం ఆచరించే నిర్మలచిత్తుడు. ముతాంజమహలు సౌందర్యం అసమానమై కవి వర్ణనలకు గానీ, చిత్రకారు కుంచెలకు గానీ అందక ఎల్లవేళల పతిస్నిగ్ధ హృదయాన్ని అలరిస్తూ ఉండేది.

ఈ వివరణల తర్వాత షాజహాను సాంసారిక జీవితం, అతడు ముంతాజ మహలుతో గడిపిన మధురక్షణాలు, వారి పదముగ్గురు సంతానం, ముంతాజ్ సౌందర్యం కళ్ళకు కట్టినట్లు వర్ణించారు జాషువా.

## • సింబల్ •

- ఇనమనమెల్కూరి నాగరాజారావు, నెల్లూరు. ఫోన్ : 9032319507

భటుడు ముందు నడిస్తే
రాజుగారికి దర్పం
బిళ్ళ బంట్రోతు ముందు నడిస్తే
తాసీలుదారుగారికి దర్పం
కుయ్యి కుయ్యి మంటూ
పోలీసు జీపు ముందు వెడుతుంటే
మంత్రిగారికి దర్పం
సుబ్బిగాడు వెంట పరుగిడితే
రెడ్డిగారికి దర్పం
పనిపిల్ల సంచిపట్టి వెంట నడిస్తే
నాయుడమ్మకి దర్పం
తాపీమేస్త్రి తాపీ పడితేనే
మన ఇంటికి దర్పం
అందుకే
కూలోడు నాలోడు క్లాసు ఫోరోడు
అనబాకు
వాళ్లేనోయ్ మనస్టేటస్సుకి
సింబల్

'పలువురు బిడ్డలు చుట్టుం
బలసి కొలువ మధుర మధుర బహు కావ్యవిభూ
షల నొప్పు శారదాంగన
వలె భారతరాణి నేత్ర పర్వము సేయున్'

'రత్న రుచులీను యవన సామ్రాజ్యరమకు
నగలు గీలించు రాణి సౌందర్యలహరి
ప్రభువు కన్నులు దాటి యీవరికి రాదు
వలపు లూరింపకుండ నవ్వలికిఁ బోదు'.

పదునాలుగో సంతానంతో ప్రసవవేదన శీతజ్వరమూ మహారాణిని బాధించనారంభించాయి. దానికి తోడు పీడకల, దుశ్శకునాలు, స్త్రీ సహజమైన వెరపుచే ఆమె పెనుశోకమూర్తి అయింది. శోకమనే మాటకు అర్థం తెలియని ఆమె కన్నుల నుంచి ముత్యాల్లా కన్నీరు జాలువారింది. శత్రువుల ప్రాణాన్ని హరించగల చక్రవర్తి అయినా భార్యకు ప్రాణదానం చేయలేదు గదా!

'దాయమన్నీల ప్రాణముల్ దీయఁగలిగి
యీయలేదయ్యె నిజభార్యకాయువులను
చండశాసనుఁడగు మహాచక్రవర్తి
ఆత్మకధికారి గాఁడు న్యాయ్యంబు గాను'

ముంతాజ్ సంతానాన్ని దగ్గరకు తీసికొని గద్గద స్వరంతో పాదుషాకు బుద్బుదప్రాయమైన జీవితం అశాశ్వతమని, ఇచట ప్రేమలు క్షణికాలని మరణం ప్రతిజీవికి తప్పదని, తనకై విలపింపవద్దని చెప్పి కనులు మూసింది. ముంతాజ్ మరణానంతరం రాణివాడ శోకసముద్రంలో మునిగిపోయింది. ఏకాకియై చక్రవర్తి షాజహాను తన రాణియగు ముంతాజ్ గుణగణాలను, పాతివ్రత్యాన్ని, విశ్వసనీయతను మనసున తలచుకొని మిక్కిలి శోకతప్తు డయ్యాడు. చతురంగ బల సంపన్నుడు షాజహాను జీవితంలో ప్రప్రథమంగా భయకంపితుడ య్యాడు. నెమలి సింహాసనం, కోహినూరు వజ్రం మొదలైన అమూల్యమైన నిధులన్నీ అర్థరహితమై పోయాయి. జీవరత్నమైన ముంతాజ్ గతించిన పిమ్మట అతడూ జీవచ్ఛవమైనాడు. పందొమ్మిది సంవత్సరాల దాంపత్య జీవనం ఆనాటితో అంతమైనందుకు మిక్కిలి వగచాడు. వగచి, వగచి తన ఆరవప్రాణమైన ముంతాజ్‌మహలు కడసారి మాటకు రూపకల్పన చేయసమకట్టాడు.

ఆదేశంలో ఒక నిర్భాగ్యుడు తన ప్రియపత్నిని కోల్పోయి వియోగవ్యథచే ఆ శ్మశానంలో పిచ్చివానిలా తిరుగుతూ అక్కడి బూడిదను ముద్దలు చేసి సమాధి బొమ్మల నమూనాలను చేస్తూ ఉండేవాడు. వాటితో ఒకటి శిల్పరమకు సిగపూవులా అందంగా అతని కళా హస్తాన్నుండి ఆవిర్భవించింది. అందమైన ఆ నమూనాను చూడగానే ఆ వియోగి హృదయంలో అట్టి సమాధిని నిర్మించి తన ప్రణయదేవికి అంకితం చేయాలని కోరిక కలిగింది.

ఆ నమూనా చేతబట్టుకొని ఊరూరా భిక్షార్థం తిరుగుతూ తన కోర్కెను తెలుపుతూ వచ్చాడు. ఒక శిల్పి ఆ నమూనాను చూచి ఆశ్చర్యచకితుడై దానిని తీసికొని పాదుషాకు చూపించాడు. అందలి మనోజ్ఞతకు, భావసంపదకు చక్రవర్తి ముగ్ధుడై ఆ నమూనాను చేసి శిల్పిని రాజసభకు పిలిపించి మంత్రులు, తాను ఎదురేగి తెచ్చి సగౌరవంగా సన్మానించాడు. పాదుషా సన్మానానికాతడు సంతోషించి చక్రవర్తి ఔదార్య సంపదను, కళాభిరుచిని ప్రశంసించి తనకిచ్చిన బహుమానాలు కళాసరస్వతీదాసులకు పంచి పెట్టమని పలికి భార్యావియోగియగు రాజునకు తన సానుభూతిని తెలుపుతూ మళ్ళీ పాదుషాకే ఆ సంపదను ఉదుగరగా ఇచ్చి వెళ్ళిపోయాడు.

"మొగలు నవాబు శేఖరుల పూజ్య సభాంతర మందు సత్కళా జగమున నా పరిశ్రమ ప్రశంసితమయ్యె పసిండి పూజల దిగులు సగంబు దీరె గరుణించి పరిగ్రహమాచరింపుడీ నగదును క్రమ్మరం దమ ఘనంబునకు న్నజరాన వెట్టుదున్"

షాజహాను తన ప్రేయసి అమరిన ప్రేమకు చిహ్నంగా అమరమైన, అపూర్వమైన కట్టడాన్ని నిర్మించడానికి పలుదేశపు వాస్తు శాస్త్రజ్ఞులను, శిలలకు ప్రాణం పోయగల శిల్పులను రప్పించి పాలరాతి ఫలకాలపై కార్మికుల కర్మజలంతో, ఘర్మజలంతో ప్రేయసి సమాధిపై ఒక మహలును నిర్మాణం చేయించాడు. అదే తాజమహలు. మహలుకు నలుదెసలా ఉద్యానవనం సుందరంగా తీర్చిదిద్ది రాజు తాజమహలు తేజస్సు ద్విగుణీకృతం చేయించాడు.

"తాకినఁగందునోయను విధంబున బాలకు సౌకుమార్యపుఁ
బోకడలద్దు నేర్పరులు ముప్పది ముగ్గురు శిల్పులాత్తలో
కైక చమత్కృతుల్ బొదిగి యిర్వదియేండ్లు శ్రమించి భారత
ప్రాకృత శిల్పసంపదకుఁ బ్రాణము వోసిరి శాశ్వతంబుగన్"

ఒకవైపు యమున. మరొకవైపు సరోవరం. తాజ్ లావణ్యం యాభై ఆరు వర్ణాలు గల తెలుగుభాషకు సాధ్యం కాదంటే తదితర భాషలకు సాధ్యమవు తుందా? అని కవి చమత్కరించారు. ఖురాను నుంచి ముఖ్యమైన సూక్తులను, 'కలదే స్వర్గము లాతిచో కలుగ నిక్కంబెద్దియే నీతిమంతుల విశ్రాంతి నికేతనంబు' అనెడి పంక్తులను నవాబు శేఖరుడు ద్వారబంధాలపై అతి సుందరంగా చెక్కించాడు.

పాదుషా వైభవం, వారి అనంత పరిమళాలు, వారి అనుకూల దాంపత్య ప్రణయ గంభీర గీతాలు, విరహవేదను తోడ పాదుషా భగ్న హృదయం అన్నీ కలసి నేటికీ తాజ్ కుడ్యాలమీద సాక్షాత్కరిస్తున్నట్లు కవి వర్ణించాడు.

పాదుషా కడగొట్టు కుమారుడైన ఔరంగజేబు వర్ణన కూడా ఈ కావ్యంలో ఉంది. ఔరంగజేబు తండ్రిని చెరసాల యందుంచిన తీరు పరోక్షంగా షాజహాను కళారాధనను, ఔరంగజేబు హింసాకాండను వర్ణించి తాజమహలుకు, షాజహానుకు అపారమైన కీర్తి తెచ్చిపెట్టారు నవయుగ కవి చక్రవర్తి జాషువా.

సనాతన భారతీయ గార్హస్థ్యం ధర్మ వైశిష్ట్యాన్ని ఆదర్శంగా గ్రహించి జాషువా ఈ కావ్యంలో ముంతాజు షాజహానుల దాంపత్యాన్ని వ్యాఖ్యానించాడు. సనాతనమూ, పవిత్రమూ ఆదర్శప్రాయమూ అయిన భారతీయ గార్హస్థ్య ధర్మాన్నే ఈ కావ్యంలో



అతడు 'ప్రథిత సంసారరాజమార్గము'గా స్థిరీకరించినాడు. ఆ పవిత్ర ప్రణయ సందేశమునే ఈ కావ్యం ద్వారా జాషువా లోకానికందించారు.

నూర్జహాన్‌గా ప్రసిద్ధిపొందిన మెహరున్నీసాకు మేనగోడలు ముంతాజి సౌందర్యసేవధి. కవి ఈమె రూప సాక్షాత్కారాన్ని గావించిన తీరు –

**'అతివ చక్కదనము నభివర్ణనము సేయ**
**కలము సాగదెట్టి కవివరులకు**
**చేయి యాడదెట్టి చిత్రకారులకును**
**చెలువ చెలువమెల్ల జలుకరింప.'**

ముంతాజు పదముగ్గురు బిడ్డల తల్లి అయినా లావణ్య మిసుమంతయినా మాయలేదట. కారణం

**'జీవితంబున నొక దుష్టచింతలేని**
**సత్యవంతుల ప్రాయంబు జారదండ్రు'**

అని అర్థాంతరన్యాసాలంకారంతో వివరించారు జాషువా. సామ్రాజ్యరమకే సౌందర్యంగా ఉన్న రాణి సౌందర్యం.

**"ప్రభువు కన్నులు దాటి యీవలికి రాదు.**
**వలపు లూరింపకుండ నవ్వలికి బోదు".**

శృంగార కరుణరసాలను అంగాంగి రసాలుగా ఈ వాక్యంలో పోషించిన జాషువా పుణ్యదంపతులైన ముంతాజు షాజహానుల సంతత ప్రణయానురాగాన్ని వర్ణిస్తూ

**'ఆ సతీపతుల గాఢాశ్లేషముల నుండి**
**జారిపోయిన నిమేషంబు లేదు**
**ఆ దంపతులకు నాహ్లాదంబు గూర్పక**
**తొలగిన వెన్నెల తునకలేదు**
**ఆ ప్రేమజీవు యనురాగవృద్ధికై**
**రుతమొనర్పని పరభృతము లేదు**
**ఆ శుభాకృతుల నెయ్యంపు ముద్దుల చేత**
**తీపికెక్కని ద్రాక్షదీగలేదు.**
**అవధి లేని వారియానందకేళికి**
**దోడుపడని పూలదోట లేదు**
**వారి కూర్మి పెంపు వలచి వర్ణన జేసి**
**సుప్రసిద్ధి గనని సుకవి లేదు**

అంటూ నిర్వికల్పమైన ప్రణయబంధ ప్రతిపాదన గావించాడు.

చూలాలుగా ముంతాజు ఉత్తమ మాతృత్వ రాజ్ఞీత్వ గౌరవం గాంచింది. ఇక్కడ చక్కటి దాంపత్య శృంగారాన్ని వర్ణించాడు కవి. పదునాల్గవ గర్భమేర్పడగా చక్రవర్తిని భాగ్యబంధురమైన నిండుబండిలా నట్టింట సంచరిస్తుంది. ఇంతలో కవి దుశ్శకునాలను ప్రవేశపెట్టి స్త్రీ సహజమైన వెరపును ప్రదర్శించాడు.

తనకు మరణం తప్పదని భావించిన ముంతాజు పాదుషాతో క్ష్మావాస కథా విశేషాలు స్వాప్నికాలని, ఇది మృత్యుదేవతా ద్యూత వినోదరంగమని బోధించింది. ఈ తాత్త్వికదృక్పథాన్ని ముంతాజి ద్వారా వ్యక్తీకరించాడు జాషువా. ఆవిరి యోడలో జలధియాన మొనర్చెడు బాటసారులు భూవర రేవులందు దిగిపోయెదురించక వెన్కముందుగా నీ వసుధాపణంబు పనియెల్ల ముగించి స్వదేశముగాలై పోవుచు వచ్చుచుండ్రుసతమున్ బ్రజలీ నరజన్మ వర్తకుల్.

ప్రపంచంలోని ప్రజలెల్లరు వర్తకులు. ఓడలలో వయనం సాగిస్తున్నారట. ఓడ జీవితానికి చిహ్నం. ఈ ప్రపంచంలో వ్యాపారం పూర్తి గావించి మరణం అనే రేవులో దిగిపోక తప్పదు.

ముంతాజి తుది వచనాలలో ఆత్మ తత్వబోధ తొణికిసలాడుతుంది. మానవుని నశ్వరదేహాన్ని గూర్చి చక్కని బోధ ముంతాజి ముఖంగా మనకు ప్రసాదించాడు కవి.

ముంతాజి సహధర్మచారిణియని చిత్రించాడు. 'కలుషంబింతయు లేని నీ మధుర ముగ్ధంబైన చిత్తంబు లోపల నిద్రింతు ననారతంబు' అనడంలో ముంతాజి షాజహానుల అన్యోన్యత ధ్వనిస్తోంది.

**'పట్టుపరదాల చీకటి వనములందు**
**ప్రభవమును గాంచి, శోభిల్లి రాలిపోయె**
**పరిమళంబొందు లోకాన బారజిమ్మి**
**మొగలు రేరాణి ముత్తైదు ముత్తియంబు'**

ఆమెను రేరాణితో ఉపశమించారు. 'ముత్తియంబు' అనే శబ్దం నిర్మలమైన, నిష్కళంకమైన ఆమె సౌశీల్యానికి ఉపలక్షకం. ముత్తైదువ అనే పదం ఆమె భర్త కళ్ళముందే దేహం చాలించిన పవిత్రురాలని చెప్పకయే చెబుతుంది.

## • సుప్రభాత వేళ ....! •

- బండికల్లు జమదగ్ని. ఫోన్ : 9848264742

ఏడు రంగుల ఇంద్రధనుస్సు
అటు మూడు రంగుల్నీ
ఇటు మూడు రంగుల్నీ
పూబాలలకు అద్ది
ఆకుపచ్చని రంగును పచ్చికతో మమేకం చేసి
ఆకాశం ఉండి నేలపైకి
దిగివచ్చిన సుమనోహర దృశ్యం .....
పక్షుల కిలకిలారావాలతో కళకళలాడుతూ
చిరుగాలి స్పర్శకు పులకరించే ఆకులతో
విశాలమైన బాహువుల్ని చాచుకున్న తరులు ...
కోయిల పాటలకు ధీటుగా
కొన్ని వందల సుమబాలల
సౌందర్య సౌరభాలు ....
మకరందాన్ని గ్రోలుతూ మత్తిల్లే
తుమ్మెదల నాట్య విన్యాసాలు ....
ఉదయభానుని నులివెచ్చని కిరణాల తాకిడితో
వజ్రాల్లా మెరిసే హిమబిందువులు ....
ఓహ్! .... కనగలిగే కనులకు, వినగలిగే చెవులకు
ఎన్నెన్నో మనోజ్ఞ దృశ్యాలు ....
సుప్రభాతవేళ ... ప్రకృతి ఒడిలో
నడక సాగించడమంటే
ఆ దేవదేవుని రక్షణ కవచంలో ఒదిగి
మన ఆయువును పెంచుకోవడమే !!

భువనైక మోహిని స్వాధీనపతిక సుగుణాల రాశి ముంతాజి. లోకంలో ఎందరో మహారాజు చక్రవర్తులు, పాదుషాలు ఉన్నారు. వారి హృదయం హరించిన ఇల్లాండ్రు ఉండవచ్చు. ప్రపంచంలో ప్రణయచిహ్నంగా భార్యాస్మృతికి భక్తిపూర్వకంగా తన అమూల్య సంపదను వెచ్చించిన ఇటువంటి మహోన్నత కళానిధిని ఒసగిన సహృదయ రసిక చక్రవర్తి కానరాడు. ముంతాజికి షాజహాను వరంకాగా, షాజహాను వరం ముంతాజి. వారి అన్యోన్యాలంబనమగు ప్రణయ ప్రసాదం తాజమహలు. చివరగా అతడనుభవించిన ఆవేదనను బట్టి ఆమె గొప్పదనం ఔన్నత్యం మనకు స్పష్టమవుతాయి.

**'ప్రియముగ దేవదూతలు చరించెడు మూడవ మిన్ను దాటిన**
**వ్యయమగు జీవ నిర్ఝరము వాఱు నొకానొకదీవికొంటిమై**
**బయనము గట్టితే యనుఁగు భర్తను నన్ను బరిత్యజించియె**
**ప్రియతమ తోడుగా నెగయు తెక్కలు గల్గనె నాకు దేవి'**

షాజహాను సహజంగా లలిత కళాప్రియ ప్రణయైకజీవి. కావున తన ముద్దులరాణి మాటకు పాదుషా ఎప్పుడూ ఎదురాడే వాడు కాడు.

ప్రేమ ఇతరుల గుర్చి ఆలోచింపజేస్తుంది. కాబట్టే దంపతీ ప్రణయంలో భర్తగా షాజహాను రాణికి జీవితంలో ఏమి కావాలో ఎల్లవేళల తెలిసికొని ముంతాజి పన్నెత్తి అడగవలసిన అవసరం లేదన్నట్లు కాపాడుకొన్నవాడు. జీవితంలో వలపులోని తరీతీపు లెరిగినవాడు. వియోగంలోని మంటలచేత అతని హృదయమే చితి అయింది. భార్యావియోగంలో వేదనా పద్యాలను షాజహాన్ ద్వారా కవి పలికించారు.

చక్రవర్తి ప్రణయతత్వవేత్త కావడంతో దేనిచేతనూ ఆకర్షింపబడక భార్య సమాధి నిర్మాణంలో నిమగ్నుడయ్యాడు.

**'నీ మృదు పదంబులుకందు కళిందజా తటిన్**
**జివుకని స్వర్గధామము రచించెద రమ్ము శుభ స్వరూపిణీ'**

అతని ప్రణయ హృదయం వల్లనే తాజమహలు అమూల్యమైన అపురూప సౌందర్యమయమైన కళాధిదేవతగా అవతరించింది. పాదుషా శేషజీవితాన్ని ఈ విధంగా గడుపుతున్నాడు.

**'నీవు వసించుచోట వసియింతును నేనునుదాచియుంపుమో**
**దేవి యొకింతనేల చనుదెంచెద రేపట మాపటన్ నిరా**
**శా విషదహ్యమానమయి సౌఖ్యపరాఙ్ముఖమైన యట్టినా**
**జీవిత శేషమంకితముఁజేసెద నీ కవివాహితుండనై'**

షాజహానుకు ముంతాజమహలు మీద గల ప్రేమకు, ఏకపత్నీవ్రత నియమానికిది నిదర్శనం. ముంతాజే షాజహాను హృదయం. షాజహాను హృదయమే తాజమహలు.

సంయోగ వియోగాలచే పూర్ణత్వమందిన పాదుషా ప్రణయ హృదయపు శోభయే తాజమహలు రూపంలో నేటికీ సౌందర్య పిపాసులను తనియింపజేస్తూ ఉంది. మానవ ప్రతిభకు ప్రత్యక్ష సాక్ష్యం ఈ తాజమహలు. పందొమ్మిది వత్సరాల దాంపత్యజీవితం మధురబంధంగా నాటుకుపోయింది. అట్టి దాంపత్యాన్ని పెకలించడం వల్ల కలిగిన, ఏ వైద్యుడి చేత మాన్పరాని పాదుషా గాయానికిది స్మృతి చిహ్నం.

జాషువా కవి ఈ కావ్యభూమికలో ఇలా పేర్కొన్నారు.

"ప్రణయమూర్తియందన యర్ధాంగియునగు ముంతాజి నలంకరించుచున్నట్లూహించుచు నిరువది రెండేండ్లెత్తిన తలవాల్చక కట్టడమును సమాప్తి చేయించిన షాజహాను చేతిలో నొక పవిత్ర ప్రణయ సందేశము, ఒక కళాపోషణ దీక్ష, ఒక యావేశము, ఒక నిఱుకు, ఒక మూగ సారస్వతము దంపతిలోకమున కందించుచున్నేదని నాయూహ. సతీ వియోగమున మన్మథుడైన షాజహాను గాఢాంధకార బంధురమై సర్వశూన్యమైన తన జీవిత బ్రహ్మాండమున సందర్శించిన తేజః పుంజమీ తాజమహలు. ఆ పదార్థమున కితడు ప్రాణప్రతిష్ఠఁజేసి శాశ్వతుడైనాడు. ఐశ్వర్యమంతుడై యతడు శ్మశానమును స్వర్గముగా మార్చివేయగలిగినాడు.

**"తచ్చంద్ర శిలాధౌతములయిన కాళిందీ జలముల**
**యందాశుభదంపతుల యాత్మలు గుసగుసలు**
**వోవుచుఁ బ్రేక్షకుల కనంత భావపరంపరల**
**బహుకరించుచున్నవి"**

తదనుగుణంగానే ఈ 'ముంతాజమహలు' కావ్యమున కద్భుతమైన ముగింపు.

**"రాణి విడచిపోయె రాజు నొంటరిఁజేసి**
**రాజు విడచిపోయెరాజ్యరమను**
**రాజ్యరమయు విడిచె రాజులఁబెక్కండ్రఃః**
**తాజి విడువలేదు రాజసంబు"**

## "కన్నీటి గేయం"

- ఎం.డి. బురహానుద్దీన్, వేంసూరు. ఫోన్ : 9704076179

పున్నమి నెలవంకల్ని నల్లని మేఘాలు మింగేశాయి
పున్నమినెలవంకల్ని చూసినట్లుండే మేము
విరబూసిన పూలతోటల్ని చూసినట్లుండే మేము
చీకటి ముసుగేసుకున్న పండువెన్నెల్లా ఉన్నాము
నడుస్తున్న కాళరాత్రిలా ఉన్నాము
తారు డబ్బాల్లోంచి ముంచితీసిన పావురంలా ఉన్నాము
కోళ్ళఫారాల్లో కోళ్ళు, బురఖాలో మేము
ముస్లిం సమాజంలో చైతన్యం గాలిదుమారంలా రావాలి
ఆదివారంనాడు మార్కెట్‌లో మటన్ చికెన్ అమ్మినట్లు
అరబ్ సేఠ్‌లకు మమ్మల్ని అమ్ముతున్నారు
డబ్బుకు ఆశపడి కన్నపేగుల్ని కసాయిలకు అంటకడుతున్నారు
తరతరాల నుంచి తిష్ఠవేసిన మత ఛాందసవాదం మట్టిపాలవ్వాలి
స్వాతిముత్యాలం మీ చేతుల్లో నలిగిపోతున్నాం
పేదరికం అడ్డుగోడలైతే, మమ్మల్ని పురిటిలోనే చంపాల్సింది
ఎందుకమ్మా! పేగుబంధం లేదా నీకు?
పశువులను సంతలకు తరలిస్తున్నట్లు మమ్మల్ని అరబ్ సేఠ్‌లకు
తెగనమ్ముతున్నారు ?
ఎందుకమ్మా! మా జీవితాలు కాళరాత్రి చేస్తారు?
పాలుగారే పసిమొగ్గలం మేము రెక్కలు తెగిన పక్షులం మేము
అల్లాసాక్షిగా చెబుతున్నాం మా బ్రతుకులు
బోర్లించినగాజు పాత్రల కింద
గాలిఆడని ఈగల్లా వున్నాయి.

